## జీర్ణరసాయనము.

25 మాత్రలు గల డబ్బీ 1-కి రూ. 1-4-0

భుజించిన వస్తువులు అజీర్ణమువలన రక్తమునకు సరిగా మారనందున మిగిలిన రోగములకు కారణమగును. ఆకలిలేకపోవుట, అగ్నిమాంద్యము, మలబద్ధము, కడుపులో శూల,అరుచి, త్రేపులు, వికారము, గుండెలోను రొమ్ములోను మంట, బరువు, తలనొప్పి, తలదిమ్ము, చిక్కిపోవుట, చలిజ్వరము, వెన్నుపూసమీదను, ప్రక్కను, గూళ్ళలోనుపోటు, ఆయాసము మొదలగునవి గలుగును.

అజీర్ణము వీనికి ప్రధానకారణము. జీర్ణరసాయన మాత్రలను సేవించిన జీర్ణ శక్తి, హెచ్చును. మలబద్ధము మానును. రక్తము పుష్టిజెందును. ఆకలిహెచ్చును.

## వజ్రగుళికలు.

20 మాత్రలు గల డబ్బీ 1-కి రూ. 1-0-0

ధాతుపుష్టికి, బలమునకు, ప్రాణమునకు రక్తపుష్టియు, నరపటుత్వమును కారణములు. రక్తపుష్టికి మంచి ఆరోగ్యము మూలము. ఆరోగ్యముబహిరంగ శరీరవ్యాయామమువలనను, జితేంద్రియత్వమువలనను గలుగును. వ్యభిచారము,సుఖరోగములు,దురభ్యాసములు,విశ్రాంతి లేకుండుటయు, ఆరోగ్యమునకు హానినిజేయును. దీనివలన. శుక్లనష్టము, స్ఖలనము, శక్తిలేకుండుట, అగ్నిమాంద్యము, భయము, కంపము, చురుకుదనములేకుండుట మొదలగునవిగలుగును. పైజబ్బులకు వజ్రగుళికలు వజ్రాయుధమువంటివి.

## వేలకుమందు.

వెల సీసా 1-కి రు. 0-4-0 వి. పి. సహా 0-8-0.

ఈనూనెను తలకురాచిన పేలు ఈపి నశించును.చర్మమునకు వెండ్రుకలకు హానియుండక వెండ్రుకలుపెరుగును.

అమృతాంజనము డిపో, నెం. 9. జహంగీరువీధి, జార్జిటవున్.

## జ్వరహారి.

సీసా 1-కి వెల రూ. 0-12-0.

జ్వరము శరీరమునందు రక్తభేదము, రక్తగతి భేదమువలన గలుగును. సాధారణముగానీటి, గాలి, స్థలపుమార్పువలనను దేహమునకు గాసివలనను జ్వరము వచ్చును. జ్వరహారిని అయిదుపూటలు సేవించిన పట్టువిడుపు జ్వరములు, చలి పురాణజ్వరములు మొదలగు సమస్తజ్వరములు మానును; కొద్దిదినములు సేవించిన శరీరము యథాస్థితినిజెంది ఆరోగ్యము గలిగియుండును.

## రోమహారి.

డబ్బీ 1-కి రు 0-8-0 వి. పి. 0-12-0

ఈ భస్మమును నీటిలో గట్టిగా కలిపి పట్టించిన రోమములు రెండు నిమిషములలో మొదలంట రాలిపోవును. దీనివలన చర్మము నలుపెక్కదు, మంటయుండదు, రోమములు రాలిపోవును.

## దంతశూలహారి.

వెల సీసా 1-కి 0-8-0. వి. పి. సహా 0-12-0

దంతశూలకు శైత్యము, రసపట్లు, పుప్పిపన్నులు, కుళ్ళిన కదిలిన దంతములు మొదలగునవి కారణములు. నొప్పిగలచోట దూదిని మందులో తడిపిపెట్టిన నొప్పి వెంటనేపోవును.

## కర్ణశూలహారి.

వెల సీసా 1-కి రు 0-6-0 వి. పి. సహా 0-10-0

ఈద్రావకము వలన చెవిపోటు, చెవినుండి చీముకారుట, చెవిదిబ్బడ మొదలగునవి వెంటనే నయమగును. 5,6 బొట్లను చెవిలో పోసిన బాధ వెంటనే తగ్గును. మంటయుండదు.

అమృతాంజనముడిపో, 109, ఫేరిరోడ్డు, ఫోర్టు, బొంబాయి.

**అమృతాంజనము పార్శ్వపునొప్పికి పరమహంస క్రియ.**

| తేదీ | | | |
|---|---|---|---|
| 15 (ఫిబ్రవరి నెల.) | ౪ | ౧౫ | శుప్ర॥ సో ౭-౧౩ శత ౩౦-౫౬ శి ౪౫-౪౭-బ౭-౧౩ రా౧౯-౨అహః౨౮-౪౦ధర౪౩౭-౨చంద్రోదయః సమశృంగం భుం-౨౨చ౨౯ [నెలవ౧. |
| 16 | ౫ | ౧౬ | ద్వి॥మ౧౭-౪౪పూభా ౩-౩౩సి౪౪-౬కా౭-౪౪రా౩౦-౧౭త్యాప్ర౪-౧౪ సత్యబోధతీర్థానాంపు భుం-౩౦రబ్బిసాని |
| 17 | ౬ | ౧౭ | తృ॥ బు౯-౩౭ఉభా౩౭-౧౮సా౪౩-౬గ౯-౩౭శేషః౩-౦ పునస్త్వాజ్యాభావఃదగ్ధః ప్రదోషః భుం-౩౮చ౨ |
| 18 (మాసి నెల.) | ౭ | ౧౮ | చ॥ గు౧౨-౫౩రే౪౨-౯శు౪౩-౭భ౧౨-౫౩వి౯-౪౩అహః౨౮-౪౬శత౧రవిః ౫౪-౯ శాంతచతుర్థి వైప్ర॥ ౩౦-౧౦ నిర్గః౪౦-౨భుం-౪౬చ౩ |
| 19 | ౮ | ౧౯ | ప॥ శు౧౬-౫౧ అశ్వ౪౭-౫౫శు౪౩-౫౧బా౧౬-౫౧రా౮-౧౭ భుం-౫౪చ౪ |
| 20 | ౯ | ౨౦ | ష॥ శ౨౧-౨౬భ౫౪-౧౬బ్ర౪౫-౨తై౨౧-౪౬ది౧౪-౨౭శూన్యతిథిః కేవేప్రదోషః భు౧-౨చ౫ |
| 21 | ౧౦ | ౨౧ | స॥ఆ౨౭-౭కృ౬౦-౧౦ఐం౪౬-౩౧వ౨౭-౭గ౨౭-౪౪మీనాయనగతో రవిః ౦-౧౫భానుసప్తమి భు౧-౧౦చ౬ [వ౭ |
| 22 | ౧౧ | ౨౨ | అ॥సో౩౨-౨౮కృ౧-౩౦వై౪౭-౫౨బ౩౨-౨౭రా౧౬-౧౦ అనాధ్యాయఃఅహః౨౮-౫౧-శత౨రవిః౧౨-౫౭భు౧-౨౮ |
| 23 | ౧౨ | ౨౩ | న॥ మ౩౭-౨౫-రో౭-౧౬వి౪౮-౪౮-శా౪-౫౬ది౨౨-౩౦భు౧-౨౮చ౮ |
| 24 | ౧౩ | ౨౪ | ద॥ బు౪౨-౭మృ౧౨-౫౮పీ౪౯-౫-తై౯-౪౬రా౬-౩౭శుక్రాం౦-౧౨పర్యంతంభు౧-౩౫చ౯ |
| 25 | ౧౪ | ౨౫ | ఏ॥ గు౪౩-౨౭ఆర్ద్రా౧౭-౪౮ఆయు౪౮-౩౬వ౧౨-౧౭-రా౨౦-౩౦-అహః-౨౯-౦ శత౩ర౩౧-౨౬ఏకాదశి గురువార వ్రతంసర్వేషామేకాదశీ-భు౧-౪౨చ౧౦ [తిరుభు౧-౫౦చ౧౧ |
| 26 | ౧౫ | ౨౬ | ద్వా॥ శు౪౫-౩౬పున౨౧-౩౦సౌ౪౭-౬బ౧౪-౮రా౧౩-౧౩ నృసింహద్వాదశీఉభయ ప్రదోషఃకుల శేఖరాళ్వార్ |
| 27 | ౧౬ | ౨౭ | త్ర॥ శ౪౬-౫౮పుష్య౨౩-౫౯శో౪౪-౩౮కా౧౬-౧౭రా౨౭-౨౯ కామదహనం శనిత్రయోదశీభు౧-౫౮చ౧౨ |
| 28 | ౧౭ | ౨౮ | చ॥ఆ౪౬-౧౦ఆశ్లే౨౫-౧౨అతి౪౧-౭గ౧౬-౩౪-శేషః౦-౨౧రావి౨౬-౮అహః౨౯-౭శత౪రవిః౫౦-౧౦భు౨-౬చ౧౩ |
| 1 | ౧౮ | ౨౯ | పూ॥ ◯ సో౪౩-౧౧మ౨౫-౧౩సు౩౬-౩౬భ౧౪-౪౦రా౧౫-౧౫బ్రహ్మసావర్ణికమన్వాదిః అన్వాధానంకేక్రాం హోళి కోత్సవఃభు౨-౧౪చ౧౪ |
| 2 | ౧౯ | ౩౦ | కృ॥ ప్రామ-౪౧-౧౦పుఫ౨౨-౫౦ధృ౩౧-౧౩బా౧౨-౩౫రా౧౧-౩౧యోగకాలఃభు౨-౨౨చ౧౫ |
| 3 | ౨౦ | ౩౧ | ద్వి॥ బు౩౬-౪౦ ఉఫ౨౧-౫౦శూ౨౫-౦తై౮-౪౦రావి౧౨-౪౩చాతుర్మాస్యద్వితీయః భు౨-౩౦చ౧౬ |
| 4 | ౨౧ | ౧ | తృ॥ గు౩౨-౨హ౧౯-౮గ౧౮-౨౯-వ౪-౨౬రా౮-౪౦అహః౨౯-౧౪ పూభా౧రవి ౪౯-౨౭ బ్రహ్మకల్పాదిఃప్రదోషః నూతనవస్త్రధారణం భు౨-౩౮చ౧౭ |
| 5 (మార్చి నెల.) | ౨౨ | ౨ | చ॥ శు౨౬-౪౩చి౧౬-౧౦వృ౧౧-౨౫బా౨౬-౪౩-ది౨౮-౪౦ రవే-భు౨-౪౬-చ౧౮ |
| 6 | ౨౩ | ౩ | ప॥ శ౨౧-౧౦స్వా౧౧-౪౬ధృ౩-౪౮వ్యా౫౩-౨౦తై౨౧-౧౦ ది౨౪-౫౦తిథిద్వయం భు౨-౫౪చ౧౯ |
| 7 | ౨౪ | ౪ | ష॥ ఆ ౧౫-౧౦వి-౭-౪౧హ౪౮-౧౫వ౧౫-౧౦-ది౧౯-౦-అహః౨౯-౨౪పూభా౨రవిః౨౯-౧౦త్రిస్పృష్టః ఉత్పాత యోగః ప్రదోషః భు౩-౨చ౨౦ |
| 8 | ౨౫ | ౫ | స॥ సో౯-౫౫అనూ౩-౩౯జ్యే౫౫-౫౮వ౩౦-౩౬-బ౯-౧౬ది౧౬-౩౪ అనధ్యాయః భు౩-౧౦చ౨౧ |
| 9 | ౨౬ | ౬ | అ॥ మ ౩-౪౨ ఏ౫౫-౧౨మూ౫౬-౧౦సి౩౩-౧౬-కా౩-౪౨రా౨౨-౪౮అవమాహః భు౩-౧౮చ౨౨ |
| 10 | ౨౭ | ౭ | ద॥ బు౫౩-౨౦పూషా౫౨-౫౮-వ్య౨౬-౧౬వ౨౫-౫౦ది౧౮-౫౬అహః౨౯-౩౨పూభా౩రవిః౪౮-౫౨-భు౩-౨౬చ౨౩ |
| 11 | ౨౮ | ౮ | ఏ॥గు౪౯-౫౦ఉషా౫౦-౫౩వ౧౯-౪౦-బ౨౧-౨౮ది౧౨-౨౦ - ప్రాగుదయంగురుఃసర్వేషామేకాదశీశవేభు౩-౩౪చ౨౪ |
| 12 | ౨౯ | ౯ | ద్వా॥శు౪౬-౨౮శ్ర౪౯-౩౪ప౧౪ - ౫౮-కా౧౭-౫౮ది-౦-౩౯రావి౨౯-౫౮త్యా౩-౫౯ శ్రవణద్వాదశీవుభయప్రదోషఃభు౩-౪౨చ౨౫ [భు౩-౫౦-చ౨౬ |
| 13 | ౩౦ | ౧౦ | త్ర॥ శ౪౪-౩౨-ధ౪౯-౨౩సి౮-౫౫-గ౧౫-౩౦-శేషః ౩-౨౧ శనిత్రయోదశీరాక్రాం |
| 14 (పంగుని నెల.) | ౧ | ౧౧ | చ॥ఆ౪౩-౫౦శ౫౦-౨౪సి౪-౫౨-భ౧౪-౧౦-ది౭-౪౧అహః-౨౯-౩౯పూభా౪మీనే రవిః౯-౧౪ మాసశివరాత్రిఃకుక్రాంషడశీతిముఖపుణ్యకాలః పరం౧౬పర్యంతం భు౩-౫౮చ౨౭ |
| 15 | ౨ | ౧౨ | అ॥ ● సో౪౪-౨౬పూభా౫౩-౪౦సా౨-౫౬శు౫౮-౩౪చ౧౪-౧౬ది౭-౧౪పంచగ్రహ కూటః అమాసోమవారవ్రతం పిండపితృయజ్ఞంరక్రాంభుం-౬చ౨౮ |
| 16 | ౩ | ౧౩ | రాక్షస సం॥ చైత్రశు౧మం౪౬-౧౫ఉభా౫౬-౩శు౫౮-౩౦కిం ౧౫-౨౦ది౧౪-౨౭యోగకాలఃభుం-౧౪చ౨౯ |

| | | | |
|---|---|---|---|
| | | | శ |
| రబుగు రా | శు ౧౩ కుంభేకు జః శు౧౪మకరే | | |
| కు | శుక్రః కృ౧౪ మీ రవిః | | కే |
| శు | | | |

| | | | | |
|---|---|---|---|---|
| కుజచారః | బ౧౨శుశత౨కు౩౧ | బ౩గుప్రాగుదయంబు౪౦ | ఫాల్గుణశు౨మపూషా౨శు౧౫ | శనిచారః |
| ఫాల్గుణశు౧సో శ్ర౪కు౬ | బ౩౦సోప్రాగుదయంకు ౪౬ | బ౬ఆ బుధవక్రత్యాగః | శు౫పూషా౩శు౮ | ఫాల్గుణశు౧౨శనివక్రత్యాగః౧౫ |
| శు౫శుధ౧కు౩౧ | బుధచారః | బ౩౦సోధర౪బుజీవబుధః | శు౮సోపూషా౪శు౧౧ | |
| శు౯మధ౨కు౩౦ | ఫాల్గుణశు ౨పశ్చాదస్తంబు౧౨ | గురుచారః | శు౧౧ఉషా౧శు౧౫ | రాహుకేతుచారః |
| శు౧౩శధ౩కుంకు౫౦ | శు౫శు శత౧వక్రిబు౩౪ | ఫాల్గుణశు౧౪ఆశత౩గురుః ౨౩ | శు౧౪ఆఉషా౨మశు౬ | ఫాల్గుణబ౧మధని౩రాహు |
| బ౩గుధ౪కు౧౦ | శు౯మధ౪వక్రిబు౫౯ | | బ౨బుఉషా౩శు౧౪ | మఖా౧కేతుః |
| బ౭సోశత౧కు౨౧ | శు౧౪ఆధ౩వక్రిబు౯ | శుక్రచారః | | |

## ఆనందాది యోగములు.

ఆ॥సో॥మం॥బు॥గు॥శు॥శ

అ మృ ఆశ్లే హ అ ఉ శ ఆనందయోగము-కార్యసిద్ధి (ర్యమగును.
భ ఆ మ చి జ్యే అపూ కాలదండయోగము-ఆయాసముమీాదకా
కృ పున పు స్వా మూ శ్ర ఉ ధూమ్రయోగము-కార్యహాని ధననష్టము
రో పు ఉష వి పూ ధ రే ధాత్రీయోగము-కార్యసిద్ధి శుభశకునము
మృ ఆ హ అ ఉ శ అ సౌమ్యయోగము-కార్యసిద్ధి సౌఖ్యకరము
ఆ మ చి జ్యే అ పూభ ధ్వాంక్షయోగము-కార్యనాశనము దుఃఖ
పునపు స్వామూ శ్ర ఉ కృ ధ్వజయోగము-ద్రవ్యప్రాప్తి (ప్రదము
పు ఉష వి పూ ధ రే రో శ్రీవత్సయోగము-లాభకరము
ఆ హ అ ఉ శ అ మృ వజ్రయోగము-కార్యనాశనము
మ చి జ్యే అ పూభ ఆ ముద్గరయోగము-కలహప్రదము అపశకు
పుస్వా మూ శ్ర ఉ కృ పున ఛత్రయోగము-స్త్రీలాభము ధనము (నం
ఉషవి పూ ధ రే రో పు మిత్రయోగము-మిత్రలాభము
హ అ ఉ శ అ మృఆ మానసయోగము-సర్వకార్యసిద్ధి
చి జ్యే అ పూభ ఆ మ పద్మయోగము-ఐశ్వర్యప్రదము
స్వామూ శ్ర ఉ కృ పునపు లంబయోగము-కార్యవిలంబము శ్రమ
వి పూ ధ రే రో పు ఉభ ఉత్పాతయోగము-ద్రవ్యనాశము శ్రమ
అ ఉ శ అ మృ ఆ హ మృత్యుయోగము-మృత్యుప్రదము
జ్యే అ పూ భ ఆ మ చి కాలయోగము-అవమానము
మూ శ్రి ఉ కృ పునపు స్వా సిద్ధయోగము-కార్యసిద్ధి శుభశకునము
పూ ధ రే రో పు ఉ వి శుభయోగము-శీఘ్రకార్యకారి
ఉ శ అ మృ ఆ హ అ అమృతయోగము-కార్యసిద్ధికరము
అ పూ భ ఆ మ చి జ్యే ముసలయోగము-దుఃఖప్రదము
శ్ర ఉ కృ పున పు స్వామూ గదాయోగము-కార్యహాని
ధ రే రో పు ఉష వి పూ మాతంగయోగము-లాభము
శ అ మృ ఆ హ అ ఉ రాక్షసయోగము-హానికరము
పూ భ ఆ మ చి జ్యే అ చరయోగము-దుర్వార్తాశ్రవణము
ఉ కృ పున పుస్వామూ శ్ర సిద్ధయోగము-మిశ్రఫలప్రదము
రే రో పు ఉష వి పూ ధ వర్ధమానయోగము-ఉత్తమము

# విషయానుక్రమణిక



## వ్యా స ము లు

# చిత్రపటముల విషయానుక్రమణిక

దీనిలో 247 మొదలు 252 వఱకు చిత్రపటముల వివరముగలవు

# సంవత్సరాది

## వేంకటపార్వతీశ్వరకవులు

సకలసచరాచరప్రపం ♦ చకము నరయ
నిరత మభినవముగఁ గానఁ ♦ బఱచుచుండు
ప్రకృతికో పరమాత్మకో ♦ పలుకరాని
సర్వశక్తికి మా నమ ♦ స్కారశతము.

మ. కలమా! నీ విపు డేమి వ్రాయుటకు సం ♦ కల్పించితో? నేఁటి నీ
కులుకుంజెయ్వులు మైచకచ్చకలు మా ♦ కున్ వింతగాఁ దోఁచె; ను
జ్జ్వలభావస్ఫురణంబునం దభినవ ♦ ప్రాగల్భ్యముం జూపు నీ
జిలుగుంబంగరువ్రా లమోఘవిజయ ♦ శ్రీకంబు లౌఁగావుతన్ !

అస్మదీయమనోభావ ♦ నానురూప
కామగామినీ! యో లేఖి ♦ నీమతల్లి!
చల్లచల్లగ నటునిటు ♦ జరగ దేల?
తెల్లముగ మాకు నీజాడ ♦ తెలిసిపోయె.
నాయికానాయకుల నట ♦ నంబు లెల్ల
నెలమిఁ జిత్రింపఁగా మది ♦ నెంచలేదు;
వికృతసందర్భనాలాప ♦ విభ్రమముల
నలరు పురుషులఁ జూపింపఁ ♦ దలఁపలేదు;
జీవితం బంతయును దేశ ♦ సేవఁ గడపు
పుణ్యులచరిత్రమును వ్రాయఁ ♦ బూనలేదు;
బవరమున జయలక్ష్మినో ♦ స్వర్గరమనో
చూఱగొను వీరుల లిఖింపఁ ♦ జూడలేదు;
ప్రథిత దేశభాషోపద్ర ♦ వంబుఁ గూర్చి
తెంపరుల విమర్శింప నూ ♦ హింపలేదు;
ఘనదురాచారపంకసం ♦ కలితు లైన
కుమతులఁ దిరస్కరింప నూ ♦ ల్కొనఁగలేద;
అవనికపకారకారకు ♦ లైనయట్టి
దుర్మదాంధుల దూషింపఁ ♦ దొడరలేదు;
ప్రకృతితత్త్వాద్భుతగుణాను ♦ భవము గలుగు
ధీమతులచిత్రగతులఁ జిం ♦ తింపలేదు;
విపులవైరాగ్యనిష్ఠాప్ర ♦ విష్టు లైన
మానులమహత్త్వ మెఱఁగించు ♦ మమత లేదు;
కాని, నవరసంబులకు ని ♦ ధాను లైన
యిందఱకు నాట్యరంగమై ♦ యెసఁగుచున్న
యిందఱకు నాశలను వెల ♦ యించుచున్న
యిందఱకు నూతనోత్సాహ ♦ మిచ్చుచున్న
యిందఱకు నొక్కరూపుగా ♦ నెదుట నున్న
యట్టి నూతనసంవత్స ♦ రాదిఁ గూర్చి
లేఖినీ! వ్రాయఁదలఁచుకో ♦ లేదె? చెపుమ!

* * * * * * *

క. వ్రాయుము నిర్మలభావవి
ధేయమ్ముగ బుధజనాళి ♦ ధేయముగ జగ
ద్గేయమ్ముగ లలితసుధా
ప్రాయమ్ముగఁ బాఠకశ్ర ♦ వణపేయముగన్.

ప్రమదమందానిలాంకూర ♦ పటలితోడ
లలితకుసుమపరిమళ ♦ లహరితోడఁ
గలితనవమంజరీలతా ♦ గణముతోడ
సమితఫలపుష్పఘనతరు ♦ సమితితోడఁ
దనరు నుపవనముల, మహా ♦ వనములందు,
నలరు పొదరింటిచల్లని ♦ నెలవులందు,

జలజవిలసితకాసార ♦ తలములందు,
బలియు చక్కనిపచ్చిక ♦ బయళులందు
నెసఁగెడు మనోజ్ఞభావంబు ♦ నెంచుకొనుచు
ననితరానందలీలల ♦ నాడుకొనుచు
భ్రమరఝుంకారములతోడఁ ♦ బాడుకొనుచుఁ
బ్రకృతిచిత్రంబులను గానఁ ♦ బఱచుకొనుచు
వనరమం గూడి క్రీడింప ♦ వచ్చినట్టి
తరుణసుందరమూర్తి మా ♦ ధవునిఁ గూడి
వచ్చినది నేఁడు నూతన ♦ వత్సరంబు.

*   *   *   *   *   *   *

అస్మదీయసుఖస్థితు ♦ లందుఁ గాని
యలఘుతరకష్టకాలంబు ♦ లందుఁ గాని
యరనిముసమైన మము విడ ♦ నాడకుండ
నీడపోలిక నెపుడు మా ♦ తోడఁ దిరిగి
కాలవశమున నేఁడు మా ♦ కను మొఱంగి
పూర్వవత్సర మెచటికో ♦ పోయె ననుచు,
దానితోఁ గూడఁ దలచూపి ♦ ద్రఢిమఁ గాంచి
పొదలు నాశాలతలు తెగి ♦ పోయె ననుచు
డెందములఁ గుందువడి దిగు ♦ లొందనేల?
దానిపోలికనే పూని ♦ దానివెనుక
దానిసర్వస్వమునకు స్వ ♦ త్వంబుఁ గాంచి,
దానియధికారమున నిల్చి ♦ దానిగతినె
కలసి మిమ్ములఁ దనవారిఁ ♦ గా గ్రహించి
భావుకాన్యోన్యబంధుసం ♦ బంధభావ
బోధకంబుగఁ దానె మి ♦ మ్ములను జేర
వచ్చినది గాదె నూతన ♦ వత్సరంబు!
కాని, యొకచింత యున్నది! ♦ దాని నదియు,
దీని నదియును జూడఁగా ♦ లేనిగతికిఁ
దలఁచి తలఁచి విచారింప ♦ వలసినదియె.
కడచిపోయిన వత్సర ♦ గర్భమందుఁ
గలసిపోయిన సంస్థితి ♦ గతులయందు
జరగిపోయిన కార్యసం ♦ చయమునందు
మనసుపోయినచోఁ బోవఁ ♦ జనును గాక,
మనకు నాస్థితి మరల రా ♦ దనుట నిజము;
మనము నచటికిఁ బోఁజాల ♦ మనుట నిజము.
ఏరు గతమున కొక యుప ♦ కారమైనఁ
జేయునది లేదు; కాన నా ♦ చింత మాని
హృదయముల నాశలను వెల ♦ యించుచున్న
యట్టి యీ వర్తమానంబు ♦ ననుసరించి
యొదవనైయున్న భావిఫ ♦ లోదయమున
కెదురుసూచుచు ముందుఁ బో ♦ వుదముగాక!
అనయ మెలమావిలేఁజిగు ♦ రాకె మెసవఁ
దలఁపుఁగాంచుట కోకిల ♦ తప్పు గాదు;
ఎపుడు వికసించియేయుండ ♦ నిచ్ఛగించి
సంభ్రమించుట తమ్మిదో ♦ సమ్ము గాదు;
ప్రకృతిసంబంధులగు జీవు ♦ లకు సతంబు
భావ మాశార్ద్రమగుట స్వా ♦ భావికంబు.
అవనతోన్నతగతుల కా ♦ శాభిరతులె
కారణము లని, పరిణామ ♦ కాలమందుఁ
గష్టసుఖదాయకము లని ♦ కాంచి, వాని
నెవఁడు మొదలంటఁ దెగఁగోయ ♦ నెంచఁగలఁడు?
జీవులప్రచారములకు, నా ♦ శావకాశ
విస్తృతికి, వర్తమానభ ♦ విష్యములకు
ననిశసంబంధబాంధవ్య ♦ మమరుఁ; గాన
సాగిపోయిన పూర్వవ ♦ త్సరముకంటె
నరుగుదెంచిన యీ నూత ♦ నాబ్దమందె
యెల్లవారలకును ప్రేమ ♦ హెచ్చుఁగాదె!

*   *   *   *   *   *   *

"క్రొత్త యొక వింత యని యెంచు ♦ కొనుటె కాని,
జగతికిం గ్రొత్త యున్నదే? ♦ సాధులార!
నరిగ దినములలోన మా ♦ సములలోన
నమరు ఋతువులలో నయ ♦ నములలోనఁ
గాలములలోన నొక్కటే ♦ గతిని గాంచి
తలఁగి చన్న ప్రమాదివ ♦ త్సరముకంటె
నేగుదెంచిన యానంద ♦ మెంత గొప్ప?
జరగిపోయినయట్టి వ ♦ త్సరమునకును
వచ్చి జరగుచునున్న యీ ♦ వర్షమునకు
నెంచి చూడంగ వ్యత్యాస ♦ మేమి కలదు?

కాలగతికిని భేదంబు ♦ కలదె ?"—యనుచుఁ
జెప్పుచుందురు కొంద ఱ ♦ చ్చెరువుగాఁగ
విశ్వసింపంగఁజెల్లునే ♦ వీరిమాట ?
కాలపరిణామముల కాన ♦ వాలునైచి
ప్రకృతి కన్నారఁగాఁ గనం ♦ బఱచుచుండఁ
దెలిసి యెవ్వారు కాదని ♦ పలుకఁగలరు ?
అస్మదీయోక్తు లనృతంబు ♦ లందురేనిఁ
బ్రక్కమీఁదనె యటునిటు ♦ పసుట మాని
లలితగతిఁ బ్రాఁకుచుండు బా ♦ లకునిఁ జూచి
తప్పటడుగులఁ దిరుగాడు ♦ దారి మాని
పరువులెత్తుచునుండు డిం ♦ భకునిఁ జూచి
జననిచెంగటనే యాఁడు ♦ కొనుట మాని
సకులతోఁ గూడి యాడు కొం ♦ డికను జూచి
మంటిలోఁ వ్రాసికొను నోన ♦ మాలు మాని
బాలబోధను చదువు శా ♦ బకునిఁ జూచి
చదువుసాములు నేర్చుకోఁ ♦ జనుట మాని
వలపుజవరాలిఁ జేరు జ ♦ వ్వనునిఁజూచి
భవనమున భార్యతో నొంటి ♦ పాటు మాని
తనయులం గాంచు బిడ్డల ♦ తండ్రిఁ జూచి
యంతయును నాది యని దొర్లు ♦ నాస మాని
ముక్తికై చూచు ముక్కాలి ♦ ముసలిఁ జూచి
ముఖ్యముగ వారిదరి కేఁగి ♦ ముచ్చటించి
కాలగతికిన్ని భేదంబు ♦ కలవొ, లేదొ
తిరిగిపోవక వలసినఁ ♦ దెలిసికొనుఁడు !

* * * * * * *

నిన్న నేఁడును నొకరీతిఁ ♦ జన్ననైన
జీవులకుఁ గ్రొత్తయే చేసి ♦ పోవుచుండు.
రాజ్యములఁ గ్రొత్త, సమయధ ♦ ర్మములఁ గ్రొత్త,
పాత్రములఁ గ్రొత్త, నెఱసడ ♦ వడులఁ గ్రొత్త,
గుణములం గ్రొత్త, పలుపలు ♦ కులను గ్రొత్త;
వేసములఁ గ్రొత్త, యాచార ♦ విధులఁ గ్రొత్త,
చదువులం గ్రొత్త, కవితార ♦ సములఁ గ్రొత్త,
దినదినంబును గ్రొత్త దై ♦ తనరుచుండు.
నూత్నజీవధర్మాసక్తి, ♦ నూత్నశక్తి,
నూత్న వైభవసంపత్తి, ♦ నూత్నవృత్తి,
నూత్నమార్గానుగతబుద్ధి, ♦ నూత్నసిద్ధి
నూత్నభావోదయముననే ♦ నూలుకొనును ;
గానఁ బ్రకృతియో పరముఁడో ♦ కరుణఁజేసి
జీవులకు నూత్నమతి దయ ♦ చేసియుంట
నిట్టి సంవత్సరాదు లె ♦ న్నేనిఁ జనిన
మనకు నీవత్సరాది నూ ♦ తనమె యయ్యె.
నెల్లవారల హృదయముల్ ♦ పల్లవించె;
మరల నాశాలతలు పూచి ♦ పరిమళించె;
జనుల కెల్లను నూతనో ♦ త్సాహ మొదవె;
నవ్యభావోదయం బయ్యె ♦ నరులలోన.
జనుల జీవమానమున వ ♦ త్సర మొకండె
యరయ సర్వప్రధానమై ♦ వఱలుఁ; గాన
జీవితంబున నొకయేఁడు ♦ చెల్లిపోయె,
ననుచుఁ బెద్దలు తమధర్మ ♦ మాచరింప,
వయసు వెలయింప నొకయేఁడు ♦ వచ్చె ననుచు
నలరి బాలురు పెద్దల ♦ ననుకరింప,
నేఁడు గడచిన ఫల మింత ♦ యెఱుఁగలేమి
జడమతులు పండుగలె చేసి ♦ సంతసింప,
నందఱకు సన్నిరూపులై ♦ యవతరించి
యుత్సవముఁ గూర్చుచుండె సం ♦ వత్సరాది.
ఉదయభానుని కోమల ♦ మృదుకరముల
దరవికసితాబ్జినీనవ ♦ పరిమళములఁ
జారుశీతలమందస ♦ మీరణములఁ
గలవిహంగకలాలాప ♦ కలకలముల
నిట్టలంబుగ నాశలు ♦ నిండియుండె.
నేక్షణంబున గతవర్ష ♦ మిట్టె చనియె
నేక్షణంబున నవవర్ష ♦ మేఁగుదెంచె
నాక్షణం బెప్పు డేరీతి ♦ నరిగినదియొ
యెట్లు మాఱిచి మాఱెనో ♦ యెవ్వఁ డెఱుఁగు!
జననమరణంబులకు నట్టి ♦ క్షణమె కలదు;
జాగరస్వప్నముల కట్టి ♦ క్షణమె కలదు;
ఆ క్షణం బెట్లుగా మాయ ♦ మైన నేమి ?
గతవినూత్నవర్షములకుఁ, ♦ గాలగతికిఁ

ఉరుగు లేకుంటఁ జూపులు ♦ దొరకకున్నఁ
బ్రజల కిప్పుడు కలిగిన ♦ బాధ యేమి?
ప్రభుననంతరమునఁ గుమా ♦ రప్రభుండు
పైతృకపదం బధిష్ఠింప ♦ వచ్చినపుడు
లోకమునకును గలిగిన ♦ లోప మేమి?
కాని, గతమునకంటె నా ♦ గతముఁ గూర్చి
సంశయంబులు పుట్టుట సహజ మరయ.
"పూర్వవత్సర మేరీతిఁ ♦ బోయినదియొ
మరల రాకుంట దానికి ♦ మార్పు లేదు;
మనల లోఁగొని, మనతోడ ♦ ననుగమించు
చున్న యీయేటిగతి యెట్టు ♦ లుండు?" ననుచు
మనుజులకు సంశయము తోఁచు ♦ మాట నిజము.
ప్రజలజీవితము లను కా ♦ వ్యంబులందు
వఱలు సర్గలవంటి వీ ♦ వత్సరములు;
జరగిపోయిన వత్సర ♦ సమితి నెల్లఁ
జదివి వైచిన సర్గల ♦ జాడ విడిచి
వానిలోఁ గన్న సుఖదుఃఖ ♦ భావములను
నెడఁదలోఁ బెట్టుకొని యాత్ర ♦ పడెద రేల?
వచ్చు సర్గను నే కత ♦ పట్టు గలదొ
చల్లఁగాఁ బత్త్రముల విప్పి ♦ చదువుకొనుఁడు!

## లోకమాత

సీ. పతిభక్తి పెంపున సతతంబు నినునకుఁ బ్రణతయై తాఁ బ్రదక్షిణ మొనర్చు
తతిసైన నెడఁబాసి తాళనీయక నిజాకర్షణశక్త్యాత్మక మగు ప్రేమ
హృదయమధ్యమునుండి ప్రేరేప, నెపుడు మార్జాలకిశోరమర్యాద దనర
జంతుసంతతి నెల్ల సమదృష్టి జాతి దారిని బడకుండ నక్కున ధరించి,
యాదలకు నెక్క త్రొక్కనసైన సైఁచి,
సకల మాతృమయము తదేకసౌఖ్యమునకె
సతము వినియోగపఱుచుచు సాఁకు; జనని
జనని యన, ధాత్రికన్నను జనని కలదె?

# ప్రత్యేకాంధ్రరాష్ట్రము

వల్లూరు సూర్యనారాయణరావు పంతులుగారు బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

చెన్నపురిరాజధానిలో నుండు తెలుఁగుజిల్లాలన్నియు నొక ప్రత్యేకాంధ్రరాష్ట్రముగ నేర్పాటుచేయుట మంచి దని క్రిందటి సంవత్సరము బాపట్లలో జరగిన యాంధ్రమహాజనసభలో కొందఱభిప్రాయపడిరి. దీని విషయమై దొరతనమువారికి మన మందఱమును కలిసి నివేదించుటకు ముందు ఆయా జిల్లాలలో నుండు ప్రముఖుల యభిప్రాయములను కనుఁగొనవలయు నని తీర్మానము చేయఁబడినది. ఈ తీర్మానము ననుసరించి ఆంధ్ర మహాజనసభవారిచే నియమింపఁబడిన కమిటీలోని మెంబర్లు కొందఱు ఆయా పట్టణములకు పోయి ఈవిషయమునుగుఱించి ముచ్చటించిరి. వీరు నంద్యాల, కర్నూలు, గుత్తి, బళ్లారి, హోస్పేట, కడప, పెనుకొండ గ్రామములలో పోయిన డిసెంబరుమాసమున ఆంధ్రోద్యమమును గుఱించియు, నూతనసర్వకళాశాలలను గుఱించియు, ఆంధ్ర విశ్వవిద్యాలయమును గుఱించియు, ఆంధ్రరాష్ట్రమును గుఱించియు, ఉపన్యాసములను గావించి ఈ సంవత్సరము ఏప్రియల్ 10-వ తేదిని బెజవాడలో జరగఁబోవు ఆంధ్ర మహాజనసభకు అక్కడివారిని రావలసిన దని కోరి యున్నారు. ఆంధ్రరాష్ట్రస్థాపనమును గుఱించి అక్కడక్కడ కొంచెము భిన్నాభిప్రాయము లున్నను, మొత్తముమీఁద కమిటీమెంబర్ల యుపన్యాసములను వినినతరువాత ఈయుద్యమములో కొంత సత్యము లేకపోలే దని దాక్షిణాత్యులు సయితము ఒప్పుకొనిరి.

ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏల కావలయును? దీనికి ఆక్షేపణ లెవ్వి? వీనికి సమాధానము లెవ్వి?— ఈ విషయములు ప్రస్తుతము చర్చింపఁదగియున్నవి.

హిందూదేశమం దుండు వివిధభాగములలోను పూర్వకాలమునుండియు జనులు వివిధభాషలు మాటలాడుచున్నారు. ఆయా భాగములలో హిందువులు మహమ్మదీయులు, పారసీకులు, క్రైస్తవులు మొదలగు, జాతులవా రున్నారు. వీరిలో, ముఖ్యముగ హిందువులలో, భిన్నజాతు లుండుటయే గాక వీరికి భోజనప్రతిభోజనములును వివాహసంబంధములును కూడ లేవు. కొందఱిని ముట్టుకొనుటయు అంటుకొనుటయు కూడ లేదు. కొందఱి గాలి తగులనేకూడదు. కాఁబట్టి ఈ హిందూదేశములో నున్న యీజాతు లన్నియు సమ్మేళనమై ఒక జాతి యేర్పడవలయు ననియు, అటు లేర్పడు ననియు చెప్పువారు చరిత్రజ్ఞానము లేనివారే కాక సామాన్యబుద్ధి కూడఁ గలవారు కా రని నేను నమ్ముచున్నాను. పాశ్చాత్యదేశములలో భోజనవివాహములయం దన్యోన్యసంబంధములు కలిగి వేషములందును మతములందును కొంచెమెచ్చుతక్కువగ నొకటేమాదిరిగ నుండి, ఇంచుమించు వేయి సంవత్సరములనుండి పొత్తుగా జీవించుచున్న జాతులే తమలో తాము కలియక ఆయా దేశభాగములలో వాడుకొను భాషలను బట్టి విడిపోయి వేఱువేఱుగ రాజ్యాంగతంత్రములను స్థాపించుకొనుచున్నారు. పూర్వచారిత్రమును బట్టియు, పూర్వసాంప్రదాయములను బట్టియు ఒక దేశములోనే వివిధభాషలను మాటలాడు వివిధజాతు లుండుట సంభవించినపుడు ఆ దేశరాజ్యాంగతంత్రము సంయుక్తరాష్ట్రపరిపాలనముగ మాఱి భిన్నజాతులు గాని భిన్నభాషలు మాటలాడువారు గాని నివసించియున్న దేశవిభాగములకు అంతఃపరిపాలనాధికారము పూర్ణముగ నీయఁబడి విదేశీయులతో సంబంధించిన విషయములలోను దేశ మంతటికిని సంబంధించిన విషయములలోను ఒక సంయుక్తసామ్రాజ్యతంత్ర మేర్పఱుపఁబడుచున్నది. ఇట్లు చేయుటచే వివిధజాతులను తమ్ము తమంతట తాము వేఱువేఱుగ పరిపాలింపఁజేసికొననిచ్చి అన్యోన్యద్వేషములను సాధ్యమైనంతవఱకును తగ్గించి దేశమును పరరాజుల బారినుండి సంరక్షించుకొనుటకును వారితో సంధులు కావించుకొనుటకును

దేశ మంతకును కావలసిన విషయముల నాలోచించుటకును తగిన యవకాశము గల సామ్రాజ్యప్రభుత్వ మేర్పడియుండును. సంగతులను బాగుగ తెలిసికొనఁదలఁచుకొన్నవారు అమెరికా సంయుక్తరాష్ట్రము, జర్మనీ సామ్రాజ్యము స్విజర్లెండు ప్రజాస్వామికము, ఆస్ట్రియా హంగేరీ సామ్రాజ్యము మొదలగువాని సంయుక్తరాజ్యాంగతంత్రములను చదువవలెను.

పైన చెప్పిన దేశములలోవలెనే హిందూదేశమందు కూడ అట్టి సంయుక్తరాజ్యతంత్ర మేర్పడు నని నమ్మవలెను. ఈ దేశముయొక్క ఆయా భాగములలో ననేకజాతులు కలిసియుండుటవలన, అక్కడక్కడ వాడుకొనుచున్న భాషలను బట్టియే దేశవిభజనము జరగును గాని మరి యే యితరమైన యాధారములమీఁదను జరగుటకు వీలు లేదు. ఇప్పుడు వ్యవహరింపఁబడుచున్న దేశవిభాగములు వాని పూర్వచరిత్రలను సాంప్రదాయములను వాడుకలోని భాషలను ఆచారములను ఆలోచించి యేర్పఱుపఁబడినవి కావు. మన చెన్నరాజధానిలోని వివిధభాగములును 1611-వ సంవత్సరము మొదలు 1838-వ సంవత్సరమువఱకును అప్పుడప్పుడు అనేకరాజులవలన, అనేకరీతుల, ఆక్రమింపఁబడి క్రమక్రమముగ మన రాజధాని పెరిఁగి ప్రస్తుతము ఒక గవర్నరుక్రింద నున్నది. తూర్పు బంగాళమునకు లెఫ్టునెంటు గవర్నరుగా నుండిన ఫుల్లరుగారు, అస్సాము లెఫ్టునెంటు గవర్నరుగా నుండిన కాటన్‌గారు, పార్లమెంటు మెంబరుగా నుండి మనదేశమం దభిమానము గల బ్రైటుగారు, మన గవర్నరు జనరల్‌గార్లగు కర్జను హార్డింజి ప్రభువులు, స్ట్రాకీగారు, అండరు సెక్రటరీ ఆఫు స్టేటుగా రగు హాల్డరునెస్సు గారు—మొదలగు తెల్లదొరలు సయితము ప్రస్తుతపు రాజ్యవిభాగములు సరిగా లే వనియు, ఆయాభాగములలో మాటలాడు భాషలను బట్టి, రాజ్యముల నేర్పఱిచిన బాగుండు ననియు, సంపూర్ణాంతఃపరిపాలనాధికారమును ఆయా భాగముల ప్రజల కొసంగవలె ననియు, ఖండితముగ చెప్పియున్నారు. ఇట్టి విభజనము ప్రజల యభివృద్ధికే గాక పరిపాలనము సౌకర్యమునకుఁ గూడ తోడ్పడును. ఈ కారణముచేతనే తూర్పు బంగాళమును పడమర బంగాళమును తిరిగి కలిపివేసి వానిని ఒక గవర్నరుక్రింద నుంచుటయు, పూర్వము ఈ బంగాళముతో కలిసియున్న బేహారు ఒరిస్సా చోటానాగపూరు రాష్ట్రములను విడఁదీసి ఒక లెఫ్టునెంటు గవర్నరుక్రింద నుంచుటయు తటస్థపడినది. మన రాజధానిలో కూడ ఆర్కాటుజిల్లాను రెండు భాగములు చేసి తెలుఁగు మాట్లాడు తాలూకాలను చిత్తూరు జిల్లాగాను, అఱవము మాట్లాడు తాలూకాలను ఉత్తరార్కాటుగాను విడదీయుటయు మధ్యపరగణాల రాష్ట్రములోనుండి మూఁడు తెలుఁగు తాలూకాలను గోదావరిజిల్లాలో కలుపుటయు, సంభవించినది.

ఇట్లు భాషలవరుసను బ్రిటిషు హిందూదేశమును విభాగించుటవలన బంగాళము, బేహారు, సంయుక్తపరగణాలు, పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రదేశము, కన్నడము, మళయాళము, అఱవదేశము, తెలుఁగు దేశము, మధ్యపరగణాలు, ఒరిస్సా అను 13 ముఖ్యదేశవిభాగము లేర్పడును. అప్పుడు ప్రతిభాగమం దందు భాషయు వర్ధిల్లి, ఆ భాషలోనే జనులకు విజ్ఞాన మంతయు బోధింపఁబడును; మంచి ప్రభుత్వము లేర్పడి అక్కడి జనుల యభివృద్ధికి కావలసిన చట్టములు చేయఁబడును; రాజకీయ సాంఘిక నైతిక పరిశ్రామిక విషయములలో నెల్ల ఆయా దేశభాగముల కనువగునట్లు లవి నడపఁబడును; ఆయా ప్రజలలో సంఘశక్తియు వారి వృద్ధికి కావలసిన యవకాశములును కలుగుచుండును. బేహారు రాష్ట్రమును బంగాళమునుండి విడఁదీయఁదలఁచుకొనినపుడు హార్డింజిప్రభువుగా రీవిధముగ సెలవిచ్చిరి.—

"ప్రస్తుతము బంగాళా దేశములో నివసించి హిందీభాష మాటలాడువారి నందఱిని సాధ్యమైనంతవఱకు ఒక పరిపాలనమందే యుంచుట ఉచితము. ఇంతవఱకును వీరిని ముందంజవేయుచున్న బంగాళీలతో కలుపుటవలన, అసమానమైన యెద్దులను కట్టిన బండివలె రాజ్యతంత్రము సరిగా నడువకున్నది. ఈ కారణమువలననే బేహారీ లభివృద్ధి చెందుటకు తగిన యవకాశములు లేవు. ఇది గాక ఇపుడిప్పుడు బేహారుదేశములో నూతనోజ్జీవము ప్రబలుచున్నది. వీరు బంగాళీలతో వేఱుపడనియెడల తమ కభివృద్ధి కలుగ దని యభిప్రాయపడుచున్నారు. కాఁబట్టి యీ యాందోళనము వీరిలో మిక్కిలి ప్రజ్వరిల్లకముందే

మనమే బేహారును ప్రత్యేకరాష్ట్రముగ చేసినయెడల మిక్కిలి బాగుండును.”

ఈ వాక్యములు మనకును అఱవలకును ఎంత వఱకు వర్తించునో చదువరులే గ్రహించెదరుగాక !

ఆయా భాగములలో వాడుకొనుచున్న భాషలను బట్టి హిందూదేశమును విభజించుట న్యాయమైన దని మనవారిలో దివాను శంకరయ్యగారు, ప్రొఫెసరు సుందరరామయ్యగారు, ప్రొఫెసరు రామనాథముగారు, న్యాయమూర్తులైన శంకరనాయరు సదాశివయ్యరు గార్లు, మైసూరు దివానుగా నుండిన వి. పి. మాధవరావుగారు, ఆనరబిల్ కేశవపిళ్ళగారు — మొదలైన విద్యాధికు లనేకులు ఒప్పుకొనిరి ; వార్తాపత్రికలలో మద్రాసు స్టాండర్డు, ఇండియను పేట్రియటు, ఇండియన్ సోషల్ రిఫార్మరు, హిందుస్థాన్ రివ్యూ, మాడరన్ రివ్యూ, ఇండియన్ వరల్డు, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్రకేసరి, దేశమాత, భారతమాత, దేశాభిమాని, రవి మొదలగు పత్రికలామోదించినవి. సూక్ష్మదృష్టి లేనివారును, తమ లాభము పోవునేమో యను ఆంధ్రేతరులును మాత్రము ఈ యాదర్శమునందు విముఖత్వమును జూపుచున్నారు.

ఇఁక వీరి యాక్షేపణలను విచారించి, నాకు తోఁచిన సమాధానములను తెలియఁజేయుచున్నాను.

i మన చెన్నరాజధానిలోని 11 తెలుఁగుజిల్లాలు కలిసిన యొక చిన్న రాష్ట్రమునకు ప్రత్యేకముగ నొక ప్రభుత్వమును స్థాపించుట సంభవించునా?

మన తెలుఁగుజిల్లాల వైశాల్య మించుమించు 80,000 చదరపుమైళ్లు. జనసంఖ్య సుమారు 170 లక్షలు. ఈ యాంధ్రదేశము, ఇప్పుడు నూతనముగ నేర్పడిన బంగాళారాష్ట్రమంత పెద్దది. దీనిలోని జనులసంఖ్య బొంబాయిరాజధాని జనసంఖ్యలో కొంచె మించుమించుగ సరిపోవును. అఱవజిల్లాలలోను, బొంబాయిరాజధానిలోను, పంజాబుదేశములోను సుమారు రెండేసికోట్ల జనసంఖ్య యున్నది. మన తెలుఁగుజిల్లాలలోకంటె, మధ్యపరగణాలలోను, బర్మాలోను జనసంఖ్య తక్కువ. ఒక రాష్ట్రము చిన్నదైన నేమి, పెద్దదైన నేమి? కొడగు రాజ్యము ఒక కమీషనరుక్రిందనే యున్నది. అట్లు మళయాళము, కన్నడజిల్లాలు, సింధు, గుజరాతు ఏల యుండఁగూడదు? మన తెలుఁగుజిల్లాల విస్తీర్ణము స్కాట్లెండు, అయిర్లాండు, బల్గేరియా, గ్రీసుదేశముల విస్తీర్ణములకంటె రెండురెట్లును, బెల్జియము, హాలెండు, డెన్మార్కుల విస్తీర్ణములకంటె అయిదురెట్లును, స్విజర్లెండు సర్వియాలకంటె నాల్గురెట్లును ఉండి, టర్కీకంటె కొంచెము పెద్దదిగను, ఇటలీకంటె కొంచెము చిన్నదిగను నున్నది.

ii. మన చెన్నరాజధానిని అఱవ రాష్ట్రముగను తెలుఁగు రాష్ట్రముగను, మళయాళరాష్ట్రముగను విభాగించినయెడల, వీనికి ప్రస్తుతమున్న గవర్నరునకు బదులు లెఫ్టినెంటు గవర్నరు లేర్పడుదురు. వీరు సాధారణముగ ఈ దేశములో బహుకాలము ఉద్యోగము చేసినవారగుటచేత ఇంగ్లాండునుండి నూతనముగ వచ్చు గవర్నరులవలెఁ గాక నిరంకుశాధికారులుగను పూర్వపక్షావలంబకులుగను న్యాయైకదృష్టి లేక ఆశ్రిత పక్షపాతులుగను నుందురు. ఇది దేశమున కనర్థకము కాదా?

చీఫు కమీషనరుచేత పరిపాలింపఁబడు మధ్యపరగణాలకును, లెఫ్టినెంటు గవర్నరులచే పరిపాలింపఁబడు పంజాబు బేహారు సంయుక్తపరగణాలకును, శాసననిర్మాణ కార్యనిర్వాహక సభ లేర్పడియున్నవి. ఇంగ్లాండునుండి వచ్చిన గవర్నరైనను, ఈ సభల తీర్మానములకు వ్యతిరేకముగ ఏపనియును చేయఁజాలఁడు. ఒకవేళ వీరికి కొంతవఱకు పలుకుఁబడి హెచ్చుగ నున్నను గవర్నరులకును, లెఫ్టినెంటు గవర్నరులకును కమీషనరులకును భేద మెంత మాత్రమును లేదు. లెఫ్టినెంటు గవర్నరు లగు మెక్డానెల్, కాటన్, హ్యూయట్, మెస్టన్ మొదలగువారు గవర్నరు లగు డఫ్, లాలీ, క్లార్కు మొదలగువారికంటె దొడ్డవారని అందఱకును తెలిసిన విషయమే. కాఁబట్టి ఆయా ప్రభువుల గుణాగుణములను బట్టి రాజ్యపరిపాలన వైఖరి మాఱుచుండును. ఇంతియ గాక క్రమక్రమముగ ప్రపంచములో నుండు నన్ని దేశములలోను ప్రజాప్రభుత్వమే వ్యాపించుచున్నది. మన దేశములో కూడ ఈ బ్రిటీషు సామ్రాజ్యముక్రిందనే ప్రజాప్రభుత్వము మిక్కిలి వృద్ధిపొందు నని నా నమ్మకము. ఏది యెటులైనను, ఇఁకముం దెన్నటికిని ఒక మనుష్యమాత్రుఁడు నిరంకుశముగ రాజ్యము చేయుట సంభవింపనేరదు.

iii. ఆంధ్రులు మన తెలుఁగుజిల్లాలలోనే గాక అఱవజిల్లాలలోను హైదరాబాదు, మయిసూరు రాష్ట్రములలోను మధ్యపరగణాల లోను కూడ నున్నారు. వా రందఱును ఈ నూతనరాష్ట్రములో నెట్లు చేరుదురు?

మన యాంధ్రు లనేక దేశములలో నున్నమాట నిజమే. వీరు మన యాంధ్ర దేశమును వదలి యితర దేశములలో స్థిరమైన నివాసము నేర్పఱుచుకొనినపుడు ఆ దేశవాసులుగానే పరిగణింపఁబడి అక్కడివారితోపాటు, కష్టనిష్ఠురముల కోర్చి ఆ రాజ్యాభివృద్ధినే ముఖ్యముగ కోరుచుందురు. ప్రస్తుతము మన యాంధ్రులు 25 లక్షలకంటె నెక్కువగ అఱవజిల్లాలలో నున్నారు. వీరికి తెలుఁగే మాతృభాష. వీరు అఱవలతో సంబంధబాంధవ్యములను జరపకపోయినను, వారితో చేరి వారి రాష్ట్రాభివృద్ధికే పనిచేయుచుందురు. న్యాయముగ నట్లే పనిచేయవలయును. ఇప్పుడు అయిర్లాండు దీవికి స్వరాజ్యము నీయఁదలఁచుకొనియున్నారు. అయిరిషుజాతివారు ఫిజీ దీవులు, అమెరికాసంయుక్తరాష్ట్రము, కనడ, మొదలగు దేశములలో స్థిరవాసులుగ నున్నారు. ఈవిధముగనే ఒక దేశపు జనులు విదేశములకు పోయి ఇండ్లు వాకిండ్లు కట్టుకొని అక్కడనే నివసించుచు, అక్కడిచట్టములకు లోఁబడి తమ యాస్తిస్వాతంత్ర్యములను ఆ దేశపరిపాలకుల మూలమున సంరక్షించుకొనుచున్నపుడు ఆదేశస్థు లగుదురు కాని, తమ యిండ్లలో తమ మాతృభాషను మాటలాడుచున్నంత మాత్రముచేత వారు శాశ్వతముగా వదలివేసిన తమ పూర్వదేశపు వాస్తవ్యులు కానేరరు.

iv. హిందూదేశములో ప్రస్తుతము అనేకసమస్యలు కలవు. వీనిని చర్చించి మనకుఁ గల కష్టములను మన ప్రభువులకు తెలియఁజేయుటకును జనులకు, రాజకీయ సాంఘిక పరిశ్రామిక నైతిక విషయములను బోధించుటకును, విద్యాధికు లనేకులు తమ కాలమును ధనమును ఉపయోగపఱిచినఁ గాని దేశ మభివృద్ధి నొందనేరదు. కాంగ్రెసు సభవారు 25 సంవత్సరములనుండి చేయుచున్న తీర్మానములనే సర్కారువారు అమలులో పెట్టనపుడు వారు ఈ రాష్ట్రస్థాపనములను గుఱించి యాలోచించెదరా? శీఘ్రముగ ఫలోన్ముఖమునకు రాని యీ రాష్ట్రోద్యమమునకు ఇంత వ్యయప్రయాస లెందుకు? వ్యర్థముగా మన యుత్సాహమును విలువ యగు కాలమును ఈ యందని ద్రాక్షపండునకు వ్యయపఱుచు టేల?

ఈ సాంఘిక, రాజకీయ, పరిశ్రామిక, నైతిక సమస్య లన్నియు హిందూదేశములో నిదివఱ కేర్పడిన రాష్ట్రములయం దెల్ల నున్నవే. ఇవి యెల్లప్పుడును నూతనముగ మన పరిష్కారమునకు ప్రతిదేశములోను బయలువెడలుచునే యుండును. ఇవి యన్నియు పరిష్కారమైనతరువాత ప్రత్యేకాంధ్రరాష్ట్రము నాలోచింపవచ్చుననుట సముద్రములోని యలలు పోయిన తరువాత స్నానమాడుటవంటిది. ఈ సమస్యలలో ప్రత్యేకాంధ్రరాష్ట్రస్థాపనము కూడ నొకటిగా నెంచవచ్చును. ఈ యాందోళనమునకును తక్కిన సమస్యలపరిష్కారమునకు జరగు నాందోళనములకును పరస్పర వైరుద్ధ్యము లేదు. ఈ యాంధ్రరాష్ట్రస్థాపనమువలన తక్కిన సమస్యలు కొన్ని అతిశీఘ్రకాలములో పరిష్కరింపఁబడవచ్చు నని కూడ నా నమ్మకము. మన కొక విశ్వవిద్యాలయము, దానిక్రింద అనేకవిధములైన కళాశాలలు, ఒక హైకోర్టు, శాసననిర్మాణ కార్యనిర్వాహక సభలు, మొదలగునవి యేర్పడుటయు, ఈ యాంధ్రదేశజనులకు గొప్ప పదవులలో నుండుట కెక్కువ యవకాశములును వీలును కలుగుటయు, ప్రత్యేకరాష్ట్రస్థాపనమువలన సంభవింపవచ్చును.

భాషల ననుసరించిన హిందూదేశ రాష్ట్రవిభజనము మంచి దనియు, మన తెనుఁగు జిల్లాల నొక రాష్ట్రముగ నేర్పఱుచుటకు ప్రయత్నించుట ఒక యాదర్శముగ మాత్రమే మనయెదుట పెట్టుకొనవలసిన దనియు ఆనరేబిల్ కేశవపిళ్ళగారు గుత్తిలో డిసెంబరు 22-వ తేదిని పబ్లికు మీటింగులో నగ్రాసనాధిపతిగ నుండి సెలవిచ్చినారు. ఈ యాదర్శము ఎల్లప్పటికిని ఆదర్శస్థితిలోనే యుండవలెనా? ఆచరణములోనికి తెచ్చుటకు ప్రయత్నింపవలెనా? ఈ యాందోళనమును మానవద్దని కూడ వీరు చెప్పియున్నారు. కాంగ్రెసుసభవారు ఏటేటను చేయుచున్న తీర్మానములలో ముఖ్యమైనవి, అనఁగా ఇంగ్లాండులో నుండు సెక్రటరీ ఆఫ్ స్టేటుగారి కౌన్సిలును తీసివేయుట లేక దానిలో మన మేలుకొను ప్రతినిధులను చేర్చుట, ఆయుధ విషయమైన చట్టమును



George Town, Madras

జార్జిటవును, మద్రాసు




General View of Madras Harbour

మద్రాసు హార్బరు



Fort St. George, Madras

ఫోర్టు సెయింటు జార్జి, మద్రాసు




Mount Road, Madras

మౌంటురోడ్డు, మద్రాసు




Memorial Hall

మెమోరియల్ మందిరము



Young Men's Christian Association Building

యువజన క్రైస్తవసమాజ మందిరము

రద్దుపఱుచుట, పటాలముల కగు వ్యయమును తగ్గించుట, కార్యనిర్వాహక న్యాయాధికారములను విడదీయుట, మన దేశస్థులను వాలంటియరు కోరులలోను సైన్యములలోను చేర్చుకొనుట మొదలైనవి, ఆచరణములో పెట్టక ముందే దేశభాషలను బట్టి హిందూదేశ మంతయు చిన్న చిన్న రాష్ట్రములక్రింద మాఱు ననియు, ముఖ్యముగ మన తెనుఁగు జిల్లాలు ప్రత్యేకాంధ్రరాష్ట్రముగ ముందుగనే మాఱు ననియు నా యభిప్రాయము. ఈ ప్రయత్నమునకు మన మెంత ప్రయాసమైనను పడవలసినదే.

v. హిందూదేశములో నుండు జను లేకజాతివారుగ నుండవలె ననియు, ఒకే లిపియు ఒకే భాషయు రాజకార్యవ్యవహారములకు దేశమం దంతటను వ్యాపింపవలె ననియు, హిందూదేశ మంతటిమీఁదను అభిమానము కలిగియుండవలె ననియు మన కాంగ్రెసు ప్రముఖులు ఘోషించుచుండఁగా, తిరిగి దేశమును నూతనవిభాగములు చేసి మన తెలుఁగువారిని అఱవవారిని మళయాళీలను కన్నడపువారిని వేఱుచేసి అన్యోన్యవైషమ్యములను పెంచి వీరిలో ననేకులకు మనస్సంతాపమును కలుఁగఁజేయుట న్యాయమా?

మన కుటుంబముయొక్క అభివృద్ధికి మనము ప్రయత్నము చేయుటవలన మన గ్రామమును మనజిల్లాను మన రాష్ట్రమును మన సోదరరాష్ట్రములను మన హిందూదేశమును ప్రేమించుట లేదా? మన ప్రేమ మన కుటుంబమునందు మొదలుపెట్టి క్రమక్రమముగ వృద్ధి పొంది జ్ఞానమహిమచేత చిట్టచివరకు విశ్వమానవకోటి మీఁదను సమస్తమైన జీవరాసులమీఁదను వెల్లివిరియునట్లు ప్రవహింపఁజేయవచ్చును. కాని సామాన్యముగ పోను పోను ప్రేమానుబంధము బలహీన మగుచుండును. కాఁబట్టి మన రాష్ట్రమును మనము బలపఱుచుకొన్నపుడే దేశ మంతయు బలిష్ఠ మగును. జాతు లన్నియు కలియుట గాని, వాడుకలోని భాషలు నశించి యేక భాష దేశ మంతటను వ్యాపించుట గాని యెన్నటికిని తటస్థింప దని యిదివఱకే వ్రాసియుంటిని. అయిర్లాండు, స్కాట్లండు, వేల్సు ప్రత్యేకరాష్ట్రములుగ నేర్పడినయెడల బ్రిటీషు సామ్రాజ్యమునకీ రాష్ట్రములు సహకారులుగ నేల యుండవు? మొదటినుండియు వేఱుగా నున్న బంగాళీలకును పంజాబీలకును మనకును నేటివఱకును అన్యోన్యసౌభ్రాతృత్వము లేదా? ఒకరి సుఖదుఃఖములు తక్కినజాతులవి కావా? యూరపుఖండవాసులందఱివలనను పొగడొంది 1 లక్ష 20 వేల రూపాయలు బహుమతి వడసిన బంగాళీకవి రవీంద్రనాథటాగోరుగారికి హిందూదేశస్థు లందఱును మ్రొక్కుచున్నారా లేదా? కాంగ్రెసులో అన్ని దేశభాగములవారును కలిసి దేశక్షేమమునకు తగిన ప్రయత్నములు చేయుచున్నారు. ఒండొరులతో సహవాస మెక్కువగ చేసి తమ్ము పరరాష్ట్రములబారినుండి రక్షించుకొనుటకు ఒకదేశములో నున్న రాష్ట్రము లన్నియు సంయుక్తరాష్ట్రముగ నేర్పడక తప్పదు. ఈ రాష్ట్రము లన్నియు ఒక కేంద్రస్థాన మగు సంయుక్తరాష్ట్రప్రభుత్వ మనుదాని నేర్పఱుచుకొనవలసియుండును.

మన కంటె ముందుగా ఏఁబది సంవత్సరముల క్రిందటనే అనేకకారణములవలన అభివృద్ధికి వచ్చిన అఱవవారిలో కొందఱు, వెనుకపడియున్న మనదేశము ప్రత్యేకరాష్ట్రమైనయెడల అఱవవారికి ఇక్కడ ఉద్యోగములు లేకపోవు ననియు, ఇప్పుడు ముఖ్యపట్టణమగు చెన్నపట్టణమునకు బదులు అప్పు డాంధ్రరాష్ట్రములో వేఱొక ముఖ్యపట్టణము స్థాపించుటవలన హైకోర్టు మొదలగునవి నూతనముగ అక్కడ నేర్పాటు చేయఁబడుటచేత ఆంధ్రులకే గొప్పపదవులు వచ్చు ననియు, ఈర్ష్యాళువులు కావచ్చును. అటులైనయెడల వారినే నిందింపవలయును గాని మనయం దెంత మాత్రమును దోషము లేదు. మనకు పెద్ద యుద్యోగములు కావలె నన్న తెల్లదొరలకు కష్టముగ నుండు నని అడుగుట మానినామా? స్వదేశవస్తువులయం దభిమానము కుదిరినపుడు విదేశీయులకు కష్టముగ నుండదా! కాఁబట్టి అసూయాపరులు నిందార్హులు కాని అభివృద్ధి పొందఁదలఁచుకొన్నవారు కారు.

vi. మన తెలుఁగు జిల్లాలలో సామాన్యముగ జనులు వాడుకొను భాష తెలుఁగైనను, ఇక్కడ అఱవలు, మహమ్మదీయులు, పారసీకులు, క్రైస్తవులు మొదలగువా రుండుటచే వీ రందఱిని ఆంధ్రు లనెదరా? వీ రెల్లరు నొక జాతిగా నెట్లు పరిగణింపఁబడుదురు?

ఆంధ్రశబ్దమును ఈ చర్చలో జాతి కన్వయింపఁజేయుటలేదు. ఈ తెలుఁగుజిల్లాలలో ననేకజాతు లున్నను దేశము మాత్రము ఆంధ్రదేశ మనియు, దేశభాష ఆంధ్రభాష యనియు, అందఱకును తెలిసిన విషయమే. ఇక్కడ నివాస మేర్పఱుచుకొన్న మహమ్మదీయులను, క్రైస్తవులను, అఱవలను, ఆంధ్రు లనియే చెప్పుచున్నాము. హిందూదేశమందు తక్కిన రాష్ట్రములలోవలె మన తెలుఁగుజిల్లాలలో కూడ అనేకవర్ణములతో కూడుకొన్న హిందువులును ఇతరజాతులవారును కలిసియున్నారు. ఈ హిందువులలో నుండు శాఖ లన్నియు కూడ అన్యజాతిమిశ్రమము కాని ఒక జాతినుండియే పుట్టలేదు. అన్నియు సంకరములే యని మనము ఒప్పుకొనవలసియున్నది. అయినను వీ రందఱును నివసించుచున్న దేశము మాత్రము మాఱలేదు.

ప్రతినిమిషమును ఉదకరేణువులు మాఱుచున్నను క్రొత్త జలబిందువులు వచ్చుచున్నను నానావిధములైన వస్తువులు కొట్టుకొనివచ్చుచున్నను, ఒక నదీప్రవాహము పూర్వమునుండియు నెడతెగక ప్రవహించుచుండుటచేత ఒక పుణ్యనామముననే యెట్లు వాడఁబడుచున్నదో, అదే విధముగ ఆంధ్రభాష సర్వసామాన్యముగ వాడుకలో నున్న దేశము ఎన్ని వివిధజాతులు కలిగియున్నను ఆంధ్రదేశ మనియే వాడఁబడుచున్నది. ఈ పుణ్యభూమిని తమ జన్మభూమిగ చేసికొనిన ఆర్యేతరులు సయితము ఈ దేశముయొక్క పూర్వచరిత్రను స్మరించుకొనుచు దేశకవులను చక్రవర్తులను యోధులను దేవతలను వేదాంతులను గాయకులను శిల్పులను పూజించుకొనుచుందురు. ఇదియే నిజమైన దేశాభిమానము. ఒక తల్లి స్తన్యపానమును చేయు సహోదరులకంటెను ఒక భాషనే మాటలాడువారిలో నెక్కువ నైకమత్య ముండితీరు నని మోక్షమూలరుగారు చెప్పియున్నారు. ఉత్తరమండలములవారికిని, దత్తమండలములవారికిని, అఱవలతోకంటె నెక్కువ మైత్రి యుండితీరును. ఒకప్పుడు ఈ తెలుఁగుదేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యమునం దుండుటయే కాక, ఆయా రాజకుటుంబములు కాలవైపరీత్యమున అంతరించినపుడు వారి సంతతివారే ఈదేశములో అక్కడక్కడ చిన్నచిన్న స్వతంత్రరాజ్యములు స్థాపించుకొని రాజ్యమేలుచుండిరి. కాఁబట్టి స్వదేశరాజులచేత వేఱువేఱు భాగములు పాలింపఁబడుచున్నను ఆంధ్రదేశచరిత్ర ఒకటియే యని తలంపవచ్చును. ఈ చరిత్ర యంతయు పూర్ణముగ నింకను వ్రాయఁబడియుండలేదు. శాసనములు జీర్ణతాళపత్రములు మొదలగునవి బయిటకు తీసి దేశచరిత్రను మనము తెలిసికొన్నకొలఁదిని మన కుత్సాహ మినుమడించుచుండును. మన దేశములో ఘనకార్యములు జరగిన అనేకపవిత్రస్థలములు బయలుపడుచుండును.

vii. ఈ హిందూదేశములో ఇపు డున్న రాష్ట్రములను ఎక్కువచేసిన యెడల ఈ రాష్ట్రపరిపాలనమునకు అమితధనము వ్యయపఱుపవలసియుండును. దీని నంతయు మనబీదదేశ మెట్లు భరింపఁగలదు?

హార్డింజి ప్రభువుగారు బేహారుదేశమును ప్రత్యేకరాష్ట్రముగ నేర్పఱుపఁదలఁచుకొన్నపుడు మొట్టమొదట సుమారు అఱువదిలక్షలు కావలసియుండు నని చెప్పినారు. మన రాజధాని యైన చెన్నపట్టణములో నున్న కట్టడముల వెలలో సగపాలు మన యాంధ్రమండలములదై యున్నది. కనుక, అఱవరాష్ట్రమునుండి మనకు కొంత సొమ్ము రావలసియున్నది. మిగిలిన సొమ్మును దొరతనమువారు నూటికి 3½ చొప్పున వడ్డికి సులభముగ అప్పుతీయ వచ్చును. ఇప్పుడు చెన్నపట్టణములో ప్రతి సంవత్సరమును పరిపాలనార్థము వ్యయమగుచున్న మొత్తము సుమారు 70 లక్షలు. దీనిలో సగము మనము ప్రస్తుత మిచ్చుకొనుచునే యున్నాము. ఆంధ్రరాష్ట్రమును వేఱుగ నేర్పఱుచుటవలన మన మింతకును మఱి పదునేను లక్ష లెక్కువ కర్చుపెట్టుకొనవలసియుండును. మండలపరిపాలనమున కగు వ్యయము ఉన్నది యున్నట్లే యుండును. ఈ స్వల్పమైన యధికవ్యయమును మనకు ప్రత్యేకరాష్ట్రమువలన కలుగు లాభమునకై భరింపఁగూడదా? ఈ యధికవ్యయమునకైనను మనము క్రొత్తగ పన్నులను వేసికొననక్కఱలేదు. మన చెన్నరాజధాని తక్కిన రాజధానులకంటె తన యాదాయమును బట్టి ఇండియా గవర్నమెంటువారికి ప్రతిసంవత్సరమును ఒక కోటిరూపాయలు అధికముగనిచ్చుచున్నది. ఈసొమ్ములో కొంతభాగము మనకు ఇండియా గవర్నమెంటువారు ఇయ్యవలసియున్నారు.

నాకు గోచరించినంతవఱకును పైని చెప్పిన యాక్షేపణలే ముఖ్యములైనవి. నేను వీనికి సంగ్రహముగా చెప్పిన సమాధానములు గాక, బుద్ధిమంతులు మఱికొన్నిటిని ఆలోచించుకొనవచ్చును. ముందుముందు నేషనల్ కాంగ్రెసువారు కూడ హిందూదేశమున కిట్టి రాష్ట్రవిభజనమే మిక్కిలి యనుకూలముగ నుండు నని తీర్మానములు చేయుచుందు రని నమ్ముచున్నాను.

# సుఖము

### శ్రీమతి గుండు అచ్చమాంబికా ప్రణీతము

సుఖ మన ననేకవిధముల
నిఖిలజనానందకారి । ణి యగుచు ధర్మా
ద్యఖిలపురుషార్థ ములకున్
సఖమై వర్తిల్లుచుండు సతము ధరిత్రిన్.

క. తనప్రాణసములఁ బాయమి
ఘనత చెడమి మానహాని । గల్గమి ఋజబా
ధ ననుభవింపమి సర్వ
స్వనాశనం బగుట గనమి । సౌఖ్యము ప్రజకున్.

క. ధర్మపథము దప్పక స
త్కర్మంబుల నెఱిఁగి సలిపి । కడుఁ దుష్టిమెయిన్
బేర్మి వహించెడు నాతఁడు
నిర్మలసుఖ మనుభవింప । నేర్చి మనియెడున్.

క. అకలంక మయిన లక్ష్మికి
నొక కొఱఁతయు లేక తూఁగు । టుయ్యెలపైఁ బు
త్త్రకు నునిచి ముద్దుగొను పు
ణ్యకాంతయును బతియుసుఖము । నరయుదురు మదిన్

క. తన జీవితమున నొనరిం
చిన కృషి ఫలియించి కోర్కె । చేకుఱు నదియున్
జనవంద్య మయ్యె నేనిన్
మనుజుఁ డనంతసుఖము గని । మనియెడు పేర్మిన్.

క. పరతత్త్వ మెఱిఁగి సంక
ల్పరహితమయి బుద్ధి తనదు । పంపు నడుప న
ప్పరమోత్కృష్టపదవిఁ జెం
ది రాజిలెడునతఁడు గాంచు । దివ్యసుఖంబున్.

క. కష్టార్జితమున బ్రదుకుచు
నిష్టార్థము లర్థిజనుల । కిచ్చుచు మఱి సం
తుష్టిం జేసి మనుడు సుఖ
పుష్టి గలిగి చెలఁగు చుంద్రు । పూజ్యులు వసుధన్.

క. తలిదండ్రుల మన్ననయును
గలిమియు సత్సతియు విద్య । గడు నెయ్యమునన్
జెలిమి సలుపు స్నేహితులుం
గలిగిన సుఖ మనఁగ నొండు । గలదె నరునకున్?

క. నవరసగుంభితమై స
త్కవివిరచిత మయిన నాట । కమొ కావ్యంబో
యవలోకించు రసజ్ఞున
కవిరళ మగు సుఖము నిత్య । మై వర్ధిల్లున్.

క. మనుజులు విద్యాధనులై
తనుఁ గొల్వఁ గుటుంబభరము । తనయుఁడు తాల్పన్
గనుచుఁ బరతత్త్వచింతన
మొనర్చు సతి పతియుఁ గాంతు । రున్నతసుఖమున్.

క. కల విద్య లెల్ల శిష్యున
కలఘుక్రియఁ గఱపు నిపుణుఁ । డై సభ విద్వ
త్కలశార్ణవశశి యని స
భ్యులమెప్పుం గనిన సుఖముఁ । బొందు గురుఁ డెదన్.

క. మల్లెలతావిఁ బెరసి తగు
చల్లని లేగాలి వీవ సమవిద్యాశ్రీ
నుల్లసిలు సలీయుతముగ
నల్లన మృదుగీతి వినిన । యతఁడు సుఖించున్.

క. నిండిన విద్వత్సభ నొ
క్కండును బ్రతివచన మీయఁ । గానమి నధ్య
క్షుం డెఱిఁగి గారవించినఁ
బాండిత్యముకల్మి నతఁడు । వడయు సుఖంబున్.

క. తనకుఁ బరమాత్ముఁ డిడునది
కనకంపుంగని యటంచుఁ । గడుఁ దుష్టిమెయిన్
దినములు గడపెడు నరుఁ డ
త్యనుపమసుఖ మనుభవింప । నర్హుండు భువిన్.

క. అకలంక మగుచు నొక్కక
యొక విషయమునందు నిలిచి । యొం డెఱుఁగక పా
యక యానందముచే ని
ర్వికల్ప మగు మనసు మావె । వెలయు సుఖమునన్.

క. "అమ్మా! సుఖ మన నెయ్యది ?
యిమ్మహి నది గాంచి మనెడ । రెవ్వ?" రనిన, నా
కెమ్మెయిఁ దోచెనో దానిం
దమ్మున కెఱిఁగింప మదిని । దలఁచి నుడివితిన్.

# పాశ్చాత్య దేశములందలి నవీన సాంఘికోద్యమములు

ఎమ్. వేంకట రంగయ్యగారు, ఎమ్. ఏ.

అభివృద్ధికి అంతము లేదు గనుక పరిపూర్ణాభివృద్ధి గాంచిన సంఘము ప్రపంచమునం దింతవఱకును లేదు. నాగరకు లని ప్రసిద్ధిగాంచి రాజకీయాదివిషయములలో మన కెల్లరకును మార్గదర్శకులై యున్న ఆంగ్లేయులు మొదలగు పాశ్చాత్యుల సంఘములందు కూడ ఇప్పటికిని ఎన్నియో లోపము లగపడుచున్నవి. ఐనప్పటికిని ఈ సందర్భమున మనకును పాశ్చాత్యులకును గల భేద మొకటి మనము గుర్తింపవలయును. మనలో అనేకులు సంఘమునందు సవరింపఁదగిన లోపము లనేకము లున్న వని కూడ అంగీకరింపరు. అంగీకరించువారు కూడ వానిని నివారించుటకు తగిన శ్రద్ధతోను ఆసక్తితోను విశాలహృదయముతోను పనిచేయుట లేదు. భగవదవతారముచేతఁ గాక మనుష్యమాత్రుల మగు మనచేత సంఘము సంస్కరింపఁబడఁగలుగునా యని అనేకు లభిప్రాయపడుచున్నారు. ఈ కారణమువలననే నలువదియేఁబది సంవత్సరములనుండి సంఘసంస్కరణోద్యమము మన దేశమందు ప్రబలియుండినను దానివలన కలిగిన ఫలము మాత్రము మిక్కిలి స్వల్పమై యున్నది. పాశ్చాత్యు లిట్టివారు కారు; తమ సంఘపు స్థితిగతులలోని లోపములను వాని హేతువులను ఎప్పుడును పరిశోధించుచుందురు; వానిని బహిరంగపఱిచి, వాని నివారణమునకై యెన్నియో నూతనసాధనములను కనిపెట్టుచుందురు. వారు విసుగు చెందువారు కారు; ఇంత మాత్రము సుఖసంపద లున్నవి గదా యని తృప్తిచెందువారు కారు. దీనివలననే వారిస్థితి క్రమక్రమముగ అభివృద్ధి గాంచుచున్నది. తమ బాగుకై రాత్రింబగళ్లు కష్టపడుచుండువారి కెన్నటికిని ఫలము కలుగకపోదు. నూరు సంవత్సరములకు పూర్వము పాశ్చాత్యులలోని సామాన్యజను లనుభవించుచున్న స్థితికిని వారి ప్రస్తుతస్థితికిని గల భేదమే దీనికి నిదర్శనము.

"మనుష్యుఁ డీప్రపంచమున జన్మ మెత్తినది సుఖము లనుభవించుటకుఁ గాని దుఃఖములపాల్పడుటకుఁ గాదు. ఐనను, ఈ సౌఖ్యము ప్రజలలో అందఱికిని సమానముగ లభించుట లేదు. కొందఱు ధనవంతులై ఆరోగ్యవంతులై శరీరమనోదార్ఢ్యములు కలిగియుండ, మఱికొందఱు దరిద్రులుగను రోగపీడితులుగను జ్ఞానహీనులుగను ఉన్నారు. ధనమును బట్టియె ఇట్టి వ్యత్యాసము కలుగుచున్నది. ధనవంతు లందఱును సుఖజీవులు కారు గాని దరిద్రులలో మూఁడువంతులు కష్టజీవులై యుండకతప్పదు. తినుట కన్నమును ధరించుకొనుటకు వస్త్రములును కాఁపురముండుటకు విశాలమైన గృహములును లేక, సంఘమునం దనేకులు కృశించిన దేహము గలిగి, రోగపీడితులై యుండుటకు దారిద్ర్యమే ప్రధానకారణమై యున్నది. క్షామములు మొదలైన యుపద్రవములు సంభవించునపుడు లక్షలకొలఁది జనులు మృత్యువువాతఁ బడుట కిదియే కారణమై యున్నది. ఈ హేతువుచేతనే అనేకులు విద్యాగంధము లేక యుండుట; దీనివలననే అనేకులు సంసారసుఖ మిట్టి దని యెఱుఁగకుండుట. అనేకులు దుర్వినీతులై జారత్వచోరత్వములనె జీవనోపాయములుగ అవలంబించుటకు కూడ ఇదియే కారణము. ధనవంతులలో సైతము వ్యాధిగ్రస్తులును దురాచారపరాయణులును ఎందఱో యున్నారు. ఐనప్పటికిని, దారిద్ర్యము ప్రబలియుండు ప్రతిసంఘమందును ఇట్టివా రెక్కువమంది యుండుట కవకాశ మున్నది. అనేకు లీ స్థితియం దుండిన సంఘమునకును దేశమునకును ఎన్నియో కష్టములును నష్టములును కలుగు ననుటకు సందేహము లేదు. యుద్ధములు మొదలగు దేశోపద్రవములు సంభవించినపుడు వాని నెదుర్కొనుటకు తగిన సమర్థత సంఘమునం దుండకపోవును. ఇట్టి విపత్తులకు లోనై, తుదకు సంఘము లయమును చెందుట నిస్సంశయము. దారిద్ర్యము సామాన్యమైన లోపము కాదు. కనుక సంస్కర్తలు దీనిని సంఘమునుండి తొలఁగించుటకై తగిన ప్రయత్నములను చేయవలయును."

అఱువది డెబ్బది సంవత్సరములనుండి పాశ్చాత్యసంఘములందు జరగుచున్న సంస్కరణముయొక్క ప్రధానోద్దేశ మిదియే. ఇట్టి యుద్దేశముతో అచ్చటి సంస్కర్తలు గావించిన మహోపకారములలో కొన్ని మాత్ర మిచ్చట వ్రాయఁ బ్రయత్నించుచున్నాను.

II

కడచిన శతాబ్దమం దంతయు ఇట్టి సంస్కరణ మాదేశములం దత్యంతావశ్యకమై యుండెను. ఈ

శతాబ్ద ప్రారంభమున అచ్చటి సామాన్యజను లనుభవించుచుండిన కష్టములు కష్టములు కావు. అవి వర్ణనాతీతము లని చెప్పుటయం దతిశయోక్తి కొంచెము కూడ లేదు. దీనికి కారణము వ్యవసాయిక పరిశ్రామిక వాణిజ్య వృత్తులయందుఁ గలిగిన గొప్ప మార్పే. తత్పూర్వ మెంత కష్టమైన పనియైనను మనుష్యులు స్వయముగ తామే చేసికొనుచుండిరి. ఇప్పుడు అట్లుగాక దున్నుటకు, విత్తనములు వేయుటకు, కలుపు దీయుటకు, వరి కోయుటకు, కుప్పలు నూర్చుటకు, నూలు వడుకుటకు, బట్టలు నేయుటకు, పాత్రసామగ్రులను చేయుటకు—అవి యివి యన నేల— మనకు కావలసిన పను లెన్ని యున్నవో వాని నన్నిటిని చేయుటకు యంత్రములను కనిపెట్టిరి. ఈ విప్లవమువలన దేశములోని మూఁడువంతుల జనులు ధనికు లగు మిగిలిన జనులకు భృత్యులైపోయిరి. ఈ యంత్రములను కొని పనిచేయలేక భూస్వాము లనేకులు తమ భూములను అమ్ముకొనుటచేతను; చేతిమగ్గములతో పనిచేయుచున్న నేఁతగాండ్రు అనేకులు యంత్రములను కొనలేకపోవుటచేతను, ఇట్లే ఇతరులు కూడ అనేకులు యంత్రములకై కావలసిన ధనవ్యయమును చేయలేకపోవుటచేతను, వా రందఱును స్వేచ్ఛావ్యాపారములను వదలుకొని కూలిపని చేసి ధనికు లిచ్చిన కూలితో జీవయాత్రను జరపవలసినట్టి స్థితికి వచ్చిరి. ధనికు లన్ననో ఈ యంత్రములను కొని, వీనితో పని చేయుటకై ఫ్యాక్టరీ లను బహువిశాలమైన శాలలఁ గట్టి వేనవేలు కూలివాండ్రచే వానియందు పని చేయించి, ఇంతంత యనరాని లాభమును గడించుచుండిరి; వ్యయ మెంత తగ్గిన తమ కంత హెచ్చుగ లాభము రాఁగల దనెడి యూహతో తమ కూలివాండ్రను నానావిధములయిన కష్టములకును లోఁబఱుచుచుండిరి. వీరు పనిచేయు శాలలు గొప్పవైనను, పరిశుభ్రమైన గాలి వచ్చుటకును పోవుటకును, వేలకొలఁది జను లేకకాలమున ఆరోగ్యవంతులుగ నుండుటకును, తగిన కిటికీలు మొదలగు సదుపాయములను కలిగియుండునవి కావు. యంత్రశాలాధికారి విలువగల యంత్రములమీఁద చూపుచుండిన శ్రద్ధ తన లాభముకొఱకై పాటుపడుచుండిన ఈ కూలివాండ్రపై చూపునట్టివాఁడు కాఁడు. జనసమ్మర్దముచేతను, పరిశుభ్రమైన గాలి లేకపోవుటచేతను, అక్కడ పని చేయువా రెల్లపుడును కృశించి వ్యాధిగ్రస్తులై యుండువారు. వారి స్థితి శానిసలు పెంపుడు మృగములు మొదలగువాని స్థితికన్న హీనమై యుండెను. ఉదయ మాఱు గంటలనుండి రాత్రి ఏఁ డెనిమిది గంటలవఱకును ఒక్కరీతిని కారాగృహములవంటి ఈ శాలలయందు వారు పనిచేయవలసినవారై యుండిరి. మఱింత లాభమును సంపాదింపఁగోరి మఱింత తక్కువ కూలి నియ్యవచ్చు ననెడి యూహతో ధనికు లీ శాలలయందు స్త్రీలను బాలురను విశేషముగ నుపయోగించుచున్నారు. ఐదు సంవత్సరముల వయసు రాఁగానే బడికి పోవుటకు మాఱు ప్రతిబాలుఁడును 13, 14 గంటలు పని చేయుటకై ఈ ఫ్యాక్టరీలకు వచ్చువాఁడు. విద్య యన నేమియో యెఱుఁగనే యెఱుఁగఁడు సరే కదా, ఆట లాడుటకుఁ గాని అన్నము తినుటకుఁ గాని పగలు విశ్రాంతి పొందుటకుఁ గాని వ్యవధి లేక శరీరపటుత్వము చెడి మృగప్రాయుఁడై త్రాగుఁబోతై కాలము గడపును. దేశములోని బాలు రెల్లరును ఈవిధముగ పెంపఁబడుచుండ, వీరు పెద్దవారై గృహస్థు లైనప్పుడు బుద్ధివికాసముతో దేశక్షేమముకొఱకు పాటుపడుటెట్లు సంభవించును? ఇఁక స్త్రీలు పడుచుండిన దురవస్థ దీనిని మించియుండెను. వీరు వెళ్లి కూలిపని చేసినఁ గాని సంసారమును పోషించుటకు వేఱు మార్గము లేకయుండెను. గృహమును నిర్వహించుచు, పసిబిడ్డల కాహారాదుల నిచ్చుచు సంసారమును చక్కఁబెట్టుకొనవలసిన యాఁడువాండ్రు దిన మంతయు ఇట్టి కష్టములకు లోఁబడవలసియుండిరి. కొన్ని సమయములయం దీ యంత్రములు ఆకస్మికముగ పగులుటవలనను, పైనుండి క్రిందఁ బడుటవలనను, బాలుర యజాగ్రత్తవలనను అనేకులు తమ ప్రాణమును కూడ పోఁగొట్టుకొనవలసియుండిరి. సుఖ మన నేమియో యెఱుఁగక నరకబాధల నన్నిటిని ఈ లోకమునందే వారు పడుచుండిరి.

ఇట్టి బాధలకు లోనైనవా రొక రిద్దఱు కారు. దేశములోని ప్రజలలో మూఁడుభాగము లిట్టివారే. ఇన్ని బాధల కోర్చి పనిచేసినను, వీరికి లభించుచుండిన కూలి ఎక్కువగ నుండెనా యన్న, స్త్రీపురుషులును ఇంటిలోని బాలురును, అందఱును తెచ్చుకూలి దినమున కొకపూఁట యాహారమునకు కూడ చాలునట్టిది కాదు. ఇంటియం దెందఱు బిడ్డ లుండిన అంత యధికముగా తమకు లాభము కలుగు ననెడి యాశతో సంసారమును నిర్వహించుకొనుటకైనను సమర్థత లేని స్త్రీపురుషులు కూడ తమ బాల్యముననే వివాహమాడువారు. దేశమునందు ద్రవ్యములేని కూలివాండ్ర కెక్కువకూలి దొరకుట లేదేమో యన, ఎప్పటికంటెను ఈశతాబ్దమునం దింగ్లండు మొదలగు దేశములలో నుత్పత్తియగుచున్న ధనము పదిపండ్రెండురెట్లధికముగ నుండెను. యంత్ర సహాయమువలనను ఇతరమైన మార్పులవలనను పుట్టెడు ధాన్యము పండు భూమి రెండు పుట్లు పండుచుండెను. రో జంతయు పనిచేసినను మగ్గముమీఁద పది గజముల బట్టను నేయలేనివారు యంత్రముల సాహాయ్యమున దినమునకు నూఱు గజములు నేయఁగలిగియుండిరి. భూగర్భమం దుండిన రాతిసిబొగ్గును ఇనుమును ఎట్లుపయోగపఱుచుటకును తెలియకుండినవారు వీనిని యంత్రములకై యుపయోగించి లక్షలకొలంది పౌనులు సంపాదింపఁగలిగియుండిరి. భిక్షాధికారు లనేకులు కోటీశ్వరులైరి. పొగయోడలు, పొగబండ్లు మొదలగువాని సాహాయ్యముచే ప్రపంచములోని సమస్తదేశములందును తమ పదార్థములను విక్రయించి వర్తకులు లాభము పొందుచుండిరి. జనశూన్యము లైన గ్రామములు యంత్రశాలలతోను కూలివాండ్రతోను నిండి గొప్ప పట్టణము లగుచుండెను. ఇట్టి మహదైశ్వర్యముతో దేశము తులతూఁగుచుండినను కూలిపని చేసి బ్రతుకు ప్రజలకు దీని నుండి యెట్టి సౌఖ్యమును కలుగదాయెను. ఈ ధనమంతయు ఎవరో కొంద అదృష్టవంతులపా లగుచుండెనే కాని కూలివాండ్రగు జనసామాన్యముయొక్క జీవితము మిక్కిలి సంతాపకరమై యుండెను.

అంధకారమగ్నులై, యర్థాయువులై, దుఃఖపీడితులై యున్న జనసామాన్యము నుద్ధరించుట యెట్లు? దేశములోని ధనము ప్రజ లందఱిచేతను ననుభవింపఁబడవలసినదా, లేక కొందఱి యభివృద్ధికొఱకే యుపయోగపడవలసినదా? ఈ విధముగ దయాళువులైన సంస్కర్త లెల్లరు నాలోచింపమొదలుపెట్టిరి. కూలివాండ్ర స్థితిని బాగుపఱుచుటకై దొరతనమువారే వివిధమైన ప్రయత్నములను చేయుట కిష్టపడలేదు. తక్కువ కూలి తీసికొని కారాగృహములవంటి యంత్రశాలలందు పనిచేయుటకు కూలీలే యంగీకరించుచుండ, తమంత తామేల చట్టములను నిర్మించి ధనికు లెక్కువ కూలి యియ్యవలసినట్లు నిర్బంధపఱుపవలయు నని దొరతనమువా రభిప్రాయపడియుండిరి. సంస్కర్త లిది యన్యాయమనియు, కూలివాండ్రకు వేఱుగతి గాని సాహాయ్యము గాని లేనికారణమున ధనికు లెంత కూలి యిచ్చిన, అంత కూలికే వారు పనిచేయవలసియున్నా రనియు, దొరతనమువా రిట్టి సమయమున ఊరకున్న యెడల దేశమునకే హాని కలుగు ననియు, కూలివాండ్ర రక్షణము నిమిత్తము శాసనమును చేయుట దొరతనమువారికి విధాయక మనియు దేశమం దంతటను ఉపన్యసింపసాగిరి. ఇంగ్లాండు ప్రజాప్రతినిధులే రాజకార్యనిర్వాహకులు గనుక, వారు క్రమక్రమముగ సంస్కర్తల యుపన్యాసములలోని ధర్మమును తెలిసికొని ధనికు లగు యంత్రశాలాధికారు లడ్డగించుచుండినను దానిని గమనింపక 1830 మొద లిప్పటివఱకు నెన్నియో శాసనములను గావించిరి. వీనిని గుఱించి విపులముగ చర్చించుట కిది సమయము కాదు. ఈ శాసనములవలన 13 సంవత్సరములకు లోఁబడినవా రెవరును యంత్రశాలలలో పనిచేయఁగూడ దనియు, పనివాం డ్రందఱును దినమునకు 10 గంటలకంటె అధికముగాఁగాని, ఉదయము 6 గంటలకు ముందుఁగాఁగాని సాయంత్రము 6 గంటలకు తర్వాతఁగాని పనిచేయఁగూడ దనియు, ఆరోగ్యశాస్త్ర ప్రకారమును వైద్యుల యాలోచన ననుసరించియు యంత్రశాలలు కట్టవలె ననియు, గనులలో స్త్రీలు పని

చేయఁగూడ దనియు, విధింపఁబడెను. ధనికుల స్వాధీనమున ఫ్యాక్టరీలలో పనిచేయవలసియున్నను, కూలివాండ్రు తగిన విశ్రాంతి కలిగి రోగపీడితులు గాక సుఖముగ కాలము గడపఁగలిగియున్నారు. 13 సంవత్సరముల వయసు రాక పూర్వ మెవ్వఁడును ఫ్యాక్టరీలలో పనిచేయఁగూడ దనియు, ప్రతిమనుష్యుఁడును తన కుమారుని కా వయస్సు వచ్చునంతవఱకును నిర్బంధముగ వానిని బడికి పంపవలసిన దనియు, అట్లు పంపనిపక్షమున శిక్షార్హుఁ డగు ననియు, శాసనము లుండుటవలన, విద్య రానివాఁడు ఇంగ్లండు మొదలగు దేశములయం దొక్కఁడును లేఁడు. కూలియొక్క హెచ్చు తక్కువల విషయమై దొరతనమువా రేలాటి జోక్యమును కలుగఁజేసికొనలేదు గాని పనివాండ్రే స్వయంసహాయమువలన తమ కూలిని వృద్ధిపఱుచుకొనఁగలిగిరి. కూలివాండ్రందఱు నొక్కటిగ చేరి సంఘములను స్థాపించుకొని తమ కింత కూలి యిచ్చినఁ గాని తాము పనిచేయుట కంగీకరింపఁగూడ దని ఏకీభావము గలిగి ప్రవర్తించుచున్నారు. ఇట్టి సంఘము లుండఁగూడ దని పూర్వము శాసనము లుండుటవలన పనివాండ్రు ధనికులను కూలివిషయమున సంఘీభావముతో నిర్బంధింప లేకయుండిరి. ఈశాసనమును దొరతనమువా రిప్పుడు తీసివేసిరి. కనుక స్వతంత్రులై కూలివాండ్రు ఎక్కువ జీతములను పొందఁగలిగియున్నారు. ఈ విషయమున సంస్కర్తల యుద్యమ మింతటితో ముగియలేదు. దినమున కెనిమిది గంటలకన్న నెక్కువకాలము పనిచేయఁగూడ దనియు, ప్రతి కూలివాఁడును స్వవిద్యాభివృద్ధికి కావలసిన విశ్రాంతిని పొందవలయు ననియు, వారు వాదించుచున్నారు. యంత్రశాలలలో పనిచేసి ఇంటికి వచ్చినతర్వాత వార్తాపత్రికలను చదువుటయందును గొప్పవారి యుపన్యాసములను వినుటయందును, ఇప్పటి కూలివాండ్రు కాలము గడపెదరు. వారి జ్ఞానాభివృద్ధికొఱకై దేశమం దంతటను పాఠశాల లెన్నియో స్థాపింపఁబడినవి. విద్యాధికు లనేకులు రాత్రు లీ పాఠశాలలలో పనిచేసి కూలివాండ్రను బుద్ధిమంతులుగ చేయఁగలిగియున్నారు. ఇగ్లాండు దేశము సామాన్యమైనది కాదు. ప్రపంచమునం దైదవభాగమును పరిపాలించునట్టిది. ఆ దేశస్థుల బుద్ధికుశలతను బట్టియే హిందూదేశము మొదలగు రాష్ట్రములలోని సుఖము నిర్ణయింపఁబడుచున్నది. నలువదికోట్ల జనులను పరిపాలించు ఆంగ్లేయులు, ఈ సాంఘికోద్యమములవలన శరీరమనోబలములు గలిగి విద్యావంతులై యుండుట చేతనే, ఈ రాజ్యభారమును ఇంత సులభముగ నిర్వహింపఁగలిగి యున్నారు. వారి నిట్టి యున్నతస్థితికి తీసికొని వచ్చినది ఈ నవీనసంఘసంస్కర్తలే.

III

ధనమును తిని గాని ధనమును కట్టుకొని గాని మనము జీవింపము. ఆహారాదిపదార్థములను మన కిచ్చుటకు శక్తిగలిగియుండుటచేతనే ధనము మన కుపయోగకారియై యున్నది. పుష్టికరమగు ఆహారమును, విశాలమైనట్టియు రమ్యమైనట్టియు గృహమును, శీతోష్ణముల నుండి కాపాడునట్టి వస్త్రములను, ఇవిగాక మనసునకు వికాసము కలుగఁజేయునట్టి పదార్థములను, సంపాదించుటయందు మనము వినియోగించు ధనమే ధనము. మిగిలినది ఉన్నను ఒకటే, లేకపోయినను ఒకటే. ఎక్కువ జీతములు లభించినంతనే సంతోషపడుట కవకాశము లేదు. వీనివలన మన కుపయోగకరమగు పదార్థములను సంపాదించుటకు వీ లున్నదా లేదా యనియే మనము ముఖ్యముగ విచారింపవలయును. జీతముల నీయక మన కుపయోగపడు వస్తువుల నన్నిటిని మన కెవరైన ఇచ్చుచుండిన మన కేలాటి లోపమును కలుగఁజాలదు. 19 వ శతాబ్దమం దింగ్లండులోని కూలివాండ్రు తమ కూలిధనమును వినియోగపఱచుకొను విషయమున కూడ ఎన్నియో కష్టములకు పాల్పడిరి. వీని నివారించుటయే సాంఘికోద్యమముల రెండవ యుద్దేశమై యుండెను.

నేత మొదలగు పరిశ్రమలందుఁ గలిగిన మార్పెట్టిదో ఇదివఱకె తెలిసికొంటిమి. దీనివలన కలిగిన ఫలములలో నొకటి దేశమం దంతటను క్రొత్తపట్టణములు ప్రబలుటయే. తత్పూర్వము ప్రజలలో చాలమంది పల్లెలయందే కాఁపురము చేయువారు. వర్తకులవంటివారు మాత్రమే అక్కడక్కడ కొన్ని పట్టణములయందు నివా

సము చేయుచుండిరి. ఇప్పు డట్లుండుటకు వీలు లేకపోయెను. కూలిచేసికొని బ్రతుకవలసిన మూఁడువంతుల ప్రజలును ఫ్యాక్టరీ లున్నచోటికి రావలసి యుండిరి. ప్రతి ఫ్యాక్టరీ చుట్టును అనేకగ్రామములనుండి వచ్చిన వేలకొలఁది జనులు నివాసము లేర్పఱచుకొనిరి. వీరికి కావలసిన వస్తుసముదాయమును అమ్ముటకును, వీరిచే ఫ్యాక్టరీలయం దుత్పత్తిగావింపఁబడిన పదార్థములను కొని ఇతరదేశములకు పంపుటకును ఎందఱో వర్తకులు గూడ అచ్చటనే కాఁపురముచేయ మొదలుపెట్టిరి. ఈ విధమున గ్రామము లన్నియు జనశూన్యములు కాఁగా, క్రొత్తపట్టణములు జనభూయిష్ఠములై పెరుఁగఁజొచ్చినవి. వీనియందు వాసముచేయుట మిక్కిలి బాధకరమై యుండెను. ప్రారంభమున వీథు లేవిధముగ నుండవలసినదియు, గృహముల నేవిధముగ కట్టవలసినదియు, తోఁటలును విహారవనములు నెక్కడెక్కడ నుండవలసినదియు ఎవ్వరైన నేర్పాటుచేసియున్నయెడల, ఇన్ని కష్టములు లేకయుండును. ఎట్టి యాలోచనయు లేక తోఁచినట్లిల్ల ఇండ్లను కట్టి, తోఁచినట్లిల్ల బాటలు వేసి, యేపద్ధతి నవలంబింపని కారణమున జనసమ్మర్దము గల పట్టణములు వివిధరోగములచేతను నిండిపోయినవి. కూలి తెచ్చుకొన్న వానికి విశాలమైన యిండ్లు గాని, ఆరోగ్యకరమైన జలము గాని, పరిశుభ్రమైన గాలి గాని, సాయంసమయములందును సెలవుదినములయందును విహరించుటకు తగిన బయళ్ళు గాని దొరకుట దుర్లభమాయెను. పట్టణములోని ధనికు లేదో యొకవిధమున తమ ప్రాణమును ధనమును స్వసేవకుల మూలమున రక్షించుకొనఁగలిగి యుండిరి గాని కొంచెముగ కూలి తెచ్చుకొనువారు చోరులచే బాధింపఁబడుచుండిరి. పట్టణములయందు తగిన పోలీసు ఏర్పాట్లేవియు లేకయుండెను. మంచి రోడ్లు గాని రోడ్లపై నడచునపుడు సాహాయ్యకరమగు దీపములు గాని యేవియు లేకయుండెను. బజారులం దమ్ముచుండిన పదార్థములు పూర్వముకంటె చౌకగ నుండినను, అవి శరీరమున కంత ఆరోగ్యకరముగా నుండెడివి కావు. శుభ్రమైన పాలు గాని రొట్టెలు గాని మాంసము గాని దొరకుటయే యరుదాయెను. కూలి యెంత దొరకిన నేమి? తమకు కావలసినట్టియు తమ ఆరోగ్యమునకు భంగకరములు కానట్టియు వస్తువులును సదుపాయములును దొరకనపుడు, ధన మంతయు వ్యర్థము గాక ప్రయోజనకారి యెట్లగును?

పురజనుల సమ్మతి ననుసరించి పట్టణమును పరిపాలించు మునిసిపల్ సంఘములు ప్రతిపట్టణమందును లేకపోవుటయే ఈ లోపములకు కారణ మని సంస్కర్తలు వాదించిరి. వీథులు, ఇండ్లు, పరిశుభ్రమైన జలము మొదలగువానిని చక్కగ నేర్పాటుచేయుట ఒకరిద్దఱు మనుష్యులచేత అగునట్టి పని కాదు. ప్రజ లందఱు నేకీభవించి, దీనికై వెచ్చింపవలసిన ద్రవ్యము నిచ్చుట కంగీకరించినఁ గాని పట్టణము బాగుపడుటకు వీలులేదు. ఇదివఱకె కొన్ని పట్టణములందు మునిసిపల్ సంఘము లుండినవి. కాని వానియందు ధనికులు మాత్రమే మెంబర్లుగా నుండినందునను, ధనికు లేదో యొక విధమున తమకు కావలసినట్లు తమ వీథులను ఇండ్లను చక్కఁబెట్టుకొనఁగలిగియుండినందునను, సామాన్యజనుల విషయమై వారే విధమైన శ్రద్ధను వహింపరైరి. పురజను లందఱును ఎవరి నెన్నుకొనుచున్నారో వారే మునిసిపల్ సంఘములయందు మెంబర్లుగ నుండవలసినదనియు, పట్టణమున కుపయోగకరమైన పనుల నన్నిటిని చేయుటకును, దీనికై వ్యయమగు సొమ్మును పన్నులమూలకముగ పౌరులయొద్దనుండి వసూలుచేయుటకును, వీరికి స్వాతంత్ర్య ముండవలసినదనియు సంస్కర్తలు వాదింపఁ బ్రారంభించిరి. క్రమముగ వీరి వాదములతో దొరతనమువారు కూడ నేకీభవించి వీని కనువగు శాసనముల నేర్పాటుచేసిరి. అది మొదలు ప్రతిపట్టణమందును మునిసిపల్ సభలు స్థాపింపఁబడినవి. ధనవంతులు దరిద్రులు నను వివక్ష లేక పురజను లందఱును ఈసభలోని మెంబర్ల నేర్పాటుచేయుట కధికారమును పొందిరి. ఇట్టి సభలు, పట్టణవాసులు స్వయముగ తాము చేసికొనలేని పనులను చేయుచు, ప్రతిపట్టణమును భూలోకవైకుంఠముగ మార్పఁగలిగియున్నవి. బాటలు వేయుట; దీపములు పె

ట్టుట; బాటలను శుభ్రపఱచుట; అగ్ని ప్రవాహములనుండియు, చోరబాధలనుండియు ప్రజలను రక్షించుట; శుభ్రమైన నీటిని పాలను తక్కిన యాహారపదార్థములను గృహములను వంటచెఱకును ప్రజలకు లభించునట్లు చేయుట; పురవనములందు పండ్లు కాయగూరలు మొదలగువాని నుత్పత్తిచేసి ప్రజల కమ్ముట; తల్లిదండ్రులు లేని బిడ్డలను, వ్యాధిగ్రస్తులయినట్టియు, వికలాంగులయినట్టియు మనుష్యులను మిక్కిలి శ్రద్ధతో రక్షించుట; ప్రసవసమయమందు ప్రత్యేకముగ స్త్రీల యుపయోగముకొఱకును, శిశువులకును బాలురకును ప్రత్యేకముగను, ఆసుపత్రులు కట్టుట; బాలురకు పాఠశాలలు కట్టుట; పురవాసుల విద్యాభివృద్ధికై పుస్తకశాలలు చిత్రవస్తుప్రదర్శనశాలలు మొదలగువానిని నిర్మించుట — మొదలగు ఘనకార్యముల నన్నిటినో ఈ మునిసిపల్ సంఘమువారు చేయుచున్నారు. సంఘీభావము లేక, ఎవరంతటవారు తమ ధనము నెంత వ్యయపెట్టినను ఇన్ని లాభములు పొందుట సాధ్యమగునా? పురవాసులందఱు నొక్కటిగ చేరి సంవత్సరమున కింత యని పన్నుల నిచ్చుచు పట్టణపారిశుద్ధ్యమునం దెంతయో శ్రద్ధవహించుచుండుటవలన కష్ట మన నేమియో యెఱుఁగక సుఖజీవనము చేయఁగలిగియున్నారు. దీనినిబట్టి మన దేశమందలి మునిసిపల్ సంఘము లెంత వెనుకఁబడియున్నవో, అభివృద్ధి కెంత యవకాశ మున్నదో, మనకు స్పష్టమగుచున్నది. తన కిష్టమున్నను లేకపోయినను మునిసిపల్ సంఘము మంచి దని నిర్ణయించిన గృహమునందే ప్రతిపౌరుఁడును నివసింపవలసియున్నది; ఈ విధముగ నిర్ణయింపఁబడిన పాఠశాలలయందే తన బాలురకు చదువు నేర్పింపవలయును. నిర్బంధపఱచియైనను ప్రతిపౌరుని ఆరోగ్యవంతునిఁగను దీర్ఘాయువు గలవానినిగను విద్యావంతునిఁగను చేయుట తమ విధి యని పట్టణపాలనాధికారులు దృఢాభిప్రాయము గలిగియున్నారు. ఇన్ని సదుపాయములు గలిగియుండు పాశ్చాత్త్యు లనేకవిషయములలో మనకంటె నెక్కువ సామర్థ్యము గలిగియున్నా రనిన, ఆశ్చర్యమేమి యున్నది?

## IV

స్వకాయకష్టముచే సంసారపోషణము చేసికొనక పరుల సాహాయ్యము నెల్లప్పుడు నపేక్షించునట్టి నిఱుపేద లెందఱో ప్రతిసంఘమునం దున్నారు. కొన్ని దేశములందు భిక్షాటనమే వీరికి ప్రధానజీవనోపాయముగ నున్నది. పాశ్చాత్యదేశములందు మాత్ర మట్లు లేదు. భిక్షాటనమువలన సంఘమున కెల్ల హాని కలుగునే గాని దరిద్రులకు తగిన సహాయము దొరకఁజాల దనియే పాశ్చాత్త్యుల యభిప్రాయము. ఏలన, నిఱుపేదలలో పనిచేయుటకు శక్తిగలిగియుండియు కష్టపడుట కిష్టపడనివా రెందఱో యున్నారు. స్వగృహమునుండి కదలలేని వికలాంగులు కూడ అనేకు లున్నారు. భిక్షాటనము చేయువారలలో మొదటితరగతికి చేరిన శరీరపుష్టి గలవారే విశేషముగ నున్నారు. నిజముగ సహాయము కావలసిన గ్రుడ్డితనము కుంటితనము పిచ్చితనము మొదలగు లోపములు గల మనుష్యుల సంఖ్య మిక్కిలి స్వల్పము. పాత్ర మెఱిఁగి ధర్మము చేయుటయే నిజమైన ధర్మ మని అందఱు నంగీకరించినను, భిక్షమెత్తుకొనువాఁ డొకఁడు ఇంటికి రాఁగానే వీఁడు భిక్షార్హుఁడా కాఁడా యని ఆలోచించు గృహస్థు లెవరును లేరు. ఈకారణమున భిక్షాటన ముండు దేశములలో సద్వినియోగ ముండుట దుస్సాధ్యము. కనుక భిక్షాటనమే దేశమం దుండఁగూడ దని పాశ్చాత్త్యసంస్కర్తల యభిప్రాయము. ఇది కూడ దని శాసించినయెడల నిఱుపేదలను రక్షించునిమిత్తమితరమైన యేర్పాటులను గావింపవలయునుగదా? అందుకై తగిన శ్రద్ధతో దొరతనమువారును ప్రజలును ఎన్నియో సదుపాయముల నేర్పఱచియున్నారు. ఏటేటను నిఱుపేదల సాహాయ్యము నిమిత్తమింగ్లాండునం దిప్పుడు వెచ్చించు ధనము పూర్వముకంటె ఎన్నియో రెట్లధికమై యున్నది.

దరిద్రులబిడ్డలకు జీతములు తీసికొనకయే చదువు చెప్పుటకును, విద్యార్థిదశయందు వారికి కావలసిన పుస్తకములను శాస్త్రపఠనమునం దుపయోగింపవలసిన ఉపకరణములను ఉచితముగ నిచ్చుటకును, మూఁడుపూఁ

టలును ఆరోగ్యకరమైనట్టియు పుష్టికరమైనట్టియు భోజన
మును పెట్టుటకును, వ్యాధు లేమియు రాకుండుటకై
అప్పుడప్పుడు వారిని వైద్యులు పరీక్షించుటకును, విలా
సార్థమై వారిని పలుమాఱు గ్రామాంతరములకును విచి
త్రప్రదేశములకును తీసికొనిపోవుటకును, కావలసిన
యేర్పాటుల నెన్నిటినో యిటీవల చేసిరి. వైద్యులకు
ధనము నిచ్చి తమ రోగములను కుదుర్చుకొనలేని దరి
ద్రుల యుపయోగముకొఱకు 800 ఆసుపత్రు లింగ్లండు
దేశమం దిప్పుడు క్రొత్తగ కట్టఁబడియున్నవి. వీనియం
దెట్టిభేదమును పాటింపక వచ్చినవారి కందఱికి నుచిత
ముగ మందు లిచ్చుట మాత్రమే గాక, వ్యాధిగ్రస్తులై
యున్నంతకాలమును వారిని పోషించుటకు కూడ వైద్య
శాలాధికారులు తగిన యేర్పాటులను చేసియున్నారు.
కొన్ని పట్టణములలో తద్విషయమై నియమింపఁబడిన
వైద్యులు బీదవారు వసించు ప్రతిగృహమునకును వెళ్లి
వారి శరీరమును పరీక్షించి వారికి కావలసిన సలహాల
నిచ్చుచున్నారు. ఇది గాక ప్రసవమైన స్త్రీ పేదవారి
యింట నున్న దని తెలిసినతోడనే ఆమె యారోగ్యము
ను కాపాడుటకు మందులను, శిశువును పోషించుటకు
పరిశుభ్రమైన పాలను తీసికొని వెళ్లి, కొన్నిదినముల
వఱకును బంధుమిత్రాదులకన్న నెక్కువ శ్రద్ధతో వారి
నాదరించుట కేర్పాటు లెన్నియో యున్నవి. ఇటీవల
బీదవారి యుపయోగముకొఱకై ఇంగ్లాండు దొరతనము
వారు మఱికొన్ని శాసనములను చేసియున్నారు. 70
సంవత్సరములకంటె అధికవయస్సు గల ప్రతి బీదముసలి
వానికిని వారమున కింత సొమ్మని అతని మరణకాల
పర్యంతము నిచ్చుటకు దొరతనమువా రంగీకరించి, 1909
సం. నుండి 7 లక్షలమంది ముసలివాండ్ర నీలాగు పో
షించుచున్నారు. ఇట్టి ధర్మకార్యములకై సంవత్సర
మొకటింటి కింగ్లాండునందు మాత్రమే 105 కోట్ల రూపా
యలను కర్చుపెట్టుచున్నారు.

అసహాయుల కిట్టి సహాయము చేయుటకై పాశ్చా
త్యులు చేసిన యేర్పాటులు లెక్కకు మించియున్నవి.
చదువరులకు శ్రమ కలుగు నేమో యన్న భీతిచే వాని
నన్నిటిని వివరింపక ఇంతటితో విరమించుచున్నాను.
సంఘమును బలపఱుచుటకై చేయు ప్రయత్నము లన్ని
యు సాంఘికోద్యమములే. దేశకాలముల ననుసరించి
ఈ ప్రయత్నస్వభావములు మాఱుచుండును. పునర్వి
వాహము రజస్వలావివాహము సముద్రయానము వర్ణ
భేదవినాశము మొదలగు సంస్కారములే మన దేశమునం
దిప్పు డవసరము లని మన సంస్కర్తల యభిప్రాయము.
ఇదివఱకే వీని నన్నిటిని సదాచారములుగ పరిగణించు
చుండు పాశ్చాత్యులు దారిద్ర్యపిశాచమును దేశము
నుండి తొలఁగించుటయే ప్రధానసంస్కార మని యెంచు
చున్నారు. శరీరపోషణమునకు కావలసినంతమాత్ర మా
హారము గాని, సామాన్యముగ వ్యాధులకు లోఁబడ
నంతమాత్రపు శరీరారోగ్యము గాని, దేశక్షేమమును
గుఱించినవిషయములను తెలిసికొనుట కావశ్యక మైనంత
మాత్రపు విద్య గాని, లేని మనుష్యుఁడు సంఘమునం
దొక్కఁడు కూడ నుండఁగూడ దని పాశ్చాత్యుల దృఢా
భిప్రాయము. ఇట్టివా రుండిరేని, వారి లోపములను పోఁ
గొట్టి వారిని సమర్థులుగఁ జేయుటయె ప్రజలయొక్కయు
దొరతనమువారియొక్కయు విధాయకకృత్యములలో ప్ర
ధానమైన దని వారి మతము. ఇట్టి మతము ననుసరించి
ఆటంకము లెన్ని కలిగినను అధైర్యపడక, క్రమక్రమము
గా సంఘమును బాగుపఱుచుచుండు పాశ్చాత్యసంస్క
ర్తల ననుసరించి మనవారు పనిచేసినయెడల మన దేశ
మందు కూడ శీఘ్రకాలముననే ప్రజ లత్యున్నతస్థితికి
రాఁగల రనుట కెంత మాత్రమును సందేహము లేదు.

# ఆంధ్రమాతృసమాశ్వాసము

సోదరకవులు, పిప్పర

చెనకి సురేంద్రునైన నొక ♦ చీరికిఁ గైకొననట్టి భూపతుల్
సునిశితధీప్రచారు లయి ♦ సుంత కొఱంతయు లేక పేర్మిన
న్ననయము గౌరవింపఁ బ్రియ ♦ మందెదు నా విభవంబు పోయె నేఁ
డని దురపిల్లకమ్మ శుభ ♦ మయ్యెడు నీ కికఁ నాంధ్రమాతరో! ౧

సీ. కుప్పతిప్పలుగాఁగ ♦ గుప్పివేసిన ధనా
దాయంబు లేదారిఁ ♦ బోయెనొక్కొ?
ఎక్కటిక్కలుగాఁగఁ ♦ బెక్కులై తగు ధాన్య
రాసు లేమంటిలో ♦ మ్రగ్గెనొక్కొ?
గుట్టమెట్టలుగాఁగఁ ♦ గూర్చిన బహువస్తు
కలన మేగంగలోఁ ♦ గలసెనొక్కొ?
కొల్లకొల్లలుగాఁగఁ ♦ గొమరైన పలు చిత్ర
పుంజంబు లేమూల ♦ ముగ్గెనొక్కొ?
ఆనవాలుకైనఁ ♦ గాని యొక్కటి కంటఁ
బడదు నాటివైభ ♦ వంబు నడచె;
నేమి సేయుదాన? ♦ నెంతలో నెంతయ్యె!
ననుచు వగవకమ్మ! ♦ యాంధ్రమాత! ౨

ఉ. పోయినవానికై వగవఁ ♦ బోవకు మమ్మరో! నీ ప్రసన్నదీ
ర్ఘాయితవీక్షణామృతర ♦ రంగబలంబున నీ పురాతన
శ్రేయము లెల్ల మెల్లఁగను ♦ ఊకులనెత్త నీకుఁ బ్రయత్నముల్
సేయఁగలారు దోహదవి ♦ శేషములన్ భవదీయపుత్రకుల్. ౩

ఉ. ధీరమతుల్ దయాపరులు ♦ దేశహితైషిణు లెందఱో జమీం
దారులు నీ పదాబ్జము లు ♦ దంచితభక్తి మెయిన్ భజించుచు
న్నారు నిరంతరంబు; సుమ ♦ నస్స్తుతిపాత్రుఁడు పీఠికాపురీ
దారుఁడు చెప్పనేల నీకుఁ? ద్వఘ్నసమూలనిధానమే కదా! ౪

తే. ఒక జమీందారులే కాదు ♦ వికచహృదయు
లాంధ్రజనసత్తము లనేకు ♦ లనఘులు తమ
జీవితము లెల్ల నీ పద ♦ సేవనమున
కర్పణము సేయుచున్నవా ♦ రాంధ్రమాత! ౫

క. పుత్రికలై కొలిచెడి నినుఁ
బత్రిక లనవరత; మాంధ్ర ♦ పత్రిక యిఁక లో
కత్రయము మెచ్చ దైనిక
పత్రికయై కొలుచుఁ బరమ ♦ భక్తిం దల్లీ! ౬

క. ఏకాగ్రభక్తిఁ బ్రభువుల
నేకగ్రీవముగఁ గొలిచి ♦ యింపొందఁగఁ, బ్ర
త్యేకాంధ్రరాష్ట్రనిర్మా
ణాకులురై యున్నవార ♦ లాంధ్రులు తల్లీ! ౭

క. తమతమ యభిమతములనే
కముఖమునన్ జూచుకొనఁగ ♦ ఘను లెల్లరు నాం
ధ్రమహాజనసభ యని ప్రతి
సమమున నెఱవేర్చుచుండ్రి ♦ సంతసఁ దల్లీ! ౮

క. మన పత్రికలం గాంచరు
మన దొర; లది గాన వారు ♦ మన యభిమతముల్
గనుఁగొన స్థాపించెదరఁట
ఘను లాంధ్రాంగ్లేయపత్రి ♦ క యొకటి తల్లీ! ౯

ఉ. సందియ మేటికిన్ వినుము ♦ సత్యము నీదు కుమారు లెల్ల సం
క్రందనలోకమున్ నగు పు ♦ రాభవదుచ్ఛవిధంబు సర్వ మిం
పొందెడుదాఁకఁ గంకణము ♦ లూని ప్రయత్నము సేతు రింక నా
నందము నొందు మెంతయు మ ♦ నఃకలుషంబులఁ దూలమొత్తుచున్.

చ. అరయఁగ శాలివాహనధ ♦ రాధిపుఁ డుద్భటవైరివీరదు
స్తరతరగర్వముల్ సెడఁ బ్ర ♦ తాపము చూపి చెలంగునాఁడు సుం
దరవదనంబునన్ ముదము ♦ నర్తిల వర్తిలునట్లె యింక నీ
వుప్రమదంబునన్ మెఱల ♦ నబ్బు దినంబులు వచ్చునమ్మరో! ౧౧

ఉ. పారములేని శూరత న్న ♦ పాలకకోటికి గుండె తల్లడం
బై రమణీయభక్తి మన ♦ యాంధ్రకళాసతిఁ బ్రోదిసేసి దు
ర్వారపరాక్రమక్రమత ♦ రాజిలు రాజమహేంద్రునాఁటి బం
గారమువంటి మేలు కలు ♦ గంగల దింకఁ గ్రమక్రమంబుగన్. ౧౨

చ. ప్రియ మెసఁగన్ వసుంధరఁ గ ♦ విప్రవరంబులపాలి కల్పకం
బయి తన రెండుకన్నులుగ ♦ నంచితభక్తిని సంస్కృతాంధ్రముల్
గయికొని పెంచినట్టి యల ♦ కాకతివంశవరేణ్యునాఁటి నీ
వయిభవ మెల్ల మెల్లగను ♦ బ్రాపడు నిక్కము నీకుఁ గ్రమ్మఱన్.

ఉ. పాడి దొఱంగ కెప్డుఁ బెన ♦ వాగలు క్రుక్కిన పేల్క్రింద మా
ఱాడ కణంగియుండఁగ ద ♦ యాతిభరంబున దేశభాష కే
పోడిమి దూలనీయ కతి ♦ మోదమునన్ దయివార నిన్నుఁ గా
పాడిన మన్మసిద్ధినృపు ♦ నప్పటి వైభవ మబ్బుఁ గ్రమ్మఱన్. ౧౪

సీ. పెద్దనాదికవీంద్ర ♦ బృందంబు లొకవంకఁ
గవితారసస్ఫూర్తిఁ ♦ జవులుగొలుప,
శరణార్థి రాడ్వచ ♦ స్సందోహ మొకవంకఁ
గవులు మెచ్చెడు రస ♦ ఖ్యాతి నెఱప,
ఖండేతరులు వెట్టు ♦ కానుక లొకవంక
ముగురురాయలకు న ♦ బ్బురము నింప,
అనఘతిమ్మరుసు ద ♦ యాదృష్టి లొకవంక
ఖండేతరుల దైన్య ♦ కలిక లుడుప,
అన్నిట మహోచ్చముగ నల ♦ రాయ కృష్ణ
దేవరాయల యాస్థాన ♦ భూవిలోక
నమున నీ పొందు సుమహదా ♦ నంద మొదవఁ
గలదు కాలక్రమంబునఁ ♦ గాన నింక
నడలఁబోవకుమమ్మ నీ ♦ వాంధ్రమాత! ౧౫

# భగవాన్ మోహనదాస కరుణాసాంద్ర గంధి

రాయప్రోలు సుబ్బారావుగారు

దక్షిణాఫ్రికా ఖండమునందు జోహాన్సుబర్గు ఒక గొప్పపట్టణము. ఈ క్రిందఁ జెప్పఁబోవు దారుణనాటక మిప్పటనే జరుగుచున్నది. అది వేసవికాలము. పగలు అతిదీర్ఘముగ విస్తరింపసాగెను. ౧౯౦౭ సం. సెప్టెంబరు మాసమునం దొక ఆదివారమునాఁడు కొందఱు మనుష్యులు రైలుస్టేషనువద్ద నెవరికొఱకో నిరీక్షించుచు తిరుగుచుండిరి. వారందఱును నల్లనివారు. ప్రేమవిధేయ మగు ఆతురత వారి చూపులలో విస్పష్టముగఁ బ్రతిఫలించుచుండెను. నెటాలునుండి వచ్చు మెయిలుబండి ఆనాఁడు సకాలమునకు వచ్చి యాగెను. తోడనే అందుండి రెండవతరగతి పెట్టె వదలి యొక పురుషుఁడు దిగెను. ఆయన వెన్నాని యొక చెఱసాల సేవకుఁడును దిగెను. ఖైదీలకుఁ బెట్టు చిన్న టోపీయును, ముదుక చొక్కాయును, ఒకకాలు ఎఱుపు ఒకకాలు మసకరంగు గల లాగును మన పురుషుఁ డపు డలంకరించిన దుస్తులు. అతఁడు ఖైదీ యని చూచువారికిఁ దెలియుటకై మఱి రెండు దక్షిణాఫ్రికా దొరతనమువారి లాంఛనములు కలవు. అవి నంబరు వేసిన టిక్కెట్టును వెడల్పయిన శాణచిహ్నమును. ఖైదీదుస్తులలో నున్న ఆ పురుషుని ముఖవర్చస్సును, శాంతినితాంత మగు చూపును ఒక విధమయిన విలక్షణశక్తిని ఆయనలోనుండి దశదిశలఁ బ్రసరింపఁ జేయుచుండెను. ఆ పురుషునిఁ జూచినతోడనే ప్రక్కల తారాడుచున్న నల్లని మనుష్యులు సాష్టాంగదండప్రణామంబు లాచరించిరి. ప్రేమపూర్ణము లైన తమ చూపులతో నాయనను గౌఁగిలించుకొనిరి. హృదయకవాటమును దెఱచి ఆయన మూర్తిని బ్రవేశపెట్టుకొనిరి. కారాగృహాధికారి శ్వేతముఖుఁడు. దక్షిణాఫ్రికా స్థానికుఁడు. ఈ యధికారి యాజ్ఞకై మన పురుషుఁ డొకమాఱు మో మెత్తి చూచెను. కాని యాతఁ డేమి చేయఁగలఁడు? వా రిరువురును నాఁడు రెండు వందలమైళ్లు కాలినడకను మండు టెండలోఁ బోవలసియుండెను. మధ్య నెచటను విశ్రాంతి కనుజ్ఞ లేదు. ఆహారమునకు వలయు పదార్థములు చెఱసాలాధికారివద్ద లేవు. తుద కిరువురును ప్రయాణమై పోయిరి. కొంత సేపటికి చూపులకుఁ గూడ నందకుండ దాటిపోయిరి. వెనుకటి మనుష్యు లందఱును వీరు పోవు దిక్కునకై అత్యంతవిషాదముతోఁ దల లెత్తి చూచుచుండిరి. చూచి చూచి యదృశ్యు లైన మహాపురుషుని దురవస్థకై యనుతాపరోషకలుషము లగు వేడి కన్నీళ్ళు విడిచిరి. కొంత సేపటికి మన పురుషుఁడు జోహాన్సుబర్గు చెఱసాలను స్వేచ్ఛగాఁ బ్రవేశించెను. ఆ కారాగృహద్వారబంధములపై "సంఘీభావము బలము" అని డచ్చి భాషాక్షరములలో వ్రాయఁబడియుండెను.

కొన్ని నెలలు గడచినవి. వార్తాపత్రికలలో చెఱసాల సంకటములను గూర్చి కంటకము లగు విమర్శ లప్పుడప్పుడు బయలు దేరెను. మనము చూచుచుండ చెరసాలలోఁ బ్రవేశపెట్టఁబడిన పురుషుఁడు ఒకనాఁడు జోహాన్సుబర్గు వీథులలోఁ బోవుచుండెను. ఆయన శరీరపాటవము వెనుకటికన్న కృశించియుండెను. ఆరోగ్యము శోషించెను. కాని ఆ చూపులయందలి శాంతియు ముఖమునందలి తేజస్సును మాత్రము రవ్వంతయు తగ్గినట్లు లేదు. చేతులకు సంకెళ్లు తగిలింపఁబడియుండెను. కారాగృహరక్షకులు ప్రిటోరియానగరరాజమార్గములం బట్టి ఆయనవెంట నడచుచుండిరి. బాహాటమగు వీథిమధ్య కొందఱు మన పురుషుని గుర్తించిరి. వెంటనే చుట్టుముట్టి కృతజ్ఞతానూచనలు వెలువరించిరి. వా రందఱును భారతీయులు. ఆ పురుషుఁడు భగవాన్ మోహనదాస్ కరుణాసాంద్ర గంధి. మహదైశ్వర్యమంతుఁ డగు నొక దివానునకు పుత్రుఁడు. బారిష్టరు పరీక్షయందు త్తీర్ణుఁ డైన నాగరకుఁడు. విద్వాంసుఁడు. గీతాధ్యయనమందు ప్రసన్నజ్ఞాని యైన మహాత్ముఁడు. 'తత్త్వ మసి, తత్త్వ మసి' యను వైదికబుఱుక్కులను నిరంతరగానము చేసి చైతన్యలీనుఁ డైన ఆర్ద్రితపస్వి.

దక్షిణాఫ్రికా యిప్పు డొక మహానాటకరంగస్థల మైనది. రెండు తెగలు. రెండు మార్గములు. దక్షిణాఫ్రికా దొరతనమువా రొక ప్రక్క. గంధి భారతజన మొక ప్రక్క. పోరాట మంతకంతకు తీసంకుల మగుచున్నది. ప్రవాసభారతీయులకు గంధి. నాయకుఁడు, మార్గదర్శి, బోధకుఁడు. అనుచరుల కెల్ల నీ మహాత్ముఁ డొక్కడే శరణ మిచ్చెను. అది మనోబలము. దీనినే మనవారు సాత్వికనిరోధ మనుచున్నారు. మనోబలము మహాశక్తి, దుర్జయము, దురవగాహము. ఈ మహాశక్తికి మనసే స్థాయి. ఈ శక్తిని తీవ్రశాసనము లడ్డగింపలేవు దారుణశిక్ష లంతరింపఁ జేయలేవు. కొరడా దెబ్బలు క్షోభపెట్టఁజాలవు. భౌతిక మగు ప్రతిరోధ మెంత ప్రచండమైన నగు గాక, ఈ శక్తి నాపలేదు. ఇట్టి మహాశక్తికి ఆచార్యపుత్రుఁడై యవతరించినవాఁడు మన మోహనదాసు కరుణాసాంద్ర గంధి.

1869 సంవత్సరము అక్టోబరు నెల రెండవ తేది ఈ మహాపురుషుఁ డుదయించిన పవిత్రదివసము. ఈయన జీవిత మంతయు బ్రాహ్మ్యమే కాని జన్మకులము బ్రాహ్మణము కాదు. పురుషశీల మంతయు క్షాత్రజ్వలితమే కాని ఆత్మకుటుంబము క్షత్రియము కాదు. ఈయన వైశ్యుఁడు. ఉత్తరహిందూస్థానమునందలి కథియవాడ నివాసమండలము. గంధి జనకుఁడు పోరోబందరు సంస్థానమునకు దివానుగ 25 సంవత్సరములు ఉద్యోగవైభవము ననుభవించెను. గంధి తల్లి మహాపతివ్రత. సదాచారధురీణ. కర్మపరాయణ. కడఁగొట్టు కుమారుఁ డైన మోహనదాసు నెడల ఈతల్లికిఁ బ్రేమ యధికము. ఇట్టి మాతృదేవతకు బద్ధవత్సలుఁ డైన గంధియందు ఆపుణ్యవతి తేజోవికాసములు లీనము లయ్యె నని

వేఱ చెప్పనక్కఱలేదు. మోహనదాసు విద్యాభ్యాసము కొంతవఱకు కథియవాడలోనె జరిగెను. తరువాత నతఁడు సీమకుఁ బోవ నుద్యమించెను; కాని ఆచారవతి యగు మాతృనిరోధ మతనికిఁ ద్రెంపరాని శృంఖల మయ్యెను. గంధికిఁ జిన్ననాటఁనుండియు నభినివేశము మెండు. లండనునగరవిశ్వవిద్యాలయములలోఁ దాను విద్య నభ్యసించక తప్ప దని సంకల్పించుకొనెను. మహనీయు లెప్పుడును సిద్ధసంకల్పులు కదా! ఎట్టకేలకు తల్లి నొప్పించిరి. విద్యాభ్యాసమునకై ప్రవాసమున కేగు కుమారునికి ఆమె స్వయముగా దీక్ష నిచ్చెను. ఒక జైనమతాచార్యుఁడు మంత్రపూతసంస్కారమును జరిపించెను. ఆ మాతృదీక్షా నియమములు మూఁడు. మొదటిది మాంసభక్షణనిషేధము. రెండవది మద్యపానదూషణము. మూఁడవది కాముకవ్యసనత్యక్తము. మోహనదాస్ కరుణాసాంద్ర గంధి లండనునగరోన్ముఖుఁడై పోయెను. ఆ కుమారుని హృదయ మప్పు డెట్టు లుండెనో! ప్రత్యక్షదైవ మగు జననీవియోగము. ప్రతిదినారాధనీయ మగు మాతృభూమీమతల్లి యెడఁబాటు.

గంధియొక్క లండనునగరజీవితమును గుఱించి విస్తరించవలసిన గ్రంథము లేదు. లండనువిశ్వవిద్యాలయమునందు జయ మందెను. తరువాత న్యాయశాస్త్రము నభ్యసించి బారిస్టరుపదవి సంపాదించెను. లండను మహాపట్టణము. ఇచట నెంత వైభవ మున్నదో అంత దారిద్ర్యము కలదు. ఎంత సాహిత్యము వికసించినదో అంత మౌఢ్యము మూసికొనియున్నది. గ్రాహ్య మగు మహోన్నతసోపానమును, దురవగాహ మగు అధోగతియు నిందుఁ గలవు. ఉత్తమము లగు తేజోమార్గములు మితములు. లజ్జాకరము లగు పాపిష్ఠి ఆకర్షణము లనేకములు. ఇంత యేల? ఇది యొక కత్తులబోను. పడుచు విద్యార్థుల కనర్థవిష మెచ్చట పట్టినను దొరకును. కుమారగంధి జీవిత మీ కత్తులబోనులోఁ బడి యసిధారావ్రతనిర్వాహకము నందెను. గంధి మాతృదత్తము లగు నియమత్రితయమును నస్ఖలితముగాఁ గాపాడి కృతకృత్యుఁ డయ్యెను. బారిస్టరు పట్టముతో స్వదేశమునకు వచ్చి బొంబాయి హైకోర్టునందు న్యాయవాదవృత్తి నవలంబించెను.

గంధికి బాల్యమునుండియు భాగవతపారాయణమునందు ఆసక్తి యధికము. హైకోర్టునందు వృత్తి సంపాదన మారంభించినది మొదలు హైందవధర్మశాస్త్రములను పురాణములను జదువసాగెను. కాని ఈ మహాత్ముని జీవిత మిట్లు పరమావధి నందవలసియుండలేదు. దైవనిర్ణయ మన్యథా యుండెను. పోరుబందరు పట్టణ వర్తకులకుఁ జాలమందికి సంబంధించిన వ్యాజ్య మొకటి దక్షిణాఫ్రికా న్యాయస్థానములలోఁ దగుల్కొనెను. భారతీయవర్తకవర్గ మంతయు శ్రీ గంధిగారిని తమ న్యాయవాదిగా నెన్నికొని పంపిరి. గంధి దక్షిణాఫ్రికాలో నడుగువెట్టినది మొదలు లజ్జాపాదన మగు నైచ్యమునకు పాలుగావలసివచ్చెను. న్యాయస్థానమున నుండఁగా నాయన శిరోవేష్టనము తీసివేయ నాజ్ఞాపింపఁబడెను. రైలులోఁ బోవుచుండఁగా మొదటి తరగతి పెట్టెలోనుండి దింపించిరి. ఇట్టి దుండగము లింకెన్నియో గలవు; కాని ఈ మహాత్ముని జీవితమునందుఁ జెప్పఁదగినవి కావు. గంధి వెళ్లిన న్యాయస్థానవివాద తృప్తికరముగ ముగిసెను. ఆయన గౌరవార్థమై అచటి భారతీయులు ప్రీతిపూర్వ మగు నొక విందు జరిపిరి. గంధి స్వదేశోన్ముఖుఁ డయ్యెను; కాని ఆయన మాతృదేశమునకు వచ్చు విధి నిర్ణయము లేదు. దక్షిణాఫ్రికాయం దున్న భారతీయులను ప్రజాస్వామ్యహీనులను జేయవలె నని బోయరు నాయకులు గాఢముగ నాలోచించుచుండిరి. అందుల కవశ్యము లగు అధికారశాసనములు ప్రవేశపెట్టఁబడు నని వార్తాపత్రికలయందుఁ గానవయ్యెను. గంధియు సోదరులును మిగుల నాకులపడిరి. బోయరులకును భారతీయులకును భావిసంబంధములు తీవ్రసంతాపకరములుగాఁ బర్యవసించు నని పొడఁజూచిరి. కర్తవ్యము నూహించిరి. గంధి ప్రజానాయకుఁడై పైఁజెప్పిన శాసనము నంగీకరించుటయందు ఆలసించవలసిన దని పాలకులకు విన్నవించెను. కాని భారతీయుల యాక్షేపణము కంఠశోషణ మయ్యెను. శాసనము స్థానికపాలకుల యంగీకారము నందెను. దక్షిణాఫ్రికాయందలి భారతపుత్రులకు బోయరు దౌరతనపు శాసనములవలన నాపదలు తప్ప వని గంధి గ్రహించెను. రాఁగల ఈ పోరాటమున కెదురొత్తుటకు ప్రవాసికు లగు భారతీయులు సన్నద్ధులు గావలె నని గంధి ప్రబోధించెను. కాని వారిదశ మిగుల శోచనీయ మయ్యెను. దేశమా విదేశము. పాలకులా బద్ధనిరాదరులు. నూచనలా సంఘర్షణప్రాప్తములు. ఏమి చేయుదురు? నాథుఁడు లేని కుటుంబీకులుగాఁ గన్పట్టిరి. గంధి ధర్మసేవానిరతుఁడు. ప్రజాసేవనముకంటె నుత్తమధర్మము ప్రపంచమునందు లేదు.

‘ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే’

అను శ్రీకృష్ణవాక్యములు గంధి హృదయకుహరమునందు మాఱుమ్రోగెను. భగవంతు నంతవాఁడు ధర్మసేవకుఁడ నని చెప్పిన గీతాపరమార్థమును ఆయన గుర్తించెను. తుదకు దక్షిణాఫ్రికా భారతీయులకై తన మనోనీతిబలములను ధారవోయ పరమార్థదీక్షితుఁ డయ్యెను. కొంత కష్టమువిూఁద దక్షిణాఫ్రికా న్యాయస్థానములలో న్యాయవాదవృత్తి జరుపుటకు గంధి కనుజ్ఞ యీయఁబడెను. అది మొదలు మహాతపస్వి జీవితము కష్టానుభవముతో నైక్యమై జగజ్జేగీయమానము లగు పరమరహస్యసిద్ధాంతములతో నన్వయ మగుచున్నది.

1896 సం. గంధి మన దేశమునకు వచ్చెను. భారతీయు లందఱును సార్వసౌదర్యపూర్ణ మగు స్వాగత మిచ్చి గౌరవించిరి. దక్షిణాఫ్రికాలోని భారతీయుల దురవస్థలం గూర్చి యచ్చటచ్చట యుపన్యసించెను. గంధి వాణి నిర్భరసాంత్వనముచేఁ బూతమైనది. ఆయన మహోపన్యాసములు శాంతిపూర్ణములు; ధర్మసమన్వయములు. సాధుమౌళి యుపదేశములు బోధపడినవార లిప్పటికిని చాల యరిది యని తోఁచుచున్నది. భగవాన్ గంధి జీవితమునందలి యొక లఘుస్ఫురణయె మనల నలమినది. తదంతరంగికయాథార్థ్యము మన కలవి కాదు. సత్వలీనుఁ డగు నీ యభినవప్రహ్లాదునకె తగును. సామాన్యులకు సాధ్యము కాదు. గంధి యుపన్యాసము లెల్ల బోయరుదూష

ణతో నిండియున్న వని అసత్యవార్తలచటికిఁ బంపఁబడెను. దక్షిణాఫ్రికా యంతయు నీ వార్తామూలమున నల్లకల్లోల మయ్యెను. వారి క్రోధసంక్షోభమునకు మితి లేకపోయెను. సభలు చేసి గంధిని నిందించిరి. భారతీయుల ప్రవర్తనలను నీచోక్తులతో గర్హించిరి. ఇంత యేల? దక్షిణాఫ్రికామండల మంతయు తీవ్రమగు నొక మహాందోళనమున తప్తమయ్యెను. ఇంతలో గంధి మఱల దక్షిణాఫ్రికాకుఁ బోవలసినట్లు తటస్థించెను. వెంటనే ఆయన నెటాలునకుఁ బ్రయాణమయ్యెను. అంతకు ముందు ఆరు వందల భారతీయు లున్న పొగరోడ యొకటి దక్షిణాఫ్రికాఖండమున కభిముఖమై పోయియుండెను. ఈ రెండు ఓడలును రెండు దినములు ముందు వెనుకగా దర్బాను పట్టణపు రేవును సమీపించెను. భారతీయులు మఱల వచ్చుచున్నారను వదంతి యెల్లయెడల మ్రోగిపోయెను. బోయరుల స్కంధమం దణఁగియున్న క్రోధవహ్ని యొక్కమాటుగా భగ్గున మండెను. ఈ రోడలను సముద్రమధ్యమున ముంచివేయుటకుఁ బ్రయత్నించిరి. వలసవచ్చిన భారతీయులను మఱల వెనుకకుఁ బంపివేయ నూహించిరి. ఉత్తరవాదశూన్యులైన హైందవద్వేషులు కొందఱు భారతీయులను పశుతుల్యముగాఁ జెండాడవలసిన దని కఠోరోపన్యాసము లొసంగి, బోయరు వైషమ్యసర్పమును ప్రబోధించిరి. అధికారులు గూడ ప్రజాభిప్రాయమును కనిపింపలేరైరి. గంధి భారతీయులను మోసి తెచ్చిన ఓడలు రెండును క్వారంటీనునందు బంధించిరి. క్వారంటీను అనగా ఒక నిర్బంధప్రదేశము. మహామారి మున్నగు అంటువ్యాధులచే బహిష్కారయోగ్యము లగు ఓడలు నిలుచుటకుఁ గాను మొట్టమొదట నిర్ణయింపఁబడినది. దేశకాలపాత్రములను బట్టి ప్రయోగవినియోగపరిణామము లిట్లే కదా మాఱుచుండును. బహిష్కారనిర్బంధమునం దుంచుటకు వీలులే దని నౌకాస్వాములు బోయరు స్థానికపాలకులకుఁ దెలియపఱచిరి. తుదకు నష్టవ్యాజము క్రింద తత్సంబంధాధికారివర్గమును ఉత్తరవాదులుగాఁ జేసెద మని బెదరించిరి. పొగయోడలయం దున్నవారు నల్లవారైనను, స్వాములు తెల్లవారు గదా! దక్షిణాఫ్రికా దొరలు కార్యము మించు నని తలంచిరి. తోడనే ఓడలు రేవులోనికి వచ్చెను. అం దున్న నల్లవారు దిగుదురు. గంధియు దక్షిణాఫ్రికాసీమలోఁ బ్రవేశించును. బోయరుగుంపులు రేవు ముట్టడించెను. వారి హృదయము లెల్ల నీర్ష్యాదూష్యములై తల్లడిల్లుచుండెను. విద్వేషవిషము పూర్ణముగా నిండెను. ఈ దక్షిణాఫ్రికా శ్వేతముఖుల కింత గర్భశత్రు లగుటకు మనవారు చేసిన మహాపరాధము లెవ్వి? మీ దేశమును మాదేశమును ఒక్క సార్వభౌమపతాకక్రిందనే చల్లగా నున్న వనిరి. మా దేశమందు మీ కెట్టి గౌరవస్వాతంత్ర్యములకు అధికారము కలదో! మాకు మీ దేశమందు నట్టి స్వామ్యములు కావలయు ననిరి. బ్రిటీషు ప్రభుత్వ పరిరక్షణము క్రింద, తెలుపు, నలుపు, యెఱుపు, మున్నగు వర్ణవివక్ష ప్రజాస్వామ్యానుభవమునకు ఆటంకము లని యొప్పికొనరైరి. ఇవియే అపరాధములు. పాతకములు. కష్టకారణములు.

భగవాన్ గంధి దర్బానునగరపు రేవున దిగిననాఁడు ఆ మహామహుని పునర్జన్మదివస మని చెప్పవచ్చును. ఓడలోని పోలీసు అధికారులు గంధిగారి నచట దిగవల దని శ్రేయోనిరోధులై పలికిరి. కాని ఆయన బ్రిటీషుసామ్రాజ్యపతాకము సూర్యాస్తమయ మెఱుంగని విశాలనాగరప్రపంచమునం దూగుచుండు నంతవఱకు నాకుఁ బ్రాణాపాయభయము లే దని మాఱుచెప్పెను. కాని మానవనైజమును గుర్తించుట యెంత దుర్లభము? గంధి నౌకనుండి పుడమిపై నడుగు పెట్టినతోడనే వైరుధ్యసర్పము ఆశీవిషములఁ గ్రక్కసాగెను. మహాసంక్షోభ మావహిల్లెను. కేకలు, అఱపులు, తిట్లు, చప్పట్లు, వీనికి మితిలేదు. ఆందోళజ్వరోన్మాదమైన ఆ జనసంక్షోభము ప్రమాదకర మని అందఱకును దోచెను. కీర్తిశేషయైన శ్రీ విక్టోరియామహారాజ్ఞి పేర నాఁటి ప్రజాక్షోభ శాంతింపఁజేసి నెటాల్ అటార్ని జనరలు సమయజ్ఞుఁ డయ్యెను. గంధి యొక మిత్రునితోఁ బోవసాగెను. తోడనె బోయరులు మూకలు మూకలుగా జుట్టుకొనిరి. అంత నొక 'రిక్షాబండి' నెక్కి తప్పికొనఁ జూచిరి; కాని ఆ గుంపులు త్రోవల నడ్డపడెను. అపాయమేఘము లప్పుడప్పుడే సకలాశలం గ్రమ్ముకొనసాగెను. పిదపఁ జెంత నున్న ఒక పోలీసు అధికారి యింట గంధిని దాచిరి. శివమెత్తిన యా బోయరుగుంపు ఆ యింటి నావరించెను. తుద కొక పోలీసువాని వేసమున భగవాన్ మోహనదాస్ కరుణాసాంద్ర గంధి నాఁటి ప్రాణాపాయమునుండి యీవలబడెను. భగవంతుఁ డాపద్బాంధవుఁడని గదా అనశ్రుతోక్తి.

ఋషులలోఁ గులపతు లెట్టివారో, ప్రజలయందుఁ బ్రజానాయకు లట్టివారు. స్వార్థలుబ్ధులు గాని ఉత్తమపురుషులకె ప్రజాసేవానుష్ఠానము సాధ్యమైనది. నాయకుఁడు లేని సంఘము కాపు లేని పంటపొలమువంటిది. వీరి కష్టనిష్ఠూరములు పరస్పరములు. సామాన్యజనదుర్లభ మగు నొక శక్తి నాయకులను కీర్తివిలక్షణులఁగా నొనరించుచుండును. దీనిం బట్టియె ప్రజలు నాయకులయెడ విధేయగౌరవబద్ధులై మెలఁగుదురు. నాయకు లిందలి యుత్తరవాదభారమును గ్రహింపలేని విభ్యక్తధర్మసామ్రాజ్యమును పవిత్రపఱచినవా రగుదురు. భగవాన్ గంధియం దుత్తమప్రజానాయకలక్షణములు గలవు.

1899 సం. బోయరులకును బ్రిటీషువారికిని యుద్ధము ప్రారంభమయ్యెను. ఈ కలహమునకు దక్షిణాఫ్రికాహైందవుల ప్రజాస్వామ్యధిక్కారము గూడ నొక కారణ మని గంధి విశ్వసించియుండెను. ప్రజాస్వామ్యములకై యెంత దీక్షతోఁ బోరాటమునకు దిగెనో, ప్రజాస్వామ్యబాధ్యతలకుఁ గూడ నంతటి శాంతముతోఁ దలయొగ్గెను. బ్రిటీషుసామ్రాజ్యపక్షమున నచటి హిందువుల నెల్ల యుద్ధభటులనుగాఁ జేర్చుకొనవలసిన దని సంబంధాధికారులకు గంధి తెలియఁజేసెను. కాని సేనానాయకులు గంధి యుదంతమును పరిహాసపూర్వముగా నిరసించిరి. యుద్ధమధ్యమందు వ్యవహారములు సందిగ్ధములుగాఁ బర్యవసించెను. అంతట దొరకినవారి నెల్ల బిరుదుమగలఁ జేయవలసి వచ్చెను. అపుడు గంధి మున్నగు భారతీయులు కొందఱు వేయిమంది యుద్ధసేనాసేవనమున కొప్పికొనిరి. సంగ్రామమందు దెబ్బలు తగిలి, ఛిన్నశరీరు లయిన భటులను మోసికొనిపోవుటకును, విడి

దలలో సౌమథసహాయోపచారములు చేయుటకును భారతీయులు నియమింపఁబడిరి. ఆ యుపద్రవసమయమునందు గంధి నాయకత్వమున భారతీయులు సలిపిన యుత్కృష్టసేవను మన మిచట శ్లాఘింప నక్కఱలేదు. దక్షిణాఫ్రికావాస్తవ్యులే కొనియాడిరని చెప్పినఁ జాలును. బోయరు యుద్ధము ముగిసెను. ట్రాన్సువాలు రాష్ట్రము బ్రిటీషుసామ్రాజ్యములోఁ గలిసెను. భారతీయుల కష్టములు గట్టెక్కునని యూహించిరి; కాని అది యన్యథా యయ్యెను. క్రొత్త బోయరు దొరతనమువారు, భారతీయుల విచారణకొఱకు ప్రత్యేకాధికారిసభ నేర్పఱచిరి. వీరికొఱకుఁ గ్రొత్త శాసనములు బయలుదేరెను. ఒకవిధమగు బహిష్కారపద్ధతి ప్రారంభమయ్యెను. ఎటు జూచిన భారతీయ మనోవికాసములు సందేహాతమస్సుచే నావృతములు కాఁజొచ్చెను. అధికారులను దర్శింపవలెనని గంధి ప్రయత్నించెను. కాని కొనసాగలేదు. గంధి చేవ్రాలు గల విజ్ఞాపనపత్రము నంగీకరించుటకు బోయరుగవర్నమెంటువారు నిరాకరించిరి. గంధి నామాక్షరములు కర్ణవిదారణములుగ మాఱిపోయెను. సమయ మంతకంతకు నంధకారమయ మగుచున్నదని గంధి కల్లోలపడెను. ఐనను నిరుత్సాహమంటుకొను పిఱికికండె ఆ మహనీయునియందు లేదయ్యెను. దక్షిణాఫ్రికా న్యాయస్థానములందుఁ దానొక న్యాయవాదిగాఁ బ్రవేశించి మాతృజాతీయజీవితమునకుఁ దటస్థింపనున్న గౌరవోపద్రవమున కెదురొత్తఁ గృతనిశ్చయుఁ డయ్యెను. ఈ నిగ్రహవ్రతము మొట్టమొదట లఘుమాత్రముగా నున్నను ఒక మహాసత్రయాగదీక్షగాఁ బరిణమింపక తీరదని గంధి చక్కగా నూహించెను. అందువలన వలయు ప్రయత్నముల నప్రమత్తసన్నాహుఁడై మెలంగెను. 1903 సం. ఒక ముద్రాయంత్రాలయమును గొని 'ఇండియన్ ఒపీనియన్' పత్రిక ప్రకటింపనారంభించెను. 'ఇండియన్ ఒపీనియన్' అనఁగా భారతీయాభిప్రాయమని యర్థము. ఇంగ్లీషు, అరవము, గుజరాతి, హిందీ యను భాషా చతుష్టయమున నీ పత్రికాప్రచురణ మారంభమయ్యెను; కాని వ్యయప్రయాస లధికములు గాఁజొచ్చెను. ఒక సంవత్సరము గంధి స్వకీయాదాయమునుండి ముప్పదివేల రూపాయ లిచ్చుకొనెను. పత్రిక కొంత కాలమునకు హిందీ ద్రవిడ భాషలలో ప్రచాలన మాపివేయఁబడెను. ఇంగ్లీషు గుజరాతి భాషల నేఁటికిని మహర్షి గంధి మనోనిగ్రహతత్వప్రకాశకరమై యీ పత్రిక రాణించుచున్నది. 1904 సం. గంధిమహాశయుఁడును తక్కుంగల సోదరకుటుంబములును కాపురము లున్న వాడలలో నతితీవ్ర మగు మహామారి జాడ్యము రగుల్కొనెను. ఏతచ్చికిత్సార్థము భారతీయులు ఆరోగ్యపాలనాశాఖీయులకు విన్నవించిరి; కాని నల్లవారి కాపురస్థలములలో ననారోగ్యోపద్రవము నంతగాఁ బరిగణింపనక్కఱలేదని పెడచెవిం బెట్టిరి. జాడ్యము నాఁటికి నాఁటికిఁ జెలరేగసాగెను. గంధి ఆర్ద్రహృదయుఁడు. ప్రకృతి పవిత్రమూర్తి యైన తల్లి యని ఆయన వేదాంతము. ప్రాణిజాల మంతయు ఆమె సంతానము. అటుగుట నందఱు నేకోదరులు. మానవరక్తబాంధవ్యముకంటె నుత్తమమగు చుట్టఱికము లేదు. మానవజీవితమునకు పృథివ్యాపస్తేజోవాయురాకాశములు పోషకులు. ఈ మహాభూతము లెల్ల నాద్య మగు మాతృకళోత్పన్నములు. ఏతదృణవిముక్తికి మానుషసంతానసేవకంటె సాధనాంతరము లేదు. దేశము కాని దేశమున దిక్కుమాలి చచ్చుచున్న భారతీయులకై గంధి పడిన పరితాప మనిర్వచనీయము. తుదకు స్వీయహస్తములతో బొబ్బలరోగముపాలఁ బడినవారిని మోసికొని పోయి, శక్తికి దాటని సాహాయ్యము నొసంగెను. అంటువ్యాధి లంకురించినది మొదలు అంతరించువఱకు నహోరాత్రములు చేయఁగల సాయము లెల్ల నిచ్చు దొరతనమువా రున్న మన దేశమందు దక్షిణాఫ్రికాస్థితిగతులను యథావిధిగా గ్రహింపలేము. తరువాత 'ఫోనిక్సు' నగరప్రాంతమందుఁ గొంత భూమి విలిచి, అచట జాతీయసోదరవర్గముతోఁ గూడ గంధి వాసస్థలములు ప్రతిష్ఠించెను. అప్పటినుండియు భారతీయు లనేకు లీ 'ఫోనిక్సు' నందు నివసించుచున్నారు. ఇటీవల నీస్థాన మొక హైందవజనాగ్రహారమై, భగవాన్ గంధివంటి సాత్వికమతాచార్యులకు తపోభూమి యైనది.

పోరాట మతితీవ్రము గాఁదగు సూచనల నిదివఱకె పొందుపఱచితిని. యూనియన్ దొరతనమువారు భారతీయులయెడల నిరసనబుద్ధి గలవారుగా నుండిరి కదా! ఈ శాంతి యెన్నినాళ్లు అణఁగి యుండఁగలదు. దక్షిణాఫ్రికాయందున్న భారతీయు లందరును బొటనవ్రేలిగుర్తు లిచ్చి 'రిజిస్టర్' చేసికొనవలసిన దని స్థానికపాలకులు బహిరంగముగ శాసించిరి. ఈ నిర్బంధనిరూపణము ఖైదీల కుండెడిది. భారతీయులును ఖైదీలును సమానగౌరవనీయు లని వారి యభిప్రాయము కాబోలు. ఒకనాఁ డుదయము కనులు తెఱచుసరికి భారతీయులెల్ల పై శాసనమునకు బద్ధులుగావలసిన దేర్పడెను. గంధి భారతీయుల యాత్మగౌరవమునకు భంగము తటస్థించు కాలము వచ్చిన దని తలచెను. కాని మహర్షుల కుండు నిరంకుశధైర్యముతో భారతీయులు అమానుష మగు నీ శాసనమునకు వశులుగా రని ప్రతిరోధించెను. ప్రతిఫల మేమి? భగవాన్ గంధి రెండు మాసములు కారాగారవాసశిక్ష విధింపఁబడెను. వందలకొలఁది భారతీయులు, స్త్రీలనక, బాలురనక, వృద్ధులనక, చెఱసాలలో బంధింపఁబడిరి. శిక్షాకాల మనుభవించి గంధి మున్నగు మహాశయులు లండనుపట్టణమున నీ యన్యాయమును గూర్చి యాందోళింపఁ బోయిరి. విశ్వసనీయుఁ డగు లార్డు ఆంప్తిల్ ప్రభువు అప్పటినుండియు మన దేశీయులపక్షమున నహోరాత్రములు పోరాడుచున్నాఁడు. భారతీయుల చెఱసాలకష్టములం గుఱించియు, విషమప్రవాసదుఃఖములను గుఱించియు నే నిన్ని కన్నీళ్లు వదలి చదువరుల నిన్ని కన్నీళ్లు విడువ మనుటకన్న వ్రాయఁదగినది లేదు. దక్షిణాఫ్రికా దొరతనమువారి చండశాసనములపట్టిక సాంగసావయవనిరూపణముగ విస్తరించుట కిందు స్థలము లేదు. దక్షిణాఫ్రికాలో నివసించుచున్న మన దేశీయు లొక్కొకరును 45 రూపాయల సుంకము చెల్లించవలె నని శాసించి యున్నారు. భగవాన్ గంధి ఈ శాసనము అక్రమ మని నిరోధించెను. తత్ప్రతిఫలముగ 15 మాసములు కఠినశిక్షకుఁ బాలయ్యెను. ఇంకను నియమితశిక్షాకాలము పూర్తికాలేదు. కాని కారణాంతరమున నిటీవల విడుదలఁజేసిరి. గంధి గాక వందలకొలఁది భారతీయులు ఇంకను బంధనాలయములలోఁ గృశించుచున్నారు.

ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి కో
పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా
పన్నశరణ్య! యో నిఖిలపావన! యంచు నుతించుఁ గాని తాఁ
గన్నుల నీరు దేఁడు భయకంపసమేతుఁడు గాఁడు భూవరా!

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు, బాహువు లొడ్డఁడు, బంధురాజిలోఁ
దూఱఁడు, ఘోరకృత్య మని దూఱఁడు, తండ్రిని మిత్రవర్గముం
జీరఁడు, మాతృసంఘము వసించు సువర్ణగృహాంబులోనికిం
దాఱఁడు, కావరే యనఁడు, తాపమునందఁడు, కంటగింపఁడున్.

భగవాన్ గంధి జీవితము స్మరించినప్పు డెల్ల నీ రెండు పద్యములును మనసునకు రాకపోవు. ఇందలి భావ మెంత చక్కఁగ ననుకలిత మగునట్టియు నీ జీవితాంశమునఁ బ్రకాశింపక దాగదు. రస మయుఁ డగు పోతనమహాకవి ఇందలి భావస్వావస్థను భాగవతాగ్రేసరుఁ డగు ప్రహ్లాదున కారోపించియున్నాఁడు. కాని కవివాక్యము లక్షరధర్మములు. యుగాంతరభేదమువలన మాఱిపోవునది స్మరణ స్వరూపము మాత్రమె. తత్వము శాశ్వతము. ఈ పద్యద్వయతాత్ప ర్యమును నేఁడు భగవాన్ గంధి జీవితము వ్యక్తీకరించుచున్నది.

ఈ పరమరహస్యమును భగవాన్ గంధి యథావిధిగ గ్రహించెను. సంకల్పసిద్ధ మైన యీ మనోబలమునే ప్రపంచతరణార్థమై వినియోగించుచున్నాఁడు. కాని అనుష్ఠానము సామాన్యజనదుర్లభ మైనది. భగవాన్ గంధి కుమారదశనుండియు గీతోపాసకుఁడు. ప్రహ్లాదాది మహాసాత్వికు లీయన కాదర్శకులు. చిరకాలతపస్సిద్ధి యీ మహర్షి యం దిట్లు సాక్షాత్కరించినది. అపరాధములను గర్హించుటకంటె క్షమించుట యుత్తమము. ఈ వేదాంతమునె,

కం. అపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ.

అని శీధభిక్షుకుఁడు నిరంతరగానముఁ జేయుచున్నాఁడు. ప్రపంచమునకు స్థాయి ప్రేమ. ఆద్య మగు ప్రేమకు సన్నిహితకళ సాత్వికస్థైర్యము. నాఁడు భాగవతాగ్రేసరుఁ డగు ప్రహ్లాదుఁ డీ ధర్మరహస్యమును వెల్లడించెను. నేఁడు భగవాన్ మోహన్ దాస్ కరుణాసాంద్రుఁ గంధి ఆధునికనాగరికప్రపంచమునకుఁ బ్రబోధించుచున్నాఁడు.

# మనీషాపంచకము

## శ్రీమతి గుండు అచ్చమాంబికా ప్రణీతము

శ్రీకర లోకానీకకు
భాకర! పరమాత్మ! నేత్ర • పర్వాద్భుతశో
భాకర! విలాసభక్తవ
శీకర! యవధారు దేవ • సేవితచరణా!

క. ఒకనాఁ డాచార్యులు కా
శికాపురికి నేగుత్రోవ • శివుఁ డంత్యజు పో
లిక రాఁ గని, "పోపో త్రో
వ కొకించుకఁ దొలఁగు" మనిన • వాఁ డి ట్లనియెన్.

క. అన్నమయవికారము నుండి • యదియొ? లేక
జీవమువలననుండి యా • జీవ మొక్కొ?
దూరముగ దేని నొనరింపఁ • గోరి పొమ్మ
పొమ్మనుచుఁ బల్కెదవొ తెలు • పుమి యతీంద్ర!

వ. అనిన శ్రీశంకరాచార్యుం డి ట్లనియె.

చ. అమరగణాశ్రితాంబువున • నంత్యజనాశ్రయ మౌ జలంబునన్
గమలహితుండు బింబితుఁడు • కాంచనమృద్ఘటవాస మంబరం
బమరునె భేద మయ్యచలహర్షసు • బోధనవార్ధి యైన త
త్వము దెస వీఁడు విప్రుఁడను • వాఁ డొరుఁ డన్ భ్రమ గల్గ నేర్చునే?

చ. కలను సుషుప్తిలోఁ దెలివి • గల్గిన యప్పుడు నొక్కరీతిగా
వెలుఁగుచు బ్రహ్మ లాదిగఁ బి • పీలికముల్ తుదిగా జగంబులోఁ
గలయవి తాన యై నెగడు • జ్ఞానమె నే నిఁక నొండు లేమ నాఁ
గల శ్వపచద్విజుల్ గురుని • కైవడిఁ బూజ్యులు నాదుబుద్ధికిన్.

శా. తానే బ్రహ్మము మూఁడులోకములుఁ దై • తన్యాకృతు ల్మాయచేఁ
గానంగానగు సర్వమున్ గడమ నేఁ • గల్పింతు నంచున్ సుఖ
శ్రీనిత్యం బగు నిర్మలాత్మనెపుడున్ • జింతించువాఁ డంత్యజుం
డేనిన్ సద్విజుఁ డేని సద్గురునిఁగా • నీక్షింతు బుద్ధిన్ సదా!

ఉ. శ్రీగురువాక్యపద్ధతి న • శేష జగంబు నశించు శాశ్వత
శ్రీగను బ్రహ్మచింతనము • చేయుచు బుద్ధికి శాంతిఁ గొల్పి భూ
తాగమదుష్కృతద్వయము • నారసి జ్ఞానవరాగ్నిఁ గాల్చుచో
నీగికి నయ్యె సంచితము • నేర్ప శరీరము నాదుబుద్ధికిన్!

మ. ఎది తిర్యఙ్నరదేవసంఘములచే • నే నంచుఁ బల్కించు నిం
కెది సర్వేంద్రియహృచ్ఛరీరవిషయా • హీనప్రకాశాకరం
బెది నిశ్చేతనసంవృతం బగుచు, భా • యేశాకృతిన్ వెల్గు న
య్యది జ్ఞానం బని కాంచు యోగనిరతుం • డాచార్యుఁడే బుద్ధికిన్!

ఉ. ఏపరమాత్మచిత్కళ శ • శీకముఖామరసౌఖ్యవార్ధి యా
నేపరమాత్మఁ గాంచి మును • లెంతయు శాంతమతిన్ సుఖింపనా
నాపరమాత్మ సౌఖ్యనిధి • నాత్మ నెఱుంగుచుఁ దానె బ్రహ్మమౌ
నేపురుషుం డతండె తగు • నింద్రవతిన్ గొన నాదుబుద్ధికిన్!

క. అని శ్రీశంకరు లద్వై
తనిరూఢిం బల్కినట్టి • తత్వార్థంబుం
గని తెనిఁగించితిఁ గైకొను
మనంతతేజోనిధీ! మహాత్మ! చిదాత్మా!

# THE LEADERS OF SOUTH AFRICAN INDIANS.

Lord Ampthill.



ఆంప్తిలు ప్రభువు.

Mr. L. W. Ritch.



రిచ్ గారు.

Mr. Kallenbach.



కాలెన్‌బాక్ గారు.

Mr. G. K. Gokhale.



గా॥ జి. కె. గోఖలే గారు.

REV. J. J. Doke.



జె. జె. డోక్ గారు.

Sir M. M. Bhownagree.



సర్ భావనగరి గారు.

Mr. H. S. L. Polak.



పోలకు గారు.

Mr. Hosken.



హాస్కెను గారు.

# ఆంధ్రవిశ్వవిద్యాలయము

డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు, బి. ఎ., ఎమ్. బీ., సి. ఎమ్.

ఆంధ్రోద్యమముయొక్క వివిధాంశములలో తక్కువ వివాదనీయ మైనదియు, ఎక్కువ జనసమ్మత మైనదియు విశ్వవిద్యాలయాపేక్షయే. సర్వవిధములను విద్యావ్యాప్తి నభిలషించు నీ దినములలో మన రాజధానియం దింకొక విశ్వవిద్యాలయము నపేక్షించుట అనాక్షేపణీయము. రాను రాను, దేశాభ్యుదయము హెచ్చినకొలఁది, ఆంధ్రదేశమునం దొక విశ్వవిద్యాలయమును, కన్నడ దేశమునందును అఱవ దేశమునందును మలయాల దేశమునందును ఒక్కొక్క విశ్వవిద్యాలయమును స్థాపింపవలసిన సుదినమును మనము చూడ వచ్చును. రాష్ట్రములవలెనే విశ్వవిద్యాలయములు గూడ భాషాప్రయుక్తములుగ నుండవలె ననుట సహేతుకమనియు దేశాభివృద్ధికి సహాయకర మనియు ముందు చూపఁగలము.

విశ్వవిద్యాలయ మనిన పాఠములను నిర్ణయించు పాలకుల సంఘము గాదు. విద్యావిధానమును నియమించు పరిషదమును గాదు. వీ రెల్లరు నలంకరించు భవనము గాదు. పరీక్షలు గావు. ఉపాధ్యాయులు గారు. విశ్వవిద్యాలయ మనిన విజ్ఞానవృద్ధికొఱకు పాటుపడు విద్యార్థుల సముదాయము. విజ్ఞానవంతు లగు విద్యాధికుల సంఘము కాదు. ఈ సముదాయమునందు విద్యాధికు లుందురుగాక. విద్యాధికులు, జ్ఞానవంతులు, అనుభవజ్ఞులు, సుశీలురు—వీ రెల్లరును విశ్వవిద్యాలయములను బలపఱచినను, వానియొక్క ముఖ్యాంశములు గానేరరు. ఇట్టివారు విద్యార్థులే. మఱియు నెప్పుడు బోధకులు విద్యార్థులుగ నుండరో, యప్పుడే వారు ఉపాధ్యాయులుగ నుండఁజాలరు. ఇట్టి విద్యాలయమునందు సామర్థ్యతారతమ్యములు, జాతిమతభేదములు, భాగ్యాభాగ్యవ్యత్యాసములు నెన్నఁడును గమనింపఁబడఁగూడదు. పరీక్షలు పరమాదర్శములు గావు. విద్యాశిక్షకు అవి యొకవిధమగు సహకారులు. ఈ ప్రమాణమును బట్టి చూడ మన చెన్నపురి విశ్వవిద్యాలయమును ఆధునిక వ్యవహారమున నిర్దుష్ట మైన విశ్వవిద్యాలయముగఁ బరిగణింపఁజాలము. ఎన్నియో వేల మైళ్ల విస్తీర్ణము గల దేశములో నచ్చటచ్చట అప్పుడప్పుడు స్థాపింపఁబడిన కళాశాలల నెల్ల కలపి యొక విశ్వవిద్యాలయ మని తలంచు పద్ధతి పూర్వకాలమున లండను విశ్వవిద్యాలయము యొక్క నిర్మాణము ననుసరించి అవలంబింపఁబడినది. కాని కడచిన 40సం.లలో పాశ్చాత్య విశ్వవిద్యాలయములు సంపూర్ణముగ మాఱి, లివర్పూలు, మాంచెస్టరు, బర్మింగుహామ్, షెఫీల్డు, లీడ్సు, బ్రిస్టల్ మున్నగు పట్టణములయందలి కళాశాలలే సంపూర్ణ విశ్వవిద్యాలయములుగ స్థాపింపఁబడినవి. హిందూదేశమునకు అసిస్టెంటు స్టేటు సెక్రెటరీ యగు మాంటాగ్యు గారు ఇట్లు చెప్పియున్నారు. "సుశిక్షయు ధర్మప్రవర్తనమును పాఠములవలన బోధింపఁబడఁదగినవి కావు. వీనియొక్క యావశ్యకము హిందూదేశములోని విశ్వవిద్యాలయములచే గమనింపఁబడఁజాలదు." ధర్మాభిలాష, దేశాభిమానము, సుశీలత మున్నగు గుణములను గఱపఁజాలని విద్యావిధానమును ఇంతకన్న నెక్కువ కఠినముగ ఖండించువా రెవరు నుండఁజాలరు. వీరి వాక్కులు మనకు పరమప్రమాణములు. 1913-వ సం. ఫిబ్రవరి నెల 21-వ తేదిని ఇండియా గవర్నమెంటువారు మన దేశమునందలి విద్యావిధానమును గూర్చి ఈ క్రింది మార్పులను గావింతుమని సూచించిరి. "విశ్వవిద్యాలయములయొక్క యధికారపరిమాణమును తగ్గించి, మొదట ప్రధానరాజధాను లన్నిటియందును ప్రత్యేకవిశ్వవిద్యాలయములను, అనంతరము ప్రతిరాజధానియందును ఆధునికపద్ధతిని మఱియొక్కొక విశ్వవిద్యాలయమును స్థాపించుట యావశ్యకము." ఇట్టి విశ్వవిద్యాలయములు వంగ

రాజ్యములో డక్కా పట్టణమునందును, నాగపూరు రంగూను పాటలీపుత్రము మున్నగు నగరములందును దొరతనమువారిచేతను, కాశీ ఆలిగర్ పట్టణములయందు ప్రజలచేతను స్థాపింపఁబడనై యున్నవి. వీని ముఖ్య లక్షణము లెట్టివి యనిన, విశ్వవిద్యాలయములకు చేరిన కళాశాలలన్నియు నొక్క పట్టణమందే యుండి, అందలి విద్యార్థు లెల్లరును కళాశాలలయొక్క ఆవరణమందే నివసించుచుందురు. ఇట్టి రీతిని స్థాపింపఁబడిన మహావిశ్వ విద్యాలయములు పూర్వము మన దేశములో బౌద్ధయుగమున వర్ధిల్లుచుండెను. నలంద తక్షశిల విక్రమశీల వారణాసి అమరావతి ధరణికోట మున్నగు స్థలములందలి విశ్వవిద్యాలయముల నిర్మాణమునే ఇప్పుడు పాశ్చాత్యులు అవలంబింప నపేక్షించుచున్నారు. ఆ ప్రతిష్ఠాపనము లందు ఒక్కొక్క దానిలో 10,000 మంది మొదలు 30,000 మంది వఱకును విద్యార్థులును, 116-1,500 మంది అధ్యాపకులును నివసించుచుండెడివారు. విశ్వవిద్యాలయములే మహాపట్టణములుగ నుండెడివి. విద్యార్థు లెల్లరును విజ్ఞానవాతావరణములో నుండెడివారు. అట్టి కాలము అట్టిరాజ్యములు అట్టినిర్మాణములు — అన్నియు నశించినవి. ఆ భవనములతో నిప్పటి కళాశాలలను బోల్చి చూచ, రాజాధిరాజుల ప్రాసాదములకును, బజాఱుకొట్లకు నుండెడి తారతమ్యము గనిపించుచున్నది.

మన రాజధానియొక్క విద్యావిషయిక కార్యము లొక్క విశ్వవిద్యాలయముచే నిర్వహింపఁబడఁజాలవు. చెన్నపురి రాజధానియందు విశ్వవిద్యాలయము చేరనై యున్న విద్యార్థులు 15,000 మందియు, కలాశాలలలోని వారు 6,000 మందియుఁ గలరు. వీ రందఱకును తగు సౌకర్యముల నొసంగుటకు మఱియొక విశ్వవిద్యాలయము కావలసియున్నది. హిందూదేశమం దంతటను 185 కళాశాల లుండఁగ, వీనికి 5 విశ్వవిద్యాలయములు మాత్రమే గలవు. కలకత్తా విశ్వవిద్యాలయము ఒక్కటి చాలకుండుటచే 1886-వ సం.న అలహాబాదునం దొకటి స్థాపింపఁబడెను. మఱియు నిప్పుడు దొరతనమువారు రంగూన్, పాట్నా, నాగ్పూరు, డక్కా పట్టణములందు వేఱువేఱు విశ్వవిద్యాలయములు స్థాపింప నిశ్చయ పఱుచుకొని యున్నారు. ఇందలి విద్యార్థు లెల్లరును పూర్వము కలకత్తాకు చేరియున్నవారే. పాశ్చాత్యదేశములయందలి స్థితి చూతుము. 4 కోట్ల జనమునకు 17, అనఁగా 25 లక్షల జనమున కొక్కొక్క విశ్వవిద్యాలయము గలదు. ఆక్సుఫర్డు కేంబ్రిడ్జి ఎడింబరో— వీనియందు 3, 4 వేలమంది విద్యార్థు లున్నారు. గ్లాస్గోలో 2, 3 వేలమందియు, మాంచెస్టరులో 1500 మందియు, వేల్సులో 1700 మందియు, తక్కినచోట్ల వేయిమందికి తక్కువగను విద్యార్థులు గలరు.

విశ్వవిద్యాలయముల సంఖ్యను హెచ్చించుట ఆవశ్యక మయినచో, వీని నెచ్చట స్థాపింపవలెను? 1912-వసం.న ఎడ్యుకేషనలు కౌన్సిల రగు గౌ. శివస్వామి అయ్యరుగారు మన రాజధానిలో చెన్నపురియం దున్న ఒక విశ్వవిద్యాలయము చాల దనియు, ఉత్తరమండలముల కొకటియు దక్షిణమండలముల కొకటియు పశ్చిమ మండలముల కొకటియు నుండవలె ననియు వ్రాసిరి. ఇట్లు విభాగములను నిర్మించుటయందలి యుద్దేశ మేమి? బొంబాయి గవర్నరుగారు కూడ ఆరాజధానిని గూర్చి ఇట్లే చెప్పియున్నారు. ఆయా విభాగములకు భాషా ప్రయుక్తము లగు భేదములు గలవు. భాష యనఁగా అయిదు బళ్లు కావు. అక్షరముల సముదాయము కాదు. మాటల ప్రోఁగు కాదు. దేశముయొక్క సంప్రదాయము విజ్ఞానము సభ్యత చరిత్ర ఊహాలు అభిలాషలు ఆదర్శములు— ఇ వన్నియు భాషయం దిమిడియున్నవి. మనుష్యునియొక్కయు సంఘముయొక్కయు వర్తనమును నిర్మించు బల మంతయు నందే యంతర్గతమై యున్నది. భాషను బట్టియే జాతియొక్క తత్త్వమును అభిరుచులను, మనోవృత్తులును స్థిరపడును. భాష భేదించినపుడు ఇవియును భేదించును. మొత్తముమీఁద భారతదేశమం దంతటను ఒక్క విజ్ఞానమును ఒక్క ధర్మమును ఒక్క రాజకీయాదర్శమును ఒక్క విధమగు ఏకీభావమును ప్రబలియున్నను, భారతజాతీయత, భారతీయు లెల్లరకు నన్ని విషయములందు నైక్యమును గల్పించుటవలనఁ

గాక, ప్రతిరాజధానియందును ప్రతిసంఘమునందును వారివారి వ్యక్తులను నిలిపి బలపఱిచి, అన్ని భాషలు మాట్లాడువారికిని స్వాతంత్ర్యత్వమును గలిగింపఁజేయుట వలననే సిద్ధి పొందవలసియున్నది. ఇట్టి పరిపాకము మాతృభాషాభివృద్ధివలననే కలుగును గాని, కేవల మాంగ్లేయవిద్యాభ్యాసమువలనఁ గలుగదు. కావున మన విశ్వవిద్యాలయములయందు మాతృభాషల నభివృద్ధి చేయవలసిన బాధ్యత మనపై నున్నది. ప్రస్తుతము, ఎఫ్. యే., బి. యే. పరీక్షలందు మాతృభాషలను నిర్బంధపఠనీయములుగ చేయవలె నని మన ప్రముఖులు చేయు కలవరము వ్యర్థ మనుటకు సందియము లేదు. విద్య నంతటిని మాతృభాషలలోఁ గలపి ఆంగ్లేయభాష నొక విషయముగ నెత్తుకొనుట యేవిద్యావిధానమునందు గమనింపఁబడునో అట్టి విధానమే నిర్దుష్టమైనది. అట్టిదే సార్థకమైనది. విశ్వవిద్యాలయములు నూతనముగ స్థాపింపఁబడినపుడు పాశ్చాత్యవిజ్ఞాన మంతయు నాంగ్లేయభాషలో నుండుటవలన ఆంగ్లేయభాషయే శిక్షామార్గముగ నుపయోగింపవలసిన యావశ్యక ముండెను. అట్టి యావశ్యకము కడు శోచనీయము. విద్యార్థులలో అనేకులకు భాషాప్రవీణత కాక జ్ఞానసంపాదనమే ఆదర్శమై యుండుటవలన, విదేశభాషలో శిక్ష నొందుటయు యోచించుటయు భాషించుటయు దుర్భరమగు విధికృత్యములుగ నున్నవి.

ఇట్లు జ్ఞాపకశక్తి వృద్ధిచేయఁబడినది గాని, విజ్ఞానము నభివృద్ధినొందింపఁగల యంతశ్శక్తి విజృంభింపలేదు. ఆంగ్లేయభాషాజ్ఞానమును విశేషముగ సంపాదింపఁజాలని విద్యార్థిసముదాయమునకు ఆంగ్లేయసాహిత్యకవిత్వములు నిరర్థకములు. మఱియు వీరి మేధావికాసమున కేమి వర్తననిర్మాణమున కేమి దేశీయసాహిత్యకవిత్వము లెంతయో సహకారులుగ నుండెడివి. వీరి హృదయంబులను గరఁగించుటకుఁ గాని వీరి మనంబులను రంజింపఁజేయుటకుఁ గాని వీని బలము మఱియొక దానికి నుండఁజాలదు. ఇట్టి ఫలితమును గోరెదమో, బాలురకు భావముల నెల్ల మాతృభాషలలోనే తెలుపవలెను. అప్పుడే విద్యావంతులకును ప్రజాసామాన్యమునకును దగిన యన్యోన్యానురాగమును, అన్యోన్యగౌరవమును గలుగును. ఇట్టి సంస్కారములతోఁ గూడిన విశ్వవిద్యాలయములను స్థాపించుట కెక్కువ పూర్ప్ప లావశ్యక మనియు, వాని యధికారపరిమాణమును తగ్గింపవలె ననియు, వానియందలి పాశ్చాత్యబోధకు లెల్లరును ప్రథమమున దేశభాషలను నేర్చుకొనవలసియుండు ననియు మన మెఱుఁగుదుము. కాని యెన్ని కష్టము లుండినను, ఈ సంస్కారములు గావింపఁబడునంతవఱకును మన విశ్వవిద్యాలయములు తమ ముఖ్యకర్తవ్యములను నెఱవేర్పఁజాలవు.

మన విశ్వవిద్యాలయనిర్మాణమువలన దేశమున కొక గొప్ప యాపత్తు సంభవించినది. "విద్య యనఁగా ఆంగ్లేయభాషాజ్ఞానమే. అట్టి విద్యలేని వాఁడు విద్యావిహీనుఁడు"—మొదలగు విపరీతభావములు దేశమునందు ప్రబలినవి. విద్యయొక్క ముఖ్యప్రయోజనము ప్రజ లెల్లరకు నొక విధమగు నైకమత్యమును గల్పించుచు, విద్యావంతుల జ్ఞానతేజస్సును ప్రజాసామాన్యముయొక్క యజ్ఞానాంధకారమును తొలఁగించుటకు సాధనముగ నుండునట్లు చేయుటయే. ప్రస్తుతావస్థయందు దీనికి బదులుగ ఆంగ్లేయవిద్యాధురీణులకును దేశీయవిద్యావంతులకును ప్రజాసామాన్యమునకును నడుమ నొక పెద్ద యఖాత ముత్పత్తియయినది. మనము చేయు సంస్కారము లెల్ల దీని నిర్మూలనము నుద్దేశించియుండవలెను. షెఫీల్డు విశ్వవిద్యాలయమునందు ఒక మరలోని కూలివాఁడు వేదాంతపఠనమును, మఱియొకఁడు తత్త్వవిచారమును, ఇంకొకఁడు శాస్త్రశోధనమును చేయుచున్నారు. ఇట్టి మనోవికాసము మన ప్రజాసామాన్యమున కేల మన విశ్వవిద్యాలయముల మూలమున లభింపరాదు? ఇందుకుఁ గల నిరోధము దేశభాషల యుపేక్షయే. కావున విశ్వవిద్యాలయములు గూడ భాషాప్రయుక్తములుగ నుండవలెను. మనదేశములో విశ్వవిద్యాలయములను భరింపఁదగిన యభివృద్ధి గల దేశభాషలు 10, 14 మాత్రమే గలవు. 31 కోటి జనమునకు 14 విశ్వవిద్యాలయములను స్థాపింపఁగోరుట అత్యాశ గానేరదు.

బాలుర ప్రవర్తననిర్మాణము విశ్వవిద్యాలయములయొక్క వివిధప్రయోజనములలో ముఖ్యమైనది. ఇది పుస్తకములవలనను పాఠములవలనను పరీక్షలవలనను సిద్ధించునది గాదు. విశ్వవిద్యాలయములయొక్క విజ్ఞానవాతావరణమే యిందులకు తోడ్పడవలెను. ప్రతికళాశాలయొక్కయు బాలుర జీవితశిక్షలను నిర్ణయించు సంప్రదాయ మొకటి కాలక్రమమున నుత్పత్తి కాఁగలదు. కాని మన చెన్నపురి విశ్వవిద్యాలయమునకుఁ జేరి

యున్న కళాశాలలలో నొక్కదానికైన నిట్టి సంప్రదాయము కల దని చెప్పఁజాలము. దేశములో నెల్ల ఒకే విధమైన కళాశాలలను వ్యాపింపఁజేయుటవలన, బాలుర యూహలును అభిలాషలును ఆదర్శములును పరీక్షలతో ప్రారంభమై వానితోనే యంతమగుచున్నవి. దేశాభిమానము, సంఘసేవ, పరోపకారము, జాతీయజీవనము, జీవిత సంస్కారము, చిత్తశుద్ధి, పవిత్రప్రవర్తనము మున్నగు లక్షణముల కించుకైనను చోటియ్యకుండ నున్నవి. ఇట్టి మహాదాదర్శములచే బాలుర ముఖంబులు ఆశావికాసముతో నిండియుండుటకు బదులు క్షణభంగురము లగు జయాపజయముల విలక్షణములచే పూరితములై యున్నవి. ఇట్టి యాపత్తును నివారించి విశ్వవిద్యాలయము యొక్క ముఖ్యప్రయోజనమును సిద్ధింపఁజేయుటకుఁగాను ఒకప్రక్క ఆధునికపాశ్చాత్యవిజ్ఞానమును అభ్యసించుచు, ఇంకొకప్రక్క మనదేశపు ప్రాచీనచరిత్రలను శాస్త్రములను విజ్ఞానమును బఠింపవలెను. ఇవియే దేశము యొక్క ప్రత్యేకసంప్రదాయములు. వీని సముదాయమే జాతీయవ్యక్తికి హేతుభూతము.

మన దేశములో నింకను సర్వకలాశాలలను స్థాపింపవలె నని చెప్పు వాదము లన్నియు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకుఁ గూడ తగిన కారణములుగ వర్తించును. ఆంధ్రులు రెండుకోట్లకు మించియున్నారు. వీరిలో కొందఱు మైసూరు నైజాము రాజ్యములలో నివసించుచున్న కారణము ప్రత్యేకాంధ్రవిశ్వవిద్యాలయమునకు నభ్యంతరముగ వర్తింపఁజాలదు. ఆంధ్రు లెక్కడ నున్నను, ముఖ్యముగ కలసియున్న ప్రదేశములలో నున్నపుడు, పరిపాలనాభేదములు విద్యావిధానమునకు నిరోధములుగ నుండవు. ఆంధ్రులు బుద్ధిశాలు లనుట లోకవిదితము. కావుననే విశేషవ్యయముతోఁ గూడిన విశ్వవిద్యాలయ స్థాపనమువలన వారు తగుకొలఁదిని ప్రయోజనమును పొందఁగల రనుటకు సందియము లేదు. వారి ప్రస్తుతపు విద్యాభివృద్ధి కొంతవఱకు వెనుకఁబడియున్నను, ఇది యనివార్యము లగు కారణాంతరములచే సంభవించినది గాని వీరి లోపమువలనఁ గలిగినది గాదు. చెన్నపురి విశ్వవిద్యాలయమునకు చేరియున్న ముప్పదిమైదు కలాశాలల లోను, రాజధానిలో సగము విస్తీర్ణము గలిగిన యాంధ్ర దేశమున మొదటి తరగతివి మూఁడును, రెండవ తరగతివి మైదును మాత్రమే గలవు.

అదియును గాక, కడప కర్నూలు బళ్లారి అనంతపురము చిత్తూరు నెల్లూరు — ఈ యాఱు జిల్లాలయందును నొక్క కలాశాల యైనను లేదు. మఱియు విశ్వవిద్యాలయమునెుక్క ముఖ్యస్థానము బరంపురమునుండి 658 మైళ్లను నంద్యాలనుండి 366 మైళ్లును దూరముగ నుండి, ఆంధ్రదేశమధ్యస్థానమునకు అతిదూరమైయున్నది. ఆంధ్రులు వర్తక వ్యవసాయిక పరీక్షలకు చదువుటకు కోయంబుత్తూరు కేలికట్ పట్టణములకు పోవలసియున్నారు. ఇంతంత దూరములు ప్రయాణము చేయవలసియుండుటయు మొన్న మొన్నటివఱకును రైలు లేకపోవుటయు నాంధ్రుల విద్యాభివృద్ధికి ప్రబలాటంకములుగ నుండినవి. ఎప్పు డొక దేశమధ్యమున విశ్వవిద్యాలయము స్థాపింపఁబడునో అప్పు డా దేశస్థుల విద్య కుత్సాహము కల్పింపఁబడును. 1886-వ సం. లో స్థాపింపఁబడిన అలహాబాదు విశ్వవిద్యాలయ మిందుకు నిదర్శనము. పూర్వ బంగాళా రాజధానియందలి జనుల విద్యాభివృద్ధి కొఱకు ప్రత్యేకసౌకర్యములను గల్పించుటకే ఢక్కా పట్టణమునందు విశ్వవిద్యాలయము స్థాపింపఁబడనైయున్నది. రంగూను నాగపూరు పాటలీపుత్రము — ఈ పట్టణములలో స్థాపింప నిశ్చయింపఁబడిన విశ్వవిద్యాలయముల ముఖ్యోద్దేశము నిదియే.

మఱియు ఆంధ్రదేశమునెుక్క ప్రత్యేకావశ్యకములు కొన్ని యాంధ్రవిశ్వవిద్యాలయమువలననే నెఱవేర్పఁబడవలసియున్నవి. అనాదినుండియు దేశకాలానుగుణ్యముగనే విశ్వవిద్యాలయములు స్థాపింపఁబడినవి. ఆంధ్రదేశమునందలి భూగర్భము ఖనిజభాగ్యములతో నిండియున్నది. అట్టి భాగ్యమును వాణిజ్యమూలమున ప్రజల కందఁజేయుటకు తగిన విద్యను గఱపు ప్రత్యేకవిద్యాలయ మం దుండవలెను. రోస్బెరీ ప్రభువు చెప్పినట్లు ప్రతి పట్టణమునకును పట్టణపుఁగొఱఁతలను దీర్చునదియు పౌరభాగ్యములలో నగ్రస్థానము వహింపఁదగినదియు నగు నొక విశ్వవిద్యాలయ ముండవలెను. అట్టిసందర్భమున పట్టణమునకుఁ గాక, మండలమునకుఁ గాక, 70,000 చదరపు మైళ్ల విస్తీర్ణము గల ద్వాదశమండలముల కొక విశ్వవిద్యాలయము నభిలషించుటయం దేమి విపరీతము గలదు?

# గురుదక్షిణా నవరత్నములు

వడ్డాది సుబ్బరాయకవి ప్రణీతము

హరిభక్తి చిఱుతప్రాయమునందు నాడెందమునఁ బాదుకొల్పిన పుస్తకంబు,
"కవి వేల్పె, మర్త్యుండు గాఁ" డంచు నాకు బాల్యమునఁ దోఁపించినయట్టి గ్రంథ,
మాఱవయేఁట మాయయ్య, నన్ వాచకతాప్తికిఁ జదివించినట్టి సుకృతి,
కవితకై మున్ను నాకన్నిట వెన్నునియడుగులు గడిగించినట్టి కబ్బ,
మంద్రమున, భాగవత మంతరంగమూఁప, । వ్యాసభణితము గరఁగి, తదర్థ మమరఁ
బోఁత వోసిన బమ్మెర పోతరాజు । మృదులపదముల కెదను మ్రొక్కెదను దవిలి. 1

సీ. స్థాపించె నృపభీతి ధరణిగర్భమునందు విత్తభాండముఁబోలెఁ బొత్త మెవఁడు,
నడిపించె మడి నేఁడు సడలించి నట్టిల నేటిజాలట్లు నాఁగేటిచాలు,
మఱఁగించె నెవఁడు, టిప్పణిఁ బోలె బావిఁ జప్పుడుచేసి, సిరిపద్యమునకు శంక,
బ్రదికించెఁ "గమరినబాలఁ", గాలిసతీఁగ వానవోలె, నమోఘువాణి నెవఁడు,
శౌరి గార్చిచ్చుకరణి, సంసరణసరణి । నోర్చె నిప్పచ్చరము, మాన ముడుగ కెవ్వఁ,
డట్టి బుధరాజు, హరిభక్తి హస్తిరాజు, । పుట్టుకవిరాజు, బమ్మెర పోతరాజు 2

తే. పొడుపుగుట్టను గ్రహరాజు పొడుచునట్టు । పోతరా జొంటిమెట్టను బుట్టినాఁడు;
రోదసిని సాంద్రమై యుష్ణరుచియుఁ బోలె, । నంధ్రమున విష్ణురుచి హెచ్చి, యడఁచె జడత. 3

మ. ఉదధిప్రాయనియోగిగోత్రఖనిగర్భోద్భూతసద్రత్నముల్
గద, యాంధ్రావనిఁ దిక్కనాదిసుకృతుల్; తన్మధ్యగణ్యుండు కో
విదుఁ డా పోతన; చాల వెన్న నతనిన్ వేనోళులుర్విన్, భారతీ
వదనాశ్రుప్లుతినోదనకుమసృణావాసుం డతం డల్పుఁడే? 4

సీ. రాజరాజేంద్రసామ్రాజ్యభోగములందు నన్నయభట్టు పాల్గొన్నవాఁడు,
మనుమసిద్ధిక్షమాచక్ర మరుదారఁ దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాఁడు,
వీరభద్రారెడ్డి విరివిమా విభవంబు శ్రీనాథుఁ డెంతో భుజించినాఁడు,
రాయలయొద్ద గారవమొంది పెద్దన్న, యెక్కి యందలము నూరేగినాఁడు,
వెలుఁగుపడనేల వారి కవిత్వమునకు? । బ్రదుకుపై యాస కూడను బాడుసేయు
ఘోరదారిద్ర్యదుఃఖంబు గుడుచు చకట! । యేగతిని బల్కెఁ బోతన్న భాగవతము! 5

మ. పలికించుం దను రామభద్రుఁ డనుచున్ భాషించుఁ బోతన్న; య
ప్పలుకుం దప్పక నమ్మఁగావలయు; యావజ్జీవమున్ దీవ్రమా
ననుపుం బెట్టు నకించనత్వదురవస్థన్ గ్రాఁగు మర్త్యుండు, ని
శ్చలుఁడై పల్కఁగలండె భావరసభూషాభాసురోద్గ్రంథమున్? 6

మ. కవులం దొక్కని కొక్క పోకడ నిసర్గం బెన్నఁ; బోతన్నకుం
జవి యా నంత్యపుసీమ; మంతటి మహాచాతుర్యశిల్పంబు వే

ఱెవర్కున్ జూపరు భేదకంబుల; నతండే మేటి యం, దద్ది త
త్కవితాకన్యకుఁ బుట్టుమచ్చ; శుభలక్ష్మం బంగమచ్చంబునున్. 7

శా. చేయుం బోతన, యచ్చ రాఁగ ద్రుతసంశ్లేషంబు, గీర్వాణపుం
జాయన్; లాక్షణికుల్ దెలుంగునను దోసం బందు రాసంధి; బ్రా
లేయాభీషుముఖీకపోలమున మొల్పించెం గటా! పుల్విరిన్,
మాయంపున్విధి; పోతరాజకృతి కీ మాలిన్య మంటెంగదా! 8

మ. "చతురుం డీతఁడు విద్యయం" దనుటకున్ సామాన్యవాక్యంబు "భా
రతమున్ భాగవతంబుఁ బాఱఁ జదివెన్ రామాయణం" బండ్రు; సా
మెతగా వాడెడు మూఁట, రెండవది నిర్మించెన్ గదా పోతరా ;
జతనిన్ సంస్మృతి సత్కరింతు రెవ, రయ్యాంధ్రుల్ కృతజ్ఞుల్, కృతుల్. 9

మ. మతిలో డాఁగిన వేఁబదేండ్లపయి వా మాటల్ బయల్పుచ్చుకొం
చతిభక్తిన్ నవరత్నమాల వసురాయం డిచ్చుఁ బోతన్నకున్
నతితోడన్ గురుదక్షిణన్, ఋణము వో; నందాత్మజాఖ్యంపుఁ ద
చ్ఛతకంబుం గనఁ, గావె వారి గురుశిష్యన్యాయముల్ స్పష్టముల్? 10

కవిప్రశంసా పంచరత్నములు

చ. నవరససృష్టిఁ జేసి వదనంబులవాడును దీర్చు, గూఢ మా
వివిధములైన భావములు వెల్లడిసేయుఁ, బ్రబోధ మిచ్చి క
న్గన దెలివుం, బదంబు లిడఁగా నగు సందియముం దొలంచుఁ, స
త్కవి, రవిభాతి; నాతఁ డెటఁ గల్గఁడు చీఁకటి గాదె యాకడన్. 11

శా. కాయంబున్ విడియున్, నిజాక్షరయశఃకాయంబుతో మేలుపా
ధ్యాయుల్ వోలెను, మంచిసెబ్బరలు విద్యాబుద్ధులు న్నేర్పి, ముం
దీయా లోకములన్ సుఖంపడు పథం బేవారు చూపింతురో,
యాయయ్యల్ కవు లన్హా లర్చితులు గా, నాచంద్రతారార్కమున్. 12

ఉ. భారతపారవేశను, బ్రభావతిపెండ్లిఁ బఠించునప్పుడున్,
గోరిక లూర కూరుఁ గద, కొమ్మనతిక్కన సూరనన్ గనన్;
వారలనాఁటివార లలవారలరూపు లుపేక్ష నిల్పమిన్,
సీరను గీఱ తొాచు నవి, నెమ్మది కుమ్మలికన్ ఘటించెడున్. 13

క. హరిగుణంబులు గలిగిన। వారికి, గోరములు చాల వన్నె యె దెచ్చున్;
ధీరుఁడు కవిపోతన్నకు। దారిద్ర్యము మిగులఁ బొగడితకె యయ్యెఁగదా! 14

క. దేవునిసృష్టివిలాసము। కోవిదుఁ డగు కవి గ్రహించి కొనియాడుఁ గృతిన్;
మావుల చైత్రవికాసము। కోవెల గని చెవులు సొాగియఁ గో యని కూయున్. 15

క. ఆనందవర్షభవుఁ దను। నానందాబ్దాదిసంచికార్థ మడుగ, ని
వ్వానందిత వసురాయఁడు। దా నందించును బదా ఋదారుల కొప్పన్. 16

# ఆంధ్రభాష

జనమంచి శేషాద్రిశర్మ గారు

ఇక్కాలమున నాంధ్రభాషావృద్ధికిఁ దగిన ప్రయత్నములు సాగుచున్నవి. జనసామాన్యమునకు భాషయందు మహానురాగము గల్గినది. ప్రాచీనాంధ్రగ్రంథములు నిర్దుష్టములుగ ముద్రింపఁబడుచున్నవి. పుస్తకమన నెట్టిదో యెఱుఁగనివారు కూడ పొత్తములం దెప్పించుకొని చదువఁబూనుచున్నారు. అందుకు వీలు లేకయున్నఁ జదివించుకొనుచున్నారు. మితిమీఱి సముద్రతరంగములవలె గ్రంథములు బయలువెడలుచున్నవి. పత్త్రికాధిపతులు భాషావృద్ధి కావలయు నని తమకు వీలున్నంత సహాయము చేయుచు నితరులను బ్రోత్సాహపఱచుచున్నారు. నాటకములు, చిత్రకథలు దినదినప్రవర్ధమానము లగుచున్నవి. దృష్టి సారించి చూచినచో నాంధ్రభాషాసాధ్వి ప్రౌఢావస్థను బొందనున్నట్లు కనఁబడుచున్నయది. క్రొత్తక్రొత్త యలంకారము లమర్పఁబడుచున్నవి. ప్రతి గ్రామమునను గవులు బయలుదేరుచున్నారు. అవధానములు పెంపు నొందుచున్నవి. కవుల కైకమత్య ముండుటకు మాఱుగా మాత్సర్యములు హెచ్చుచున్నవి. "స్పర్ధయా వర్ధతే విద్యా" యను న్యాయము నుదహరించి యీ మాత్సర్యములు వృద్ధిహేతువులే యని కొందఱు తలంచి వానిని బలపఱచుచున్నారు. ఏది యెట్లుండినను మొత్తముమీఁద బాగుగ యోచింప, భాషాభివృద్ధి యగు కాల మిది యని తోఁచుచున్నది. శ్రీకృష్ణదేవరాయలవంటి మహాప్రభువుల యవలంబనము లేకపోయినను, పరమేశ్వరానుగ్రహముచేత నాంధ్రు లన్నవారి కెల్ల గ్రంథములను జదువు నాసక్తి హెచ్చుచున్నది. హూణభాషఁ జదువుకొను విద్యార్థులును, నాటకములు, అద్భుతకథలు మొదలగువానిని వ్రాయుచున్నారు. ముద్రితములై నవీనగ్రంథములు ప్రతిక్షణవిలక్షణములై యలరారుచున్నవి. భాషాపోషకసభలు వెలయుచున్నవి. అ సభలనుండి సులలిత గ్రంథములు బయటవచ్చి సరసజనదృక్పథముల నర్తనము సలుపుచున్నవి. కొందఱు సభల నేర్పఱుపఁబూనుచున్నారు. కొంద ఱా ప్రయత్నమును జేయనున్నారు. ఏయూరఁ జూచినను స్వభాష వృద్ధికావలయు నను ప్రౌఢవాక్యములు వినఁబడుచున్నవి. వార్తాపత్రికలను జదువువారు వృద్ధి యగుచున్నారు. స్వభాషతో నుపన్యాసములు చెప్పుట కలవాటు చేసికొనుచున్నారు. ఔరా! ఆంధ్రమహాజనుల భాషాభిరతి! ఆహా! ఆంధ్రభాషాసాధ్వీమణి ప్రౌఢావస్థ!

పై విషయముల నన్నింటిని జూడఁగా భాషాభివృద్ధి యగుచున్న దని తేలకమానదు. ఐనను దీని కొక కొఱంత గలుగుచున్నది. అది కనిపెట్టువారు సాధారణముగ లేరు. ఆ కొఱఁత సామాన్యదృష్టికిఁ గనఁబడక పోవుటయే గాక వృద్ధిహేతు వని కూడ గోచరించును. ఐన నేమి? దీర్ఘాలోచన గలవారు కొందఱు దానిని గనిపెట్టి తొలఁగింప నెంచుచున్నారు. అది యేమని మీ రడుగుదు రని నే నెఱుఁగుదును. అది యిదియే.

"భాష సర్వజనసామాన్యముగ నర్థ మగుచుండవలయును. గ్రంథములు స్త్రీబాలవృద్ధముగా నన్వయింపఁదగి యుండవలయును. అందఱును వ్రాయఁదగిన స్థితిలో నుండవలయును. ఆంధ్రభాష వృద్ధి నొందుట లేదు. కావున నిందులో లేని పదములను సంస్కృతమునుండి గ్రహింపక నానావిధభాషలనుండియు నిష్టానుసారము గ్రహించి మాటలాడునట్లు వ్రాయుచుండుమేని భాష విస్తరిల్లి గ్రంథములసంఖ్య వృద్ధియై యొక యపూర్వవిఖ్యాతి మనకుం గలుగును."

ఆర్యవరేణ్యులారా! చక్కఁగ గమనింపుఁడు. నానాజాతులవారును నానావిధముల మాటలాడుదురు. ఒక జాతివారి భాష యింకొక జాతివారికి నింపుగ నుండదు. సర్వజనులకుఁ దెలియునట్లు గ్రంథములు వ్రాయవలయు ననుట పొసఁగని మాట. మాటలాడునట్లు వ్రాయవలయు ననుటయు సమంజసము కాదు. లోకవ్యవహారము అందఱితో మాటలాడకున్న జరగదు.

చదివినవారు నిరక్షరకుక్షులు కలిసి మాటలాడునపు డక్షరాస్యుఁడు నిరక్షరకుక్షికిఁ దగిన భాష నుపయోగింపక తప్పదు. ఆ మాటలే గ్రంథముల కెక్కినా ఆ గ్రంథముల వైఖరి చెప్ప నక్కఱలేదు. వైఖరి మాట య టుండనిండు. ఆంధ్రదేశమునం దంతటను ఒక్కరీతి జనులు మాటలాడుట లేదుకదా! ఒకవైపున నున్నవారి మాట లింకొక వైపున నున్నవారికి విరుద్ధార్థము నిచ్చును. అసహ్యముగఁ గూడ నుండును.

మఱియు గ్రామ్యభాష ప్రతిక్షణమును మాఱుచుండును. దేశాంతరజను లెందఱో వచ్చి యాంధ్రభాషను నేర్చుకొని తమతమ భాషాపదములను మెల్లమెల్లనఁ జొప్పింతురు. వారి సహవాసము చేయుచున్న వారికిఁ దప్పఁ దక్కినవారి కవి బోధపడవు. అట్టివారు గ్రంథములు వ్రాసి రేని వారే వ్యాఖ్యానము కూడఁ జేయవలసియుండును. ఒక్కొక్క జిల్లావారి కొక్కొక్క విధముగఁ బుస్తకము లేర్పడవలసివచ్చును.

ఇట్టి యిక్కట్టుల నెఱింగియే పూర్వులు "ఇహతు ప్రవ్యాహార్యం సంకేతితసుప్రసిద్ధ మేవ పదమ్" అని నియమించిరి. దేశ్యపదము లాంధ్రదేశమందలి యన్నిదిక్కులవారికి నన్వయించును. కావున గ్రామ్యభాషను మాని గ్రంథములు వ్రాయుట సమంజసము.

ఒకవేళ గ్రామ్యపదములతోడనే గ్రంథములు వ్రాసి రేని ప్రాచీనగ్రంథములు దుర్బోధకములుగఁ దోఁచు. వానిని బఠించుట నిలిచిపోవును. అట్లగుచేని భాషాజ్ఞానము కృశించి యంతరించు. మతమే క్రమక్రమముగ ప్రాచీనగ్రంథ పఠనము లేమి క్షీణించు.

కావున నట్టి ప్రయత్నమును మాని వలసిన పదములను గల్పించుకొని సంస్కృతములో నున్నవానిని గ్రహించి భాషను వృద్ధిచేయవలయు నని మహాజనులకు విన్నవించువాఁడను.

# ఆంధ్రకవితా వర్తమానస్థితి

గో. రమాకాంతాచార్యులు

భువనంబందు సమస్తవస్తుహృదయంబుల్ చొచ్చి తత్తద్రహస్యవిశేషంబుల నక్షరాకృతి నలేఖ్యంబైన చిత్రంబులన్ గవి గాకెవ్వఁడు వ్రాయ నేర్చు? కవి కానన్ లేని యర్థంబులన్ గవి కాంచంగలఁ డన్న సూక్తి వినమే? నానావిరుద్ధార్థవస్తువులన్ గూడఁ గవీంద్రమానససరశ్శుద్ధామృతస్నానభిన్నవిరోధం బయి స్వస్వరూపరుచిసౌందర్యంబుతోఁ గావ్యసృష్టి విరాజిల్లు; నచేతనంబులును వాక్సిద్ధిం గనంబోలు! సత్కవి సాన్నిధ్యమునన్ సదా ప్రకృతి గుప్తజ్ఞానసర్వస్వమున్ నవలావణ్యరసాదు లెట్లతనికిన్ గన్పట్టు లేకున్నచోఁ? బువులన్ దీవలు పర్వతంబులు నదుల్ మూకత్వము న్మాని తత్త్వవివేకం బుదయింపఁజేయఁ గనమే ధర్మోపదేశంబు? మానవహృద్వర్తిసమస్తదుఃఖసుఖముల్ నానాప్రకారప్రజావ్యవహారంబుల వ్యూహభేదములు దివ్యజ్ఞాననేత్రంబుచే నవలీలం గ్రహియించుచున్ నవరసవ్యాహారలీలావిలాసవిధానంబుల విశ్వనాటకమునన్ సర్వజ్ఞుఁడై, తన్మయత్వవిధిన్ బాత్రగుణాగుణప్రకటనప్రావీణ్యముం జూపుఁ; దత్కవనం బన్నఁ జరాచరాత్మకజగత్సౌందర్యసాదర్శమే యవుఁగా; యట్టి మహాకవీశ్వరులు మృగ్యంబైరి; తన్మార్గముల్ చవిగావయ్యె నవీనపుంగవులకున్; సాహిత్య మ స్వేర శబ్దవిడంబంబును జూపి కొందఱును, ఛందశ్శాస్త్ర మ స్వేర బంధవిదగ్ధత్వముఁ జూపి కొంద, ఱవధానం బాశు వ స్వేర జ్ఞప్తిబలోద్వృత్తులఁ జూపికొంద, ఱఖిలాధ్యేతవ్య మ స్వేర గ్రామ్యవచోధోరణిఁ జూపి కొందఱును, మోహంబెట్టి లోకంబు, మా కవితామానవతీస్వభావమధురాకారంబు గాసింతు రో యవివేకంబ! సహింపలేము భవదీయచ్ఛాత్రనానాప్రకారవిహారంబు; తొలంగు మాంధ్రవిషయగ్రామాంతసీమావధిన్.



The Madras High Court

చెన్నపురి హైకోర్టు



The Government House and Banqueting Hall

గవర్నమెంటుభవనము, బాంకెటింగుహాలు




The Parthasarathy Temple & Tank



Procession of an Idol



The Victoria Public Hall

Photos by Messrs Weil & Klein and Venkiah Pros.

# విద్యవలని ముఖ్యప్రయోజనము

వెలిదండ శ్రీనివాసరావుగారు

లోకములో విద్య నభ్యసించువారు చాలమంది యున్నను, దాని ప్రయోజనమును బాగుగా గ్రహించినవారు మిక్కిలి అరుదు. విద్య అనగా నేమి? అది "తెలిసికొను" అనునర్థ మిచ్చు "విద్" అను ధాతువు నుండి పుట్టినపదము. విద్య అనగా తెలిసికొనుట యని యర్థము. దేనిని తెలిసికొనుట? మనము ఎక్కడనుండి వచ్చితిమి? ఈ ప్రపంచమున మన మేమి చేయవలయును? ఇకముందు మనగతి ఏమి? ఈవిషయములను స్త్రీపురుషులను భేదము లేక సమస్తజనులును తెలిసికొనవలసియున్నది. సమస్తజీవరాసులును, దృగ్గోచరములగు సమస్త వస్తువులును భగవంతునినుండి పుట్టి భగవంతునియందే పెరుగుచు తుదకు భగవంతునియందే లయించు నని స్వానుభవముచేత కొందరు బుద్ధిమంతులు గ్రహించియున్నారు. అనగా మన కెల్లరకును ఆధారభూతుడు భగవంతు డనియు, కావున ఆయనను దెలిసికొనుటయే మన జీవితాదర్శమనియు మనము బాగుగా నమ్మవలసియున్నది. మరియు భగవంతుడు మన బాహ్యేంద్రియములకు గోచరముగాని మనయాత్మలకు ఆత్మయైయుండుటయే గాక దృగ్గోచరమగు బాహ్యప్రపంచమందలి చరాచరాత్మకంబగు సమస్తపదార్థములకును నాత్మయై అలలయందలి సలిలమువలె వ్యాపించియున్నాడు. కావున ఆయనను తెలిసికొనుటకు రెండుమార్గములు గలవు. (1) మన ఆత్మజ్ఞానముచేత. (2) బాహ్యప్రపంచజ్ఞానముచేత. ఈ రెండుమార్గములకును దగినట్లు విద్యలును రెండు విధములుగా నున్నవి. అవి పరవిద్య యనియు అపరవిద్య యనియు పిలువబడుచున్నవి. పరవిద్యవలన ఆత్మజ్ఞాన మలవడును; అపరవిద్యవలన ప్రపంచజ్ఞాన మలవడును. ఈ రెండువిద్యలవలని ముఖ్యప్రయోజనము భగవంతుని దెలిసికొనుటయే. ఈ రెండువిద్యలలోను, పరవిద్య శ్రేష్ఠమైనను కష్టతరముగా నుండుటచే, సామాన్యజనులు ముందుగా అపరవిద్యను గ్రహించి తదనంతరము పరవిద్యను బొంది తమ జన్మములను సార్థకముగ జేసికొనుచున్నారు.

మన మిప్పుడు పాఠశాలలయందుగాని గృహములయందుగాని నేర్చుకొనువిద్యను అపరవిద్యయని చెప్పవచ్చును. ఈవిద్యవలన మనకు ప్రపంచజ్ఞానము వృద్ధియగుచున్నది. ఇట్టి ప్రపంచజ్ఞానము వృద్ధియైన కొలదిని ప్రపంచమునందు సర్వత్ర వ్యాపించియున్న భగవంతుని దెలిసికొనుచున్నాము. అట్టి యుద్దేశము లేని విద్య నిరర్థకము. అట్టియుద్దేశమునకు సహాయము కాని విద్య నిష్ప్రయోజనము. అట్టి యుద్దేశమునకు విరుద్ధమగు విద్యను పొందగూడదు.

భగవంతుడు మన మనస్సాక్షిద్వారమున కొన్ని నీతులను దెలిపియున్నాడు. అట్టి నీతులను సమకూర్చి బుద్ధిమంతులు కొందరు పుస్తకరూపమున పదిలపరిచియున్నారు. మనస్సాక్షి, సర్వసాధారణముగా పెక్కండ్రయందు మందస్థితియం దుండుటచే, అట్టినీతులను వారికి సరిగా మొదట తెలుపకపోవుటవలన, అట్టివారు పుస్తకములయందలి నీతులను గ్రహించుచున్నారు; ఆ నీతుల ననుసరించుటవలన భగవంతుని యాజ్ఞలను చెల్లించుచు ఆయనను తెలిసికొనుటకు సమర్థు లగుచున్నారు. ఆనీతు లన్నియు పుస్తకములయందు వివిధరూపములుగా బోధింపబడియున్నవి. అనగా, కొన్ని పుస్తకములయందు అట్టినీతులు మాత్రమే పేర్కొనబడియున్నవి. ఉదాహరణము — విద్య యున్నను దుర్మార్గుడు ఆదరణీయుడు గాడు. మరికొన్నిటియందు ఉపమానములతో జేర్చబడియున్నవి. ఉ.—మా. శిక్యము తలయం దున్నను పాము ఎట్లు ఆదరణీయము గాదో, అటువలెనే విద్య యున్నను దుర్మార్గుడు ఆదరణీయుడు గాడు. ఇతరములయందు అట్టినీతుల ననుసరించినవారి చరిత్రముల మూల

ముస దెలుపబడియున్నవి. ఉ.— రావణాసురుడు సమస్త వేదములను చదివినవాడైనను దుర్మార్గుడైనందున ఆదరణీయుడు కాలేదుగదా! ఈనీతులు కొన్ని గ్రంథములందు సామాన్యభాషను వ్రాయబడియుండినను, చాలభాగము ఉత్కృష్టభాషను వ్రాయబడియున్నవి. అందువలన వానిని దెలిసికొనుటకు భాషాజ్ఞాన మవసరము. అట్టి భాషాజ్ఞానమునకు వ్యాకరణము, శబ్దార్థము మొదలగువానిని దెలుపు గ్రంథపఠన మావశ్యకము. కేవల మిట్టి గ్రంథపఠనమువలన విద్యయొక్క ప్రయోజన మగు భగవంతుని దెలిసికొనుట యసంభవ మైనను, పైజెప్పినట్లు ఆయనను దెలిసికొనుటకు సహకారులగు నీతిబోధక గ్రంథముల యర్థమును గ్రహించుటకు మనకు శక్తి నిచ్చుటచేత, అట్టి గ్రంథపఠనము గూడ నుపయోగకారియే. కావున మొట్టమొదట సామాన్యగ్రంథసహాయమున భాషాజ్ఞాన మలవరచుకొని తరువాత తద్భాషయందు వ్రాయబడిన నీతిబోధకగ్రంథముల బఠించి, వాని ననుసరించి మనజీవితములను సార్థకపరచుకొనవలయును.

ఆనీతు లేమి? వానిని ధర్మము లని కూడ చెప్పవచ్చును. ప్రతిమనుజుడును తా నీప్రపంచమున జేయవలసిన కార్యములను ధర్మము లందురు. ధర్మములు నాల్గు విధములుగా నుండును:—

1. భగవంతునియెడల ధర్మములు— అద్వితీయుండును సత్యస్వరూపుండును అయిన యాయనయెడల నమ్మిక, ప్రేమ, ఉపాసన.

2. తనయెడల ధర్మములు— శరీరము నారోగ్యదశయం దుంచుకొనుట; జ్ఞానమును, నిర్మలత్వమును, ఆత్మపారిశుధ్యమును సంపాదించుకొనుట.

3. ఇతరులయెడల ధర్మములు — సత్యవాదిత్వము, వాగ్దాననిర్వాహకత్వము, న్యాయము, కృతజ్ఞత; తల్లిదండ్రులయెడలను, అక్కచెల్లెండ్రయెడలను, బంధువులాదిగాఁ గలవారియెడలను ప్రేమ, సర్వమానవశ్రేయోభివృద్ధిప్రయత్నము.

4. హీనజంతువుల యెడఁధర్మములు— పక్షులు మృగములు కీటకములు మున్నగు జీవజంతువులయెడల కనికరము.

ఈ పైధర్మముల ననుసరించినకొలదిని మనము భగవదాజ్ఞలను చెల్లించుచు, ఆయనకృపకు పాత్రులమై ఆయనను దెలిసికొనుచున్నవార మగుచుందుము. అట్లు తెలిసికొనుటయే మన జన్మముయొక్క యుద్దేశము. అజ్ఞానముచేత నైననేమి, ఉద్దేశపూర్వకముగ నైననేమి మన విహితధర్మములను నెరవేర్పకున్నను, వానికి విరుద్ధముగా బ్రవర్తించినను, మనము భగవంతునినుండి విముఖులమై, ఆయన కంతకంతకు దూరులమై మన జీవితమును నిష్ప్రయోజనముగ జేసికొనుటయేగాక, మన చెడునడతవలన మనతో సంబంధముగల ఇతరుల జీవితములను గూడ చెడగొట్టినవార మగుదుము.

మన యిహప్రపంచమునందు పైజెప్పిన ధర్మములను సరిగా నెరవేర్చుటకు ప్రాపంచికజ్ఞానము విశేషముగా గావలసియున్నది. మనతో నెక్కుడుసంబంధముగల తల్లిదండ్రులు సోదరీసోదరులు, దారపుత్రాదులు మున్నగు సమీపబంధువులను గురించియే గాక, లోకములోని సమస్తదేశములయందలి మనతోడిమానవు లెల్లరనుగురించియు, ఆయాదేశములను గురించియు, అందలి పూర్వపు ప్రస్తుతపు జనుల వ్యవహారాదులను గురించియు, మఱియు మన ముపయోగించు సమస్తవస్తుతత్త్వములను దెలుపు ప్రకృతిశాస్త్రాదులను గురించియు కూడ జ్ఞానము సంపాదించవలసియున్నది. ఇంతేగాక మన బుద్ధిని పదునుపరిచి దానిని వికసింపజేయు శక్తిగల గణితశాస్త్రాదులజ్ఞానము గూడ నావశ్యకమే. మనము మన ప్రభుత్వమువారియెడలను తోడిమానవులయెడలను అనుసరింపవలసిన విధులను దెలుపు న్యాయశాస్త్రాదులును, మన గృహదేహాదుల శుభ్రముగ నుంచు తెరగును బోధించు ఆరోగ్య శాస్త్రాదులను గూడ తెలిసికొనవలసినదే. ఏల నన, పైఁజెప్పిన నానాశాస్త్రములయందు చేర్కొనబడిన ధర్మములును మన యభివృద్ధికై ఏర్పడినవే. ఈధర్మములను మనలోని కొందరు బుద్ధిమంతులు స్వానుభవముచేత గ్రహించి శాస్త్రము లనుపేర పుస్తకరూపమున బ్రచురించియున్నారు. ఈ ధర్మములు భగవంతుని యాజ్ఞలు. మఱియు ఆనందస్వరూపుడగు

భగవంతుఁడు విచిత్రచిత్రలేఖనాలోకనమునను, మృదు
మధురగానశ్రవణమునను, సుమనోమనోజ్ఞప్రసూనాఘ్రా
ణమునను మనకు తన్ను దాన తెలుపుకొనుచున్నాఁడు.
ఇటుల భగవంతుని దెలిసికొనుటకు అనేకమార్గము
లున్నను, వీనికన్నిటికిని మిన్నయైనదొక్కటి గలదు. అది
ఘనులగు మహానుభావుల జీవచారిత్రపఠనము.

కం. మనగుణముల దిద్దుకొనం
గను సద్దముఁ బోలియుండు ఘనులచరిత్రల్
గని విని యాచరితమ్ముల
ననుసరణముఁ జేయ మనకు నగు సత్సుఖముల్.

అనునట్లు, మన మెట్లీప్రపంచమున నడచుకొన
వలయునో తెలుపుటకు గొప్పవారల చరిత్రరత్నము
లావశ్యకములు. వీరిని గురించి పురాణములయందును,
దేశచరిత్రములందును, సమకాలీనుల నడవడికలందును
బాగుగా దెలుపబడియున్నది. పురాణములలో ప్రత్యే
కించి సీతారాములయొక్కయు, నలదమయంతుల
యొక్కయు, హరిశ్చంద్రచంద్రమతులయొక్కయు, ధర్మ
రాజాదులయొక్కయు చరిత్రలు మనకు ముఖ్యము
గా ననుసరణీయములు. ఇవిగాక పురాణములయందు
ధ్రువుఁడు ప్రహ్లాదుఁడు మున్నగు భక్తుల చరిత్రలును గలవు.
అవియు అనుసరణీయములే. ఇంక దేశచరిత్రలందును
స్త్రీపురుషు లెల్లరకును ఆదర్శములుగా నుండదగు
మహానుభావు లెందరో గలరు. అశోకుఁడు చంద్రగుప్తుఁడు
మొదలగు రాజచంద్రులును, రామమోహనవిద్యాసాగ
రాదిదేశబాంధవులును, అబలాసచ్చరిత్ర రత్నమాల
యందుఁ దెలుపబడిన వనితారత్నములును అట్టివారే.
సమకాలీనులలోను మన కాదర్శముగ నుండఁదగిన స్త్రీ
పురుషులు పెక్కండ్రు గలరు. వీరిలో ముఖ్యులు, గంధి
గోక్లేలు. ఇట్టి వీరుల చరిత్రములను బాగుగా గ్రహించు
టకు బుద్ధిసూక్ష్మత యావశ్యకము. బుద్ధిసూక్ష్మతకు
విద్య యావశ్యకము. విద్య దీపమువంటిది. దీప ముండుట
వలన సకలవస్తువులను మన మెట్లు చూడగలుగుదుమో
అటులె విద్య నేర్చుకొనుటవలన మంచి చెడ్డలను బాగు
గా నెరుగగలము. అయినను చీకటియందు జేయు జారత్వ
చోరత్వాదిదుష్కృతులను దీపమున్నను కొందరు చేయు
నట్లే, మంచిచెడ్డల వివక్షతనుదెలుపు విద్య యున్నను
కొందరు చెడుపనులను జేయుచునే యుండవచ్చును.
ఇప్పుడు చూచుటలేదా ? గొప్ప గొప్ప పరీక్షలయం
దారితేరిన పురుషులలోను చదువుకొనినవారని పేరెన్నిక
గన్న స్త్రీలలోను కొందరు కొందరు త్రాగుబోతులు
ను, నీతిదూరులునై తమ స్నేహితులకును బంధువుల
కును మిక్కటమైన తలవంపులను కలిగించి వారిని తీరని
విచారసాగరమున ముంచుచున్నారు. "చదువు వేరు,
సద్గుణము వేరు" అనుట వినలేదా ? కావున సన్మార్గ మవ
లంబించుటకు విద్య చాలదు. దృఢమనస్కతయవసరము.
అది సాధనవలన నలవడును. అయినను లోకములో
మనము మంచిపనులను చేయుటకుగాను ముందుగా
ఏది మంచిదో తెలిసికొనవలయును. అటుల తెలిసి
కొనుటకు వెలుతురువంటి విద్యయే మనకుగల సహా
యము. మఱియు విద్యవలన వేరొకవిధమైన ప్రయోజన
ము కూడ గలదు. అది ఏదన, మనుజుని యాత్మయగు
జీవాత్మయందు పరమాత్మయొక్క సర్వజ్ఞత్వబీజములు
నివురుగప్పిన నిప్పువలె అవ్యక్తస్థితియం దున్నవని వేదాం
తులు నమ్ముచున్నారు. అవి వ్యక్తమగుటకు విద్యయను
వాయు వావశ్యకము. విద్య రూపములేని ఆత్మవంటిది.
రూపములేని ఆత్మను రూపముగల శరీరముమూలమున
నే ఎట్లు తెలిసికొనగలుగుదుమో, అటువలెనే రూపము
లేనివిద్యను రూపముగల గ్రంథముల మూలముననే
పొందగలుగుదుము. కనుక గొప్పవారనిగాని, కొద్దివా
రనిగాని, బ్రాహ్మణు లనిగాని, మాల లనిగాని, పురుషు
లనిగాని, స్త్రీ లనిగాని భేదములేక, సర్వజనులును పై
జెప్పినట్లు విద్య యను వెలుతురును బొంది తద్ద్వారా
మంచిచెడుగుల భేదమును పాటించి తమతమ నియమిత
ధర్మముల నెల్ల నిర్వర్తించి, తమ జన్మములను సార్థక
పరచుకొందురుగాక !

# గద్యకావ్యములు – శైలి

ఆచంట సూర్యనారాయణరాజుగారు

ఏ భాషలోనైనను పద్యరూపమునఁగాని గద్యరూపమునఁగాని యేదేని నొకయంశముఁగూర్చి మనోగతాభిప్రాయముల వ్యక్తీకరించుటకై యుపయోగించు పదసముదాయమునకు శైలి యనిపేరు. పదములఁ గూర్చు సామర్థ్య మెల్లవారల కొక్కతీరున నుండక వారువారు వ్రాయు నంశములఁబట్టియు, వారివారి కుండు భాషాజ్ఞానముఁబట్టియు, ఆ జ్ఞానము నుపయోగపఱచు సామర్థ్యమును బట్టియుఁ బెక్కువిధములుగ నుండు. కవి యగువాఁడు తాను వ్రాయు నంశములఁ బద్యరూపముననో గద్యరూపముననో యద్భుతకల్పనలతో వ్యక్తీకరించుచుఁ జదువువారి వినెడువారి మనస్సులఁ దన ధోరణికి లాగుకొను సామర్థ్యము కలిగియుండును. కొందఱి శైలి యతిమధురమై యలంకారసహితమై భావరసోద్గాఢమై పాఠకుల నానందసముద్రమున నోలలాడించుచుండును. కొందఱిశైలియం దెంత పాండిత్యప్రకర్ష కానుపించినను శైలి మధురముగా నుండకుండిన వినువారి కాహ్లాదము కలుగఁబోదు. కావునఁ బాఠకుల రంజింపఁజేయుటకు మృదుశైలి చేసినంతపని పాండిత్యము సేయలేకపోవును. పాండిత్యమును శైలిమాధుర్యమును చేరెనేని నన్నివిధముల శ్లాఘనీయముగా నుండును. వసుచరిత్ర మనుచరిత్రకంటె శ్లేషలు బహువిధాలంకారములు కలదయినను, మనుచరిత్రవలె వినువారి కాహ్లాదమొసంగకుండుటకు రచనాకౌశలమే కారణము. కావున దోషరహితమై గుణసహితమై సర్వజనాహ్లాదకరం బగు వృత్తియు, రీతియు, పాకమును గలిగిన రచనయే వన్నెకెక్కును.

మనమార్గదర్శకులగు పూర్వులు నిరర్థకాదిదోషములును, మాధుర్యసౌకుమార్యాదిదశగుణములును, పంచవిధభావములును, కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి యను నర్థసంబంధవృత్తులును, వైదర్భి, గౌడి, పాంచాలి యను పదసంబంధరీతులును, ద్రాక్షాపాకము, కదళీపాకము మొదలగు పాకములును నేర్పఱచియున్నారు. వీనిభేదముల నన్నిటిని బూర్ణముగా నెఱింగియున్నను, కొందఱిశైలి మనోహరముగా నుండకపోవుటచే శైలి యొక్కొక్కనికిని స్వభావముచేతనే కుదురవలయునని సందేహము కలుగుచున్నది. అట్లని ప్రయత్నము మానక మంచిశైలిగల గ్రంథరాజములఁ బలుమాఱు చదువుచు వ్రాయఁబ్రయత్నించుచుండుటవలనఁ గాలక్రమమునఁ గొంతవఱకయిన శైలి మాఱకపోదని నా నిశ్చయము.

మనలోఁ గొందఱారంభమున నేది వ్రాయఁబూనినను, కఠినశైలితోను దీర్ఘసమాసములతోను వ్రాయయత్నింతురు. అట్టివారు తమగ్రంథములు జనసామాన్యమున నంతగా వ్యాపింపకపోవుటచే, కైశికీవృత్తి నవలంబించిన గ్రంథములు మిగులవ్యాపకము చెందుచుండుటను జూచి, కాలక్రమమున లోకానుభవముగలిగి మృదుశైలి వ్రాయనుద్యమింతురు. కావున మొదటినుండియు మృదుశైలి నలవడఁజేసికొనుట యుక్తము.

పిడుగునకు బియ్యమున కొక్కటే మంత్ర మనునట్లు వ్రాయునట్టి యేయంశమునకయిన నొక్కరీతి శైలియే యుండుటతగదు. శాస్త్రములు చరిత్రలు మొదలైనవి జ్ఞానబోధకములు గాననట్టి వెల్లజనసామాన్యమున వాడుకలో నున్న పదములతో, లక్షణయుక్తముగ వ్రాయవలె. అట్టిగ్రంథము లలంకారభూయిష్ఠమై యారభటీవృత్తిని గౌడిరీతిని నారికేళపాకముగా రచియింపఁబడినచో నట్టివి లోకమున బయల్వెడలిన నెంతమేలో బయల్వెడకున్న నంతేమేలు.

అక్బరుచక్రవర్తినిగూర్చి వ్రాయుచు "మతకక్షపూనక ప్రజను దయతోఁ జూచుచుండెడివాఁ"డని వ్రాయుటకు బదులుగా "మతవిద్వేషరహితనిర్మలస్వాంతుఁడైన యక్బర్ సర్వంసహాచక్రవర్తి శ్రీశరత్కాలరాకా

సుధాకరనిభవదనవిరాజమానవయనారవిందోద్భూతకటాక్షమరందపరితృప్తజనభృంగసంచయుండై చెన్నారె" యని వ్రాసినచో నేమయిన మేలు కలదా? చరిత్రలలోను శాస్త్రములలోను, క్లిష్టాలంకారములు, శ్లేషలు, అన్వయకాఠిన్యము మొదలగున వేవియు లేకుండ సులభశైలి నంశముల సత్యముగాఁ బ్రకటించవలెను.

శైలి శక్తిమంతమై యుండుట యవసరమే. కవి తన పదప్రయోగకౌశలముచేఁ దా వర్ణించు రసమునకుఁ బుష్టికలుగఁజేయుచు వినువారి మనసులను ఆరసములో ముంచుచుఁ దేల్చుచు నన్యచింత వారికిఁ గలుగనీయకుండవలె. కాళిదాసు తన గ్రంథములో మృదుశైలిని జక్కని యుపమల నిచ్చియుండుటచేత సర్వజనాహ్లాదసంధాయకుఁడై యెప్పటికప్పుడే నూతనఖ్యాతిని జెందుచు మృతజీవుఁడై యున్నాఁడు. శైలి శక్తిమంతముగఁ జేయుటకుఁ బాత్రౌచిత్యము, వర్ణనౌన్నత్యము, సరసశబ్దసమ్మేళనము, అలంకారసంపద, భావవ్యక్తి, మొదలగున వన్నియు వెలయుచుండుటతోఁ బాటు పదములపొందిక యాహ్లాదకరమైయుండవలయు. ఈలక్షణములు పద్యగ్రంథములోఁ గంటె గద్యగ్రంథములో సులభతరముగా నిమిడించ వచ్చును. పైలక్షణములు గల పద్యప్రబంధములు మన యాంధ్రములోఁ గొన్ని గలవు గాని గద్యగ్రంథములలోఁ గానరావు.

మనలో మునుపు గద్యగ్రంథములే లేవు. ఎన్ని సారులు వెతకినను చిన్నయసూరిగారి నీతిచంద్రిక ముందుగా లెక్కకు వచ్చుచుండెను. పంచతంత్రము, శుక సప్తతి, మదనకామరాజుకథలు గద్యప్రబంధములే కాని వానికి కథలపుస్తకములను పేరే తగియుండును. ఆంగ్లేయ భాషలో వచనగ్రంథములు లక్షోపలక్షలు కలవు; వానికి నవలలని పేరు. అట్టివి మనలో మొట్టమొదట మ-రా-రా-శ్రీ రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు వ్రాయనారంభించిరి. ఇప్పటికి నొకవంద నవలలయిన బయల్వెడలెనేమోయని సందేహము కలుగుచున్నది. అభిప్రాయౌన్నత్యమునఁగాని, పాత్రౌచిత్యమునఁగాని, శైలిమాధుర్యమునఁగాని, యసమానముగా విరాజిల్లుచున్న యిప్పటి యాంగ్లేయభాషావైభవము మన తెలుఁగు భాసకుఁ బట్టవలయు నని తలంచినచో, హూణభాషానవలలను చదివి, భాషాంతరీకరించి, అనుసరించి వ్రాసి, స్వతంత్రముగా రచియించి, యిట్లు వ్రాయఁగలవారు గ్రంథములు వ్రాయుచు, భాషాభిమానముచే నాంధ్రులు వారికిఁ దగినంత ప్రోత్సాహ మిచ్చుచు, మనవారెల్లఁ బనిసేయఁదొడంగవలెను. ఇట్లొకశతాబ్దము గడచుసరికాంధ్రభాష హూణభాషావైభవమును పొంద వచ్చు నని యుభయభాషావిదులు లెక్కవేసియున్నారు. చేయవలసిన కార్యము విశేషముగా నుండుటచే మనవా రాశాభంగమొంది నిరుత్సాహపరులు కానక్కఱలేదు. భాష మంచిస్థితిలోనికి వచ్చు సూచనలు స్పష్టముగాఁ గానంబడుచున్నవి.



నవలలు భాషలో బయల్వెడలి హూణభాష తెలియనియాంధ్రుల తలలకెక్కుచున్నకొలఁది దేశభాషకు మంచి దినములు రావచ్చును. ఎఫ్.ఏ., బి.ఏ. పరీక్షలకు దేశభాష రెండవభాషగాఁ జదువనక్కఱలే దను విశ్వవిద్యాలయసూత్రము భాష కపకారకరమే యనుటకు సందియము లేదు. ఈసమయములో గ్రాంథికశైలిని రూపుమాపి భాగమున కొకతీరున విధినిషేధములు లేక యిచ్చవచ్చినట్లు వాడుచున్న గ్రామ్యమే యిపుడు మాతృభాషగాను గ్రాంథికభాషగాను కాఁదలఁచిన దినములు కూడ వచ్చినవి. ఆంధ్రభాషాప్రతికక్షుల పట్టుదలయే నెగ్గినయెడల నింకఁగొన్నేండ్లకు మన భారతరామాయణాదిగ్రంథము లెల్ల గ్రామ్యములోనికి మార్చుకున్న మనకిప్పుడు సంస్కృత మెట్లున్నదో యాగ్రంథములను భాషాంతరీకరించుట యెంత యవసరమయినదో యట్లే మన యిప్పటిగ్రంథములు గ్రామ్య భాషాంతరీకరింపవలసివచ్చును. దానినే చేకొనవలయు నను మనవారిలోఁ గొందఱి పట్టుదల చూడఁగా కట్టుదిట్టములకు లొంగియున్న యిల్లాలిని విడిచి యెవరెటు లాగిన నటు విధినిషేధములు లేక మరుగు వెలయాలిని జేరఁదీయ మనుచున్నట్లున్నది. దైవానుగ్రహమున భాష కంతటి దుస్థితి కలుగకుండుఁగాక ! కాని యాంధ్రులెల్లరు కనులు తెఱచియుండవల

యునే కాని యేమియు భయములే దని విస్మరించియుండ రాదు. రచియింపఁబడు గ్రంథములు విధ్యుక్తముగానే రచియింపఁబడవలెను.

ఎఱిఁగి యెఱిఁగి మన యొక గొప్పలోపము సేయుచున్నారము. మన పూర్వులు చరిత్రములు వ్రాసియుండనికారణమున నెంతయో కుందుచున్న మనము మనచరిత్రలను వ్రాయమానితిమి. మన మెఱిఁగి యుండఁగనే యెందఱో మహారాజులు, పుణ్యాత్ములు, ధర్మశాలులు, భాషాపోషకులు, విఖ్యాతధనవంతులు, లోకోపకారులంతరించిరి. వారి చారిత్రము మనమే కొంతవఱకు మఱచియుంటిమి. మన మింక నశ్రద్ధచేసితిమేని మనవలెనే మన తరువాతివారు మనలఁగూర్చి చింతిల్లవలసిన కాలము రాఁగలదు. కావున మనలో నాచారాదులు, రాజకీయాంశములు మొదలగు వివిధాంశములలో జరగుచున్న మార్పుల చారిత్రము వ్రాయవలసిన యవసరము కలదు.

ఒక్కొక్క గ్రంథకర్తయు కొన్నికొన్ని నవలలు వ్రాసియుండెను. నవలలు ప్రచురించు సంఘములు కొన్ని యిటీవల బయల్వెడలియుండుట పరమసంతోషము. అట్టి నవలాప్రకటనసంఘములలో నగ్రగణ్యమగునది ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము. ఇందుఁ బెక్కునవలలు బయల్వెడలి భాషామణికమూల్యాలంకారములుగా నమరుచున్నవి. భాషామణికి నూతనవైభవ మమరినది. దీనికంతకును ముఖ్యకారకులగు మ-రా-రా-శ్రీ కొవ్వూరి చంద్రరెడ్డిగారి యౌదార్యము సంస్తవనీయము. చిన్నతనములో వారికిఁ గలిగినమాతృభాషాభిమానము శ్లాఘ్యము. ఇట్టివారలు మనదేశములో నలుముఖంబుల బయలుదేఱిరేని నత్యల్పకాలములోనే మనభాష మంచిదశకు రావచ్చును.

పై నిలయమువారు ప్రచురించు నవలలు సాధారణముగా నన్నియు భాషాంతరీకరణములే. మొదటఁ జేయవలసిన ప్రయత్న మదియే యనుటకు సందియము లేదు. ఇట్లు కొంతకాలము జరగినపిదప స్వతంత్రముగా నవలలను వ్రాయనుద్యమింపకపోరు. ఆంగ్లేయభాషలో ప్రతివృత్తి ననుసరించు నవలలు పెక్కు లున్నవి. ఆరీతిగా మన యాంధ్రభాషలో వృత్తుల ననుకరించునవలలు, చరిత్రాంశముల వ్యక్తీకరించు నవలలు బయలుదేఱవలసియున్నవి. ఈనవలలు వినోదముగాఁ జదువుటకే కాక కాలక్రమమున చరిత్రాచారాదుల స్పష్టముగాఁ దెలుపు గ్రంథములై లలి వెలయవలెనని యభిలషించుచున్నాను.

కావున శైలి మనోహరముగా నుండునట్లు రచియించు నవలలలోఁ బైఁజేర్కొనిన యంశములఁ జొనుపుచు నెక్కడ నుపయోగింపవలసిన శైలి నచ్చట రసానుగుణముగా నుపయోగించుచు గ్రంథకర్తలు మాతృభాషాసేవ సేయుచుండ, నాంధ్రులు వారలకుఁ దగు ప్రోత్సాహమిచ్చుచోఁ దాము కూడ నాంధ్రభాషాయోషిన్మణికి దగు సహాయ మొనర్చుచు నతిపాత్రు లగుదురు.

## వసంతాగమము

సీ. పుష్పాసవంబును బుష్కలంబుగఁ గ్రోలు చంచరీకంబుల సద్దుతోడ
లేమావిచివురుల లెస్సగా భుజియించు గండుఁగోయిల గానగరిమతోడ
నిర్మలజలముల నింపుమైఁ బ్రవహించు సెలయేళ్లస్రోతల చెలువుతోడ
విరులనెత్తావుల విరివిగాఁ గొనితెచ్చు పవనుని పిల్లవాయువులతోడ
సుమనసులు చేయు స్తోత్రపాఠములతోడఁ
దనదు శుభదాగమంబును జనుల కెల్లఁ
జాటుచున్నాఁడు నిజవికాసంబుఁ జూపి
సంహృతజనార్తి యల శ్రీవసంతమూర్తి.

# వైద్యము

శ్రీ విక్రమదేవవర్మగారు

కృపాపారావారుం డగు నీశ్వరుండు మానవాదులను సృజియించి, వారలు నిరంతరసుఖ మొందున ట్లనుగ్రహించి యున్నాఁడు. అయినను మనము యుక్తప్రవర్తనమును మానుటం జేసి రోగగ్రస్తుల మయి సుఖమును గోలుపోయి దుఃఖభాజనుల మగుచున్నారము.

రోగము ద్వివిధము. మానసికము, శారీరకము అని. అందుఁ జింతాదులు మానసికరోగములు; వైరాగ్యాదులు తన్నివారణములు. మఱి శారీరకరోగములు కర్మజము లనియును, కాలజము లనియును, పదార్థజము లనియును జెప్పంబడును. ప్రారబ్ధాదికర్మములవలనఁ గలుగు రోగములు కర్మజములు. అవి యనుభవింపఁబడినంగాని పోవు. శీతోష్ణాదికాలపరివర్తనములవలనఁ బుట్టు రోగములు కాలజములు. అవి కాలపరివర్తనము చేతనయినను సామాన్యచికిత్సచేతనయినను నివర్తించును. అనిష్టకరము లగు నాహారవిహారాదులవలన జనించురోగములు పదార్థజములు. అవి తగు చికిత్స చేతనే నివారింపంబడును. పైని జెప్పంబడిన కారణత్రయములో దేనిచేత నేరోగము సంభవించునో తెలిసికొనుట సాధారణముగా దుర్ఘట మగుటం జేసి, సకలరోగములకు నుపయుక్తచికిత్స చేయవలయు నని పెద్దలు శాసించి యున్నవారు.

దీపము చమురును వత్తిని గలిగియుండియు గాలి వీచినతోడనే సంచలించును. వాయు వధిక మగునేని దీప మాఱును. మన మావచ్చువాయువున కడ్డముగా దేని నయిన నుంతు మేని దీపము సంచలించదు; మఱి యాఱిపోదు. ఇందు దీపమును మన ప్రాణముతోడను, చమురును వత్తిని మనపరిమాణకాలముతోడను, గాలిని రోగముతోడను, అడ్డముగా నుంచుదానిని చికిత్స తోడను బోల్పవచ్చును.

రోగము గలుగునపుడు చికిత్స చేయకుందు మేని బాధ నొందుదుము. ఆరోగము ప్రబలమయినది యగు నేని మరణింతుము. కనుక రోగము పొడమునపుడు తగు చికిత్స యత్యంతావశ్యకము.

ఏరోగమున కెట్టిచికిత్స యావశ్యకమో యవ్విషయంబును దమ యనుభవజ్ఞానమువలననే పెద్దలు కనుఁగొని నిరూపించి యున్నవారు. చికిత్సాపద్ధతులు పలువిధములుగా నున్నవి. అం దీదేశమున వాడుకలో నున్న ముఖ్యము లగు పద్ధతులలోఁ గొన్నింటి నిట వివరింతము. 1. జలచికిత్సాపద్ధతి. నియమానుసారముగా జలము నుపయోగించుట వలన సమస్తవ్యాధులు నశించు నని యిందుఁ జెప్పంబడును. 2. వర్ణచికిత్సాపద్ధతి. సూర్యకిరణములందుఁ బోలె జంతువుల శరీరములందు సప్తవర్ణములు గల వనియును, ఆవర్ణముల న్యూనాధిక్యముల వలననే రోగము లుద్భవించుచుండు ననియును, సూర్యరశ్మిసాహాయ్యముచేత ఆన్యూనాధిక్యములను సరిచేసినచో రోగము లుపశమించు ననియు నిందుఁ జెప్పంబడును. 3. విద్యుచ్చికిత్సాపద్ధతి. యంత్రసాహాయ్యముచేత విద్యుచ్ఛక్తిని మేనం జొనిపినచో వ్యాధులు నివారింపఁబడు నని యిందుఁ జెప్పంబడును. 4. హితపదార్థచికిత్సాపద్ధతి. ఏపదార్థము నుపయోగించుటవలననే రోగము సంభవించునో యాపదార్థమునే కొంచెముగా నుపయోగించుటవలన నారోగము మాయు నని యిందుఁ జెప్పంబడును. 5. అహితపదార్థచికిత్సాపద్ధతి. ఏపదార్థ మేరోగమునకు నహితకరమో యాపదార్థమునే యారోగమునందు నుపయోగించినచో, ఆరోగ్యము చేకూడు నని యిందుఁ జెప్పంబడును. ఈకడపటి పద్ధతియే యీదేశమునందు నధికప్రచారము గలది. ఇది యాయుర్వేదపద్ధతి, యూనానీపద్ధతి పాశ్చాత్యపద్ధతి యను మూఁడువిధములు గలది. భారతీయుల చికిత్స యాయుర్వేదపద్ధతి యనియును, తురష్కుల

చికిత్స యూనానీపద్ధతి యనియును, ఆంగ్లేయులచికిత్స పాశ్చాత్యపద్ధతి యనియు నెఱుంగనగును.

రోగనిదానమునందు నాయుర్వేదపద్ధతితో యూనానీపద్ధతి యించుమించుగా సరిపోవును. కాని, పాశ్చాత్యపద్ధతి మాత్రము సరిపోని విధమునఁ గనుపించును. జంతువుల యారోగ్యము పిత్తవాతకఫధాతువులంబట్టి యుండు ననియును, పిత్తవాతకఫములలో నేది యధికమయినను రోగములు జనించు ననియును, మఱి వానిలో నేది యుద్రేకించినను గడమ రెండు నుద్రేకించి మరణమును గలిగించు ననియును భారతీయుల సిద్ధాంతము. జంతువుల యారోగ్యము మస్తిష్క-హృదయశ్వాసకోశములనుబట్టి యుండు ననియును, వానిలో నేది యించుక చెడినను రోగములు జనించు ననియును, మఱివానిలో నేదియత్యంతముగాఁ జెడినను గడమరెండును జెడి మరణమును గలిగించు ననియును పాశ్చాత్యుల సిద్ధాంతము. ఆరెండు సిద్ధాంతముల నిట్లు సరిపెట్టవచ్చును. భారతీయులు చెప్పు పిత్తోద్రేకమే పాశ్చాత్యులు చెప్పెడి మస్తిష్క-విషమత్వము. భారతీయులు చెప్పు వాతోద్రేకమే పాశ్చాత్యులు చెప్పెడి హృదయవిషమత్వము. భారతీయులు చెప్పు కఫోద్రేకమే పాశ్చాత్యులుచెప్పెడి శ్వాసకోశవిషమత్వము. త్రిదోషోద్రేకమువలనఁ గలుగు సన్నిపాతము లేక జన్నియే మస్తిష్క-హృదయశ్వాసకోశములు చెడిన యవస్థ. ఇంక మలమూత్రకోశాదులయందుఁ గొన్నిరోగము లుత్పత్తిల్లును. అయిన నారోగము లతిప్రబలము లగునపుడు మస్తిష్క-హృదయశ్వాసకోశములలో మొదట నొకటియుఁ బిమ్మటఁ గడమరెండును జెడి మృతి కలుగును. మస్తిష్కాదులలో మొదట నెద్ది చెడునో దానింబట్టియే యుల్లిఖితరోగములు పిత్తాదులవలన నుద్భవించు నని యాయుర్వేదమతము. భారతీయులు చెప్పెడి రోగకారణములను బాలవఱకు నిట్లు సరిపెట్టవచ్చును. గ్రంథవిస్తరభీతిచేత రోగతత్వములును దత్కారణంబులును విపులంబుగా నిట నుదాహరింపంబడ లేదు. బుద్ధిమంతులు వానిని నూహించుకొందురుగాక !

పైని చెప్పంబడిన పద్ధతులలో దేని నయినను లెస్సగా నెఱింగిన వైద్యుఁడు చికిత్సచేసినచో, రోగములు తొలఁగిపోవును. అట్లు కాక, కుక్షింభరు లగు వైద్యవేషధారులు చికిత్సచేసినచో, ఉన్న వ్యాధులు పోకుండుటయే కాక, క్రొత్తగ మఱికొన్ని వ్యాధులొదవును. కనుక సద్వైద్యులచేతనే చికిత్స చేయించుకొనుట సమంజసము.

"చంపుటకంటెఁ బుట్టకుండ సలుపుట మేలు." కావున రోగము లుద్భవించినపిదప సద్వైద్యుల నాశ్రయించి వారిచికిత్సలచేత రోగములను బాపుకొనుటకంటె రోగములు సంభవింపకుండునట్లు చేసికొనుటయే శ్రేయస్కరము. అట్లు చేసికొనుట యుక్తాహారవిహారాదులవలననే సిద్ధించును.

జను లుపయుక్తాహారవిహారాదులయందు ననురక్తులయి, స్వాస్థ్యమును గాపాడుకొనుచు నీశ్వరప్రసాదం బగు నిరంతరసుఖమును గాంతురుగాక !

## మత్తకోకిల

నూతనం బగు భావముల్ మది నూలుకొల్పుచు వీఁకనై
నూతనం బగు సత్వరూఢిని నొప్పుచుండి నిరంతమున్,
మాతృదేశపుసేవనే కడు మానితంబుగ సల్పుచున్
నూతనాశలతోఁ జరింపుఁడు నూత్నవత్సరమందునన్.



First Line Beach

సముద్ర తీరపు మొదటి వీథి



wn

జార్జిటవునులోని రాజమార్గము

# అన్యోన్య సహాయసంఘములు — గ్రామ ధనాగారములు

వెన్నెలకంటి అప్పారావుగారు

వీనినే పరపతిసంఘములనియు విలేజిబ్యాంకులనియుఁ గూడ జెప్పుచున్నారు. ఆంధ్రదేశమున ముఖ్యముగ నుత్తరసర్కారులలో స్థాపింపఁబడిన వీనియల్పసంఖ్య నాలోచించిన వీని ప్రాముఖ్యము నాంధ్రులు గ్రహింప లేదనుట నిర్వివాదాంశము. ఒక్క యాంధ్రులే యన నేల, హిందూదేశస్థులలోఁ బెక్కరు వీని సారస్యమును గ్రహించినట్లు గనుపట్టను. దీనికి ముఖ్యకారణము స్వలాభాభిలాష యై యున్నది. కాంగ్రెసు సభలు మాండలికసభలు మున్నగువానివలన దేశమున కొనఁగూడు మే లతిస్వల్పమై వాని నిర్వాహకులకుఁ జెందు మే లత్యధికముగ నున్నది. పరిశ్రామిక వ్యవసాయ సంతలు పట్టణరాజంబులలో నెలకొల్పఁబడుటచేతను దారిద్ర్యపీడితు లగు సాధారణగ్రామవాసులకు నలభ్య మగుటచేతను నవికూడ చేయవలసినవిధికృత్యము లొనర్ప కున్నయవి. గ్రామవాసుల కుపయోగకరము లగు గ్రామపంచాయతీల స్థాపింపవలసిన దని పాలకుల నెంతఁ వేఁడినను నవి మన గ్రహచారవశంబున నింతవఱకును స్థాపింపఁబడనయ్యె. ఇఁక నాయకు లనఁబరఁగినవారిలోఁ బ్రముఖులు మనయాంధ్రగ్రామవాసులకొఱకుఁ జేయు పనులెవ్వియో నాకుఁ గానరాకున్నయవి. గ్రామవాసుల మంచిచెడ్డలు తెలిసికొనవలెనన్న గ్రామములలో నివసించవలెను. నివసించునంతమాత్రము చాలదు. భూములమీఁద వందల వేల రూప్యముల యాదాయము గల్గి కష్టము లన నేమియో యెఱుఁగని భూస్వాములకుఁగూడ వీరికష్టసుఖములు తెలియఁజాలవు. వీరికష్టములు తెలిసికొనవలెనన్న వీరివలె నొక చిన్న "రయి"తయి యుండవలెను. చిన్న రయితయి యున్న, వారివలెఁ బరాధీనుఁడయి యుండును. పండిన వత్సరమును నెండిన వత్సరమును గడియారపుఁ బద్ధతిని తమసిస్తు వసూలుచేయు సర్కారువారి నడుమను సంవత్సరము పొడుగునను భోజనాదులకుఁ గావలసిన చిల్లర వస్తుసముదాయము నిచ్చుచు వీని రక్తనాళములం దుండు నెత్తురును బీల్చి వీనిని శవాకారముఁ జేయు షాహుకారునడుమను అడకొత్తునడుమఁ జిక్కిన పోకవలె నలుఁగు చిన్నరయితు పరోపకారమునుగూర్చి యేమియోజింపఁ గలఁడు? తన్నుమాలిన ధర్మ మెంతైనఁ గలదే! చిన్న కాఁపులయందు సుగుణము లెన్నియో కలవు. వీరికి మధుపానాభ్యాసము సాధారణముగ లేదు; సోమరితనము బొత్తిగాఁ గానరాదు; వృథాకర్చులుచేయుట లేదు; జొన్న సంకటి రాగిసంకటి మొదలగు కష్టపు భోజనములతోఁ దృప్తిఁ బొందుచున్నారు; ఘృతము మొదలు సాధారణ భోజనవస్తువులైన కందులు పెసలు కూడ అమ్మి సర్కారు కట్నమును జెల్లించుచున్నారు; వివాహాదికార్యములకు మితవ్యయమునే చేయుచున్నారు; మాంసాహారు లయ్యు గ్రామదేవతల జాతరలు మొదలగు సమయములందుఁ దప్ప మాంసభోజనము చేయుటయే లేదు; తమ పశువులను బిడ్డలవలెఁ గాపాడుదురు. వంటచేయుట కెంత కష్టమైనను పేఁడను బిడుకరూపముగ మార్చక యెరువుచేసి యుపయోగించుచున్నారు. తమశక్తికి వంచన లేకుండ నిట్లు అన్నివిధములఁ బాటుపడుచున్నను, రైతులు పుంజీకరముగ నుండుట లేదు. వారిని మంచిస్థితికిఁ దెచ్చుటకు సర్కారువారు భూములపై ఋణము లిచ్చుటకు ఏర్పాటుఁ జేసియున్నారు కాని దాని లాభమును రైతులు తమ యజ్ఞానకారణంబునను మఱి కొన్ని యవర్ణనీయకష్టంబులచేతను బడయఁజాలకున్నారు. "వ్యవసాయకుఁడు తాను చేయు కష్టముయొక్క ఫలితమును దా ననుభవించునట్లు చేయు టెట్లు? తాను జేయు కష్టమునకుఁ దగినఫలితము తనకు లభింపఁజేయు టెట్లు?" అను నవి నేఁటి యాంధ్రదేశనాయకుల యాలోచనకు ముఖ్యాంశములై యున్నవి. పల్లెటూరివాని మొఱ కొద్దిమాటలలో నిది యైయున్నది. "ఢిల్లీ కౌన్సిలు, పట్నం

కొన్నిలు అనగా ఏమిటో, అవి ఏమి చేయుచున్నవో నాకు తెలియదు; తెలియవలసిన యవసరమును లేదు. మండలసభలవలని ప్రయోజన మేమో నాకు తెలియదు. నాకు కావలసిన దొక్కటె. అది పండినసంవత్సరం పన్ను తీసుకోవడం, ఎండిన సంవత్సరం రాయితీ చేయడం. నాశరీరమందలి నెత్తురును పీల్చు పెద్దపల్లి యో అనబడు సాహుకారు చేతులనుండి నన్ను తప్పించడం. ఇప్పుడు ఎకరాలో పుట్టెడుధాన్యం పండితే ఎకరాలో నాలుగుపుట్లు పండేమార్గము ఏమహానుభావుఁడైనను చెప్పితే మాకు మేలుచేసినవాడే యగును. మే మది గ్రహించుటకు సిద్ధముగ నున్నాము. అయితే వేలరూపాయలు తినే అగ్రికల్చరు డిపార్టుమెంటువారివల్ల మాకు ఏలాభమును చెందుటలేదు." ఇట్టి వానిఘోష పట్టణవాసు లుద్యోగస్థులకును ధనవంతులకును దెలియుమార్గము లేదు. ధనవంతులుగాని విద్యావంతులుగాని వీని వలె కొద్దిపాటి వ్యవసాయముచేయుట లేదు. ఈవ్యాసకర్తవంటివాఁ డెవ్వడేని సేద్యము ప్రారంభించిన, వాఁడు పట్టణవాసవిద్యాధికులచే హసింపఁబడుచున్నాఁడు; ఇంత చదివియు సేద్యము చేసికొనుచున్నాఁ డని గ్రామవాసులచేఁ దృణీకరింపఁబడుచున్నాఁడు; సర్కారుద్యోగములోఁ జేరుమని నిర్బంధపఱచు బంధువులచేఁ బీడింపఁబడుచున్నాఁడు. పట్టణములందు నివసించుట కలవాటుపడిన యిల్లాలిని సంతోషపఱుపఁజాలక సదా చింతిల వలసియుండును. ఇన్ని బాధల కోర్చి సేద్యముచేసి స్వచ్ఛందవృత్తిని జీవించుద మన్నఁ, దనకు సాటియైన గొల్ల వెంకఁడు, బలిజరాముఁడు, రెడ్డి పోలిరెడ్డి—వీరితోఁబాటు జొన్నన్నముతోను గోగుకూర పచ్చడితోను సంతుష్టి నొందవలసినదే కాని, కందిపప్పు, నేయి, పాలు, పెరుగులతో భుజించుటకు వీలుపడదు. ఇట్లు భుజించిన మూడు రోజులలో భూములఁ దెగనమ్మి తిరిగి పట్టణము చేరవలసి వచ్చును. కనుక కొంత ధనసహాయము కల్గి విద్యావంతులయ్యు నభిమానమును ద్యజించి తమ స్వహస్తములతోఁ బనిచేయ సిద్ధముగనుండునట్టివారు వ్యవసాయవృత్తి నవలంబించిననే కాని దేశమునకు మేలొనఁగూడదు. ఇన్ని లక్షణములు గల్గియుఁ దమ యనుభవమును లోకమునకు వెల్లడిచేయునియెడల నెంతయో కొఱంతగ నుండు. ఇక్కార్యమునకు సాధారణవిద్యకుఁ దోడు లేఖనాశక్తియు వక్తృత్వమును ధైర్యసాహసాదిలక్షణములును గావలసియుండును. ఇన్ని శక్తు లుండియు స్వశ్రేయోభిలాషి కాక గ్రామవాసుల కష్టములు తనవిగా భావించినఁ గాని వారికష్టములఁ గొంతవఱకైనను బాప సమర్థుఁడై యుండఁడు. ఇన్ని లక్షణములు నిజమైన నాయకులయందు సైత ముండుట యరుదుగ నున్నది. ఇఁక ప్రతిగ్రామమందును నిట్టి యసాధారణప్రజ్ఞగల నాయకు లుంట యసంభవముకదా! అయిన నీ వ్యాసవిషయమైన పరపతి సంఘములు జయప్రదములు కావలెనన్న, "పరోపకారార్థ మిదం శరీర"మను నీతిని గొంతవఱకైనను నాచరణలోనికిం దేవలెను. ఇట్టి నాయకలక్షణాఢ్యులే వీనిని నిర్వహింపఁగలవారుగ నున్నారు.

ఈ సంఘస్థాపన చట్టసమ్మతమైయున్నది. 1912-వ సం. వఱకు 1904-వ సం.రపు ఆక్టును, అటుతరువాత దానిని రద్దుచేసిన 1912-వ సం.రపు 2-వ ఆక్టును, ఈ సంఘములకు ననుసరించియుండును. ఇవి ముఖ్యముగ వ్యవసాయకులకొఱకును, చేతిపనులచే జీవించువారికొఱకును నుద్దేశింపఁబడినవి. వీనినిగుఱించి తెలిసికొనవలెనన్న, చెన్నపురి కోఆపరేటివ్ సొసైటీల రిజిస్ట్రారువారికి వ్రాయవలసియుండును. వారు వీనిస్థాపనమునకై తగు సహాయ మొనర్చుదురు. విద్యాధికులకైనను, ప్రస్తుతము చక్కగాఁ బనిచేయుచున్న సొసైటీయొక్క చర్య చూచినఁగాని, వీనినిగుఱించిన కొన్ని సంగతులు బోధపడవు. రిజిస్ట్రారువారు దయతో నుచితముగాఁ బంపు చట్టమును మాదిరిరూల్సును జాలవఱకు సహాయకారులే యైనను, గొన్ని సందేహములు నివారించుకొనుటకుఁ బనిచేయుచున్న సంఘముయొక్క రూల్సును గమనించవలసియుండును. ఇంత శ్రమతీసికొని దీనిని స్థాపించి పని చేయువానికి లాభ మేమియు లేదు. ప్రారంభమునుండియు నుచితముగఁ బనిచేయవలసియుండు. సర్వవిధముల వ్యాపారలక్షణములతోఁ గూడుకొన్న యీ సంఘములకు

“పరోపకారార్థ మిదం శరీర” మను చతుర్థాశ్రమము నందుసయిత మసాధ్యంబగు నియమమును చట్టముగనేర్పాటుచేయుట వింతగానున్నది. ఏది యెట్లున్నను, ఇప్పుడుండు చట్టప్రకార ముచితముగాఁ బనిచేయక తప్పదు. ధనవంతులకు నుచితముగఁ బనిచేయు బుద్ధి పొడమకుండుటయుఁ బనిచేయు బుద్ధికలవారికిఁ దగు వసతులు లేకుండుటయు సహజముకదా! అయినను వీనినిగురించి యింత లోతుగ విచారింపనేల? ఇవి బీద జనులకుఁ గల్పవృక్షము; వడ్డీ వ్యాపారముచే జీవించువారికిఁ గుఠార తుల్యము; బలవంతులకు విషప్రాయము; వ్యవసాయమునకు నమృతపానము; జాతీయోద్ధారణకు సంజీవిని. ఈ సంఘములు దేశమునకుఁ జేయు మేలు మఱియొండు చేయఁజాలదని నేఁ ద్రికరణశుద్ధిగ నమ్ముచున్నాఁడ. కాన జాతీయనాయకులు, ఆంధ్ర దేశమందలి ప్రతిగ్రామమందును నీ పరపతి సంఘములు స్థాపించుటకుఁ బ్రయత్నించవలెను. ఈ పరపతి సంఘముల కార్యనిర్వాహకులకు రాజకీయవిషయంబులతో జోక్య మవసరము లేదు. పరపతి సంఘములు దీనజనోద్ధారణమునకై యుద్దేశింపఁబడినవి. ప్రపంచమందలి ముఖ్యదేశంబులలో వ్యవసాయ పరపతి సంఘములకు సంబంధ మధికముగఁ గనఁబడుచున్నదే కాని రాజకీయవిషయంబులతో సంబంధము కనఁబడుట లేదు. స్వరాజ్యముకల దేశములందే యీ రెంటిని వేఱై నంతదూరముగ నుంచుచుండ, దేశాంతరవాసులచేఁ బాలింపఁబడు హిందూస్థానంబున నేల వీని సమ్మేళనము నుద్దేశింపవలెను? ఇప్పటికే కొంతవఱకు నీ సొసైటీలను గురించి పాలకసంఘములయందు, అనుమానాస్పదమైన సంభాషణలు పొడముచున్నయవి. ఈసొసైటీలఁ బరీక్షించుటకుఁ దగిన సిబ్బంది యింతవఱకు లేనందున రిజిస్ట్రేషన్ నిమిత్తము పంపఁబడు దరఖాస్తులు మంజూరుచేయఁబడక నిలువఁబడియున్నవి. ఇప్పటి సొసైటీల సంఖ్య యతిస్వల్పమై యున్నది. ఇట్టి స్థితియందే దరఖాస్తులు పంపుకొన్నఁ గొన్ని నెలలకుఁ గాని యవి మంజూరగుట లేదు. ప్రతిగ్రామమువారును నీసొసైటీల స్థాపింపఁగోరిన యెడలఁ బైయధికారు లేవిధముగఁ జేతురో తెలియకున్నది. కౌన్సిలుసభలయం దుండు ప్రజాప్రతినిధులు, ఈ దరఖాస్తులు సకాలమునకు మంజూరు చేయునట్లు చేయఁగల్గినయెడలఁ జాల మేలుచేసినవా రగుదురు. పల్లెటూరివారు విద్యాగంధము లేనివారు. అజ్ఞానాంధకారమున మునిఁగినవారు. వీరి సహాయముకొఱకే ప్రభుత్వమువారు రాత్రిందివమును బాటుపడుచున్నారని చెప్పు కర్జన్ప్రభువు మొదలు, ఏదియో రావ్ బహదూర్ బిరుదమునకుఁ బాటుపడు చిన్నవకీలు ఉపన్యాసకునివఱకు నిజముగఁ బల్లెటూరివారికి మేలు చేయువా రెవ్వరు లేరు. పల్లెటూరి వ్యవసాయకుని బియ్యముకదా మనము భుజించునది యని వానిని ప్రతి దినసము త్రికాలములందును స్మరింపవలసియుండ, బల్లమీఁదికెక్కి యుపన్యసింపఁబోవునపుడు తప్ప, వారు వీరిజ్ఞాపకమునకు మఱియెప్పుడును రారు. యూరపుఖండమందలి యన్ని దేశములవారును, అమెరికాదేశస్థులును బల్లెటూరివారిని బాగుపఱచుటకు “అన్యోన్య సహాయసంఘములు” తప్ప వేరొండు మార్గము లేదని వానియభివృద్ధికై యెంతయో పాటుపడుచున్నారు. ఈ విషయమై లెక్కలేని పుస్తకములఁ బ్రచురించుచున్నారు. వీని ప్రస్తుతపు స్థితులను భావిలక్షణములను గనుఁగొనుటకు రాయల్ కమిషనుల నేర్పాటుచేయుచున్నారు. అన్ని దేశములవారు నీవిధముగఁ బాటుపడుచుండ నాంధ్రులమైన మనము నిద్రించుచున్నాము.

ధారాళముగ, నిర్భయముగ, నిరాటంకముగ వ్రాయ వీలు గల యీ విషయముంగూర్చి యాంధ్ర పత్రికలు మూకీభావ మవలంబించి యుండుట కడు శోచనీయము. కనుక నికమీఁదనైనను నీవిషయముం గూర్చి యాంధ్రు లెక్కువ శ్రద్ధతోఁ బనిచేసెదరుగాక!

# లోకల్ బోర్డులు - ప్రజల బాధ్యతలు

వేమూరు వేంకట సుబ్బారావుపంతులు గారు, బి. ఏ., బందరు తాలూకాబోర్డు ప్రెసిడెంటు

భారతసమువారు స్వతంత్రప్రజాపరిపాలనము విస్తరింపబూనుకొన్నను, ప్రజలు తగు ప్రోత్సాహమును కలుగజేయనిపక్షమున వారు చేయుప్రయత్నము నిరుత్సాహకరము కాగలదు. కావున నిజముగ ప్రజలకభిరుచి కలదా లేదా యను సంశయము కొంచెము విచారణీయము. సాధారణముగ పల్లెలయందు వసించువారికి విద్యాభ్యాసమునకు తగువీలు లేవు. కొన్నిగ్రామములందు పాఠశాలలే లేవు. కొన్నిగ్రామములందున్నను, పూర్వాచారపరాయణత్వముచే వ్యవసాయకునికి చదు వెందుకని నిరసించువారు కొందరు. తెల్లవారి లేచినదిమొదలు వ్యవసాయపుపాటునందును గృహకృత్యములందును పిల్లలు సయితము కష్టపడనియెడల జీవనము జరగనిహేతువునలన విద్యయందాసక్తికలిగియు విద్యాభ్యాసముచేయలేనివారు కొందరు. ఇతరుల ప్రోత్సాహము లేమిచే, నిరంతరముగా ఆశించియున్న జడత్వము తొలగకపోవుటవలన విద్యయందభిరుచిలేక ఊరకుండువారు మరికొందరు. ఇట్లనేకహేతువులచే మన దేశమందు విద్య అభివృద్ధినొందకున్నది. ఎవరెవరు సాధారణముగ చేయుచున్న పనులను వారువారు చేయుచు ఈతిబాధలు లేక సంతుష్టిగా నుండిన, జనులు తమజీవితమున కనుకూలమగు మార్గములను వదలి ఇతర మార్గముల బ్రవేశింపజాలరు. ఏదియో కొంత మనసునకు నొప్పిగాని, అసంతుష్టిగాని, కలుగనిచో, మనుజుడు క్రొత్తయత్నములుచేయనోపడు. కావున, విద్యాభివృద్ధిచేతగాని, ప్రముఖులగువారు చెప్పుటచేతగాని, తన యభివృద్ధికి కారణము లగు సంగతులను గ్రహింపకున్న, పామరు డెట్టి ప్రయత్నమును జేయడు. ఇక విద్యాభివృద్ధి చేయవలెనన్న విశేషద్రవ్యసహాయము కావలెను. ఇది సాధారణజనులవలన లభించుట దుస్తరము. గవర్నమెంటువారు ఇప్పుడిప్పుడు విశేషముగ పాఠశాలల స్థాపించుచున్నారు. కాని ఇంకను హెచ్చుగ ద్రవ్యసహాయము చేయనియెడల పామరత్వము పోనేరదని మనము నొక్కి మనవిచేయుచుండవలెను. విద్యాభివృద్ధి లేకున్న, వారు మన కొసంగెడు పరిపాలనాధికారముల నెట్లు నిర్వహింపగలము? మనలోని విద్యాధికులు అప్పుడప్పుడు గ్రామాంతరములకు బోయి ప్రజాపరిపాలనాదివిషయములను గూర్చి పల్లెలలోనివారికి చక్కగ బోధించి వారి కెక్కువయభిరుచి కలుగజేయవలెను. ఇది యొక విధాయకకృత్యముగ బూనుకొనినచో కొద్దికాలములో చాల అభివృద్ధి కాగలదు. కుగ్రామములందు సైతము ఇప్పుడు కొందరుకొందరు బుద్ధిమంతులును దేశవిద్యయందు పరిశ్రమచేసినవారును కనబడుచున్నారు. కాని, మంచి మార్గములయందు వ్యాపకము లేకపోవుటచే, కక్షలయందును పార్టీలు ఏర్పరచుటయందును వీరి తెలివితేటలు వ్యయపడుచున్నవి. అట్టివారికి ఉత్సాహకరము లగు మంచిసంగతులను పలుమారు బోధపరచుటచే దేశమునకు లాభము కలుగక మానదు. ఇక మనప్రముఖులస్థితి ఎట్లున్నదనిన, వారి యోగక్షేమము వారు చూచుకొనువారేగాని, తమకంటె తక్కువ జ్ఞానముగలవారిని ఆదరించి, వారి యభివృద్ధికై పాటుపడువారు బహుస్వల్పము. విద్యావంతులు మొదట మొదట వారి యుదరపోషణ జరగక పాటుపడుచున్నారను సంశయము నిజమే. కొన్నాళ్లకు వారిలో కొందరు ధనికు లగునప్పుడైనను తమయల్పసోదరులకు సాయము చేయబూనుకొనగూడదా? మ్యూనిసిపల్ మెంబర్లము కావలెననియు, కలెక్టర్లతో సమానముగ కూర్చుందమని బోర్డుమెంబర్లు కావలెననియు, అంతటితో జాలక హానరెబిల్ బిరుదాంకితమునవహించి గవర్నర్లతో సమానముగ నుండవలెననియు తంటాలుపడుచున్నారేగాని, వారివారి విధికృత్యముల నెరింగి ప్రజాభివృద్ధికితగు ప్రయత్నముల జేయబూనినవారు అరుదు. ఇట్లు వ్రాయుటచే, వారినిగాని వారియూహలనుగాని నిరసించితి ననుకొనగూడదు.

అట్టి కోర్కెలు ప్రజలకు పూర్తిగ కలుగవలెననియే నా తాత్పర్యము. అట్టి ఉత్సాహము విస్తారముగ ఉద్భవించినగాని మన దేశము బాగుపడదు. కాని, ఇందుతో పాటు, వారి నెన్నుకొనువారిని కూడ ఉత్సాహశక్తిచే, నభివృద్ధి నొందించినగాని దేశము బాగుపడదని మనవి చేయుచున్నాను. మనల నెన్నుకొనిన వోటర్లు, మనయందు విశేషగౌరవము కలిగియుండుటవలననేగదా, మనకు అధికారస్థానము లభించినది. కనుక, వారలకు మనము చెప్పెడి యంశములు వారిమనసుల నాటగలవు. విద్యాధికు లందరును తమతమ వీలునుబట్టి ఏమాత్రమైనను కొంత కాలము పామరజనుల యభివృద్ధిహేతువు లగు వ్యాపారములందు వినియోగించుటకు గోరుచున్నాను.

పురాతనగ్రంథములనుగాని స్కూళ్ళలో చదివెడు గ్రంథములనుగాని చూచినంతమాత్రమున జ్ఞాన మభివృద్ధి చెందనేరదు. ఏకాలమున కాకాలము ప్రపంచమం దెల్లెడలను జరగెడు వృత్తాంతములు తెలియుట అవసరము. ఇందువలన లోకానుభవము వృద్ధికాగలదు. లోకానుభవము వలననే గదా, మనసంఘమందలి చెడుగులను తెలిసికొనగలము. కూపస్థమండూకన్యాయమున ఎవరిగ్రామమున వారు కూర్చుండి ప్రపంచమం దెట్టి మార్పులు కలుగుచున్నవో చూడలేరు సరిగదా, గ్రంథములవలనను, వార్తాపత్రికలవలనను, ఈవిషయమున జరగెడు సభలకు వెళ్లుటవలనను, జ్ఞానాభివృద్ధిని కలుగజేసికొనుటకైనను యత్నింపకున్నారు. పాపము, అచ్చటచ్చట వార్తాపత్రికలను స్థాపించి దేశాభివృద్ధికై పాటుపడుచున్నవారు, చేతిచమురు భాగవతమన్నట్లు ద్రవ్యనష్టమును కూడ పొందుచున్నారు. వారికి తగు సాయ మిచ్చి వారి పత్రికను తెప్పించుకొనిన, వారికి నష్టము లేకపోవుటచే ఇంకను ఎక్కువ ప్రయత్నములను వారు చేయబూనుకొనులాగున చేయగల్గుదుము. అందువలన దేశాభివృద్ధి కలిగి జాతీయాభ్యుదయ ముత్పన్నమగును. దేశలాభ మట్లుండ, మనకు జ్ఞానము కలిగి, సోదరభావము హెచ్చి, నిజముగు ఆర్యపుత్రు లగుదుము. అన్నిమతములకంటెను ఔదార్యవంతమని, మనవలననేగాక, ఇతరమతములవారివలన గూడ విశేషముగ కొనియాడబడుచున్న మన ఆర్యమతము, సర్వసమత్వమును, సోదరభావమును, నిష్కామకర్మాచరణమును పలువిధముల బోధించుచుండ, అట్టిగౌరవమతమందు బుట్టి, చిన్ననాటనుండియు మన తల్లులు చేయుచుండెడు వ్రతములను జూచుచున్నను, వానితాత్పర్య మిసుమంతైన గ్రహించక, స్వోదరభరణముమాత్రమే చూచుకొనుచున్న మనము ఆర్యపుత్రుల మనిపించుకొనగలుగుదుమా? ఎవరికి వారము, మనము చేయుచున్న పనులు క్రమమైనవేనా? మన జాతి కుల దేశ ధర్మముల నేమాత్రమైన జేయుచున్నామా? అని శంకించి ఆత్మశోధన చేసికొంటిమా నిజము తేటపడగలదు. సోదరులారా! ఇకనైన మేలుకొనుడు. కాలవశమున గాఢనిద్ర జెంది అనేకలాభములను పోగొట్టుకొనుచున్నాము. ఇంకను ఇట్లే కాలము వ్యర్థపుచ్చెదరేని జాతీయమరణము సంభవించగలదు. దొరతనమువారిలో చాలమంది ఔదార్యవంతులును కేవల ధర్మిష్ఠులు నగుటచే, మన తెలివితేటలకు తగినట్లు సంచరింపక, ప్రజాభివృద్ధిని కలుగజేయవలె నని పలుగతుల యత్నించుచున్నారు. వారి ప్రయత్నములకు తోడ్పడి మీ విధాయకకృత్యముల నెరవేర్పరేని దేశము వృద్ధి పొందజాలదు.

మన చెన్నపురిరాష్ట్రమందు 25 జిల్లా బోర్డులును 95 తాలూకా బోర్డులును గలవు. వానియందు 2494 మెంబర్లు గలరు. ఇందు సగముమందిని ఎన్నుకొనుటకు ప్రజలకు ఎలెక్షను అధికారమును శ్రీగవర్నమెంటువారు దయచేసినారు. ఇట్లుండ 100 మెంబర్షిప్పులు ఖాళీకాగా, అందు మనవారు 26 గురిని మాత్రమే ఎన్నుకొనిరి. తక్కినవారిని గవర్నమెంటువారు ఏర్పరచవలసివచ్చెను. ఇ దెంత అవమానకరమో యోచింపుడు. గవర్నమెంటువారు మనకు దయతో పిలిచి అధికార మియ్యగ, అట్టి యధికారమును చలాయింపనశక్తులముగ నుండుట కడు శోచనీయము. ఈవిషయమున ఒకసంగతి మాత్రము విచారింపవలెను. చాలవరకు వోటర్లకు (అనగా మెంబర్ల నెన్నుకొను అధికారము గలవారికి) ఎలెక్షను (మెంబర్ల నెన్నుకొను) సమాచారమే తెలియదు. గెజటీలో

ప్రచురించుటయే గాని అది ఎల్లరకు సాధారణముగ తెలియుట లేదు. నిజముగ తెలిసినచో ఇంత అన్యాయముగ ఊరుకొన రని తలచెదను. కావున కొంతకాలమువరకు గెజటీలను, వార్తాపత్రికాధిపతులు తెప్పించి ఈ సంబంధమగు సంగతులను ప్రచురించుచుండిన వోటర్లకు ఎక్కువ ప్రోత్సాహకరముగ నుండు నని నా యభిప్రాయము. మ్యూనిసిపాలిటీలలోను, లోకలు బోర్డులలోను ఎలెక్షను అధికారము ప్రజలు క్రమముగ నెరవేర్చనియెడల, అంతకు పైరాజ్యాంగములలో ఇట్టి అధికారము మనకు లభించనేరదు సరిగదా, లోపము మనయొద్ద నుంచుకొని ఏమొగముతో గవర్నమెంటు వారిని ఎక్కువ యధికారము లిమ్మని కోరగలము? కావున పత్రికాధిపతులు, తరుచుగ ఈవిషయములను ప్రచురింపవలెను. ఎలెక్టెడు (ఎన్నుకొనబడిన) మెంబర్లు తరుచుగ వారిఫిర్కా-గ్రామముల వోటర్లను సభగా కూర్చి అప్పుడప్పుడు స్వతంత్రపరిపాలనాంశములగూర్చి ఉపన్యసించుచుండవలెను. దేశాభివృద్ధి నేమాత్రమైనను హెచ్చింపవలె నను కోర్కె గల ప్రతిదేశీయుడును వీలువెంట తా నెరిగిన గ్రామములకైనను అప్పుడప్పుడు వెళ్ళి ప్రోత్సాహకరముగ బోధచేయుచుండవలెను. ఇకను ఉద్యోగములలో నుండెడివారందరు తాము గ్రామములవెంట సరిక్యూటువెళ్ళినప్పుడు రహితులను దగ్గరబిలిచి వారికష్టనిష్ఠురముల విచారించి న్యాయముచేయుట వారి విధికృతమేగాని, వారు కూడ ఎలెక్షను విషయములగూర్చి రహితులతో వారికి గవర్నమెంటు వారు దయచేసిన యధికారమును ముచ్చటింపగూడదా? ఇది గవర్నమెంటు వారికి వ్యతిరేకపు పని కాదు సరిగదా, ఈసంగతులు తెల్పుటచే గవర్నమెంటునందు ప్రజలకు ఎక్కువ అనురాగము పుట్టగలదు. అందుకు గవర్నమెంటు వారు కూడ సంతసింతురు. కావున, ప్రజలకష్టమువలన సంపాదింపబడిన ద్రవ్యముచే పోషింపబడు ఓయధికారులారా! కొంచెమైనను ప్రజాక్షేమమునకై పాటుపడి దేశాభివృద్ధిని కలుగజేయుడు. మీ కిది న్యాయమగు విధి. కష్టముల జెప్పుకొనవచ్చిన రైతుల బయటికి కొట్టుమనెడి ప్రభువులు కొందరున్నారు. వారికి గాదు ఈ ప్రార్థన. న్యాయదృష్టిగలవారును, విద్యావంతులు ననేకు లున్నారు. అట్టివారినే హెచ్చరించెదను. ఇదియును గాక లోకలు బోర్డుల ప్రెసిడెంట్లు గ్రామములవెంట వెళ్ళినప్పుడు గూడ రైతులతో ఈసంగతులను గూర్చియు, పారిశుద్ధ్యము, విద్యాభివృద్ధి మొదలగు ముఖ్యాంశములను గూర్చియు ముచ్చటించుట విధాయకకృత్య మని తలచెదను. ఇట్లుపలు విధముల పలుమంది పాటుపడిన గాని దేశాభివృద్ధి కలుగనేరదు. లోకల్‌బోర్డుల ప్రెసిడెంట్లు వారి తీర్మానములను, వార్తాపత్రికల కిచ్చుట ముఖ్యము. పత్రికాధిపతులు ఈ విషయమున ప్రెసిడెంట్లకు వ్రాసి అన్ని విషయములు ప్రచురించుచు, అప్పుడప్పుడు ముఖ్యాంశములనుగూర్చి వ్యాసముల వ్రాయుచుండుట విధాయకము. శరీరకష్టమే కాక ద్రవ్యనష్టమునకు గూడ నోర్చి కృషిచేయుచున్న పత్రికాధిపతులుపైపనులు చేయుదురుగాని, వానిని చదువనుద్యుక్తులు లేనియెడల ఏమి లాభము? గ్రామమునకొక్క వార్తాపత్రికను తెప్పించిన ఎంత లాభము కలుగును? రు 100 లు సిస్తు చెల్లించెడివారు రు 3లు లేక, రు 4లు సాలు కొక పర్యాయము వెచ్చించి వార్తాపత్రికల తెప్పించుకొనలేరా? ఇది కేవల పరార్థమే కాదు, స్వార్థము కూడ లభించునుగదా! ఇట్టి స్వల్పవ్యయముచే ఎక్కువ లాభము పొందగల విషయమును నిరసించుట న్యాయమా? గ్రామ మందరు కలిసి ఒకటిరెండు పత్రికలు తెప్పించుట ఏమి కష్టము? ఎన్నెసి చందాల నిచ్చుచున్నారు. డాబా ఖర్చులతోపాటు ఎకరము కొక పైస పోగుచేసిన కావలసినంత ద్రవ్యము సమకూడును. ఇదంతయు నిజముగ డబ్బు లేక కాదు; దానియం దభిరుచి లేకయే ఈ పాట్లు వచ్చినవి. వార్తాపత్రికల మూలమునను, ఇతరవిధములవలనను, ప్రజలు తమ యధికారములను గ్రహించి, విద్యాధికులును జనసామాన్యులును గలిసి పనిచేసినచో, దొరతనమువారు మన ప్రార్థనల నాలకించి దేశము బాగుపడునట్లు గావింతు రనుట కేమియు సందియము లేదు.

# యుద్ధాచరణ విధానములు

ముత్తరాజు వేంకటసుబ్బరావు పంతులుగారు, ఎమ్. ఏ.

గతసంవత్సరాదిసంచికయందు హిందూదేశాధీశులు రణంబునకుఁ జొచ్చుటకు శాస్త్రోక్తములైన కారణంబులును, జరిత్రోదితంబగు కారణంబులును జర్చింపఁబడియె. ఇఁక నిందు యుద్ధాచరణవిధానములు కొంత చర్చింపఁబడును.

**యుద్ధభేదములు** — శుక్రుండు యుద్ధములను ధర్మము లనియు, కూటము లనియు ద్వివిధములుగా విభజించె. అందు ధర్మశాస్త్రోక్తవిధుల కనుగుణ్యముగాఁ గావింపఁబడినవి ధర్మయుద్ధములు. ఇతరములు కూటయుద్ధములు. మఱియు నతఁ డాయుధభేదమును గైకొని యుద్ధములఁ ద్రివిధముగా విభజించె. రణంబు మంత్రాస్త్రంబుల నయిన దైవం బనియు, నాలాద్యస్త్రముల నైన నాసుర మనియు, ఖడ్గాదిశస్త్రములను గాని బాహువులను గాని యైన మానవ మనియుఁ జెప్పంబడియె. మనుస్మృతికారకుఁడు యుద్ధంబులను రెండువిధములుగా విభజించె. అందు మొదటి దొకనిచే స్వలాభమునకై కాలాకాల విచక్షణ లేక ప్రారంభింపఁబడునది. రెండవ దొకనిచేఁ దనకుఁగాని తనమిత్రునకుఁగాని కలిగిన యపకారపుఁ బ్రతీకారమునకై యారంభింపఁబడునది. ఇంక చాణక్యుఁడు యుద్ధములను బహిరంగము లనియు, ద్రోహయుక్తము లనియు, నిశ్శబ్దము లనియుఁ, ద్రివిధముగా భాగించె. మాయోపాయంబులఁ గాక బహిరంగంబుగ నొనర్పఁబడునది బహిరంగయుద్ధము. జయార్థమై న్యాయాన్యాయవిచక్షణ లేక శాస్త్రవిరుద్ధముగఁ జరుపఁబడునది ద్రోహయుక్తము. రాజకార్యనిర్వహణధురంధరు లగు వారిచేత వాగ్రూపమునఁ గాని పత్రికామూలమునఁ గాని రాజకార్యసిద్ధికై సలుపఁబడునది నిశ్శబ్దము.

**యుద్ధోచితకాలము** — యుద్ధమునకు శరద్ధేమంత శిశిరఋతువు లుత్తమంబులు. వసంతంబు మధ్యమంబు. గ్రీష్మం బధమంబు. వర్షాకాలం బధమాధమంబు. ఈ కాలనిర్ణయము మన హిందూదేశశీతోష్ణస్థితి ననుసరించి చెప్పంబడియె. ఇట్లున్నను నవశ్యంబయిన కార్యంబు ప్రాప్తింపనియెడల, నకాలంబుననయిన యుద్ధంబుఁ గావింపనగు ననియుఁ జెప్పఁబడియున్నది. మఱియు వీనికన్నిఁటికంటె గాలనిర్ణయమునకు యుద్ధకాముకుని సైన్యసన్నద్ధతాసన్నద్ధతయే ముఖ్యముగాఁ జెప్పఁబడియె. తా నెప్పుడు యుద్ధసంభారసంపన్నుఁడును నుత్సాహవంతుఁడును శుభశకునుండును నగునో యక్కాలంబు సమీకంబునకు నుత్తమంబు. మఱియు శత్రుభూపాలుండు భిన్నమంత్రబలుఁడై విషయాసక్తుఁడై యుద్ధసంభారహీనుఁడై దుర్గతుఁడై యున్నకాల ముత్తమోత్తమంబు.

**సైన్యభేదములు** — శస్త్రాస్త్ర సంయుక్తంబయిన మనుష్యాదిగణంబు సైన్యంబు నాఁబడు. సైన్యము స్వగమం బనియు నన్యగమం బనియు ద్వివిధంబు. పరాపేక్ష లేక గమనశీలంబు స్వగమంబు. ఉ.-పదాతులు. యానసహాయంబునఁ బోవునది యన్యగమంబు. ఉ.- రథగజతురగములు. సేన స్వరాజ్యరక్షణమునకు రిపుపరాజయంబునకు సమర్థమగుటంజేసి రాజుల కత్యావశ్యకము. సేనాబలంబు స్వీయం బనియు మైత్రం బనియు ద్వివిధంబు. అది మౌలసాద్యస్కభేదంబున మరల ద్వివిధంబుగాఁ బరఁగు. ఇది యెల్లను సారంబు నసారంబు ననియు, శిక్షితంబు నశిక్షితంబు ననియు, గుల్మీభూతంబు నగుల్మీభూతంబు ననియు, దత్తాస్త్రవాహంబు స్వాస్త్రవాహంబు ననియు నిఱుదెఱఁగుల నుండు. సౌజన్యంబునఁ గార్యసాధకం బయినబలంబు మైత్రంబు; భృతిపాలితంబు స్వీయంబు; అనేకవత్సరములనుండి యనుబంధించినది మౌలంబు; నూతనముగ సంపాదింపఁబడినది సాద్యస్కంబు; సుయుద్ధకాముకంబు సారంబు; విపరీతం బసారంబు; వ్యూహాదికుశలంబు శిక్షితంబు; విపరీతం బశిక్షితంబు; సాధికారకంబు గుల్మీభూతంబు; స్వస్వామికం బగుల్మీభూ

తంబు; రాజశస్త్రాస్త్రంబుల గ్రహించునది దత్తాస్త్రవాహము; తక్కినది స్వాస్త్రవాహము. మఱియుఁ గిరాతాదికం బారణ్యకం బనియు శత్రులచే నుత్సృష్టంబై తన భృత్యవర్గమునఁ జేరినదియు భేదోపాయంబున స్వాధీనం బయినదియు శత్రుబలం బనియుఁ జెప్పఁబడె. ఈ వివిధంబు లగు సేనల ననిలో నుపయోగింపవచ్చును. కానియం దారణ్యకంబును శత్రుబలంబును నధమంబులు. మౌలంబును శిక్షితంబును నుత్తమంబులు.

**సైన్యసంపోషణము** — యుద్ధకుశలు లగు సంగ్రామదక్షులతో నియుద్ధార్థంబునను, వ్యాయామంబునను, బలపోషకంబు లయిన యాహారంబులను, శారీరబలంబును; వ్యాఘ్రాదిమృగంబులతోడి మృగవ్యంబునను, శస్త్రాస్త్రాభ్యాసపాటవంబునను, శూరసంసర్గంబునను, శౌర్యబలంబును; రాజు వృద్ధిచేయునది. సైనికులకుఁ గాలమునకు భృతి నిచ్చుచు వారి నుత్సాహులుగాఁ జేయునది. పాదాతంబునందుఁ జతుర్థాంశంబయిన యాశ్వికబలంబును, పంచమాంశంబయిన వృషబలంబును, సప్తమాంశంబయిన క్రమేలకబలంబును, దానం జతుర్థాంశంబు గజబలంబును, దానియం దర్ధాంశంబయిన రథికబలంబును, దద్బలంబునకంటె ద్విగుణంబయిన బృహన్నాళీకబలంబును, రాజు లెల్లప్పుడును సంపాదింపవలయును. పలుకుఁబ్రల్లదమునను, గఠినదండంబునను, భృతిహ్రాసంబునను, నిత్యప్రవాసాయాసంబునను, సేనల భేదిల్లఁజేయక యుద్ధసమయమున సైనికులకుఁ జతుర్థాంశము భృతి నెక్కుడుగ నిచ్చియు మద్యమును బానార్థ మిచ్చియుఁ బోషించునది. రణనిహతులైన సైనికుల కుటుంబములకు రాజు ధన మిచ్చి పోషించునది.

**సైన్యవ్యూహములు**— భయస్థానంబు లయిన నద్యద్రివనదుర్గంబులందు సేనాని వ్యూహాకృతంబులయిన బలంబులతోఁ జనునది. పురోభయంబు ప్రాప్తించునపుడు మకరవ్యూహంబునను, నుభయపక్షభయంబున శ్యేనసూచీవ్యూహంబులనేనియుఁ, బశ్చాద్భయంబున శకటవ్యూహంబునను, నలుదెసల వెఱ పుప్పతిల్లిన సర్వతోభద్ర, వ్యాల, చక్ర వ్యూహంబులనేనియు వాహినీపతి పన్నునది. కొన్ని వేళల దేశానుసారంబుగ భిన్నవ్యూహంబులనేనిఁ బన్నందగు. మనదేశమున జరగిన ప్రాచీనయుద్ధములలో నెట్టివ్యూహములఁ బన్నిరో మన కెఱుకపడదు. భారతంబు మాత్రము కురుక్షేత్రసంగ్రామంబునఁ బద్మాదివ్యూహంబులు పన్నఁబడియె నని తెలుపుచున్నది. యుద్ధభూమియందు మహాంతములైన నాళికాస్త్రముల ముందిడి వానివెనుకఁ బదాతుల నిలిపి గజాశ్వములఁ బార్శ్వముల నునిచి యుద్ధమునకుఁ బూనుకొనునది. రాజును ధనంబును సైన్యమధ్యంబున నుండునది. మఱియు రాజు జంత్రములనేని యస్త్రములనేని యేస్థలమున నిల్పిన శత్రుసేనాభేదంబు సులభమగునో యట్టి స్థలమును యుద్ధభూమిఁగా నిర్ణయించుకొనునది.

**దుర్గవశీకరణము** — శుక్రుండు దుర్గంబులదొమ్మిది విధములుగా విభజించె. అందు ముఖ్యములు జల, వన, గిరి, సైన్య దుర్గంబులు. సైన్య మెల్లదుర్గంబుల కలంకారంబు గాన నది లేని దుర్గంబులు నిష్ఫలంబులు. సైన్యదుర్గంబు గల రాజునకు స్థలం బెల్ల దుర్గప్రాయం బగు. దుర్గంబుల నెల్ల వీరాగ్రేసరులను, ధనధాన్యంబులను, దదితరసంభారంబులను, సిద్ధముగ నుంచవలయును. శత్రురాజును దుర్గమందు ముట్టడించినప్పు డచట శిబిరము వేసికొని శత్రుబలపోషకములైన తృణాన్నజలసంభారములను లోనికిఁ జేరనీయక యా దుర్గప్రాకారములను గండకములను నాశనముఁ జేసి కాలానుసారముగ నతనిని వశ్యునిఁగాఁ జేసికొనునది. మఱియుఁ దన శత్రువునకుఁ దెలియకుండఁగనే యకస్మాత్తుగ దుర్గమును ముట్టడించి దానిని లోఁబఱుచుకొనవచ్చును. తాను ముట్టడించుచున్న శత్రువు లోఁబడినయెడలఁగాని శత్రువు లోఁబడకుండఁగనే కోట స్వాధీనమయినపుడుగాని దేశమందు క్షోభముగాని క్షామముగాని కల్పనచేయరాదు.

**రణోచితాయుధములు**— మంత్రంబుననేని జంత్రంబుననేని నగ్నినేని నెద్ది క్షిప్తంబగు నది యస్త్రము. తద్భిన్నము శస్త్రంబు. అస్త్రము మాంత్రికము, నాళికము నని ద్వివిధము. మంత్రప్రయోజ్యంబైన యస్త్రము మాంత్రికము. అగ్నిచూర్ణప్రయోజ్యంబైన యస్త్రము



The Connemara Library.

కానెమారా పుస్తకాలయము



The Interior of St. Thome Church.

సాంతు థోము క్రైస్తవాలయాంతర్భాగము



The Pachaippa's College.

పచ్చయప్పకాలేజి



The Victoria Technical Institute.

విక్టోరియా సాంకేతికవిద్యాలయము

Photos by Messrs Weil & Klein and Venkiah Bros.



The Light House, Vizagapatam

విశాఖపట్టణము, దీపాలయస్థలము



View from Muslim Mosque, Vizag.

విశాఖపట్టణము, మసీదుస్థలము

Photos by Messrs Weil & Klein and Venkiah Bros.

నాళికము. ఇవి రెండును దొరకనితరుణమున శస్త్రముల నుపయోగించుట యర్థము. మంత్రప్రయుక్తము లగు నాయుధములఁ బ్రమాణశూన్యము లని త్రోసివేసినను నాళికాస్త్రములను గుఱించి కొంతచర్చఁ జేయవలయును. చాణక్యుఁడు భార్గవుఁడుఁ దమతమ గ్రంథముల నగ్నిచూర్ణమును జేయు విధములను దాని నుపయోగించు సాధనములనుం బేర్కొనియున్నను దానింబట్టి యట్టి యాయుధముల మనవా రుపయోగించి రనుటకుఁ జరిత్రాంశము లేవియుఁ దార్కాణముగ లేవు. ఒకవేళ చీనా దేశస్థులకు నగ్నిచూర్ణసంవిధానము పురాతనకాలము నుండి తెలిసియుండుటంజేసి మనవారి కది వారిమూల మునఁదెలిసియుండె ననుకొన్నను వారు నాళికాస్త్రములు యుద్ధమునందుఁ బ్రయోగింపలే దని రూఢిగాఁ జెప్ప వచ్చును. ఏల యనఁ బూర్వము హిందూదేశమునకు వచ్చిన విదేశీయులలో నొక్కఁ డయినను ననేకస్వల్పాంశములఁ బేర్కొని దీనినిగుఱించి వ్రాయఁడయ్యె. మఱియు మనవా రట్టి యాయుధముల యుద్ధమునం దుపయోగించిన వారికి మహమ్మదీయులచేతిలోఁ బరాజయము గలుగుట యసంభవము కావున మనవా రట్టి నాళికాస్త్రముల నుపయోగింపక శస్త్రములనే ముఖ్యముగ వాడుచుండి రని నమ్మవలసియున్నది. శస్త్రములలో ముఖ్యమైనవి ఖడ్గము, ధనుస్సు, కుంతము, పాశము మొదలగునవి. వీని నన్నిటిని బహిరంగముగాఁ బ్రయోగింపనగుఁగాని, పొదలచాటునుండిగాని శిలలచాటునుండి గాని ప్రయోగింపఁదగదు. అగ్నిముఖములుగాని విషముఖములుగాని యగుబాణములఁ బ్రయోగింపఁదగదు. ఈ నిషేధము లాచరణములో నుండినయెడలఁ బూర్వహిందువు లాధునికులకు నీవిషయమునఁ దీసిపోలే దని చెప్పవచ్చును.

**రణరంగము**— రణరంగంబున జయము శత్రురాజుగాని సేనానిగాని పలాయితుఁడైనను బట్టుపడినను లబ్ధమగును. అందు నొక యోధుఁడు మఱియొకనితో మాత్రమే యుద్ధముచేయవలయును. శత్రువు యుద్ధోపకరణముల సజ్జీకృతుఁడై వచ్చినఁ దానును నట్టిసన్నాహమునే చేసికొని రావలయును. సైన్యసమేతుఁడై వచ్చిన వానిని సైన్యముతో నెదుర్కొనవలయును. న్యాయబాహ్యం బగు యుద్ధమునకుఁ దొడంగినవాని న్యాయచింత లేకయే మార్కొనవచ్చును. అట్లుగాక న్యాయమార్గమునఁ బోరువానితో నట్లే పోరవలయును. అశ్వారూఢుఁ డశ్వారూఢునితోడను గజారూఢుఁడు గజారూఢునితోడను రథికుఁడు రథికునితోడను నస్త్రశస్త్రసన్నద్ధు లస్త్రశస్త్రసన్నద్ధులతోడను యుద్ధమునకుఁ జొచ్చునది.

**రణవధ్యులు**— శస్త్రము ధరించి చంపనే తెంచిన ప్రతిమనుజుని వధింపవచ్చును. వాఁడు బాలకుఁడైనను వానినిఁ జంపిన దోషము లేదు. ఆత్మరక్షణమునకై యాతతాయులైన బ్రాహ్మణులను విద్వాంసులను గురువులను నైన వధింపవచ్చును.

**అవధ్యులు**— యుద్ధరంగమునఁ బ్రాణహానిని సాధ్యమైనంతవఱకుఁ దగ్గించుటకుఁ బెక్కు నిబంధనలు గన్పట్టుచున్నవి. వీనివలన ననేకులు మృత్యువువాఁతనుండి రక్షింపఁబడి రనుట నిర్వివాదాంశము. సద్యోధుఁడు రణభీరుని, షండునిఁ, గృతాంజలిని, లంబకేశుని, నుపవిష్టుని, నపుత్రకుని, నిద్రావశునిఁ, దనుత్రాణవిహీనుని, నగ్నుని, నాయుధశూన్యుని, భగ్నాయుధుని, దుఃఖకర్శితుని, భయకంపితుని, గాయపీడితుని, ‘నీ వాఁడను రక్షింపు’ మని ప్రార్థించువానిని, రణావలోకనమునకు వచ్చినవానినిఁ, బూఁటగఱచినవానిని, మఱియొకనితోఁ బోరాడువానిని, యుద్ధమునుండి తొలఁగి చనువానిని వధింపఁగూడదు. మఱియు శత్రువు మిగుల క్లాంతుఁడైనప్పుడును, భుజించుచున్నప్పుడును, నన్యకార్యవ్యాపృతుఁడైనప్పుడును, వానిని శూరుఁడు చెనకఁగూడదు. ఇంకను బాలురను, వృద్ధులను నబలలను, రాజును, బ్రాహ్మణులను, నున్మత్తులను నెదుర్కొనుట గాని వధించుట గాని తగదు. మఱియుఁ బాఱిపోవుచుండు శత్రుసైన్యంబుల వెంటనంటి తఱుముటయు, శత్రునకు మైత్రసైన్యంబులఁ దాఁకుటయు నిషేధింపఁబడియె. ఈశాసనములు మనపూర్వుల దయార్ద్రహృదయమును బరమార్థచింతను వేనోళ్ళఁ జాటుచున్నవి. ఇవి

యాధునికాంతర్దేశీయశాసనములకంటె నెక్కుడు గౌరవపాత్రములుగాఁ దనరుచున్నవి.

రణానంతరము — రణమునందుఁ బట్టువడిన సైనికుల విషయ మిట్లు చెప్పఁబడియె. శత్రువు గాయపీడితుఁడైయున్న జయశీలుఁడగు రాజు వానినిఁ దనదేశమునఁ జికిత్సచే విగతవ్రణుఁ జేయవలయును. అట్లొనర్చుటకువీలు లేనియెడ వానిదేశమునకైనఁ బంపివేయవలయును. గాయము తగులనివారిని గొలఁదికాలములో విడుదలచేయవలయును. ఒకప్పుడు వారిని సేవకావృత్తియం దుంచినను బ్రాణములకు మాత్ర మపాయము గలుగకుండఁ బోషింపవలయును. ఇందువలన మనకు శాస్త్రోక్తముగ రాజులు ప్రతిఫల మేమియుఁ గైకొనకయే పరాజితులై బందీకృతు లగువారిని విడుదలచేయవలయు నని తెలియుచున్నది. ఐనను నీశాసనము లెంతవఱకు నాచరణీయములుగ నుండెనో చరిత్రాంశలోపమువలన మనము కనుఁగొనుటకు వీలులేదు. మఱియు బాలికలు యుద్ధమున బలాత్కారముగ బందీకృతలుగాఁ జేయఁబడిరేని యొక సంవత్సరమువఱకు వారినిఁ బాణిగ్రహణ మొనర్పఁగూడదు. అట్లు బందిఁగాఁ జేసినవాఁడు వదలివేసిన వారు మఱియొకరి యాశ్రయమును గోరవచ్చును. కాని యట్టి బాలికల నిర్బంధించి వివాహమాడుట తగ దని చెప్పఁబడినది. దీనివలన జయశీలుఁ డగువానిచేఁ జిక్కిన బాలికలకుఁ గూడ స్వయంవరస్వాతంత్ర్యము గల్గియుండిన దని తెలియవచ్చుచున్నది. మఱియు జేత దేశమునుండి పాఱివచ్చి శత్రుసైన్యముతోఁ గూడి పోరాడుచున్నట్టివారు పట్టువడినయెడల నట్టివారిని జంపక రాజ్యాంతిమదేశమున నెచ్చటనైన నివసింపఁ జేయవలయు ననియుఁ జెప్పఁబడియె. ఇఁక శత్రుభూపాలుఁడే యొకవేళఁ బట్టువడినయెడల వాని దుస్థితినిఁ గాంచి కరుణించి సమ్యగ్విధంబున సత్కారములఁ జేసి యుద్ధాంతంబున నాతని విడుదలచేయునది. ఇదియునుంగాక శాత్రవుల ధనధాన్యంబుల మితముగాఁ గైకొని సైనికులకుఁ బంచిపెట్టవలయును. బందీకృతుల నాదరించుటకై యిట్టి యోగ్యశాసనములు శాసింపఁబడియె. ఆచరణయం దెట్లున్నను నివి యాధునికాంతర్దేశీయ శాసనములకంటె నెక్కుడు దయాన్వితములై గన్పట్టెడిని.

కూటయుద్ధములు — పైఁజెప్పఁబడిన శాసనములన్నియు ధర్మయుద్ధవిషయమై విధింపఁబడినవి. కూటయుద్ధంబున నిట్టి శాసనంబులఁ బరిగణింప నవసరము లేదు. శుక్రనీతియం దీవిషయ మెక్కుడుగఁ బ్రతిపాదితం బైయున్నది. భార్గవుఁడు దీనిని బలహీనులగు రాజులు బలవంతులగు శత్రువులఁ బరాజితులఁ జేయుటకు ముఖ్యోపాయంబుగఁ బేర్కొనియున్నాఁడు. మఱియు నతఁ డింద్రుఁడమూచినిఁ జంపుట, రాముఁడు వాలిని వధించుట, కృష్ణుండు కాలయవనునిఁ గూల్చుట, భీముండు దుర్యోధనునిఁ బరిమార్చుట కూటయుద్ధమున కుదాహరణములుగా నిరూపించె. ఈ విషయమే మహాభారతమున నింతకంటె వివరముగఁ జెప్పఁబడియున్నది. ఒకరాజు తనకంటె బలవంతుఁ డగు మఱియొకని యధీనమున నెల్లకాల ముండరా దనియుఁ దాను బలహీనుఁ డయ్యు సమయము వచ్చినప్పుడు తనపగఱ నెదుర్కొనయత్నింపవలయు ననియు నగ్న్యాయుధవిషప్రయోగంబులవలన వాని రాజ్యము ముట్టడింపనగు ననియు భీష్ముండు బోధించె. దీనిం బట్టి చూడ బలహీనుం డగురాజు బలవంతుఁడగు శత్రురాజుచేఁ బీడింపఁబడి నిరంకుశాధికారముఁ గోల్పోయినవేళ నధర్మయుద్ధము స్వాతంత్ర్యమును మరలఁ గాంచుటకై ముఖ్యసాధనముగాఁ బూర్వు లెంచినట్లు తోఁచుచున్నది. ఏకారణంబున నిట్టి యుద్ధమునకుఁ జొచ్చినను నది గర్హ్యమే యనఁదగును. కార్య మెంత యుత్కృష్టమైన దైనను దానిని సాధించు సాధనంబులును ధర్మబాహ్యములుగాక బుధనుతములుగా నుండవలయును. ఇట్లుండవలసినను ననేక భూపాలురు కార్యసాధనమునకై కూటయుద్ధమునకే చొచ్చి రని మన మూహింపవచ్చును. ఇట్టిది శాస్త్రోక్తమగుటచే రాజులు నిర్భయముగా నట్లే యాచరించుచుండిరని తెలియవచ్చుచున్నది. కావునఁ బూర్వము ధర్మయుద్ధవిషయమైక శాసనంబు లాధునికశాసనంబులకంటె నెక్కుడు దయార్ద్రబుద్ధితోడను ధర్మతత్పరతతోడను నిరూపింపఁబడియుండినను వాని పార్శ్వమున నిట్టి ధర్మబాహ్యంబులును గర్హ్యంబులును నగు కూటయుద్ధాచరణవిధానంబులుండుటం జేసి వానికిఁ గళంకం బొకటి వాటిల్లిన దనుట నిర్వివాదాంశము.

---

# తెనాలి కవులు

మానవల్లి రామకృష్ణకవిగారు, ఎమ్. ఏ.

వేశ్యావాక్కు లగు పండితాగ్రగణ్యుల యభిప్రాయములను లోకమునఁ జిరకాలముగ నూఁదివచ్చు పుక్కిటిపురాణములను సులభముగాఁ బూర్వపక్షముచేసి యబద్ధమని స్థాపించుట మహామతులకేనియు సంపూర్ణ సామగ్రిలోనైనను గడు దుష్కరము. తెనాలి రామకృష్ణుఁడు కృష్ణరాయనిసభలో హాస్యరసచతురుఁడై యుండెనో లేక ఘుతనియనంతరము నూటయిరువదియేండ్లకునుఁ దన పాండురంగమాహాత్మ్యము రచియింపఁ డయ్యెనో యను సంశయము చిరకాలమునుండి నాహృదయమును వేధించుచున్నది. ఈవ్యాసములో సుప్రసిద్ధుఁ డగురామకృష్ణునికాల నిర్ణయమును గుఱించి వ్రాయఁదలంచి యాపేరు గల మఱికొంద ఱుండుటచే వారల సహిత మిందుఁ జేర్చి యించుక విచారించినఁ బ్రతివాదబుద్బుదము లుప్పతిల్ల సాకర్యము చాల దని యీ వ్యాసమునకుఁ బైనామ మిడ వలసివచ్చెను. తెనాలివారలు రామకృష్ణకవి, అన్నయ్య, గిరియప్ప, రామకృష్ణకవి, రామభద్రుఁడు, రామలింగఁడు, అని కొందఱు గలరు. ఇందఱిపేరులు క్రొత్తగ నుడువుట తన్నామధారి నగు నాహాస్యచాతుర్య మని యెవ్వరును దలఁపకుఁడు. పై పరంపరలోఁ గడపటిరామలింగఁడు స్వర్ణకారకులజుఁడు ; గోలకొండతానీషాయొద్ద మంత్రులుగా నుండినయక్కన్నమాదనల యాస్థానకవి. "శ్రీమదుమామహేశ్వరచరణారవిందసేవాప్రవీణ తెనాలివంశపవిత్రార్యజనస్తోత్రపాత్ర మృత్యుంజయనామధేయపౌత్ర మల్లికార్జునతనూభవ రామలింగనామధేయకవి విరచితం బగు ధీరజనమనోవిరాజితం" బను నొక యేకాశ్వాస గ్రంథము స్వర్ణకారకులజప్రాశస్త్యమును వర్ణించునది విలసిల్లుచున్నది. ఇది సుమారు 250 సంవత్సరములక్రిందటిది. కవిత కేవలము కథాసూత్రమునే యనుసరించుచు సామాన్యముగా నడచుచున్నది. సకలజనమనోనయనహరణకౌశలప్రభావిశేషంబు లేకున్నను రంగస్థలీవిలాసంబు లగు మాయాప్రసాధనవిజృంభణంబు లిందుఁ గానరావు.

ఉ. పూర్ణకళావిశేషములపోల్కి చెలంగు ముఖంబులన్ సువి
స్తీర్ణవికాసనేత్రసరసీరుహముల్ మృదులాంచితప్రభా
కీర్ణవిలాసమూర్తిరుచి గీల్కొనఁ జెక్కుల నవ్వులన్ మహా
ద్వర్ణములన్ సజీవములు వావిరి గల్గ నొనర్చి రయ్యెడన్.

అను పద్య మిశ్రనిరచనాధోరణి కుదాహరించితిఁ గాని యిందులోఁ గల యర్థము మాత్రము చదువువారలకుఁ గలుగునట్లు కవి రచియింపఁ డయ్యె. ఇఁకఁ దక్కినవారెల్లరును సగోత్రులు సకుటుంబులు. తెనాలి రామకృష్ణకవియు, అన్నయ్యయు, శ్రీగిరియు నన్నదమ్ములు; ఇమ్మడి రామకృష్ణుఁడు శ్రీగిరి కుమారుఁడు. వీరరాఘవుఁడును రామభద్రుఁడును రెండవరామకృష్ణుని పుత్రులు. వీ రందఱును గ్రంథకర్తలే. వితరణశాలు లగు రాజేంద్రులసభలు నిర్ణిరుద్ధద్వారములై యుండఁగా, "ఊరూర నింట నింట......పదుగురేసి కవులు భవ్యచరిత" అనుమాట యేల నిక్కము కాఁగూడదు? వీరిలో రామకృష్ణకవి కందర్పకేతువిలాసము, హరిలీలావిలాసము, పాండురంగమాహాత్మ్యము, ఘటికాచలమాహాత్మ్యమును; తెనాలియన్నయ సుదక్షిణాపరిణయమును; శ్రీగిరి శ్రీశైలమాహాత్మ్యమును; ఇమ్మడి రామకృష్ణుఁడు కృష్ణచరితయు; రామభద్రుఁ డిందుమతీకల్యాణమును విరచించిరి. వీనిలో నిందుమతీకల్యాణమును బాలచురి కృష్ణభూపాలున కంకితముసేయుచు రామభద్రకవి కవిస్తుతిలో,

ఉ. మామకనవ్యకావ్యము సమంచితమాధురి సారరీతిగా
యామకృతప్రబంధరచనాయతపాకచతుర్విధైకవా
ర్తామహిమోజ్జ్వలాఢ్యకవితాఘనతామహు మత్పితామహున్
రామయరామకృష్ణకవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్.

గీ. తదనుసంభవమణిని సుదక్షిణాప
రిణయముఖకావ్యరచనాధురీణు నంధ్ర
కవికదంబములోనఁ బ్రఖ్యాతిఁ గన్న
యన్నపకవీంద్రు ధీసాంద్రు నభినుతింతు.

అని చెప్పి, తద్రాజేంద్రుఁడు తన్నుఁ బిలిపించి,

సీ. ప్రాభి మీపెదతాత పాండురంగాదిస
    త్కృతులు సేసెను రామకృష్ణసుకవి
అనుజుఁ డన్నప్ప మీపినతాత రచియించెఁ
    బరఁగ సుదక్షిణాపరిణయంబు
మీ తాత శ్రీగిరి చాతురీవిఖ్యాతి
    శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చెఁ
గడిమి మీతండ్రి యిమ్మడిరామకృష్ణాఖ్యుఁ
    డనఁ గీర్తికనె సంస్కృతాంధ్రములను
దొర లనిపించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
నిన్ననూచానసంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి

అని పొగడినట్లు తన యిందుమతీకల్యాణమునఁ జెప్పుకొనియె. ఇఁక మనకుఁ గలుగు సామగ్రితో స్థిరహృదయము లగు పండితభూధరములతోఁ దగురనుంబోలె నించుక సమీపించి చూచెదను. శృంగభంగ మైనను విలాసప్రాప్తవమే.

శ్రీయుత వీరేశలింగంపంతులవారు రామకృష్ణుని గుఱించి యొక్కచో నతఁడు క్రీ. శ. 1560-70 సంవత్సర ప్రాంతమునుండి కవియై యుండవచ్చు ననియు, వేఱొకచోఁ బనునేడవశతాబ్దాదియం దుండె ననుటకు సందేహము లే దనియు, మఱియొక్కచోటఁ బాండురంగమాహాత్మ్యము రచియింపఁబడినకాలము 1650 సంవత్సరము కంటెఁ బూర్వమై యుండ దనియు వ్రాసిరి. తెనాలి రామకృష్ణకవి కృష్ణరాయనిసభలో నుండె నని తక్కిన చరిత్రకారుల యభిప్రాయము.

1. పాండురంగమాహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రి కంకితమయ్యె, నతఁడు కందాళయప్పళాచార్యుల శిష్యుఁడు; మంగయగురువరాజు కుమారుఁ డగు పెద్ద సంగభూపాలునకు వ్రాయసకాఁడు. ఇందులోఁ గందాళయప్పళాచార్యునే చిత్రభారతకృతికర్త యగు చరిగొండ ధర్మనయు వైజయంతీవిలాసకర్తయగు సారంగు తమ్మకవియుఁ బ్రశంసించియున్నారు. తమ్మకవి యయ్యాచార్యునకు శిష్యుఁడు; చరిగొండ ధర్మన కాశ్రయుఁ డగు నిమ్మలపల్లి పెద్దామాత్యుని తండ్రియు నయ్యాచార్యుని శిష్యుఁడట; ధర్మన భట్టపరాశరదేశికునిపౌత్రుఁ డగు రంగనాథదేశికుని శిష్యుఁడు.

2. రామకృష్ణుఁడు భట్టపరాశరుని కుమారుఁ డగు చిక్కభట్టరుకు శిష్యుఁడు.

క. వాక్కాంతాశ్రయభట్టరు
   చిక్కాచార్యులమహాత్ము శ్రీగురుమూర్తిన్
   నిక్కపుభక్తి భజించెద
   నిక్కావ్యకళాకలాప మీడేరుటకున్.—పాండు.

లింగముకుంట తిమ్మనయు నతనికే శిష్యుఁడు.

3. ఇఁక రెట్టమత మనెడి జ్యోతిషగ్రంథము కొండ్రాజు తిమ్మరాజు కుమారుఁ డగు వేంకటాద్రికి నంకితమీఁబడియున్నది. ఆవేంకటరాజు మంగయ గురువరాజు కొమార్తె యగు పాపమాంబకుఁ బుత్రుఁడు; అనఁగా విరూరి వేదాద్రిమంత్రికి యజమాని యగు పెదసంగభూపాలునకుఁ జెల్లెలికుమారుఁడు. ఈ వేంకటాద్రికిఁ గామందక మను రాజనీతిగ్రంథ మొకటి యంకితముగా రచింపఁబడియున్నది. దానిలోఁ బ్రథమాశ్వాసాంతమున,

క. శ్రీంచనద్భట్టరు చి
   క్కాచార్యవరార్యశిష్య యతులితశౌర్య
   ప్రాచుర్యవర్య గుణర
   త్నాచలజయలలితధైర్య నయవినయనిధీ.

అని యున్నందున వేంకటాద్రియుఁ జిక్కభట్టునకు శిష్యుఁడు.

పై సూచించినయంశములలోఁ జిక్కభట్టరు భట్టపరాశరునికుమారుఁ డనుటకుఁ దప్పఁ దక్కిన వన్నిటికిని శ్రీయుతపంతులవారే కవిచరిత్రములో నాధారములు సూపిరి. స్థలసంకోచముచే నిందు వాని నుద్ధరింపఁజాల. చిక్కభట్టు పరాశరభట్టుకుమారుఁడు. తంజావురీనాథుఁ డగు విజయరాఘవునిసభలో నుండిన శేషము తిమ్మకవి తన యంబరీషచరిత్రమున భట్టపరాశరుని పుత్రుఁడు చిక్కభట్టనియు నతనిపుత్రుఁడు రంగనాథదేశికుఁ డనియు నతనికుమారుఁడు చిక్కభట్టనియు మరల నతనిపుత్రుఁడు రంగనాథుఁడు తన గురు వనియు వ్రాసికొనియె.

శ్రీయుతపంతులవారు రెట్టమతము కడపట నున్న యీ క్రిందిపద్య మాధారముగా నొనర్చి రామకృష్ణుని కాలనిర్ణయమునకు నమకట్టిరి.

సీ. కలియుగప్రథమభాగము నాల్గువేల యె
  న్మిదినూర్లపైని డెబ్బదియు నొకటి
శాలివాహనశకసమ లిల వేయునా
  ర్నూటతొంబదిరెండు రూఢిగాఁగ
ప్రభవాదిగతములు పరఁగ నిర్వదిమూఁడు
  నేండ్లయ్యె నెంతయు నెన్న బుధులు
అట్టికాలంబున నయ్యనభాస్కర
  కవివర్యు లలరాజకమలహితుని
యాజ్ఞఁ బూర్వోక్తరెట్టమతాఖ్యకావ్య
ము నొనర్చిరి యాచంద్రముగను గీర్తి.

ఈపద్యము ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నుండు నాల్గుప్రతులలో నొకదానిలో మాత్రము కలదు. నే నిటీవల సంపాదించిన ప్రతులలోఁ గానరాదు. ప్రాఁత ప్రతిలో నుండిన లేఖకదోషసహస్రమును బంతులవారు సవరించిరి. ఈపద్యము ననుసరించి కృతిపతి క్రీస్తుశకము 1769 లో నుండియుండఁగా నతనిమేనమామ యగు పెద్ద సంగభూపాలునకు ప్రాయసకాఁ డగు విరూరి వేదాద్రి మంత్రి క్రీ. శ. 1650 ల కంటెఁ బూర్వుఁడు కాఁజాలఁడు గావునఁ బాండురంగకృతి యంతకంటె నర్వాచీన మనుట దోషముకాదు. అయినను బంతులవారు మామకును నల్లునకును 119 సంవత్సరములు భేదము సూపిన యుక్తి యద్భుతముగా నున్నది. మంగయగురువరాజునకుఁ దొమ్మండ్రు పుత్రులు. వారలలోఁ బెదసంగభూపతి మూఁడవవాఁడు; పాపమాంబ కడగొట్టుచెల్లెలు. ఈ సమృద్ధసంతతిలో నొక్కొకనికిఁ బదియేండ్ల చొప్పున గర్భధారణకాలభేదము చూపినను మూఁడవకుమారున కెట్లు కడగొట్టుచెల్లెలి కొమారుఁడు 120 యేండ్ల పిదప నుండ సంభవించునో యస్మాదృశులబుద్ధుల కగోచరమై యున్నది. ఇంత విశాలకాలము సునిష్ఠితవీర్యుఁ డగు మంగయగురువరా జెట్టి రససిద్ధుఁడో యెఱుఁగఁజాల.

మఱియు నీవేంకటాద్రి,

సీ. శ్రీమదహోబలస్వామిమహారాజ్య
  రక్షకుం డగుచు నేరాజు వెలయు
నభిరామకామందకాఖ్యసత్కావ్యర
  త్నమునకు నేరాజు నాథుఁ డయ్యె
నెగయూరిపురవరాధీశాదిబహుబిరు
  దాంకుఁడై యేరాజు యశము గాంచె
జానకీనాయకచరణసంసేవన
  ప్రౌఢిచే నేరాజు ప్రబలు సిరుల
నతఁడు కొండ్రాజు తిమ్మభూపతివరేణ్య
తనయ పెదతిమ్మరాజవతంసగర్భ
వార్ధిచంద్రుండు సత్కులవర్ధనుండు
సతతవిభవుండు వేంకటక్ష్మావిభుండు.

అని రెట్టమతమునఁ వర్ణింపఁబడినట్లు కామందకకృతిపతియు నహోబలస్వామిభక్తుఁడునై యుండెను. రెట్టమతములోనుండి పంతులవారు సూపిన పద్యాధారము నిశ్చయమా యని మనకుఁ దోచుచున్న సందేహమును దీర్పఁ గామందకకృతియే మనకు శరణ్యము; అహోబలస్వామియే యాపన్నపరిత్రాణుఁడు. కామందకకృతికర్తలు వేంకటరామకృష్ణులు దాని నెనిమిదాశ్వాసములుగా రచించి వేంకటరాజున కంకిత మొనర్చిరి. తర్వాతనే యతనికి రెట్టమతము విరచిత మయ్యెఁ గదా. తిక్కనాదులకుఁ బూర్వమే మఱియొక కామందకము గలదు. మన కామందకమున,

మ. రమణీయంబుగ శాలివాహశకవర్షంబుల్ గతంబై సహ
  స్రము నేనూఱును నాఱునై వెలయఁగాఁ బ్రౌఢిం దెనింగించి రా
  ర మహిం దిమ్మయవేంకటాద్రివిభుపేరన్ వేడ్కఁ గామందకీ
  యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభాన్వబ్దంబునన్ రూఢిగన్.

అని యున్నది. అనఁగాఁ గ్రీస్తుశకము 1584 సంవత్సర మగుచున్నది. ఇది మనకుఁ దోడుపడియె; నిఁక శరణాగతత్రాణబిరుదుం డగు నహోబిలపతి యనుగ్రహ మెట్లుండునో యతనిదివ్యాయతనముఁ జొచ్చి చూతము. అదిగో! మహాద్వారమున శాసన మగపడుచున్నది. చదువుదమా?

" శుభమస్తు. దేవశ్రేణీశిరోరత్నం దైత్యద్విపఘటాంకుశం, జయతు శ్రీనృసింహస్య దేవదేవస్య శాసనం. స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు 1506 అగు నేటితారణసం. వైశాఖశుద్ధ 14 శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరశ్రీరంగరాయదేవమహారాయలుగారు పెనుగొండనగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్య సర్వతంత్రోభయవేదాంతాచార్యు లయిన శ్రీశఠగోపజియ్యంగారి కార్యకర్త లయిన రాచప్పగారున్ను శ్రీ అహోబలస్థానంవారున్ను కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన సూర్యవంశోద్భవు లయిన మూరురాయర బసవశంకర గుత్తిహం నిబ్బరగండ యొరయూరి పురవరాధీశ్వరు లయిన శ్రీమన్మహామండలే

శ్వర కొండ్రాజు తిమ్మరాజుగారిపౌత్రు లయిన తిమ్మరాజుగారిపుత్రు లయిన వేంకటరాజు దేవమహారాజులుంగారికి యిచ్చిన శిలాశాసన క్రమ మెట్లన్నను, ప్రాక్ బహుధాన్యనామసంవత్సరాన నిభరాము వారు హండేవారిని కూడుకొని సీమయంతా రా చూరా పట్టి అహోబల స్థలానకువచ్చి అహోబలం అంతా పాడుచేసి అహోబలస్థలం అయిదు ఆరుఏండ్లు తమవశం చేసుక ఆక్రమించి నడుస్తూవున్న నిమిత్యం శ్రీఅహోబలేశ్వరులు సన్యాసం ప్రసాదించిన ఆదిమమైన శఠగోపజియ్యంగారికి ఏడోతరమై శ్రీపురుషోత్తమ ఆళ్వారులప్రతిష్ఠ చేసి ముకుందదేవుని చేత పూజగొని రామానుజదర్శనోద్ధారకు లైన శ్రీ పరాంకుశమహాముని శిష్యులయినటువంటి శ్రీమచ్ఛఠకోపస్వామివారిస్థలం యీతీరునఅయిన నిమిత్తం శ్రీరంగరాయ దేవమహారాయుల సముఖాన తాము మనవిచేసి మీరు యీతీరున రత్నసింహాసనారూఢులైవుండిన్ని మీకులస్వామి యైన అహోబళేశ్వరునిస్థలం తుగకలు......"

అయ్యో! "శిలాభోగం నరాభోగం" అను మాట నిశ్చయమై, "భుజంగజిహ్వాచపలా నృపశ్రియః" అన్న భాసవాక్యము దేవతలకుఁగూడననుభూత మయ్యెనా! పై శాసనము మనకే కాక చరిత్రకారులకునుఁ బ్రయోజనకారి యగునని విపులముగా నుదాహరించితిని. ఈ శాసనకాలము సహితము క్రీ. శ. 1584 అగుచున్నది. ఇవి గతవర్షములు. ఈ కాలమున నున్న వేంకటరాజునకు మేనమామ యగు పెద్దసంగభూపతి 20 ఏండ్ల పూర్వమున్నను పాండురంగకృతి రచనాకాలము 1564 అగుచున్నది. శైలియుఁ బదబంధముల ననుసరించి చూడఁగాఁ బాండురంగకృతి హరిలీలావిలాసముకంటెఁ దరువాత రచిత మని తోఁచుచున్నది.

పైఁ జూపిన శాసనములోని వేంకటాద్రి యొరయూరిపురవరాధీశ్వరుఁ డగు సూర్యవంశోద్భవుఁడు కావున దెలుఁగుచోడులలోఁ జేరినవాఁడు. కామందకమున షష్ఠాశ్వాసము మొదట,

క. శ్రీదేవ చోడవంశమ । హోదధిపరిపూర్ణచంద్ర...
  ............కొండ్రాజు వేంకటాద్రినరేంద్రా.

అనియు, రెట్టమతమున

మ. కపటారాతివిభంజనోద్ధతమతీ కర్ణాటసింహాసనా
  ధిపతిప్రాప్తరమాధురీణ కరుణాబ్ధీ కంతుసౌందర్య కా
  శ్యపసద్గోత్రపవిత్ర నమ్రతరవాచానైపుణీనిర్జితా
  హిప కామందకకావ్యనాయక కవీంద్రేష్టార్థసంధాయకా.

తో. భానువంశాగ్రణీ బంధుచింతామణీ.

అనియుఁ గలవు కావున శాసనములోని పురుషుఁడే యీ కృతులభర్త యనుటకు సందేహ ముండదు.

ఇఁక సుదక్షిణాపరిణయమును గుఱించి పంతుల వారు తత్కృతిపతి యగు పులిజాల సోమామాత్యుఁడు 1580 సంవత్సరప్రాంతముల నుండె నని తేలుచున్న దని వ్రాసిరి. అట్లయినఁ దద్గ్రంథకర్త యగు తెనాలియన్నయ్య కన్న యగు రామకృష్ణుఁ డెట్లు 1650 సంవత్సరములకుఁ దరువాత నుండ సంభవించును? పులిజాల సోమామాత్యుఁడు కోనేటి తిమ్మరాజు కొడుకగు రామరాజునొద్ద మంత్రియై యుండె. రామరాయలకు మనుమనివరుస యగు కోనేటి రామరాజు బుక్కయరామరాజునకుఁ బెద్ద కుమారునిసంతతిలోఁ జేరినందున 1560 లకే యళియ రామరాయలకు మనుమలు కలిగినందున వీరు నా కాలమువా రనుటకు సందేహింపఁబనిలేదు. కావున సుదక్షిణాపరిణయరచనాకాలము కూడ 1565 అగుచున్నది.

మఱియుఁ, గ్రీ.శ. 1542 పరాభవసంవత్సరమున గండికోటప్రభువు కందాళయప్పలాచార్యునకు భూదాన మిచ్చినట్లు భూదానశాసనము గలదు. అతనికి సమకాలికుఁ డగు రామకృష్ణుఁడు నూఱేండ్ల పిదప నెట్లుండును? వైష్ణవాచార్యులయొద్ద ముద్రాధారణమును గైకొనువా రెల్లరు వారలకు శిష్యులే. ఈవ్యాసమునఁ జూపిన శిష్యు లెల్లరు ముద్రాంకనశిష్యులు కాని విద్యాశిష్యులు కారు. కావున బాలగురువులయొద్దను దక్షిణామూర్తికిఁబలె వృద్ధశిష్యు లుండవచ్చును.

మఱియుఁ దెన్నాలి రామభద్రకవి యిందుమతీ కల్యాణమునఁ గృతిపతినిగూర్చి,

గీ. తిరుమలశ్రీనివాసాఖ్యదేశికునకుఁ
  బ్రబలషడ్దర్శనైకపారంగతునకు
  శ్రీవరార్చనాదరునకు శిష్యుఁ డగుచు
  భక్తి చిగురొత్తఁ గృష్ణభూపాలుఁ డలరు.

అని చెప్పెను. కర్మవిపాక మను కృతిలోఁ దత్కర్త యగు తిరుమల వేంకటాచార్యుఁడు తమ పూర్వుల మహాప్రాభవము వర్ణించుకొనుచు నిట్లు చెప్పుచున్నాఁడు. అంగిరసగోత్రులలో, శఠమర్షణునివంశమున శొట్టముని

జనించె; వారిపరంపరలో నాళవందారు తిరుమలనంబి యుఁ దాతాచార్యుఁడునుఁ దిరుమలయుఁ బెద్దార్యుఁడును గ్రమముగా జనించిరి. పెద్దార్యునకు నలుగురుపుత్రులు; తాతయ్య, చినతిరుమలయ్య, కొండమయ్య, సింగరయ్య. వీరిలోఁ దాతయ్యకే పంచమతభంజనతాతాచార్యు లని పౌరుషనామము. వారికొమారుఁడు కంచి తాతాచార్యుఁడు నేటూరిపరిష్కారుఁడునై యుండె. చినతిరుమలయ్య కొమారులు తాతయ్య, పెద్దయ్య, రామానుజయ్య. * వీరు ముప్వురును

తే. గురువు లార్వీటికులతిలకులకు బుక్క-
రాజవరతిమ్మరాజసత్ప్రభుల కెలమి.

ఉ. క్ష్మానుతకీర్తిశాలి యగు కందనవోల్పెదరామరాజభూ
జానికిఁ దాత లాసుగుణశాలులు బుక్కవిభుండుఁ దిమ్మరా
జానృపు లాత్మశిష్యులుగ నట్లు ప్రవర్ధిలు ముప్వు రందు రా
మానుజసద్గురుల్ గురువులై రిభ నేతకు శత్రుజేతకున్.

ఈ పెద్దయార్యున కహోబల, వేంకట, శ్రీనివాసాచార్యు లను ముప్వురు పుత్రులు. చినతిరుమలాచార్యుని తమ్ముఁడు సింగరాచార్యుఁడు విష్ణుపురాణకృతికర్తయగు బసవయరాఘువునకు గురువు. పెద్దయార్యుని కుమారుఁడు శ్రీనివాసాచార్యుఁడు కందనవోలు కోనేటితిమ్మాధీశ్వరునకు గురువు. అతనిమనుమఁడు శ్రీనివాసాచార్యుఁడు నంద్యాల కృష్ణరాజునకు గురువు. పెద్దార్యుని తమ్ముఁడు రామానుజుని ముమ్మనుమఁడు శ్రీనివాసాచార్యుఁడే పాలచురి కృష్ణభూపాలునకు గురువు. పెద్దార్యుని పుత్రుఁడగు నహోబలాచార్యునిముమ్మనుమఁడు (శ్రీ సంతానమూలకముగా) పూడూరి శోభనాద్రిరాజునకు గురువై కర్మవిపాకమును 1650లో విరచించెను. ఈగురుపరంపరను బట్టి చూడఁగా నిందుమతీకల్యాణమునకు భర్తయుఁ గర్తయు సుమారు 1590-1600 సంవత్సరములలో నుండినట్లు తేలుచున్నది. అప్పుడు రామకృష్ణుఁడు తనమనుమనికంటె 50 సంవత్సరములు తరువాత నుండెననుట కేవల మైంద్రజాలికలీలావిలాసమే.

ఇఁకఁ గందర్పకేతువిలాసము చిట్టమంత్రి కంకితముగా రచింపఁబడినది. ఈ చిట్టమంత్రి నాదెండ్ల యప్పనగోపనలకు సన్నిహితజ్ఞాతియు సమకాలికుఁ డగు "చిట్టరసు" అనునతఁడే యైన యెడల నాకృతియు 1545 ప్రాంతములో రచింపఁబడి యుండవలయు. అప్పాజి యను నామము సాళ్వతిమ్మరసునకుఁ గాక యతనిమేనల్లుఁ డగు నాదెండ్లయప్పమంత్రికే చెల్లు నని నా యభిప్రాయము.

పై సందర్భము లన్నియుఁ గూర్చి యూహింపఁగా రామకృష్ణకవి కృష్ణరాయలసభలో నూత్నయౌవనముఁ జెల్లించి తిరుమలరాయల రాజ్యకాలమునకు వృద్ధుఁడై ఘటికాచలమాహాత్మ్యకృతిలోఁ జే వడఁకుచుండును.

ఘటికాచలమాహాత్మ్యము కృతి నందిన ఖండోరాయనికే గిరియప్ప యనుకవి ద్విపదనలచరిత్ర మంకితమొసఁగియున్నాఁడు. నలుగురు ఖండోరాయలలో నితఁడే కాలమువాఁ డని యూహించుటకుఁ గొంత యాధారము లభించినది కాదు. వారిలో నొకఁడు 1600 సం. ములో నుండినట్లును మఱియొకఁడు 1684 లో నుండినట్లును శాసనములు గలవు. ఖండోజికాలమున రామకృష్ణుని మనుమఁ డుండినందున నిది స్పష్టముగాఁ దెలిసినఁ గొంత యాధార మగును. నాకుఁ దోచినయంశముల బయలుపఱచితిని; చరిత్రకారులు తమపరిశ్రమముతోఁ జేర్చి యూహించినచో నిశ్చయము బయలుపడును.

* ఈనామముల కంతయు నాచార్యదేశికశబ్దము లుపచరింపఁబడియున్నవి కాని స్థల సంకోచము నూహించి నామమాత్రముల నుపయోగించితిని. తద్భక్తులు దూషింపకుందురుగాక!

## జ్ఞానమార్గము

క. ధీరులు నిరపేక్షులు నా। త్మారాములు నైన మునులు హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు। నారాయణుఁ డట్టివాఁడ సవ్యచరిత్రా.

గీ. ఊరిదేపురు గొల్లవేళల బురదలోనఁ। బొరలుచుండియుఁ బంకంబుఁ బొందనట్లు
జ్ఞాని యగువాఁడు సంసారసంగుఁ డగుచు। నెందునేనియుఁ బంకంబుఁ బొందఁ డధిప.

# శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల చరిత్ర

క. మార్కండేయశర్మగారు

భారతఖండము సనాతనధర్మమునకు జన్మభూమి. సనాతనధర్మరహస్యములు శ్రుతిస్మృతులందు ప్రతిపాదింపఁబడియుండును. ఈసనాతనధర్మములను అందఱు యథాశాస్త్రముగఁ జేయుచున్న యెడల దేశీయులు సకల క్షేమములను పొందుదు రని ఋషు లభిప్రాయపడిరి. ఈ కథానాయకుఁడును అట్టి తలంపు గలవాఁడే. శాలివాహనశకము సం. ౧౭౮౫ సరియగు ప్రమాదిసం. జ్యేష్ఠ శుద్ధనవమినాఁడు శ్రీదీక్షితులవారు జన్మించిరి. తండ్రి ఘంటయ్య, తల్లి చిన్నమ్మ. కృష్ణ యజుర్వేద శాఖాంతర్గతమగు ఆపస్తంబ సూత్రము. భారద్వాజసగోత్రము. ఆఱ్వేల నియోగిశాఖకు చేరినవారు. వీరిజన్మభూమి రేపల్లె. కొంతకాలము తండ్రి దగ్గఱను ఇతరుల దగ్గఱను సాహిత్యాలంకార తర్క వ్యాకరణ శాస్త్రములు పఠించిరి. వీరి కపుడు ౧౬ సం.ల వయస్సు. వీరికి ఆయేటనే వివాహ మాయెను. కొంతకాలమునకు భార్య మరణించెను. విద్యయందు వీరు చెందుచున్న యభివృద్ధిని గాంచి సహింపనివారిలో కొందఱు వీరికి శత్రువులయిరి. అట్టి శత్రువుల నిర్బంధముచేత ఈ దీక్షితులవారి పురోహితుఁడు సగము కర్మ చేయించి తక్కినసగము సభయందు నీవు క్షమాపణమును కోరినఁ గాని జరప నని బెదరించెను. గ్రంథసహాయముచేత దీక్షితులవా రా కర్మను నెఱవేర్చుకొనిరి. వీరి సాహసమును గాంచి మిత్రులును శత్రువులును పలువు రేర్పడిరి. ఆ కాలమునందు సుప్రసిద్ధు లగు కృత్తివెంటివారి సాహాయ్యమువలన నియోగిబాలుర నేర్పఱిచి స్మార్తకర్మలను బోధించుచు వారిని వెంటఁ బెట్టుకొని దక్షిణ దేశమునకుఁ బోయి ౧౨ మాసము లుండి వేదమును, శ్రౌతప్రయోగమును, పూర్వోత్తర మీమాంసలను చక్కఁగ నభ్యసించిరి. వీరు దక్షిణదేశమునకుఁ బోయి యున్నపుడు అజినమేఖలాది బ్రహ్మచర్య చిహ్నములతో ప్రకాశించుచున్న వీరి విద్యార్థులను, వారు సలుపుచున్న అగ్నికార్యాది ఆశ్రమాచారనియమములను అచటి పండితులు చూచి హర్షించియు 'ఇట్టి కీర్తిని బాల్యమునందే వహించినాఁడు. ఎటులైనను పరాభవింత' మని తర్క వ్యాకరణములందు వాదమునకు వచ్చి యోడిపోయి వేదాంతమునందు మరల వాదమునకు వచ్చి యోడిపోయినవారలై మరల సఖ్యమును వహించి "అద్వైతమతస్థాపక" యను బిరుదము నిచ్చి సత్కరించిరి.



తరువాత శ్రీదీక్షితులవారు స్వదేశమునకు వచ్చి రేపల్లెయందును బందరునందును పాఠశాలల నేర్పాటు చేసి శ్రౌతస్మార్తసాహిత్యతర్క వ్యాకరణాది పాఠములను బోధించునేర్పాటు చేసిరి. దాదాపు ౨౦౦ విద్యార్థులు విద్యాభ్యాసమును చేసిరి. ఉద్గ్రంథము లగు భాష్యాది గ్రంథములను మాత్రము తాము బోధించుచు తక్కిన

పాఠములను సమర్థులగు శిష్యులచేతఁ జెప్పించుచుండిరి. వైష్ణవులు, వైదికులు మున్నగువారివలెనే నియోగులును యాజనాదికమును నిర్వహించుకొనుట శాస్త్రీయమని శ్రీదీక్షితులవారు బోధించుచుండిరి. షోడశకర్మలును చదివిన కొందఱు విద్యార్థులను సమీపగ్రామములకుఁ బంపి నియోగిబ్రాహ్మణులకు ఉచితముగ విద్యను బోధించి అచటివారలను పరస్పరము యాజనాదులు నిర్వహించుకొనుటకు సమర్థులనుగఁ జేయుచుండిరి.

### వీరు వ్యాపింపఁజేసిన యంశములు

౧. ఆశ్రమాచారనియమము నవలంబించి విద్యను చదువవలయును.

౨. ఆవశ్యకమగు మంత్రజాలము ప్రథమమున సార్థకముగ చదివి పిదప ఇతరాధ్యయనము చేయవలయును.

3. యథోక్తమంత్రద్రవ్యాదిసంపత్తు ప్రకృతమున లభించుటలేదు కావున యజ్ఞములను పిష్టపశువుతో చేయవలయును గాని ప్రత్యక్షముగ పశువును హింసింపరాదు.

౪. నాస్తికబుద్ధితో మతాచారధర్మములను పరిత్యజించినవారి ఆశౌచమును శిష్టులు విడువవలయును.

౫. శాస్త్రవిరుద్ధమగు నాచారమును విడువవలయును.

వీనిని ఆచరణమునందు పెట్టుచున్న కాలమునందు శ్రీదీక్షితులవారికి బంధువులందును, నియోగులందును, పలువురును, వైదికశాఖయందు కొందఱును శత్రువులుగా నేర్పడిరి. వీరిలో కొందఱు సమయము లభించిన దీక్షితులవారిని చంపవలయు నని వేచియుండిరి. కొందఱు వ్యవహారముల చిక్కులు తెచ్చిపెట్టిరి. చిట్టచివరకు పుష్పగిరిస్వాములవారి సమీపమున ఆపీఠమునం దున్న పండితులతోను ఇతరపండితులతోను శాస్త్రచర్చలు జరిగి, శ్రీదీక్షితులవా రొనర్చు శాస్త్రవిధిప్రచారము ఈ కాలమున ఆచరించవలసినదే అయినను అలసు లగువారు చేయఁజాలరు, అని స్వాములవారు నిర్ణయించిరి. ఈ శాస్త్రార్థము సుమారు ౪౦ దినములు జరిగెను. శ్రీదీక్షితులవారికంటె ౨౦ వర్షములు ఎక్కువ పెద్దవారును ౨, 3 శాస్త్రములందు పాండిత్యము కలిగిన ప్రసిద్ధగ్రంథకర్తలు నగు నిత్యానందనాథులు మున్నగువారు తా మొనర్చిన గ్రంథములందు శ్రీదీక్షితులవారిని కులాచార్యునిఁగను, దక్షిణామూర్త్యవతారముగను స్తుతి యొనర్చిరి.

శాస్త్రములం దాయా యాశ్రమములకు విధించిన మతాచారములను యథాశాస్త్రముగ నాచరించువారలే శ్రీదీక్షితులవారికి మిత్రులును బంధువులును అయి యుండి రనిన స్వభావోక్తి యగును. శ్రీదీక్షితులవారు పరమహంసాశ్రమము స్వీకరించి చిదానందసరస్వతి యని ప్రసిద్ధినంది శ్రీముఖసం. కార్తికశుద్ధ నవమియందు సిద్ధిని పొందిరి. వీరి శిష్యకోటిలో శ్రౌతము కోటీశ్వరశాస్త్రి, ఆనందరావు, నరసింహశాస్త్రి, విజయరామశాస్త్రి—అనువారు సుప్రసిద్ధులు. వీ రొనర్చిన స్వధర్మాచరణప్రచారణమును శ్రీ శైవాద్వైతమతస్థాపన కోటీశ్వరశర్మశాస్త్రిగా రొనర్చుచున్నారు. గుంటూరునందు శ్రీ మందపాటి వేంకటలక్ష్మీనారాయణరావుగారిచేత చిదానందాశ్రమము నుపేర శ్రీదీక్షితులవారి కొక మఠము కట్టఁబడినది ఇచట శాశ్వతముగ నొక పాఠశాలయు, గ్రంథభాండాగారమును ఏర్పఱుచుటకుఁగాను కృషి జరగుచున్నది.

శ్రీ దీక్షితులవా రొనర్చిన గ్రంథములలో చాల వఱకు మాకు లభించినవి. వానిసంఖ్య దాఁదాపు ౨౫. ఇందులో ప్రధానము లగువాని నామములు కొన్ని ఇచ్చుచున్నాఁడను.

౧. వేదపదసూచి, ౨. ప్రమాణసూర్యోదయము, 3. విశ్వపత్యసురవిజయము, ౪. మంత్రప్రశ్నపథము, ౫. స్మార్తానుక్రమణిక, ౬. రక్షోవిజయము, ౭. విధవాపునరుద్వాహఖండనము, ౮. నియోగమతసిద్ధాంతదీపిక మున్నగునవి.

వీరిజీవితచరిత్రమునుగూర్చి సమగ్రముగ నెఱుంగఁగోరువారు గుంటూరు చిదానందాశ్రమసంఘమువారు ప్రచురించిన దీక్షితచరిత్ర గాంచునది.

# ఆంధ్రపత్రికారత్నావళీనవకము

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నశర్మ ప్రణీతము

కనఁగ నాంధ్రపత్రిక యిది పంచా ♦ క్షరి యాంధ్రు లుందు రెందఱో యం
దనఁగ నియోగులె యాఱువేలవా ♦ రని యి ట్లుండుటఁ బ్రతిదినమం
దనువొందఁగఁ బ్రకటింపఁబడుట ని ♦ త్యాంధ్రపత్రిక షడక్షరి గాఁ
దనరె నాఱువేల నియోగు లిఁకం ♦ దమ పేరు న్నిల్పికొనవలెన్. 1

ప్రత్యాంధ్రుం డీ పత్రికఁ గొనియే ♦ ప్రథితుఁడు గావలె నీవడినే
నిత్యాంధ్రుండుగ నెగడఁగవలయును ♦ నెమ్మది నెమ్మిగ నిమ్ముగనే
మత్యుద్దీపక మగు నీయది స ♦ న్మతులకు గ్రాహ్యము గాకున్నె ?
యత్యుత్తమ మిది జగదుపకారక ♦ మగుట నంద ఱందకయుంద్రే ? 2

వ్యాసోపన్యాసంబుల జాబుల ♦ బహువృత్తాంతంబులతోడన్
వాసిమీఱఁగఁ బ్రజాభిప్రాయము ♦ పాలకులకుఁ దెల్పుటతోడన్
దాసభావమును మాన్పుటతోడన్ ♦ ధర్మరాజ్యకల్పనతోడన్
భాసిల్లెడు నిత్యాంధ్రపత్రిక ప్ర ♦ భాకరుభంగి వినుతితోడన్. 3

కాలోచితముగ నాంధ్రపత్రికం ♦ గనుపట్టెడుఁ జిత్రప్రతిమల్
చాలఁగ సంవత్సరాదిసంచిక ♦ స్రష్టసృష్టి యనఁ జూపట్టున్
బోలఁగఁ బలుపుర చరిత్రములు గడుఁ ♦ బొల్పుగఁ బ్రకటింపంబడెడున్
సాలోచనముగఁ జాటుఁజాటు లే ♦ కాంధ్రోద్యమముల నిది పొదలున్. 4

వరకృషివాణిజ్యాభివృద్ధికర ♦ బహువిషయంబుల వివరించున్
పెరవారఁగ విద్యావిషయంబుల ♦ వివిధచరిత్రకథలఁ దెలుపున్
నరుల కెల్లరకు సుఖజీవనమును ♦ నల్వుపఱుచు రాజ్యముఁ గూర్చున్
సరసుల కీ యాంధ్రపత్రికామణి ♦ సంతతసంతోషం బిడెడున్. 5

న్యాయవాదివలెఁ బ్రజాపక్షమున ♦ నైకమత్యకల్పన సేనా
నాయకువలె సన్మంత్రివలె ధరా ♦ నాథువలెను రాజ్యంబువలెన్
ధీయుతుఁ డౌ మిత్రునివలె హితోప ♦ దేశకుఁ డౌ గురునివలెఁ దగున్
శ్రీయుతనిత్యాంధ్రపత్రికామణిఁ ♦ జేపట్టఁ డెవఁడు జేపెట్టున్. 6

పత్రిక యన నాంధ్రపత్రికయె యవు ♦ భాగ్య మన్న నాంధ్రులదె యగున్
శ్రీత్రివిక్రమాకారముఁ బొందెన్ ♦ శ్రీమదుపేంద్రుఁడు గాకున్నె ?
సత్రముగానై సర్వజనులకున్ ♦ సముదారతఁ జూపెడుఁగద న
క్షత్రనాథుఁ డక్షయుఁడై పరఁగెడు ♦ కరణి ని దెంతయుఁ గ్రాలు నిలన్. 7

నెలకు నూలిపోఁ గన్నట్టుల యీ ♦ నిత్యాంధ్రపత్రి కేందునికిన్
దలకొని యాంధ్రులు చందాదారు లు ♦ దారతఁ జందాధన మిడినన్
జెలఁగుచు నొరు లందఱు విడిముడి వడిఁ ♦ జేర్చిన విడివిడి గాఁగఁ గడున్
వెలయుదు రాంధ్రులు పురుషోత్తమస ♦ ద్విఖ్యాతిం గంద్రనెడును శ్రీ. 8

రత్నాకరతీరగ మగు బొంబయి ♦ రాజధాని నింబుగఁ బొడమెన్
రత్నాకరతీరస్థ మైన చె ♦ న్నరాజధానిం జేరెఁ దగన్
రత్నాకరభవ లక్ష్మి యనంగను ♦ రాజిల్లెడుఁ దోడ్తెచ్చెను శ్రీన్
రత్నావళి నిత్యాంధ్రపత్రికకు ♦ రత్నకవి యొసఁగెఁ దగకున్నె ? 9

# వ్యవసాయము

రివరెండ్ జి. ఎస్. తామ్సన్

నేను ఆస్ట్రేలియాఖండమును రెండుసారులు చూచియుంటిని. దక్షిణసముద్రములలో నెల్ల మణియన నొప్పుచు, కడు సారవంతమై, వ్యవసాయాభివృద్ధియందు మిన్నుముట్టుచున్న క్వీన్సులాండు అను జిల్లా యొకటి యందుఁ గలదు. మొత్తముమీఁద ఆఱుమాసముల కాలమీ క్వీన్సులాండునందు, అందులో ముఖ్యముగ ఈసారవంతమైన బహిఃప్రదేశమునందుఁ, గడపి అచ్చటి వ్యవసాయవిశేషములం గాంచి సంతోషభరితుఁడనై, ఆయా వృత్తాంతముల నెల్ల నా హిందూదేశసోదరులకు తెలుపవలెనని కుతూహలపడుచుంటిని. నేను హిందూదేశములోని వ్యవసాయవిషయముల నాసక్తితో నేర్చుకొంటిని. నాకు క్రొత్త విషయము లతిసంతోషముతో గమనించి వాని నితరులకు సువ్యక్తముగ బోధింపవలయు ననెడి యాశ మొదటినుండియును సహజలక్షణముగా నున్నది. ఆస్ట్రేలియాలోని వ్యవసాయసంఘములు జయప్రదములుగ నుండుటయును, హిందూదేశసంఘములు తద్వ్యతిరిక్తఫలము గాంచుచుండుటయును బాగుగ కనిపెట్టియుంటిని. ఇట్లగుటకుం గల కారణముల నీ క్రింద వ్యక్తీకరించెదను.

## వ్యవసాయవిద్య

వృక్షశాస్త్రము నభ్యసించువారు బీజము, క్షేత్రము, కృషి అను మూఁడు ముఖ్యాంశములను గమనింపవలయును గదా. జయప్రదములైన వ్యవసాయసంఘములు బయలువెడలుటకు దేశములోని బాలురే మూలాంకురములుగ నున్నారు. క్వీన్సులాండునందు, విశేషముగ శ్లాఘింపఁదగిన నిర్బంధప్రారంభ విద్యాశాసనములు కలవు. సర్వసాధారణముగ, ఐదైదు మైళ్లకు సొగసుగ నిర్మింపఁబడి సర్వబోధనోచితపరికరములతోడను నింపఁబడినట్టి యొక్కొక్క పాఠశాలాగృహ ముండును. దీని నానుకొని యుపాధ్యాయులు నివసించుటకు సర్వసౌకర్యములును గలిగినట్టి మఱికొన్ని గృహము లుండును. ఈ గృహము లన్నియును పరిపాలకుల సొత్తైయున్నవి. ఉపాధ్యాయు లందఱును సాంగోపాంగముగ విద్య నేర్చి బోధనపద్ధతులయం దారితేరినవారుగ నుందురు. వీరు బహుధారాళముగ పోషింపఁబడుచున్నవారు. అనేకస్థలములందు పాఠశాలాగృహములలోనే తపాలాఫీసు గూడ నుండును. సంఘములోని అన్ని తరగతులవారును తీఱిక వేళలయం దీ పాఠశాలాభవనమునందే సమావేశమగుచుందురు. ఈ సమావేశమైన సాంఘికయంత్రమును, ఈ యుపాధ్యాయులే త్రిప్పుచుందురు. ఈ పాఠశాలయందు ప్రారంభవిద్యలోని ముఖ్యాంగములగు చదువుట, వ్రాయుట, లెక్కలు వేయుట యనునవి అతిజాగరూకతతో బోధింపఁబడుటయే గాక, ప్రకృతియు ప్రకృతిపరిణామభేదములును అతిజాగరూకతతో పిల్లవాండ్రు స్వయముగ పరిశీలించునట్లు నేర్పఁబడుచున్నవి. నానాజాతుల వృక్షములును ఈపాఠశాలారామములలో వేయఁబడుచున్నవి. పిల్లవాండ్రీ చెట్ల పెరుఁగుదలలు స్వయముగ ప్రతిదినమును పరిశీలింతురు. పుష్పోత్పత్తియు, అందుండి ఫలము లెటు లుత్పన్నమగుచున్నదియుఁ గూడ పరిశీలించుచుందురు. పాఠశాల తెఱవకముందును, తెఱచినతఱిఁ దీఱికగా నుండు ప్రతినిమిషమును వ్యర్థపుచ్చక బాలురును బాలికలును తోఁటలోనే పనిచేయుచుందురు. అతిచిత్రములగు లతాగుల్మాదులు, కొన్ని ఆరామమునందును మఱికొన్ని పాఠశాలాభవనములోని పంచాదులందును, ఈ పసివాండ్రచేతనే పోషింపఁబడుచున్నవి. గ్లాసుతో నాలుగువైపుల నావరింపఁబడిన పెట్టెలయందు నానాజాతుల నాఱులును నాటఁబడియున్నవి. అందువలన ఆయా మొక్కల వేఱులే యే విధముల పెంపొందుచున్నదియును, ఆకుల భేదమును, కాఁడల వృద్ధిభేదమును, భూసారఫలితమును, నీటిపోషణమును, ప్రకృతి

పోషణమును పరిశీలించుట కనువుగ నేర్పాటులు గావింపఁబడియున్నవి.

ప్రతిపాఠశాలయందును వస్తుప్రదర్శనశాలలు కలవు. అందన్నిరకములైన తయారుచేయఁబడిన సామానులును, అట్టిసామాను లేయే వస్తువులతో తయారుచేయఁబడుచున్నవో ఆ వస్తువులును ఉంచఁబడుచున్నవి. పిల్లవాండ్రు సర్వసామాన్యముగ తమ పొలములలో పండు దూది మొదలగు పైరులను చూచుచున్నారు. ఈ పాఠశాలయందా యా వస్తువులలో నెట్లెట్లు సామానులు తయారగుచున్నదియు, తయారుకాఁబడిన సామాను లేమేమి చేయఁబడుచున్నదియు మొదలగు నుపయుక్తవర్తకవ్యాపారములను చిన్నవాండ్రు బాగుగ నేర్చుకొనుచున్నవారు. ప్రారంభరసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, భౌతికభూగోళము, భూగర్భశాస్త్రము మొదలగు అనుభవజ్ఞానసాధనములు బాగుగ బోధింపఁబడుచున్నవి. చెట్లవలనను, రాళ్లవలనను, గుట్టలవలనను, ఏఱులవలనను దేశమునకు కలుగు సౌకర్యములు దృష్టాంతములతోఁ బొందుపఱుపఁబడుచున్నవి. వే యేల? ఈ పాఠశాలలయందు బాలురును బాలికలును సృష్టిని, సృష్టిలోని మార్పులను పరిశీలించి, తమ చుట్టుపట్ల ప్రతిదినమును జరగు పరిణామభేదములకుం గల కారణములను స్వయం సహాయముచేతనే తెలిసికొనుటకు తగు మార్గములు సూచింపఁబడుచున్నవి. ఇట్టి యేర్పాటు లుండుటవలన బాలురు నిజమైన జ్ఞానమును పొందెద రనుటకు సందియ మేమైన నుండునా? నేర్చుకొనిన ప్రతివిషయమును మనస్సునందు నాటుకొనకయుండునా? నే నిట్టి పాఠశాల లనేకము దర్శించియుంటిని. ప్రతిచోటను ఉపాధ్యాయులు న న్నేదో యొక విషయమును పిల్లవాండ్ర యెదుట ముచ్చటింపవలసినదిగా వేడుచువచ్చిరి. ఏఁబదిమంది పిల్లలు గల యొక పాఠశాలయందు, నేను హిందూదేశమును గుఱించి ముచ్చటించిన విషయములోని సారమును వ్రాయుఁ డని, యుపాధ్యాయుఁడు పిల్లల కాజ్ఞాపించెను. నే నైదు పర్యాయము లైదు విషయములను గుఱించి ముచ్చటించియుంటిని. 1. అయిదు మతములు, 2. ఐదు నగరములు, 3. అయిదు నదులు, 4. అయిదు జంతువులు, 5. అయిదు పంటలు. నేను ముచ్చటించుచుండఁగా పిల్ల లేమియును వ్రాసికొనియుండలేదు. అయినను నేను ప్రస్తావించిన ఇరువదియైదు విషయములను అందఱును జ్ఞాపకముంచుకొని చెప్పఁగలిగియుండిరి. అందొక చిన్నది ఈ యన్ని విషయములను నామాటలతోనే చెప్పఁగలిగెను. ఈ యేకసంతగ్రాహిత్వమునకు చాల సంతసించితిని. పాఠశాలయందు నేర్చుకొనిన ప్రతివిషయమును, ఇంటియొద్ద పరస్పరానుభవమునకుఁ దెచ్చుకొనుటకై ప్రతిదినమును యజమానులు ప్రయత్నించుచుందురు. ఇట్లు గృహయజమానులయొక్కయును, ఉపాధ్యాయులయొక్కయును అన్యోన్యసంధానమే జయప్రదమైన వ్యవసాయసంఘోత్పత్తికి మూలకారణముగ పరిగణింపఁబడుచున్నది. కాఁబట్టి యాస్ట్రేలియాలోని వ్యవసాయసంఘములు జయప్రదము లగుట యొక వింత గాదు.

ఇఁక హిందూదేశములోని విషయములు గమనింపుఁడు. ఇచ్చట నిర్బంధప్రారంభవిద్యాశాసనములా లేవు. పాఠశాలలా కఱవుగ నున్నవి. పాఠశాలాగృహములా శూన్యములు. ఉపాధ్యాయుల ప్రత్యేకనివాసగృహములా హుళక్కి. ఉపాధ్యాయులయొక్కయు గృహస్థులయొక్కయు నన్యోన్యసంధానమా నిండుసున్న. ఇచ్చటి ప్రతివిషయమును బాల్యదశయందే యున్నది. పరిపాలకులును, మిషనువారును, ఇంకను మఱికొన్ని సంఘములవారును కళాశాలలను, ఉన్నతవిద్యాశాలలను స్థాపించియున్నారు. పరిపాలకు లేమి, తదితరసంఘము లేమి, ప్రారంభవిద్యాప్రచారవిషయమున కన్నుమూసికొనియున్నారు. ఉన్నతవిద్యాప్రచారమే ఎక్కువగ పరిపాటించుటవలన విద్యాశాసనములు తలలు బలువై యున్నవి. పరిపాలకు లేమూలనో కొన్ని ప్రారంభవిద్యాపాఠశాలలను నామకార్థము స్థాపించినంత మాత్రమున, ఆస్ట్రేలియాలోవలె అనుభవవిద్యాప్రచార మీ దేశమునందు కలుగు ననుట కల్లయె గాని నిజము కానేరదు. వ్యవసాయసంఘములలోనివారు పరిశోధకులుగ నుండవలయును. కుక్షింభరత్వ మనునది వారిలో నుండఁగా

డదు. వారి కెల్లప్పుడును పారమార్థికచింతయే ప్రధాన ముగ నుండవలయును. మొగమోటము నెంచుకొనువారుగ నుండఁగూడదు. ప్రజాసౌకర్యములకు సాహస మనునది వారి కిలవేల్పుగా నుండవలయును. సంఘములకు కావలసిన యట్టి యౌదార్యవంతులు సరియైన స్వతంత్ర విద్యాప్రచారమువలననే బైలుపడుచుందురు. అట్టి విద్యాలక్షణములు లేని యీ దేశమునందు జయప్రదములైన సంఘము లుత్పన్నము లగు నని తలఁచుట మిథ్యగా నుండును.

వ్యవసాయసంఘాభివృద్ధికి కావలసిన సౌకర్యములు హిందూదేశమునకంటె ఎక్కువగా కలిగిన దేశము మఱియొకటి లేదు. అందు ప్రధానసౌకర్యము జనములో నూటికి తొంబదిమంది వ్యవసాయవృత్తిచే జీవించుచు పల్లెలయందు నివసించుటయే. నూటికి పదికన్న తక్కువ మందిజనులు పట్టణములయం దితరవృత్తులలో నున్నారు. ఆస్ట్రేలియాయం దిట్లు లేదు. నూటికి ఏఁబదిమంది పట్టణములయందే నివసించుచున్నవారు. ఎచ్చట వ్యవసాయవృత్తివలన ఎక్కువమందిజనము జీవించుచున్నారో, అచ్చటనే వ్యవసాయ సంఘములు విస్తారము వ్యాపకము గాంచవలయును. వ్యవసాయసంఘావలంబులు సంఘాభివృద్ధికై తాము పడెడు కష్ట మటుండ, వారు కర్చుపెట్టిన రూపాయలకు అణాలు సయితమీ దేశమునందు లభించుట లేదు. ఇవన్నియును పనిచేయుటకు నిరుత్సాహమును మాత్రమే కలిగించుచున్నవి. ఆస్ట్రేలియాలో జనసమ్మర్దము తక్కువగా నున్నది. మధ్యరాష్ట్రముగా నున్న దక్షిణాస్ట్రేలియా కెల్లను ధైర్యోత్సాహములతో స్వతంత్రతను వెలిపుచ్చుచున్న యొక పత్రికారత్నమునందు బహిరంగపఱుపఁబడిన ఈ విషయములను గమనింపుఁడు:—

“ భావుకఫలముల నొసంగునట్టియును, భాగ్యప్రద మగునట్టియును సుక్షేత్ర మిది. అనుకూలము లైన శీతోష్ణస్థితులు కలిగియున్నది. బహువిధాలంకారశోభితమై కన్నులకు పండువుగా నున్నది. దక్షిణాస్ట్రేలియా జనసంఖ్య (జూన్ 30, 1910) 417,765. (అందు 165,000 అడిలేడ్‌లోనే నివసించుచున్నారు.) దక్షిణాస్ట్రేలియా 578,361,600 ఎకరముల విస్తీర్ణము కలిగియున్నది. 1909-10లో 31,751,974 ఎకరముల భూమి మాత్రమే సాగుబడిక్రింద నున్నది.”



అయినను దక్షిణాస్ట్రేలియా మెక్కువ యౌన్నత్యమును వహించిన రాష్ట్రములలో నొకటిగ నున్నది. అతిసమర్థు లగు జనులు, జర్మనీనుండియును, స్కాట్లండు నుండియును, ఇంకను గ్రేటుబ్రిటన్‌కు సంబంధించిన యన్ని పార్శ్వములనుండియును వచ్చి నివసించుచున్నారు. దక్షిణాస్ట్రేలియాయందు ప్రశస్తమైన నది యొకటి కలదు. దానిని ముర్రే యనుచున్నారు. దానికి ఆస్ట్రేలియానైల్ అని నామాంతరము కూడఁ గలదు. ఈ నదీప్రాంతములం దెచ్చట జను లెక్కువగా నుండవలయునో, అచ్చటనే తక్కువగ నున్నారు. జనసంఖ్య యింత తక్కువగ నున్నను, వారియం దన్యోన్యసహాయోత్సాహ మమితముగ నున్నది. 1909-10 సం.నం దచ్చటి వ్యవసాయసంఘములవారు పౌ. 17,500,000 లు అనఁగా 262,500,000 రూప్యాలు. విలువగల పంటలు పండించిరి. జనులు దగ్గఱ దగ్గఱ నివసించుటచే సంఘములు పెంపొందుచుండును. అయినను హిందూదేశముతో పోల్చి చూచిన, అచ్చటి జనసంఖ్య మిక్కిలి తక్కువగ నున్నది. సంఘప్రాబల్యమునకు జనసంఖ్యయే ముఖ్యాధార మని యెంచిన, అట్టిసంఘవ్యాపకమునకు హిందూదేశమునకు తరువాతివే తక్కిన యన్ని దేశములు నని నొక్కి వక్కాణింపనగును. ఐనను పరిమాణమునకన్న గుణమే ప్రధానము. ఎందుకీ సోదె? పై మాటల కన్నిటికిని, స్వప్రజాభిమానమే దేశమునకు కావలసిన ముఖ్యవిషయ మని యర్థము. మన గుంటూరు జిల్లాలోని రయితులు, తమకు ప్రపంచము నంతటికిని సారవంతమగు క్షేత్రములు కల వనియును, అట్టి ప్రదేశములు సయితము కృష్ణ వండలినీరు లేనియెడల నూసర క్షేత్రము లగు ననియును చెప్పుచున్నారు. ఇరువదియైదు సంవత్సరములక్రింద నుచితముగ నియ్యఁబడి, ఆకాలమునందు ఎకర మొకటింటికి రు 10 లు లేక రు 24 లు కిమ్మతు కలిగినట్టి భూములు ఈ కాలమున రు 1,000 లు, రు1,500 లు కిమ్మతు గలిగియున్నవి. ఎందువలన? ప్రాణాధారమైన మూలపదార్థము గిరాకీయైనది గనుకనే. ఆస్ట్రేలియాలో మిశ్రమజాతు లనేకములు వాసముచేయుచున్నను, అత్యద్భుత మైన పరిపాలనాపాఠశాలలవలన నన్ని జాతులును

ఏకజాతిగ నెన్నుకొనఁబడుచున్నవి. నిర్బంధప్రారంభ విద్యాప్రవాహము అన్నిజాతులలోనికి ప్రవహించి, వాని నైకమత్యమునకు ప్రతిరోధించు మాలిన్యములను కొట్టివేసి, తన పండలినీటిచే వానికి బలము నిచ్చుచున్నది. ఆకారణముననె సంఘబీజము లే సారమునందు నాటినను సమానాభివృద్ధి గలిగి సొగసైన పైరగుచున్నది.

సంఘము లన్నియు నన్యోన్యసహాయము నందుచుండవలయును. మేము క్వీన్సులాండునం దుండఁగా, ఒక సంఘము, అమ్మకము చేయు తఱుగరుల కియ్యవలసిన రుసుము తగ్గించుటకు నిశ్చయించెను. తఱుగరులు చేయవలసిన పని మిక్కిలి స్వల్ప మగుటచేతను, అమ్మకపు కాలమునందు కొలఁది మాట లాడుటయే వారిపని యగుటచేతను, తత్పూర్వ మియ్యఁబడుచున్న నూటికి రెండు రుసుము నిచ్చుట యా సమయమున కష్టతరముగ నుండుటచేతను కాఁపువా రందఱును కలసి ఈ క్రిందివిధమున మాటలాడిరి. "రుసుము నూటి కొకటికి తగ్గించినను తఱుగరులకు ధనము పుష్కలముగ లభించును గనుక తగ్గింపవచ్చును." సంఘీభావములో చేసిరి గనుక ఈ మాటలు సాగినవి కాని, ప్రతికాఁపును ఈ ప్రయత్నమును ప్రత్యేకముగ సాగించిన, రుసుము తగ్గించుటకు వీలు లేక యుండును. ప్రత్యేకముగ నొక సంఘము మాత్రమే ఈ నిబంధన మేర్పఱిచిన, తఱుగరు లందఱును సమ్మెకట్టి, తమతమ యుద్యోగములనుండి తొలఁగి సంఘముల కనర్థములం దెచ్చియుందురు. సంఘము లన్నిటికిని సంఘీభావ ముండుటవలన, తఱుగరు లందఱును లొంగవలసి వచ్చినది. కనుక జనసంఘమున కంతకును కావలసిన విషయములం దేమి, అన్యోన్యసహాయ సంఘములం దేమి, వెన్నయంత్రశాలలయం దేమి, మఱి యే యితరవ్యాపారములం దేమి, ఒక సంఘము మఱియొక సంఘమునకు సహకారిగా నుండును. ఇట్టి పరస్పరానుకూల్యసాహాయ్యములవలననే, పంటలు పండించుటయం దేమి, చేతిపనులయం దేమి, వాని నమ్ముటయం దేమి, సంఘము లతి జయప్రదములుగ నున్నవి.

## హిందూదేశపుస్థితి

హిందూదేశమునందు వ్యవసాయకళాశాలలు కలవు. వానికి ప్రత్యేకముగ దివ్యభవనములు నిర్మింపఁబడినవి. ఉపకరణములు కొదువలేకుండనే యున్నవి. ఉపాధ్యాయులును సమర్థులే. శోధనలు అనుభవైకవేద్యములుగనే యున్నవి. వేయేల? ఈ కళాశాలలకు మించినవి ప్రపంచమునం దెచ్చటను లేవు. అయినను 10,000 మైళ్లకొక్కొక్క కళాశాల యైనను లేదు. ఇచ్చట నేమాఱుమూలనో యొక కళాశాల యుండినంత మాత్రమున దీని నాస్ట్రేలియాతో పోటీపెట్టుటకు వీలగునా? ఈ కళాశాలలయం దొక దౌర్భాగ్యము గలదు. వ్యవసాయవిద్య నిజముగ నభ్యసింపఁదగినవా రా కళాశాలలో చేరఁగూడదు. ఇం దసత్య మేమియును లేదు. మెట్రిక్యులేషన్, స్కూల్ ఫైనల్ పరీక్షలయం దారితేరినవారే కాని ఈ కళాశాలలయందు చేరఁగూడదు. తాము కష్టమైన పరీక్షలు ప్యాసయియున్నారు గనుక, సామాన్యముగ గవర్నమెంటు ఉద్యోగములలో త్వరగా పైకి వచ్చుటకు యోగ్యముగా నుండు ననియే, వా రీ కళాశాలలయందు ప్రవేశించుచున్నారు. దృఢకాయులై, వ్యవసాయము నభివృద్ధి గావింపఁగలిగిన రయితు లందు లేరు. అట్టివారికి కళాశాలలయందు చోటు లేదు. వా రనర్హులు. ఆస్ట్రేలియాయం దట్లు గాదు. సర్వసామాన్యముగ, ఎఫ్. ఏలును, బి. ఏలును ఇట్టి కళాశాలలో తర్బీ తయినతరువాత వ్యవసాయికులుగ నుండ లేరు గనుక, గొప్పపరీక్షలు ప్యాసయినంత మాత్రమున వ్యవసాయకళాశాలలో చేరుటకు వీలుండదు. వ్యవసాయమును వృద్ధిపఱుచుటకు ఆలోచనశక్తికన్న వేయిమడుఁగులు పిండశక్తి యుండవలయును. హిందూదేశమునందు వ్రాయను చదువను లెక్కలువేయను నేర్చిన రైతులు వేనవే లున్నారు. ఇట్టివారి నీ కళాశాలలందు తర్బీతు చేసి, తరువాత గవర్నమెంటు ఉద్యోగముల నాసించకుండ వ్యవసాయమునే తమ యావజ్జీవజీవనోపాధిగా నేర్పఱుచుకొనునట్లు నిబంధనము లేర్పఱిచినయెడల వ్యవసాయ మెన్నివిధముల నభివృద్ధియగును? బీదవా రెంతమంది వ్యవసాయలక్షణములం జూచి గ్రహించి బాగుపడుదురు? పాఠశాలలకు సంబంధించి తోఁట లుండ

వలయు నని పరిపాలకులు కఠినవిబంధనము లేర్పఱిచి యున్నారు గదా! ఈ పాఠశాలలయందు, వ్యవసాయ కళాశాలయం దొక సంవత్సరమైనను తర్ఫీతు పొందినవారుపాధ్యాయులుగా నుండిన, వ్యవసాయసాధనము లెట్లెట్లుపయోగించునదియును, ఏయే భూసారమునం దేయే పైరులు బాగుగ నగునదియును, ఈ పైరులు వేయు విధానమును పిల్లవాండ్రు అనుభవపూర్వకముగ నేర్చుకొందురుగద! దున్నుట యన నేమియో యెఱుంగనట్టియును, పాపటము త్రోలుట యనునది విననట్టియును ఉపాధ్యాయులు వ్యవసాయవిద్యను నేర్పుటకు నియోగింపఁబడిన లాభ మేమైన నుండునా? ప్రస్తుతము హిందూ దేశమునందు ప్రత్యక్షానుభవము గలిగిన యుపాధ్యాయు లుండి, ప్రత్యక్షనిదర్శనములతో బోధించుచుండ వలయును. ప్రత్యక్షనిదర్శనములతో నుండు విద్యయే మమ్మాటికి నీ దేశమునందు కొఱఁతపడియున్నది. విద్యకు కార్యకారణభావములును ప్రత్యక్షనిదర్శనములును పునాదులు. ప్రకృతిశాస్త్రములు ప్రత్యక్షానుభవముతో నేర్చుకొనుటకు, విద్యార్థులు పెద్దపెద్దపరీక్షలు వ్రాసియుండవలసిన యవశ్యము లేదు. సర్ ఫ్రెడరిక్ నిఖాల్ సన్ దొరవారు సముద్రములోని చేపలు బహువిధోపయోగసాధనము లగునట్టి మార్గములను వ్యక్తీకరించుచు, ప్రకృతివిద్యాప్రావీణ్యము ననుభవైకవేద్యము చేయుచున్నట్లు, వ్యవసాయకళాశాలలవారు వ్యవసాయపాఠములకును ప్రకృతిపరిణామపాఠములకును పరస్పరసంబంధములను కలుపుచు, భూసారములోని భాగ్యము నంతటిని బైలుపెట్టుచుండవలయును. ఇట్లు చేయుచుండినచో, అన్యోన్యసహాయమును వ్యవసాయసంఘములును అప్రయత్నముగనే బయలువెడలుచుండును. జనులు ప్రకృతిశాస్త్రసాహాయ్యముతో భూసారములను గ్రహించి యందలి లాభములం గాంచఁగలిగి భాగ్యమును సౌఖ్యమును ఔన్నత్యమును నందఁగలుగుదురుగాక!

## నీ తి ప ద్య ము లు

తనువున విఱిగిన యమ్ముల
ననువునఁ బుచ్చంగవచ్చు; నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా!

క. నెమ్మి గలవారి నొల్లరు;
తె మ్మొల్లనివారి వెనుకఁ దగులుదు; రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు
రి మ్మెఱుగనియట్టివార లిభపురనాథా!

గీ. కుడిచి కట్టిన నున్కి గా కిడుమపడుచు
నింట నున్నను బురుషార్థ మేమి కలదు?
కడఁగి యిహమైనఁ బరమైనఁ గాక దాన
యూర కుండుట నరునకుఁ బౌరుషంబె?

క. ధనము గలవాఁడు మృత్యువ
దనమున నున్నట్లు భయము దన చిత్తమునం
దనుకఁగ నల్లల నుడుకును
విను శిఖిచోరాదిముఖ్యవివిధాపదలన్.

క. మాటలు నేరక పలికిన
నోటముగాఁ గొనక కార్య మున్న నిజముఁ దాఁ
బాటించి నృపతి ధర్మం
బేటముగాఁ బాడి నిర్ణయింపఁగవలయున్.

క. కడు ననురక్తియు నేర్పును
గడఁకయుఁ గలవారి నుఱక గడవఁగ నెగ్గుల్
నొడివెడు వివేకశూన్యుల
కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే?

క. మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగనినాఁ డెల్లపాట్ల నెఱిఁగింపగున్
మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని
కొఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే?

క. కాని వ్యయం బెన్నఁడు నొక
కానియుఁ జేయంగఁదగదు; కార్యము గలచో
మానక ధనంబుఁ దృణముగ
మానవపతి చేయునది సమగ్రవిభూతిన్.

# ఆత్మహత్య

భోగరాజు నారాయణమూర్తిగారు.

కన్యావిక్రయవిత్తలోలు రయి మూర్ఖస్వాంతు లై ధూర్తు లై
యన్యాయమ్ముగఁ దల్లిదండ్రు లొక విద్యాహీనుపా ల్చేసి; దౌ
ర్జన్యం బొప్పఁగ నొంతుఁ గోసి రిఁక నా ప్రారబ్ధ మే మందు? సౌ
జన్యాకారనదీప్రవాహమ! నమస్కారంబు రక్షింపుమా! 1

శా. ఆ పాపిష్ఠివిధాతయత్నమున బాల్యంబందె శారీరస
ద్రూపోదారకలాకలాపకలనోద్యత్కీర్తి యౌవాని నే
నాపేక్షించి వరించి బల్మి నిటు విద్యాశూన్యపాలైతి; నా
పాపం బేమొకొ? నీవె నా శరణ మంబా! ఓ నదీదేవతా! 2

చ. అమలమనీషులై పరిణయమ్ములయందు స్వయంవరాధికా
రముఁ దమ కన్యకాళి కొసరన్ దలిదండ్రు లొసంగునట్టి భా
గ్య మెపుడో? ఆత్మహత్యలకు నంతము నెన్నఁడొ? అంతదాఁక ని
క్కము జలదేవి! దీన లగు కన్యల నీవె భరింపఁగావలెన్. 3

సీ. చిననాఁటనుండి పెంచిన ముద్దుబిడ్డను
దుఃఖపెట్టకుఁ డంచు దోసిలిడితి;
నా మనోహరుతోడ ననుఁ గూర్పుఁ డనుచు మా
యమ్మ నయ్యను గూడ నడుగుకొంటి;
అతిపాపకరము కన్యాశుల్క మద్దాని
మానరే! యని బ్రతిమాలుకొంటి;
అల్పజ్ఞుఁ బెండ్లాడి యకట! కాఁపుర మేను
చేయఁజాల నటంచుఁ జెప్పుకొంటి;
వెంటవెంట నంటి గంటగంటకుఁ జిన్న
మనవి యంటి, నన్ను మనుపుఁ డంటి;
కంట నీరు పెట్టుకొంటి; పాదమ్ములఁ
బట్టుకొంటి; ముద్దుపట్టి నంటి. 4

చ. అధికధనాశచేత నకటా! తలిదండ్రులముందు నా మొఱల్
బధిరుని ముందరన్ జదువు భాగవతంబుగతిన్ జనెన్; మహో
దధిఁ బడి యీవలావలకు దాటఁగవచ్చును, పర్వతావళిన్
శిథిలమొనర్పవచ్చు, ఖలచిత్తము మార్ప నసాధ్య మేరికిన్. 5

ఉ. నేటికి సంఘసంస్కరణనీతిపరుం డొకఁడైన నెచ్చటన్
నూటికి లేఁడు; తద్గరిమ న్యూనతమై చనె, నెల్లవారలున్
మాటలు చెప్పువారె; క్రియమాట హుళక్కియ, యాంధ్రదేశ మే
నాఁటికి నాఁటివైభవము నాటి సుఖించునొ సాటిసీమలన్? 6

ఉ. లేరుగదమ్మ! దీన లగు లేముల దుఃఖముఁ బాపు సంఘసం
స్కారులు; కల్గినన్ నను నిజమ్ముగ మూర్ఖుని కంటఁగట్టు మా
వారల ధూర్తకార్యము నివారణసేయక యుందురే? వగన్
దీరిచి ప్రోవకుందురె? నదీజలదేవత! లోకసన్నుతా! 7

చ. వలచినవాని మాని బలవంతపుఁ బెండిలి నన్యపాలు గా
వలసెఁగదా యటంచు ననివారవిచారమునం బడంగి, వే
ల్పులకు ననేకభంగులను మ్రొక్కితి; నా వగ నొక్క దైవమున్
దొలఁగఁగఁజేయఁ డయ్యె; నిదె దోసిలియొగ్గితి నీవె దిక్కనన్. 8

ఉ. అల్లనఁ దల్లిదండ్రులును నన్నలుఁ దమ్ములు గాఢనిద్రలోఁ
జల్లఁగ ద్రుంకియుండఁగ, నిశాసమయమ్మున నంధకార మి
ల్లెల్లెడ నిండియుండ, నను నెవ్వరుఁ జూడ రటంచుఁ గోర్కె సం
ధిల్లఁగ వచ్చినాను; కరుణించి గ్రహింపుము నన్ జలాంగనా! 9

శా. రంగారంగ వరించినట్టి వరుఁ గూర్పంబోక నా కిట్లు దు
స్సాంగత్యం బొనఁగూర్చి రైన మిఁక నీ సంసారదుఃఖమ్ముఁ బూ
నంగాఁజాల; సుఖమ్ము లేని బ్రతు కున్నన్ లేనియట్లే కదా?
గంగాదేవి! యనుగ్రహింపు మిపు డైక్యంబౌదు నీలోపలన్. 10

సీ. పరిణయమ్ముల స్వేచ్ఛ దరుణుల కొసఁగుఁడీ!
ఆడుబిడ్డలఁ గన్న యయ్యలార!
బాల్యవివాహసంబంధమ్ము లిఁక నైన
మానుఁడీ దేశాభిమానులార!
నాఁటి స్వయంవరానందభాగ్యము మాకు
దయ నొసంగుఁడు తల్లిదండ్రులార!
మూర్ఖంపుటాచారములఁ గన్నియలఁ బాడు
సేయకుఁ డాంధ్రదేశీయులార!
బల్మి నే నిట్లు ప్రాణముల్ వాసి చనుటఁ
జూచి, మీ కొమార్తెలగతిఁ జూచుకొనుఁడు;
నేఁటి నా యాత్మహత్యయే నీతిపాఠ
మని తలంపుఁడు మీ రెల్ల రనుదినమ్ము. 11

సీ. నీ దయచేత నే నిజముగా నాకు వి
ద్యాగంధ మబ్బె బాల్యమ్మునందు;
నీ ప్రోద్బలముచేత నే వరించితి నొక్క
సుందరాంగుని నాదు డెందమందు;
నీ ధైర్య మూనియే నే సుఖింతు నటంచు
సంతసించుచునుంటి స్వాంతమందు;
నీ పదధ్యానమే నిరతమ్ము నన్ను ర
క్షించు నటంచు నాసించుచుందు;
తల్లి! శర్వాణి! నీ యనాదరణకతన
విక్రయింపఁగఁబడితిని వక్రమతికి;
నీ సెలవుఁ బూనియే సుమీ నేఁడు నేను
ప్రాణములఁ బాసి నినుఁ జేర వచ్చుచుంటి. 12

గీ. శంకరాయ! ఘోరాఘనాశంకరాయ!
పార్వతీశాయ! దేవ! తుభ్య న్నమోస్తు!
త్వచ్ఛరణ మాశ్రయామి మాం పాహి పాహి
హర! హరా! మహాదేవ! దేవా! యనంత! 13



Street scene, Vizag

విశాఖపట్టణములో నొకబజారు



Bezvada

బెజవాడపురము, కృష్ణానదీ ప్రాంతము

Temple at Draksharamam



ద్రాక్షారామములోని దేవాలయము, గోదావరి

Gopuram at sarpavaram



సర్పవరపు గోపురము, గోదావరి

Gopuram at Dwaraka Tirumala



ద్వారకా తిరుమల గోపురము, గోదావరి

The Bhadrachalam Temple



భద్రాచలపు దేవాలయము

The Pattisam Temple



పట్టిసపు దేవాలయము, గోదావరి,

The Antaravedi Temple



అంతర్వేది దేవాలయము, గోదావరి

The Bobbarlanka Lock



బొబ్బర్లంక లాకు, గోదావరి

Photos by Messrs. S. V. Baygeswara Rao & V. V. Ramaiah.

# వివాహము

## రా మ కృ ష్ణ క వు లు

మనుజునకు జీవితకాలమునందుఁ గలుగు మహోత్సవములలో వివాహము ముఖ్యమయినది. పాణిగ్రహణ వైభవదినములలో వధూవరు లిరువురును మహారాజులవలె నేలపైఁ గాలు మోపక శిబికారూఢులై సమస్తబంధుజనములచేతను గౌరవింపఁబడుచు వివిధ భోగముల ననుభవింతురు. ఉద్వాహవిధి కేవలము నుత్సవప్రధానమే గాక సమంత్రకమును, యావజ్జీవము దంపతుల సుఖదుఃఖములకు హేతుభూతము నగు కర్మముగాఁ గూడ నున్నది. అట్టి పాణిగ్రహణమును గుఱించి ప్రస్తావింపఁదగిన యంశము లనేకము లున్నవి కాని ప్రస్తుతానుకూలముగ నించుక నుడువుచున్నారము. వివాహమంత్రములయందలి యర్థము నరసి చూడఁగా వధూవరులు హృదయపూర్వకముగా నొండొరుల వరించిన ట్లగ్నిసాక్షికముగాఁ బ్రమాణము చేయుటయుఁ బిదపఁ బరస్పరము నిట్లు నడుచుకొనవలయు నను నిబంధనములు చేసికొనుటయు మున్నగు విషయములు గానఁబడుచున్నవి. అట్టి విషయములను విద్యాగంధ మెఱుఁగని యర్భకు లగు వరులును వధువులును దెలియఁజాలరు గదా? బొమ్మల పెండ్లిండ్లవలె బాల్యవివాహములు వినోదమాత్రఫలము లౌటయే గాక తఱచు విచారకారణములుగాఁ గూడఁ బరిణమించుచున్నవి. కావుననే యాధునికులు బాల్యము దాఁటినవారికిఁ గాని వివాహాధికారము లే దనుచున్నారు.

విద్యాజ్ఞానసంపన్నుఁడై సుస్నాతుఁడైన వరుఁడు తనకొఱకు కన్యను వరించుటకై మిత్రులు నాప్తులు నగు నలువురు మంత్రజ్ఞులను బంపవలయును. వరుఁడు తనకుఁ దానే కన్యకను వరింపక పరకీయనేత్రములతో వధువును వరించుట సమంజసము గాదు గాని యొకప్పుడు కేవల రూపమోహితుఁడై పెండ్లికొమరుఁ డసత్కులసంభూతయు నసతీసుతయు నగు పడుచు నజ్ఞానముచేఁ బెండ్లియాడు నేమోయని మంత్రద్రష్ట లగు మహర్షు లీవిషయమునందు నాప్తులగు మిత్రులే శరణ మనిచెప్పిరి. ఇదియే కన్యావరణ మని వ్యవహరింపఁబడుచున్నది. శ్రీ రామచంద్రునకు సీతాదేవియం దామె సౌందర్యసౌశీల్యాదులవలననే గాక తండ్రి చేసిన భార్య యని విశేషాదర ముండునది యని వాల్మీకి వర్ణించినాఁడు. కావునఁ బెద్దలు కూర్చిన సంబంధ మన్నివిధముల సమంజసముగనే యుండును గాని స్వార్థపరులై యాప్తుల మను వేషముతో వధూవరులను వంచించు మహాత్ములు గల యిక్కాలమునందు వరుఁడు తనంతఁ దానే వధువును వరించుట యుక్తరూప మని చెప్పుట సాహసము గాదు.

పిదప వధూకులమునకు వచ్చిన వరునకుఁ గన్యాజనకుఁడు గాని యన్న మొదలగువారు గాని కన్యక నుదకపూర్వకముగా దానము చేసి మధుపర్కము నొసంగి యల్లుని యథార్హముగా సంభావింతురు. జలమునందు సర్వదేవతలును గల రని శ్రుతికథితము గావున దేవతాసాక్షికముగ నీ దానముఁ జేయుచున్నా నని తెలుపుటకై యుదకపూర్వకముగా దానముఁ జేయవలయు నని విధింపఁబడిన ట్లూహింపవచ్చును. ఇట్టి పవిత్ర మగు దానమునకుఁ గళంకముఁ గలిగించుచుఁ గొంద ఱలంకారమిషమున వరునిఁ బీడించి ధనముఁ గొని యనుభవించుచున్నారు. అట్టివి కన్యాదానములు గాక కన్యావిక్రయము లనంబడి యనేకానర్థకములకు మూలము లగుచున్నవి. విద్యాధనగర్వితు లగు కొందఱు వరులును గన్యాదాతలు యథాశక్తి నొసంగు దక్షిణలను గైకొనక తృష్ణాపీడితులై శ్వశురకులమును ఋణములపాలు సేయుచున్నారు. కట్టా! పుత్రిక సుఖపడు నని తలఁచి యుపపత్తి గల వరునకుఁ గోరినంత దక్షిణ నొసంగి పాడుపడిన గృహస్థుల నెందఱను మనము చూచుచుండుట లేదు ?

వరుఁడు పాణిగ్రహణము సేయుటకు ముందు పితరుల నుద్దేశించి నాందీశ్రాద్ధముఁ జేయవలయును. శుభకార్య మగు వివాహమునందు నశుభకర్మ మగు శ్రాద్ధము నేల చేయవలయు ననఁ, బాణిగ్రహణము మనుజునిఁ బితౄణమునుండి విడిపించునట్టి యుత్తమ సాధనము గావున వరుఁడు వారి యనుగ్రహమున సత్సంతానసమృద్ధిని బడయఁగోరుచు నాందీశ్రాద్ధము నొనరించి పితలను సంతోషపెట్టవలయు నని మహర్షులు శాసించియున్నారు.

దారగ్రహణము కేవలభోగముకొఱకుఁ గాక సత్సంతానమును బడసి పితౄణమోచనము మొదలగు ధర్మముల నాచరించుటకే యని దీనివలన విశదమగుచున్నది. కాళిదాసమహాకవియు "ప్రజాయై గృహమేధినామ్" అని యీ రహస్యమునే వెల్లడించినాఁడు.

తరువాత వరుఁడు తాను వధువును జూచి "అభ్రాతృఘ్నీం"అను మంత్రమును జదివి వధూసహోదరులకు శ్రేయస్సు నాశంసించును. సోదరులు లేని కన్యకను బెండ్లియాడఁజన దని స్మృతి గలదు. దారపుత్రాదులు దనకు నధీనులు గాక తాను గూడ భూధనలోభమున శ్వశురకులమున కధీనుఁడు గావలసి స్వపితృమాతృసేవ స్వదేశవాసము మున్నగువానినుండి తొలఁగవలసి వచ్చుటఁ జేసి సహోదరులు లేని కన్యను బెండ్లియాడఁజన దని స్మరింపఁబడినది. కావున వరుఁడు వధూభ్రాతల కాయురారోగ్యములను గోరవలయును. ధనాశాబద్ధులై యిప్పటివారు కొంద ఱభ్రాతృకకన్యాపరిణయమునకే యగ్రస్థానము నొసంగుచున్నారు.

పిమ్మట వరుఁడు వధువును సమీపించి "అఘోరచక్షురపతిఘ్నీమ్" అను మంత్రమును జదువుచు నామె దృష్టియందుఁ దన దృష్టిని గీలింపవలయును. దంపతులకుఁ బరస్పరము తారామైత్రిఁ గూర్చుటకై ఋషు లీ మంత్రమును వినియోగించియుందురు. తరువాత ననామికాకనిష్ఠికలతో నంగుష్ఠమును గూర్చి దర్భను బట్టుకొని "నీయందుఁ బతికిఁ గీడుసేయు నలక్ష్మిని బోఁగొట్టుచున్నా" నని యర్థమిచ్చు మంత్రమును జదువుచు నా దర్భతోఁ బెండ్లికూఁతు కనుబొమ్మలనడుమఁ దుడిచి పడమటిదిక్కున విడిచిపెట్టును. ఈ విధాన మంతయు వశీకరణమువలె నున్నది.

పిదపఁ గన్యక పుట్టినింటినుండి యన్యస్థలమునకుఁ బోవలయు నని బెంగఁగొని యేడ్చినచో "జీవాంరుదంతీమ్" అను మంత్రముచే నోదార్చి యామె కుత్సాహమును బుట్టించును. అంత నిరువురు బ్రాహ్మణులచే మంత్రోచ్చారణపూర్వకముగా జలమును దెప్పించి దర్భలను మండలాకారముగా నొనరించి యా వలయమును వధువు శిరసుపై నిడి యిఁకమీఁద గార్హస్థ్యభారమును నాతోఁ జాటు నీవును సగము వహింపవలయుఁజుమీ యని తెలుపుటకో యనునట్లు దానిమీఁద దక్షిణముగా యుగచ్ఛిద్రము (కాఁడియొక్కరంధ్రము) మోపి యా రంధ్రమునందు సువర్ణము నుంచి పవిత్రము లగు నైదు మంత్రములను జదివి యామెను స్నానముఁ జేయించును. తొల్లి యపాల యను కన్యక గలదు. ఆమెకు బొల్లి యుండుటచే నెవ్వఁడును బెండ్లియాడఁడయ్యెను. ఆమె కింద్రునిఁ బూజింపవలయు నని సర్వదా కోరిక యుండెడిది. ఒకప్పు డామె స్నానార్థము నదిలోని కరిగి ప్రవాహవేగమునఁ బడిపోవుచుఁ బైనుండి కొట్టుకొనివచ్చుచున్న సోమలతను దంతములతో నమలి యా రసము నింద్రున కర్పించి హృదయమునందలి కోరికను నెఱవేర్చుకొనెను. ఇంద్రుఁడును సంతసించి రథము కాఁడి చిల్లిలోనుండి నీళ్లు పోసి యామెను బవిత్రను జేసి సూర్యకాంతి గల దానిని జేసెను. అట్లే యీమెను గూడఁ జేయుటకుఁ బై విధానముచే నింద్రుఁడు ప్రార్థింపఁబడుచున్నాఁడు.

తరువాత నామెకు నూతనవస్త్రమును గట్టఁబెట్టి దర్భత్రాటిని గటీస్థలమునందుఁ గట్టును. అటుపిమ్మటఁ బెండ్లికూఁతు కుడిచేయిఁ బట్టుకొని యగ్నిదగ్గఱ కరిగి యుత్తరాగ్రముగాఁ జాప నైచి యందుఁ గుడివైపున నామెను గూర్చుండఁబెట్టి తా నామె యెడమప్రక్కఁ గూరుచుండును. పురుషులకు దక్షిణపార్శ్వమును స్త్రీలకు వామపార్శ్వమును శ్రేష్ఠ మని యెన్నఁబడుటఁ జేసి కుడివైపున వధువును గూర్చుండఁబెట్టుకొని యామెకు నెడమప్రక్కను వరుఁడు గూర్చుండుట యొండొరుల కాదరాతిశయమును జాటుచున్నది. పిదప నగ్నిని సమాధానపఱచి (ప్రజ్వలింపఁజేసి) "సోమః ప్రథమః" మొదలగు రెండు మంత్రములచేఁ బెండ్లికూఁతును మంత్రించును. ఆ మంత్రములందుఁ గన్యను సోమగంధర్వాగ్నులను మువ్వురు దేవతలు ముందు వరింతు రనియు, నాలవ భర్త మనుజుఁ డనియుఁ జెప్పఁబడియున్నది. అనఁగా స్త్రీల కెల్లరకు నలువురు భర్త లని తెలియుచున్నది. దేవతలు జ్ఞానేంద్రియకర్మేంద్రియములను బోషించువా రనియు మనుజుఁడు శరీరమును బోషించువాఁ డనియు దీని యభిప్రాయమై యుండును. తరువాత వరుఁడు క్రిందుగాఁ దన కుడిచేయి నుంచి మీఁద నున్న వధూదక్షిణహస్తమును బట్టుకొనును. స్త్రీసంతానముఁ గనవలయు నని కోరిక గలిగినచో నామె యంగుళులఁ బట్టుకొనవలయును. పురుషసంతానముఁ గనవలయు నని యిచ్ఛయున్నచో నుత్తాన మగు నామె యంగుష్ఠముఁ దన యంగుష్ఠముతోఁ బట్టుకొనవలయును. పాణిగ్రహణకాల

మునందు వరుఁడు "నీయందు గుణవంత మగు సంతాన మును బుట్టింతునుగాత" మను నర్థము నిచ్చు మంత్రముల జపింపవలయును. పాణిగ్రహణమునకుఁ దరువాత వధూకంఠమున మంగళసూత్రమును గట్టించుచున్నారు. కాని తద్విధాయక మగు మంత్రము గృహ్యసూత్రమునం దెచ్చటను జెప్పఁబడియుండలేదు మంగళధారణసమయ మునఁ జదువఁబడు "సౌభాగ్యవతీ! నా కాయుష్కారణ మగు నీ మంగళసూత్రమును నీ కంఠమునకుఁ గట్టుచున్నాను. నీవు నూఱేండ్లు బ్రతుకుము" అను నర్థము గల "మాంగళ్యతంతునా నేన" అను శ్లోకము వైదికులు కల్పించినది గాని మంత్రము గాదు. కావుననే యుత్తర దేశములందుఁ బెక్కుచోట్ల మంగళసూత్రధారణము సేయఁబడుచుండుట లేదు. వధూవరు లొండొరులఁ దలఁబ్రాలు పోయుటయు వైదికవిధి గాక యుత్సవప్రధానమై యాచరింపఁబడుచున్నది. అనంతరము వధువును గుడి కాలితోఁ దూర్పునకుఁ గాని యుత్తరమునకుఁ గాని "ఏకమిషే." మొదలగు మంత్రముల నేడింటిఁ జదువుచు నేడడుగులు నడిపించును. "సఖ్యం సాప్తపదీనమ్" అని పెద్దలు నుడువుట కీ విధి తార్కాణముగా నున్నది. వరుఁడును "సఖా సప్తపదా భవ" అని సప్తమపదము నందు మంత్రమును జదువును. తరువాత దంపతులు వీతిహోత్రమునకుఁ బ్రదక్షిణముచేసి మఱలఁ జాఁపపైఁ గూర్చుందురు. తదనంతరము వధూసహితుఁడై వరుఁడు "సోమయాజనివిదేస్వాహా" మొదలగు పదునాఱు మంత్రములచే హోమముఁ జేయును. సప్తపదికిఁ దరువాతనే మొల్లపుడును హోమాదిక్రియలయందు వధువు సహధర్మచారిణియై యుండును. అనంతరము వధువు నగ్ని కుత్తరముగా దక్షిణపదముతో నడిపించి "ఆతిష్ఠేమమ శ్మానమశ్మేవత్వంస్థిరాభవ" అను మంత్రము నుచ్చరించుచు నగ్నిసమక్షమున నిన్ను మద్గృహదేవతగా నభిషేకించుచున్నా ననునట్లు ఱాతిమీఁదఁ గూర్చుండఁబెట్టవలయును. పిమ్మట వధూసోదరుఁడు దెచ్చిన పేలలను పెండ్లికూఁతుదోయిట రెండుసార్లుంచి నేయిచేఁ దడిపి "జుహోతీయంనారీ" యను మంత్రముచే "నా సహధర్మచారిణి యీ హోమముఁ జేయుచున్నది" అని యగ్నికిఁ దెలిపి లాజహోమమును జేయించును. ఈ విధాన మంతయు ముమ్మాఱు చేయఁబడును. ఱాతిమీఁదఁ [illegible]ూర్చుండఁబెట్టుటచే 'నీవు నాయందు ఱాయి వలె స్థిరమైన మనసు గలిగి నిన్నంటవచ్చు పరులఁ బరిభవించి త్యజింపు' మని వరునిచే నుపదేశింపఁబడుచున్నది. లాజహోమముచేఁ బతికి దీర్ఘాయువు గలుగవలయు నని వధువుచే నర్థింపఁబడుచున్నది. అగ్నికిఁ బ్రదక్షిణము చేయుటచేఁ దేజోబలమేధాసమృద్ధియు సత్సంతానసంపదలును జాయాపతులచేతఁ గోరఁబడుచున్నవి. తరువాత జయాదిహోమముఁ జేసి వధువు నడుమునకుఁ గట్టిన దర్భత్రాటిని విప్పి యామెను గుఱ్ఱమునో యేనుఁగునో పల్లకినో రథమునో యెక్కింపవలయును. జయాదిహోమముచేఁ బాణిగ్రహణవిధి నెఱవేఱినట్లు యెన్నవచ్చును. పదంపడి వరుఁడు వివాహాగ్నిని గ్రహించి వధూసమేతుఁడై స్వగృహమునకుఁ బోయి ప్రవేశహోమముఁ జేసి పరిణయవిధిని ముగించును. వివాహసమయమునందు సాక్షిగా నున్న యగ్నినే యావజ్జీవమును గృహమందు నిల్పి త్రిసంధ్యము హోమము చేయుట దంపతుల కభ్యుదయహేతు వని చెప్పుదురు. చిరకాలముక్రింద మన పూర్వఋషులు శీతబాధ గల గిరిప్రాంతప్రదేశమునందు వసించుచుండెడివారు. అప్పుడు శైత్యనివారణార్థము నిత్యము గృహమునం దగ్ని నుంచవలసివచ్చెడిది. కావుననే యప్పటి మహర్షులచే నీ నియమము చేయఁబడినది. క్రమముగా వితస్తాదినదుల దాఁటి యార్యావర్తమును గూడ నతిక్రమించి దక్షిణమునందలి యుష్ణదేశముల నివసించు నార్యులకు నిత్యాగ్నిహోత్రవిధి యనావశ్యక మైన దని చరిత్రవిజ్ఞానము గలవారు నుడువుచున్నారు. పాణిగ్రహణానంతరము వరుఁడు బండి నొకదానిని మంత్రపూర్వకముగా సన్నద్ధముచేసి దానికి గుఱ్ఱములనో యెద్దులనో కట్టి ముందుగా వధువు నెక్కింపవలయును. పుట్టి పెరిఁగినచోటును జిన్నతనమునుండియుఁ గలసి మెలసి యుండు చెలికత్తియలను దల్లిదండ్రులు మొదలగు బాంధవులను విడిచి యపరిచితులు నజ్ఞాతస్వభావసౌహార్దులు నగు నత్తమామలు నాఁడుబిడ్డలు మున్నగువారిలో నెట్లు మంచిగాఁ గాఁపురము సేయుదు నని తలంచుచుఁ దన ప్రేయసి దిగులుఁ జెందునో యని వరుఁడు "నీవు నా నెత్తిమీఁద నెక్కుము. సంతానముచేతఁ గూడ విరాట్టు వగుము. నీ యత్తమామలు ఆఁడుబిడ్డలు మొదలగు నా జను లందఱకు నీ వీశ్వరివి గమ్ము" అని ప్రణయమధురము లగు మాటలచే నాకెను కుత్సాహముఁ గల్పించును. వివేకవంతుల కభినందనీయము లగు నిట్టి

విషయముల నెల్లం దా మెఱుంగక వధూవరులకుం దెలుపక ధనార్జనమాత్రాసక్తు లగు నిప్పటి పురోహితులం జూడ నెవ్వరి మనసు దుఃఖింపదు? ప్రయాణమునకు ముందు వరుఁడు బండి కిరుప్రక్కలను శత్రువులు చేయు నభిచారహోమములచేఁ బ్రేరిత యగు కృత్య వచ్చి యుపద్రవము సేయు నని యెంచి యది రాకుండ సీలలో హితము లగు దారములను గట్టును. మార్గమధ్యమునందుఁ దీర్ఘస్థాణుచతుష్పథాదికమును దాఁటునప్పుడు తత్తద్దేవతల ప్రసాదముఁ బడయు మంత్రముల జపించును. త్రోవలో నావచే నదిని దాఁటవలసివచ్చినచో వరుఁడు నావను మంత్రించి వధువుతోడను అగ్నితోడను బడవ నెక్కును. నదిని దాఁటునపుడు పెండ్లికూఁతురు నావికులఁ జూడరాదు. ముగ్ధయగు వధువు తరంగమాలాకుల మగు నదీప్రవాహమునందు నావికులు చేయు సాహస కృత్యములఁ జూచి భయపడు నని మహర్షు లట్లు విధించి యుందురు. శ్మశానభూమినుండి బండి నడచినను, బండి గాని యగ్నిభాండము గాని భగ్న మయినను వరుఁడు ప్రాయశ్చిత్తి చేసికొని మఱలఁ బ్రయాణము చేయును. జువ్వి మఱ్ఱి మొదలగు మహావనస్పతులను మహారణ్యములను దాఁటునపుడు మంత్రముల జపించును. తరువాతఁ దన గృహముఁ జేరి "ఇది నా యిల్లు. వీరు నా సంబంధు" లని చెప్పుచు వధువునకుఁ జూపించును. అనంతరము మంత్రపూర్వకముగా రథవాహముల విప్పి మధ్యగృహముఁ జొచ్చి ప్రాచీనగ్రీవము నుత్తరలోమలోహితము నగు నెద్దుతోలు పఱచి వధువుతో గృహప్రవేశముఁ జేయును. పెండ్లికూఁతురు గృహములోనికిఁ బ్రవేశించునపుడు లక్ష్మినివాస మని యెన్నఁబడు గడపఁ ద్రొక్కకుండునట్లు మాత్రము వరుఁడు జాగరూకుఁడై యుండవలయును. పిమ్మట గృహమున కుత్తరపూర్వ మగు ప్రదేశమునందు యథావిధిగా నగ్నికి హోమముఁ జేసి వధువుతోఁ జర్మమునందుఁ గూరుచుండి యామె తొడమీఁద జీవత్పుత్ర యగు సాధ్వి కుమారునిఁ గూర్చుండఁ బెట్టి యా బాలునికి మంత్రపూర్వకముగా ఫలముల నొసంగి నక్షత్రోదయమువఱకు నూరక యుండవలయును. ఈ విధానముచే నగ్నిప్రసాదమున మాకుఁ బుత్త్రగాత్రపరిష్వంగసుఖము గలిగి ధన్యుల మగుదుముగాక యని వరుఁ డభిలషించుచున్నాఁ డని తోఁచుచున్నది. నక్షత్రోదయ మైనపిదప వధువును దూర్పునకుఁ గాని యుత్తరమునకుఁ గాని తీసికొనిపోయి ధ్రువనక్షత్రము, నరుంధతీ నక్షత్రమును జూపును. పూర్వము కాశ్యపుఁడు మొదలగు సప్తఋషులు గలరు. వారికిఁ గృత్తిక లను పేర నేడ్వురు భార్య లుండిరి. ఆ యువతులలో నేడవది యగు నరుంధతి పతివ్రతాతిలకమును నిశ్చలచిత్తయుఁ గా నెగడినది. తక్కినయార్గురను భర్తలు వ్యభిచారశంకచే విడిచిరి. నీవు గూడ నరుంధతివలెఁ బతివ్రతాముఖ్య యనం బరఁగి బాల్యమునందే గుణాతిశయముచే సర్వోన్నతుండైన ధ్రువునివంటి పుత్త్రినిఁ బడయవలయుఁజుమీ యని వరుఁడు వధువున కుపదేశించుచున్నట్లు పై విధానము తోఁచుచున్నది. ప్రవేశహోమ మయినపిదప గృహస్థులు ధర్మపత్నీసమేతులై యాచరింపఁదగిన స్థాలీపాకవైశ్వదేవాదికర్మము లుపదేశింపఁబడును. పాణిగ్రహణదివసము మొదలు మూఁడునాళ్లవఱకును భార్యాపతు లధశ్శయనము, బ్రహ్మచర్యము, క్షారలవణవర్జ మగు భోజనమును జేయవలయును. ఇరువురి శయ్యలకు నడుమ గంధలిప్త మయి వస్త్రముతోఁ గాని దారముతోఁ గాని చుట్టఁబడిన దండమునందు విశ్వావసు వనియెడు గంధర్వు నావాహనముఁ జేసి యుంతురు. ఆదండము న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షములలో నొకదాని దై యుండవలయును. ఆ వృక్షములే గంధర్వాప్సరసలకు నివాసస్థానము లని వైదికులు నుడువుదురు. విశ్వావసువుచే వధువు పరిగ్రహింపఁబడినది గావున నా గంధర్వుని స్తుతులచేతను నమస్కృతులచేతను సంతోషపఱచి తదనుగ్రహమున ఋతుదోషము శమించినపిదప వివాహదినమునకు నాలవనాఁటి యపరరాత్రమునందు శుభముహూర్తమున దంపతులు గలియవలయు నని సూత్రకారులు నిర్వచించుచున్నారు. దీనిచేఁ బుష్పవతులకే వివాహము శాస్త్రీయ మని నిస్సందేహముగాఁ దెలియవచ్చును. వధూవరసమాగమముతోఁ బాణిగ్రహణవిధి ముగియును.

# మన జమీందారుల విద్యాభివృద్ధి

## శ్రీ రాజా మేకా వరదరాజప్పారావు బహద్దరుగారు

భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్;
భూషితకేశపాశమృదుపుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావు; పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి; వా
గ్భూషణమే సుభూషణము; భూషణముల్ నశియించు నన్నియున్.

ఈ భర్తృహరి వాక్యప్రకారము, మున్నెంచఁబడునట్లు శ్రోత్రియులకే గాక, అన్నిదేశముల నుండు సర్వజనంబులకును విద్య యత్యవసర మను సంగతి నెల్లరును నొప్పికొనవలసిన కాల మిప్పటికి వచ్చినది. కావున స్త్రీ యైనను పురుషుం డైనను, తన జీవితకాలమం దాహారనిద్రావిహారాదు లెంత యావశ్యకమో చదువు నేర్చుట యంత యావశ్యక మనియు, తన యనుదిన కృత్యములలో నది కూడ ముఖ్యమైన దనియు నెన్నుకొనుచుండవలెను. ఇట్టి విద్యను దేశమం దంతటఁ బ్రసరింపఁజేయు మార్గ మేది? అట్లు చేయఁదగినవా రెవరు? దొరతనమువా రిప్పు డనేకపాఠశాలలను స్థాపించి లక్షల కొలఁది ధనము వెచ్చించి విద్యాభివృద్ధికై మిగుల శ్రద్ధగైకొనుచుండుటయు, వారి ప్రయత్నములు చాలవఱకు సఫలము లగుటయు విశదమే. కాని దేనినైనను వృద్ధిచేయుటకై కావలసిన ముఖ్యసహాయము దొరతనమువారియొద్దనుండి వచ్చునది కాదు. ప్రజలే దానిని బూనియొనర్చినంత మే లెందును లేదు. అట్లు సహాయ మొనర్చువా రొకింతయైన ధనవంతులుగ నుండవలయును. "ధనమూల మిదం జగ" త్తనునట్లు, సర్వమునకుంబోలె విద్యాభివృద్ధికిని ధనము కావలెను గదా? కావునఁ బ్రజలలో ధనవంతు లగు గొప్ప రాజులు, జమీందారులు, వర్తకులు మొదలగువా రీ కార్యమును బూనుకొనవలెను. పైఁ బేర్కొనబడినవారిలో మార్పులకు లోనగు నాదాయము గల వర్తకులు మొదలగువారికంటె భూమ్యాదులపై వచ్చు స్థిరాదాయము గల జమీందారులే ఈ పనిని దప్పక చేయవలె ననుట యెల్లరకును దెలిసిన యంశమే. అప్పుడే విద్యావిషయిక మగు నుద్యమము ప్రబలసహాయిమై యుండును. తా నేరనివాఁ డొరులకు నేర్ప నేరఁడుగాన, విద్య నభివృద్ధిచేయవలసిన జమీందార్లకే స్వయముగా విద్య లేనప్పుడు, వారు దాని మూల్యమును గ్రహించి దానిని వన్నెకుఁ దేఁజాలరు. అందువలన జమీందార్లకును, నితరధనికులకును ముఖ్యముగాఁ జదువు నేర్పింపవలయును. ఇందుకొఱకే దొరతనమువారు రాజకుమార్ కాలేజీ లనియు, తాలూక్‌దార్ స్కూళ్లనియు వెర్వేఱెడల వేర్వేఱు నామములతోఁ బాఠశాల లేర్పఱిచియున్నారు. ఇట్టిదే మన దక్షిణహిందుస్థానములో చెన్నపురియందు న్యూయింగ్‌టన్ అను పేర నొక దివ్యమగు పాఠశాల యున్నది. విద్యాభ్యాసమునకుఁ దగిన వయసు వచ్చినతోడనే బాలురను దెచ్చి యచ్చట తగు విద్యల నభ్యసింపఁజేయుదురు. కోర్టు ఆఫ్ వార్డ్సులోఁ జేరిన బాలురకే గాక, యనుమతిమీఁదఁ బంపు తక్కిన జమీందార్ల బాలురకుఁ గూడ నచ్చట విద్య నేర్పించుచున్నారు. ఇందలి బాలురకు విద్యతోఁ బాటు లౌకికవ్యాపారము లనేకములు తెలియవలసి యుండునుగాన, వ్యాయామము, చిత్రలేఖనము, వడ్రము, భూమి కొలుచు రీతి, సౌధనిర్మాణశాస్త్రము, కృషిశాస్త్రము, సంగీతము మొదలగు ననేకవిద్యల నభ్యసింపఁ జేయుచుందురు. ప్రాతఃకాలముననే దేహపరిశ్రమయు, తర్వాత వ్యవసాయశాస్త్ర విషయంబులును, పిదప స్నానమును భోజనమును జేసినవెనుక, ఉదయము పది ఘంటలు మొదలు సాయంత్రము నాలుగు గంటలవఱకును పాఠశాలయందలి విద్యాభ్యాసమును, తర్వాత ఖేలనాదులును, నడుమనడుమ వలయునంత విశ్రాంతియుఁ గలదియై వీరి దినచర్య యుండును. బాలురకు విశేషముగ లౌకికజ్ఞానము నుపదేశించి ముందు వారికిఁ గలుగఁ

బోవు పదవులకు వారి నర్హులుగఁ జేయుటకంటె గొప్ప పరీక్షలయందుఁ గృతార్థులను జేయుట యీ పాఠశాల యొక్క ముఖ్యోద్దేశము కాకున్నను, ఇందలి బాలురు కొందఱు శ్రద్ధాభక్తులతోఁ జదివి యూనివర్సిటీ పరీక్షలయందుఁ గూడ కృతార్థులయిరి. ఇందలి బాలు రందఱు నొక్కరీతినే విద్య నభ్యసింపవలయు నను నిర్బంధము లేదు. వారివారి బుద్ధిశక్తుల కనుగుణ్యమగు విద్య నభ్యసించుటకుఁ దగిన యేర్పాటులు గూడఁ గలవు. కాన నీ పాఠశాల యెల్లరకు నాదరణీయమే!

మఱియు నిచ్చటఁ జదువుటవలన నీ రాజధానిలోఁ గల జమీందార్లకు సంఘీభావము కలుగును. మన రాజధానిలోఁ బెక్కుభాషలు మాట్లాడు సామాన్య జను లుండునట్లే జమీందారులు కూడ నున్నారు. ఉత్తరమున గంజాములో నున్న జమీందారు దక్షిణమున తిరునల్వేలిలో నున్న జమీందారును గలిసినయెడల వారు మిక్కిలి యన్యస్వభావముతో నాదరించుకొనెదరు. అట్లుగాక వీరు బాల్యంబుననుండియు నొక్కచోటఁ జదువుకొనిన నెంతయు స్నేహభావమునఁ గలసికొందురు. సోదరులు తమ తల్లి నెంచి బద్ధానురాగులై యుండునట్లు, ఒక్కయెడఁ జదివినవారు తమ పాఠశాల నెంచి పరస్పరానురాగము గలవారై యుందురు. వీరు సహపాఠులు గాకున్నను నొక పాఠశాలలోఁ జదువుదురు గాన పరిచయమును సానుక్రోశమును వీరి కుండకపోదు. కావున నీ న్యూయింగ్టను ఇన్‌స్టిట్యూషనులోఁ గాని యిట్టి యితరపాఠశాలలోఁ గాని చదివించుటచేత నీ రాజధానిలోఁ గల గొప్పవారి కందఱకును రానురాను స్నేహ మెచ్చుచుండును. ఈ యుద్దేశముతోనే యీ న్యూయింగ్టనులో సంవత్సరమున కొకసారి న్యూయింగ్టను డే యనుపేర నొక దిన మేర్పఱిచి యిదివఱలో నిక్కడ చదివి రాజ్యముల నేలుచున్నవారి నందఱను సమావేశము చేసి వారికిఁ దగురీతిని సద్బోధలను వలసిన ట్లొనర్చి వారిని తగు వేడ్కలతో సంతోషపఱిచి గవర్నరుగారు మొదలగు గొప్పయుద్యోగస్థుల నీ వేడుకల కాహ్వానమొనర్చి తమ పాఠకుల నందఱిని వారికిఁ దెలిపి మఱియు ననేకరీతుల స్నేహసౌజన్యంబుల వృద్ధిపఱచుటకు యత్నించుచున్నారు. ఇట్టి సదుద్దేశములతోఁ గూడిన యీ పాఠశాల యెల్లవారలకును మిగుల నాదరణీయమే కావలయును. ఐనను, కొందఱు మహాత్ములు ఈ పాఠశాలపై నతిమాత్సర్యముఁ బూనియుండుట, ఒరులయెడ లేనిదోషముల నారోపించుట, ఉన్న యల్పానర్థముల నతిశయోక్తిచేఁ జెప్పుట — వీనిని జూడ వారి బుద్ధిసామర్థ్యములచే వారి కిట్లు తోఁచుచున్నదో, లేక యచ్చోట నేను చిరకాలము చదువుటచే నాకా తప్పులు ఒప్పులుగ తోఁచుచున్నవో నే నూహింపఁజాలకున్నాను. దోషము లున్నను సోదరభావమున మా కా మహానుభావులు దిద్దుకొను మార్గములు చెప్పక మమ్మతిక్రౌర్యమునఁ జూచుట యేటి తగవు? సర్వశక్తుఁ డగు భగవంతుని సృష్టివిధానంబుననే కొన్ని విపరీతము లగపడుచుండ, నల్పశక్తుల మగు మన కృత్యములందు లోపము లుండుట యొక విరుద్ధమా? ఎవరే కార్యము నెంత బాగుగ నొనర్చినను దానికంటె నెక్కువ బాగుగ నొనర్ప నవకాశ ముండు ననియు, కావున విశేషప్రయత్నమునఁ గాని యేదియు దోషరహితముగ నుండనేర దనియు జనంబు లెఱుంగుదురుగాక!

## నీతిపద్యములు

క. ఖలున కిమ్మగు సంతసము! గ్గనుఁ డిష్టుఁడపోలె నుండి సర్వమువోలెన్
దన కిమ్మగుదును గఱచును। ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రిచేన్.

క. చెవిటికి శంఖధ్వని క న్నవిటికి దీపంబు మందుఁ డగు పురుషునకున్
యువతియు ఖలునకు నుపకృతి। శవమున కిడు భూషణములు జగతి వృథయగున్.

# ఆంధ్రదేశమునందలి ద్రావిడులు

చేగంటి శేషయ్యగారు

ఆంధ్రదేశమునం దున్న ద్రావిడ బ్రాహ్మణులు కోనసీమ ద్రావిడు లనియు, పేరూరు ద్రావిడు లనియు, అఱవ లనియు వాడఁబడుచున్నారు. ఆంధ్రులు మహారాష్ట్రులు మొదలగువారు కూడ పంచద్రావిడుల లోనివారే కాని ద్రావిడశబ్దము దక్షిణచెన్న రాష్ట్రము వారియందే రూఢిమై యున్నది. ప్రస్తుతము అఱవ ద్రావిడ శబ్దములు పర్యాయపదములుగా వాడఁబడు చున్నను, అఱవలు వే ఱనియు, ద్రావిడులు వే ఱనియుఁ గొందఱు తలంచుచున్నారు. మఱికొందఱు అవి పర్యాయములే యని చెప్పుచున్నారు. ఆ భిన్నాభిప్రాయమును గూర్చి సహేతుకముగఁ జర్చించి నిర్ధారణసేయుట కీ చిన్న వ్యాసమున తావు చాలదు. ఇంతకు నది ప్రస్తుతాంశమును గాదు. కాన యీ యాంధ్రదేశమునందలి ద్రావిడులు అఱవ లని పిలువఁబడుచున్నను, ద్రావిడు లని పిలువఁబడుచున్నను వీ రందఱు నొక తెగవా రయియే యున్నారు. ఈ ద్రావిడు లిప్పటి కించుమించు పది పంన్రెండు వందల సంవత్సరముల క్రిందట మొట్టమొదట గోదావరీమండలమునకు వచ్చినట్లు చెప్పుచున్నారు. వీరు తంజావూరు మండలములోని కుంభకోణమునకు నాల్గుమైళ్లలో నున్న 'వెలంగమాను' అను గ్రామమునుండి వచ్చియున్నారు. పదియవ శతాబ్దాంత్య భాగమున తంజావూరు రాష్ట్రమును బరిపాలించుచున్న పరాక్రమశాలి యగు రాజరాజచోడుఁడు ఆంధ్రదేశముపై దండెత్తి వచ్చి చాళుక్యులను జయించి తన జయధ్వజమును నాటి యీ రాజ్యపాలనమునకై కొందఱను నియమించి మరల తన దేశమున కేగెను. అప్పటినుండియుఁ గొంతవఱ కీ దేశము చోడరాజులచేఁ బరిపాలింపఁబడుచు వచ్చినది. ఈ ద్రావిడు లా కాలమున నీ దేశమునకు వచ్చిన ట్లూహింపఁదగియున్నది. ఆంధ్రబ్రాహ్మణులలో వెలనాడు కాసలనాడు మొదలగు భేదము లున్నట్లే ద్రావిడులలో వడమ, బృహచ్చరణము మొదలగు నాడీభేదములు గలవు. మొట్టమొదట నీ యాంధ్రదేశమునకు పదుమూఁడు గోత్రముల ద్రావిడు లరుదెంచి రనియు, రెండు గోత్రములవారు నశించి రనియు, పదునొకొండు గోత్రములవారు మాత్ర మిప్పు డుండి రనియుఁ గొందఱనుచున్నారు. మఱికొందఱు పంన్రెండు గోత్రములవారు వచ్చి రనియు, ఒక గోత్రమువారు నశించిపోయి రనియు, పదునొకొండు గోత్రములవా రుండి రనియుఁ జెప్పుచున్నారు. ఎట్లయినను నిలిచి యున్నవి పదునొకొండు. ఈ పంన్రెండు గోత్రములవారిలో పదునొకండు గోత్రములవారు వడమలు. ఒక గోత్రమువారు బృహచ్చరణులు. చోళదేశపు వడమ లని, వడమదేశపు వడమ లని వడమలు రెండు విధములవారు. అందులో నీ గోదావరి మండలమునకు వచ్చినవారు వడమదేశపు వడమలు.

## ప్రథమ నివాసస్థలము

ప్రప్రథమమున గోదావరీమండలమునందలి అమలాపురము తాలూకాలోని ర్యాలి గ్రామమునకు వచ్చి కొంత కాల మక్కడ నివసించిరి. ఆ కాలమున ర్యాలి ఒక తాలూకాకు ప్రధానపట్టణమై యుండెడిది. ఆ గ్రామమున నిప్పటికిని ఒకవీథి అఱవవీథి యని పిలువఁబడుచున్నది. అప్పలవా రను నింటిపేరు గలవా రిప్పుడు నక్కడ నివసించియున్నారు. జగన్మోహిన్యవతారమును సూచించుచు సగము పురుషరూపమును సగము స్త్రీరూపమును దాల్చి అత్యంతసుందరవిగ్రహ మని పేరొందిన ర్యాలి గ్రామమునందలి విష్ణువిగ్రహమును దక్షిణమునుండి ద్రావిడులే తీసికొనివచ్చి రని చెప్పుచున్నారు. వీరు పూర్వము నివసించెడి భూమి కొబ్బెరతోఁటలచే నిండి చల్లగ నుండు ప్రదేశ మగుటచే నిచ్చట కూడ నట్టి ప్రదేశమునే నివాసముగా నేర్పఱుచుకొనిరి. మల

ళారు ప్రాంతములయందు నేతికి బదులుగ కొబ్బెర నూనెను ఇప్పుడు కూడ వాడుచుందురు. ఆంధ్రదేశద్రావిడుల కా యభ్యాసము క్రమముగ తగ్గిపోయినది. కాని ఆ శబ్దము మాత్ర మిప్పటికిని వాడుకలో నుండియున్నది. కొబ్బెరనూనెను కొబ్బెరెణ యని యనెదరు.

### పేరూరు

ఏవైన చిక్కులు కలుగుటవలననో, మరి యే కారణమువలననో కొలఁది కాలములోనే ర్యాలిని విడిచి వేఱొకచో నివాసము గల్పించుకొనవలసిన యవసరము సంప్రాప్తము కాఁగా, అప్పటి ప్రభువుల నాశ్రయించి ర్యాలికిఁ గొంచెము దూరములో నున్న పేరూరిని అగ్రహారముగాఁ బడసి దానినే తమ ప్రధాననివాసస్థానముగా నేర్పఱచుకొనిరి. గోదావరీమండలమునకు వచ్చిన అప్పటి ద్రావిడులలో పద్మసోమయాజుల సోమనాధమహావ్రత సోమయాజులవారు ప్రముఖులు. వీరే పేరూరిని సంపాదించి అందఱకును అగ్రహారముగ నిచ్చివేసిరి. దక్షిణమున 'పేరూరు' అను నొక గ్రామ ముండెనఁట. ఆ పేరుననే ఇక్కడ కూడ నీ యగ్రహారమును స్థాపించిరి. ఇందు కొంత భాగమునకు ఆ యాజులవారి పేరట సోమనాధపుర మనియు, ఆయన భార్యపేరట లక్ష్మీదేవి యగ్రహార మనియు నామములు కలవు. క్రమక్రమముగ ననేకాగ్రహారము లీయఁబడి గ్రామ మభివృద్ధినొంది ప్రస్తుత మించుమించు ఏడువేల జనసంఖ్య కలిగియున్నది. ఆంధ్రదేశమం దంతటను వ్యాపించియున్న ద్రావిడుల కందఱకును ప్రథమమున నిదియే ప్రధాననివాసస్థానమగుటచే ప్రస్తుతము ఎక్కడ నివసించియున్నను వారందఱకును పేరూరిద్రావిడు లని పేరు వచ్చినది. ఆంధ్రదేశమం దంతటను విశేషించి ఉత్తరసర్కారులలోను ప్రస్తుతమున నీ ద్రావిడులు వ్యాపించియున్నారు. కాని అమలాపురము తాలూకాలో చాల విస్తారముగ నున్నారు. 'కోనసీమ' యని నామాంతరము గల యీ యమలాపురము తాలూకాలో నివసించియుండుటచే వీరికి కోనసీమ ద్రావిడు లని కూడ పేరువచ్చినది.

### భాష

దక్షిణమునుండి వీ రిక్కడకు వచ్చునప్పటికి వారి స్వభాషను గాక సంస్కృతభాషయందు వీ రసమాన ప్రజ్ఞావంతులై యుండిరి. వేదాధ్యయనమునందును షట్ఛాస్త్రములయందును బరిపూర్ణులుగ నుండిరి. ఆ కాలమున ప్రభువుల యాదర ముండుటచే వేదశాస్త్రము లత్యంతౌన్నత్యము నందియుండెను. రాజకీయవ్యాపారములయందును వేదశాస్త్రములయందును నత్యంతప్రవీణత గలవారై తన్మూలమున విశేషముగ భూవసతిని సంపాదించి వీరు దారిద్ర్య మనునది యెఱుంగక సర్వ విషయములఁ బరిపూర్ణులై యుండిరి. కొంత కాలమునకు వేదశాస్త్రములయెడ రాజానుగ్రహము లేకపోయినను, పొట్టకై వేఱువృత్తి నవలంబింప నవసరము లేనందున, అద్వితీయప్రతిభావంత మని భరతఖండమునకుఁ బేరు వచ్చుట కేవి ప్రధానకారణములో అట్టి వేదశాస్త్రములను విడిచిపెట్టక యభ్యసించుచు నిప్పటికిని కీర్తిని వెలయించుచున్నారు. ఒక్క పేరూరునందు ఒకటి రెండు శతాబ్దుల క్రిందట నాల్గు వందలమందికి మించి పండితులుండెడివా రనిన నం దతిశయోక్తి లేదు. కాలదేవత యొక్క తీక్ష్ణదృష్టియందలి వేఁడిమి కాఁగఁజాలక సంస్కృతభాషావధూటి ఆశ్రయమునకై వెదకుచు పోయి పోయి యీ కోనసీమయందే తల దాఁచుకొనినది. ఇప్పటికి నా కోనసీమయే యామె కాశ్రయము. మనోహరము లగు నానావిధవృక్షలతాదులు దట్టముగ నల్లుకొని యుండుట వలన నా ప్రదేశమునం దా తీక్ష్ణకిరణములు లోనికిఁ జొఱలేకపోయినవి. కాని యింతటితో నా కాలదేవత యూరకుండునా? మెల్లమెల్లగ నీవు కూడ నా నీడకుఁ జేరి యామె కాశ్రయము లేకుండఁ జేయు మని యేవియో లేనిపోని కుతంత్రములు చెప్పి హూణభాషావధూటిని జగడమునకై పురికొల్పుచున్నది. ఈ మాట విని పాప మా సంస్కృతభాషావధూటి గడగడలాడుచు నామెతో సఖ్య మొనఁగూర్చుకొనఁ జూచుచున్నది. ముందే మగునో!

సంస్కృత మి ట్లున్నను ద్రావిడము మాత్ర మేమియు నభివృద్ధి నొందలేదు. తద్దినమునాఁడును పర్వదినములయందును తెలుఁగు మాటలాడరా దనియును మాటలాడిన శ్రాద్ధము చెడిపోవు ననియు నెన్నెన్ని యో కఠిననియమములఁ బెట్టి ద్రావిడమును గాపాడ వీరు చాల ప్రయత్నించిరి. కాని యీ ప్రయత్నము లన్నియు నిష్ఫలము లయ్యెను. ఇప్పు డెక్కడను ద్రావిడము కానరాదు. ప్రస్తుతము యువకులును బాలురును ఇంట వాడుకొను పది యిరువది మాటలు దక్క ద్రావిడ మన్న మాటయే యెఱుఁగరు. వృద్ధులు కొందఱు కొన్ని కొన్ని శబ్దములను వాడుచుందురు కాని అది శుద్ధద్రావిడము కాదు; అపశబ్దములు. ఇప్పుడు దక్షిణమున నుండు ద్రావిడులు తెలుఁగు మాటలాడినచో నెట్టి భేద మగపడునో అట్టి భేదము కొంచెముగ, వయసు చెల్లిన వారు మాట లాడునపుడు గన్పట్టుచుండును. ఈ భేదమునే 'యాస' అందురు.

ప్రస్తుతమున నీ ద్రావిడుల కందఱకును మాతృభాష తెలుఁగు. కొందఱు తెలుఁగున మంచి పండితులై చక్కని శైలితో గ్రంథముల రచించియున్నారు. ములపాక బుచ్చన్నశాస్త్రి యను నొక కవి వేంకటేశ్వర మాహాత్మ్య మను నొక గ్రంథమును రచియించెను. అందు కవి తన్నుఁ గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. అనుపమకోనసీమాభిధానద్రావి
డాన్వయంబునను విఖ్యాతి మీఱు
ములపాకవా రను ముఖ్యాన్వవాయులు
కాశ్యపభార్గవకౌశికాత్రి
గోత్రజు ల్గల రందు గురుతరభార్గవ
గోత్రసంజాతుఁడై కొమరుమీఱె
వేంకటపతి వాని కుంకువమీఱ వెం
గాంబికయందు సుబ్బాభిధాన
విబుధవరుఁ డుద్భవించె నవ్విమలమతికి
బుచ్చమాంబికయందు సంపూర్ణచంద్ర
మండలముకీతి సత్కళామండనుండు
రహి జనించెను గోదండరామవిభుఁడు.

సీ. మల్లిసద్వంశతుమాపాలపూజ్యుండ
గుండ్లూరిపురి నుండు గురుయశుండ
నాంధ్రగీర్వాణభాషాష్టభాషాకవి
త్వాభినిర్మాణమహత్వవిదుఁడఁ
గాశికావిశ్వేశకరుణాకటాక్షాభి
భాషితబహుళప్రబంధచయుఁడ
హితనాటకాంతసాహిత్యనిశాత్యర్థస్త
సకలపురాణార్థసారవిదుఁడ
సాంద్రములపాకవిద్వత్కవీంద్రవంశ
వార్ధిచంద్రుండ సర్వసర్వంసహాభి
విశ్రుతకుకవికులగోత్రవిపులపక్ష
శాంతపవి నైన బుచ్చనశాస్త్రికవిని.

## మ త ము, ఆ చా ర ము

తత్వశాస్త్రవిషయము "ఏక మే వాద్వితీయం బ్రహ్మ" "తత్త్వ మసి" "నేహనా నాస్తి కించ" నేత్యాది మహావాక్యములతో నిండియున్న ఉపనిషత్తులు వీరి పరమప్రమాణములు. కర్మల విషయమునఁ గొందఱు ఋగ్వేదమును కొందఱు యజుర్వేదమును ననుసరించిరి. ఆచారవిషయమున వీ రనుసరించినది వైద్యనాథదీక్షితీయము. ఆంధ్రబ్రాహ్మణులకును వీరికిని మతాచారములలో నంత విపరీత మగు భేద మేమియును లేదు. ఒక్కటి మాత్ర మున్నది. ఆంధ్రులలోవలె వీరు మేనమామకొమార్తను బరిణయము చేసికొనరు. వీ రది చాల నిషిద్ధముగఁ దలంతురు. ఆంధ్రబ్రాహ్మణులలో నన్యోన్యభోజనము లున్నను ఒకనాడువారి కన్య నింకొక నాడువారు గ్రహింపనట్లే కొన్ని దినములు వడమద్రావిడులును బృహచ్చరణద్రావిడులు నన్యోన్యవివాహసంబంధములు లేకుండ నుండుచువచ్చిరి. కాని యిటీవల నా భేదమును దీసివేసిరి. ఈ పదుమూఁడు గోత్రములవారు గాకుండ మరికొంత కాలమునకు ఆరామద్రావిడు లను వా రొకకొంద ఱీ యాంధ్రదేశమునకు వచ్చియున్నారు. వారికిని వీరికిని అన్యోన్యభోజనము లున్నను పరిణయ సంబంధములు లేవు. అన్ని తెగల యాంధ్రబ్రాహ్మణులకును వీరికిని భోజనప్రతిభోజనములు కలవు కాని కన్యల నిచ్చిపుచ్చుకొనుట లేదు.

## ద ర డ క వి ల

దక్షిణదేశమునుండి యిక్కడకు వచ్చినది మొద

లు ఒకటి రెండు శతాబ్దుల క్రిందటివఱకును ఆంధ్రదేశమునకు వచ్చిన యీ ద్రావిడుల చారిత్రమును వారు క్రమముగ సంస్కృతభాషలో రచియించి పెట్టుచు వచ్చిరి. ఆ పుస్తకమునకు దండకవిల యని పేరు. దీనిని చదివినచో వీరి చారిత్రము సంపూర్ణముగఁ దెలియును. కాని భరతఖండమునందలి కొన్ని యుద్గ్రంథముల కెట్టి గతి వాటిల్లినదో దీనికి నట్టి గతియే పట్టినది. ఈ గ్రంథము తాటాకులపై వ్రాయఁబడి పేహూరునం దొకరి యింట నామావశిష్టమై యున్నది. దాని నాయన ప్రకటింపరు. ప్రకటింప నొరుల కీయరు. ఈ యిరువదియవ శతాబ్దిని గూడ మన యీ హిందూదేశమున నిట్టి చారిత్రకగ్రంథము లిట్లు నశించిపోవుచున్న వని తెలిసికొని నప్పుడు ఎంతగ నాఁచికొనినను మనకన్నుల నశ్రువు లుదయింపకమానవు.

రాజకార్యములయందు నిపుణులై ధర్మబుద్ధిగలిగి దేశసేవ చేసినవా రనేకులు వీరిలో కలరు; ఇప్పుడు నున్నారు. అనప్పిండి అమ్మన్నగారు పెద్దాపురము సంస్థానమునకు చాలకాలము దివానుగ నుండి రాజ్యపరిపాలనమును జక్కఁగ నిర్వహించియున్నారు. ఈయన పెనుగొండ తణుకు అమలాపురములకు జమీందారులుగ నున్నట్లు కూడ తెలియుచున్నది. రాజమహేంద్రవరమునకు సమీపమున నున్న దివాంజీచెఱువును వీరే త్రవ్వించిరఁట. అనేకదేవాలయములను నిర్మించి భూముల నిచ్చిరఁట; ప్రభువులచే నిప్పించిరఁట. అమలాపురము తాలూకాయందలి మురుమళ్లలో నిత్యకళ్యాణోత్సవము జరుగుచున్న వీరేశ్వరాలయమును అయ్యలసోమయాజుల పేరమ్మగా రను నొక స్త్రీరత్నము కట్టించెనఁట. ఆమె యింక ననేకధర్మకార్యములు చేసెను; కొన్ని యగ్రహారముల నొసంగెను. గన్నవరమున డొక్కా జోగన్న గారును, ఆయన సతీమణి సీతమ్మగారును చేసిన యన్నప్రదానమునకు మితి లేదు. "డొక్కావారి యన్నప్రదాన" మని భరతఖండమం దంతటను వారికీర్తి ప్రబలి యున్నది. ఇట్లే యనేకు లనేకధర్మకార్యములు చేసి కీర్తి సంపాదించి మృతులయ్యును జీవించియున్నవారు. ప్రస్తుతకాలమున వీరిలో ననేకులు హూణభాషయందుఁ బరిపూర్ణులై పేరువడసియున్నవారు.

## సీతాస్వయంవరము

ఉర్వీదేవు లపూర్వమోదమున విధ్యుక్తంబుగాఁ జేయు నా
 శీర్వాదంబు సుమంగలీజనమణీశృంగారమాంగళ్యగాం
ధర్వస్వానము తూర్యఘోషము జయోద్రావమ్ము నొక్కుమ్మడిన్
సర్వాశాగతిఁ బర్వె దారితధనుర్నాదప్రతిధ్వానమై.

మ. జనకక్ష్మాపతి కన్నుసన్నలనె యాజ్ఞాపింపఁ, బుణ్యాంగనా
జన మంతఃపురి కేఁగి భూమిజకు విజ్ఞాపించి తోడ్తేరఁగా,
ఘనసంఘాతమునుండి వెల్వడు తటిత్కాంతిన్ విడంబించుచున్
ఘనసౌధాగ్రమునుండి తా వెడలె శృంగారంబు తోరంబుగన్.

మ. శరదబ్జానన వెన్కముందగుచు లజ్జాకాతుకాళీమణీ
కరకంజాతము లూఁతగాఁ గొని తనూగంధప్రభాజాలముల్
పరివేష్టింప సభాస్థలాభినవలీలాభూష యై రాఘవే
శ్వరు కంఠంబున వైచె రాగసుమనఃప్రాగ్భారమున్ హారమున్.

ఉ. కౌతుకవామనేత్ర యది గాంచి వినోదవిలోకనాగత
క్ష్మాతలనేతలన్ వలచి సమ్మతి వారి వరించె; నంత ల
జ్జాతరుణీలలామయు వెసన్ వరియించె మహాసభాజన
వ్రాతగతస్వయంవరపరాజితరాజకుమారవారమున్.

ఉ. అంతకుమున్నె రాముని దనంత వరించిన కీర్తికాంత త
న్నింతయు లెక్కసేయ కతఁ డెవ్వతెనో వరియించె నంచు దు
ర్దాంతమనోవ్యథన్ దిశలఁ దల్లడమందె వియోగపాండువై;
ఖాంతలఁ జూచుచున్ సవతిపోరు సహింతురె యెందు సుందరుల్?

# శ్రీ బ్రహ్మానంద కేశవచంద్ర సేను

కవుకొండల సాంబశివరావుగారు

సకల దేశములందును సకలయుగములందును నప్పటప్పటి యవసరములనుబట్టి మహానుభావు లుద్భవించుచుందురు. సుమారు రెండువేల సంవత్సరములకు పూర్వము యుహుదియా దేశ మొక గొప్ప యల్లకల్లోలావస్థయం దుండెను. యూధీయు లంత కనేక సంవత్సరములకుఁ బూర్వమే స్వరాజ్యాధికారమును గోల్పోయి దిక్కుమాలినవారై యుండిరి. అందుకు తగునట్లుగ నక్కాలమున రోమీయులు కూడ వారిదేశముపై దండువెడలి, పాలస్తీను నంతయు చేతఁ జిక్కించుకొనిరి. స్వదేశమందుండు హెరడ్ మొదలుగాఁగల చిన్నచిన్న ప్రభువులు రోమీయ రాష్ట్రమునకుఁ గప్పమును జెల్లించుచు, పరాధీనులయ్యు స్వదేశీయులగు యూధీయులనే పీడించుచుండిరి. దేశ మంతయు కడు దురవస్థయం దుండెను; బీదలు దిక్కులేక మొఱపెట్టుచుండిరి. అత్తఱి దీనుల పాలిటికి దైవమో యన్నట్లు శ్రీ యేసుక్రీస్తు ఉద్భవించి తన యాత్మబలముచే దుష్టులను భయకంపితులఁ జేసి బీదసాదలకు నాశ పుట్టించెను.



సుమారు రెండువేల యైదువందల సంవత్సరములకు పూర్వము మన భారతవర్షమునందు సాంఘిక జీవనము కడు హీనావస్థయం దుండెను. బ్రాహ్మణులు తమ వృత్తిని మఱచి నరమృగబలులందు నాసక్తి గలిగియుండిరి. శాస్త్రజ్ఞులు తమ దైనికవ్యవహారములను త్యజించి యేమాత్రము నక్కఱకురాని వితండవాదములందు ప్రొద్దు పుచ్చుచుండిరి. బీదలు సుఖ మన నేమో యెఱుఁగక శాస్త్రజ్ఞులను బ్రాహ్మణులను నుడువు నర్థములేని వాక్యముల మోహశక్తికి వశులై మంచిచెడుగుల తారతమ్యమును మఱచిరి. పశ్వాదు లనాథలై యెక్కడఁ జూచినను తమ రక్తమే ప్రవహించుచుండుటను గాంచి భగవంతునకు మొఱపెట్టుకొనుచుండెను. అట్టిసమయమున దిక్కులేని మృగములపాలిటికి దిక్కో యన్నట్లును, శుష్కజ్ఞానుల కంకుశమో యన్నట్లును, బూటకపు బ్రాహ్మణుల కనంతశత్రువో యన్నట్లును, శ్రీగౌతమబౌద్ధుఁ డుద్భవించి, జంతువర్గమున కభయహస్త మిచ్చి, జనపీడకులకు భీషణుఁడై, కలకలధ్వనులచే నిండియున్న యశాంతిసముద్రమున కనంత నిర్వాణదాయకుఁడై, భారతవర్షమునకు శిరోమణియై, ప్రపంచమునకు మార్గదర్శియై, యార్యావర్తమునకు వన్నె దెచ్చెను.

సుమారు నూటనలువది సంవత్సరముల క్రిందట మన హిందూస్థానము మెల్లమెల్లన మహమ్మదీయుల పరిపాలనమును వదలించుకొని యాంగ్లేయుల చేతిలోఁ జిక్కుచున్నపుడును, హిందూధర్మము విషయమై నాల్గక్షరములకంటె నెక్కువ యెఱుఁగని క్రైస్తవమతబోధకులు హిందూధర్మమును ఖండించుచు క్రైస్తవమతమును స్థాపింపఁ బూనుచున్నపుడును, జాతిమతభేదము లధికమై యనాథలు నాథులతో కాలిపోవుచున్నపుడును, శ్రీ రాజర్షి రామమోహనరాయ లుద్భవించి, హిందూధర్మగౌరవమును నిల్పి, క్రైస్తవమతబోధకులను గజగజ వణఁకించి, వేదాంతమును మరల స్థాపించి, సహగమనమును గొట్టివేయించి, జాతిభేదములను జితుగఁ గొట్టి, యేసుక్రీస్తు మహమ్మదుల యొక్క మహౌన్నత్యమును ప్రపంచమునకుఁ జాటి, భారతవర్షమందు నూతనయుగమును సృష్టించి, భారతమాత కీర్తిని బృథ్వి కెల్లఁ దెలియఁ బఱిచెను.

కాని రామమోహనరాయలు సాంఘికౌన్నత్యమునకై యనేకవిధముల పాటుపడినను నది చాలలేదు. కేశవచంద్రసేను జన్మించుతఱికి రామమోహనుని కాలమున లేని సమస్యలు కొన్ని నూతనముగఁ బుట్టినవి. బ్రహ్మానందుని కాలమునాఁటికి పాశ్చాత్యవిద్యయు నాగరకమును మన దేశమునఁ జొచ్చి సంఘమును దొట్రుపఱిచి మన యువజనులను గలవరపెట్టుచుండెను. యువకులు వేషభాషలందు జాతీయపద్ధతులను వదలి విదేశీయమార్గములను ద్రొక్కసాగిరి. క్రైస్తవమతబోధకులు రామమోహనుని కాలమునఁ బరాజితు లయ్యును, కొంచెము విరామము దొరకినంతనె మఱింత యుత్సాహపూరితులై వందలువందలుగ మన దేశముపై దండెత్తసాగిరి. విద్యార్థు లనేకులు స్వధర్మమును సరిపూర్ణముగ మఱచి గుంపులుగుంపులుగ క్రైస్తవమతము నవ

లంబించుచుండిరి. ఇట్టితఱి భారతమాత నుద్ధరించుటకై జన్మించినది శ్రీ బ్రహ్మానంద కేశవచంద్రసేను.

ఈయన వంగదేశమున కలకత్తానగరమున క్రీ. శ. 1838 వ సంవత్సరమున వైద్యవైష్ణవకులమందు జనియించెను. పితృపితామహులు శ్రీమంతులు. వంశము వంగదేశమున మిగుల ఖ్యాతికెక్కినది. కేశవచంద్రుఁడు చిన్ననాఁటినుండియు భక్తిపరుఁడు, శ్రద్ధావంతుఁడు, సూక్ష్మబుద్ధి గలవాఁడు; ఆకారమం దాజానుబాహుఁడు; సాహిత్యశాస్త్రమం దభిరుచియు గణితశాస్త్రమందు విరక్తియుఁ గలవాఁడు. ఈయన యౌవనమున ననేకబాలురను ప్రోగుచేసి, నూతననూతనము లగు నాటలను సృష్టించి యన్ని యాటలందును దా నేనాయకత్వమును వహించి యాడుచుండెడివాఁడు. తల్లిదండ్రులీయనను కొన్నివత్సరములు ముద్దుగఁ బెంచి కడకు హిందూకళాశాలకుఁ బంపుచుండిరి. అక్కడనే కేశవచంద్రుఁ డాంగ్లేయభాషను బాగుగఁ జదువనారంభించెను. తన్మూలమున నాయనకు క్రైస్తవమతవేద మగు బైబిలుతోఁ బరిచయము గలుగ, యేసుక్రీస్తుజీవనమం దత్యంతాసక్తి గలవాఁడై, యా గ్రంథమందలి 'నూతననిబంధన' ననిర్వచనీయ మగు నాతురతతోఁ బఠియించెను. ఇదియే యీయన జీవనమున మొదట బాగుగ నాటుకొనిన ధర్మబీజము. ఈయన వంశధర్మానుసారముగ మాంసభక్షకుఁ డయ్యును పదునాల్గవ వత్సరముననే దానిని వదలి శాకాహారి యయ్యెను. తరువాత నిరువదవ వత్సరమున హిందూధర్మమందలి జాతిమతభేదాదులఁ బరిగణింపఁజాలక బ్రాహ్మసమాజమునఁ జేరెను. ఇది మొదలీయన జీవించియుండిన యిరువదియైదు వత్సరములును బ్రాహ్మసమాజోద్ధరణమునకును భారతవర్షోద్ధారణమునకును తన యావచ్ఛక్తిని ధారవోసి క్రీ. శ 1884-వ సంవత్సరమున మృతినొందెను.

మన మీ మిగిలిన వ్యాసమందు కేశవచంద్రుని యీ యిరువదియైదు వత్సరముల జీవితమును, ఆయన దేశమున కొనర్చిన సేవను గూర్చి సంక్షిప్తముగ ముచ్చటింతము. కేశవచంద్రుని యీ యిరువదియైదు వత్సరముల జీవితము విషయమై యనేకాభిప్రాయములు గలవు. కొందఱీయన మొదటినుండి తుదవఱకును జేసిన దంతయు ప్రశంసనీయమే యనుచున్నారు. మఱికొందఱు ఈయన చేసినదానిలో నేమాత్రమును జేకొనఁదగినది లే దనుచున్నారు. వేఱొకకొందఱీయన మొదట చక్కఁగ బ్రవర్తించినను జీవనాంతమం దనేకభ్రమలకు లోనయ్యెననుచున్నారు. కాని మన మీ యెవ్వరిపక్షమును వహింపక కేశవచంద్రుని విషయమై మనకుఁ దెలిసినవట్టు మంచిచెడుగుల రెంటిని జూపయత్నింతము. ఈయన జీవితమును గ్రహింపఁదలఁచినచో నీయనయం దున్న యొక రహస్యమును దప్పక పరిగణింపవలయును. ఈయనకు సత్యమం దపరిమితాపేక్షయు నసత్యమం దత్యంతమైన యసహనమును గలదు. ఇదియే యీయన జీవితమునందలి రహస్యము. ఈయన యెన్ని మంచిచెడుగులను జేసిన నిదియే యీయన యావజ్జీవితమందును నస్ఖలితముగఁ బ్రవహించుచున్నది. దీనిని మనము గ్రహింపఁజాలమైతిమేని యాశ్చర్యకరమైన యీయన జీవితము నవగాహపఱుచుకొనుట కష్టతరము.

కేశవచంద్రుఁ డీసమయమున బెంగాల్ బ్యాంకునందుఁ జక్కని యుద్యోగమం దుండియు ధర్మసంఘసంస్కారాదులందలి యాసక్తిచే క్రీ. శ. 1861-వ సంవత్సరమున దానిని వదలి సంపూర్ణోత్సాహముతో నానాప్రాంతములందును దిరిగి బ్రాహ్మమతమును బోధించుచుండెను. ఈ సమయమున నీయనయు శ్రీ మహర్షి దేవేంద్రనాథఠాకురుగారును నత్యంతమిత్రులు. ఠాకురుగారు కేశవచంద్రునిఁ గుమారునివలెను, కేశవచంద్రుఁడు మహర్షిని జనకునివలెను జూచుకొనుచుండువారు. కేశవచంద్రుఁడు యజ్ఞోపవీతమును బరిత్యజింపవలయు నని చెప్పినతోడనే మహర్షి దానిని దొలఁగించెను. కేశవచంద్రుఁడును నతని మిత్రులును నప్పు డాదిబ్రాహ్మసమాజముయొక్క సభ్యులు; వీరిలోఁ గొందఱప్పుడప్పుడు సమాజోపాసనాదికార్యములను జేయుచుండెడివారు. కాని యింత మైత్రి యుండియు కేశవచంద్రమహర్షులు కొన్నాళ్లకు నొండొరులను వీడవలసివచ్చెను. మహర్షి కుపనిషత్తు లన్న నతిప్రేమ; స్వదేశాచారాదులమీఁద। నత్యంతగౌరవము. కేశవచంద్రుఁడు యేసుక్రీస్తన్న ప్రాణము విడుచువాఁడు; ఉపనిషదాదుల ఘనత నప్పటికి విశేషముగ నెఱుఁగఁడు; సంఘసంస్కారాదులం దత్యంతాసక్తి; దేశమున నుండు నానాకుసంస్కారముల నొక్కపోటుతోఁ బొడువవలయు నను నమితోత్సాహము గల్గియుండె. ఈ కారణములవలన వీరిరువుర కన్యోన్యానురాగ ముండియుఁ బొత్తు కుదురకుండుటచే, క్రీ. శ. 1866-సంవత్సరమున కేశవచంద్రుఁడు తన మిత్రులతో నాదిబ్రాహ్మసమాజమునుండి చీలి, మెల్లమెల్లన భారతవర్షీయబ్రాహ్మసమాజమును స్థాపించెను. ఇది మొదలు క్రీ. శ. 1878-వ సంవత్సరము వఱకును కేశవచంద్రుని కీర్తి భారతవర్షమం దంతటను మాత్రమే గాక యూరోపు అమెరికా ఖండములందుఁ గూడ వ్యాపించెను.

ఈ పదిపదునొకండు సంవత్సరములలో నీయన యనేకులను బ్రాహ్మసమాజమున కాకర్షింపఁగల్గెను; ఖ్యాతిఁజెందిన శ్రీ పండిత శివనాథశాస్త్రిగారును, ఆనందమోహన్ బోసుగారును, మఱియు నితరసుప్రసిద్ధులును బ్రాహ్మసమాజమునఁ జేరిరి. కేశవచంద్రుని యుపన్యాసశక్తియు నుత్సాహమును నధికమయ్యెను; సంఘపారిశుద్ధ్యమితాచారముల విషయమై దేశమునం దంతట ఘోషించి తత్కార్యసాధనార్థమై శాఖోపశాఖల స్థాపించెను; తన మిత్రులలో నొక్కొక్కని నొక్కొక్క ధర్మమును సాంతముగఁ బఠింప నియోగించెను; విగ్రహారాధనాతిబాల్యవివాహములమీఁద ధ్వజమెత్తి పోరాడుచు భారతవర్షపు నానామూలలను దిరిగి యుపన్యాసము లీయసాగెను; క్రీ. శ. 1870-వ సంవత్సరమున నింగ్లాండుదేశము వెళ్లి యక్కడ ననేకముగ నుపన్యాసము లిచ్చి మహావక్త యని పేరొంది, క్రైస్తవసమాజముయొక్క వివిధశాఖలవారిచే నమితగౌరవమును బడసి భారతమాత నాంగ్లేయులదృష్టికి ఘనమైనదానినిగఁ జేసెను. ఆంగ్లేయదేశమునుండి తిరిగి వచ్చినతరువాత నీయన యతిబాల్యవివాహములమీఁద పునరుత్సాహముతో దండెత్తి, యాంగ్లేయపరిపాలనమును బలవంతపఱిచి,

బ్రాహ్మసమాజపు బాలికలు పదునాల్గు సంవత్సరములైన తరువాత వివాహమాడినను తద్వివాహము న్యాయవిరుద్ధము కాఁజాలకుండునట్లు చేయించి క్రీ. శ. 1872-వ సంవత్సరమున సివిల్ మేరేజ్ ఆక్టు రప్పించెను. ఈ సమయముననే యీయన మనస్సు జ్ఞానకర్మభక్తియోగమార్గముల కొరగ, తత్తత్సాధనముల నవలంబించి ధర్మజీవనమందు గభీరత గలిగినకొలఁదిని సంఘసంస్కారాదులం దుత్సాహము తగ్గుచుండెను. అదియును గాక యీయన మొదటినుండియు రాజకీయోద్యమములందు తాను జోక్యము కలుగఁజేసికొనకుండుటయే గాక యితరులను సహితము నిరుత్సాహపఱిచెను. దీనికి తగినట్లు క్రీ. శ. 1878-వ సంవత్సరమున తన జ్యేష్ఠకుమారికను పదినాల్గు సంవత్సరములు నిండకమునుపే కూచిబిహారు రాజకుమారున కిచ్చి వివాహముచేసెను. ఈ వివిధకారణములచే విజయకృష్ణగోస్వామి, ఆనందమోహన్ బోసు, శివనాథశాస్త్రి మొదలగు ప్రముఖులు సహింపఁజాలక భారతవర్షీయ బ్రాహ్మసమాజమునుండి వీడి, సాధారణబ్రాహ్మసమాజ మను మఱియొక శాఖను ప్రతిష్ఠించిరి.

కేశవచంద్రుని జీవితములోని చరమభాగమును గూర్చిన ప్రసంగము నెత్తుకొనకపూర్వము మన మిచట నొక క్షణ మాఁగి యాయన యీ మధ్యజీవనమం దొనర్చిన కొన్ని కార్యములను, నాయనకును నాయన శిష్యబృందమునకును శివనాథశాస్త్ర్యాదులకును జరగిన వాదములను గొంచెము విచారింతము. శ్రీ కేశవచంద్రునియందు మొదటినుండియు ధర్మోత్సాహమును సంస్కారములందు పట్టుదలయుఁ గల వనుమాట వాస్తవము. ఈయన మేధాశక్తి యపరిమితమైన దగుటయు నీయన యొక యుగపురుషుఁ డనుమాటయు వాస్తవములే. శివనాథశాస్త్ర్యాదులు దీనిని మొదటినుండియు నొప్పుకొనియే యున్నారు. అట్లయిన నీ యుభయపక్షములకును దగవు లేల కల్గెను? కేశవచంద్రుని నమితప్రేమతోఁ జూచుచుండిన విజయకృష్ణుఁడును ఆనందమోహన్ బోసును శివనాథశాస్త్రిగారును ఏల చీలిపోయిరి? దీని కొక గూఢమైన గభీరతరకారణము ఉండవలయును గాని, ఇది కేవల మొక్క కూచిబిహారు వివాహముచే కాఁజాలదు. శివనాథశాస్త్రిగారును ఆనందమోహన్ బోసును నక్కాలమునందలి పాశ్చాత్య విద్యయం దారితేఱినవారు; వీరు విశ్వవిద్యాలయములం దనేకబిరుదములను బొందిరి. వీరికి స్వదేశ మన్న నమితప్రేమ. సంఘసంస్కారాదులందును రాజకీయవిషయములందును వీరికి కేశవచంద్రునికంటె నధికోత్సాహ ముండె. అదిగాక వీరు కేశవచంద్రునివంటి భక్తులు కారు. కేశవచంద్రుఁ డన్ననో యమితభక్తుఁడు. భక్తుఁడు ప్రతివిషయమునందును భగవంతుని సంజ్ఞలను జూచుచుండును; భారతవర్షమును బరిపాలించుటకై యాంగ్లేయులు భగవంతునిచే నిరూపింపఁబడి రనియు, నందుచే నాంగ్లేయపరిపాలనమును భగవంతుని పరిపాలనముగ నమ్మవలయు ననియు కేశవచంద్రుని విశ్వాసము. ఇంకను కేశవచంద్రునకు నవీనపాశ్చాత్యవిద్యయందు శివనాథాదుల కున్నట్టి పరిచయము లేదు. మరియు నాతఁడు సంఘసంస్కారకుల యనుచరులలోఁ గొందఱు చేయు నమితాచారములను జూచి భయపడి సంఘ



సంస్కారము నతిత్వరితముగ నడపిన సంఘమునకు హాని వాటిల్లు నని నమ్మెను. కేశవచంద్రశివనాథుల కీ నానావిషయములందును మొదటినుండియు వేర్వే ఱభిప్రాయము లుండెను. వీరు చివరకు చీలిపోవుట కివియే కారణములు కాని కూచిబిహారు వివాహ మొక విశేషమైన కారణము కాదు.

ఆ వివాహవిషయమును మనము సంక్షిప్తముగ విచారింతము. కేశవచంద్రుని కొమార్తెకు పదునాలుగు వత్సరములు నిండకమునుపే వివాహము చేయుట కేశవచంద్రుని యాదర్శములకు భంగము కలిగించి బ్రాహ్మసమాజమునకు హాని వాటిల్లఁజేయు ననియు, కూచిబిహారు రాజకుమారుఁడు బ్రాహ్మసమాజకుఁడు కాకుండుటచే నదియు బ్రాహ్మసమాజమును హీనపఱుచు ననియు సాధారణబ్రాహ్మసమాజమువా రనిరి. కేశవచంద్రుఁ డన్ననో తద్వివాహము భగవత్సంకల్పమగుటచే దానిని చేసియే తీరుదు ననెను. ఇం దెవరిపక్షము వాస్తవమైనదియు మనము చెప్ప నక్కఱ లేదు. కాని కేశవచంద్రుఁ డీ వివాహమును జేయింపకుండిన మిగుల బాగుండునది. దీనివలన నెవరికిని మేలు కలుగలేదు. కూచిబిహారురాష్ట్ర మింతవఱకును దేశమున కెద్దియు విశేషము మేలు కలుగఁజేయలేదు; అయిన నీ వివాహమందు కేశవచంద్రుఁడు తాను వైద్యకులస్థుఁ డయ్యు, తక్కువ కులమునకుఁ జెందిన కూచిబిహారువంశమందు తన కొమార్తె నిచ్చుటచే సంఘసంస్కారమందుఁ దన కున్న యాదరమునే సూచించెను. కాని తన కొమార్తెకంత పసితనములో వివాహము చేయుటకు తగినంత కారణము లేదు. అది గాక ననేకవిధముల దేశసేవ చేయనెంచిన కేశవచంద్రునివంటి వాఁడు క్షత్రియవంశముతో వియ్యమందుటంత ప్రశంసనీయముగ నుండ లేదు. కేశవచంద్రుని కొమార్తె యగు కూచిబిహారురాణిగారు దేశమునకుఁ జెప్పఁదగిన సేవ నెద్దియుఁ జేయలేదు. కావున మొత్తముమీఁద నక్కాలమందు శివనాథశాస్త్ర్యాదులు విడివడుట సంఘసంస్కారమున కత్యంతశ్రేయస్కర మైనది. కాని యప్పుడు విడివడుటచే నెల్లకాలమును విడివడియుండవలయు ననుటలో నర్థము లేదు.

ఇఁక మనము కేశవచంద్రుని చరమజీవితము విషయమై యించుక ప్రసంగింతము. కూచిబిహారు వివాహ మైనతరువాత కేశవచంద్రుఁడు ఆఱు సంవత్సరములు మాత్రమే జీవించియుండెను. కొమార్తె వివాహముచే స్వదేశమందును నింగ్లాండునందును బుట్టిన కలవరమును శివనాథశాస్త్ర్యాదులు విడిపోవుటయు నీయన హృదయమును జీల్చివైచెను. ఇఁకమీఁద నీయన యుపన్యాసములతో సాధనను కూడ నెక్కువగఁ జేసెను; అనేకనిష్ఠలను బూని రాత్రింబవళ్లు బ్రహ్మదర్శనమందు మగ్నుఁడై యుండెడివాఁడు. ఈయన యీ సమయముననే బ్రాహ్మసమాజ మను పేరును నవవిధాన మను పేరుగ మార్చివైచి సర్వధర్మసమన్వయము చేయఁబూనెను. కేశవచంద్రుని యర్థమున నవవిధాన మన నేమి? నవవిధాన మన నీశ్వరుఁడు నూతనముగ నా యుగమునకుఁ దగినట్లు విధించిన సత్యము. ఈశ్వరుఁ డాయా యుగములకుఁ దగిన ట్లొక్కొక ధర్మమును సృష్టించుచుండును. ఇదే విధమున హిందూక్రైస్తవమహమ్మదీయాదిధర్మములు

వ్యాపకములోనికి వచ్చినవి. కాని యిప్పుడు వీనిగతి యేమి కావలసినది? ఇవన్నియు నడుగంటిపోవలసినవా? దీనికి నుత్తరముగా కేశవచంద్రుఁడు నవవిధానమును జూపించెను. ఈ వివిధధర్మములందేదియు నష్టము గానక్కఱలేదు. సమస్తధర్మములందును సత్యముండుటయే గాక సమస్తధర్మములును సత్యములే. ఒక్కొకధర్మమందు జరగిన కాండ మంతయు నాయా మతావలంబులయొక్క ధర్మవిజ్ఞానఫలము గాని కేవలము బూటకము కాదు. కాని యా మతావలంబులు తమ యాత్మజీవనములో నొక్కొక్క శ్రేణిని దాఁటిన కొలఁదిని నూతనము నుచ్చతరము నగు జ్ఞానమును బొందుచుందురు. కావున నాదినుండియు సకలధర్మములలోను బుట్టి పెరిఁగిన యంశములలో నెద్దియుఁ గేవలము వ్యర్థ మగునది గాదు. అవి యన్నియు స్మరణీయములే గాక ధర్మములయొక్క క్రమవికాసమును సూచించును. ఇందుచేతనే సకలధర్మములలో కొన్ని సత్యము లుండుటయే గాక సకలధర్మములును సత్యములే. మఱియు నివ్విధముననే ధర్మసాధనార్థమై యేమి సంఘసంస్కారసాధనార్థమై యేమి ప్రపంచమున ననాదినుండియు వివిధయుగములందును వివిధదేశములందును జనియించిన మహానుభావు లందఱును భగవంతుని విధానపురుషులు. వీ రందఱియందును నొక్కొక గుణము ప్రకాశించుచున్నది. యేసుక్రీస్తులో మానవులయెడల నమితప్రేమయు, బుద్ధదేవునియందు మైత్రియు, మహమ్మదునందు నిష్ఠయు తేజోవంతము లై యున్నవి. ఇందులో మనము దేనిని విడువఁజాలము. ఇం దొక్కొక్క గుణమును సాధింపవలె నన్న నాయా గుణములను సాధించిన యా మహానుభావుల నాదర్శముగఁ గైకొని, వారి జీవితచరిత్రములను మన జీవనములందు జీర్ణించుకొనవలెను. అప్పుడే మనము వారల నిజముగ మన్నించినవార మగుదుము. అంతియగాక యొక్కొక ధర్మము నొక్కొక ప్రధానసత్యమును నిరూపించుచున్నది. హిందూధర్మము భగవంతుని యనంతత్వమును ఆయన సర్వమయత్వమును బ్రధానముగఁ జూపుచున్నది. క్రైస్తవధర్మము ఈశ్వరునియెడల పుత్రభావమున మెలఁగుచు మానవసంఘమునకు సేవ సేయవలయు నని నొక్కి చెప్పుచున్నది. మహమ్మదీయధర్మ మేకేశ్వరోపాసనమును వేయువిధముల ఘోషించుచున్నది. వీణను వాయించునపు డొక్కొక తంత్రి యొక్కొక నాదము నిచ్చును. ఇందులో నేనాదమును మనము విడువలేము. మఱియు నాయా నాదము లొకవరుసను ధ్వనించుచుండుటచేతనే మనము రమ్యమై మాధుర్యమైన సంగీతమును వినుచున్నాము. ఈ వివిధనాదములను సంపూర్ణముగ సమన్వయించుకొని బయల్వెడలు మధురగానమే నవవిధానము. నవవిధానము సకలధర్మములందును బ్రధానముగ మూర్తీభవించిన సత్యములను సమన్వయించుకొని యొక నూతనసత్యముగఁ బ్రకాశించుచున్నది. ఇది కేవలము సత్యముల సముదాయమే గాక సత్యముల సమన్వయము కూడ నై యున్నది. ఈ సమన్వయములో నీ నానాసత్యములును కరఁగి కలిసిపోయి యొక నూతనసత్యముగఁ బ్రకాశించుచున్నవి. ఇదియే నవవిధానము, కేశవచంద్రుఁడు తన చరమావస్థయందు రాత్రింబవళ్లు సాధించి విశ్రాంతి లేకుండఁగ ప్రపంచమునకు ఘోషించిన దీ విషయమే.

ఈ కాలమందు కేశవచంద్రుని యుత్సాహము తిరిగి యిబ్బడి కాఁగ, నీ నవవిధానతత్త్వమును ఢంక గొట్టి బహువిధముల ప్రచురించెను. ఈయన తన 'జీవనవేదము'లో నవవిధానాంతరము సాధకుల యుత్సాహము నాయువును వేయిమడుంగు లధికమయ్యె నని నుడివి యున్నాఁడు; తన సమాజములో నిష్కాముకసంసారము, బ్రహ్మచర్యము, ఆధ్యాత్మికవివాహము నను ననేకము లగు వ్రతముల నేర్పఱిచెను; తన యనుచరులను భక్తియోగమార్గములందు సంపూర్ణముగ దింపివేసెను. ఈయనకు సంఘసంస్కారమందలి యుత్సాహము తగ్గుచు ధర్మజీవనసాధనమందలి యాతురత యెక్కువగుచుండెను. ఈయన యొక్కొకదినమున గంటలవెంబడి పంచభూతములలో నొక్కొక భూతము ముందు కూర్చుండి యందు బ్రహ్మదర్శనమును పొందుటకై యనిర్వచనీయమైన యాకాంక్షతో సాధనచేయువాఁడు. ఒక చిన్న యగ్నిగుండము ముందు రాత్రింబవళ్లు గూర్చుండి బ్రహ్మదర్శనలాలసుఁడై యుండఁ జూచినవా రనేకు లున్నారు. ఒకనాఁడు నిశీథసమయమున నీయన తనగదిలో ప్రక్కమీఁద లేకుండెను. స్నేహితు లెక్కడ నక్కడ వెదుక, సాధనకుటీరమందుఁ గూర్చుండి, గృహమం దున్న పాదరక్షల నన్నిటిని దండగట్టి మెడలో వైచుకొని వామహస్తముయొక్క యైదువ్రేళ్లను దక్షిణహస్తముయొక్క యైదువ్రేళ్లతోఁ గలుపుచు విడఁదీయుచు నుండెను; అందుపై నిది యేమని యడుగ, పాదరక్షలదండ తనకు వినయమును గఱపుటకనియు, నెడమచేతియొక్క యైదువ్రేళ్లను కామక్రోధలోభమోహాహంకారములకును కుడిచేతి వ్రేళ్లను తద్వ్యతిరేకగుణములకును చిహ్నములుగఁ బెట్టికొంటి ననియు, నీ వ్రేళ్లను గలుపుచు విడఁదీయుచు నుండుట కామాదిగుణములను నిష్కామాదిగుణములచే ధ్వంసముచేయుటను సూచించు ననియు నుడివెను.

ఈ సమయమున కేశవచంద్రుని ధర్మాకాంక్షయు భగవద్దర్శనతృష్ణయు నింతంత యని చెప్ప నలవికాదు. అహోరాత్రము లిదియే దృష్టి. ఈయన సాధుసమాగమాభిలాషయు వర్ణనాతీతమై యుండెను. బుద్ధదేవునియొక్క గుణముల నన్నిటిని గ్రహించుటకుఁగాను తాను క్రీస్తుశకమునకు నాలుగువందల సంవత్సరముల ముందు కపిలవస్తునగరమం దున్న ట్లనుకొని, బుద్ధుని సకలదివ్యగుణములను నాయన సకలకార్యములను మనస్సున నిల్పుకొని బుద్ధునితో నేకమైనట్లు భావించుచు నీ భావములో దినములవెంబడి మునిఁగియుండెడివాఁడు. అట్లే జనకుఁడు, రాముఁడు, నారదుఁడు, వాల్మీకి, యేసుక్రీస్తు, మహమ్మదు మున్నగు మహానుభావుల నాత్మవీథియందు సందర్శించి, వారి దివ్యగుణముల నాకర్షించుచు వారితో ప్రొద్దుపుచ్చుచుండెడివాఁడు. మఱియు నీయన యీ కాలమునఁ బ్రత్యేకముగ హిందూధర్మమందలి నానాతత్త్వములను సమన్వయించిన విధము మిక్కిలి యద్భుతము. ఆర్య ధర్మమందలి కాళి, విష్ణువు, సరస్వతి, పార్వతి, శివుఁడు, హరి,

లక్ష్మి మున్నగు శబ్దములకు సుందర మగు నర్థమును దెల్పెను. ఈ పదముల నన్నిటి నేకేశ్వరోపాసనలో నుపయోగింపఁదగిన మార్గమును ముఖ్యముగ సేవకనివేదనముయొక్క రెండుసంపుటములందు నతి విపులముగఁ దెల్పియుండె. లక్ష్మిశబ్ద మీశ్వరుని యనంతైశ్వర్యమును సూచించును. మనము సామాన్యముగ నైశ్వర్యగుణముల నన్నిటిని మృదుమధురసుందరభావమునఁ జూతుము గాన లక్ష్మిశబ్దమునకుఁ జెందు గుణములను స్త్రీభావములుగ భావించితిమి. శ్రావణ భాద్రపద మాసములందు పొలము లన్నియుఁ బచ్చనిరంగులఁ దేలుచున్నపుడు మనము కన్నులారఁ జూచి 'అహాహా' యని యానందింతుము; ఈ యానందదృశ్యమే భగవంతుని యైశ్వర్యము; ఇదియే లక్ష్మి. అట్లే సకలదైవభావములును వేర్వేఱు దేవతలయొక్క పేర్లు గాక యేకేశ్వరుని వివిధప్రకాశములు.

ఈయన యీప్రకారము సాధనచేయుచు, నూతననూతనభావముల కర్థము చెప్పుచు శుద్ధపక్షచంద్రునివలె నాత్మజీవనమందు దినదినప్రవర్ధమానుఁ డగుచుండెను గాని, తిన్నఁగ నాహారమును భుజింపకుండుటచేతను, బహువిధము లగు తీవ్రవ్రతములను బట్టుటచేతను, ప్రాణబంధువు లందఱును దూరులై రను దుఃఖముచేతను, నానాఁటికి చిక్కి శల్యమై, వ్యాధివశుఁడై, శరీరపటుత్వమందు బహుళపక్షచంద్రునివలె క్రమక్రమముగఁ గ్రుంగిపోవుచుండెను. ఈ కాలమున నీయనకు శ్రీ రామకృష్ణపరమహంసలవారలతిమిత్రులు. ఇరువురును మిక్కిలి తఱచుగఁ గలిసి ధర్మజీవనము విషయమై గంటలవెంబడి ముచ్చటించుచుండెడివారు. వీరి స్థానమునకు వారును వారి స్థానమునకు వీరును అప్పుడప్పుడు వెళ్లుచుండుటయు కలదు. శ్రీమన్మహర్షి దేవేంద్రనాథుఁడు కేశవచంద్రునితో వీడిపోయినను, ఆయనమీఁదఁ గల మమతచేత వ్యాధితో నున్న దినములలో నొకటి రెండు పర్యాయములు వచ్చి చూచి వెళ్లెను. కేశవచంద్రునకు బ్రహ్మానందుఁ డను సార్థకనామము నిచ్చినది మహర్షియే. శివనాథశాస్త్ర్యాదులకు కూడ, నెంత విడిగ నున్నను, కేశవచంద్రునిమీఁది భక్తిశ్రద్ధలును గురుభావమును పోలేదు; అందుచే వారును వచ్చి చూచి వెళ్లుచుండిరి. కాని క్రీ. శ. 1883-వ సంవత్సర మాఖరున వ్యాధి ముదిరి, బ్రహ్మానందుఁ డనేకదినములు తీవ్రబాధచేఁ దీసికొని తీసికొని చివరకు క్రీ. శ. 1884-వ సంవత్సరము జనవరి 8-వ తేదీని భార్యాపుత్రులను మాతృవర్గమును బంధుమిత్రాదులను భారతమాతను నపరిమితదుఃఖమందు ముంచివైచి దేహమును ద్యజియించెను.

శ్రీ కేశవచంద్రునియం దెన్ని లోపము లున్నను, నాతఁ డొక యసాధారణయుగపురుషుఁడు గాని సామాన్యుఁడు గాఁడు. మహదైశ్వర్యవంశమునందు జన్మించియు, నైహికజీవనమునం దత్యుచ్చపదవులఁ బొందఁగల్గియు, వాని నన్నిటిని దృణప్రాయముగ నెంచి దేశసేవయందు యావజ్జీవమును ధారవోసినది శ్రీ కేశవచంద్రుఁడు. వంగదేశపు యువజను లందఱు నమితాచారులై భ్రష్టజీవనమందు ప్రొద్దుపుచ్చుచున్నపుడు దాని నాఁపినది శ్రీ కేశవచంద్రుఁడు. భారతవర్షమునం దెక్కడఁ జూచినను విద్యార్థులు క్రైస్తవమతబోధకులయొక్క యాకర్షణములోఁ బడి స్వధర్మమును వదలి విజాతీయపద్ధతుల నవలంబించునపుడు దాని కడ్డముగ నిల్చుండి యా విజాతీయాచారప్రవాహమున కానకట్ట యైనది శ్రీ కేశవచంద్రుఁడు. బ్రహ్మసామాజికులు తమ కుమారికలకు హిందూధర్మశాస్త్రప్రకారము వివాహముచేయుటకిచ్ఛలేకుండియు తగిన న్యాయశాసనముయొక్క బలము లేక యట్లు చేయుటకు వెఱచుచున్నపుడు అట్టి న్యాయశాసనమును బుట్టించినది శ్రీ కేశవచంద్రుఁడు. బ్రాహ్మసమాజము కేవలము క్రైస్తవమతబోధయందలి సారమునే గ్రహించి హిందూధర్మముయొక్క గభీరతను బాగుగ గుర్తెఱుఁగలేకున్నపుడు తిరిగి యాదృష్టిని మరలించి యార్యధర్మముయొక్క గౌరవమును దెల్పినది శ్రీ కేశవచంద్రుఁడు. ఒక్కొక ధర్మము నవలంబించినవారును తమ మతపురుషులే భక్తు లని తలంచుచుండ, సకలమహాపురుషులను పుష్పమాలికగఁ జేసి వారి జీవితసారమును మన జీవనములం దంతర్గతముచేసికొను మార్గమును జూపినది శ్రీ కేశవచంద్రుఁడు. సకలధర్మవిధానములును పోరాడుచుండ, వానియందలి సద్గుణములను సమన్వయించి ధర్మములందలి క్రమవికసనమును జూపినది శ్రీ కేశవచంద్రుఁడు. తెల్ల నల్ల జాతులవా రొకరి నొకరసహ్యించుకొనుచుండ, నది యధార్మిక మని బోధించి యందఱకును సంధిచేసినది శ్రీ కేశవచంద్రుఁడు. ఆంగ్లేయభాషాసాహిత్యమందుఁ బ్రవీణుఁ డయ్యు నిరువదవ శతాబ్దమందు భక్తియోగమున మునుకలు వేయఁగలిగినది శ్రీ కేశవచంద్రుఁడు. ఆమిషాహారములోఁ బుట్టి పెరిఁగియు దానిని బాల్యమందే సంపూర్ణముగఁ ద్యజించి జీవనాంతము వఱకును శాకాహారి యైనది శ్రీ కేశవచంద్రుఁడు. వక్తలలో ననర్గళప్రవాహము గల మహావక్తయై యార్యావర్తమునకు వన్నె దెచ్చినది శ్రీ కేశవచంద్రుఁడు. ఈ కేశవచంద్రుని కీర్తిని సద్గుణపుంజమును బొగడ వేయినోళ్లయినను జాలవు. అట్టిచో నిరక్షరకుక్షి యైన నావంటివాఁ డేల నేర్చు?

కాని మహానుభావులయొక్క సద్గుణములను వెదకు టెంత యవసరమో వారి లోపములను కూడఁ జూచి జాగ్రత్తపడుట యంత యవసరము. కావున రాజకీయవిషయములందును నీశ్వరతత్త్వమందును సంఘసంస్కారమందును కేశవచంద్రుని యభిప్రాయములను కొంచెము విచారింతము. "రాజకీయవిషయములలో నేము జోక్యము కలుగఁజేసికొనము." అని కేశవచంద్రుఁడు నుడివెను. వాస్తవమున ఆయనకు రాజకీయశాస్త్రము విషయమై విశేషముగఁ దెలిసియున్నట్లు కానిపింపదు. తెలిసినవాఁడైన నంత యజ్ఞానముగఁ బల్కఁడు. ఏ దేశమువా రా దేశమును బాగుచేసికొనవలయును గాని యితరు లెంత దయతో చూచినను, విశేష ముపకారము కలుగనేరదు. ఇదిగాక కేశవచంద్రుఁడు మరియొక గొప్ప తప్పును జేసెను. ఈయన స్వదేశోద్ధారము మాట వదలివేసి సకలదేశముల నొక్కమాఱుగ నుద్ధరింపఁబూనెను. సకలదేశములును తమతమ తగవులను మాని యన్యోన్యానురాగముతో సోదరభావమున నుండుట యత్యంతావశ్యమే యైనను, అది

యొక్కమాఱుగ జరగునది కాదు. దీనికి ముందీ యన్నిదేశములును దమతమ సమస్యలను దెగఁగొట్టుకొని తమతమ జాతుల దిట్టపఱచుకొనవలయును. అన్ని దేశములకును స్వాతంత్ర్యము కల్గిన పిమ్మట ప్రపంచ మంతయు నేకసంయుక్తరాష్ట్రము కాఁగలదు గాని కొన్ని దేశములు దాస్యములో నుండి మఱికొన్ని దేశములు హాయి ననుభవించునపు డట్టి దెన్నఁడును సంభవింప వీలులేదు. కేశవచంద్రుఁ డిట్టి విషయములను విచారించి యుండలేదు. విచారించియుండిన రాజకీయవిషయముల నంత ననాదరముతోఁ ద్రోసివేసియుండఁడు.

ఇఁక కేశవచంద్రుని యీశ్వరతత్త్వమును గొంత విచారింతము. కేశవచంద్రున కీశ్వరుఁడు విధానకర్త; సకలమును విధించుచుండును; సకలమునకును బ్రభువు; సర్వమయుఁడు; సర్వాధారుఁడు. బ్రహ్మసందుని యీశ్వరతత్త్వము మొదట బైబిలునుండియే యుద్భవించినది. అందుచేతనే యీయన యీశ్వరుఁ డంతగఁ బ్రపంచాతీతుఁ డయ్యెను. మధ్యమజీవనమునుండి హిందూధర్మముయొక్క సృష్టితత్త్వమును గొంత గ్రహించినను మొదటినుండియు నాటుకొనిన క్రైస్తవధర్మముయొక్క యీశ్వరతత్త్వము చావలేదు. ఇక్కారణముచే నీయన యీశ్వరుఁ డెంత సర్వమయుఁడై సంసారమందలి సకలవిషయములందుఁ జొచ్చినను, చివరకా యీశ్వరుఁడు సన్ననైన పూచికపుల్లవలె నుండెను గాని, దృఢకాయుఁడై సర్వము నావరించుకొనఁగల్గలేదు. సర్వమును భగవత్ప్రకాశము లని కేశవచంద్రుఁ డెంత నుడివిన నీ "సర్వము"ను, "భగవంతు"నిని దుదివఱకును విడిగ నుంచెను గాని, రెంటి నైక్యము చేయు సాహస మీయనకు లేకుండెను. మఱియు నీయన భక్తి యద్భుతమైన దైనను నది యంతగ నక్కఱకు రాక సంసార మావల నుండెను గాని, ప్రాపంచికవ్యవహారములలోని కంతగఁ జొఱలేదు. చొచ్చియుండిన నీయన యంత త్యాగభావమును వహించి యుండెడివాఁడు గాఁడు.

ఈయన సంఘసంస్కారము నంతంతమాత్రముదే. సంస్కర్తలలోఁ బ్రధానుఁడైనను దానిని దుదివఱకును నెగ్గింప నీయనకు సాహసము లేకుండె; స్త్రీలను పరదాచాటునుండి నలుగురిలోనికిఁ బ్రవేశపెట్టుటలోఁ గొంతవఱ కంజవేసి యక్కడ నాఁగిపోయె. స్త్రీల నట్లు బలవంతముగ బైటికి నెట్టఁగూడ దనెను. ఈమాట కొంతవఱకు వాస్తవమే. అనేకవత్సరములనుండి జనానాయందుండిన స్త్రీలను నొక్కమాఱుగ నలుగురిలోనికిఁ బ్రవేశపెట్టుటలోఁ గొంత యాపద యుండవచ్చును; కాని యట్టి స్త్రీలవిషయముననే యమితప్రోత్సాహమును బ్రోద్బలమును నత్యంతావశ్యకములు. ఇట్టి కార్యమును మెల్లమెల్లనఁ జేయుద మనుకొనరాదు; అట్లయినను దెన్నాళ్లకును మెల్లగనె యుండును. రెండవ దీయన స్త్రీజాతి గృహకృత్యాదివిషయములకే తగు ననెను గాని, యంతకుపై దాఁటిపోలేకపోయెను. మఱియు నితరులు కొంచెము స్త్రీలతోఁ గలసిమెలసి తిరుగుచున్నపు డది యనర్థదాయక మని ఖండించెను గాని యందుండిన సాంఘికోన్నతిని గ్రహింపఁజాలకుండెను.

మహానుభావులం దనేకము లగు మహద్గుణము లున్నట్లే కొన్ని తీవ్రము లగు లోపములు నుండును. వారు మహానుభావు లగుటచేతనే వారి లోపములును స్పష్టముగఁ గాన్పించుచుండును. కాని యీ లోపములు వారికీర్తిని మలినముచేయక మఱింత ప్రకాశింపఁజేయును. కేశవచంద్రునియం దున్న లోపములను మనము మఱువ నవసరము లేదు. మఱచినందుచే కీడు కల్గును గాని మన మాయనకు వన్నెదేలేము. గొప్పగొప్ప పొరపాటు లాయనయం దున్నను, నీశ్వరతత్త్వము నాయన తిన్నగ గమనింపలేకున్నను, నాయన దేశమునకుఁ జేసిన సేవ యింతింతని చెప్ప నలవి కాదు. "నవవిధాన"మం దీయన మన కిచ్చిన నూతనసత్యములు మిగుల విలువగలవి. వీని నక్కాలమున ననేకులు గ్రహింపలేకున్నను, ముందుముందు భారతీయులు దాని సారమును గ్రహియించి కేశవచంద్రునిఁ జిరకాలము స్మరింతు రను మాట నిస్సంశయము. కేశవచంద్రున కింకను మన దేశమందు తగిన గౌరవము జరగలేదు. ఆయన మహత్త్వమును మన మింకను నెఱుఁగము. ఆయనను కేవలము బూటకుఁ డనుట యన్యాయము; ఆయనయం దెద్దియు గొప్పతనము లే దనుట యంతకంటె నన్యాయమైనది. భారతమాత తన పుత్రులలో నేరిని విడువఁజాలదు. తన పుత్రు లందఱు నామెకు సమానులే. కావున మదీయసోదరు లగు నాంధ్రులు కేశవచంద్రుని విషయమై బాగుగఁ జదివి, యాయన దేశమునకొనర్చిన మహోపకారమును గమనించి, యమ్మహానుభావుని జక్కగ నాదరించి, యాయన దివ్యజీవనము ననుసరింతురుగాత! తత్త్వశాస్త్రవిశారదు లగు నాంధ్రులు వంగదేశభక్తవరుని సన్మానముతోఁ బూజించి, యాయన ప్రగల్భభక్తి నందుకొందురుగాత !! ఇదియే యాంధ్రమాత కోర్కె !!!

The Buckingham Palace, Chittoor

బక్కింఘాం మందిరము, చిత్తూరు



Water works, Vizianagrum



జలాశయము, విజయనగరము

Sitarameswar Temple, Bobbili



శీతారామేశ్వరుని దేవాలయము, బొబ్బిలి



Ghatakachala Temple, Sholingur

ఘటకాచల దేవాలయము సరోవరము షోళింగపురము

Bojjanna Hill, Vizag



బొజ్జన్న కొండ విశాఖపట్టణము



View of Mt. Fuji, Japan

ఫ్యూజియామాపర్వతము, జపాను



View of Mt. Fuji, Japan

ఫ్యూజియామాపర్వతము జపాను

Blocks by Messrs. D. B. Neroy & Co.



Cowherd, Japan

పసులకాపరి, జపాను



The Elegant Park, Japan

శృంగారోద్యానము, జపాను

# అ బ లా వి లా ప ము

మంగిపూడి వేంకటశర్మగారు

స్త్రీల కున్నతవిద్య చెప్పింపవచ్చునా
  కూడదా యను చర్చతోడ నేల?
చెలువ లుద్యోగాలు చేయంగవచ్చునా
  కూడదా యను పాట పాడ నేల?
రమణులు బ్రహ్మచర్యము చేయవచ్చునా
  కూడదా యను వాద మాడ నేల?
[illegible] వివాహంబు లొప్పుకోవచ్చునా
  కూడదా యను పల్కు వాడ నేల?
రమలు దేహపరిశ్రమము చేయవచ్చునా
  కూడదా యను శంక కూడ నేల?
నిన్న మొన్నటి దాఁక నిన్నియును గలిగి
వన్నెఁ గన్నట్టి భారతవర్షమందు
నేఁటి కవి చేటు చేయంగ నేర్చినోటు?
ఏటి తాటోటు లివి? కీర్తిపేటులార!

సీ. ఉన్నతవిద్య స్త్రీ కొసఁగరా దన నేల?
  విద్యాధిదేవత వెలఁది యనఁగ;
ఉద్యోగములు స్త్రీల కొప్పవం చన నేల?
  రాజ్యంబు లేలిరి రమణు లనఁగ;
బ్రహ్మచర్యము స్త్రీకిఁ బనికిరా దన నేల?
  యోగినుల్ పదివేవు రుండి రనఁగ;
కలదె స్త్రీలకు వయఃకల్యాణ మన నేల?
  మున్ను స్వయంవర మ్మున్న దనఁగ;
వ్యాయామ మబలలఁ కష్టమా యన నేల?
  యరివర్గముల వేటలాడి రనఁగ;
కాలవశమున నవి నేఁడు కల్ల లాయె;
సచ్చరిత్ర వివేకంబు సమసిపోయె,
పెద్ద లరిగిన త్రోవలు వింత లాయె;
పలు మతము లాయె. సాంఘికబలము పోయె

సీ. బాలుర కట్టులో బాలల కట్టులే
  యున్నతవిద్యల నొసఁగరయ్య!
యువకుల కట్టులో యువతుల కట్టులే
  స్వేచ్ఛాప్రదానంబు సేయరయ్య!
విధురుల కట్టులో విధవల కట్టులే
  యుద్వాహములు సేయ నొప్పరయ్య!
మగవార లట్టులో మగువలు నట్టులే
  సమ లను మాట లోనరయఁగయ్య!

ఒక్కకంటను బెల్లంబు నొక్కకంట
సున్నమును బెట్టుకొనకుఁడో యన్నలార!
భగవదుద్దేశముల భంగపఱచి యతని
యాగ్రహముపాలు గాకుఁడో యార్యులార!

సీ. పట్టపరీక్షలో పలుఁ గృతార్థలఁ జేసి
  యున్నతోద్యోగంబు లొసఁగువారు
స్వమతధర్మములు విశ్వప్రపంచము నిండ
  వ్యాపింపఁజేయంగ నంపువారు
నిఖిలప్రజాప్రతినిధిమహాసభలకుఁ
  బ్రాతినిధ్యము లిచ్చి పంపువారు
పురుషులతో సరాసరిగ స్వాతంత్ర్యంబు
  లిచ్చి హెచ్చుగ గౌరవించువారు
నగుచుఁ బాశ్చాత్యు లుండంగ, నగుదు రన్న
తలఁ గొంకింతయు లేక నాథలకుఁ గేశ
ఖండనము చేయు టుచితంబో, కాదో? యనుచు
సభలు చేయుదురే? ద్విజస్వాములార!

సీ. కులకాంతతోఁ గూడి కులికెడు వానికి
  విధురుని చింత లేవిధిని దెలియు?
తులలేని సిరులతోఁ దులఁదూఁగు వానికి
  నిఱుపేద కష్ట మేకరణిఁ దెలియు?
స్వాతంత్ర్యభూతివిస్ఫీతుఁడౌ వానికి
  బానిస బెడద లేభాతిఁ దెలియు?
భూసురుఁడై పుట్టి మురిసెడు వానికి
  మాలని దోసఁగు లేమాడ్కిఁ దెలియు?
ప్రాణపతితోడ సుఖియించు భాగ్యవతికి
బాలవిధవల దుఃఖ మేభంగిఁ దెలియు?
నింగితజ్ఞాన మించుకంతేని లేక
నోరికొలఁదులు నుడువుచుండుదురు గాక.

సీ. గానశాస్త్రమున కంగనలే తగుదు రంచు
  మధురకంఠములె ముమ్మాఱు దెలుప,
వైద్యవిద్యకు గుణవతులె తగుదు రంచు
  సదయంబు హృదయంబు సారెఁ దెలుప,
బోధకత్వమునకు బోటులే సరి యంచు
  శాంతశీలమె సదా చాటి తెలుప,
లలితక…కి లలనలే మే లంచు
  సరిలేని …కౌశలము దెలుప,

మాకు గానంబుఁ గఱపక మాని రేమొ?
మాకు వైద్యంబు నేర్పక మాని రేమొ?
మాకు బోద్ధత మప్పక మాని రేమొ?
మాకుఁ గళలను జెప్పక మాని రేమొ?

సీ. తీర్థాలవెంబడిఁ దిరుగుచుండుట యొప్పు,
కులకాంత సభల కేగుటయె తప్పు;
నాటకంబులు చూడ నరుగుచుండుట యొప్పు,
కులకాంతసభల కేగుటయె తప్పు;
యాగంబులను జూడ నేగుచుండుట యొప్పు,
కులకాంత సభల కేగుటయె తప్పు;
దేవోత్సవముల కేతెంచుచుండుట యొప్పు,
కులకాంత సభల కేగుటయె తప్పు;
పెండ్లిపేరంటముల వేడ్క వేళ లనుచు
నిల్లునిల్లును దిరిగి యూరేగుచుంట
యొప్పు; సభలకు నేగుట యొకటె తప్పు;
ఆఁడుపుట్టువు పుట్టుటే యసలు తప్పు.

సీ. పెద చెత్తి పాత్రంబు చదువుచుండుట తప్పు
పాటలు పాడుట మేటితప్పు
కల మెత్తి వ్రాయంగ గమకించుటే తప్పు
చిత్తరుల్ వ్రాయుట చెడ్డ తప్పు
వ్యాయామశాస్త్రంబు నభ్యసించుట తప్పు
చేతిపనుల్ నేర్చు చేఁత తప్పు
నలుగురిలోపల నిలుచుటే బలు తప్పు
జరక తైలను జూడఁ జనుట తప్పు
అన్నియును దప్పులే గదా! యాఁడుదాని
కింక స్వాతంత్ర్య మెందున నిచ్చినారో?

సుదతులకు నింక నెక్కడ సుఖము గలదో?
న్యాయమతిఁ జూడరే! భారతీయులార!

సీ. ఎండవానలకుఁ దా నెంత చిందులుచున్న,
గొడుగు పట్టఁగరాదు పడఁతిమిన్న;
చలిబాధ కెంత భీతిలి వంతఁ గనుచున్న,
నంగీలు దొడుగరా దతివమిన్న;
కాళ్ల నెత్తురు లోడికలె రైనఁ, బాదర
క్షలు దాల్పఁగారాదు కన్నెమిన్న;
కంటి రోగములచే గాసిఁజెందినఁ, జల్వ
జోడు వెట్టఁగరాదు చేడెమిన్న;
స్త్రీల కివి యెల్ల లేకుండఁ జేసినారు,
పురుషులే బొడ్డుమణితోడఁ బుట్టినారో?
మేము పుట్టమొ? మాది నెమ్మేను గాదొ?
యరయఁగదరయ్య! యీ ధర్మ మార్యులార!

సీ. కడు బీద లగువారి కడుపునఁ బుట్టిన,
నమ్మ చుల్కనఁజేతు రదయు లగుచు;
ధనికు లిండ్లను బుట్టినను, గట్నముల నీయ
వలసివచ్చె నటంచు వగచుచుంద్రు;
విధివశంబున బాలవిధవరాలే యైన,
నత్తింటఁ బుట్టింట నత్తనీరు;
శక్తి గల్గినవాళ్లు చాకిరీ చేయించు
కొని, శక్తి యుడిగినఁ గొంచెపఱుతు;
రకట! యేగతిఁ జూచిన నాఁడుదాని
బ్రతు కధోగతియే గదా! భారతీయు
లార! మా దుర్దశలఁ గన్నులారఁ గనుచు
నెన్ని నాళ్లింక నిట్లుపేక్షింతురయ్య!

# శ్రీ కృష్ణదేవరాయలు

గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎమ్. ఏ.

కాలము పురుషున కధీనమా? పురుషుఁడు కాలమున కధీనుఁడా? ఈ రెండు ప్రశ్నలును ఎల్లప్పుడును మానవునకుఁ బ్రత్యక్షములగుచునే యున్నవి. చర్చలయం దెచ్చటను నిద మిత్థ మని నిర్ణయము తేలినట్లు కానరాదు. కాని మానవకోటిలోని ప్రతివ్యక్తియుఁ దన జీవితముచే నీ ప్రశ్నలలో నొక్కంటికిఁ గాకున్న నొక్కటికిఁ బ్రత్యుత్తర మిచ్చుచునే యున్నాఁడు. భూమిలోఁ బుట్టి పెరిఁగి తిని పూసి తొడిగి జీవయాత్రను ముగించి పోయినవా రెందఱో గలరు. అందు బీదసాదలే గాదు, "కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే? వా రేరీ? సిరి మూటగట్టికొని పోవంజాలిరే?... పేరైనంగలదే?" యను బలివాక్యమునకు లక్ష్యములుగాఁ గల సార్వభౌములుం గలరు. వీ రెల్లరును కాలప్రభావమును జాటువారు. బ్రతికియుండఁగ వీ రెంతటివారై యుండినను సరే, గతించిన పిదప వీరి ప్రశంస మెచ్చటను గలికమునకైనఁ గానరాదు. వీరి తరగతికిం జేరనివారు మహనీయులు, కాలమును లొంగఁదీసినవారు, లోకపరిణామమునకు కారణభూతులు, మృతజీవులు, సతత తేజోరూపులు, ఎల్లకాలములయందును ఎల్ల దేశములయందును జూపట్టి లోకాభివృద్ధికిఁ దోడ్పడి తమకుఁ దెలియకయె నూతనయుగముల సృజించి సంస్మరణీయులై యున్నారు. ఇట్టి మహామహులలో బహుజనులు కుటీరజన్ములనియే చెప్పనగు. కొందఱు మాత్రము ఘనకుటుంబీకులు. ఘనకుటుంబీకు లైనను, కుటీరజన్ము లయినను, వీరిపేరులు మనకు పరంపరాగతమయి వచ్చియుండినను, రాకున్నను, లోకమిత్రు లగుట వీరందఱును నాగరకలోకము భక్తిమై పూజించుచున్నది.



ఇట్టివారలలో నాంధ్రదేశమున నగ్రగణ్యుఁడు శ్రీకృష్ణదేవరాయఁడు. ఈతఁడె సర్వమతసహిష్ణుఁడై సర్వభాషాపోషకుఁడై సర్వజాతిసార్వభౌముఁడై స్వమతసాధనుఁడై స్వభాషావ్యాపకుఁడై స్వజాత్యుద్దీపకుఁడై యక్బరుశివాజీలకుఁ బిదప హైందవసామ్రాజ్యధురంధరుఁడైనవాఁడు. పదునాఱవ శతాబ్దంబున నీతఁడు నాటిన బీజంబె కాలక్రమమున నన్నిదశలం జెంది యిప్పుడిప్పుడు నన లెత్తి యాంధ్రదేశవికాసంబునకు హేతుభూతంబై యాంధ్రోద్యమమహావృక్షంబయి పరిణమింప నుంకించుచున్నది. కాన నీ మహనీయుఁ డాంధ్రదేశంబునకే గాక, భిన్నవ్యక్తిపరిణామంబు లోకపరిణామంబున మొకటివిభాగం బనియు, నట్టిభిన్నవ్యక్తిపరిణామం బుండినం గాని లోకపరిణామం బసాధ్యం బనియు, నెఱుంగు సర్వనాగరకజనంబులకును సమ్మాన్యుండె.

మహాస్రవంతుల మూలములయట్లు పలుమాఱు

మహాపురుషుల మూలములును నిగూఢము లందురు. శ్రీ కృష్ణదేవరాయల పూర్వికులను గుఱించి మనకు విశేషము లెవ్వియుం దెలియవు. ఈతని తండ్రి తాతల పేళ్లను వారి చరిత్ర గొంతయు మాత్ర మెఱుఁగుదుము. తన వ్రాసిన గ్రంథమం దైన నీతఁ డింతకంటె నెక్కుడు బయటఁ బెట్టినవాఁడు గాఁడు. శాసనవిమర్శ ఎప్పటికైనను నీ విషయమున కొద్దిగనైన తోడుకాక పోవునా యను నాశ పీడించుచుండెడిది గాని ఇప్పటికి దొరకిన కృష్ణదేవరాయలవియు తరువాతివారివియు ముందువారివియు నగు ననేకశాసనములను బట్టి వితర్కింప, నిం కేశాసన మెప్పుడు దొరకినను రాయలు తన యాముక్తమాల్యద యందుఁ జెప్పుకొనినయంతకంటె నెక్కుడు విశేషము లాతని పూర్వికులను గుఱించి వెలుఁగునకు రా వనుట తప్పని సిద్ధాంతము. వరాహపురాణము ననుసరించితిమేని వీరు తుళువ * దేశమందలివా రనుట స్పష్టము. కృష్ణదేవరాయల ముత్తాత కాలముననో అంతకుఁ గొంచెము మున్నో యా తుళువదేశమునుండి యీ వంశము వారు ఉద్యోగపరాయత్తచిత్తు లయి యాంధ్రదేశముఁ జొచ్చిన ట్లూహింపఁదగియున్నది. మొదట కర్ణాటులయ్యు నాంధ్రదేశము వచ్చి చేరి యాంధ్రరాజ్యమునఁ గ్రమక్రమముగ సుప్రసిద్ధులయి సర్వజనసమత్వ మింకను చాటుచుండిన వైష్ణవమతమునకు భక్తులై యాంధ్రులతో సంబంధములు కల్పించుకొని మొత్తముమీఁద వీరును నాంధ్రు లయి రనుటకుఁ గృష్ణదేవరాయండే సాక్షి. ఈతని తాతయె సాళువ నరసింగజనవిభుని ముఖ్యసేనానాయకుఁడై యుండెను. అతని కీర్తియె దిగంతంబై యుండె. అతని కుమారుఁడు నరసింహరాయలు తండ్రికంటె నెక్కుడువాఁడై విఖ్యాతివహించి సాళువ నరసింగని కుమారుఁడు ఇమ్మడి నరసింహరాయఁడు బలహీనుం డగుటను గాంచి యాతనిని నామమాత్రావశిష్టునిఁ జేసి రాజ్య మాక్రమించుకొని విజయనగరసామ్రాట్సంతతులలో మూఁడవ సంతతిని స్థాపించెను.

పిదప నీ తుళువ నరసింహరాయని పుత్రుఁడును కృష్ణరాయల యన్నయు నగు వీరనరసింహరాయలు రాజ్యము నేలి క్రీ. శ. 1509-వ సంవత్సరప్రాంతమున మృతి నొందెను. అతనిపిదప శ్రీ కృష్ణదేవరాయలు విద్యానగర సామ్రాజ్యసింహాసనం బలంకరించెను. ఈతనికిఁ బట్టాభిషేకము శక సం. 1431 మాఘ శు. 14 ని జరగెను. అప్పటి కీతఁడు ఇరువదియైదు సంవత్సరములవాఁడుగ నుండె నని చెప్పనగు. † అంతకుమున్నే యీతండు మహావీరుండై నెగడియుండె. నరసింహరాయలు రాజ్యసంపాదన చేయునప్పటి కాతఁ డొక్కఁడె బలవంతుఁడు గాఁడు. సాళువల సామంతులును దండనాయకులును నెందఱో మహాపరాక్రమవంతు లుండిరి. అట్టివారు నెగడుట కాదిమకారణము యాదవసార్వభౌముల (అనఁగా మొదటివంశమువారి) దౌర్బల్యమే. ముప్పది సంవత్సరములలోపల రెండు వంశములు మాఱవలయు ననిన, కాలమెట్టిదిగ నుండునో సులభముగ నూహింపనగును. అట్లగుట తుళువ నరసింహరాయలు మృతినొందినతోడనె అక్కడక్కడ పెక్కురు బలవంతులు తిరుగఁబాటొనర్చిరి. ఆ తిరుగఁబాటుల నణఁప శ్రీ. కృష్ణదేవరాయలును అచ్యుతదేవరాయలును వీరనృసింహుని కాలమునఁ జని జయించిరి. ఇంత చేసియు కృష్ణదేవరాయలు సింహాసనమునకు వచ్చునప్పటికి మరల దిగ్విజయమునకై వెడలవలసినవాఁ డయ్యెను. అయిన నతఁ డేమాత్రమును తొందరపడినవాఁడు గాఁడు. ఇతఁడు రాజ్యారూఢుఁ డయినవెంటనే పోర్చుగీసువారు కళ్లికోటను బట్టుకొనఁ దమకు సాయమొనర్పవలసిన దనియుఁ దా మాతనికి మహమ్మదీయులతోఁ గల పోరాటములో బలముగఁ దోడగుదు మనియు వార్త పంపిరి. దాని కీతఁడు ప్రత్యుత్తరమే యీయఁడయ్యెను. కాలపరిపాకమును గని పెట్టుట గదా రాజనీతి.

---

* కృష్ణదేవరాయల కాలమునఁ గూడ తుళువరాజ్య మొకటుండె ననుట అతని శాసనములవలనని తెలియుచున్నది.

† ఇది న్యూనిజని వృత్తాంతము ననుసరించి. రాయుల జన్మదినమును గుఱించిన చాటు వొకటి కలదు. దానికిఁ బాఠాంతర మొండు కల్పింపఁబడినది. పద్యము పాఠాంతరము రెండును నిరుపయోగములు. ఇం కెవరో యొకరు కృష్ణరాయలు ౧౪౮౭ లోఁ బుట్టె నని చెప్పినట్లు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసిరి. ఆ వ్రాఁత నాధారము చేసికొని కృష్ణశాస్త్రిగారు న్యూనిజు వృత్తాంతమున కిది సరిపోవుచున్న దనుచున్నారు. మొదటివా రెవరో వారి కాధార మేమియు తెలియనందునఁ బ్రస్తుతము న్యూని పొక్కుండే యూహించ మనుచున్నాము.

విజయనగరసామ్రాజ్యమునకు శత్రుపదము నంది
యుండినవారు బహమని నవాబులును వడ్డెరాజులును.
అందు ముఖ్యముగ సంఘట్టన సంభవించినది బీజాపురపు
నవాబుతోడను ప్రతాపరుద్రునితోడను. వీరలను దరి
యుటకుఁ బూర్వమె కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు శివ
సముద్రములను లోఁబఱచుకొనవలసినవాఁ డయ్యెను.
అక్కడి ప్రభువుల నంకితుల నొనర్చికొని దక్షిణదేశం
బెల్ల లోఁబఱచుకొని యాతఁడు ఉదయగిరిని ముట్ట
డించెను. 18 మాసములు ముట్టడినైచి సాధించి క్రీ. శ.
1514లో విజయనగరమునకు మరలివచ్చి చేరెను. కాని
గజపతి కొండవీటిదుర్గమున బలము చేర్చికొనుచుంట
వెన్వెంటన ఆ దుర్గమును బట్టనుంకించువాఁ డయ్యెను. ఆ
దండయాత్రకుఁ బోవుచు నొక్కపెట్టున కృష్ణదేవ
రాయలు అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జున
కొండ, తంగేడు, కతివరము మున్నగువాని నెల్ల స్వాధీన
పఱచుకొనెను. కొండవీడుదుర్గము లోఁబడినప్పు డ
చ్చట ప్రతాపరుద్రుని పుత్రుఁడును బ్రతినిధియు నగు వీర
భద్రరాయఁడు మున్నగు ఒడ్డె రాజులును మల్లాఖాను
ఉద్దండఖాను లను రాచూరి మహమ్మదీయులును పట్టు
వడిరి. వీరభద్రుని రాయలు అవమానపఱచినట్లును న
తఁడు తనచేతన పొడిచికొని చచ్చినట్లును గొంద అభిప్రా
యపడియున్నారు. కాని కొన్ని నిదర్శనములవలన వీర
భద్రున కిట్టిగతి సంభవింప లే దనియు నతఁడు మాళిగ
బెన్నూరు సీమకుఁ దరువాతికాలమున శ్రీ కృష్ణదేవ
రాయల ప్రతినిధియై యుండినట్లును గానవచ్చుచున్నది.
కొండవీటిదుర్గమున దొరకినవారలలో నిద్దఱు రాయ
చూరు మహమ్మదీయముఖ్యు లున్నందున ఒడ్డెరాజున
కును బీజాపురాధీశ్వరునకును సంధి కుదిరియుండె నని
యూహింపవలసియున్నది. అట్లగుట కష్ణదేవరాయలు
పట్టువడినవారిని చెఱయం దుంపించి కొంత కష్టపెట్టి
యుండిన నుండవచ్చును గాని ఆత్మహత్య చేసికొనునంత
వఱకు వీరభద్రు నవమానపఱచె ననుట నమ్మఁదగినది
గా దని నా విజ్ఞప్తి.

కొండవీడును సాధించి, కృష్ణుని వెంట సత్యభామఁ
బోలె, యుద్ధములలోఁ దన వెంట నడచుచుండిన చిన్నా
దేవి తిరుముల దేవులతో రాయలు బెజవాడ, ధారణి
కోట, అమరావతి మున్నగు స్థలములందలి శివాలయవి
ష్ణ్వాలయములను దర్శించి యనేకదానములను చేసి
శాసనముల వేయించెను.

ఈలోపుగఁ బ్రతాపరుద్రుఁ డూరకుండినవాఁడు
గాఁడు. కొండపల్లిదుర్గమున నిండు సేనలఁ జేర్చుచుండెను.
ఆ వార్తను విని రాయలు మూఁడవదండయాత్రకు
కళింగముమీఁదికి బయలుదేరి కొండపల్లిని లోఁబఱచు
కొనెను. అందు పట్టువడినవారలలో ముఖ్యులు ప్రతాప
రుద్రుని భార్యయు, పుత్రుఁడును, ఏఁడ్గురు సేనానులును,
బిజలీఖాన్ అను యవనముఖ్యుఁడును. ఈ కడపటివాఁడు
గోల్కొండ ప్రతినిధి యేమొ? కొండపల్లితో విడిచి
పెట్టిన ప్రతాపరుద్రుఁడు మరల మరల యవనుల ప్రేరే
పణచేఁ దొందరపెట్టుచుండు నని కాఁబోలు కృష్ణరా
యలు అనంతగిరి, ఉండ్రుగొండ, ఉర్లగొండ, అరువపల్లి,
జల్లిపల్లి, కందికొండ, నలగొండ, ఖమ్మమ్మెట్టు, కనకగిరి
మొదలగు ప్రాంతము లాక్రమించికొనెను. ఇంతటితో
పొట్టునూరికడ జయస్తంభము వేయించి రాజమహేంద్ర
వరమార్గమున రాయలు తిరిగి వచ్చె నని న్యూనిజు
యొక్కయు శాసనములయొక్కయు ధోరణివలనఁ గాన
వచ్చుచున్నది. కాని న్యూనిజు మఱల "కట్వరు" అను
తూర్పుతీరమందలి సీమమీఁదికి రాయలు దండెత్తె నని
యు ఒరిస్సారాజు బిడ్డను వివాహమున స్వీకరించి సంధి
కియ్యకొనె ననియుఁ జెప్పుటను బట్టియు, ఆంధ్రవాఙ్మయ
పు సాక్ష్యమును బట్టియు, శ్రీ కృష్ణదేవరాయలు ఈ విధ
ముగా నాగిపోక ప్రతాపరుద్రుని వెన్నంటి కటకపురము
వఱకును దఱిమి కటకపురిని ముట్టడించి దయదలంచి
సంధి కియ్యకొని కటకేశ్వరుని పుత్రిని వివాహమునఁ
గొని కృష్ణ కుత్తరభాగమునఁ దాను జయించిన దేశ
మును ప్రతాపరుద్రునకు మరల నిచ్చి బహుశః వీరభ
ద్రుని మాళిగ బెన్నూరు సీమకుఁ బ్రతినిధిగ పంపుటను
ప్రసాదించి మరలి వచ్చుచు పొట్టునూరివద్ద జయస్తంభ
మును నిలిపి రాజమహేంద్రవరమార్గమున విజయనగర

మునకు వచ్చి చేరె ననిన సక్రమముగ నుండును.

రాయలు ప్రతాపరుద్రుని సంపూర్ణముగ నోడించి లోంగఁదీసి రమారమి మూఁడుసంవత్సరముల కాలము శాంతిమైఁ గడపి చోళమండలమందుఁ గల వైష్ణవ, శైవ, జైన, బుద్ధ దేవాలయము లనేకములకు మహోదారభావమున మాన్యముల దానమొనర్చి రైతుల యుపయోగార్థము చెఱువులు, కాలువలు మున్నగునవి త్రవ్వించి రాజ్యవ్యవస్థను దిద్ది దేశము నంతటను సరియైన పాలకులను నియమించి వారి మూలమున సైన్యముల నద్భుతభంగి చేర్చికొని యవనులపై దాడివెడల సిద్ధమగుచుండెను. ప్రతాపరుద్రునకు సాయముచేసి యలయుటచేతను రాయల రాజనీతి ప్రభావముచే దమలోఁ దాము పోట్లాడుకొనుచుండుటచేతను యవనులు కొంతకుఁ గొంత బలము గోలుపోయియుండిరి. ఇట్లుండ 1520వ సంవత్సర ప్రాంతమున రాయచూరు ముట్టడికి రాయలు ప్రయత్నములు చేయసాగెను. మహాసైన్యమును గొని కంపనాయక, తిమ్మప్పనాయక, ఆదెప్పనాయక ముఖ్యులు దండనాయకులుగ నాతఁడు రాయచూరున కున్ముఖుఁడయ్యె. రాయచూరుకడ నాతని సైన్యములకును ఆదిల్శాహ సైన్యములకును ఘోరసంకుల మయ్యె. యుద్ధమున రాయలకె విజయము కలిగె. ఆదిల్శాహ రాయచూరు దుర్గమునకు సాయముచేయ నేతెంచినవాఁడు పరాజితుఁ డగుటయు, నా దుర్గమునందలివారు మహాసాహసమునఁ బోరిరి. ఫలము లేదయ్యె. దుర్గము రాయలకు చేఁజిక్కెను. అంతటితో శ్రీ కృష్ణదేవరాయల రాజ్యమునకు శాంతి చేకూర, 1520 మొదలు 1529 వఱకు నాతఁడు రామరాజ్యంబుగ రాజ్య మేలెను. ఆ నంవత్సరమున మరల నాదిల్శాహపై దండు వెడల వలసినవాఁడై కుల్బర్గను సాధించి యిదివఱకు రాజ్యపదచ్యుతుఁడై యుండినవాని నొకనిని సింహాసనారూఢునిఁ జేసెను. ఆదిల్శాహ బెళగామునకుఁ బారిపోయె. ఆ పట్టణమును సాధించువఱకును గృష్ణరాయ లీ లోకమున నుండఁడయ్యెను.

ఇట్టి తేజశ్శాలియు పరాక్రమవంతుఁడును నగు కృష్ణరాయల దిగ్విజయమును దిక్ప్రదర్శనముగ వర్ణించితిమి. వ్రాయఁబూనిన వందపుటల సంపుటమైనను జాలదు. ఆతని గుణముల వేలువేల నుగ్గడింపఁబూనిన నట్లయగు. ఆతని ధైర్యపటిమకు రాయచూరుదుర్గయుద్ధమున నొంటిమై పడి పోరొనర్చుటయ సాక్షి. ఆతని రాజనీతికౌశలమునకు పోర్చుగీసువారి మొదటిసాహాయ్యమును గొనకుండుటయు, మహమ్మదీయులలో నంతఃకలహములు ప్రేరేచుటయు, పోర్చుగీసువారితో మెలఁకువమై వ్యాపారము పెంచి వారిచే గౌరవ మంది వారిని వశవర్తనులుగఁ జేసికొనుటయుఁ దార్కాణములు. ఆతని సర్వమతసహిష్ణుతకును మహదౌదార్యమునకును చోళమండలమందలి దేవాలయములె వాయింపకయె వాగుబూరగొమ్ములు. ఆతని శీలమునకుఁ బ్రతాపరుద్రుని భార్యయె యోగ్యతాపత్రము.

పై వ్రాసిన దిగ్విజయచరిత్రంబును నీదృశగుణవర్ణనంబును నొక్కొక్కటియ శ్రీ కృష్ణదేవరాయల మహత్త్వమును బ్రకటింపఁజాలియున్నవి. కాని యీ దిగ్విజయంబులకంటె నెక్కుడగు మఱియొక దిగ్విజయంబును, ఈ గుణంబులకంటె మిన్నయగు మఱియొక గుణంబును, ఆతనియం దుండుటంజేసి యాతఁ డందఱకు, అందు ముఖ్యముగ నాంధ్రులకు, సంస్మరణీయుఁడయినాఁడు.

యోధులు, సద్గుణులు, సత్పార్వభౌములు పూజనీయులే. కాని వీరికి మన మర్పించు పూజ ఆశ్చర్యజన్యమో, గౌరవజన్యమో యగుచున్నది. అనురాగజన్యమగు పూజకు వీరు పాత్రులు గారు. తలిదండ్రులు మనకుఁ బుట్టువు నిచ్చుటచేతను, గురువు విద్యాభ్యాసమునకుఁ దోడ్పడి జ్ఞాన మంకురింపఁజేసి పునర్జన్మము నాపాదించుటంజేసియు, వారును నీతఁడును ననురాగపూర్వకపూజకు నిదానము లగుచున్నారు. ఇట్టి పూజ ననుభవించువారు మఱి లాతివారును గొంద ఱున్నారు. వారు గురుపదతుల్యులు. ఎవ్వఁడు మన జ్ఞానాభివృద్ధికిఁ దన మహాశక్తిమైఁ దోడగుచున్నాఁడో, యెవ్వఁడు మన యొక్కయో మనము అంగముగాఁ గల సంఘశరీరము

యొక్కయో పునరుజ్జీవమునకు నాధారభూతుఁ డగు చున్నాఁడో, అట్టివానిని ఈవిధంపుఁ బూజల సన్మానించుట సాజమె. కాన నీ తరగతిం జేరువారు మహాకవులు, విద్యాపోషకులు, దేశభక్తులు. కావ్యముల నుత్తమపదవికిఁ గయ్యాలాడు ఆముక్తమాల్యదను వ్రాసి పేరొందిన మహాకవి; అల్లసాని పెద్దన, నంది తిమ్మన, పింగళి సూరన, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ్యగారి మల్లన, తాళ్ళపాక చిన్నన, తెనాలి రామలింగకవివర్యుఁడు నను నష్టదిగ్గజముల పోషించిన మహాదాత; "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని యాంధ్రవాఙ్మయమునకుఁ బ్రాధాన్య మిచ్చి యాంధ్ర సంతతి కైక్యముఁ గల్గింప మొదలిడిన మహాదేశభక్తుఁడు; ఇట్టి యీకృష్ణదేవరాయం డెంతటి పూజ కర్హుఁడు గాఁడు? ఏ దిగ్విజయమును గైకొనలేఁడు? ఆతని పవిత్రచరిత్రకు నాంధ్రవాఙ్మయ మసదృశప్రకటనపేటికయై చెలంగ, నాతని నామచిహ్నితపతాకంబునీడన నాంధ్రజాతి పెంపొంది విజృంభించి యశం బందుఁగాత!

## ii

### వారణాసి వేంకటనరసింహశాస్త్రిగారు

అక్కటికంబు మాని జన మంతయుఁ గొత్తల నందఁజేసి దూ
 టక్కిన దుష్టభూపతుల నెందఱనో వధియించి శౌర్య మిం
పెక్క సమస్తదేశముల కేలికయై మన తెల్గుబాస న
ల్దిక్కుల నించెఁ; గృష్ణజగతీపతి కన్యులు సాటి వత్తురే? ౧

సీ. పాలించినాఁడు భూపాలకుల్ దనపాద
 పీఠంబునం దల ల్వెట్టి మ్రొక్క;
లాలించినాఁ డాంధ్రలలనాలలామ కం
 గము సుఖసార్వభౌమ్యమును బొంద;
కావించినాఁ డాంధ్రకవితామతల్లికి
 భూషణంబులు మేను పొంగునట్లు;
సాధించినాఁడు దుస్సాధ్యశాత్రవదుర్గ
 వర్గంబులను భుజాబలము మెఱయ;
చేసినాఁ డన్యనృపులకుఁ జేయరాని
చేఁత లెన్నియొ తాను గష్టించి మనదు
తెలుఁగుదేశంబుకొఱకు రాత్రింబవళ్లు;
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయనృపతి? ౨

సీ. దేశాపకారకుల్ దెగుదాఁక దూసిన
 విచ్చుకత్తిని నొరఁ బెట్టలేదు;
విద్యాభివృద్ధి ప్రాపించునంతటిదాఁక
 పట్టిన పటును వదలలేదు;
స్వీయదేశము సుఖస్థితి నొందునందాఁక
 నన్నంబు నీరుఁ దా నంటలేదు;
అర్థులు సంతృప్తి యనుదాఁక నీగికై
 చాఁచిన చేయి వెన్జాఁచలేదు;
బళిర దేశాగ్ర వీరకీలిఁ బరమభక్తిఁ
బాటుపడి కీర్తి నార్జించు మేటి కృష్ణ
ధరణినాథుండు తక్క నొక్కరుఁడు నరుఁడు
పుడమిఁ గలఁ డంచు నెవఁడు వే ల్మడువఁగలఁడు? 3

సీ. తగ మూరురాయల మగఁడంచు నేరాజు
 నుతిఁ జెందె విక్రమోద్ధతి చెలంగ?
పెద్దనాదికవీంద్రబృందంబు నేరాజు
 పోషించెఁ గవనాభిలాష మెఱయ?
ఆంధ్రభోజాభిఖ్య నలరారె నేరాజు
 విద్యాభిమానంబు వెలువడంగ?
ఆముక్తమాల్యదాఖ్యగ్రంథ మేరాజు
 రచియించెఁ బాండిత్యరసము తెలియ?
సాటివారలతో నాంధ్రజనులు కూడ
వన్నెవాసియుఁ గల్గినవా రటంచుఁ
జెప్పుకొనఁజేసె నేరాజసింహుఁ? డతని
మఱవశక్యంబె శ్రీకృష్ణమనుజవిభుని? ౪

# భాష, భావము, సంగీతము

కోపల్లి హనుమంతరావుపంతులుగారు, ఎమ్. ఏ., బి.ఎల్.

ప్రతిభాషయందలి వాఙ్మయమును సాహిత్యము, శాస్త్రము అను రెండు శీర్షికల క్రింద నిమిడి యుండును. భావప్రధానమై, రసభరితమై, వివిధాలంకారశోభితమై, హృదయరంజక మగునది సాహిత్యము. అభిప్రాయప్రధానమై, తత్త్వనిరూపణోద్దేశమై మనస్సునకు ధర్మనిశ్చయముం జేయునది శాస్త్రము.

సాహిత్యము, శాస్త్రము— ఈ రెంటికిని తగిన భాష ఆవశ్యకము. కాని శాస్త్రసందర్భమునందు భాష అభిప్రాయమునకు వాహన మని చెప్పనగును. ఇందు అభిప్రాయము వెల్లడియగుటయే ముఖ్యవిషయము. స్పష్టత, కఱుకుతనము, నిర్మలత్వము శాస్త్రశైలియందు మిగుల ప్రశంసనీయములు. ధర్మశాస్త్రములు, ప్రకృతిశాస్త్రములు, తర్కమీమాంసశాస్త్రములు మొదలగు సర్వశాస్త్రములును మనుష్యుల మేధాశక్తిని సమాధానపఱిచి నిశ్చయము కుదుర్చునంతవఱకును ఈశీర్షికయందుఁ జేర్పవచ్చును.

సాహిత్యమునందు భాషాప్రయోజన మింతకన్న చాల నెక్కుడు. భాష సాహిత్యమున కొక అలంకారము నిచ్చు వలువ యనినఁ జాలదు. కళాసౌందర్యమునకు శరీరస్థాపన మెట్లో అట్లే సాహిత్యమునకు భాషయు సుందరస్వరూపమువంటిది. భావము ప్రాణము. భాష విగ్రహము. ఈ రెంటి సమ్మేళనమువలన సర్వజనమనోమోహన మగు లావణ్య మావిర్భవించుచున్నది. ఇట్టి కవిసృష్టలావణ్యమునందు అంగసౌష్ఠవము నెంచి, కళావిభ్రమములను వేర్వేఱ దీసి, గుణసంపదను గుర్తించి, భావనిరూపణమును జేయునది సాహిత్యవిమర్శనము.

క. తనువగు శబ్దార్థంబులు,
 ధ్వని జీవ, మలంక్రియావితానము సొమ్ముల్,
 తనరు గుణంబులు గుణములు,
 ఘనవృత్తులు వృత్తు లార! కావ్యేందిరకున్.

అను సాహిత్యలక్ష్మీవర్ణనమందు లోపము వెదకరాదు గాని, భావమునకును భాషకును చాలినంత భేదగుణనిరూపణమును జేసినట్లు కనఁబడదు. కొంతవఱకును కావ్యప్రకృతియందు వెనుక మన మెన్నినట్లు భావభాషల కత్యంతమైత్రి నిజ మని మన మొప్పుకొనవలయును గాని, భావసౌభాగ్యమును, భాషాసంపదయును వేర్వేఱని యెంచనియెడల, సత్కవిత్వము వర్ధిల్లనేరదు. ఇమ్లించుచు రెంటికిని తగు పొందికతో సమాశ్రయము చేయుటయే మహాకవుల నేర్పరితనము. ధ్వనిమాధుర్యమునుండి సహాయముఁ గోరక, చిత్రాలంకారనైపుణ్యముఁ జూపకుండియు, భావసారస్యమువలననే రస ముప్పతిలంజేయు శక్తి మహాకవుల కుండవచ్చును గాని, జనహృదయమునంటినతోడనే కరఁగించు సామర్థ్యమీ కవిత్వములో నంతగ నుండదు; కనుక ఇది యొక లోపముగ నెంచక తప్పదు. ఇట్లే పదలాలిత్యమును, చిత్రరచనాకౌశలమును ఎంత యుండినను అర్థగౌరవము లేని కవిత్వ మెన్నటికిని రాణింపనేరదు. ఈ న్యాయము ఆధునికాంధ్రకవులయం దుదాహరణీయము. ప్రబంధములను పేర బయలువెడలిన లెక్కలేని నూతనగ్రంథములు శబ్దప్రపంచమునందలి మాధుర్యము నంతను కొల్లవెట్టిన వనుటకు సందియము లేదు. ఏ దేశసాహిత్యమునందును కేవలసంగీతమునందుఁ గాక శబ్దజాలమునందే శ్రావ్యగుణమును, కర్ణేంద్రియము నిట్లు కరఁగించు శక్తియు అనూహ్యములు. భాషాప్రభుత్వ మింత చేత నుండియు, హృదయరంజకము గాని కవిత్వముఁ జూచిన భావగౌరవముయొక్క విలువ యెంతయో తేటపడవచ్చును. ఈ విషయ మింకించుక సవిస్తరముగా విచారించెదము.

పదముల పొందిక యన నేమి? ఇందు విశేష మేమి? కవిత్వమందలి శబ్దలాలిత్యమునకును సంగీతమునందలి శ్రావ్యగుణమునకును సంబంధ మేమి? భేద మేమి? ఈ ప్రశ్నలకు తగిన యుత్తరముల ప్రయత్నించెదము. శబ్ద మన రెండు విషయములిం దిమిడియున్నవి. ఒకటి ధ్వని. ఇట్టి ధ్వనికి జనసంకేతముగా వచ్చిన యర్థము రెండవది. శబ్దములు ఒండొంటితోఁ జేరుటవలన ధ్వనితరంగ మగును. ఇట్టి చేరికవలననే వేర్వేఱు భావకళిక లన్నియుఁ గలసి పూర్ణభావస్వరూప మేర్పడును. సరసధ్వనిమైత్రివలన శ్రావ్యరవ ముత్పన్న మగుచున్నది. అర్థము పొందికవలన రస ముప్పతిల్లును. ధ్వనిమైత్రివలన వచ్చు శ్రావ్యరవమునకును, అర్థము పొందికవలన వచ్చు రసోత్పత్తికిని, సత్కవిత్వమందాక విశేషసంబంధమున్నది.

శబ్దమునకు జనసంకేతార్థము గాక ధ్వనివలన స్ఫురించు సారస్యము కొంత యున్నది. ఇట్టిది కవిత్వమునందువలె శబ్దజాలములు చేరిన ప్రతిసంధర్భమునను ధ్వని

## చెన్నపురి గవర్నరులు

**Major General William Medows**



మేజరు జనరలు విలియంమెడోస్

**Lord Clive**



క్లయివు ప్రభువు

**Lord William Bentinck**



విలియం బెంట్నికు ప్రభువు

**Sir George Barlow**



సర్ జార్జిబార్లో

**Sir Thomas Munro**



సర్ థామస్‌మన్రో

**Lady Munro**



లేడి మన్రో

Marquis of Tweeddale



ట్వీడేలు ప్రభువు

Lord Harris



హారిసు ప్రభువు

Lord Napier



నేపియర్ ప్రభువు

Lord Wenlock



వెన్లాక్ ప్రభువు

Sir Arthur Havelock



సర్ ఆర్థర్ హేవ్లాకు

Lord Ampthill



ఏంప్తిలు ప్రభువు

Photos by R. Venkiah Bros. Blocks by the Madras Photo type Co.

Sir Arthur Lawley



సర్ ఆర్థర్ లాలి

Lord Carmichael



కార్మికెయిలు ప్రభువు

Lord Pentland



పెంట్లండు ప్రభువు

Lord Cornwallis



కార్నవాలిస్ ప్రభువు

Marquis of Wellesley



వెల్లెస్లీ ప్రభువు

Lord Kitchener



కిచెనర్ ప్రభువు

Members of the Madras Legeslative Council



చెన్నపురి శాసననిర్మాణ సభాసభ్యులు

Blocks by the Madras Photo type Co.

ప్రవాహమునందు తేటపడును. సంకేతార్థమునకును, ధ్వనిసారస్యమునకును కుదురు మైత్రియే సత్కవనమునందలి యొక ముఖ్యలక్షణముగ పరిగణింపఁబడుచున్నది. రౌద్రరసవర్ణనమందు ధైర్యవిక్రమములను, కోపోద్రేకమును తెల్లమగునట్లు పరుషాక్షరములును సంయుక్తధ్వనులును గల పదజాలము లుపయోగపడుటయు, భక్తి కరుణ మోహము మొదలగు సౌమ్యభావముల వర్ణనములయందు సరళధ్వను లెక్కుడుగ నుపయోగపడుటయు, ఎల్లరకును దెలిసిన విషయమే. చక్కని కవిత్వశైలిని పరీక్షించిన కొలఁదిని, అప్రయత్నముగనో యనునట్లు సందర్భించు ధ్వనిభావమైత్రి రసవంత మగు పట్టులనెల్ల అనేకముగ వెల్లడి యగుచుండును. ఇట్టి ధ్వనిభావమైత్రివలన నుద్భవిల్లు హాయియు ఆహ్లాదమును చవిఁజూచువార లెఱుఁగనలయునే గాని చెప్పి తెలుపుట దుర్లభము. అందులో ఆంధ్రకవిత్వమునందలి ధ్వనిమాధుర్యమును భాషాసంతతివారు దక్కఁ బరు లెన్నఁడైన దెలిసికొనఁగల్గుదురా యనునది గొప్ప సంశయము. అచ్చ తెనుఁగునందలి సౌమ్యము కొంత, గీర్వాణమందలి గాంభీర్యము కొంత, అన్యభాషాపదములను వశీకరణముఁజేసికొను ధారాళత్వ మొక కొంత, అంతయుఁ జేరి సకలకళావిభ్రమమును, సర్వరసస్ఫూర్తియు ధ్వనివితానమున ప్రసరింపఁజేయఁజాలు ఆంధ్రశబ్దజాలములను బోలినవి, ప్రకృతిప్రపంచమునందలి చిత్రస్వరమాధుర్యము దక్క, మానుషకల్పిత మేదియుఁ గానరాదు. ఇంత శ్రావ్యము గావుననే యిటీవలి యాంధ్రకవు లందఱును ధ్వనిమాధుర్యమోహమున మునిఁగి తీయని పదముల నోలలాడుచు, అర్థగౌరవ మన నేమియో మఱచి తమ నేర్పరితనములో సంప్రీతులై యున్న ట్లూరకున్నారు. ఇదియు నొక గొప్పవిపత్తే. సాహిత్యమందలి ధ్వనిమాధుర్యము పదార్థము నాశ్రయించి యుండునది. అర్థమును విడనాడిన మాధుర్య మెంతకును కొఱగాదు. వ్యర్థపదముల యల్లికలో నిజమైన సారస్యమే లేదు. అది యొక విధమైన చాతుర్యము. గణనిర్ణయము కొలగాని పని; వేఱు కాదు. భావమును వ్యక్తీకరించు పదములు సజీవరేణువులు. ఇవి కవిత్వసరళిని జేరినపుడు ప్రాణసహితలావణ్యము బయల్పడును. అట్టి లావణ్యమునకు ధ్వనిమాధుర్య మొక క్రొత్తకళ.

ఇది చాల ముఖ్యవిషయము. సంగీతమునందలి ధ్వనిమాధుర్యముతోడ పోల్చి చూచిన, కొన్ని క్రొత్త విషయములు తెలియఁగలవు. సంగీతమునందు ధ్వనియే ప్రధానము. మధురమైన స్వరమునుండియే రస ముప్పతిలును. ఇది ప్రకృతిప్రపంచలక్షణము. ప్రకృతియందు రూపలావణ్య మున్నటులే ధ్వనిమాధుర్యమును నున్నది. రసోత్పత్తికి రెండును సమమే. ఈ ధర్మమును బట్టియే పిపీలికాదిసర్వజంతువులును గానమాధుర్యమునకు లోనగుట లోకప్రసిద్ధము.

మానవులలో సంగీతమునకును, వాగ్జాలమునకును ప్రథమములో నెట్టి సందర్భమును నుండియుండెడి కాదు. అనఁగా, ప్రస్తుతము సంగీత మెక్కువగ నేరుపని అనాగరికులలో సంగీతమునం దొక ధ్వనివిలాసమే గాని భావసారస్య మేమియు లేదు. కాని గానవిద్య యెక్కుడైన కొలఁదిని పదముల కూర్పువలన భావోదయము గావించి భావమును సంగీతమున తగు రాగములఁ జేర్చి రసవిస్ఫురితముఁ గననేర్చిరి. ఇట్టి యభివృద్ధి గాంచిన పట్టుల సంగీత మన, పదగుంభనమువలనఁ జేరరాని రసావిర్భావమును సూచించుచున్నది. మానవహృదయమునందు భాషాతీత మగు భావమును, భావాతీత మగు రసమును లోలోన నెక్కడనో యణఁగి యున్నది. జనహృదయమును భేదించి రసప్రవాహము వెలివడునట్లు చేయు అద్భుతశక్తి మహాకవులకును, మహాగాయకులకును మాత్రమే గలదు. గోటిమీటునకు మ్రోఁగు తంబురతీఁగవలెనే జనహృదయము వారి చిత్రకల్పనలకు నిరంతరమును చలించుచుండును. ఒకమాట, ఏ సందర్భమున ఏ కవివాక్కునుండి వెడలినదో, మనోమర్మభేది యై మానవలోకము నంతయు అనంతవార్ధిలో తల్లడిల్లఁ జేయఁగల్గును. ఒక కీర్తన, ఏ గాయకుఁడో ఏ భక్తుఁడో తన శారీరమునఁ జేర్చి, సృష్టివిధానమున కనువగు లయ నూర్చి, నటరాజేశ్వరుని తాండవపారవశ్యమును వెల్లడి చేయుచు పాడిన శైలితో, కాలాంతమువఱకును ప్రతిధ్వనుల నింపఁగల్గును.

ఇట్లు సర్వసృష్టియం దంతర్గర్భిత మగు భావమును, భావప్రకటనమునకు వలయు భాషాప్రాగల్భ్యమును, భావమును భాషయును లయముఁ జెందు రవమాధుర్యమును, జేరి ఏకరసస్ఫూర్తి గాంచినపుడే నిఖిలరసామృతమూర్తి యగు సర్వేశ్వరుని యారాధనము మానవచిత్తమునందు సఫలత నొందఁగలదు.

# విశ్వబ్రాహ్మణులు – ఆర్యాగమనము

ఎమ్. వీరభద్రాచారిగారు

చిరకాలము క్రిందట హిందూదేశ మనాగరకు లగు ప్రజలతో విరాజిల్లుచుండెను. ప్రతిజీవియు స్వభావముచేతనే సుఖాభిలాషియై యుండును. మఱియు బుద్ధిబలమును, ప్రపంచానుభవమును ప్రబలినకొలఁదిని, నీ సుఖాభిలాష హెచ్చుచుండును. కావున మనుష్యజాతులు సుఖప్రదము లగు చోటుల వెదకికొనుచు నొక తావు నుండి వేఱొక తావునకు దీర్ఘప్రయాణములు చేయుచు వచ్చిరి. ఆశియాఖండమధ్యభాగము శీతలప్రదేశమై పంటలు పైరులు సులభముగ పెరుఁగని స్థలముగ నున్నది. అచ్చటి జనులసంఖ్య వృద్ధియైనకొలఁదిని వారికిఁ జాలినంత యాహారము సులభముగ దొరకమిని వా రితరదేశములకై యాత్రలు సాగించిరి. కొందఱు పశ్చిమముగఁ బోయి యైరోపాఖండమున నివాసముల నేర్పఱచుకొనిరి. మఱికొందఱు దక్షిణమునకు వచ్చి హిందూదేశమును గనుఁగొనిరి. ఈ దేశము సమశీతోష్ణముగను, ఫలవంతముగను నుండెను. అయినను నడవులందును, కొండలందును నున్న మోటువారు నూతనాగతుల నెదిరించి పోరాడిరి. వీరినే దస్యు లని మన పూర్వగ్రంథములు పేర్కొనుచున్నవి. వీరితోఁ జిరకాలము పోరి తుదకు నూతనాగతులే విజయులై హిందూదేమున నుత్తరభాగము నాక్రమించుకొనిరి. ఈ క్రొత్తవారు వనముల నఱికివేసి భూమిని సేద్యము సేయుట కారంభించిరి. అందువలన సేద్యగాండ్రను నర్థమిచ్చు ఆర్యలను పేరఁ బరఁగిరి. క్రమక్రమముగ స్థిరనివాసముల నేర్పఱచుకొని నగరముల నిర్మించిరి. అందు ప్రముఖమైనవిగ జ్యోతిష్మతీపురము, తేజోవర్తిపురము, శ్వేతద్వీపము మొదలగునవి పేర్కొనఁబడుచున్నవి. వేదములందును, శిల్పశాస్త్రమునందును నివి మహామహిమాఢ్యములుగను, చిత్రకళల కాలవాలములుగను వర్ణింపఁబడియున్నవి.

## పూర్వవిద్యలు పారమార్థికములు

ఆర్యులు ధీశాలులును, తత్త్వవిచారపరాయణులునై యుండిరి. వీరి జీవిత మంతయు పారమార్థికచింతతోడనే పూరితమై యున్నది. వీరు నిద్రించినను, మేల్కొనియున్నను, నన్నము దినినను, నుదకము ద్రాగినను, దేశయాత్రలఁ గావించినను, నాట లాడినను, పాటలు పాడినను, తుదకు భోగముల సాధించినను పారమార్థికచింతతోడనే పరఁగిరి. అయ్యది వారి జాతీయస్వభావము. కావుననే వీరి శాస్త్రములు భౌతికశాస్త్రము, భూగోళశాస్త్రము, ఖగోళశాస్త్రము, రాజనీతిశాస్త్రము, శిల్పశాస్త్రము, వాస్తుశాస్త్రము, రసాయనశాస్త్రము, వైద్యశాస్త్రము మొదలగున వన్నియు వేదాంతమునం దిమిడియుంటయే గాక, వేదాంతభావశూన్యముగ నేవిషయమును బోధింపఁబడలేదు. మఱియు నుదయమున లేచి ముఖప్రక్షాళనము చేయవలె నన్నదియు ధర్మశాస్త్రాంశమైనది. తన వృత్తి కవసరము లగు నుపకరణములఁ జేఁబూనవలె నన్న నదియు ధర్మశాస్త్రము ననుసరించియే చేయవలయును. జుట్టు కత్తిరించుకొనవలయు నన్నను, వస్త్రములు ధరించుకొనవలయు నన్నను, పరుండి నిద్రింపవలయు నన్నను, సర్వమును ధర్మశాస్త్రనిబంధనమైనది. దీనిని బట్టి మతసంప్రదాయము మన రక్తమం దంతటను లీనమై యున్నట్లు తోఁచును. సర్వసామాన్యవిషయములందే యిట్లుండ విద్యావైశద్యప్రకటనహేతువు లగు నుత్కృష్ట విద్యలఁ గూర్చి చెప్పనేల? సంగీతము, చిత్రవర్ణరచనము, శిల్పము మున్నగు నుత్తమవిద్యలు పూర్ణముగ నీశ్వరసేవ కనుగుణ్యములుగ నొనర్పఁబడి వృద్ధిచేయఁబడినవి.

## శిల్పములు

పూర్వశిల్పగ్రంథము లన్నియు దేవాలయనిర్మాణవిధానములఁ గూర్చియు, వాని వివిధరూపములఁ గూర్చి

యు, విగ్రహరచనావిధులఁ గూర్చియు బోధించుచున్నవి. ఆర్యుల జీవిత మంతయు నీశ్వరసేవయందే గడపఁబడు చుండుటచేతను, వీరి నాగరకమున కీశ్వరారాధనమే మూలాధారముగ నేర్పడుటచేతను, శిల్పము లత్యంతము వృద్ధిగాంచినవి.

అనంతసంఖ్య గల శిల్పము లున్న వని చెప్పుదురు. డాక్టరు ఫర్గుసను, ఆనందకుమారస్వామి, హావెలు మొదలగు శిల్పశాస్త్రవిశారదులు మన దేశపు శిల్పముల నానాదేశపు శిల్పములతోఁ బోల్చి చూచి యనేకవిమర్శగ్రంథముల రచించియుండిరి. అం దెల్లెడల నీ దేశపు శిల్పములను దక్కినవానికంటె నుత్కృష్టము లని సహేతుకముగ వర్ణించియుండిరి.

### శిల్పులు

ఆర్యులు తమ కత్యంతము ప్రీతికరమును జాతీయలక్షణమును నగు నీశ్వరసేవయం దీ శిల్పవిద్యల నుపయోగించుటయే హిందూశిల్పముల యుత్కృష్టస్థితికి మూల మని వక్కాణించుచున్నారు. వారు తమయందలి మహోన్నతశక్తుల నన్నింటి నిం దుపయోగించియున్నారు. శిల్పములు పావనతరములుగను, దైవతములుగను భావింపఁబడుచున్నవి. ఈ విద్యలను మొదట ప్రచారము గావించిన మహాపావనమూర్తు లగు మనుమయాదులు వేదాధ్యయనపరులును వేదకర్తలును నై పూజింపఁబడి రని వేదములందును, నుపనిషత్తులందును, మానసారము మొదలగు శిల్పశాస్త్రములందును, దృష్టాంతములు గాన్పించుచున్నవి.

ఈ దైవతములు విశ్వకర్మపరాత్పరుని ముఖముల వలనఁ గల్గి రనియు, నాదేవదేవునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లను నైదు ముఖములు గల వనియు, వానినుండి క్రమముగ మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ లను నైదుగురు బ్రహ్మ లుద్భవించి అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణములతో వస్తునిర్మాణమును చేయుచువచ్చి రనియు స్పష్టముగఁ దెలుపఁబడియున్నది. దీనిని బట్టి విచారింపఁగా, పూర్వ మార్యులవలన సమస్తవస్తునిర్మాణమునకును నాధారమైన అయోదారుకాదిపంచవృత్తులు నుత్తమోత్తమములుగ నెంచఁబడి యావృత్తులఁ జరించువారిని మిక్కిలి గౌరవించుచువచ్చి రని విశదమగుచున్నది. మఱియు నీ వృత్తులఁ జేసెడివారు, పూర్వము విధ్యుక్తధర్మముగ వేదవిద్యలఁ గఱచి రనియు సంఘమున గురుస్థానమును వహించియుండి రనియు తెలియుచున్నది. వర్ణములు పెచ్చుపెరిఁగి సంఘ మంతయు భిన్నభిన్నమై యిప్పటిలీల నుండమి నుత్తమసాంఘికులు విశేషభేదభావము లేక యార్యసంతతి నెల్ల నొక్కటిగ భావించి వఱలిరి. అప్పుడు చిత్రకళలు, శాస్త్రములు, వేదములు విశేషముగ నభ్యసింపఁబడుచుండెను. ఈ మూడింటి యందును విశారదు లగువారినే గురువులుగ భావించిరి. వారికే ఆచార్యు లని పేరు. ఆచార్యశబ్దమున కీ సంజ్ఞాత్రయమును సాధించినవా రని యర్థ మని శిల్పమునందు వివరింపఁబడియున్నది. ప్రాచీనగ్రంథరాజముల విమర్శించినచో వానిలో నొక్కొక్కటియు ప్రత్యేక మొక యంశమును ప్రధానముగఁ జేసికొని బోధించుచున్నను, వేదాంతమును, ప్రకృతిశాస్త్రములను, చిత్రకళలను నుదాహరణములకొఱకుఁ గాని, బోధనాంశమును విశదీకరించుటకుఁ గాని సర్వసాధారణముగఁ బ్రయోజనమునకుఁ దెచ్చుకొనుచుండెను. ఒకరీతి విద్యకును మఱొకరీతి విద్యకును ప్రబలవైరుధ్యము లేక యవి పరస్పర సహకారములై వెలసినవి.

### కాలచక్రము

ఇట్లుండ కాలక్రమమున వివిధవిద్యలందును స్వాభావికాభిలాష గలవారు తమతమ యభిమానవిద్యలను ప్రబలఁజేయ నుత్సుకులైరి. క్రమముగ వివిధవిద్యలును ఘనతరస్థితికి వచ్చినవి. క్రమక్రమంబుగ వాని పరస్పరానుబంధము దూరమగుచు వచ్చినది. విద్యాధికులును పరస్పరము దూరస్థు లగుచుండిరి. సంఘమున నైకమత్యము క్షీణత గాంచెను. ఒండొరుల నిరసించుకొనుటయు, స్వాభిమానమును పెంపుచేయుటయుఁ దటస్థించెను. సంఘ మిట్టి స్థితి నుండఁగా మధ్యనూశియానుండి మఱొక యార్యసమూహము హిందూదేశమునకు వచ్చి

నది. ఇక్కడ నొక విషయమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. హిందూదేశమునకు వచ్చిన యార్యు లందఱు నొక్కసారిగ వచ్చినవారు కారు. కొందఱు ముందు వచ్చి దేశీయులతోఁ బోరి దేశమును కొంత స్వాధీనము చేసికొని స్థిరనివాసముల నేర్పఱచుకొనిరి. ఈ సంగతిని దెలిసికొని మఱికొంతకాలమునకు మఱికొంద ఱార్యులు వచ్చిరి. ముందు వచ్చినవారు తమ లాభములను, సౌకర్యములను, జయములను, నివాసములను వీరితోఁ బంచుకొనుటకు సమ్మతింపకుండిరి. యుద్ధములు పొసఁగినవి. ముందు వచ్చినవారు సకలసౌకర్యకలితు లయ్యు, పరస్పరానుగుణ్యము లేనివారై దుర్బలత నుండ, రెండవవారు నూతనదేశాక్రమణసంకల్పపూరితులై, నైకమత్యయుతులై యుత్సాహబలసమన్వితులై యుండిరి. రెండవతెగవారికే జయ మబ్బినది. మొదటివారు చెదరిపోయి యచ్చటచ్చట నివాసముల నేర్పఱచుకొనఁగా, విజయులు వీరి నివాసముల నాక్రమించుకొని సింధుగంగానదుల నడుమ నున్న విశాలప్రదేశమునందు నివసించుచువచ్చిరి. ఎంత దుర్బలు లైనను ప్రియతరనివాసములను, సౌఖ్యములను గోల్పోవువారు శత్రువులను క్షేమమున విడునరు గదా! కావున మొదట నీ దేశమును జయించి యిప్పుడు తమ సోదరులచే నిర్జితు లైనవారు సమయము దొరకినప్పు డెల్ల రెండవవారితోఁ బోరుచునే యుండిరి. ఏకజాతివా రగుటచేత కొందఱుకొందఱు నూతనాగతులతోఁ జేరుచువచ్చిరి. అయో, దారు, తామ్ర, శిలా, సువర్ణములతో వృత్తులఁ జేసి జీవించువారు స్వతంత్రజీవనాధారము గలవారు గాన గర్వులై, మైత్రి కొడంబడ లేదు. మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞ బ్రహ్మల సంతతివా రగు 125 గోత్రములవారును ప్రత్యేకముగ నుండిరి. వీరిబలము క్షీణించుచు వచ్చెను. రెండవవారి బలము హెచ్చుచు వచ్చెను.

## విశ్వబ్రాహ్మణులు

ఈ 125 గోత్రములవారును సర్వజనుల కాశ్రయము లగు వృత్తులందుఁ జరించుచుండుటచేత నవసరమును బట్టి యితరులచే నాహ్వానముచేయఁబడుచు, వారికి సహాయము చేయునెడల గౌరవింపఁబడుచు నుండిరి. హిందూదేశమున నార్యావర్తమునందు నివాసముల నేర్పఱచుకొనిన కాలమున నార్యజాతి ముఖ్యముగ బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణము లను నాలుగు శాఖలతోఁ బరఁగుచుండెను. వేదాధ్యయనము, ఈశ్వరోపాసనము, పారమార్థికము లగు చేతిపనులు మొదలగు వానినే వృత్తులుగ నేర్పఱచుకొనినవారు బ్రాహ్మణులు. శస్త్రాస్త్రముల చేఁ బూని సంఘమును శత్రువులపాలఁ బడకుండఁ గాచినవారు క్షత్రియులు. ధనధాన్యగోరక్షణాదులఁ జరించుచు నాగరకాభివృద్ధికిఁ దోడ్పడినవారు వైశ్యులు. ఈ మూఁడు తెగలవారికి సేవయొనర్చుచు సంఘక్షేమమునకుఁ దోడ్పడినవారు శూద్రులు. ఈ తుదివారిలో ననేకు లనార్యులును యుద్ధములలో నిర్జితులును గూడఁ జేరిరి. బ్రాహ్మణవృత్తులఁ జరించినవారిలో, రెండవతడవ వచ్చినవారును వారితోఁ జేరిన మొదటి తెగవారును, బ్రాహ్మణనామమునఁ బరఁగుచుండ, వారితోఁ జేరకుండిన బ్రాహ్మణు లని తెలియఁబఱచుటకు పైఁ బేర్కొనఁబడిన 125 గోత్రములవారును విశ్వకర్మ బ్రాహ్మణులని వ్యవహరించుకొనుచు వచ్చిరి. వీరి గోత్రపురుషు లందఱును శ్రీవిరాడ్విశ్వకర్మనుండి యుద్భవించినవా రగుటచేత పౌరుషేయు లనియు వ్యవహారము కలిగినది. పౌరషేయు లన పురుషుని (పరబ్రహ్మకు పురుషుఁ డనియు నామము.) సంతతి యని యర్థము.

## సమష్టిభావము

ఆ కాలమున నున్న తక్కిన బ్రాహ్మణులు విశాలహృదయులును, ప్రాపంచికధర్మములం దాదరము హెచ్చుగఁ గలవారు నై బ్రాహ్మణగుణము లగు సత్యశౌచాదిపావనగుణములు గలవారి నందఱిని తమ తెగలోనికి సులభముగఁ జేర్చుకొని గౌరవించిరి. వీరి గోత్రపురుషుల నామములందు క్షత్రియఋషుల పేర్లును తదితరుల పేర్లును గలసి ప్రఖ్యాతములై యున్నవి. ఈ సమష్టిభావమే వారి సంఘమును బలసమన్వితముగ నొనర్చి, బౌద్ధులు జైనులు మొదలగు మతాంతరుల దాడికి నాశనమై పోకుండఁ గాచినది. ఇంకొక విశేషము గలదు.

వర్ణనిర్ధారణమందు జాతినిర్ణయము గొంతవఱకు వదలి నను గుణనిర్ణయమునందు పట్టుదల గలవారై తమ వర్ణ గౌరవమును, విద్యాధిక్యమును, బుద్ధిబలమును వీరు గాపాడుకొనిరి. "కలౌ సంఘే శక్తిః" అనునట్లు కొంత కాలము వీరు శత్రుబాధ కోడినను, బునరభివృద్ధి నొందఁ గల్గుచువచ్చుట చరిత్రపాఠకులకు విశదమే. లోకమును ముంచివేయునో యనునంతగాఁ బ్రబలిన బౌద్ధమతమును గూడ వీరు సరకుగొనక తటి వేచి చతుర్విధోపాయము లను వశముచేసికొనిరి. బుద్ధుని విష్ణుదశావతారములలోఁ జేర్చిరి. బౌద్ధ జైన సాంప్రదాయకము లగు నీశ్వరోపా సనవిధానముల నంగీకరించిరి. కాలక్రమమున సమష్టి భావముచే ప్రబలతఁ గాంచిరి. ఈ విషయములఁ గూర్చి డాక్టరు పల్నిఆండిగారు విశదముగను, విపులముగను వ్రాసియున్నారు.

## వ్యష్టి భావము

ఋషిసంతతి బ్రాహ్మణులు సమష్టిభావముచేత, దేశకాలపాత్రల ననుసరించి మెలంగుచు, విద్యాభివృద్ధిని గౌరవమును బలమును సాధించుచుండఁగా, పౌరుషేయు లౌ విధానముల ననుసరింపక వ్యష్టిభావముతో వఱలిరి. వీరు చేయు వృత్తుల యావశ్యమును బట్టి సమయానుకూ లముగ గౌరవింపఁబడుచు వచ్చినను, నితరుల మైత్రిని సాధింప నశక్తులైరి; రానురాను ఇతరులచే పెక్కురీతుల బాధల నందవలసినవార లైరి. సంఘ మంతయు నొక్క రీతి నుండ, వీరు వేఱుగ నుండిరి; గుణశీలములకంటె జాతి కత్యంతము ప్రాముఖ్యము నిచ్చి శాఖేతరు లగు ఋషిసంతతి బ్రాహ్మణుల నిరసించుచుఁ దత్ప్రతిఫలము లగు నిరసనమును, వైరమును, ద్వేషమును బాలు గొనిరి. సంస్కరణ విముఖులై దేశకాల పాత్రముల ననుసరించి వర్తింపక, జాతిగర్వప్రధానులై పెక్కు చిక్కులఁ బడిరి. కొంతకాలమునకు బౌద్ధజైనమతములు ప్రబలి బ్రాహ్మణమతము నొకింత యడంచి పట్టినవి. అక్కాలమున చిత్రకళావిశారదు లగు విశ్వకర్మబ్రాహ్మ ణులు తమ విద్యాప్రభావమువలన వారిమన్ననల సంపా దించుకొనసాగిరి. బౌద్ధజైనమతస్థు లగు రాజులు విశ్వ బ్రాహ్మణుల నాదరించి యనేకము లగు విహారముల ను, గుహాలయములను, చైత్యములను నిర్మింపఁజేసిరి. హిందూదేశమునఁ గల పూర్వశిల్పములలో పేరెన్నిక గాంచిన వీ కాలమున నిర్మింపఁబడినవే. అవియే యిప్పటి కిని మన దేశౌన్నత్యమునకు సుస్థిరనిదర్శనములుగ వెల యుచున్నవి. వేదసంబంధపు మతములవారిని బౌద్ధులు నిరసించియు విశ్వకర్మబ్రాహ్మణుల నాదరించిరి గాని వీరు మాత్రము తమ మతధర్మముల వదలినవారు కారు. తమ జాతిగౌరవమును రాజుల యాదరముచేఁ జెడకుండఁ గాచుకొనుటకు ననేకసూత్రముల రచించుకొనినట్లు పూర్వశిల్పగ్రంథములందు దృష్టాంతములు గాన్పించు చున్నవి. తమ కూటాధిపతు లగు నాచార్యులను నిర్ణ యించుకొనుటలో కడు జాగరూకతతో మెలంగుచు వర్ణ పారిశుద్ధ్యమును, కళానైపుణ్యమును గాపాడుకొనిరి. మఱియు ననేక వేదశాస్త్రదృష్టాంతములవలన పూర్వ శిల్పుల యౌన్నత్యమును నిరూపింపవచ్చును.

## బౌద్ధరాజులు

బౌద్ధరాజులు విశ్వకర్మబ్రాహ్మణులను * గౌరవిం చినట్లు దక్షిణ హిందూస్థానమునను, సింహాళమునను శాసనములు పెక్కులు గలవు. 1644 సం. ద్వితీయ రాజసింహరాజు దేవసింహమూలాచారి యను విశ్వ బ్రాహ్మణుని తన యేనుంగుపై నెక్కించి నగరునకుఁ దీసికొనివచ్చి మిగుల బహూకరించియున్నాఁడు.

1763 సం. కీర్తిశ్రీ రాజసింహుఁ డను రాజు విజయ వర్ధనదేవసింహమూలాచారి యనువానికి దానశాసనము నొసంగెను. రాజకరుణదేవ సురేంద్ర మను వీరవిక్రమ శిరిత్తరాళన అరశణ విచిత్రచిత్ర కర్మాంతనిర్మిత సకల శిల్పతిలక నవరత్నముదవిలిదవుండ శిప్పాచారి యను వానికి బిరుదములను భూదానములను నొసఁగినట్లు తామ్రశాసన మొండు గలదు.

సింహాళము నేలిన బౌద్ధరాజులు విశ్వకర్మవంశీయుల చేత కిరీటధారణముఁ బొందినట్లు తెలియవచ్చుచున్నది. విక్రమబాహుఁ డను రాజు పండితనీలమి యను విశ్వ

* విశ్వకర్మబ్రాహ్మణులు కాలక్రమమున విశ్వబ్రాహ్మణు లని పేరు గాంచిరి.

బ్రాహ్మణునిచే కిరీటమును బొంది వాని భార్యకును, సుతకును, పుణ్యానందహాని, విజయవర్ధన యను నామముల నొసంగి గౌరవించి విలువగల దానముల నొసంగినాఁడు.

బెల్లనమేస్త్రి యనునాతఁ డొక సువర్ణపతకము నందియుండెను. ఆపతకముమీఁద నీ యర్థ మిచ్చునట్లు వ్రాయఁబడియుండెను. “శాకశకము 1634 సంవత్సరమున శ్రీ దంతధాతుమకరధ్వజమండలవల్లి విశ్వకర్మ రాజకరుణ మహామందిరమునకు సమర్పితము.”

## బౌద్ధానంతరవృత్తాంతము

బౌద్ధులకాలమునఁ దమ సోదరులు బాధల నందుచుండ, రాజాశ్రయమునఁ బెంపొంది, యందువలన నితరుల ధిక్కరించియున్న పౌరుషేయులకును, బౌద్ధమతము క్షీణింపఁ బునరుద్ధతిఁ గాంచిన యార్షేయులకును, పూర్వమునకంటె వైరము హెచ్చెను. ఆర్షేయులును వారి గురుత్వము నంగీకరించి వెలయు సాంఘికులును పౌరుషేయుల బాధింపసాగిరి; అనేకవిధముల నిరసించుచు వచ్చిరి; రాజాశ్రయమునఁ జేరి వీరికిఁ బ్రతికూలములు నమానుషములు నగు శాసనములఁ గల్పింపఁజేసిరి; పౌరుషేయులను మతాంతరులో బౌద్ధులుగ వాదించిరి. పౌరుషేయులు సామాన్యవిద్య నొకింత యుపేక్షించినను గర్మవిద్యలఁ బ్రవీణులును సంఘజీవనమునకు ముఖ్యాధారులు నగుటచేత శత్రువుల బాధలకుఁ జిక్కియు నెట్టెటో మనఁజాలిరి.

హిందూదేశమున మతమునందాసక్తి ప్రజలకుఁ బ్రధానలక్షణము గావున పౌరుషేయు లెన్ని చిక్కులను బడినను మతధర్మములను గాచికొనుచు నార్యజాతిలక్షణముల నిలుపుకొనఁగలిగిరి. పరంపరగ వచ్చుచున్న గోత్రసూత్రమతాచారవ్యవహారములం బరిశీలించినచో పెక్కుబాధలం బడి వీర లెట్లు మనఁగల్గిరో యద్భుతముగఁ దోఁచును. హిందూదేశమందలి కులవృత్తుల నిర్ణయము కొన్ని యెడల దేశమును బలతరము గాకుండఁ నాఁపినను, దేశీయవిద్యావైశద్యముల బొత్తుగఁ బోకుండఁ గాచినది; మఱియు పౌరుషేయుల స్థితిని ప్రాముఖ్యమును నిలిపినది.

## ప్రస్తుతస్థితి

బౌద్ధయుగానంతరము దేశ మనేకరాజులపాలఁ బడి పెక్కు మార్పుల నందినది. సంస్కరణవిముఖు లగు పౌరుషేయులు తప్ప తక్కినవారు దేశకాలపాత్రముల కనువగు వర్తనముచే మార్పుల నందుచు వృద్ధికివచ్చిరి. ఈ సంఘము మాత్రము నానాఁట క్షీణతకు వచ్చినది. బొత్తుగ నాశము నొందకుండ నుండుటే విచిత్రముగ నున్నది! కుమతు లగు మంత్రులయొక్కయు, పక్షపాతమునఁ బ్రసంగించు ప్రజలయొక్కయు వాక్కులకుఁ జెవియొగ్గి పౌరుషేయుల బాములఁ బెట్టిన రాజులు చాలమంది గలరు. దైవయోగముచే నీ దేశము నాక్రమించిన హూణులు సాంఘికమతవిషయములందు జోక్యముఁ గలుగఁజేసికొన మను దీక్ష గలవా రగుటచేతను, వివిధసంఘముల స్వేచ్ఛాజీవితములకు హాని రాకుండఁ గాచు ప్రయత్నశీలు రగుటచేతను, ఇతరసాంఘికుల సిలుగులు లేక పౌరుషేయులు మనుచున్నారు. చిరకాలమునుండి యహితు లగు ప్రజలచేఁ బరివృతులై సదా దుర్ఘటప్రయత్నములచే మనవలసినవా రగుటచేత నిప్పటికిని విసికి వేసారి ప్రవృత్తిని వీడి యప్రయత్నముగ సాగు జీవితమును చేయుచున్నారు. ప్రయత్నమున సంస్కరణములఁ గావించుకొని యున్నతికి రావలయు నన్న, విరక్తి పురోభివృద్ధియం దవిశ్వాసము, ప్రోత్సాహకర్తలయం దనాదరము, ఆత్మగౌరవమం దుపేక్ష సంఘమును బీడించుచున్నవి. ఐకమత్య మనిన మందున కైనఁ గానరాదు. సహజముగ ధీయుత మగు సంఘము గాన యువజనులు కొందఱు కాలానుసరణి నూతనోజ్జీవసూచకంబుగ వేషభాషలను మార్చుకొనుచు విజాతీయమార్గముల నవలంబించుచున్నను, నవి యనుకరణమాత్రముగ నుండెఁ గాని విజ్ఞానమువలనను, నావశ్యమువలనను, ననుకూలతవలనను దెచ్చిపెట్టుకొనఁబడినవి కావు. యువజను లిట్లుండ, ముసలివారు కూపస్థమండూకములమాడ్కి నుండి విద్యావైశద్యములఁ జిరకాలముక్రిందటనె గోల్పోయి, తా మాచరించినదే సదాచార మనియు, తదితరము జాతిధర్మవిరుద్ధ మనియుఁ, దమ యున్నతికి నితరసాంఘికు లోర్వక య

ద్ధుపెట్టువారుగ నుండి రనియు భ్రమించుచుండిరి; పురోభివృద్ధిప్రయత్నములకు భంగకరముగ వాదించుచుండిరి. ఇప్పుడు మనలఁ బాలించువా రాంగ్లేయులు. వారి సంప్రదాయములును, వారి యాచారములును, వారి సాంఘిక విధానములును మన సంఘమును మార్చుచున్నవి. మన కిష్టము లేకున్నను మాఱిపోవుచున్నాము. ఉభయ సంఘస్థితులఁ బరిశీలించి యుత్తమపథముల నిర్ణయించుకొని సంఘసంస్కరణము గావించుకొనినఁ గాని మన జాతి యున్నతికి రాఁజాలదు. అందుకు ప్రతిసంఘమునను గొందఱైనను హూణవిద్యాధురంధరులు గావలసియున్నారు. అట్టి విద్య పౌరుషేయసంఘమున సర్వశూన్యముగ నున్నది. నూటికి తొంబదిమంది మాతృభాషలోఁ దమ పేరునైన లిఖింపఁజాలకుండి రని చెప్పినచో, నాంగ్లేయ భాషాజ్ఞానరహితులై రని చెప్పిన వింతగ నుండదు.

## ప్రముఖుల ప్రయత్నము

ఈ దుస్థితిని దలంచి కొందఱు ప్రముఖులు ప్రవాసికోపన్యాససంఘముల నేర్పఱిచి, యూర నూర సుబోధలఁ గావించియు, స్వభాషలందు పత్రికాప్రచారము నొనర్చియు, మహాజనసభలఁ గల్పించియు, విద్యార్థులకై సహాయనిధుల నేర్పఱిచియు నెన్నియో పాట్లు పడుచున్నారు. చెన్నపట్టణమునందు విశ్వకర్మకులోద్ధారణసంఘ మొకటి స్థాపింపఁబడియున్నది. “విశ్వకర్మ” యను నఱవపత్రిక ప్రకటింపఁబడుచున్నది. సింహళమున విశ్వకర్మసంఘ మొకటి యున్నది. విశ్వబ్రాహ్మణుల పూర్వౌన్నత్యమును బ్రకటించు గ్రంథముల ప్రచారము సాగించుచున్నారు. అట్టి సంఘ మొకటి తిరుచునాపల్లియం దున్నది. బొంబాయినుండి దైవజ్ఞమాసిక యను నొక వార్తాపత్రిక వెలువడుచున్నది. పూనానుండి విశ్వబ్రహ్మవృత్తి యను పత్రిక ప్రకటింపఁబడుచున్నది. హిందూదేశమందలి విశ్వబ్రాహ్మణుల నెల్లఁ బ్రోత్సాహపఱిచి పూర్వశిల్పాభ్యుదయము నెల్ల జనులకుఁ దెల్లముచేయునట్టి “విశ్వకర్మ” యను పత్రిక యొకటి డాక్టరు ఆనందకుమారస్వామి గారిచే లండను పట్టణమునఁ బ్రకటింపఁబడుచున్నది. ఆంధ్రదేశమునను గొన్ని ప్రయత్నములు సాగుచున్నవి.

1908 సంవత్సరమున విశ్వబ్రాహ్మణమహాజనసభ ప్రప్రథమమున బందరునందు జరుపఁబడినది. విద్యాభ్యాసమును బ్రోత్సాహపఱుచుచు, కన్యావరశుల్కములను నిరసించుచు, కర్మవిద్యల గౌరవించుచు తీర్మానములు చేయఁబడినవి. విద్యార్థుల సహాయమునకై ధననిధి యొకటి స్థాపింపఁబడినది. క్రమముగ గుంటూరు, పొన్నూరు, వంగవోలు, కవుతరము, తణుకు గ్రామములందు సాంవత్సరికమహాజనసభలు జరిగినవి. కడపటి రెండు సభలతోఁబాటు చిత్రవస్తుప్రదర్శనములు కూడ జరిగినవి. “ప్రబోధిని” యను మాసపత్రిక ప్రకటింపఁబడుచున్నది. అయినను నీ సభలు కొందఱి ప్రోత్సాహబలాత్కారములచేత నెఱవేఱుచున్నవి. సాంఘికులు వాని యుపయోగమును, బలమును గుర్తింపలేకున్నారు. ఆధునికాచారములును, సంస్కరణములును సంఘమునఁ జొచ్చి పూర్వాచారవిధిని జెఱుచు ననియు, అందువలన జాతికి భంగము వాటిల్లు ననియు భీతిలుచుండిరి. నెమ్మదిమీఁద విద్యావ్యాపకమువలనఁ గాని యీ భీతి తీఱదు. కాలానుగుణ మగు మార్పుల నంగీకరించి యందఱు నున్నతికి రారు.

## ఇతరుల తోడ్పాటు

ఈ సంఘమును సంస్కరించి విద్యావంతముగఁ జేయుటలో విశ్వబ్రాహ్మణేతరులు గొందఱు కడు సహాయము చేయుచున్నారు. వా రెంతయు వందనీయులు. ఈ సంఘమున నైకమత్యము వఱలినఁ గాని సాంఘికులు బాగుపడరు. సంఘసంస్కరణవిముఖులును, సాంఘిక జీవిత మన్న నెట్టిదో యెఱుంగనివారు నగు పౌరుషేయులు సులభముగ నితరులతోఁ గలియరు. పూర్వము వీరియందుఁ గల వృత్తిసమితులు వీరిని గాచినవి. కమ్మరము, వడ్రము, కంచరము, శిల్పము (శిలలపని), బంగారుపని — అన్నియు శాఖాభేదము లేక యందఱును తమతమ వీలు ననుసరించి యవలంబించుచుండిరి. అయినను సర్వకళావిదుఁ డగు నొకనిని ఆచార్యపదవియం దుంచి యొక్కొక్క వృత్తి కొక్కొక్కనిని ప్రతినిధిగఁ

జేసి యెన్నికగల ప్రతిగ్రామమునను, పట్టణమునను వృత్తిసమితులఁ గల్పించెడివారు. ఈ వృత్తిసంఘములు పూర్వము బలసమన్వితములై సర్వకళాభివృద్ధికిఁ దోడ్పడుచువచ్చినవి. వానిని రాజులు తమ శాసనములచే బలపఱచి కాపాడుచుండెడివారు. రాజులు సహితము వృత్తిసమితియొక్క యాచార్యుల ద్వారా తమ స్వకార్యములను నెఱవేర్చుకొనుచుండెడివారు. అట్టి సమితు లేర్పడుటకు సర్వజనులును పాటుపడవలయును. కులకట్టులచే హిందూజాతీయమహాసంఘమునకు బలము తగ్గుననియు, ఉపసంఘములు మితిమీఱిన బలమును గాంచి తదితరుల బాధించు ననియుఁ గొందఱు భ్రాంతి నందుదురు. జాతీయమహాసంఘము బాల్యదశయందుండుతఱి నట్టి భయమున కవకాశ ముండిన నుండును గాని, సుస్థిరమగు చిరతరనాగరకము గల సంఘమునకీ వృత్తిసంఘము లత్యంతము శుభప్రదము లే. మహాసంఘపు ప్రత్యంగమును బలపడి జాతిని తేజోవంతముగ నొనర్చును. చేతిపనుల యభ్యుదయము మన దేశమునకు ప్రస్తుత మత్యంతావశ్యకముగ నున్నది. ఇందుకొఱకై యనేకప్రయత్నములు జరగుచున్నవి. కర్మవిద్యాలయములు స్థాపింప దొరతనమువారు గోరఁబడుచున్నారు. యువజను లితరదేశములకుఁ బోయి యంత్రనిర్మాణముల నేర్చుకొని వచ్చుచున్నారు. పరిశ్రామికమహాసభలు జరుగుచున్నవి. చిత్రవస్తుప్రదర్శనములు సాగింపఁబడుచున్నవి. ఈ యన్నింటను వైశద్యయుతు లెల్లరును ప్రోత్సాహపఱుపఁబడుచున్నారు. అయినను జాతిధర్మముగఁ గర్మవిద్యలందుఁ జరించుచు జీవించు పౌరుషేయులు విద్యావిహీనతవలన, వ్యష్టిజీవనమును గడపుచు కూపస్థమండూకములలీల నుండి వాని నెఱుఁగనికతమున, లాభము నందఁజాలకుండిరి. కావున భారతీయు లెల్లరును నీ సంఘమును విద్యచే నున్నతికిఁ దీసికొనిరాఁ బ్రయత్నింతు రేని, అచిరకాలమునఁ గర్మవిద్య లుచ్చదశకు వచ్చి దేశము శోభాయమానము కాఁగలదు. సర్వవిధముల నీ సంఘమువారిని ప్రోత్సాహపఱచుట యందఱకును విధి. నూతనముగ నితరులఁ గర్మవిద్యలందుఁ బ్రవేశపెట్టుటకై చేయఁబడు ప్రయత్నములకంటె నీ సంఘమువారి నటుల చేయ బలవంతపెట్టుట శ్రేయోదాయక మగును. అయినను నీ సాంఘికు లట్టి ప్రోత్సాహమును దమకు శ్రేయోదాయక మని గ్రహించు స్థితియందు లేరు. కాని సర్వకళాభ్యుదయమునకు నాధార మగు స్వాభావికజ్ఞానప్రజ్ఞాసంపదలు వీరియందు తగియున్నవి. వానిని మేల్కొల్పుట దేశాభ్యుదయహేతు వని వక్కాణింపవచ్చును.

# భారతవర్ష ప్రశంస

గోదావరి సత్యనారాయణగారు

ప్రభవించినాఁ డమ్మ! ప్రభు వశోకుఁడు బౌద్ధ
మతమును బోషింపఁ బ్రతిన దాల్చి;
జనియించినాఁ డమ్మ! సర్వసర్వంసహా
చక్ర మేలఁగఁజాలు విక్రముండు;
ఉదయించినాఁ డమ్మ! కదనంబులో నిల్చి
వెను కంజ వేయని భీమసింగు;
జనన మందెను దల్లి! చండభాస్కరులీల
శత్రుభీకరుఁడు జస్వంతనృపతి
ప్రథితఢిల్లీపురాధీశు ప్రక్కలోని
వాఁడిబల్లెమురీతి శివాజి పుట్టె;
సింహబలులను గన్నావు క్షితిని నీవు!
నిన్ను సామాన్యరాలిఁగా నెన్నఁదగునె?

సీ. సంసారమును వీడి సకలరాజ్యము వీడి
యతియైన బౌద్ధుని యవ్వ నీవ!
చిఱుతప్రాయమునందె యురుకీర్తి గాంచిన
శంకరాచార్యుని జనని వీవ!
కవిరాజరాజాగ్రగణ్యుఁడై పేర్వడ్డ
కాళిదాసునిఁ గన్న కాంత వీవ!
శిబిదధీచులవంటి శ్రేష్ఠజన్ములఁ గాంచి
వన్నె కెక్కినయట్టి పడఁతి వీవ!
యాజ్ఞవల్క్యాదిమునులను యశము నింప
మమతతోఁ గని పెంచిన మాత వీవ!
భరతమాతరో! నీవంటి భవ్యురాలు
కలుగ, మా కేల గర్వంబు కలుగకుండు?

# గ్రాంథిక శైలి — వ్యావహారిక శైలి

రావుబహదూర్ కి. రామానుజాచార్యులుగారు, ఎమ్.ఏ., బి.యల్., ఎఫ్.ఎమ్.యు.

సుమారు రెండుసంవత్సరములక్రిందటఁ బాఠశాలలోఁ జదువు బాలకులు గ్రాంథిక శైలిని వ్రాయుటయా, వ్యావహారిక శైలిని వ్రాయుటయా, యను విషయము చర్చింపఁబడెను ఆ సందర్భమున "క్లాసికల్" "మోడర్న్" శబ్దము లుపయోగింపఁబడినవి. గ్రీకు లాటి న్భాషలలో మహాకవులు వ్రాసిన గ్రంథములను మాత్రమే కొంతకాలమువఱకుఁ బాశ్చాత్యులు "క్లాసిక" లని వ్యవహరించుచు వచ్చిరి. అనంతరము పశ్చిమఖండములోని మహాకవులు వ్రాసిన గ్రంథములు "క్లాసికల్" శబ్దవాచ్యము లయ్యెను. ప్రకృతమున నాగరకులచే వ్యవహరింపఁబడుచున్న సమస్తభాషలలో నున్న యుత్తమ గ్రంథములు "క్లాసిక" లనిపించుకొనుచున్నవి. కాని యాంధ్రభాషావిషయమున "క్లాసికల్" "మోడర్న్" శబ్దము లుపయోగించువారి యభిప్రాయము వేఱుగ నున్నట్లు తోఁచుచున్నది. వీరీ శబ్దములను గాలపరముగఁ జేసి ప్రాచీననవీనార్థములందు వాడుచున్న ట్లగపడుచున్నది. "క్లాసికల్" శైలి యనఁ గొన్ని వందల సంవత్సరముల క్రిందట గ్రంథకర్త లుపయోగించిన శైలి యని వీరి యభిప్రాయము. అట్లయిన నాంధ్రవైయాకరణులు మొదటినుండియుఁ గొంచెమెచ్చుతక్కువగ నంగీకరించిన భాషానియమముల ననుసరించి వ్రాసిన దంతయు "క్లాసికల్" శైలి యనిపించుకొనవలసియున్నది. ఈ యర్థము నంగీకరించినచో సత్కావ్యగుణములు లేక పూర్వవ్యాకరణనిబంధనముల మాత్రమే కలదయి వార్తాపత్రికలలో నుపయోగింపఁబడునట్టి శైలియే కాక పాఠశాలలోఁ బ్రథమద్వితీయకక్ష్యలలోని బాలకులు చదువుచున్న పుస్తకముల శైలి గూడ "క్లాసికల్" శబ్దవాచ్య మని చెప్పవలసియున్నది. ఇది యసందర్భ మని వేఱె యన నక్కఱలేదు.

మొదటఁ బాశ్చాత్యు లే కావ్యగుణములను "క్లాసిక" లని వాడిరో విచారింతము. లాలిత్యము, స్నిగ్ధత, వైశద్యము, కల్పనానిగ్రహము, సుబోధత, ప్రకృత్యనుకరణము, యుక్తిసిద్ధత మొదలగునవి శ్రవ్యకావ్యగుణములు. ఉత్తమపాత్రములను గలిగి దుఃఖాంతమై చూచువారికిఁ గరుణాదిరసమూలముగా హృదయప్రసాదమును బుట్టించుట ప్రహసనేతరదృశ్యకావ్యమునకు ముఖ్యగుణము. హాస్యరసప్రధాన మగు దృశ్యకావ్యమునకు సంతోషజనకత ముఖ్యగుణము. మఱికొన్ని గుణములను గూడ నాలంకారికు లుదాహరించిరి కాని వాని నిక్కడ వివరింప నక్కఱలేదు. స్పెయిన్, ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలగు దేశములలో గ్రీకురోమకమార్గముల నే కేవల మనుసరింపక స్వాతంత్ర్య మవలంబించిన గ్రంథకర్తలలో ముఖ్యు లగు ప్రాచీనులే కాక నవీనులు గూడ "క్లాసికల్" శబ్దవాచ్యు లని యొప్పుకొనుటచే నీశబ్ద ముత్తమార్థక మని స్పష్టమగుచున్నది. ఇట్టి యుత్తమత్వము దేశమునుబట్టియు, భాషనుబట్టియు, గాలమును బట్టియు మాఱుచున్నది. కనుక నుత్తమగ్రంథకర్త లందఱు ప్రాచీననవీనభేదము లేక "క్లాసికల్" శబ్దవాచ్యు లగుచున్నారు.

ఇఁక సంస్కృతాంధ్రభాషలలో నుత్తమకావ్యలక్షణమును విచారింతము.

"ఇద ముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వని ర్బుధైః కథితః"
కావ్యప్రదీపము.

ఏ కావ్యమునందు వ్యంగ్యము వాచ్యముకంటె నధికచమత్కారకారి యగునో యది యుత్తమ మనిపించుకొను నని సంస్కృతాలంకారికులు చెప్పుచున్నారు. ఈ విషయమున వీరి యభిప్రాయములతో నాంధ్రాలంకారికుల యభిప్రాయము లేకీభవించియున్నవి.

తే. వ్యంగ్యము ప్రధాన మైనను నప్రధాన
మైన నస్ఫుట మైనఁ గావ్యము త్రిసంఖ్య
నమరు నుత్తమమధ్యమాధమత ధ్వనిగు
ణీకృతవ్యంగ్యమును జిత్రమై కడంగి. నరసభూపాలీయము.

సంస్కృతభాషను గాళిదాసభవభూత్యాదుల గ్రంథములందువలె నాంధ్రభాషలో మహాకవు లనిపించుకొనుచున్న నన్నయ, తిక్కన, శ్రీనాథ, పెద్దనాదుల గ్రంథములందుఁ బైని జెప్పిన యుత్తమకావ్యగుణములు సంపూర్ణముగాఁ గానవచ్చుచున్నవి. ఈ గుణము లన్నియు విశేషముగా నర్థాశ్రయము లగుటవలన స్వల్పవిద్యులగు బాలకుల శైలిని గూర్చి పై నుదాహరింపఁబడిన చర్చకు ఫల మేమో తెలియకున్నది. ఒకభాషలో వేఱువేఱు కాలముల వ్రాసిన గ్రంథకర్తల కావ్యములు శ్రేష్ఠగుణోపేతము లయినప్పు డుత్తమము లని యనవలసియున్నది. ఆంగ్లభాషలో చాసర్, షేక్స్పియర్, టెనిసన్, అను కవుల గ్రంథముల భాష విశేషము లగు మార్పులను జూపుచున్నది. ఈ మార్పులు వారి గ్రంథముల యుత్తమత్వమునకు ప్రతిబంధకములు కాలేదు. అట్లే యాంధ్రభాషలో భిన్నకాలికు లగు నన్నయ, శ్రీనాథుఁడు, చేమకూర వేంకటకవి మొదలగువారు భాషావిషయమున భిన్నమార్గములఁ బోయినప్పటికిని నుత్తమకవు లని యాంధ్రభాషాభిజ్ఞు లొప్పుకొనుచున్నారు.

ప్రస్తుతము ననేకు లాంధ్రభాషను గ్రంథములు వ్రాయుచున్నారు. వీరి శైలి యనేకవిధములుగ నున్నది. వీరిలోఁ జాలమంది ప్రాచీనశైలిని వ్రాయుటయె కాక కథావర్ణనాదివిషయములందుఁ గూడఁ బ్రాచీను లేర్పఱిచిన మార్గముల వదలకున్నారు. పూర్వు లంగీకరించిన నియమములను గొంచెమైన వదలుట గొప్ప లోప మని వీరి యభిప్రాయము. దీనివలన నాంధ్రవాఙ్మయములో నూతనమార్గములు మృగ్యములై యున్నవి. మన దేశమునం దాంగ్లభాషావ్యాప్తివలన నాంగ్లవాఙ్మయవైచిత్ర్యము లే కాక యితరపాశ్చాత్యవాఙ్మయవైచిత్ర్యములు గూడ నాంగ్లభాషలోఁ బాండిత్యము సంపాదించిన మనవారికిఁ గొంతవఱకుఁ దెలిసియున్నవి. కాని యీ విపులజ్ఞానఫలము వీరి గ్రంథములం దంతగాఁ గానఁబడదు. దీనికిఁ గారణము లనేకము లున్నవి. ప్రాచీనమైన దంతయుఁ బ్రశస్త మనియు నవీనమైనది శంకావహ మనియు నీ దేశమున జనులకుఁ గల నమ్మకము మొదటిది. సామాన్యముగాఁ బాశ్చాత్యవాఙ్మయానభిజ్ఞు లగు మన పండితులు నూతనమార్గములఁ జూపలేకపోవుటయే కాక వానిని నిరసించుట రెండవది.

శ్లో. పురాణ మిత్యేవ నసాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనే య బుద్ధిః.

అని కాళిదాసు చెప్పెను గాని యాయన యభిప్రాయము మనవా రంతగాఁ బాటించిన ట్లగపడదు. ఆంగ్లప్రభువుల దయచేఁ గళాశాల లభివృద్ధి యగుటవలన నీ దేశమున ననేకవిధముల జ్ఞానము పెరుఁగుచున్నది. కాని యిది కతిపయజనలభ్య మగుటచే దీని సంపాదించినవారు స్వదేశభాషాగ్రంథములం దుపయోగింపని యెడల నాంగ్లభాషఁ జదువని సామాన్యజనుల జ్ఞానము పెరుఁగదు. కనుక నాంధ్రవాఙ్మయవృద్ధిని గోరువారు పాశ్చాత్యవాఙ్మయమార్గములను జూపు గ్రంథములను దెనుఁగున వ్రాయుట యవసరము. ఈపని యాంధ్రసాహిత్యపరిషత్తువారు పూనుకొనఁదగినది.

# ఆంధ్రమాతృస్తవము

గడ్డము కొండారెడ్డిగారు

ఎన్నఁగరాని శైలముల నేవిషయం బలరారుచుండునో?
యెన్నఁగరాని కాఱడవు లేవిషయంబున నిండు గూర్చునో?
యెన్నఁగరాని గొప్పనదు లెవ్విషయంబునఁ బాఱుచుండు? నా
సన్నుతిపాత్రకున్ సుగుణశస్తకు వందన మాంధ్రమాతకున్. 1

ఉ. భీమయుఁ, దుంగభద్రయును, బెన్నయుఁ, గౌతమి, కృష్ణవేణి, యు
ద్దామమహాప్రవాహములఁ దద్దయుఁ బాఱుచు సస్యసంతత
శ్రీమహితంబుగా నలరఁజేయును నెవ్విషయంబు? నట్టి స
ద్ధామయలేశనాశముఁ గరంబు భజించెద మాంధ్రదేశమున్. 2

ఉ. నన్నయభట్టు, భాస్కరుఁడు, నాచన సోముఁ, డథర్వణుండుఁ, బే
రెన్నికఁ గన్నయట్టి సుకవీంద్రుఁడు తిక్కన, రంగనాథుఁ, డే
ఱ్ఱన్నయుఁ, బోతరాజు జననంబయి రేయమ గర్భమందు? నా
సన్నుతిపాత్రకున్ సుగుణశస్తకు వందన మాంధ్రమాతకున్. 3

తే. బౌద్ధజైనాది ప్రతిపక్షవాదివర
మును జయించి వేదంబుల ఘనత నిల్పి
నట్టి శ్రీకుమారిలభట్టు పుట్టినట్టి
యాంధ్రదేశంబు మదిలోన నభినుతింతు. 4

క. మాధవవిద్యారణ్యుఁడు
సాధితజినబౌద్ధయవనజంగమమతదు
ర్వాదుఁడు నిగమాంతవిదుఁడు
వైదికపథలోలుఁ డాంధ్ర బ్రాహ్మణుఁడు కదా! 5

తే. గానశాస్త్రమునం దసమానమైన
ప్రజ్ఞ గలిగియు, వైరాగ్యపరతఁ జోళ
వల్లభుఁడు పిల్వనంపఁ బోవకయ యుండె
నమలభక్తుఁడు త్యాగరా జాంధ్రుఁడే కద! 6

తే. అన్న మిచ్చెద వాఁకలి యడఁగఁ దల్లి!
త్రావఁ బానీయ మిచ్చెదు దాహ మాఱ;
శ్రమను బాపుదు మాపయిఁ జల్లగాలి
వీచి; నీ ఋణ మెట్టుల వీడఁగలము? 7

తే. తల్లియును జన్మభూమియు ధర నొకటియ
యనెడు నార్యోక్తి నిజము కా దంచుఁ దలఁతు;
నెలలు తొమ్మిది భరియించి యలయుఁ దల్లి,
నీవు భరియింతు వాయువు నిండుకొలఁది. 8

తే. రెండుకోటుల కెక్కువై యుండు ప్రజలఁ
బోషణం బొనరించెదు ప్రోడ వీవు;
తరమె? నుతిసేయ నిన్ను సస్మదాదులకును
నల్పవిజ్ఞానమతులకు నాంధ్రమాత! 9

తే. పుణ్యభూముల కెల్లను బుట్టినిల్లు
పరమభక్తుల కెల్ల నావాసభూమి
శౌర్యధనులకెల్ల నాస్థానపీఠ
మనుదినంబు భజించెద మమ్మ నిన్ను. 10

తే. ఎంత దుర్బలులైనను నేకమైన
ఘన ప్రయత్నంబు లొనర్చుచున నిర్వ
హింపఁగల రని యెఱిఁగింపు మీవు తల్లి!
యైకమత్యవిహీనుల మైన మాకు. 11

తే. జనని! నీ పదపద్మసేవన మొకండె
ఘనతరోద్యోగపదవిగాఁ గాంతు మమ్మ!
త్వత్కృపాపూరనిబిడదృక్పాత మొకటి
కేతనంబుగఁ దలఁతు మో విశ్వవినుత! 12

తే. పుట్టినారము నీ గర్భమునను దల్లి!
పెరిఁగినారము నీదు నోగిరముచేత
కట్టినారము నీ విచ్చు పుట్టములను
తల్లిరో! నిన్ను మఱువంగఁ దరమె మాకు? 13

ఉ. వీనుల కింపుఁ గూర్చు పదవిస్ఫురణం దనరారుచుండు స,
మ్మానితమయ్యె నాంగ్లజనమండలి "తూరుపు దేశభాషలన్
గానము మాధ్వమున్న సుకాశముఁ దెల్గున" కంచుఁ బల్క; నీ
మానితవాక్యవైఖరి సమంబులు నీ కిటు లన్యదేశముల్? 14

మ. కుహనారత్నము లెన్నియేని కల వీ గోత్రాస్థలిన్ దుర్లభం
బహహా! యిట్టిది యందు విజ్ఞులవఁగా నత్యంతవిఖ్యాతమై
కోహినూర్వజ్రము చాటుచుండెఁ గద నీ కుక్షిప్రభావంబు నీ
మహి? నాంగ్లేయకిరీటభూషణత సన్మానంబుఁ దా నొందుచున్.

ఉ. పూర్వపు శిల్పవైభవ మపూర్వ మటం చెఱిఁగించుఁ గాదె? దృ
క్పర్వ మొనర్చు స్తూపములుఁ, గట్టడముల్, జయచిహ్నబోధకా
పూర్వమహాధ్వజంబులును, బూజ్యసుశిల్పగుహాగృహంబులున్,
సర్వసుపర్వగేహము లజస్రము నీ తనయాళి కీర్తులన్. 16

ఉ. అక్కనమాదనల్ సచివులై యలరారరె గోలకొండలో?
నెక్కటిఁ బాదుషాహ నెదిరించి పెనంగరె పెక్కుమాఱ్లు నే
ఱెక్కనఁ? దానిశాహకు యశోన్నతిఁ గూర్పరె? యగ్రహారముల్
పెక్కిటి నీయఁజేసి పృథివీస్థలి; వారలు నాంధ్రులే కదా! 17

ఉ. అమ్మరో? యాంధ్రమాత! భవదాత్మజు లెల్లఱు నేఁడు దీనులై
క్రిమ్మఱుచుండఁ గాంచి భవదీయముఖాబ్జము నశ్రుబిందువుల్
గ్రమ్మఁగ మోడ్చె దేల? యిది కాలవిశేషము సుమ్మ, మున్ను లో
కమ్మున నీ తనూజు లధికమ్ముగ తేజముఁ గాంచి మించరే? 18

ఉ. పాడియుఁ బంటయున్ గల సుభాసురగర్భము నీది యైనన్
గూడును గుడ్డ లేక, సుతకోటి రిపింపఁగ నెట్టు ...ర్చెదో
రాడకమాడ? నీకు దయ యుండియు నేమి ఫలంబు? యూర్ధ్వతన్
వీడక నీదు పుత్రులు కవీనపుద్రోహులఁ బోవకుండినన్. 19

ఉ. ఒక్కటియైన లేదు ధర నో యమ! నీ యుదరంబునందునన్
జిక్కనియట్టి వస్తువు, ప్రసిద్ధము సుమ్మిది; యైన నేమి? మా
కొక్కటియైన దక్కదు; ఇది యొక్క విచిత్రమే? వస్తుసంతతిన్
గ్రక్కునఁ జక్కఁజేయఁదగు జ్ఞాన మదొక్కటి లేకయుండుటన్

ఉ. ప్రత్తియు, నిమ్మనుం బరుల పాలికిఁ బంపి తదీయవస్తువుల్
మొత్తములైన విత్తముల ముడ్పుల నిచ్చి గ్రహించి, ధాన్యసం
పత్తిని బంపి క్షామములపాలయి మాడుచు, నీ తనూజు లీ
పత్తియినన్ బ్రతిక్రియలు సల్పరు జ్ఞానము లేకయుండుటన్. 21

మ. పరదేశంబుల కేగి విద్యలను నేర్వంబూని యుత్సాహవ
త్వరులౌ వారిని గాంచి, ధూర్తులు కులం బంచొక్క యడ్డొడ్డి నె
య్యురఁ బ్రోత్సాహము సేసిమాన్పెదరు, తాముత్సాహముద్దక్కఁ బా
లుర పోకుండెద; రెట్లు జ్ఞానలత లల్లున్ మాత! దేశమ్మునన్? 22

మ. కల వెన్నెని ఖనుల్ త్వదీయఘనసద్గర్భంబునం, దైవ న
న్యులపాలై యవి యుండ నేమి ఫల ముండున్ మాకు దేహశ్రమా
ఫలమౌ కూలియ కాక? వాని ధృతిఁ ద్రవ్వంబూను నుత్సాహవం
తులు మాయం దొకరైన నచ్చునకు నెందున్ గానరాకుండుటన్.

ఉ. మాత! భవత్కృపారసము మాపయి సోఁకినయంతమాత్ర నే
పూతులమై ప్రబోధమును బొంది, భవచ్చరణారవిందసే
వాతతచిత్తవృత్తుల నవారణ నెందును మాఱులేక మో
హాతిశయంబు వాసి జగ మంతయు నింపమె కీర్తిచంద్రికల్? 24

ఉ. శీతనగాధిరాజమును సేతువు పశ్చిమపూర్వసింధువుల్
ప్రాతిగ నెల్లలై పరఁగు భారతభూమిని నెల్ల దేశముల్
ఖ్యాతిని జెంది ముందునకుఁ గ్రచ్చఱ వచ్చుచునుండ, నాంధ్రు లే
పాతక మాచరించిరో? ప్రభావము నీ విసుమంత తక్కఁగన్. 25

మ. ఒక కోటీశ్వరుఁ డైన లేఁడు కద! నీ యుత్సంగమున దమ్మరో!
ప్రకటవ్యాప్తినిఁ జెందినట్టి ప్రబలవ్యాపారముం జేయఁ? దా
వక దౌర్భాగ్యము నేమి చెప్ప! నకటా! వైశ్యోత్తముల్ నేఁడు జీ
వికకై యుంచిరి చిల్లరంగడుల దేవీ! యెచ్చటం జూచినన్. 26

ఉ. పాటకపుంజముల్ ప్రబలబాధలపా లగుచున్నవారు ము
ప్పూటను దిండి లేక కఱవుల్ బఱపోటను నాఁడునాఁటికిన్;
స్ఫోటక మాదిగాఁగల పలు సోకుడువ్యాధులు విస్తరించి యే
వీటను గన్నఁ దామ యయి పీనుఁగుపెంటలు సేయుచుండెడిన్.

ఉ. పూర్వుల వైభవంబుఁ గనఁ బూర్వుల యద్భుతరాజ్యపాలనా
ధూర్వహతన్ దలంప సముదోద్ధతశాత్రవసైనికాగ్ని యౌ
పూర్వుల శౌర్యమున్ గనినఁ బొంగు జనించునటమ్మ? నేఁడు మా
గర్వ మడంగుఁగాక ఘనకార్యధురీణుల మెందుఁ గామిచేన్. 28

సీ. శకయవనాదినాయకుల సేనలఁ బాఱఁ
దోలిన శౌర్య మేమూల దాఁగె?
జావాసుమాత్రాప్రశస్తసద్ద్వీప
పాలకత్వాప్తి యేవార్ధిఁ బడియె?
మగధరాజ్యవిదాహి యగుచు వెల్గిన బాహు
విక్రమం బేవినువీథి కెగసె?
ముమ్మాఱు ఢిల్లీశు మూఁకలఁ దోలిన
శౌర్య మేయేటిలోఁ జాఱె నేఁడు?
విజయనగరమహారాజ్యవిభవరక్ష
యవనసైన్యాటవీదావహవ్యవాహ
కీల యెవ్వారి పటుశౌర్యలీల? యట్టి
యాంధ్రు లాంగ్లేయసేన కనర్హు లైరె? 29

తే. సకలసస్యంబు లొసఁగు పండఁబాలు నేల
లకట! యత్యల్పఫలదము లయ్యె నేఁడు;
కర్షకుఁడు కృషిశాస్త్రప్రకారమునను
సాగుసేయమి మాత! దేశంబునందు. 30

క. చాలియుఁ బాలవు విద్యా
శాలలు విద్యార్థులకుఁ బ్రశస్తమనీషా
శాలిత యెటు లలవడు మా
బాలుర కిఁక ననెడు చింత వర్ధిల్లెఁ గడున్. 31

ఉ. వింతగ దేశమందున నవీనముగా నొక శక్తి పుట్టె సం
ఘాంతరశక్తు లన్నిఁటిని గ్రక్కున నొక్కట వెల్వరించు చా
ద్యంతము దేశ మంతటను నాంధ్రజనోద్యమ మంచు; దానికిన్
స్వాంతములందు యౌవనులు స్వాగత మిచ్చిరి భక్తినమ్రులై. 32

సీ. దైనికాంగ్లేయవార్తాపత్రికాస్థాప
నము ముఖ్య మని చాటునట్టివారు
త్వరలోన విశ్వవిద్యాలయస్థాపనం
బవసరం బని పల్కునట్టివారు
తెనుఁగువా రందఱకును నొక్క రాష్ట్రంబు
వలయు నంచని వాదు సలుపువారు
సంఘసంస్కారంబె సకలశ్రేయంబుల
సమకూర్పఁజాలు నం చనెడువారు
సకలసద్గ్రంథముల భాష సంతరింప
మృదుపదమనోహరంబుగా మెఱుఁగుపెట్టఁ
బూనికఁ బ్రయత్నములు సల్పు మానితాత్ము
లీ మహోద్యమచిహ్నంబులే కదమ్మ. 33

క. ఉత్సాహోదగ్రం బొక
సత్సంతతి నీదు గర్భజాతం బయ్యెన్;
వత్సల! వారిం బ్రోవుము
త్వత్సంతానులను భక్తితత్పరులఁ గృపన్. 34

సీ. హైందవు లందఱయందు బలాధికుం
డంచు "మింటో" ప్రభు వాదరింప
నాంగ్లదేశమహాజనాళియు మంత్రులు
సార్వభౌముండును సత్కరింపఁ
దన బాహుబలమును విని విదేశియు లా
హ్వానపత్రిక లంపి యాదరింప
నభినవభీముఁ డీయఘుభుజుం డని
యెంచి దేశజులు మన్నించుచుండ
బాహుబలమునఁ బ్రఖ్యాతిఁ బడసినట్టి
రామమూర్తి భవత్పుత్రరత్న; మాంధ్రు
లబలు లను నింద వాయ ఖండాంతరములఁ
గ్రుమ్మఱుచునున్న వాఁడు శ్రేయమ్ము నాఁక. 35

తే. మాదు పూర్వుల విజ్ఞానమహిమ నిచ్చి
మాదు పూర్వుల ప్రబలసామర్థ్య మిచ్చి
మాదు పూర్వుల సుగుణసంపద నొసంగి
కరుణ మముఁ బ్రోవుమీ నీవు కన్నతల్లి 36

# నిజాము రాష్ట్రములోని యాంధ్రులు

మాడపాటి హనుమంతరావు పంతులుగారు

ఆంధ్ర దేశముయొక్క వర్తమానస్థితిని గుఱించియు, భవిష్యద్దశను గుఱించియు అనేకచర్చలు జరుగుచున్న ఈకాలమున, నిజామురాష్ట్రములో వసించుచున్న యాంధ్రుల స్థితిగతులను మనవారు తెలిసికొనుట యవసర మని వేఱుగా చెప్పనక్కఱలేదు. నిజామురాజ్యముయొక్క విస్తీర్ణము మొత్తము ౮౨,౬౯౮ చదరపు మైళ్లు. వీనిలో సుమారు సగము, అనఁగా ౪౧,౩౪౯ చదరపుమైళ్ల ప్రదేశము ఆంధ్రదేశమునకుఁ జెందినది. ఈ భాగమును ఇచ్చట 'తెలంగానా' యని వాడెదరు. తక్కిన సగమునకు 'మహారాట్వాడీ', అనఁగా మహారాష్ట్రులు నివసించు దేశ, మని పేరు. అయినను ఈభాగమున నివసించువా రందఱును మహారాష్ట్రులు కారు. మహారాట్వాడీకి సంబంధించియున్న యెనిమిది జిల్లాలలో సుమారు నాలుగింటిలో నివసించువారు కన్నడభాష మాట్లాడెదరు. అయినను పరిపాలనాసౌకర్యముకొఱకు పైనఁ జెప్పిన జిల్లా లన్నియు 'మహారాట్వాడీ'వి గానే భావింపఁబడుచున్నవి. రాజ్యమునం దున్న ౧౬ జిల్లాలలో మహారాట్వాడీ జిల్లాలు పోఁగా మిగిలిన ౮ జిల్లాలు' వరంగల్లు, కరీంనగరము, ఆదిలాబాదు, నిజామాబాదు' మెదకు, నల్లగొండ, అత్రాఫ్బల్దా, మహబూబునగరము అనునవి తెలంగానావి. ౧౯౧౧-వ సంవత్సరమున జరగిన జనపరిగణనపత్రములను బట్టి తెలుఁగుజిల్లాల మొత్తము జనసంఖ్య ౬౭,౨౪,౬౯౪. ఇట్లనుటవలన ఈ రాజ్యమున ఇంతకుమించి తెలుఁగువారు లే రని తలఁపఁగూడదు. తెలుఁగుజిల్లాలను పశ్చిమదిశ నంటియున్న మూఁడు మహారాట్వాడీ జిల్లా లగు రాయచూరు, గుల్బర్గా, బీదరులలోఁ గూడ తెలుఁగువా రున్నారు. వీరి సంఖ్య ౮,౦౭,౫౪౭. ఈ విధముగా 'తెలంగానా' వైశాల్యవిషయమున మహారాట్వాడీతో సమముగానే యున్నను, జనసంఖ్యయందు రెండవదానిని మించియే యున్నది. తెలుఁగుజిల్లాలలో అరణ్యప్రదేశములు విస్తారముగాఁ గలవు. రాజ్యమున మొత్తముమీఁద నున్న ౧౮,౦౦౦ చదరపుమైళ్ల వైశాల్యము గల యరణ్యములో ౧౫,౦౦౦చదరపుమైళ్లు తెలుఁగుజిల్లాలలోని వే. ఈయరణ్యము గూడ వాసయోగ్యముగాఁ జేయఁబడినయెడల జనసంఖ్య ఇంకను హెచ్చియుండెడిది. రాష్ట్రమునకు రాజధాని యగు హైదరాబాదు తెలుఁగుదేశములోనే చేరియున్నది. ఇదిగాక, రాజ్యములోని ముఖ్యసంస్థానములగు పాలవంచ, ఆత్మకూరు, జటప్రోలు, గద్వాల, వనపర్తి మున్నగునవి తెలుఁగువే. ఇదియుఁ గాక, గడచిన పదిసంవత్సరముల (౧౯౦౧-౧౧) కాలములో పట్టణములుగా మాఱిన ౯ ప్రదేశములలో ౭ తెలుఁగుజిల్లాలలోనివే. పూర్వపు జనపరిగణనమునాఁటికంటెఁ గడచిన జనపరిగణనమునాఁటికి తెలుఁగుజిల్లాల జనసంఖ్య హెచ్చినది. అనేకసంవత్సరములనుండి మహారాట్వాడీ ప్లేగుజాడ్యమువలనఁ బీడింపఁబడుచున్నది. దానిలోని కొన్ని జిల్లాలయందు వర్షలోపముచేత తఱచుగా క్షామములు సంభవించుచుండును. కాని తెలుఁగుభాగమున నేఁటివఱకు ప్లేగు రాలేదు. ౧౯౧౧-వ సంవత్సరమున హైదరాబాదు పట్టణమున నీజాడ్యము పొడచూపెను కాని మఱల నది వచ్చియుండలేదు. మహారాట్వాడీనుండి పరదేశములకు వలసపోయినవారి సంఖ్యకంటె తెలుఁగు జిల్లాలనుండి పోయినవారి సంఖ్య చాల స్వల్పము. పై సంగతుల నన్నిటిని బట్టి చూడ నిజాము రాజ్యములోని తెలుఁగువారు చాల సుఖులై వృద్ధిమార్గోన్ముఖులై యున్నా రని తోఁచును; కాని వారి యథార్థస్థితిని గూర్చి యింకను గొన్ని సంగతుల నాలోచింపనిదే, ఇట్టి యభిప్రాయమునకు మనము రాఁగూడదు.

బ్రిటిషు హిందూదేశమునందలి ఉత్తమరాజ్యాంగపద్ధతులు నిజాము రాష్ట్రమున అనేకసంవత్సరముల క్రిందనే ప్రవేశపెట్టఁబడియుండుటయును, నేఁటివఱకును పరిపాలనమున సంస్కారములు జరుగుచుండుటయును సర్వజనవిదితము. ఇట్టి సంస్కారముల సందర్భమున అనేకులు మంచి యున్నతస్థానములను బొందియున్నారు. కాని తెలుఁగువారు రాజ్యాంగమునం దేమాత్రమును గొప్ప స్థితికి వచ్చినట్లు గాని, వచ్చుటకై యత్నించుచున్నట్లు గాని కానరాదు. కొన్ని సంవత్సరములక్రింద ఇచ్చటి హైకోర్టు జడ్జీపదవిని ఆకస్మికముగాఁ బొందిన యొక నాయఁడుగారిని వదలివేసితిమేని, హైకోర్టు జడ్జీపదవికి వచ్చిన తెలుఁగువాఁడు లేనేలేఁడు. వైద్యశాఖయందు ఇప్పుడు

పనిచేయుచున్న యొకరిద్దఱిని లెక్కలోనికిఁ దీసికొనని పక్షమున ఉన్నతోద్యోగములందున్న తెలుఁగువారే లేరని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ౧౮౯౫-వ సంవత్సరమున హైదరాబాదునందు శాసననిర్మాణసభ యొకటి స్థాపింపఁబడినది. అప్పటినుండి నేఁటివఱకు ఒక యాంధ్రుఁడేనియు దానిలో సభ్యుఁడగు భాగ్యమును బొందలేదు. పలువురు హిందువులు ఈ రాజ్యమున అవ్వలుతాలుకుదారులుగను, సూబాదారులుగను పని చేసియున్నారు. కాని ఆంధ్రుఁ డెవ్వఁడును నట్టి గౌరవమునకుఁ బాత్రుఁడు కాలేదు. వేయేల? నూఱు రూపాయలకు మించిన వేతనమును గొను తెలుఁగువారిని మనము వ్రేళ్లపైన లెక్కింపవచ్చును. తుదకు, హైదరాబాద హైకోర్టులో ప్రముఖులుగాఁ బనిచేయుచున్న న్యాయవాదులలో ఆంధ్రుఁ డెవఁడైన నున్నాఁడా యని సంశయింపవలసియున్నది. రాజ్యాంగమువారికి మహారాష్ట్రులును కర్ణాటకులును తెలుఁగువారును అందఱును సమానమే కదా. ఇట్టి స్థితిలో తెలుఁగువారి ప్రస్తుతస్థితికి ఎవరుత్తరవాదులో చెప్పవలసిన పని లేదు.

ఇఁక వీరి యార్థికదశ విచారింపఁదగియున్నది. మహారాష్ట్రులవారి కేమి తెలుఁగువారి కేమి, అందఱికిని వ్యవసాయమే జీవనాధారమై యున్నదను మాట వాస్తవమే. కాని అందులో సైతము తారతమ్యము లేకపోలేదు. మహారాష్ట్రులరైతు వర్తకాభివృద్ధికి సాధనములగు మంచిపంటలను —గోదుములు ప్రత్తి మున్నగువానిని —పండించుచున్నాఁడు. అతఁడు వ్యవసాయకుని దశనుండి వర్తకునిదశకు వేగముగాఁ బోవుచున్నాఁడు; కాని తెలుఁగురైతు ఇంకను భోజనమున కవసరములగు వరి మొదలగు పంటలను పండించుటతోనే తృప్తిపొందుచున్నాఁడు. రాజ్యమునఁ గల ౧౮౮ కర్మశాలలలో ౬౫ మాత్రము తెలుఁగుజిల్లాలలో నున్నవి. ఈ ౬౫లో ౧౦ హైదరాబాద పట్టణములోనివే. ఈ కర్మశాలలలో నిజామాబాదలోని పట్టుపని చేయు కర్మశాల తప్ప, తక్కిన వన్నియు ప్రత్తినుండి దూది తీయునవో, వడ్లనుండి బియ్యము సిద్ధముచేయునవో, తైలము తీయునవో యై యున్నవి. (హైదరాబాదలోని కర్మశాలలను గుఱించి మే మీమాట చెప్పుట లేదు.) ఈ కర్మశాలల యజమానులు విశేషముగా పారసీలో తురకలో నై యుందురు. అయినను వీని భాగస్థులలో మాత్రము తెలుఁగువారు లేకపోలేదు. చర్మపుఁబనులలోను నేఁతపనులలోను ముందంజ వేయువారు సాధారణముగా తురకలే. తెలుఁగుజిల్లాలలోఁ గొన్నికొన్ని ప్రదేశములందు చిరకాలమునుండి నేఁతపనియందు ప్రఖ్యాతిగాంచిన పనివాండ్రు కలరు. కాని వారు నవీనపరిశ్రామికసాధనముల యెదుట తలలు వాల్చుచున్నారు. నాగరకము గలదిగా నెంచఁబడు హైదరాబాద పట్టణమున సైతము, వందలకొలఁది మహారాష్ట్రబ్రాహ్మణులు వర్తకవ్యాపారములను కడు సమర్థతతో నిర్వహించుచుండ, వారి సోదరుఁడగు తెలుఁగుబ్రాహ్మణుఁడు వర్తకము తనకు అవమానకరమగు వృత్తియని ఇంకను భావించుచునే యున్నాఁడు. రాజ్యమునఁ గల యినుపదారిలో సుమారు సగము అనఁగా ౮౦౦ మైళ్లవఱకు తెలుఁగుజిల్లాలలో నున్నది; కాని దీని సంపర్కము కొన్ని తాలూకాలకు మాత్రమే లభించినది. ఈ యినుపదారి నంటియున్న కొన్ని స్థలములందు వర్తకము వృద్ధియగుచునే యున్నను, మొత్తముమీఁద మహారాష్ట్రులలో ఇనుపదారి నంటియున్న ప్రదేశములందుఁ గల వ్యాపారవృద్ధి గాని కర్మాగారపరిశ్రమల వృద్ధి గాని తెలుఁగుజిల్లాలలోఁ గానరాదు.

తెలుఁగుజిల్లాలలో నివసించువారియందు చాల భాగము, అనఁగా నూటికి ౮౦ మంది వంతున, హిందువులు కలరు. ఈ రాజ్యములోని తెలుఁగు హిందువుల సంఖ్య, గడచిన జనపరిగణనమును బట్టి ౫౭,౯౩,౫౨౭. తెలుఁగుజిల్లాలలోని ప్రతి ౧౦,౦౦౦ జనులలో ౮,౬౧౫ మంది హిందువులును, ౯౧౧ మంది తురకలును, ౬౬ మంది క్రైస్తవులును ఉన్నారు. మిగిలినవారిలో ఇతర మతస్థులు కలరు. వీరిలో హిందువులసంఖ్య నానాఁటికి క్షీణించుచున్న దను మాట యీక్రింది యంకెలవలనఁ దెలియఁగలదు.—

| సంవత్సరము | ౧౦,౦౦౦ జనులలో హిందువుల సంఖ్య |
|---|---|
| ౧౮౮౧ | ౯౦౫౩ |
| ౧౮౯౧ | ౮౯౮౫ |
| ౧౯౦౧ | ౮౯౧౫ |
| ౧౯౧౧ | ౮౬౧౫ |

మహమ్మదీయుల సంఖ్యయును, క్రైస్తవుల సంఖ్యయును క్రమక్రమముగాఁ బెరుఁగుచున్నది. మొదటివారి వృద్ధికి మతేదైన కారణ మగునేమో కాని వారు హిందువులను తమలోఁ గలుపుకొనుచున్నారనుట మాత్రము సరి కాదు. మహమ్మదీయులు ఇతరమత

ములలోఁ గలయుట యెంత తక్కువగా నున్నదో వారిలో నితరులు గలయుట గూడ అంతేతక్కువ. క్రైస్తవ మతము నవలంబించువారిలో దాదాఁపుగా నందఱును హిందువులే. మహమ్మదీయుని తనవైపున కాకర్షించు కొనుటకు సాధనములు క్రైస్తవమతమున నంతగా లేవు. కనుక హిందూదేశమునందలి యితరభాగములం దెట్లో, యట్లే ఈ రాజ్యమందును క్రైస్తవమతము స్వీయవృద్ధికై హిందూసంఘమునే నమ్ముకొనియుండవలసినదిగా నున్నది. అందులోను, మహారాష్ట్ర్వాడీ హిందువులకంటె తెలుఁగు హిందువులే ఎక్కువగా క్రైస్తవమతమునఁ బ్రవేశించుచున్నట్లు జనపరిగణనసంఖ్యలను బట్టి తేలుచున్నది.

పరమతముల దాడులనుండి హిందూసంఘమును గాపాడుటకై ఈ కాలమున హిందూదేశమున బయలువెడలిన సంస్కరణోద్యమములు నిజామురాష్ట్రమునఁ బని చేయుచుండలేదు. ఎనిమిది జిల్లాల వైశాల్యము గల యీ తెలుఁగుదేశమునందు, తుదకు రాజధానినగరమందైనను ఒక బ్రహ్మసమాజము గాని ప్రార్థనాసమాజము గాని లేదు. హైదరాబాదునం దొకటియును సికందరాబాదునం దొకటియును మొత్తము రెండు ఆర్యసమాజములు కలవు గాని, అవి చేయు పని మిక్కిలి యల్పము. ఆ పనియైనను పట్టణమును దాఁటి యవతలికిఁ బోయినట్లు తోఁచదు. అదిగాక, ఆర్యసమాజవాఙ్మయము దాదాఁపుగా నంతయును హిందీభాషయం దుండుటచేత తెలుఁగుదేశపు జనసామాన్యము దానివలన నాకర్షింపఁబడుట కష్టము. ఇంతకును, సంఘమతసంస్కారోద్యమములు ఇంకను ఇచ్చటివారి కన్నులను విప్పలేదు.

ఈ రాజ్యమువారు విద్యావిషయమున చాల వెనుకఁబడియే యున్నారు. బొంబాయి ప్రాంతమున ౧,౦౦౦లో ౭౦ మందియును, చెన్నపురి ప్రాంతమున ౭౫ మందియును, మైసూరు రాజ్యమున ౬౩ మందియును, బరోడా రాష్ట్రమందు ౧౦౧ మందియును, తుదకు మధ్యపరగణాలలో ౩౩ మందియును చదువుకొనినవారై యుండఁగా, ఈ రాజ్యమున నట్టివారి సంఖ్య ౨౮ కంటె మించదు. హిందూమహమ్మదీయులలో చదువు నేర్చినవారి సంఖ్యలను వేఱుపఱచి చూచినపక్షమున, రెండవవారిలోనే చదువుకొనినవా రెక్కువ గల రనుట కానవచ్చుచున్నది. ఇటీవల ప్రకటింపఁబడిన లెక్కల ప్రకారము, ౧,౦౦౦ మంది తురకలలో ౫౯ మంది చదువువచ్చినవారుండ, హిందువులలో ౨౩ మంది మాత్రమే కలరు. హిందువులలోను మహారాష్ట్రులే తెలుఁగువారిని మించియున్నారు. రాజధానిని వదలివేసినచో, తెలుఁగుదేశమున నున్న మధ్యమపాఠశాలల సంఖ్య ౧౭. ఇఁక మహారాష్ట్ర్వాడీ జిల్లాలలో నిట్టివి ౨౯ ఉన్నవి. పైపాఠశాలలలో ఇంగ్లీషు నేర్పునవి తెలుఁగుదేశమున చాల తక్కువగను, మహారాష్ట్ర్వాడీయందు చాల హెచ్చుగను ఉన్నవి. హైదరాబాదులోని సర్వకలాశాలయందు నేఁటివఱకును ఎఫ్. ఏ., బి. ఏ. పరీక్షలలోఁ గడతేరినవారిలో తెలుఁగువారి సంఖ్య అత్యల్పము. ఎచ్చటనైన నొకరిద్దఱు వెక్కిరించినట్లు కానవచ్చినను వారు ఈ రాజ్యమునకు బయటనుండు తెలుఁగువారుగా నుందురు గాని ఇచ్చటివారు సాధారణముగా కారు. హైదరాబాదునందలి వైద్యకలాశాలయం దేమి శిల్పకలాశాలయం దేమి విశేషసంఖ్య మహారాష్ట్ర్వాడీ విద్యార్థులదే కాని తెలుఁగువారిది కాదు. పరిశ్రామికవిద్యాలయములందును తెలుఁగువారు సామాన్యముగాఁ గానరారు. ఇచ్చటి న్యాయశాస్త్రముల బోధించు తరగతిలో సైతము మహారాష్ట్ర్వాడీవారి సంఖ్య తెలుఁగువారి సంఖ్యకంటె నెన్నియో రెట్లు మించియున్నది.

విద్యాస్థితి యిట్లుండ, వీరిలో గ్రంథకర్తలు గాని పత్రికాసంపాదకులు గాని లేనేలేరని చెప్పనేల?

బ్రిటిషు హిందూదేశీయులకు లేని చిక్కొకటి ఈ రాజ్యమువారి నెదుర్కొనుచున్నది. అ దేదన, అచ్చట ఇంగ్లీషు, దానితో దేశభాష; ఈ రెండే కావలసియున్నవి. ఇచ్చట ఆ రెంటితోఁబాటు ఉర్దూ కూడ వచ్చిననే కాని పని సాగదు. కనుక ఇచ్చటి విద్యార్థి మాతృభాష నేర్చుకొనుటయందు కొంతకాలమును, ఉర్దూ నభ్యసించుటయందు కొంతకాలమును ఇంగ్లీషుకొఱకు మఱికొంతకాలమును గడపవలసియున్నాఁడు. అనఁగా అచ్చటి విద్యార్థికి ఉన్నతవిద్యాభ్యసనవిషయమునఁ గల సౌకర్యము ఇచ్చటి విద్యార్థికి లేదు.

ఇఁక వీరి మాతృభాషను గుఱించి విచారింతము. నిజామురాజ్యమునందు తెలుఁగుభాష మాట్లాడువారి సంఖ్య ౬౩,౬౨,౯౨౮. వీరిలో వెనుకఁ జెప్పిన ప్రకారము, మహారాష్ట్ర్వాడీ జిల్లాలలోనివారికి తెలుఁగు నేర్చుకొను నవకాశమే లేదు. తెలుఁగు జిల్లాలలోనివారి స్థితి వీరి స్థితి కంటె కొంచెము నయముగానే యున్నను, మొత్తము

మీఁద తృప్తికరముగ మాత్రము లేదు. ఆరంభవిద్య తెలుఁగున నేర్పు పాఠశాలలు చాల గ్రామములలో నున్నవి కాని, అంతమాత్రమున జనులకు లభించు జ్ఞానము స్వల్పము. మధ్యమపాఠశాలలలో తెలుఁగు రెండవ భాషగాఁ జదువుకొనుటకు మాత్రము వీ లున్నది. హైదరాబాద కలాశాలలో తెలుఁగు బోధించు నేర్పాటులు కలవు గాని దానివలనఁ గూడ లాభము లేదు. దానికి కారణములు రెండు గలవు. మొదటిది విశ్వవిద్యాలయమువారు విధించిన క్రొత్త నియమముల స్వభావము, రెండవది ఈ రాజ్యమువారు ఉర్దూనో పారసీనో రెండవ భాషగాఁ దీసికొనఁగోరుచుండుట. మధ్యమవిద్యాపరీక్షలో తెలుఁగు రెండవభాషగాఁ దీసికొనువారి సంఖ్య దినదినము సన్నగిల్లుచున్నది. ప్రాఁతపద్ధతిని సంస్కృతమందును ఆంధ్రమునందును కొంత పాండిత్యము కలవారు కొందఱు అక్కడక్కడ, ముఖ్యముగా వరంగల్లు, కరీంనగరము, నల్లగొండ జిల్లాలలో నున్నారు; కాని వారి కెట్టి ప్రోత్సాహమును లేకపోవుటచేతను, గ్రంథరచనచేత నిప్పటివారి నాకర్షించు యోగ్యత వారియందు లేనందువలనను, ఏమూలనో కూర్చుండి యక్షగానములనో హరికథలనో శతకములనో వ్రాసికొని బ్రతుకవలసినవారై యున్నారు.

ఇఁక ఇచ్చటి తెలుఁగువారు మాట్లాడు భాషను జూతము. ఈ సందర్భమున నింకొక మాట చెప్పవలసియున్నది. ఈ రాజ్యములోని తెలుఁగుభాషకు ఉత్తరముననను, కొంతవఱకు పశ్చిమముననను మహారాష్ట్రభాషతోను, కొంత పశ్చిమముననను, దక్షిణముననను కన్నడభాషతోను సమ్మేళనము కలుగుచున్నది. తక్కిన యన్ని భాగములలోను, అందు ముఖ్యముగా పట్టణములందు, ఉర్దూభాషాసంపర్కము వీడఁజాలనిదై యున్నది. ఈ కారణములవలన పైనఁ జెప్పిన ప్రాంతములవారి యాచారవ్యవహారములందువలెనే వారి భాషయందుఁ గూడ ఎన్నియో మార్పులు వాటిల్లినవి. ఆదిలాబాద నిజామాబాద ప్రాంతములందు వసించువారు సంభాషించునప్పుడు మహారాష్ట్రభాషలోని శబ్దములును వాని యపభ్రంశస్వరూపములును తఱచుగా వచ్చుచుండును. "ఇదే మ్రామాయ్[1]: రొండు[2] దివ్సలు[3] ఆయె. ఏ... కు[4] పోవు. ఇదేమి దైవము[5]. ఏన్గు సొండెము[6] ఏదిరా? కాకకు[7] మావుశీ[8] భేటీ[9] కాలేదు." ఈ వాక్యములు వారిభాష కుదాహరణములు. ఇఁక మహబూబునగరములోను, అత్రాప్సబల్దా జిల్లాయొక్క పశ్చిమభాగములోను నివసించువారి భాష కర్ణాటకుల సంపర్కమువలన కన్నడభాషాశబ్దములతో నిండియుండును. "మా సణ్ణ[10] పిల్లకు పెసర బేడలు[11] పట్టవు[12]. ధొడ్డ[13] పిల్ల బేకైనంత[14] తింటది." ఇవి రెండనవారి భాషకు దృష్టాంతములు. ఇఁక ఉర్దూతో సంభవించిన కలయికచేత తెలుఁగు బాసకు కలిగిన దురవస్థ చూచితీరవలసినది కాని ఇట్టిదని చెప్పుటకష్టము.

* "ఈ మొకద్దమాలో చలాయించిన కార్రవాయి అంతా జారీది. సాహెబు జిలాజాయమొక్కాకు పోయి తనకీకా చేసి కైఫియ్యతు రాసినాడు గదాకె ఫరీఖుదావా ఓలూకులు నాజాయజు ఆయిందా ఈతౌర్న కార్రవాయి చేసిన సూరతులో మాఖూలుతదారకు చేయటం కాగలదు. ఫక్తు మర్కుంచంకు 16 ఫర్వర్దిసక తేరా సాబారా ఫసలీ."

ఇది స్వల్పముగా వీరిభాష కుదాహరణము. ఇఁక తూర్పునైపున, అదృష్టవశమున ఉత్తరసర్కారుల వారి సంసర్గము భాషను కొంతవఱకు బాగుచేసినది. ఈస్థితులు గ్రామ్యభాషావాదులు గమనింపఁదగినవిగా నున్నవి.

ఈ రాజ్యములోఁ గడచిన ౧౦-౧౨ సంవత్సరముల క్రిందట స్థాపింపఁబడి, తమ శక్తి కొలఁది దేశభాషాప్రచారము చేయుచున్న ఆంధ్రభాషానిలయములను శేర్కొనకుండ ఈ వ్యాసమును బూర్తిచేయఁజాలము. హైదరాబాద, సికిందరాబాద, హనుమకొండ, ఖమ్మముమెట్టు, ఎల్లుపాలెము మున్నగు స్థలములం దిట్టి నిలయములు కలవు. వీనిలో హైదరాబాదలోనిది మొట్టమొదటిది. దాని స్థాపకులలో కీ. శే. రావిచెట్టు రంగారావుగారు ముఖ్యముగాఁ జెప్పఁదగియున్నారు. పైనఁ జెప్పఁబడిన నిలయములలో దాదాఁపుగా నన్నియును మునగాల జమీందారులును మాతృభాషాపోషకులును నగు శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారి పోషకత్వము ననుభవించుచున్నవి.

---

1. తల్లి. 2. రెండు. 3. దినములు. 4. బడి. 5. అదృష్టము. 6. తొండము. 7. పినతండ్రి. 8. పెత్తల్లి. 9. దర్శనము. 10. చిన్న. 11. పప్పు. 12 ఇష్టముండవు. 13. పెద్ద. 14. కావలసినంత.

* 'ఈ వ్యవహారములో జరిగిన చర్య యంతయును తప్పున్నది. జిల్లాఅధికారి వివాదస్థలమునకు పోయి విచారణచేసి, 'తక్షీదారు చెప్పు సంగతి కేవలము అక్రమము, గుండు ఈ ప్రకారము చర్య చేసినపక్షమున తగినట్లు మందలింపఁబడును' అని వ్రాసియున్నాఁడు. ౧౬ ఫర్వర్ది ౧౩౧౭-వ ఫసలీ సంవత్సరము.''

# శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

అత్తిలి సూర్యనారాయణ గారు

ఈ మహాశయుఁడు దేవేంద్రనాథమహర్షితల్లజు కనిష్ఠ పుత్త్రుఁడు. ఈయన బార్హస్పత్యమానము 1268-వ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము 1860-వ సంవత్సరమున జనన మంది, నైదేండ్ల ప్రాయమున రామాయణమహాభారతసంగ్రహములఁ బఠించి, యెల్లరకు నామోదముఁ గూర్చుచుండె. కాశీఘట్టమున నా రవీంద్రుఁడు నార్మల్ స్కూలులోఁ జదువుచుఁ దొమ్మిదేండ్లవాఁడుగా నుండినపుడె కవితారచనము నారంభించి, సకలజనమనోరంజకుఁడై, యుపాధ్యాయుల క్రమశిక్ష నందుచు గౌరవింపఁబడుచుండెను. ఈ విధముగా విద్య నభ్యసించినపిమ్మటఁ, దండ్రిగారితో బోల్పురమున కరిగి, యచ్చటఁ గొంతకాల ముండెను. ఈ సమయమున జనకుని సాన్నిధ్యమున జ్యోతిష, సంస్కృత, వ్యాకరణ, శిక్ష నంది, చిన్నన్నగారైన సత్యేంద్రనాథుల నివాసమగు నామోదాబాదునకుఁ జని, కొంతకాల మచ్చట నుండెను. అచ్చట నున్నపుడె, రవీంద్రుఁ డింగ్లీషుభాష నభ్యసించెను. అప్పు డతనికిఁ బదునాఱువత్సరముల వయస్సు. ఆవయస్సునందె యాతఁడు భారతీపత్త్రికలోఁ దన ప్రబంధములఁ బ్రకటించుట కారంభించెను. అనంతర మతఁడు లండనుమహానగరమున కరిగి, యూనివర్సిటీ కళాశాలలో నాంగ్లేయసాహిత్యశిక్ష నందెను. అప్పుడె యాతఁ డొక్కమాఱు యూరపుఖండమందలి దేశములఁ జూడఁగలిగెను. కుటుంబగౌరవమునకును సాహిత్యవిశేషమునకు నేమేని సంబంధ మున్న, రవీంద్రనాథునకు మఱి యభ్యర్థనీయ మగున దావంతయు లేదని "యిండియన్ వర్ల్డు" పత్త్రికాప్రవర్తకు లయిన శ్రీ వసంతకుమారరాయలు వచించిన వాక్యమున నెంతేని సత్య మిమిడియున్నది. భూస్వామియై, యశశ్చంద్రికల నెల్లయెడలఁ బఱపఁగలిగిన న్యాయవాదియై, పత్త్రికాప్రవర్తకుఁడై, న్యాయకళావిషయికగ్రంథకర్తయై, యాంగ్లహైందవసంఘస్థాపకాధ్యక్షుఁడై, వంగసంగీతపరిషన్నిర్వాహకుఁడై చెన్నొందిన శ్రీ రాజా శౌరీంద్రమోహన టాగోరును, మఱి చిత్రకారుఁడై, హైందవప్రాచీనకళలఁ బునరుజ్జీవింపఁజేసి విఖ్యాతి నందిన యవనీంద్రనాథటాగోరును, రాజ్యాంగవిషయికగ్రంథకర్తయై ప్రముఖుఁడై ప్రతిభఁ గాంచిన మహారాజ రామనాథ టాగోరును, మఱి రవీంద్రపితామహులై, సహగమనఘోరతరాచారము నంతమొందింపఁ బాటుపడినవాఁడయి యలరిన ద్వారకానాథటాగోరును, మన రవీంద్రుని పితామహులై యుండిరి.

వంగసాహిత్యమున రవీంద్రనాథుని స్థానము సామాన్యమైనది కాదు. అతని గీతకావ్యములును, మహోన్నతభావాత్మకగ్రంథరాజములును, నాటకచిత్రవచనకావ్యములును, రాజనీతివిషయికప్రబంధములును, స్వదేశభక్తివిషయికపద్యావళులును, మఱి యావాహనకవిత, స్తోత్రసల్లాపకవిత్వము, కౌతుకకవిత, గాథలు, ప్రశస్తదివ్యకవిత, మఱి యెన్నేనియు, మఱి యెవ్వానికి సాధ్యము గానిరీతి, నొక్కట ఘనత వహించిన వయ్యె. ఈమహాపురుషునిచే నిట్లు రచియింపఁబడిన గ్రంథము లనేకములు గలవు. ప్రాచీనసాహిత్యము, లోకసాహిత్యము, ఆధునికసాహిత్యము, రాజు—ప్రజ, సమూహము, సమాజము, స్వదేశము, శబ్దతత్త్వము, ధర్మము, విద్యాసాగరచరిత్ర, రామమోహనరాయలు, శాంతినికేతనము, గోరా, నౌకాడుబీ, బౌఠాకురాణీర్హాట్, రాజర్షి, నష్టనీడ, గల్పగుచ్ఛము ( 5 భాగములు ), రాజారాణి, మానసి, కోమల, విసర్జనము, చిత్రాంగద, బిదాయ్‌అభిశాపము, ముకుటము, డాక్‌ఘర్, రాజా, శారదోత్సవము, ప్రజాపతినిబంధనము, హాస్యకౌతుకము, వ్యంగ్యకౌతుకము, ప్రాయశ్చిత్తము, సంధ్యాసంగీతము, ప్రభాతసంగీతము, ఛోఖేర్‌బాలి, నైవేద్యము, మాలిని, గీతాంజలి, గానము,

కణిక మున్నగు నుత్తమగ్రంథముల నెన్నిటినో రచించి 1912-వ సంవత్సరమున రవీంద్రుఁ డేష్యాఖండమందలి విద్వత్కవికోటిలో నగ్రగణ్యుఁ డని పాశ్చాత్యులచేఁ గొనియాడఁబడి, లక్షకుమించిన బహుమాన మంది, భరత ఖండమున కింతింతనరాని కీర్తి గడియింపఁగలిగినవాఁ డయ్యె.

ఈమహాకవి సువిశాలలలాటముతో, మనోహర శిరోజములతో, సమున్నతద్యుతుల నీను నెమ్మోముతో, సుకోమలకరంబులతో, సుమధురకంఠనాదముతో, మందమందహాసములతో, రసభరితసంభాషణములతో, మఱి సహజసత్స్వభావముతో నొప్పారుచు, నిఖిలజనమనోహరమూర్తియై నెగడుచుండును. ప్రభాతవేళ జగత్సౌందర్యము, మాధుర్యము రవీంద్రుహృదయము హరియించుచుండును. వీధులలోని సామాన్యజనఘోషములు, గాలి పడగల ధ్వనులు, నారామములోని నారికేళాదివృక్ష సంతతుల సోయగము మున్నగున వెల్ల నీతనికి సర్వేశ్వర సందర్శనప్రాప్తిఁ గలిగించుచుండును. బాల్యమునందె యాతఁడు నిరంతరము విద్యాలయమందె యుండక, ప్రకృతి సౌందర్య మాహ్వానము సేయునపుడెల్ల నవ్వలికిఁ బోయి, యానంద మందుచుండును. సాధారణముగా బాల్యమున నెన్నఁడును దీక్షమైఁ బాఠము లభ్యసించు స్వభావము కలవాఁడు కాకున్నను, పరీక్షలు జరుగువేళల నగ్రస్థానమునసె యవలీలఁ దేలుచు నుపాధ్యాయుల నచ్చెరు వందఁ జేయుచుండెను.

తన తనయుని స్వభావ మెఱింగియ యుంటచే, జనకుఁడైన దేవేంద్రనాథమహర్షి, తనతో నీతని హిమవత్పర్వతములకుఁ గొనిపోవుచుండెను. సూర్యాస్తమయ మైన తరువాత సందునకై రవీంద్రుఁడు పయనముసేయ వలసివచ్చినపుడు, తాత్కాలికము లయిన చీఁకటులఁ జూచుటకంటె, మఱునాఁడు ప్రభాత మగువఱకుఁ గన్నులు మూసికొని యుండుటె యుత్తమపక్ష మని యెంచి, భానూదయ మగువఱకు నట్లె చేయుచువచ్చెను. హిమవన్నగమున కరుగుతోడనె, ప్రకృతిసౌందర్యము ననుభవించి, యాతఁ డందిన యానందము నే మని చెప్పవచ్చును! అచ్చోటనె దేవేంద్రనాథమహర్షి యాస్తిక్యబుద్ధి నీతనికిఁ గఱపె. అచ్చోటనె యామహాత్ముఁ డింగ్లీషు, సంస్కృతము, బంగాళీ మున్నగు భాషల రవీంద్రునకు నేర్పె. అచ్చోటనె, వృక్షశాస్త్రమును ఖగోళశాస్త్రమును, రవీంద్రుఁడు దేవేంద్రనాథగురూత్తము పదములకడ నిలిచి యభ్యసింపఁగలిగె.

అప్పటి కతనివయస్సు పదునొకండు వత్సరములు దాఁటి యుండ లేదు. అప్పుడె రవీంద్రుని ప్రియమాతపరలోకమున కరిగె. అపుడప్పుడె రవీంద్రుఁడు సహజముగాఁ బద్యములు నుడువఁజొచ్చెను. అప్పుడె బంగాళాభాషలోని యత్యుత్తమకావ్యముల నతఁడు పఠించుచుండెను.

తన తల్లి గతించినప్పు, డింక నీ మహావిశ్వమె తన జనని యని విశ్వసించి, గంగానదీతీరమందలి చంద్రనగరమున నాతఁడు వసియించుచుఁ బ్రకృతి నారాధింపసాఁగెను. హిమవన్నగముపొంతను, భాగీరథీతీరమునను, భక్తిమైఁ గూరుచున్న కారణమున విశ్వేశ్వరారాధనపరుఁడై, విశ్వమును బ్రేమించువాఁడై, గంగాతరంగిణీ సుమధురగానమున్ గ్రహింపఁగలిగి, హిమాలయ స్వచ్ఛతఁ బడయఁగలిగి, గంభీరధ్వనిప్రధానకావ్యముల నాతఁ డవలీలఁ జెప్పఁగలిగె.

అర్ధరాత్రమప్పుడు శశ్వచ్చంద్రికలు

"గంగామాయి"ని దరంగములు వెలయఁ జుంబించువేళల, సమున్నతతరంగముల నిజకరంబుల నమృతమూర్తి యగు నిశాకరు నాలింగన మొనర్చు నవసరముల, నీ మహాకవీంద్రు భావనాశక్తి దృఢపడి, గృహాంగణమున నాసీనుఁడై నక్షత్రముల నవలోకించుచు, నా వియన్మార్గము ననుసరించియ తన యాశయములఁ బఱపుచు రాత్రులఁ బుచ్చుచుండ, విశాలహృదయము గలవాఁడై, మహోన్నతచింతనల నాఱు వత్సరములు గడపినవాఁ డయ్యె.

ఇట్లీ కవిలోకచక్రవర్తి సువిచారశీలుఁడై, యాంగ్ల బంగాళాసారస్వతపరిజ్ఞాతయై, తన సోదరి యైన శ్రీమతి స్వర్ణకుమారీదేవీవిదుషీమణిచే సంపాదింపఁబడుచుండిన భారతీపత్రికాగత్నమునకు వ్యాసములు వ్రాయుచుండు

వాఁడు. అంతఁ బదునేడవ వత్సరమున యూరపుఖండమున కరిగి, యచ్చటినుండి వ్రాయుచువచ్చిన లేఖలవలన, నితఁడు తా నింగ్లీషు బంగాళీ భాషల నెంత విశేషజ్ఞానము సంపాదించెనో తేటపడుచుచుండెను. ఇంగ్లీషుభాషయం దైన నీ కవిపుంగవుతో సమానముగా నిర్దుష్టవిధంబున వ్రాయఁగలవా రరిదిగ నుందురు.

రవీంద్రనాథుని ప్రజ్ఞ కూలంకషమైనదిగాఁ గొనియాడఁబడుచున్నది. అతఁడు గంభీరతత్త్వశాస్త్రవేత్త; యాధ్యాత్మికవిషయజ్ఞపురోగామి; సూక్ష్మదృష్టిసంపన్నుఁడు; దేశభక్తాగ్రేసరుఁడు; చారిత్రాంశమర్మజ్ఞుఁడు; గానవిద్యావిశారదుఁడు; సాధన, వంగదర్శన, భారతీ, తత్త్వబోధినీ, పత్త్రికా ప్రవర్తకుఁడు; దూరదర్శి యగు బోధకుఁడు; "వాల్మీకిప్రతిభా" నామకనాటకమున వాల్మీకిపాత్రముం బూని సరసాభినయ మొనర్చిన ప్రౌఢ; మఱి, కృపాయత్తచిత్తుఁ డయిన ప్రభువు. ఇన్నిటికన్న మిన్నగా, రసముల నొలికింపఁజేయు కవిగ్రామణి. మఱి, యాఱేండ్లకు మున్ను బంగాళారాష్ట్రీయరాజ్యాంగమహాసభకు నగ్రాసనాధిపతిగ నెన్నుకొనఁబడి, యపూర్వరీతి, నద్భుతవిధంబున, స్వశక్తివిశ్వాసమును బలపఱిచిన యసమానరాజ్యతంత్రజ్ఞుఁడు.

అతనిహృదయాంతరములనుండి ప్రేమప్రవాహమవిచ్ఛిన్నమై, వివిధరూపములఁ దాల్చి, వివిధదేశగామియై, జ్ఞాతాజ్ఞాత మితామిత విషయ సంచారిణియై, వర్తిల్లుచుండును. ప్రేమ రూపొందిన వివిధస్వరూపముల, మాతాపుత్త్రుల, భార్యాభర్తల, ప్రకృతిజ్ఞానామృతపానమత్తుల, సర్వేశ్వరభక్తిపారవశ్యుల, స్వభావముల నెల్ల మృదుతరలీల నాతఁడు చిత్రించుచు, షెల్లీ కీట్సు మహాకవుల జ్ఞప్తికిం దెచ్చుచుండును. రవీంద్రు పద్యములు విన్నతోడనే, నొడ లెల్లఁ బులకరించును; గుండె జల్లు మనును; గనుఁగొలఁకులనుండి వారిపూరములు ప్రవహింపఁజొచ్చును. అన్యకవిపుంగవులవలెనె, వివిధజీవితానురాగవిలసనముల వర్తిల్లియున్నవాఁ డగుటచే, నంచితానురాగవర్ణన మాతని సొమ్మయ్యె. గద్యకవీశ్వరుఁ డనందగు టాల్‌స్టాయి వలెనే, యాతఁడు చక్షుశ్శ్రోత్రాదీంద్రియవిషయముల భజియించుచుఁ గ్రమముగా యోగశాంతిం బడయఁ గలిగె. దివ్యానురాగముచేఁ గలుగు గగుర్పాటులఁ, గాల్పనిక కళావిలసనముల, సత్యాశా సంజనితాంధకారముల, నిరాశాగాంభీర్య శాంతిగభీరతా సచ్చిదానందా ద్యనుభవముల, నాతఁ డెఱుంగక యుండలేదు. ఝరీవేగతుల్యమైన యౌవనదశాప్రవాహము లీతని నజ్ఞాతరీతిఁ జుట్టుకొనినప్పుడు కాల్పనికకళానురాగములె యీతనికిఁ బొడకట్టుచు వచ్చెను. చిరపరిచితము లయి యుండిన వస్తుసంతతు లెల్ల, నీతని కంతటినుండి నవ్యతరశోభాయమానములై కానవచ్చెను.

ఈనవ్యతరవీక్షణమునుబట్టి, నిక్కముగఁ బ్రకృతియందె మార్పు కలిగెనో, తనయందె మార్పు కలిగెనో యతనికిఁ దెలియలేదు. ఏవంవిధనవ్యతరానురాగము కలిగినతోడనె, భోగపరాయణుఁడై, మృదుతరాంబరధారియై, కౌశేయాభిలాషియై, ప్రబంధకవియై, దేవేంద్రనాథగురూత్తముకడఁ గైకొన్న పరమేశ్వరభక్తి నన్నిట వర్తిల్లఁజేయుచుఁ, గొంతకాలముఁ గడపెను. అప్పుడాతఁడు రచించిన పద్యముల నన్యులవలన వినినప్పుడు, "శృంగారపద్యము లివి యెంతన కిస్సీ!" యనినవారు, రవీంద్రవిరచితము లని తెలియవచ్చినతోడనె, "యహహా! మరలఁ జదువు! మరలఁ జదువు! ఏదో మహత్తరమైన యర్థ మం దుండితీరవలయు" నని క్రమ్మఱ విని, దానిం గ్రహించి, యానంద మందుచుండువారు.

అందుఁ గొన్నిటి నిట నాంధ్రీకరించువాఁడ.—

మ. అదిగో! రమ్ము ప్రియా! మదీయసుఖదం బై యొప్పు నారామమం
దదటుం బాసి, పదంబు లల్లన నిడన్ హర్షంబు సంధిల్లు; నె
మ్మది మై మామకపుష్పసంచయ మెటన్ మాధుర్యసౌందర్యముల్
వెదచల్లున్ గనుఁగొమ్ము! సౌరభములన్ శ్రేణించుచున్ బుష్పాళికన్
విదలించున్ మృదుగంధవాయువు లెటో, వీక్షింపు! మందప్రభల్
పొదలన్ జంద్రిక లెట్లు నిల్చెడినొ! యాపుల్ చల్లఁగాఁ గానలం
దొదవున్ వ్యాపించు తేఁకునో ధవళతన్ యోగ్యస్థితిన్, గాంచుమా!
యిదిగో! నీ యమృతప్రసూనముల హాయిన్ పోయగంబున్ బ్రదీ
ప్తిదమై క్రాలఁగ నింత గాంచుదము; స్వాప్తిన్ మాలికల్ గూర్చి, యా
యుదయం బందెడివేళ వాడుటను, బ్రత్యూషప్రభన్; జూత మీ

మృదులారామమునందు రిక్తగములున్ హీనస్థితిం బొందఁగాఁ;
త్రిదివానంద మొసంగఁజేయుదము సంప్రీతిన్ వియద్గానమున్
బదిలంబొప్పఁగ, ఝల్లనన్ హృదయముల్ ప్రాణంబుతోఁ దేఁజే, య
భ్యుదయం బౌనటు లేఁబవల్ గడపి, సంపూర్ణానురాగాధిపున్
మదిఁ గొండాడుచు నేకతం దలఁచి స్వప్నం బట్టు లెల్లన్ జనన్.

మఱియు, నిర్మలదేశభక్తిని బుఱికొల్పునట్టి రవీంద్రనాథకీర్తనముల నహరహంబు నెందఱెందఱో పాడుచు, నున్నతి నందుచుందురు. గంగాతరంగిణియందు జలావగాహన మొనర్చుటకై తండోపతండములుగా నరుగువారు, ప్రభాతవేళఁ బరబ్రహ్మనామ ముచ్చరించుచు మేలుకొం డని పురవాసుల నుద్బోధించువారు, మైదానములందు వృక్షములనీడలఁ బసుల నిలిపి యాటలాడుచుండువారు, నదిలోఁ బడవలు నడుపువారు, చాకిరేవుల బట్టలు గుంజువారు, సూర్యాస్తమయవేళల సంధ్యారాగముం గీర్తించువారు, వివాహవేళల మంగళగీతములఁ బాడ నభిలషించువారు, మఱి దేశభక్తిం బురికొల్ప నెంచువారు, దేశీయమహాసభలందుఁ గూడువారు, నెల్లరు రవీంద్రకవీంద్రవిరచితము లయిన పాటలనె పాడుచు, సంతోషవార్ధి నోలలాడుచుందురు.

రవీంద్రుఁడు మాతృదేశభక్తిఁ బ్రజ్వలింపఁజేయుటకై స్వదేశవాసుల మానసముల నత్యంతానురాగముల హత్తించుచుండును. పొట్టలు విచ్చి క్షేత్రముల నల్లలనాడుచుండు వరికంకుల, మందమందహాసములు చేయుచుండు వివిధప్రసూనములఁ, గమ్మతావుల వెదచల్లు పుష్పగుచ్ఛముల, మధురరుతములు సేయు విహంగముల, భీప్రదము లగు భూధరంబుల, నతలసుతలము లగుచుండు విపణివీథుల, నంచితమాధుర్య మొలికించుచుండు గృహాంగణముల, నిలువచేసికొన్న ధాన్యరాసుల, బాలకు లాడుచుండు విహారస్థలమ్ముల, నెల్ల నీ కవిలోకచక్రవర్తి కీర్తించుచు, భరతమాతృస్తోత్రముం గావించుచుండును.

అనన్యసామాన్యమైన శైలితో, నపూర్వభావములతో, సముచితమాధుర్యముతో, హైందవాచారముల తెఱం గెఱింగి, యధునాతనసాంకేతికపదముల నుపయోగించి, స్వదేశసేవం బుఱికొల్పుచు, వివిధముల నెల్లరఁ గ్రియాచరణపరత్వమునకుఁ బ్రోత్సహించుచుండును. స్వార్థసమర్పణముం గూర్చి, స్వదేశము నుద్దేశించి, రవీంద్రుఁ డిట్లు నుడివె.——

తే. అమ్మ! భారతమాత! మాయమ్మ కాన!
ముందు నాదు దేహప్రాణములను నీక
యర్పణము సేయువాఁడ; నాయంబకములు
నిన్నుఁ గూర్చి యశోకించుచున్న వెపుడు;
నిన్నె వినుతింప నా పద్య మెన్నుచుండు;
నా కరంబులు బల మఱినన్ త్వదీయ
సేవఁ గావింప నే యెప్డు చింత సేయు;
నక్కటా! త్రుప్పుపట్టె నా యాయుధములు
పడియయున్నను నీబంధ మెడలఁజేయు.

మఱియొకచోట నీ దేశమాత నిట్లు నిందించుచున్నాఁడు.——

గీ. అమ్మరో! నీదుతనయుల నధికనీచ
వృత్తిని గమండలువులఁ జేయెత్తి బిచ్చ
మడుగ, నెవ్వరు తా ముర్వ నభిలషింత్రో
వారి చెంతకె నీ వేల పనిచె దమ్మ?

ఇట్లు, స్వదేశప్రేమవిషయికములు, నావాహనస్తోత్రానతిగభీరవిషయసంబంధములు, చిత్రాతిచిత్రములు నగు పద్యావళులఁ, గథల నెన్నేని రవిబాబు వ్రాసియుండి, యనన్యసామాన్యవిధమున నఖిలజనుల రంజింపఁగలిగె. నిసర్గకవిత్వలహరీపరంపర కందరాని దెయ్యది కలదు? కర్మవీరుఁడయిన కవీంద్రునిచేఁ బవిత్రతరముగఁ జేయఁబడని దెం దుండనోపు? "చండకరుని రూక్షవీక్షణములకు బెగ్గడిలి మహానభంబు కంపించుచున్న నేమి? నిదాఘవేళల నుష్ణతాచ్ఛాదనములఁ గప్పికొని యెడారినేలలు హాహాకారములు సేయుచున్న నేమి? భవదీయహృదంతరమున నానందరస మడుగంటి-పోయినదా? అడుగిడినయెడల నెల్ల, బాధనందుచున్న మహాపథంబులు సుమధురనినాదములనె కావించుచుండ లేదా? "ఉత్తిష్ఠత జాగ్రత్ ప్రాప్య!" యని గీతాంజలి యొనర్చిన రవీంద్రకవీంద్రుం గని, దివ్యభారతజనని శాంతికుటీరమునఁ బ్రవేశించి, శుభాశీస్సుల నెల్లకడలనుండి ప్రతిధ్వను లీనఁజేయుచున్నది. భక్తవరులైన కవీంద్రులు గలుగు దేశమున కెన్నండును వినాశము లేదని దిక్కులు పిక్కటిల నొక్క దివ్యధ్వని వినవచ్చుచున్నది.

## కవీంద్రుఁడె యోగీంద్రుఁడు

రవీంద్రనాథకవీంద్రుఁడు తా సన్యదేశముల బహుమానముగఁ బడసిన లక్ష యిర్వదివేల రూప్యముల నెట్లు వినియోగించునో యను సంశయముం గూర్చి పెక్కండ్రు భిన్నభిన్నాభిప్రాయము లందఁజొచ్చిరి. యోగీంద్రుఁడె కాక యున్నఁ గవీంద్రనామమున కర్హుఁడె కాఁడు. కవీంద్రుఁ డయిన రవీంద్రుఁడును, భక్తాగ్రేసరుఁడును తన జనకుఁడు నగు దేవేంద్రనాథమహర్షి లక్షలకొలఁది ధనమును జనోపయోగార్థ మెట్లు వినియోగపఱిచి యనన్యసామాన్యయశస్సును గడియింపఁగల్గెనో యెఱిఁగియ యున్నవాఁడు, కావున నిప్పుడు తాను పారితోషికముగ నందిన ధనమును దాను బండ్రెండేండ్లకు మున్ను నెలకొల్పి నిర్వహించుచుండిన బోల్పురము విద్యాలయము నిమిత్తమె యొసంగివైచె నని తంత్రీవార్తామూలమునఁ దెలియవచ్చినది. విద్యాభివృద్ధివలననె స్వదేశోద్ధరణము సుసాధ్య మయ్యెడు నని ధీవిశేషమున నాతఁడు గ్రహించి యున్నట్లు మనము గ్రహింపవచ్చును. శాంతినికేతనమను బంగాళీగ్రంథమునఁ దృతీయభాగము, 26వ పుటలో

"సమస్తమనుష్యమధ్యమున నేను క్షుద్రుఁడ"

నని, యెంతయు వినయమునఁ బలికిన యోగీంద్రుఁడె కదా, యిట్టి స్వార్థత్యాగ మొనర్ప దక్షుఁడు!

## రవీంద్రనాథుఁడు రాజగౌరవ మందుట

కలకత్తానగరమున 1913-వ సంవత్సరము డిసెంబరు 26-వ దినమునఁ బరిపాలకసౌధమునందు, విశ్వవిద్యాలయప్రత్యేకకార్యాలోచనసభ కూడినపుడు, రాజప్రతినిధులయిన హార్డింజిప్రభువుగారు, కవీంద్రు లయిన రవీంద్రనాథులకు సారస్వతమనీషి యను నున్నతబిరుద మొసంగుచు, నిట్లు నుడివిరి.—

"ఎంతయు నమ్రత గలిగి వెలయుచున్న యా కనుబొమ్మలపై, "నోబెల్" బహుమాకృతిపూర్వకముగా, సువిశాలవిశ్వగౌరవసూచకముగా, నీ నడుమ నొక పుష్పదామ మలంకరింపఁబడియెఁ గదా! అట్టి ధీశాలి యగు మన బంగాళీకవీశ్వరుని నేకాంతవాసస్వభావము క్రమ్మఱ మన మిట్లు జనవ్యాప్తికిఁ గొనివచ్చుచున్నందునకు మన్నించి, సముచితసహనముతో ఘనత వహించియున్నందునకుఁ దగిన దండన మనుభవింపక తప్ప దని గ్రహింపఁగోరుచున్నాను."

## రవీంద్రనాథుని కీర్తనలు

ఆనందలోకే మంగళాలోకే - విరాజసత్యసుందర.
౧. మహిమా తవ ఉద్భాసిత - మహాగగన మాఝే
విశ్వజగత మణిభూషణ - వేష్టితచరణే. ఆ.
౨. గ్రహతారకచంద్రతపన - వ్యాకులద్రుతవేగే
కొరిఛే పాన కొరిఛే స్నాన - అక్షయకిరణే. ఆ.
౩. ధరణీపరఝరే నిర్ఝర - మోహనమధుశోభా
ఫూలపల్లవగీతగంధ - సుందరవరణే. ఆ.
౪. బాహే జీవనరజనీదిన - చిరనూతనధారా;
కరుణా తవ అవిశ్రామ - జనమే మరణే. ఆ.
౫. స్నేహ ప్రేమదయాభక్తి - కోమలకరే ప్రాణ్
కొతొ సాంత్వనా, కొరో వర్షణ - సంతాపహరణే. ఆ.
౬. జగతే తవ కి మహోత్సవ - వందనకరె విశ్వ
శ్రీసంపదభూమాస్పద - నిర్భయ శరణే. ఆ.

II

భైరవి — రూపకతాళము

శునేఛే తోమారో నామ్ - అనాథో ఆతురజన్
ఏసేఛే తోమారో ద్వారె - శూన్య ఫేరె నా జెనో. శు.
౧. కాఁదె జారా నిరాశాయ్ - ఆఁఖి జేనో ముఛేజాయ్,
జేనో గో అభయొపాయ్ - త్రాసేకంపితమన్. శు.
౨. కొతో శతో ఆఛేదిన్ - అభాగా ఆలయహీన్
శోకే జీర్ణప్రాణ్ కొతో - కాఁదితేఛే నిశిదిన్. శు.
౩. పాపే జారా డుబియాఛే - జాబే తారా కార్ కాఛే
కోథా హాయ్ పథో ఆఛే - దావ్ తారె దరశన్. శు.

### ఆంధ్రీకృతము *

నిన్నారము నీనామము - నన్నారము దిక్కుమాలి
కన్నారము నీద్వారముఁ - గడుఁ ద్రోయకు రిత్తకేల. ని
౧. కనులవెంటఁ దొరఁగు నీరు - కడకుఁ ద్రోచి యాసఁగూర్చు
ఘనతరముగ బెగడందెడు - కష్టజీవి నాదరింపు. ని.
౨. ఒకరిద్దఱె యని యెంచితో? - యున్నారము వేలకొలఁది
వికలులమై వంతఁగూరి - విడుచుచు మహి దుఃఖాశ్రుల. ని.
౩. వంతఁ దోఁగునట్టి మనసు - చింత వేఁగునట్టి కనులు
చింతింపఁగ నిన్నుఁ దక్కఁ - జేరు నెవరి నయ్యా? ని.
౪. ఏది వానిపరమావధి? - యెపుడుఁ గాచు నీద్వారము
నేఁదొ యిమ్ము నీదర్శన - మిపుడ పూని కారుణ్యము. ని.

* ఇందు ద్వితీయబంగాళీకీర్తనము భావము మాత్రము కొనిరాఁబడినది.

# ఖండాంతరములందలి భారతీయులు

గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్.

చితుకులు గదల్చుటను నగ్ని చెలఁగి మండు,
చెఱుగు చేయుటచేఁ బాము పడగ విప్పు;
కాన, క్షోభంబువలననే మానవుఁడును
తనదు మహిమంబుఁ జూపును దక్ష్యముగను.— కం. వీ. పంతులుగారు.

అనాదికాలమునుండి హిందువులు పరదేశములకుఁ బోవుచు, వర్తకవ్యాపారములను జేయుచు, మతబోధ సల్పుచు, నాయా ప్రదేశముల నివాసము లేర్పఱచుకొని కాఁపురములు చేయుచుండిరి. హిందువుల మతగ్రంథములఁ గాని పురాణేతిహాసములఁ గాని, చరిత్రలఁ గాని పరిశోధించినవారికీ విషయము కరతలామలకం బగు. మహమ్మదీయు లన్ననో, వారు హిందూదేశమునకు వచ్చుటయె వారి విదేశయాత్రానురాగంబును ఋజువుచేయు. పారసీకులమాట యోచించినచో, వారి నామధేయమె, అన్యదేశసంప్రదాయంబును సూచించు. బౌద్ధులయు జైనులయు మతవ్యాపనము వారికీ విషయంబునం గల యభిరుచిని చాటుచున్నది. క్రైస్తవులకది స్వభావధర్మముగనే పరిగణింపఁబడుచున్నది. హిందువులును, మహమ్మదీయులును, పారసీకులును, బౌద్ధులును, జైనులును, క్రైస్తవులును కలిసియె భారతీయు లను పదముచేతఁ దెలుపఁబడు జాతులు అయియున్నారు.

విదేశయాత్ర రెండుకారణంబులచే కలుగుచున్నది. లాభముకొఱకుఁ గాని, ధర్మముకొఱకుఁ గాని యిది ప్రారంభింపఁబడుచున్నది. వర్తకమునకుఁ గాని, జీవనోపాధికిఁ గాని, రాజ్యవ్యాప్తికిఁ గాని చేయఁబడు విదేశయాత్ర లాభముకొఱకని యెన్నఁదగు. దర్శనమాత్రమునకుఁ గాని, ఆత్మోపలబ్ధికిఁ గాని, మతోపదేశమునకుఁ గాని యుపక్రమింపఁబడు యాత్ర ధర్మార్థం బని పక్కాణింపఁదగు.

వర్తకసంఘములుగా బయలుదేఱినను మతబోధకులుగా వెడలినను పాశ్చాత్యదేశీయు లెల్లరును రాజ్యవ్యాప్తియె పరమోద్దేశముగా పని చేయుచున్నా రని చెప్పవచ్చును. పాశ్చాత్యదేశంబులు కౌమారదశయందున్నవి. ప్రాగ్దేశములు వార్ధకదశయందున్నవి. వార్ధకాంతమందు సంభవించు మరణంబుచేత నాస్తికత గాని పునర్జన్మంబు గాని సంప్రాప్తమగును. జపానుదేశము, మహాత్ముని స్పర్శనముచే స్వచ్ఛమగు పాపాత్ముని హృదయంబుపగిది, వార్ధకంబు వీడి నూతనోజ్జీవంబు కలిగి యౌవనోద్రేకంబుచేఁ బెంపొందుచున్నది. పర్షియా చీనా దేశంబులు నూతనావతారములు గైకొనఁ బ్రయత్నించుచు పూర్వాకారంబును పూర్ణంబుగా వీడమి, కురూపంబు వీడి సీతాకోకచిలుకగా మాఱెడివేళను పురాతనశరీరవిసర్జనమందు శ్రమంపడు గొంగళిపురుగువలె, సంధిసమయంబున తగులుకొని స్వాస్థ్యము లేక చిక్కులుపడుచున్నవి. తురుష్కదేశంబు, ఆకురాలుకాలమునందలి మావిగున్నఁబోలి, పరగణాలతరువాత పరగణా రాలిపోవుచుండ పరరాజులతోడి యుద్ధముల నపజయంబునొంది పట్టరాని పుత్రశోకమునను అపయశంబునను పొక్కి పొరలుచున్నది. ప్రకృతియందుఁ బోలె, ఈ యవస్థానంతరమున వసంతోత్సవ మీ దేశమునకు కల్గునో కలుగదో చెప్ప నలవికాదు. అరబ్బియాదేశంబు నామమాత్రావశిష్టమై యున్నది. భరతఖండపుస్థితి చిత్రముగానున్నది. బాల్యమునందు పితృపోషణంబును, యౌవనమందు భర్తృసంరక్షణమును, ముసలితనంబున పుత్రసమాశ్రయంబును కలిగియుండవలసినదే గాని "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యను సామెతఁ బోలి, సుమారు వేయి సంవత్సరములనుండి పరాధీన యయియున్న భరతఖండము, మూఁడుకాళ్ల ముసలమ్మ అయియున్నది.

ప్రప్రథమమున విజిగీషామిషంజేసి వేంచేసిన మహమ్మదీయులు, కాలక్రమంబున దేశీయులై రాజ్యభ్రష్టులై భారతజాతిలో సమ్మేళన మగుచున్నారు. మహా

స్మదీయరాజ్యావసానమందు సుమారు 300 సంవత్సరముల క్రింద వర్తకమున కరుగుదెంచిన ఆంగ్లేయులు, 150 సంవత్సరములనుండి ప్రభువు లయ్యు, నిప్పటికిని విదేశీయులుగా తమ్ముఁ దాము చూచుకొనుచున్నారు. ముసలితనమె రుజ. అదియునుం గాక, పరాధీనత మరింత జాడ్యము. ఇట్టి స్థితిలో నున్న భరతఖండమును ఆంగ్లేయవైద్యుండు, తన మందుల బలిమిచేఁ గాని, శస్త్రవిద్యాకౌశలమునఁ గాని నయముచేసి యౌవనము కలిగించునో, లేదో చెప్ప నేరికి తరము? కాని ఆంగ్లేయుల ధర్మాసక్తియం దున్న దృఢమైన నమ్మకముచేఁ వా రొకప్పుడయిన నీ దేశమునకుఁ బ్రముఖత్వ మిచ్చెద రని నెంచి యితరరాజ్యములపలె ఇండియా దేశ మని వాడుచున్నాము.

పై పేర్కొనఁబడిన పాశ్చాత్యదేశంబులనుండి వెడలు ప్రజలు వర్తకవృద్ధికొఱకును, రాజ్యంబు వ్యాపింపఁజేయుటకును వెళ్లి, నివాసంబు లేర్పఱుచుకొని భూభాగంబుల నాక్రమించుటకు యత్నించుచున్నారు. వారి ప్రయత్నములు కొనసాగఁగలవు. స్వదేశమం దుండు ధనధాన్యసంపత్తిచేతను, రాజ్యతంత్రసౌష్ఠవముచేతను, సైన్యసమృద్ధిచేతను, వారికి కలుగు నిరోధములు తొలఁగఁగలవు. ప్రాగ్దేశములనుండి బయలుదేఱు జనులు జీవనోపాధికిని, కొన్నివేళల మతబోధకును ప్రయత్నించుచున్నారు. అంతకంటె హెచ్చయిన పరమావధులు వారికి లేవు; ఉన్నను కొనసాగవు. అందులోను భారతీయుల కట్టి కోరిక లుండుట యసాధ్యము. కాన విదేశయాత్ర చేయు భారతీయులు విద్యాసంపాదనమునకుఁ గాని, జీవనోపాధికిఁ గాని సముద్రయానంబునకుఁ గడంగుచున్నారు. ఈ సంగతి మనసునం దుంచుకొనుట యవసరము.

భారతీయులు ప్రపంచమునందు చాల భాగములకు వెళ్లియున్నారు. బ్రిటిషుగయనాయందును, అమెరికా సంయుక్తరాష్ట్రములందును, కెనాడాయందును, ఆస్ట్రేలియా ఖండమందును, నెటాలు మొదలగు దక్షిణాఫ్రికా పరగణాలయందును, ఐరోపాలోని కొన్ని స్వతంత్రరాజ్యములలోను వీరు కానుపించుచున్నారు. ఈ విదేశములలోఁ గూడ రెండు విధము లున్నవి. స్వతంత్రరాజ్యములకు వెళ్లినప్పుడు భారతీయులు బ్రిటిషు సామ్రాజ్య పౌరులుగాఁ గాని యేషియాఖండ వాసులుగాఁ గాని గణింపఁబడుచున్నారు. అందుచేత కొంతవఱకైనను, గౌరవమును హక్కులును కలుగుచున్నవి. బ్రిటిషు సామ్రాజ్యమునకు లోఁబడిన భూప్రదేశములకు వెళ్లినపుడు భారతీయులుగానే గణింపఁబడుచున్నారు. అనఁగా, బ్రిటిషువారిచే జయింపఁబడి స్వాధీనపఱుచుకొనఁబడినవారుగా పరిగణింపఁబడుచున్నారు. బ్రిటిషు సామ్రాజ్యములో నున్న దేశములలో నిగ్లాండు, వేల్సు, స్కాట్లండు దేశములు మాతృస్థానములుగాను, కాలనీ లని వ్యవహరింపఁబడు గయనా, కెనాడా, దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా దేశములు స్వకుటుంబములోని చుట్టపక్కములుగాను, క్రౌనుకాలనీ లనఁబరఁగు సిలోను మొదలగు రాష్ట్రములు స్వజాతిలోని పరాయివారుగాను, భారతీయులు విజాతివారయిన యాశ్రితులుగాను భావింపఁబడుచున్నారు. ఇండియాను గుఱించి ప్రసంగించునపుడు లండను టైమ్సు మొదలయిన పత్రికలు వాడునట్టి "దీ గ్రేట్ డిపెన్డెన్సీ" మొదలయిన పదముల కర్థము "ఆశ్రిత బృందము" అనియె యైయున్నది. ఈ భేదభావము స్పష్టముగా కనఁబడుచున్నది. దీనికి కారణములు లే వని చెప్ప వీలుగాదు. ఈ ప్రస్తుతస్థితి మాఱనంతవఱకు నా కారణములు మాఱవు; ఆ భేదాభిప్రాయమును మాఱుట కష్టము. ఐరోపాఖండములోని స్వతంత్రరాష్ట్రములకుఁ బోవువారి మాట యటుండ నిచ్చి బ్రిటిషు సామ్రాజ్యమునకు లోఁబడిన దేశములకుఁ బోవువారి విషయము నాలోచింపుఁడు. వా రచ్చటి కేల వెళ్లిరి? స్వబుద్ధిచేతనా? పరప్రేరణచేతనా? ఎవరి లాభముకొఱకు? — ఈ మొదలయిన యంశముల నొక్కనిమిషము చర్చింపవలెను.

ఈ ప్రదేశముల కెల్లను మొట్టమొదట భారతీయులు వెళ్లుట పాశ్చాత్యుల ప్రేరేపణచే నయియున్నది. వా రాయా ప్రదేశములయందు జనసమృద్ధి లేకుంటచే

తను, భూములు ఫలవంతము లగుటచేతను, పనిపాటులు చేయువారు లేక, మేలు చేయుదు మని చెప్పి నమ్మించి, తమ లాభముఁకొఱకు మనవారల నచ్చటికి చేర్చిరి. ఈ దేశస్థులు బుద్ధిమంతులును శ్రమ కోర్చువారును పాటు పడు స్వభావము గలవారును, శాంతులును గాన బహు ప్రకారముల వారి కుపయోగకరముగా నుండిరి. వీర లాహారాదులయందు మితవ్యయు లగుటచేత స్వల్పవేతనమునకు పనులు జరుపుచుండిరి. అందుచేతనే పాశ్చాత్యు లానసపడిరి. ఇట్లు చేరినతరువాత విదేశములనుండి, కొంత కాలము జరిగిన పిమ్మట స్వదేశమునకు తిరిగి వచ్చుచుండిరి. అట్లు జరగినంతకాలమును వీరిని రాఁబట్టుటకు పాశ్చాత్యులు ప్రయాసపడుచుండిరి. కాలక్రమమున, వెళ్లినవారిలో కొందఱు విదేశములలో నచ్చటచ్చట నివాసము లేర్పఱుచుకొని యుండఁజొచ్చిరి. అట్లు నిలిచి యున్నవారు జీవనోపాధికై స్వల్పమైన వ్యాపారములు చేయుటకును, భూస్థితిని సంపాదించుటకును, గృహనిర్మాణమునకును మొదలిడిరి. ఇట్టి స్థితిలోనికి వచ్చినవెంటనే పాశ్చాత్యుల మనశ్శాంతి కొంతయు భంగము కలిగెను. భారతీయులు, వారికంటె తక్కువ వెలల కమ్మినను తక్కువ వేతనములకు కుదిరినను, వ్యయము తక్కువగుటచే లాభము నెక్కుడుగా పొందుచుండిరి. వర్తకసంఘమువారును, వ్యావసాయికులును, పాశ్చాత్యభృత్యులను తగ్గించి, భారతీయులఁ జేర్చసాగిరి. అందుచేత కడుపుమంట మఱింత హెచ్చెను. కాన భారతీయుల నేరీతి నయినను ఆయా దేశములనుండి వెడలఁగొట్టు ప్రయత్నములు ప్రారంభమయ్యెను. ఆయా దేశీయరాజకీయ వ్యవహారములలో భారతీయు లేవిధముగాను జోక్యము కలుగఁజేసికొనలేదు. ఏవిధమయిన హక్కులను గోరి యుండలేదు. మానవకోటికి సహజము లగు హక్కుల తోడనే తృప్తి చెందియుండిరి. ఆయా భాగములయందు జనులును స్థానికప్రభుత్వములవారును వీరిపై అసూయఁ బూని బహువిధంబుల కష్టపెట్టసాగిరి. చట్టముల మీఁద చట్టములను జేయుచు, చట్టముల నమలులోనికిఁ దెచ్చుటలో నవసరము లేని కాఠిన్యమును క్రూరత్వమును బూని మనవారి యునికికి భంగమొనర్చుచుండిరి; బాలురను స్త్రీలను వృద్ధులను, అసహాయులను గూడ క్రౌర్యముతోఁ జూడసాగిరి.

ఇది ముఖ్యముగా దక్షిణాఫ్రికాలో నిప్పటికిని జరుగుచున్నది. కెనాడాలోను గయానాలోను, ఏకీతిగా భారతీయుల వెడలఁగొట్టవచ్చునని యాలోచనలు సలుపబడుచున్నవి. తదనంతరము చట్టముల నిర్మించుటకు యత్నములు చేయఁబడును. ఆస్ట్రేలియాలోఁ గూడ నివ్విధమునసే బుద్ధులు పరిణమించుచున్నవి. ఆఫ్రికాలో జరగుచున్న కోలాహల మందఱకును విశదమె.

ఈ కాలములో దక్షిణాఫ్రికాలో గంధి యను మహామహుని యాజమాన్యముక్రింద జరగుచున్న పోరాటమున కర్థ మేమి? ఎందునకై యీ మహామహుఁడు తనకు ప్రతినెలకును వచ్చు 8,000 రూపాయల రాఁబడిని వదలుకొని, తానును పిల్లలును భార్యయును, ఈ కష్టములకు లోనై, సహచరులతోఁ బాటు తానును సామాన్యుఁడై కారాగారముల ప్రవేశించి పడరాని యిక్కట్టుల ననుభవించుచున్నాఁడు? ఆ మహాత్ముని వాగ్ధారాపాతమునకు లొంగి, పాదముల ననుసరించి, యాజ్ఞను శిరసా వహించి, యడుగు దాఁటక, విద్యావిహీనులును, సామాన్యకులజులును నయ్యు, భక్తిరసపూర్ణులై, న్యాయకంకణము ధరించి, ధైర్యముతో కష్టప్రవాహమున కడుపోవుచున్న భారతీయబృందముయొక్క యభిప్రాయ మేమి? సేవకావృత్తియందు మునిఁగియున్న వీరికి సద్గుణపుంజ మెట్టు లలవడెను? ఇయ్యది వారు జీవనోపాధినిమిత్తమయి మొదలిడిరా? సాధారణరాజకీయ బాధ్యతలఁ బొందుటకై సాగించిరా? పేరునకా, ప్రఖ్యాతికా? దీని పారమార్థిక మేమి?—అని యోచింప వలయును. దానిని గ్రహించినయెడల భారతజాతియొక్క చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభమైనట్లును, కాలచక్రభ్రమణమున కాటంకము కలిగినట్లును గ్రహింపనగును.

భగవద్విధానములు బహుచిత్రములు, దుర్గ్రాహ్యంబులు. ఆదికాలమునుండియు, గర్వితులగు సగ్ర

The Hon. Mr. P. S. Sivaswamy Iyer



గౌ. పి. ఎస్. శివస్వామయ్యరుగారు

Sir S. Seshadry Iyer



సర్ ఎస్. శేషాద్రి అయ్యరు

Sir Gurudas Bannerji



సర్ గురుదాస్ బేనర్జి గారు

Mr. V. P. Madhava Row



వి. పి. మాధవరావు గారు

Mr. G. V. Subrahmanya Iyer



జి. వి. సుబ్రహ్మణ్య అయ్యరుగారు

Mr. K. L. Datta



కె. ఎల్. దత్తు గారు



Dr. J. C. Bose

జ. సి. బోసు గారు



Dr. P. C. Ray

పి. సి. రే గారు



Dr. Vrajendranath Seal

వ్రజేంద్రనాథ శీలు గారు



D. Mahendralal Sircar

మహేంద్రలాల్ సర్కారు గారు

Blocks by Messrs. U. Ray & sons, Calcutta.

Bankim Chandra Chatterji



బంకించంద్ర ఛాటర్జిగారు

Mr. D. L. Roy



డి. ఎల్. రాయిగారు

Rai Bahadur Dinabandhu Mitra



రాయిబహాదూరు దీనబంధుమిత్ర

Mr. Heramba Chandra Mitra



హేరంబచంద్ర మిత్రగారు

Blocks by Messrs. U. Ray & sons, Calcutta

జాతివారినుండి గాక, సామాన్యులనుండియె దైవము మహాత్ములను సృజియించుచుండెను. ఆయనకు దుర్లభంబు లేమియు లేవు. "నవ్విన నాపచేను పండును." అను సామెత యథార్థమును సూచించుచున్నాఁడు. నరసింహావతారమునందు, రాక్షసకులసంభవుఁ డైన ప్రహ్లాదుని ఘనునిఁ జేసెను. రామావతారమునందు జ్ఞానహీను లైన వనచరులలోని హనుమంతుని ధీమంతునిఁగా మార్చి, పుణ్యాత్మునిఁ గావించెను. శ్రీకృష్ణుఁడై యల్పులయిన గొల్లలను గౌరవించెను. బౌద్ధావతారంబునఁ ద్రిమ్మరియై దారిదోఁపుడుగాఁ డైన యసంగపాలుని భక్తునిఁగా ద్రిప్పి ధర్మవ్యాపనమునకై యుపయోగించెను. క్రైస్తవావతారమున మత్స్యవర్తకుల నుండి శిష్యులఁ దీసెను. దక్షిణాఫ్రికాలో గంధికి తోడ్పడుటకై యల్పవృత్తు లవలంబించిన సామాన్య భారతీయులను గదల్చి, నూతనోజ్జీవమును పురికొలిపి, వారియందు మాతృభక్తి ఆత్మగౌరవము దేశాభిమానము మొదలయిన భావిభాగ్యసూచకంబు లగు గుణంబులను ప్రసరింపఁజేసి, వారిని భరతఖండభావ్యున్నత్యమునకు మార్గదర్శకులుగాఁ జేసెను. వివిధజాతులుగా పరిగణింపఁబడుచున్న భారతజాతియొక్క సమ్మేళనమచ్చట ప్రారంభమయ్యెను. భారతజాతి యుద్భవమయినది గూడ నచ్చటనే. ఆహా! ఆ యదృష్టముఁ వారికి కలిగినది. గొప్పగొప్పవారు ఇండియాలో ఎన్ని ప్రయత్నములు చేసినను, సోఫాలలో పండుకొని కబుర్లు చెప్పినను రంగస్థలములఁ జేరి యుపన్యసించినను, వార్తాపత్రికలయందు వీలయినంత దీర్ఘోపన్యాసములు వ్రాసినను, హృదయము స్వచ్ఛము గాకుండుటం జేసి ఐకమత్యమునకిచ్చట వీలు కాలేదు. వీ రందఱికంటె దక్షిణాఫ్రికాభారతీయులె సుకృతులు, మహాత్ములు, స్తవనీయులు. వారికి మాతృసందర్శన మీయఁబడెను. మహాధర్మములు దృగ్గోచర మాయెను. అందుచేతనే పిఱికివారు ధీరు లయిరి. సామాన్యులు ఘను లయిరి. బానిసలు ప్రభువు లగుచుండిరి. ఈ పోరాటము పూర్తి కాలేదు. కాని, వారి యాత్మార్పణము అసదృశము, ప్రశస్తము, అవశ్యము, దైవప్రేరితము, సర్వవిధముల ననుకరణీయము.

## నన్నయభట్టు యజ్ఞస్థలము

నన్నయ భట్టారకుఁడు తణుకు దగ్గఱ మున్ను జన్నము చేసెనఁట. ఆ చోటఁ దన నాఁటికి జమ్మిచెట్టు గుర్తుగా నుండినట్టు పృథుచరిత్రము రచియించిన సరస్వతీసోమయాజి పేర్కొన్నాఁడు.

ఉ. నన్నయభట్టుగారు యజనం బొనరించినచోట జమ్మిచె
ట్టున్నది తణ్కుతూర్పున సమున్నతమై; యలదానిచెంత నే
నున్నతఁజిఁ శిశుత్వమున నున్నతరీతి వరం బొసంగుచుఁ
నన్నుఁ గృతార్థుఁ జేసితి వనల్పదయామతి భీమనాయకా!

# తెలుఁగు దేశపు స్త్రీల వ్రతములు, పండుగలు

శ్రీమతి కళ్లేపల్లె వేంకటరమణమ్మగారు

ప్రస్తుతకాలమున మనదేశమునం దాచరింపఁబడుచుండు పండుగలు వ్రతములు నసంఖ్యేయములు. ఇవి యన్నియు నాదికాలమునుండియు నున్నయవి కావు. నాగరికతాభ్యుదయము ననుసరించి క్రమక్రమాభివృద్ధి నందినవి. అందువలన నయ్యవి శ్రౌతములు, స్మార్తములు, పౌరాణికములు, లౌకికములు నను నలుదెఱంగుల వ్యవహరింపఁబడుచున్నవి. వానియం దనేకములు దివారాత్రముల కధిపతులగు సూర్యచంద్రుల చలనాదిపురస్కృతములై గణితశాస్త్రానుసారము నిర్ణయింపఁబడిన యుగ సంవత్సరాయన ఋతు మాస పక్ష తిథి వార నక్షత్రాదులపై నాధారపడి యున్నవి. కొన్ని నామ రూప క్రియా సహితులగు దేవతలను, వారి యవతారములను ధర్మార్థ కామ మోక్షములకొఱకు నారాధించునవియై యున్నవి. మరికొన్ని దేశోపకారులగు మహాపురుషులను, లోకోపకారకములగు పంచభూతములను బశుపక్షిమృగాదులను బూజించునవియై యున్నవి. తక్కినవి లోకకంటకు లగు రాక్షసాదులను, లోకమును బీడించు పిశాచాది క్షుద్రదేవతలను, గోచారరీత్యా శుభాశుభఫలముల నొసంగు గ్రహములను శాంతిపఱచునవియై యున్నవి. వీనిలోఁ గొన్ని శాఖానుసరణములు. కొన్ని కులానుగుణ్యములు. కొన్ని మతోద్దిష్టములు. కొన్ని యాశ్రమాచరణీయములు. కొన్ని వంశపారంపరణీయములు. కొన్ని చాతుర్వర్ణ్యానుష్ఠేయములు. ఇట్లనేకవిధములఁ బొడచూపుచున్నవి. వీనిలో పండుగు లెవ్వియో వ్రతము లెవ్వియో తెలిసికొనవలవికానట్లు కలగలపుచేయఁబడి పంచాంగాదులలో నేఁడాది పండుగలుగఁ బరిగణింపఁబడుచున్నవి. కాఁబట్టి వ్రతము లెవ్వియో పండుగ లెవ్వియో తెలిసికొనుట మనకు ముఖ్యమైనది.

## వ్రతము లెట్టివి? పండుగ లెట్టివి?

వ్యావహారికపరిభాషయందు వ్రతశబ్దమునకు పండుగ యను పదము పర్యాయపదముగా నెన్నఁబడుచున్నది. కాని వ్యుత్పత్త్యర్థమును పట్టి యాలోచించినను వ్యావహారికధర్మములను పట్టి విమర్శించినను విరుద్ధపద మని స్పష్టముగా తెలియుచున్నది. వ్రత మను సంస్కృత పదమునకు తెలుఁగుపర్యాయపదము నోము. వ్రత మనఁగా విడిచిపెట్టఁబడవలసిన విషయములు కలది యని వ్యుత్పత్త్యర్థము. వ్రతమందు విడిచిపెట్టఁబడవలసిన ముఖ్యవిషయముల నీ క్రింది రెండు శ్లోకముల వలన తెలుపుడు చేయుచున్న దానను.

శ్లో. బ్రహ్మచర్య మహింసాచ సత్య మామిషవర్జనం
వ్రతే ష్వేతాని చత్వారి చరితవ్యాని నిత్యశః.

శ్లో. గాత్రాభ్యంగం శిరోభ్యంగం తాంబూలం చానులేపనం
వ్రతస్థో వర్జయే త్సర్వం యచ్చాన్య ద్బలరాగకృత్.

మఱియు సంకల్పాదియు, పారణాంతమును గలవి వ్రతములు. ఆ రెండింటికి మధ్యకాలమందు వ్రతధర్మములకు లోఁబడి యుండవలయును. వ్రతములకు కాలపరిమాణమును, ఉద్యాపనయును గలవు. వ్రత మారంభించి సమాప్తి నొందింపకపోయిన ప్రత్యవాయము కలదు. వ్రతభంగమునకు ప్రాయశ్చిత్తములుం గలవు. వాని నన్నిటిని గ్రంథ విస్తరభీతిచే నుదాహరింపలేదు. ఇందువలన వ్రతములయందు స్వేచ్ఛ యేమాత్రమును లేదని తెలియుచున్నది. అట్టి నియమములకు లోఁబడి చేయు ప్రతికార్యమును, తుదకు నిత్యకర్మలును, వ్రతము లనఁబడుచున్నవి. ఈ క్రింది శ్లోకములను జూడుఁడు.

శ్లో. స్నానం దానం జపో హోమః పూజా సజ్జనసంగతిః
బ్రహ్మవిద్యా ప్రబోధశ్చ ముక్తిసోపాన సప్తకం.

శ్లో. ఉక్తవ్రతేషు సర్వేషు సర్వసిద్ధాంతసమ్మతం
వేదశాస్త్రప్రమాణేషు కీర్తితం వ్రతసప్తకం.

## పండుగలు

పండుగ అను శబ్దము దేశ్యపద మని నైఘంటికాదులవలన తెలియుచున్నది. ఇందుకు సంస్కృతపర్యాయపదము, ఉత్సవము అని వాడఁబడుచున్నది. కాని సంస్కృతమున పర్వశబ్దము నకు నుత్సవ మను నర్థ ముండుటచేతను, తెలుఁగున "నేత్రపర్వము" అనుటకు "కనుల పండువు" అను ప్రయోగము లుండుటచేతను పండుగ యను పదము పర్వశబ్దార్థ మని తోఁచుచున్నది.

ఉత్సవ మనఁగా పుట్టునది లేక ప్రేరేపించునది యని వ్యుత్పత్త్యర్థము. ఇందు స్వేచ్ఛకు నూతనోత్పత్తియు, ప్రేరేపింపఁబడుటయు, నభ్యుదయ ముండుటయుఁ గలదు. పండుగలకు కట్టుఁబాట్లేమియు లేవు. శక్తికొలఁది యిష్టానుసార మనుభవించుటయే ప్రధానముగాఁ గలవి పండుగలు.

ఇటుల నింద్రియనిగ్రహానుగ్రహములు క్రమముగా వ్రతములందును పండుగలందును నాచరణీయములై యుండుటచే నా రెండును విరుద్ధపదములు గాని పర్యాయపదములు కానేరవు.

## వ్రతాధికారము

శ్లో. పతికామంచ భర్తారం సౌభాగ్యంచ సువాసినీం
విధవా పూజయిత్వాతు వైధవ్యం నాప్నుయాత్ క్వచిత్.

అని యుండుటచే పతిని గోరి కన్యకలును, సౌభాగ్యమును గోరి సువాసినులును, భావివైధవ్యనాశముం గోరి విధవలును వ్రతముల నాచరింపవచ్చు నని కానవచ్చుచున్నది గాని, చిరకాలమునుండియు స్త్రీస్వాతంత్ర్యముతోఁబాటు వ్రతాధికారమును స్త్రీలయెడల నిషేధింపఁబడిన దనియు, ఎద్దియేని వ్రత మాచరించు కోరిక స్త్రీలకుఁ గలిగినయెడల కన్య తండ్రియొక్కయు, సువాసిని పతియొక్కయు,

విధవ సుతునియొక్కయు నాజ్ఞను పొందవలయు ననియు, తుదకు పతిసంజీవనవ్రతము సహితము పతియాజ్ఞను పొందియే చేయవలయు ననియు వ్రాయఁబడినది.

కన్యకలు జనకునియొక్కయు, సువాసినులు పతులయొక్కయు, విధవలు సుతులయొక్కయు నాజ్ఞలను పొందకయే వ్రతముల నాచరించినటుల దృష్టాంతము లనేకములు మన గ్రంథములయందే గానవచ్చుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే మూఁడుదాహరణలను మాత్ర మీక్రింద వ్రాయుచున్నాను.

1. కుంతి కన్యకగా నుండి పితృగృహమ్మున సూర్యు నారాధించి కర్ణుం గనిన గాథ శ్రీమహాభారతమువలన స్పష్టముగా తెలియుచున్నది.
2. కౌండిన్యుని భార్య యగు శీల పతియాజ్ఞ నందకయే అనంతవ్రత మాచరించి సకలైశ్వర్యముల నందినటులను, దానిం దెలిసికొని కౌండిన్యుఁడు తోరము నగ్నిలోఁ బడవేయుటచే నిడుమలఁబడినటులను, ఆ వ్రతకథవలన తెలియుచున్నది.
3. వితంతు వగు కుంతీమహాదేవి సుతు లరణ్యవాసులైయుండ వారి యనుమతి నందకయే దశఫలవ్రత మాచరించినటుల నావ్రతకథ నుడువుచున్నది.

ఇట్టి దృష్టాంతములను పరిశీలించినచో స్త్రీస్వాతంత్ర్య మిటీవల నిషేధింపఁబడినటుల సందేహింపవలసివచ్చుచున్నది.

ఏది యెట్లున్నను, మనవారి యభిప్రాయము మాత్రము స్త్రీలకు వ్రతాచరణయందు స్వతంత్రాధికార మేమియు లేదనియు, భర్తలతోఁ గలసి గాని లేదా పతులకు ప్రతినిధులై గాని లేదా సంరక్షకు లగు పురుషుల యనుమతి నొంది గాని యేవ్రతమైన నాచరింపవచ్చు ననియు తేలుచున్నది.

## స్త్రీల వ్రతములు

శ్రౌతస్మార్తకర్మరూపకములై మంత్రములతోఁ గూడిన వేదవ్రతములయొక్కయు, శ్రౌతస్మార్తకర్మరూపములై వేదమంత్రములతోఁ గూడిన వైదికవ్రతములయొక్కయు, పురాణోక్తములై కల్పములతోఁ గూడిన పౌరాణికవ్రతములయొక్కయు నధికారము స్త్రీలపట్ల నిషేధింపఁబడినప్పటికిని, స్త్రీలచే నాచరింపఁబడుచుండు వ్రతములు లెక్కకు మిక్కిలిగాఁ గానవచ్చుచున్నవి. పూర్వకాలమున రజస్వలానంతరవివాహము లుండుటచే కన్యకలకు వ్రతాధికార ముండి యున్నటుల గానవచ్చుచున్నది గాని ప్రస్తుతకాలమున వివాహోత్పూర్వము స్త్రీలకు వ్రతాధికారము నిషేధింపఁబడినది. వయోనిర్ణయముతోఁ బ్రసక్తి లేకయె వివాహముతో పసిబాలికలు సహితము వ్రతాధికారిణు లగుచున్నారు. అది మొదలు వా రాచరింపఁదగు వ్రతము లనేకములు గలవు. అవి యన్నియు సాధారణముగ సౌభాగ్యముకొఱకు గౌరిని, సంపదకొఱకు మహాలక్ష్మిని, విద్యకొఱకు సరస్వతిని, పాపహరణార్థము తులసిని పూజించునవియై యున్నవి. వానిం బరిశీలించినయెడల మహామంత్రములకు ప్రత్యామ్నాయముగఁ గల్పింపఁబడిన శాబరమంత్రములవలె శ్రౌతస్మార్తపౌరాణికవ్రతములకు బదులుగా కల్పింపఁబడిన లౌకికవ్రతములవలెనే గానవచ్చుచున్నవి. వివాహమైన వెంటనే యావజ్జీవసౌమంగళ్యసిద్ధికొఱకు నాచరింపఁబడుచుండునది శ్రావణమంగళగౌరీవ్రతము. ఈ వ్రతము వివాహమైనది మొదలు అయిదు సంవత్సరము లాచరింపవలయును. ఉద్యాపనయుఁ గలదు. ఇందు యథాశక్తిని ముత్తయిదువల నారాధించి నానఁబోసిన పెసలను, లేక సెనగలను వాయన మొసంగుట యాచారమై యున్నది. బ్రాహ్మణేతరులు బ్రాహ్మణస్త్రీలకు వాయన మిచ్చునపుడు నానఁబోయని పెసలను గాని సెనగలను గాని యిచ్చుటయుం గలదు. ఇటుల శ్రావణమాసమున వచ్చు మంగళవారము లన్నియుఁ బాలింపఁబడవలయును.

ఇత్యాది పురాణోక్తమగు వ్రతము. వ్రతకల్పమును గలదు. కాని దీని నాచరించువారు పసిబాలిక లని కాఁబోలు వ్రతధర్మము లంతగా పాటింపఁబడుచుండుట లేదు. కల్పోక్తవిధానముగా జరుపఁబడుచుండుటయు లేదు. స్త్రీలకొఱకేర్పఱచఁబడిన చిన్నారిపొన్నారిచిన్నెల సిరి నోము లగు చిట్టిబొట్టు, మోచేతిపద్మము, ఉదయకుంకుమ, కాటుకగౌరి మొదలగువానివలె కథతోనో, పాటలతోనో ఆచరింపఁబడుచున్నయది. ఈ వ్రతముకొఱకు బాలిక నత్తవారింటికి మాతృసహితముగాఁ దీసికొనిపోయి మాసాంతమువఱకు నుంచుకొని కానుకలు కట్నములు నొసంగి పంపుటయు నాచారమై యున్నది.

వివాహమైన వెంటనే సంపదకొఱకు చేయించునది వరలక్ష్మీవ్రతము. ఈ వ్రతము యావజ్జీవము సువాసిను లాచరింపవలసిన వ్రతముగాఁ గానవచ్చుచున్నది. దీని కుద్యాపన లేదు. ఇందు వ్రతధర్మములు కొంతవఱకు పాటింపఁబడుచున్నవి. ఈవ్రతమునకును శ్రావణమంగళగౌరీవ్రతమువలెనే యత్తవారు బాలికను మాతృసహితముగాఁ దీసికొనిపోవుటయు కట్నములు కానుకలు మొదలగువానితో సాగనంపుటయు నాచారమై యున్నది. ఇయ్యది శ్రావణపౌర్ణిమకు ముందు నుండు శుక్రవారమున నాచరింపఁబడుచున్నది. ఈ వ్రతమును కొన్ని శాఖలవారు భార్యాభర్తలిరువురిచేఁ జేయించుచున్నారు. కొన్ని శాఖలవారు బాలికచే స్వతంత్రముగాఁ జేయించుచున్నారు. ఇందు మహాలక్ష్మిని పూజించుటయు బ్రాహ్మణునకు వాయన మిచ్చుటయు స్త్రీ లందఱుం గలసి మహాలక్ష్మికి రాత్రి మంగళహారతు లిచ్చుటయు వాడుకయై యున్నది. ఈ వ్రతము మాత్రము కల్పోక్తవిధానముగ జరుపఁబడుచున్నది. అందువలననే కొందఱు వధూవరుల నిరువురఁ గూర్చుండఁబెట్టుచున్నా రని తోఁచుచున్నది. ఇయ్యది చిన్నారిపొన్నారి నోముల వంటిది కా దనియు, పెద్ద వ్రత మనియు, ఆచారవ్యవహారములు బొత్తిగా తెలియని పసిబాలికలచే నీవ్రతము చేయింపఁగూడ దనియు, కొన్ని శాఖలవారు గర్భాధాన మగువఱకు వ్రతాధికారమును స్త్రీలకు నిషేధించియున్నారు.

పురుషులయొక్క గాని పురోహితునియొక్క గాని ప్రమేయము లేని నోము లన్నియు లౌకికము లనియు, వాని నాచరించు నధికారము మాత్రమే స్త్రీలకు కల దనియు, నందులో బాలిక లాచరింపఁదగినవి చిన్నారిపొన్నారి నోము లనియు, గర్భాధానానంతర మాచరింపవలసిన నిత్యశృంగారము, మార్గశిరలక్ష్మీవారము, ముప్పదిమూఁడు పున్నములు,

నందికేశ్వరవ్రతము, పోలా లమావాస్య, కార్తీక చలిమిళ్లు మొదలగు నోములు పెద్దనోము లనియు వ్యవహరింపఁబడుచున్నను, కలోప్తకము లగు ననంతవ్రతము, ఋషిపంచమి, కేదారేశ్వరవ్రతము, దశఫల వ్రతము మొదలగునవి స్త్రీలచే స్వతంత్రముగా చేయఁబడుచున్నవి.

కొన్ని పురాణోక్తవ్రతములు వితంతువులచే సహితి మాచరింపఁబడుచున్నవి.

## పండుగలు

ఇందు నియమ మేమియు లేదు. శక్త్యనుసారము భోగము లనుభవించుటయే వీనియందలి యుద్దేశము. వ్రతములందు నిషేధింపఁబడిన విషయములు పండుగలయం దామోదింపఁబడుచున్నవి. తైలాభ్యంగనము, ఇష్టపదార్థభోజనము, నూతనవస్త్రధారణము, శృంగారము, తాంబూలము, అనులేపనము, విహారము, ఆటలు, పాటలు మొదలగు భోగములే పండుగలకు ప్రధానాంగములు. మన దేశమున నష్టాదశ వర్ణములవారికి పెద్దపండుగ

## మకరసంక్రాంతి

ఈ పండుగ ధనుస్సంక్రమణముతో నారంభమగును. స్త్రీలు ధనుర్మాస మంతయు నలుకులు ముగ్గులతో కాలక్షేప మొనరించుచు మకరసంక్రమణమునకు ముందుదిన మగు భోగిపండుగను పాలించెదరు. మరుచటిదినము సంక్రాంతిపండుగ. ఆదినమున సకలాభరణభూషితలై బాలికలు వెడలి సంక్రాంతిబుడ్లను పంచెదరు. సంక్రాంతిబుడ్లనఁగా మూఁతలు గల పిడతలు. ఇవి సాధారణముగ కుండపిడతలు, లేక పంచదార పిడతలు నై యుండును.

పెద్దలగు సువాసినీమణులు విలువగల వలువలను నగలను ధరించి మంగళవాద్యములతో నిలు వెడలి గ్రామమునఁ బసుపు గుండుములఁ బంచిపెట్టెదరు. సంక్రాంతి మరుచటిదినము కను మనఁబడును. దీనినే పశువులపండుగ యందురు. సావిత్రీగౌరీవ్రత మని కొన్ని మండలములవారును, బొమ్మలనో మని కొన్ని మండలములవారును దీనికే పేరిడి యున్నారు.

## సంవత్సరాది పండుగ

ఇయ్యది మనదేశమున చైత్రశుద్ధపాడ్యమి దినమ్మునఁ బాలింపఁబడుచున్నది. ఆ దినమ్మున నెట్టిసంతోషము సౌఖ్యము భోగము మున్నగునవి యనుభవింపఁబడునో, అట్టి సంతోషాదులు సంవత్సరాంతము వఱకు ననుభవింపఁబడు నను నూహతో నాదినమ్మున నధికానందకరము లగు నూతనవస్త్రాద్యలంకారధారణము, నాటలు, పాటలు మొదలగునవి యన్నియు నాచరించెదరు. ఆరోజున నిష్టమృష్టాన్నములతో నింబకుసుమమును సేవించెదరు. సాయాహ్నమున పంచాంగశ్రవణ మొనరించెదరు.

ఇటులనే నరకచతుర్దశి దసరా దీపావళి మొదలగు నుత్సవములఁ బాలించెదరు. మొత్తముమీఁద శ్రౌతస్మార్తాదికర్మరూపకము లగు వ్రతములు తప్ప తక్కిన సమస్తమగు నుత్సవములును వ్రతములును గృహరాణు లగు స్త్రీలవలననే నాచరింపఁబడుచున్నవి. పురుషులు సాక్షిమాత్రులుగా నిలుచుచున్నారు. ప్రస్తుతకాలపు పురుషులలో ననేకులు, దేశీయవిద్యావిముఖులై, ఆంగ్లేయవిద్యావాసనాబలము చేతనో, ప్రకృతిశాస్త్రపాండిత్యమువలననో, పరదేశీయులయొక్కయు బ్రహ్మసామాజికులయొక్కయు సహవాసముచేతనో, విద్యాధిపులందఱును సేవకావృత్తియం దుండియుండుటచేతనో, రాజావలంబనాచారములందుఁ గల గౌరవబుద్ధిచేతనో, లేక తక్కిన దేశములవలె మన దేశమును సహితము అభ్యుదయదశకుఁ దేవలయు నను సద్బుద్ధిచేతనో, మరి యేకారణములచేతనో గాని హిందూమతాచారములకు విముఖులును, పాశ్చాత్యదేశాచారములకు సుముఖులును నై విగ్రహారాధనమును నిరసించుచు వర్తించుచుండుటచే పూర్వాచారపరాయణత్వ మంతయు స్త్రీల తలయందే నిలిచియున్నది. అందువలన వారి నిప్పటి దొరసానులవంటి స్వేచ్ఛ గలవారినిగా మార్చవలెనని కొందఱు సంస్కర్తలును, పూర్వకాలపు సీత, ద్రౌపది మున్నగు పతివ్రతలవంటివారినిగా మార్చవలెనని కొందఱు సంస్కర్తలును పాటుపడుచున్నారు. దైవ మెటులఁ బరిణమింపఁజేయునో దురూహ్యము.

## ఉద్దేశములు

మన దేశమునం దెన్ని మతములు వ్యాపించియున్నను మూలమతము మాత్ర మద్వైతమై యున్నది. అందువలన భగవంతుఁ డను పదార్థ మొకటి కల దనియు, నదియే సృష్టిగా మాఱిన దనియు, 'సర్వం విష్ణుమయం జగ' త్తనియు, మనవారి యభిప్రాయము. అట్టి యభిప్రాయము దాహరణపూర్వకముగా మనస్సున నాటఁజేయుటకై మనపూర్వులెన్నియో సాధనముల నేర్పఱచియున్నారు. అట్టి సాధనములలో వ్రతాచరణ మొకటియై యున్నది. ప్రతివ్రతసంకల్పమందును "ధర్మార్థకామమోక్షచతుర్విధపురుషార్థసిద్ధ్యర్థం" అని చెప్పఁబడుచున్నది. అట్టిఫల మెటుల కలుగు ననఁగా:

స్త్రీలకు వివాహమే మంత్రోపదేశము. పతియే మంత్రాధిష్ఠానదైవము. అతఁడే జగ మంతయు నిండియున్న భగవంతుఁడు—అను విషయము మనస్సున నట్టియుండుకొఱకు వివాహమైన వెంటనే నోములను పట్టించెదరు. అందువలన దైవభక్తియు తద్ద్వారా పతిభక్తియు నలవడుటయే కాక సృష్టి యంతయు దైవస్వరూప మనియు, నెల్లవారును పూజనీయు లనియు క్రమక్రమముగా తెలిసి జ్ఞానోత్పత్తియై మోక్షసామ్రాజ్యమును చూఱఁగొనవచ్చు ననునది ముఖ్యాభిప్రాయము.

మోక్ష మనఁగా నజ్ఞాననాశనము; అజ్ఞాననాశమే సుజ్ఞానము; సుజ్ఞానమే విద్య. అట్టి విద్య లభించినచో చతుర్విధపురుషార్థములు లభించు నని యీక్రింది పద్యమువలన నందఱికి తెలిసియే యున్నది.

తే. విద్య యొసఁగును వినయమ్ము, వినయమునను
బడయుఁ బాత్రత, పాత్రతవలన ధనము,
ధనమువలనను ధర్మమ్ము, దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు.

తక్కిన యుద్దేశము లనేకములు కలవు. అందుకు తగినటుల ప్రదేశములను నిర్ణయించియున్నారు. అవి సజ్జనసహవాసయోగ్యము లగు పుణ్యభూములై యుండవలయు నని మనవారి యభిప్రాయము.

# పురుషార్థము

పండిత నిట్టల వేంకటశాస్త్రిగారు

ఈప్రపంచమున మనుజుఁడై పుట్టి యార్జింపవలసిన వస్తువులు నాలుగు. అవి ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి. ఈ నాల్గింటిలో మోక్షముత్తమము. ఏల ననఁగా, సకలజీవులకును సర్వప్రయత్నములచే కోరఁదగినది సుఖము. ఈసుఖము నిరతిశయము సాతిశయము నని రెండు విధములు. నిర్విషయముగాఁ గలుగు సుఖము నిరతిశయము. విషయములవలనఁ గలుగు సుఖము, విషయము లనంతము లగుటచేత నొకదానికంటె నొకటి యుత్కృష్టముగాఁ గన్పట్టుటం జేసి, సాతిశయము. నిరతిశయసుఖమును మోక్ష మని పెద్దలు వాడిరి. సర్వజనులకును నిరతిశయసుఖమె యపేక్ష్యము. అయినను ఒకసారి హఠముగా దొరకుట దుర్లభము గాన క్రమముగా నార్జింపవలెను. కావున నట్టి నిరతిశయసుఖరూపం బయిన మోక్షమును కాలక్రమంబునఁ బొందుటకయి ధర్మార్థకామంబు లను సాధనంబులను సేవించుటకు వేదపురుషుఁ డాజ్ఞ నొసంగినాఁడు. కావున మోక్షమునకు విరోధము లేకుండ ధర్మార్థకామములను జనుఁడు సేవించి కాలక్రమంబున నీ సాధనానుష్ఠానము చేత మోక్షసుఖము నార్జింపవలెను.

అట్టి మోక్షము భక్తిజ్ఞానవైరాగ్యము లను నంతరంగసాధనములవలనఁ గాని దొరకదు. ఆ మూడింటిలో మొదటిది భక్తి. భక్తి యనఁగా సృష్టికి మూలకారణ మగు పరమేశ్వరునియందలి ప్రేమ. అట్టి ప్రేమ భగవదారాధనరూపం బైన ధర్మమువలనఁ గలుగును. ధర్మ మనఁగా వర్ణాశ్రమాచారానుక్రమంబున వేదంబుల విధింపఁబడిన పుణ్యకర్మానుష్ఠానము. ఇట్టి ధర్మము సకామ మనియు, నిష్కామ మనియు రెండు విధంబులు. సకామ మనఁగా ప్రతిఫలమును గోరి చేయునది. నిష్కామ మనఁగా ఫలమును ఈశ్వరార్పణ గావించి ఫలమును గోరక చేయు పుణ్యకర్మము. ఫలము రెండు విధములు — ఇహలోకఫలము, పరలోకఫలము. ఇహలోకఫలము తత్కాలసుఖప్రాంతి, యశస్సు మొదలైనవి. పరలోకఫలము ఉత్తమలోకప్రాప్తి, ఉత్తమజన్మప్రాప్తి మొదలైనవి. ఈ రెండు తెఱఁగుల ఫలములను గోరక తనకు జన్మము నిచ్చిన యీశ్వరుని యందలి కృతజ్ఞతతో చేయఁబడిన సేవగా భావించి సుకర్మమును జేయుచుండుటవలన భగవద్భక్తి గలుగును. ఈ విధముగ ధర్మాచరణము గావించుటకయి ధనము నార్జింపవలెను గాని కామభోగములకయి ధనార్జనముఁ జేయఁగూడదు. ధర్మవిరోధము లేకుండ నర్థము నార్జింపవలెను. ధర్మార్థవిరోధము లేకుండ కామమును సేవింపవలెను. ఇట్లు తెలిసి యీ లోకమున నడువఁగలిన మనుజునకు మోక్షము సులభముగఁ జేకురును.

ఈ నాలుగు పురుషార్థములును భూమండలమునఁ గల జను లందఱును నార్జింపవలసినవే యయియున్నవి. వానిలో మోక్షపురుషార్థము సర్వజనసాధారణము. ధర్మ మనునది బహువిధంబులుగా నున్నది. దాని నాచరించుట కధికారులు వేదమున నేర్పఱుపఁబడియున్నారు. ఈ ధర్మము నాచరించు విధములు మూఁడుగా నున్నవి. ఎందుచేత నన, జనులకు కర్మాచరణసాధనములు మూఁడు సృష్టింపఁబడినవి. అవి మనస్సు, వాక్కు, కాయము నను నవి. వానిలో మనస్సుచే జ్ఞానేంద్రియంబులును, వాక్కుచే కర్మేంద్రియంబులును, కాయముచే సర్వదేహావయవములును గ్రహింపఁబడినవి. అన్ని జాతుల జనులును మనస్సుచేత సర్వవిధము లయిన కర్మములను జేయవచ్చును. వాక్కాయములచేత కర్మాచరణము గావించుటలో నధికారు లేర్పఱుపఁబడిరి. ఈ కర్మముల స్వభావమునుబట్టి యధికారు లేర్పఱపఁబడిరి. అట్టి యధికారులు బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు నని నాలుగు విధములు. వీనినే జాతు లందురు. మనస్సు మాత్రమె ప్రధాన మని భావించుచు, సృష్టికర్తృవిషయమును సృష్టి

విషయమును గూర్చి నిరంతరము నాలోచించువాఁడు బ్రాహ్మణుఁడు. అట్లు బ్రాహ్మణుఁ డాలోచించు విషయమును, వ్యవహారమునఁ బెట్టి జనోపయోగము గావించుచు జనులలో నన్యోన్యకలహములు లేకుండ పాలించువాఁడు క్షత్రియుఁడు. రాజాజ్ఞానుసారంబుగా సృష్టిని విస్తరింపఁజేయు విషయములను వ్యవహారమునఁ బెట్టి జనుల పోషణమునకై కృషి వాణిజ్య గోరక్షణాదికార్యములను జేయువాఁడు వైశ్యుఁడు. వీరి ముగ్గురికి సహాయభూతుఁ డయి పరిచర్యలను జేయువాఁడు శూద్రుఁడు. కావున సర్వవిధము లయిన కర్మకరులును వేదవిధులనుబట్టి శూద్రులుగాఁ జెప్పఁబడిరి. అయినను జాతులు నాలుగే యనుటకు కారణ మేమనఁగా, నీ ప్రశ్నమునకు సృష్టిరహస్యమును యుక్తముగా గ్రహించువారు సరియైన యుత్తరమును బొందఁగలరు. ఎట్లనిన, ప్రథమమున పురుషుఁ డుండె ననియు ఆ పురుషుఁడు తన ప్రభావముచేత సత్త్వరజస్తమోగుణాత్మక మయిన ప్రకృతి, మాయ, ప్రధానము నను పేరులతో నాయా శాస్త్రకర్తలచే వాడఁబడుచున్న మాయను స్వీకరించి జగత్తును సృజించె ననియు శ్రుతులు చెప్పుచున్నవి గాన, సత్త్వగుణంబును గ్రహించి బ్రాహ్మణుండును, రజస్సును గ్రహించి క్షత్రియుఁడును, తమసును గ్రహించి వైశ్యుఁడు నయ్యెను. అనఁగా, సత్త్వప్రధాన మయిన మనసు నే నని గ్రహించి బ్రాహ్మణుఁ డయ్యె. రజఃప్రధానము లైన ప్రాణేంద్రియాదులను నే నని భావించి క్షత్రియుం డయ్యెను. తమఃప్రధాన మయిన స్థూలము నే నని గ్రహించి వైశ్యుఁ డయ్యెను. పురుషబుద్ధి యీ మూఁడు జాతులయందే యుండుటచేత వేదవిహిత కర్మానుష్ఠానమున కధికారము గలిగెను. కేవలప్రకృతి భావమునందె యహంభావము గలిగి పురుషదృష్టి లేశ మయినను లేని జాతి శూద్రజాతి యయ్యెను.

దానికి కర్మాధికారము లేదు. అట్లయిన, శూద్రుఁడును సర్వకర్మములను మనసుచేత నెట్లు చేయవచ్చునందురా? దాని రహస్యమును వినుఁడు. మనసు బ్రాహ్మణుఁడు. ప్రాణము క్షత్రియుఁడు. స్థూలము వైశ్యుఁడు. సర్వదేశములయందును నీ నాలుగు జాతులు లేనిచో సృష్టి నశించును గాని నిలువదు. నాలుగుజాతు లనునవి సృష్టిని నశింపకుండ వృద్ధిచేయు వృత్తులు గాని వేఱు కావు. ప్రథమంబున నాయా వృత్తుల నవలంబించి యాయా వృత్తులందు నిపుణు లయినవారికిఁ గలిగిన సంతానములో నా వృత్తిని యుక్తముగా నెఱవేర్చు నేర్పు హెచ్చుగా నుండుటచేత నా వంశమును జాతి యని పిలుచుచున్నారు. సృష్టిస్థితిలయంబు లను వ్యాపారములను జేయు పరమాత్మ బ్రహ్మ విష్ణుశివు లని చెప్పఁబడుచున్నాఁడు గదా? వారిలో శివుఁడు బ్రాహ్మణుఁడు, విష్ణువు క్షత్రియుఁడు, బ్రహ్మ వైశ్యుఁడు. బ్రాహ్మణుఁడు భోక్తయె యగుటచేత లయకర్త యగు నీశ్వరుఁ డనఁబడును. క్షత్రియుఁడు పాలకుఁ డగుటచేత విష్ణు వనఁబడును. వైశ్యుఁడు కృషివాణిజ్యగోరక్షణవృత్తులచే సస్యాదులను సృష్టించుచుండుటచేత బ్రహ్మ యనఁబడును. ఈ మూఁడు జాతులయందును జ్ఞానశక్తి యను పురుషుం డుండకతీఱదు గాన, జ్ఞానవంతము లయిన యీ జాతులకే కర్మాధికారము చెప్పఁబడినది.

ఈ జాతులలోనివారికి నాలుగు ఆశ్రమము లేర్పఱుపఁబడినవి. వీనిలో బ్రహ్మచర్యవానప్రస్థసన్యాసాశ్రమములు నివృత్తిమార్గనిష్ఠములు. గృహస్థాశ్రమము ప్రవృత్తిమార్గనిష్ఠము.

ధర్మములు రాజధర్మములు మోక్షధర్మములు నని రెండు తెఱఁగులు. బ్రహ్మచర్యవానప్రస్థసన్యాసాశ్రమంబుల నున్నవారు మోక్షధర్మములను సేవింపవలెను. గృహస్థాశ్రమమున నున్నవారు రాజధర్మములను సేవింపవలెను. రాజధర్మములు ప్రపంచ మసత్య మను పక్షంబున జనించినవి. మోక్షధర్మములు ప్రపంచము సత్య మను పక్షమున జనించినవి. అందుచేతనే రాజధర్మములందు దుష్టసంహారము మొదలగు హింసలు గూడ ధర్మములుగఁ జెప్పఁబడినవి. మోక్షధర్మములన్నియు నహింసాప్రధానములుగా నుండును. అహింసాప్రధానధర్మములను గృహస్థుఁ డాచరింప లేఁడు. ఆచరించిన గార్హస్థ్యమునుండి చెడి సన్యాసి యగును. కావున గృహస్థుం డయిన యర్జునుఁడు అహింసాప్రధానధర్మా

సక్తుఁడయి యుద్ధమును మాన నిశ్చయించిన, భగవంతుఁడు 'నీ ధర్మ మిది కాదు. దుష్టహింస నీ ధర్మ' మని చెప్పి, యట్టి ధర్మమును ధైర్యముతో నర్జునుఁ డాచరించుటకయి ప్రపంచమిథ్యాత్వమును బోధించినాఁడు.

ధర్మ మనఁగ ప్రకాశముగా చేయునది. అధర్మ మనఁగ రహస్యముగఁ జేయునది. అందుచేతనే భగవంతునికి ధర్మము వక్షస్స్థల మనియు నధర్మము వీఁపనియు వేదములయందు చెప్పఁబడినది. ఇంతియ గాక, ధర్మాధర్మలక్షణములు భగవద్గీతలో 15-వ అధ్యాయమునందు ముక్తసరుగాఁ జెప్పఁబడినవి. ఒరులు తన కేమి గావించిన తన కానందము గలుగునో యట్లొరులకు తా నాచరించుట ధర్మము. ఒరులు తన కేమి గావించిన తనకు దుఃఖము గలుగునో యట్లొరులకుఁ జేయుట యధర్మము.

ఇట్లు వర్ణాశ్రమములను బట్టి విధింపఁబడిన పుణ్యకర్మములను నిష్కామముతోఁ గావించుచు నధర్మమును విడిచినవారికి భగవద్భక్తి గలుగును. ఆ భక్తివలన వైరాగ్యము గలుగును. భక్తివైరాగ్యములవలన జ్ఞానము గలుగును. ఇవి మోక్షమునకు ముఖ్యసాధనములు. ఈ మూడింటిలో భక్తి స్త్రీస్వభావము గలది. అనఁగా సేవ, పారతంత్ర్యము, జీవభావము నని చెప్పఁబడును. ప్రకృతి పురుషుని సేవించునట్లు ప్రకృతిభావమె జీవత్వము గావున ప్రకృతివలెనె యీశ్వరప్రాప్తికయి యీశ్వరపారతంత్ర్యయముచే నీశ్వరుని భజించుచు నుండవలెను. ఈశ్వరునిఁ బొందు కోరిక గలదు గాన కోరిక యున్నంతకాలము నీశ్వరునికి దాసుఁడయి భజింపవలసి వచ్చును. కావున కోరిక స్త్రీత్వ మని యర్థమయినది. ఇట్లు భజింపఁగా నీశ్వరదర్శన మయి యాతనిఁ గలయఁగనే నిష్కాముఁ డగును. అట్టి నిష్కామతయె వైరాగ్య మనఁబడును. అనఁగా నీశ్వరత్వము. కావున వైరాగ్యము పురుషుఁడు.

కామము స్త్రీ. నిష్కామము (వైరాగ్యము) పురుషుఁడు. పురుషుఁడు స్వతంత్రుఁడు. స్త్రీ పరతంత్రురాలు. ఇట్లు స్త్రీభావముచే చిరకాలము పరతంత్రుఁడయి యీశ్వరుని భజించి యెట్టకేలకు స్వతంత్రుఁడయి యాచారమును గూడ విడుచును. అపుడు స్త్రీత్వపుంస్త్వములు లేనందున నపుంసకుఁ డనఁబడి జ్ఞాని యగును. కాని జ్ఞాని స్త్రీయును పురుషుఁడును గూడఁ గాఁగలఁడు. ప్రకృతకాలమునందలి స్త్రీలే స్వాతంత్ర్యమును గోరుచుండఁగా పురుషుఁడు స్వాతంత్ర్యము నేల కోరఁగూడదు? కావున నందఱును పురుషు లయి స్వతంత్రు లయి అనఁగా వైరాగ్యవంతు లయి జ్ఞానమును బొంది మోక్షమును జూఱగొనవచ్చును. వైరాగ్యము లేనివారికి జ్ఞానము లేదు. జ్ఞానము లేనివారికి ముక్తి లేదు. కావున నోమహాశయులారా! వైరాగ్యవంతు లయి జ్ఞాను లయి బంధముక్తు లయి నిత్యానందలోలు రగుటకు సోదరులగు మిమ్ము ప్రోత్సహించుచు మన కందఱకు నిట్టి భక్తివైరాగ్యజ్ఞానములను గలిగించుటకును బంధముక్తిని బొందించుటకును సమర్థుఁడయి మనహృదయములందుండి సర్వసంకల్పసాక్షియై ప్రేరకుఁడయిన పరమాత్మను స్తుతించుచు నీ వ్యాసమును విరమించుచున్నాను.

# ఉద్యానకృషి

గోటేటి జోగిరాజుగారు

మన నివాసములచుట్టును కన్నుల కింపుగ నుండుటకును విహారముకొఱకును గానీ, యనువగు చోట్ల సర్వజనోపయోగముకొఱకుఁ గాని నిర్మింపఁబడు తోఁటల కుద్యానవనము లని పేరు. వీనిని పెంచుటయే యుద్యానకృషి.

ఉద్యానవనములో రమ్యము లగు నానావిధోద్భిజ్జములును ఉచితస్థలములం దాహ్లాదకరముగ నుండునట్లమర్పఁబడి పెంచఁబడుచుండును. ఏ దిక్కుఁ జూచినను, సృష్టివైచిత్ర్యములనేకములు గోచరమగుచుండును. కాలచక్రము తిరుగుచున్న కొలఁదిని పరివర్తన మొందుచుండు మనోహరము లగు వివిధ జాతుల పుష్పము లెల్లపుడును కన్నుల పండువు చేయుచుండును. వాని పరిమళము ఘ్రాణేంద్రియమునకు విందుగొలుపుచుండును. అందు ఫలించు రసవంతములగు వివిధజాతుల ఫలములును, శాకములును జిహ్వేంద్రియమును దృప్తిపఱుచుచుండును. ఇంతేల! ఉద్యానములందు వసించుటవలనఁ గలుగు మనోనైర్మల్యమును, ఆరోగ్యమును సౌఖ్యమును అప్రమేయములు.

ఉద్యానకృషి భరతవర్షమున మిగులఁ బురాతనకళ. రమారమి 4 వే॥ సంవత్సరముల క్రిందటనే జనులు తమ యిండ్లకు వెనుకను ముందును బాటలప్రక్కలను పుష్పవృక్షములను పెంచుచుండి రని గొన్నిమంత్రంబులు దెలుపుచుండుటచే నుద్యానకృషిబీజము లప్పటికే నాటియున్న వని యెన్నఁదగును.



ఉద్యానవనము, పూనా ।

మన పురాణకథలందును మహాకావ్యము లగు రామాయణమహాభారతములందును గూడ నుద్యానవనము లెక్కుడు మనోహరముగ వర్ణింపఁబడియున్నవి. ఈ వర్ణనలనుబట్టి చూచినయెడల నక్కాలపుటుద్యానములిపుడు పాశ్చాత్యపద్ధతుల ననుసరించి వేయు తోఁటలంత శాస్త్రీయములుగ లేకపోయినను, నానావిధతరులతాగుల్మాదిసంచయమును, అక్కడక్కడ పొదరిండ్లు, సోపానములు, కొలఁకులు, మొదలగునవియుఁ గలిగి మిగుల శోభాయమానములుగ నుండె ననుటకు సందేహము లేదు.

కావ్యములందును బురాణములందును గల వర్ణనల నటుంచి చారిత్రాంశములనుబట్టిచూచినను, నృపాలు రుద్యానవనములను నిర్మించుకొని యందు నివసించువాడుక క్రీస్తుశకమునకుఁ బూర్వమునుండియు నార్యావర్తమునఁ గల దనుటకు నిదర్శనములు గలవు. క్రీ. పూ. 557 సం. ల క్రిందట బుద్ధుఁడు లంచినీవన మనఁబడు తోఁటలో జనించె ననియు తరువాత నాతని జన్మస్థానమున నశోకుఁ డొక శాసనమును వేయించె ననియు చరిత్రకారులు వ్రాయుచున్నారు. క్రీస్తుపూర్వము 297 సం. ల క్రిందట మగధరాజ్యాధిపతి యగు చంద్రగుప్తచక్రవర్తియొక్క రాజమందిరము పాటలీపుత్రమున నొక యుద్యానవనములో నుండె నని మెగస్తనీసు అను రాయబారియొక్క వ్రాఁతలవలనఁ దెలియుచున్నది.

హిందూదేశపుఁ దరువాతి చరిత్రయందు మరల

15-వ శతాబ్దమువఱకు నుద్యానవర్ణన లంతగాఁ గానరావు. అయినను అప్పటి భూపాలుర కుద్యానవనములం దభిలాష లేకయుండె నని గాని, యుద్యానకృషి యెఱుగం రె నని గాని యూహించుటకుఁ గారణము లెవ్వియును లేవు. మన దేశమునఁ జరిత్రలు వ్రాయు నాచారము లేకపోవుటవలన నప్పటి విషయము లనేకము మనకుఁ దెలియకున్నవి.

15-వ శతాబ్దమున మిగుల వైభవముతో నుండిన విజయనగర సామ్రాజ్యమం దుద్యానకృషి యుచ్చస్థితియం దుండె నని తెలియుచున్నది. 1404 మొదలు 1422-వ సం. వఱకు నీ రాజ్యము నేలిన రెండవ బుక్కరాయలు తుంగభద్రానది కానకట్ట గట్టి రాజధానిలోనికి కాల్వలను త్రవ్వించి జలసమృద్ధి గావించుటచేఁ బూర్వము తోఁటలు మొదలగునవి పెరుఁగని చోట్ల నెచటఁ జూచినను, లతాకుంజములును పుష్పోద్యానములును ద్రాక్షాతాంబూలాదుల తోఁటలును, సమృద్ధిగఁ బెరిఁగి నగరశోభను హెచ్చించె నని చరిత్రకారులు వ్రాయుచున్నారు. తరువాత నొక శతాబ్దము గడచిన వెనుక నా పట్టణమును జూడవచ్చినవారు గూడ విజయనగరము యొక్క వైభవమును బొగడుచు, నందలి యుద్యానములను వర్ణించియున్నారు. 1520-వ సంవత్సరమున శ్రీకృష్ణరాయల యాధిపత్యముక్రింద విజయనగరసామ్రాజ్య మత్యున్నతవైభవముతో నెగడుచుండఁగా 'ఫిగరిడో' యను పోర్చుగీసు రాయబారి యా నగరమును జూచి వ్రాసిన వర్ణనలో నిట్లు గలదు.—

"నాకుఁ గనుపట్టిన భాగము రోమకపురియంత పెద్దదిగా నుండి చూపునకు మిక్కిలి సుందరముగాఁ గానుపించెను. దానిలోపల చెట్లగుంపు లనేకములు గలవు. ఇండ్లకుఁ జేరిన తోఁటలలో నీళ్లకాలువలును, నచ్చటచట చెఱువులును గలవు. రాజు తన యంతఃపురసమీపమునఁ దాళ్లవనములను, నానావిధఫలవృక్షములతోఁ గూడిన తోఁపులను గలిగియుండెను. తురుష్కుల నివాసభూమికి దిగువ నొక చిన్న నది యున్నది. మామిడితోఁటలు, పనసతోఁటలు, నిమ్మతోఁటలు, నారింజతోఁటలు మొదలగునవి దట్టముగఁ బెరుఁగుచు మహారణ్యమువలె నల్లుకొనియున్నవి. తెల్ల ద్రాక్షలు గూడ విశేషముగఁ గలవు."

మఱియు రాయలకాలమున వ్రాయఁబడిన మనుచరిత్ర వసుచరిత్ర మున్నగు ప్రసిద్ధకావ్యముల లోని యసమానము లగు వర్ణనలను బట్టి యక్కాలపు రాజదంపతుల యొక్కయు ఇతర రాజ వర్గము యొక్కయు, వినోదక్రీడలం దుద్యానవిహారము మిగులఁ బ్రముఖతను బడసి యుండె ననుటకు సందేహము లేదు.



గాణీతోఁట, పునహ

కొందఱు మొగలాయి చక్రవర్తులు గూడ నుద్యానవిహారమునం దభిలాష గలవారై యున్నట్లు తెలియుచున్నది. ఢిల్లీ నగరమందు జహాంగీరు పాదుషా రాజ్యమేలుచుండఁగా 1611-వ సంవత్సరమున నా నగరమును దర్శించిన విల్లియం ఫించు అను చరిత్రకారుఁ డా నగరవర్ణనమున "సుందరోద్యానవనములచేతను, ప్రాచీనశోభాచిహ్నము లగు కట్టడములచేతను జుట్టఁబడిన బహిఃప్రదేశమున నీ ఢిల్లీనగర మున్నది" యని వ్రాసియున్నాఁడు. ఢిల్లీయం దిప్పటికిని బహుసుందరమై యలరారు 'రాణీతోఁట' షహాజహాన్ పాదుషాగారి కాలమున జహానారా బేగముగారిచే నిర్మింపఁబడిన దని ప్రతీతి గలదు. ఔరంగజేబు పట్టాభిషేకస్థాన మయిన 'షాలిమరు' తోఁటయు, 'రోషనారా' తోఁటయు నీ చక్రవర్తికాలమున నిర్మింపఁబడియుండును.

ఇపు డుదయపురములో మిగుల విశాలమును, నేత్రానందదాయకమును నగు తోఁట టిప్పూ సుల్తానుచే నిర్మింపఁబడెనఁట.

హైందవోద్యానకృషి యిట్లు మిగులఁ బురాతనమై, యీ విద్యయం దభిలాష గల కొందఱు కొందఱు రాజుల కాలమం దౌన్నత్యము నొందె ననుటకును, పాశ్చాత్య పద్ధతుల ననుసరించి యిపుడు నిర్మింపఁబడు నుద్యానవనములతోఁ గొంతవఱకుఁ బోల్పఁదగు తోఁటలు పూర్వకాలమం దప్పుడప్పుడుండె ననుటకును సందేహము లేదు. అయినను హిందూదేశమందలి యితర విద్యలన్నిటివలెనే నివియు నిటీవలఁ గొన్ని కారణములచేఁ బాశ్చాత్య దేశములలోవలెఁ గ్రమక్రమముగ నభివృద్ధి నొందుటకు బదులు తన యౌన్నత్యమును గోల్పోయెను. తక్కిన విద్యల హీనస్థితికివలెనే వీని హీనస్థితికిని దేశకాలవైపరీత్యము లొక ముఖ్యకారణము. మరియు జనసామాన్యమున కిట్టి ప్రకృతి విద్యలం దభిలాష తక్కువగుట యిందుకుఁ దోడ్పడెను.



డాల్లెటీసరోవరము, మాథెరాను

ఇప్పటికి రమారమి 50 సంవత్సరముల క్రిందట నప్పటి హైందవోద్యానకృషియొక్క దుస్థితిని గూర్చి యొక యుద్యానకృషిశాస్త్రజ్ఞుఁ డిట్లు వ్రాసెను.—

“ఎంత యభిమానబుద్ధితో నాలోచించినను, హిందూదేశమం దుద్యానకృషి యేమియు నభివృద్ధిగ నున్న దని చెప్పుటకు వీలు లేదు. దేశీయులలో గొప్పవారి కీ విద్యయం దేమియు నభిలాష యున్నట్లు కనఁబడదు. వా రెన్నడును దానియందు శ్రద్ధ చూపలేదు. దాని నుదగ పోషణకొఱ కవలంబించినవారు, దమ కాలము నంతను మనస్ఫూర్తిగ నీ విద్యకు వినియోగించునంతటి లాభ మందఁ గానరాకుండెను. వారు పెంచు పూలజాతులు మిగులఁ దక్కువ. అవి యైనను, పూర్వాచారము ననుసరించి మతవిషయములందలి పూజలం దుపయోగింపఁబడుటచేతనే వారి యామోదమును బడయుచున్నవి గాని, వారికిఁ గల నిజమయిన యభిరుచిచేఁ గాదు. ఇశ్లే బజాఱులలో నమ్మకమునకు వచ్చు పండ్లును మిగుల హీనము లగు రకములు. విక్రయమునకు వచ్చు మామిడిపండ్లు, జేమపండ్లు, అనాసపండ్లు, అరఁటిపండ్లు మొదలగున వన్నియు పనికిమాలిన రకము లని చెప్పకతీఱదు. ఈ దుస్థితికి తోఁటలను పెంచువారి యుపేక్షాభావము తప్ప తగిన కారణ మేమియుఁ గానరాదు. మంచిరకముల పండ్లను పుష్పజాతులను బెంచుట కించుక శ్రద్ధ వహించినఁ జాలును. ఈ యణుమాత్రపు శ్రద్ధయుఁ గూడఁ దీసికొనుటకు తగిన యుత్సాహంబు లేదు. వారు పెంచు ఫలవృక్షములు సామాన్యముగ పాఱవేసిన టెంకలు మొదలగునవి మొలచుటచేఁ బుట్టు నధమజాతి వృక్షములు. మంచివిత్తునుండి యెల్లపుడును మంచిరకపు మొక్కయె పుట్టు నను నిశ్చయము లేకపోయినను చెడ్డవిత్తునుండి చెడుమొక్కయే పుట్టు ననుటకు సందేహము లేదు. ఇట్లు పడి మొలచు మొక్కలును తమంతట తాము పెరుఁగవలెనే గాని, వీరు చేయు కృషి యేమియు లేదు. ఒక్కొకప్పుడొకే జాతి చెట్లు గుంపు గూడి గాని, యితరజాతుల చెట్ల నడుమ నిఱికి గాని యీ ఫలవృక్షములు పెరుఁగుచుండును.”

ఇట్లుద్యానకృషి 19-వ శతాబ్దమధ్యమందు మిగుల హీనస్థితియం దుండుటం గని యప్పటికిఁ దమ ప్రభుత్వము నీ దేశమున బాగుగ నాటియుండిన యాంగ్లపాలకు లీ విద్య నభివృద్ధిలోనికిఁ దెచ్చుటకు యత్నములను జేయఁ దొడఁగిరి. వారి యత్నములచేతను, ఆంగ్లప్రభుత్వము వలన దేశమున కంతటికిని గలిగిన శాంతివలనను, నూతనోజ్జీవమువలనను మరల నీ విద్య క్రమక్రమముగ వృద్ధి నొందుచున్నది.

దొరతనపువా రిపుడు కలకత్తా మొదలగు గొప్ప పట్టణములందు ప్రవీణు లగు పాశ్చాత్యోద్యానపాలకులచేఁ గొన్ని తోఁటలను నిర్మాణము చేయించి యందు శాస్త్రీయముగ నెన్నియో వందల జాతుల మొక్కలను బరీక్షింపించుచున్నారు. దొరతనపువారిచేతను, వారి సహాయమును బొందుచున్న యుద్యానకృషిసంఘముల చేతను, సర్వజనోపయోగార్థమై నిర్మింపఁబడిన యుద్యానవనములలో ముఖ్యము లగు కొన్నిటి నీ క్రిందఁ బేర్కొన నగును.

1. చెన్నపురి యుద్యానసంఘమువారి యారామము.
2. కలకత్తా యుద్భిజ్జవనము.
3. సహారాంపురపు ఉద్భిజ్జవనము.
4. ఉదకమండలపు ఉద్భిజ్జవనము.
5. సిబ్‌పురపు ఉద్భిజ్జవనము.
6. అనండేల్ వనము, సిమ్లా.
7. రాణితోఁట, బొంబయి.

ఇవి గాక, ప్రతి రాజధానియొక్క గవర్నరుగారి భవనము చుట్టును గూడ సుందరమైన యుద్యానవనములు గలవు. బొంబాయి గవర్నరుగారు నివసించు పునహాయందలి భవనమును జుట్టియున్నట్టియు ఉదయపురపు రాజమందిరమును జుట్టియున్నట్టియు నుద్యానవనములందుఁ దీసిన పటములు గొన్ని యీ సంచికయందు ముద్రింపఁ బడెను.



ఉద్యానవనము, పునహ



తోట ఇల్లు, జపాను

మఱియుఁ గొందఱు గొప్పగొప్ప స్వదేశ సంస్థానాధీశులకుఁ గూడ నీవిద్యయం దభిరుచి గలుగ నారంభించెను. వారు గూడ దొరతనపువారి తోఁటలలో పని నేర్చిన హైందవోద్యాన పాలకులను గాని, ఐరోపీయులను గాని తగిన జీతము లిచ్చి తమ కొలువునం దుంచుకొని, తమ రాజధానులం దుద్యానవనములను నిర్మించుకొనఁదొడఁగిరి. ఇపు డట్టి తోఁటలు మైసూరు, హైదరాబాద్, బరోడా, ఉదయపురము, జయపురము, గ్వాలియర్, దర్భంగ మొదలగు సంస్థానము లన్నిటియందును గలవు.

ఈ దేశమున కుద్యోగము చేయవచ్చిన కొందఱు ఐరోపీయులు గూడ నీ విద్యయందుఁ గల యభిలాషచేఁ గ్రొత్తజాతుల మొక్కలను దెప్పించి తమ భవనముల చుట్టును గల విశాల స్థలముల నుద్యానములుగ మార్చుకొని సౌఖ్యము ననుభవించుచు, నీ దేశీయులకు మార్గదర్శకు లగుటచేత, ఈ విద్యావ్యాపకమునకుఁ జాలవఱకుఁ దోడ్పడుచున్నారు.

ఇంతవఱకీ దేశమందలి యుద్యానకృషిచరిత్రను సంగ్రహముగఁ దెలిపితిమి. ఇఁక నుద్యానవననిర్మాణమును, పాలనమును గుఱించి గూడ సంగ్రహముగఁ గొంత దెలిపెదము.

ఉద్యాననిర్మాణమునందు మొదట ననుకూలమయిన నేలను జూచుకొనవలెను. ప్రతికూలమగు నేలపై నెంత పని చేసినను శోభింపదు. నీరు నిలువని మెరక గరువు లుద్యానవనములకుఁ బ్రశస్తములు. నేలయందలి లోపముల నుచితరీతిని సవరింపవచ్చును.

నేల మంచిదయినను, తగిన నీటివసతి లేనియెడల

నది నిరుపయోగము. కావున నిర్మాణప్రారంభముననే
తగిన నూతిని గాని కొలఁకును గాని నిర్మింపవలెను.

తగిననేలను నీటివసతిని ఏర్పఱచుకొనినపిమ్మట
నెవరి రసికతను బుద్ధిసూక్ష్మతను బట్టి వారు తమ
యుద్యానమునకు
నిర్మాణపథకము
నేర్పఱచుకొనవలసి
యుండును. నిర్మాణ
కుఁడు తన చాతుర్య
మును జూపుటకి దు
విశేషావకాశము
గలదు. ఈ విద్య
కవనము వంటిది.
కావ్యములందు పద
ములను చితరీతిని
ప్రయోగించుటచే
వివిధాలంకారములం
గల్పించి కవులు తమ కావ్యముల నెట్లు రంజకముగఁ
జేయుదురో, అ ద్యానపాలకుఁ డుద్భిజ్జకోటిని తగిన
విధమున నాయాచోట్ల నమర్చి రమ్యములగు నుద్భిజ్జ
కూటములు, పొదటిండ్లు, ఫెరను గృహములు మొదలగు
వానిని గల్పించుటచే నుద్యానవనములను శోభాయుత
ముగఁ జేయవలెను.

ఇట్లుద్యాననిర్మాణమునందు పాలకుని చాతు
ర్యమే ప్రధాన మైనను, ప్రారంభకులకుఁ ద్రోవఁ జూపు
టకుఁ గొన్ని సామాన్యసూత్రముల నిచటఁ దెలుపనగును.

ఉద్యానవనమునకు చుట్టును ఏదో యొక యా
వరణ మావశ్యకము. టుకతోఁ గాని రాతితోఁ గాని
గోడ కట్టుట మిగుల మంచిది. సీమచింత మొదలగు
జాతుల మొక్కలను కట్టనగ పెంచినను పెంచవచ్చును.
బాటలను కాలిత్రోవలను ఏర్పఱచుట యుద్యాననిర్మా
ణమునందలి రెండవ పని. చుట్టును 10, 12 అడుగుల
వెడల్పునకుఁ దక్కువ గాని బాట యొకటి యుండుట
మంచిది. పెద్దపెద్ద వనములలో నడుమ నడుమఁ గూడ
నట్టి బాట లుండవలసియుండును. పెద్దబాటలనుండి చీలు
చిన్న చిన్న కాలిత్రోవలు (4 మొదలు 8 అడుగులవఱకు
వెడల్పు గలవి) తోఁటయం దంతటను వ్యాపింపవలెను.
బాటలును త్రోవలును కేవలము నిడివిగా నుండుట
కంటె సౌమ్యములగు వంపులతోఁ గూడియుండుట
మనోహరము. అక్కడక్కడ నిడివిబాటలును ఉండవచ్చు
ను. పెద్దబాటల ప్రక్క నీడ నిచ్చు పెద్ద వృక్షములను,
చిన్న త్రోవల ప్రక్కల నక్కడక్కడ వివిధము లగు
పూలచెట్లను తుప్పలను పాతవలెను. త్రోవ లొకదాని
నొకటి కలియు చో
ట్లను, ఉచితము లగు
నితరస్థలములందును
నక్కడక్కడ కమా
నులును, పందిళ్లను
వేసి తీఁగల నెక్కించ
వలెను. తోఁట నడు
మ యజమానుని
గృహముగాని, సర్వ
జనోపయోగార్థము
నిర్మింపఁబడిన యు
ద్యానవన మైనయెడ
ల విశ్రమమందిరము
గాని యుండవలెను. బాటలప్రక్క మంచినీడ నిచ్చు చెట్ల
క్రిందను, చలువపందిళ్లక్రిందను గూడ విశ్రమించుట కాస
నము లుండవలెను. బాటలకును, కాలిత్రోవలకును నడుమ
నుండు స్థలములలో నక్కడక్కడ పూలమొక్కలను వివి
ధాకారములుగ చతురతచొప్పున నేర్పాటుచేయవచ్చును.
కొన్ని బహిఃప్రదేశములందు, గరిక మొదలగు గడ్డిజాతు
లను బెంచి కత్తిరించుటచే మిగుల నందమగు పచ్చికబయ
ళ్ళను నిర్మింపవలెను. ఒకటి రెండు చోట్ల కొలఁకులను
త్రవ్వి యందు నీళ్ళలో పెరుఁగు కలువ మొదలగు జాతు
లను బెంచవలెను. తోఁటయం దంతటను అక్కడక్కడ
మనోహరము లగు పెద్ద వృక్షములను పెంచవచ్చును.
కొంత ప్రదేశమందు ప్రత్యేకముగ ఫలవృక్షములును,
కూరగాయలును బెంచవచ్చును. శీతలప్రదేశములందు
పెరుఁగు ఫెరనులు మొదలగు జాతులను బెంచుటకు
తగిన పొదటింట్లను ఫెరను గృహములును గూడ నుద్యాన
వనమున నుండితీరవలయును. విశ్రమమందిరపు వసా
రాలలోను కొన్ని త్రోవల ప్రక్కలను కుండ్లలో
పెంచిన మొక్క లుంచవచ్చును. కొన్ని మొక్కలను,
తీగఁలతో చేసిన యుట్లలో వ్రేలాడఁగట్టవచ్చును. ఇట్లె
వివిధస్వభావములు గల జాతు లన్నిటిని, ఇంకను పలు
తెఱఁగుల నుచితరీతిని తోఁటయం దమర్చి, చూపఱకు
నేత్రానందకరముగ నుండునట్లు చేయవచ్చును. బాటలను


ఉదయపుర రాజమందిరము

త్రోవలను అనుదినమును తుడుచుచు, అంచులను మొలచు గడ్డిని కత్తిరించుచు వానిని బరిశుభ్రముగ నుంచినయెడల నవి యంతటికిని శోభ తెచ్చును. ఉద్యాన కృషిలోఁ బెంచఁబడు నుద్భిజ్జజాతుల నీ క్రింది తరగతులుగ విభాగింపవచ్చును.

1. ఏకవార్షిక పుష్పజాతులు.
   a. దేశీయములు.-బంతి, గోరింట, సూర్యకాంతము మొ.
   b. విదేశీయములు.—కోరియాప్సిసు, గైలార్డియము, వర్బీనము మొ.
2. పూలమొక్కల మళ్లయంచులను వేయు జాతులు. — ఆల్టర్నాంతెరము మొ.
3. దుంపజాతులు.—చెంగల్వ, కలేడియము, డాల్లియము మొ.
4. పొదటిండ్లలోను ఘరను గృహములలోను పెంచు జాతులు.—ఘరనులు, అలోకేడియము, బిగోనియము మొ.
5. నీటిలోఁ బెరుఁగునవి.—కలువ, విక్టోరియారిజియము మొ.
6. రాళ్లగుట్టలపై పెరుఁగునవి.—చాగ, చెముడు మొ.
7. సువాసన గల యాకులు గలవి.— నిమ్మగడ్డి, రుద్రజడ, దమనము, మరువము మొ.
8. రమ్యముగ నుండు పర్ణజాతులు.—క్రోటనులు, ఎరాంతిమము మొ.
9. మంచిమంచి పూవులను బూయు తుప్పలు చెట్లు. —మల్లె, పారిజాతము, గులాబీ, మందారము మొ.
10. తీఁగజాతులు.—మల్లె, మాధవి, జూకామల్లె మొ.
11. బాటల ప్రక్కలను ఇతర స్థలములను నీడకొఱకును రమ్యతకొఱకును పెంచఁబడు జాతులు.—పొన్న, నిద్రగన్నేరు, రావి మొ.
12. కంచెల కుపయోగించునవి.—కిత్తనార, సీమచింత మొ.
13. కూరగాయలు.
    a. దేశీయములు.—వంగ, బెండ మొ.
    b. విదేశీయములు.—సీమవంగ, నూలుకోటు, కాబేజి మొ.
14. ఫలవృక్షములు.—మామిడి, నారింజ, సపోటా మొ.



పై తరగతులలో మిగుల రమ్యముగ నుండు జాతులును ఉపజాతులును వేనవేలు గలవు. ఒక గులాబీలోనే 200 రకములకు పైఁగాఁ గలవు. ఉద్యానపాలకుఁడు తోఁటకుఁ గావలసిన జాతుల నెన్నుకొనుటలోఁ గూడ మిగుల జాగరూకత గలిగియుండవలెను. సాధ్యమయినంత తక్కువ కృషితో నెక్కువ శోభ దెచ్చునవి మెండుగ సంపాదింపవలెను. ఉద్యాననిర్మాణమునం దెంత శ్రద్ధ గావలయునో, మొక్కల నెంచుటయందును, వానిని బెంచుటయందును గూడ నంతకంటె నెక్కువ శ్రద్ధ కావలయును. నేలను ద్రవ్వి శుభ్రముచేయుట, వివిధములగు నెరవులను మంటితోఁ గలుపుటవలన నాయా జాతుల కనుకూలమగు మంటిని సిద్ధపఱచుట, నాఱు పోసి మొక్కలను పెంచుట, వానిని విడఁదీసి మళ్లలోఁగాని కుండ్లలోఁగాని నాటుట, వివిధములగు నంట్లచేతను ఖండసులచేతను ఆయా జాతులను ప్రవర్ధనము చేయుట, మొక్కలకు అదను గనిపెట్టి నీరు పోయుట, గొప్పు త్రవ్వుట, గలుపు తీయుట, ఆయా జాతులు బాగుగ పూయుటకును కాయుటకును గాని అందముగ నుండుటకుఁ గాని కొమ్మలు మొదలగువానిని ఛేదనము చేయుట మొదలగు తక్కిన పనులందును తగిన యనుభవమును సంపాదించి, వాని నన్నిటిని మిగుల జాగరూకతతోను ఓపికతోను జేయవలయును. కేవలము జీతములకొఱకు పాటుపడు మాలీలకే వదలినయెడల నీ పను లెన్నఁడును బాగుగ జరగవు. కాన సాధ్యమైనంతవఱకును యజమానుఁడే తన యుద్యానమును జూచుకొనుచుండవలెను. యజమానుఁ డయినను, తన పనియం దనురాగము గలిగి మిగులఁ దెలివిగను శ్రద్ధగను జూచినఁ గాని యే యుద్యానవనమును రమ్యముగ నుండనేరదు.

# ఆంధ్రజన విద్యావ్యాప్తి

వేమవరపు రామదాసు పంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

సమస్తమయిన అభివృద్ధికిని విద్యయే మూలసాధనము. ఆంధ్రులయం దుద్భవించిన నూతనోజ్జీవము యొక్క స్థైర్యసిద్ధికిని వా రభిలషించు మహోన్నతపదవి యొక్క ప్రాప్తికిని ఆంధ్రదేశమందు నిజమైన విద్యావ్యాప్తి తప్ప సాధనాంతరము లేదు. మన స్థితిగతులు మన విద్యమీఁదనే యాధారపడియుండుటచేత విద్యాసమస్యయొక్క నిర్వహణము మన కార్యక్రమమున ముఖ్యాంశము మాత్రమే గాక మొదటి విషయముగా నుండఁదగియున్నది. మన దేశమందు వ్యాప్తిచెందుచున్న పాశ్చాత్యవిద్యయందు ఆంధ్రేతరులతో మనలను పోల్చి చూచికొన్నప్పుడు వారికంటె మనము వెనుకఁబడియున్నా మని యొప్పికొనవలసినదే. మన రాజధానియందుఁ గల ముప్పది కళాశాలలలో నెనిమిది మాత్రమే మన తెనుఁగుజిల్లాలలో కలవు. దత్తమండలములందును నెల్లూరు చిత్తూరు జిల్లాలయందును, అనఁగా నాంధ్రదేశమున నాఱుజిల్లాలలో నొక్క కళాశాలనైన లేదు. ఇంజినీరింగు, టీచింగు, లా, మెడిసిను, ఎగ్రికల్చరు మొదలగు వృత్తులందున్నతవిద్యను నేర్పెడి కళాశాల యొక్కటైనను తెనుఁగుజిల్లాలలో లేదు. మన రాజధానిలో 756 సెకండరీ పాఠశాలలు గలవు. వానిలో 178 మాత్రమే ఆంధ్రదేశమున నున్నవి. చేతిపనులు, శిల్పములు మొదలగు కర్మవిద్యలను నేర్పుటకై దొరతనమువారిచే నీ రాజధానియందు స్థాపింపఁబడిన ఏఁబది విద్యాలయములలో మనవంతునకు తొమ్మిది మాత్రమే లభించినవి. ఎలిమెంటరీ, ప్రైమరీ పాఠశాలల యొక్క సంఖ్య గూడ నిట్టి విషాదకర మగు వ్యత్యయమునే తెలుపుచున్నది. విద్య నేర్చిన జనుల సంఖ్యను బట్టి మన రాజధానిలోని జిల్లాలను వరుసగా పరిగణింపఁ జూచినచో, విద్యావ్యాప్తియం దాంధ్రదేశమున నగ్రస్థానము నలంకరించి నూటికి పండ్రెండుమంది విద్య నేర్చిన జనులు గల కృష్ణాజిల్లా, రాజధానియందలి జిల్లాలలో విద్యయందు 13వ స్థానమున నున్నది. తక్కిన తెలుఁగు జిల్లాల సంగతి చెప్పనక్కఱయే లేదు. మన రాజధానిలో పట్టపరీక్షలందు కృతార్థు లయినవారు రమారమి 15,000 మంది గలరు. వారిలో మనవారు 2,700 లకు లోపుగా నున్నారు. ఆంధ్రేతరులతోపాటు మనయందు విద్య వ్యాపించియుండినయెడల జనసంఖ్యను బట్టి మనలో 6,000 మంది పట్టపరీక్షల నిచ్చినవా రుండియుండవలయును. మన విద్యయొక్క హైన్యదశను నిరూపించుట కిట్టి నిదర్శనముల ననేకములను జూపవచ్చును.

పాఠశాలలందు నేర్పఁబడు విద్య గాక యితరవిధమైన విద్యయొక్క వ్యాప్తియు నాంధ్రదేశమునఁ గానరాదు. వంగదేశమందును మహారాష్ట్రదేశమందును ద్రవిడ మళయాళ దేశములందును జనులకు స్వభాషాజ్ఞానము మెండు. మాతృభాషను వ్రాయను చదువను నేర్చినవారు, వారిలో నాంధ్రులకంటె నెక్కువమంది గలరు. మరియు ఆయా భాషలందు వివిధశాస్త్రవిజ్ఞానము నొసంగఁజాలిన వాఙ్మయము కొంతవఱకు కలదు. ఆంధ్రభాషయందు కేవలసాహిత్యగ్రంథములు తప్ప శాస్త్రజ్ఞానము నిచ్చెడి గ్రంథము లింతవఱకు లే వనియె చెప్పవలసియున్నది. ఒక్క శాస్త్రమైన సమగ్రముగ నన్యభాషాపరిచయము లేనివారు తెలిసికొనుటకు తగిన సదుపాయములు మన భాషయందు లేవు. విదేశభాషాసహాయముచే మనకు విద్య నేర్పఁబడుచుండుటచే, సంపాదింపఁదగిన జ్ఞాన మంతయు ఆ విదేశభాషయొక్క మధ్యవర్తిత్వముచేతనె యలవడవలసియున్నది. మాతృభాషాజ్ఞానము గల పండితులు వివిధశాస్త్రజ్ఞానమును, అన్యభాషాపరిచితియు లేనివా రగుటచే మనకు వలయు గ్రంథము నొక్కదానినైన వారు వ్రాయుటకు సమర్థులు గాకున్నారు. ఆంగ్లేయభాషాజ్ఞానముచే, శాస్త్రములను జదివినవారికి స్వభాషలో గ్రంథకరణోద్యమమునకుఁ దగిన మాతృభాషాజ్ఞానము లేకపోవుటచే వారు కూడ మన వాఙ్మయమునందుఁ గల లోపమును దీర్ప లేకున్నారు. ఇట్టి లోపమును నివారింపఁగలిగినప్పుడే జనులయందు విద్య వ్యాపించును గాని, కష్టసాధ్యమైన ఆంగ్లేయభాష ఎన్నటికైన మన దేశభాష యై దాని మూలమున జనులకు జ్ఞానము అబ్బు నని నమ్ముట వట్టి వెఱ్ఱి. పాఠశాలలందు దేశభాషలలో విద్యను నేర్పు

ప్రయత్నములు జరుగకపోవుటయే గాక దేశభాషాభ్యాసము విద్యార్థులయందు తగ్గిపోవు పద్ధతులు పాఠశాలలం దవలంబింపఁబడుచున్నవి. ఇది మిక్కిలి శోచనీయ మైన విషయము.

కాఁబట్టి మన మాంధ్రులందు విద్యావ్యాప్తికై చేయఁదగు ప్రయత్నములు రెండు. మొదటిది పాశ్చాత్య పద్ధతి ననుసరించి పాఠశాలలో నేర్పఁబడు విద్యను ఇప్పటి కంటె నెక్కువగా నాంధ్రదేశమున వ్యాపింపఁజేయుట. రెండవది జనసామాన్యమునకు అన్యభాషామధ్యవర్తిత్వముతో నవసరము లేకుండ విద్యను లభింపఁజేయుటకై వలయు గ్రంథసామగ్రిని స్వభాషయందు సమకూర్చుట. ప్రస్తుతస్థితియందు ఈ రెండు కార్యములును స్వసహాయమువలనను గౌర్నమెంటువారి సహాయమువలనను గూడ సిద్ధింపఁదగియున్నవి. సంవత్సరమున కొకసారి సమావేశమగు కాన్ఫరెన్సులలో విద్యను గుఱించి చేయఁబడు తీర్మానములు మన కెంతమాత్రమును సహాయ మొనర్పనేరవు. నిరంతరమును ఈ విషయమై దీక్ష వహించి పని చేయుటకు ఆంధ్రుల సంఘ మొక్కటైన నుండిననే గాని మనయందు విద్యావ్యాప్తికై తగిన ప్రయత్నములు జరుగుట కల్ల. ఆంధ్రదేశమున కళాశాలలయొక్కయు పాఠశాలలయొక్కయు సంఖ్యను వృద్ధిచేసియు, మన మేయే విద్యాశాఖలందు వెనుకఁబడియున్నామో ఆయా శాఖలలో మన విద్యార్థుల సంఖ్యను వృద్ధిచేయుటకై విద్యార్థివేతనములు మొదలగు ప్రోత్సాహసాధనముల నేర్పఱచియు స్కూళ్ల సహాయార్థమై యీయఁబడు గ్రాంట్లను గుఱించిన నిబంధనలను మార్చియు గౌర్నమెంటువారు మన కుపకారము చేయుటకై వారిని సదా హెచ్చరించుచుండవలయును. విద్యావ్యాప్తికై కంకణము గట్టుకొని పనిచేయుచుండు సంఘమువారిచే నిట్టి విజ్ఞాపనములు చేయఁబడినప్పుడు అవి ప్రభుత్వమువారి యాదరణమును పొందకమానవు. మఱియు ఉన్నతవిద్యాశాఖలలో వేనియందు అభివృద్ధి మిక్కిలి తక్కువగ నున్నదో అట్టి శాస్త్రపఠనమును మన దేశమందును విదేశములందును అభ్యసించెడు విద్యార్థులకు ధనసహాయము చేయుట అత్యావశ్యక మగు కార్యములం దొకటియై యున్నది. వివిధవిషయబోధకము లగు పఠనగ్రంథములను ప్రకృతిశాస్త్రాదులను గుఱించిన వాఙ్మయమును మాతృభాషయందు కల్పించుటకై జరుగుచున్న ప్రయత్నములకు తోడ్పడుట మఱియొక ముఖ్యమైన కార్యము. ఇట్టి కార్యములు ప్రత్యేకసంఘనిర్మాణముచేతఁ గాని సాధ్యము కావు.

ఆంధ్రభాషావిద్యాభివృద్ధిసంఘము నొకదానిని స్థాపింపవలయు ననునభిప్రాయమును గౌరవనీయులును ప్రథమాంధ్రమహాజనసభాధ్యక్షులును నామిత్రులు నగు బయ్యా నరసింహేశ్వరశర్మగారు తమ మిత్రుల హృదయములందు దృఢముగ నాటి ఆ యభిప్రాయమును ఇప్పటి కొక సంవత్సరము క్రిందట కార్యరూపమున పరిణమించునట్లు చేసియున్నారు. 1913-వ సంవత్సరము మార్చి 16-వ తేదిని ఈ సంఘము చెన్నపురిలో స్థాపింపఁబడినది. ఇందు ఆంధ్రులలో ప్రముఖు లనేకులు ఇదివఱకే సభ్యులుగఁ జేరియున్నారు. ఈ సంవత్సరము జూలై నెల నుండి ఆంధ్రదేశీయులలో ఇంజినీరింగు కాలేజిలో బి.ఇ. పరీక్షకు చదువునట్టి విద్యార్థి కొక్కనికిని, మెడికలు కాలేజిలో ఎమ్. బీ. పరీక్షకు చదువు విద్యార్థి కొక్కనికిని నెలకు 25 రూపాయల చొప్పున విద్యార్థివేతనము నిచ్చుటకే సంఘమువారు తీర్మానించి వారి తీర్మానమును వార్తాపత్రికల మూలమున ప్రచురించియున్న సంగతి యీ పత్రికను చదువువారికి తెలిసిన విషయమే యైయున్నది. ఈ సంఘమువారు గతసంవత్సరములో చేయఁగలిగిన పనికంటె ఈ సంవత్సరము ఎక్కువపని చేయఁగల రనుట నిస్సంశయము. సంవత్సరమున కొక రూపాయికి తక్కువ కాకుండ చందా నిచ్చు ప్రతియాంధ్రుఁడును ఈ సభలో సభ్యుఁడుగాఁ జేర్చికొనఁబడును. ఈ సభ వారికి రాజకీయసంస్కరణోద్యమసంకల్పము లేదు. అందుచే గౌర్నమెంటు ఉద్యోగులును తదితరులును నిస్సంశయముగ నీ సంఘోద్దేశములకు తోడ్పడవచ్చును. కాన నాంధ్రపత్రికాపాఠకమహాశయుల నీ యుద్యమమునకుఁ దోడ్పడుఁ డని వేఁడుచు నే నీ చిన్న వ్యాసమును, నేఁబది సంవత్సరముల క్రిందట నొక అమెరికా ధర్మశాసనకర్త విద్యావిషయ మైన యొక చట్టమును గూర్చి యుపన్యసించుచు చెప్పిన మాటలతో, విరమించెదను.

“నేను చెప్పెడి మాటలు ప్రపంచములోని సమస్తదేశవాసుల కర్ణపుటములలో నొక్కసారి పడునట్లు చేయుటకుఁ దగిన వాద్యవిశేష మొక్కటి నాకు లభించినచో నేను వారికి సదా ‘మీ పిల్లలకు విద్య నేర్పుఁడు, మీ పిల్ల లందఱికిని విద్య నేర్పుఁడు, మీ పిల్లలలో ప్రతివానికిని విద్య నేర్పుఁడు’ అని చెప్పుచుందును.”

బజారులో చవుకగ దొరకగల తలనూనెలను కొని కష్టార్జితమైన సొమ్మును పాడుచేసికొనకుము.

అట్టి తైలములను ఒకసారి తలకు రాసుకొనిన, తోడనే తలనొప్పిని కలుగ జేయును.

కురులకాంతి, తగ్గిపోవును. దివ్యమై సుప్రసిద్ధ మైనట్టి

# కామినియా తైలము

## మాత్రము యుపయోగించవలయును.

కామినియా తైలము కురుల మొదళ్ళ కాహారమొసగి, శిరోజములను చక్కగ పెరుగునట్లు జేయును.




జుట్టుతలను బోగొట్టి వెండ్రుకలు రాలిపోవుటమాన్పును. వెండ్రుకలను గుబురుగను, దట్టముగను పెరుగనిచ్చి, నిగనిగలాడు నల్లని కాంతి నొసగి, ప్రకాశించునట్లు చేయును. చర్మమును శుభ్రపరచును. చుండును పుట్టనివ్వదు. ఈ తైలము సువాసన గలిగి తల దువ్వుకొనుటకు

## మనోహరముగనుండును.

వెండ్రుకలను రాలిపోనివ్వదు. తలను నెరియ నివ్వదు. నెరపడిన శిరోజములు, మరల నేకరూపపు వర్ణమునకు వచ్చును.

తలనూనెలలోనెల్ల నిది చాల శ్రేష్ఠమైన తైలము.

మయిసూరు ప్రదర్శనమందు బంగారు పతకమీయబడినది.

దీని ప్రాశస్త్యమును కొనియాడుచు అలహాబాదు ప్రదర్శనములో ప్రశంసాపత్రిక మొసగబడినది. పెద్దమనుష్యు లనేకులు కామినియా తైలమును, కొనియాడుచు, మేము కోరకుండగనే వ్రాయుచున్నారు.

మన్నారుగుడినుంచి డివిజన్ సెక్రెటరీ, డి. సోలముగారు యిట్లు వ్రాయుచున్నారు:— దయచేసి, ఆరు సీసాలు కామినియా తైలమును పంపుడు. మాయింటిలో వాడినాము. నాకు తృప్తికరముగనున్నదని తెలుపుటకు సంతసించుచున్నాను. మాయింటిలో స్త్రీలు చాలమెచ్చుకొనినారు.

మైసూరునుంచి ఎడ్వకేటుగానున్న బి. రామన్నగారు యిట్లు తెలియ జేయుచున్నారు:— ఇదివరలో పంపించిన బుడ్లు, స్త్రీలు శ్లాఘించిరి. మరి ఆరుసీసాల కామినియా తైలమును వీ. పీ. గా పంపుడు.

ప్రతిపట్టణమందును, గ్రామమందును గల షాపులలో, ఈ తైలము విక్రయింపబడును. అచ్చట దొరకనియెడల మాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. చవుకరకమని చెప్పి, ఎక్కువలాభముకొరకు షాపులలో దగాచేయుచుందురు. గనుక మోసపోక జాగ్రత్తగ చూచి నిజమైన కామినియా తైలమునే కొనవలయును.

### ఆంగ్లో ఇండియన్, డ్రగ్ అండు కెమికలు కంపెని,

నెం. 155 జుమామసీదు, మార్కెటు, బొంబాయి.

ANGLO-INDIAN DRUG & CHEMICAL Co. No. 155, Juma Masjid, Murket, Bombay.

The Viceregal Party, Goverment House, Madras



చెన్నపురి గవర్నమెంటు గృహమున రాజప్రతినిధియు వారి ఆప్తులును

H. E. Lord Hardinge laying Foundation Stone of the University Library



శ్రీ హార్డింజి ప్రభువు మద్రాసు విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారమునకు శంకుస్థాపన చేయుట



Ripon Buildings, Madras

రిపను (మునిసిపలు) మందిరము, చెన్నపురి



Officers of the Madras City Police

మద్రాసు పోలీసు ఉద్యోగస్థులు

**Blocks** and Photo by Messrs. R. Venkiah Bros.

Canadian Missionaries, in the Andhra Country



ఆంధ్రదేశమందలి కనడా దేశపు మిషనరీలు

Andhra L. T. Students, Saidapet



ఆంధ్రవిద్యార్థులు (ఎల్.టి.) సైదాపేట

General View, Kalahasti



శ్రీకాళహస్తి పురప్రాంతము

Mount Abu.



అబూపర్వతము

Daulatabad



దౌలతాబాదు

# కీర్తిశేషులగు బెల్లముకొండ రామరాయ కవీంద్రులు

ఒక గుంటూరుమండలవాసి

సీ. అనవరతాన్నవిద్యాదానతృప్తవిద్యార్థివిరాజద్గృహాంగణుండు
వ్యాకృతితర్కవేదాంతమీమాంసాదిరమణీయశాస్త్రపారంగతుండు
సకలవిద్వజ్జనస్తవనీయవిషయవిభాసితాప్రతిమానభాష్యకర్త
సరససంస్కృతకావ్యచంపూముఖశతాధికగ్రంథనిర్మాణకలితయశుఁడు
వినుతదుర్వాదికాననవీతిహోత్రుఁ । డాత్మవిజ్ఞానవర్తి సత్యవ్రతుండు
హరిబెల్లముకొండవంశాబ్ధివిధుఁడు । రామరాయకవీంద్రుండు ధీమహితుఁడు.

ఈ పండితకవిచక్రవర్తి శా. శ. ౧౭౯౭-వ సంవత్సరమునకు సరియగు (హూణశకము ౧౮౭౫) యువసంవత్సర మార్గశిర బహుళ అమావాస్యా సోమవారమురాత్రి కటకలగ్నమున జనించెను. గుంటూరుజిల్లా నరసారావుపేటతాలూకాలో చేరిన పమిడిపాడు (పైడిపాడు) వీరి జన్మభూమి. తండ్రి మోహనరాయఁడు. తల్లి హనుమమాయమ్మ. ఋగ్వేది. ఆశ్వలాయన సూత్రుఁడు. వీరిపూర్వులు సుమారు ౭,౮ తరములనుండి మంచి పాండిత్యము గలవారు. వీరికి 3 అగ్రహారములును, పెక్కు గ్రామములందు మాన్యములును గలవు. ఇవన్నియు పూర్వు లార్జించినవియే. ౭-వ యేఁట వీరికి పితృవియోగము తటస్థించెను. బాల్యమునందు రాజకీయ విద్యయగు హూణభాషను కొంతవఱకుఁ జదివిరి గాని, వీరి మాతామహి మాత్ర మందుల కంగీకరింపక కులక్రమాగత మగు పాండిత్యమున కంతరాయము వాటిల్లకుండ తమ మనుమనికి సంస్కృతవిద్యను, వీరికి సమీపజ్ఞాతి యగు బెల్లముకొండ సీతారామయ్యగారి దగ్గఱఁ జెప్పించెను. బాల్యమునుండియు అసమానధారణాశక్తి కలిగియుండి ఒక్కపర్యాయము వినినదానిని వెంటనే మఱల నొప్పఁజెప్పుట మన రామారావుగారికి మంచినీళ్లప్రాయమైయుండెను. ప్రథమమున రఘువంశకావ్యమున ౪౦ శ్లోకములను మాత్రము గురువులవా రన్వయించి బోధించిరి గాని తరువాత ౫ కావ్యములను వారే స్వయముగ అన్వయించి అర్థమును చెప్పుచుండిరఁట. ౧౬-వ యేఁట నైషధము మురారి మున్నగు గ్రంథములను తామే స్వయముగ పఠించి విద్యార్థులకుఁ బాఠములు చెప్ప మొదలిడిరి. ౧౭-వ యేఁట వల్లభరాయ స్తవము మున్నగు గ్రంథముల రచింప మొదలిడిరి. ౧౮ మంజరులు గల సముద్రమథన మను చంపూకావ్య మా సంవత్సరమునందే రచించిరఁట. ౧౯-వ సం. వివాహ మాయెను. ౨౦-వ యేఁట పురిఘళ్ల రామశాస్త్రి సుబ్రహ్మణ్యశాస్త్రి యను సోదరు లగు పండితుల తమ యింట నిల్పుకొని



తర్క-వ్యాకరణముల నభ్యసించిరి. వేదాంతశాస్త్రమును తామే స్వయముగ నభ్యసించి శ్లోకరూపముగ ఉపనిషదర్థమును సంగ్రహించి వ్రాసిరి. సిద్ధాంతకౌముదికి శరద్రాత్రి యను పేర విపులమయిన వ్యాఖ్యాన మొనర్చిరి. ఆంధ్రులలో మాధవాచార్యుని తరువాత ఇట్టి సర్వతోముఖ మగు పాండిత్యశక్తి కలిగి ఇన్ని గ్రంథములను రచించిన పండితకవి మఱొక్కఁడు పుట్టియుండలే దనుటయే వీరి మహిమను తెలుపఁగలదు.

## దినచర్య

వీరు సుమారు జాముప్రొద్దుండఁగా లేచి శరీర వ్యాయామ మొనర్చి ౩౦౦ దండెములు తీసి ఊరివెలుపల నుండు బావియందు చన్నీళ్లలో స్నానము చేయుచు కంఠదఘ్నమగు జలమునందు నిలుచుండి సహస్ర గాయత్రి జపించి బ్రహ్మయజ్ఞ మొనర్చి గృహంబునకు వచ్చి విద్యార్థులకు పాఠములు చెప్పి మఱల స్నాన మొనర్చి సహస్రగాయత్రిని సలిపి విద్యార్థులతోపాటు భుజించుచుండువారఁట.

## గ్రంథరచనము

వీరు కావ్యములను, వ్యాఖ్యానములను, ఖండనములను, స్తోత్రములను కలిపి దాదాపు ౧౪౮ గ్రంథములను రచించిరి. ఈ గ్రంథములు వ్యాకరణశాస్త్రమునందును, అలంకారశాస్త్రమునందును, వేదాంతశాస్త్రమునందును, ధర్మశాస్త్రమునందును గలవు. కావ్యములందును, స్తోత్రములందును, భాగవతచంపువ్యాఖ్య మురారి నాటకవ్యాఖ్య లందును వీరు గనంబఱుచుచు వచ్చిన కల్పనలు, యమకములు, వ్యంగ్యార్థవినిర్ణయము మున్నగు విషయములు పాఠకులను విస్మయావహులనుగ నొనర్చును. ఎట్టి శాస్త్రీయగ్రంథమును గాని కావ్యమును గాని వ్రాయుచున్నను ఒక్క యక్షరము నైనను కొట్టి వ్రాయువారు కారు.

## స్వభావము

గర్వ మన్న ఏ రెట్టిదో ఎఱుంగరు. తమ యాదాయము నంతయు విద్యార్థుల భోజనాదికమునకును యాచనకై సంచరించు విద్వాంసుల సత్కారమునకును సెలవు చేయుచుండువారు. ఏమాత్ర మవకాశము లభించినను గ్రంథములను వ్రాయుచు ఆరోగ్యావహ మగు శరీర వ్యాయామమును కొంతకాల ముపేక్షించిరి.

దాన వీరికి దేహము దుర్బలమయి వ్యాధి సంభవించెను. కొంతకాలము వేదాద్రియందు తప మొనర్చిరి. మిత్రుల బలవంతముమీఁద వ్యాధికై ఔషధసేవఁ జేసిరి. కాని వ్యాధి కుదురలేదు. తరువాత గీతాభాష్యార్కప్రకాశ మను పేర శంకరగీతాభాష్యమునకు సుబోధ మగు వ్యాఖ్యానమును రచించిరి. ఇతరమతములవారు గీతాభాష్యమునందుఁ గనంబఱచిన దూషణములకు సమాధాన మీ గ్రంథమునఁ జూపినటుల మఱొక్క గ్రంథమునఁ జూపియుండలేదు. ఈ గ్రంథమును వ్రాయునపుడు వ్రణము లేచి శస్త్రచికిత్స చేయవలసివచ్చెను. వైద్యుఁడు శస్త్రముచేత వ్రణమును కోయుచుండఁగా వీరు లేఖినిచేత భాష్యవ్యాఖ్యానమును వ్రాయుచుండిరఁట. పల్నాడుతాలూకాయం దున్నవారిలో పలువురు వీరియొద్ద విద్య నభ్యసించినవారే. పలువురు కోరిక ననుసరించి అష్టావధానశతావధానములను రెండు మూఁడు పర్యాయము లొనర్చిరఁట. ౧౮ మందికి నిషేధాక్షరియు, ముప్వురకు వ్యస్తాక్షరియు అవధానమునందు చెప్పెడివారఁట. శతావధాను లగు శ్రీ జూపూడి హనుమచ్ఛాస్త్రి గారును, ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారును వీరి శిష్యు లని మాత్రము నేను ఎఱుంగుదును. తక్కిన వారిని బాగుగా నెఱుంగను. వీరు "శాంకరాశాంకర భాష్యవిమర్శన" మను పేరుతో శ్రీభాష్యమునందు రామానుజాచార్యులవా రొనర్చిన శంకరభాష్యఖండనమునకు సమాధానము వ్రాయుట కుపక్రమించిరి. కాని యాంధ్రులయం దిట్టి పండితకవీంద్రుని నుంచుటకు భగవంతునికి ఇష్టము లేక కాఁబోలు ఈ ప్రమాదిసం. కార్తిక శు ౯ యందు బ్రహ్మదేవుఁడు తన లోకమునకు కొనిపోయెను.

## వీరి గ్రంథములలో ముద్రించినవి

౧. రుక్మిణీపరిణయచంపువు, సవ్యాఖ్య. ౨. గరుడసందేశము, సవ్యాఖ్య. 3. హయగ్రీవశతకము, సవ్యాఖ్య. ౪. వేదాంతకౌస్తుభము. ౫. కందర్పవిలాసము. ౬. కృష్ణలీలాతరంగిణి.

### ముద్రణమునం దున్న గ్రంథము

గీతాభాష్యార్క ప్రకాశము — ఈ గ్రంథ ప్రాశస్త్య మును గాంచి గుంటూరుపౌరులు ముద్రణమునకుంగాను ౨ వేల రూప్యముల నిచ్చిరి. ఈ గ్రంథముద్రణానంతరము క్రమముగ గ్రంథము లన్నియు వెలువడఁగలవు.

### II

### జూపూడి హనుమచ్ఛాస్త్రిగారు

శా. తల్లీ ! భారతమాత ! నీ కడుపునన్ దారిద్ర్యవిచ్ఛిత్తిగా
ముల్లోకంబులలోన వీఁ డనఁగ భూముల్ పట్టరాకుండ మా
యుల్లాసంబు చెలంగఁ బుట్టినతఁ డాయుర్దాయనిర్భాగ్యుఁడై
కల్లోలం బొనరించె లోకముల నీ కా శోక మెచ్చుంగదా!

సీ. వైరిముఖాబ్జముల్ వాడి వత్తలు గాఁగ
వాక్యచంద్రికలను బఱపు విధుఁడు
సప్తోత్తరచతుర్దశదశకకృతికృతి
చాతుర్యహృదయాబ్జసరసనరసి
వివిధావధానప్రవీణశిష్యాగ్రణీ
తదిగంతకీర్తికాంతావిభుండు
రామానుజాచార్యరచితగీతాభాష్య
ఖండనతుషితశంకరవిభుండు
రామరాయాఖ్యకవిసార్వభౌముఁ డకట!
భౌతికంబును విడనాడి బ్రహ్మపదము
నంది విజ్ఞానమయమును బొందెనయ్య
హైందవుల దురదృష్టమో యనఁగ నేఁడు.

సీ. శ్రీభాష్యఖండనఁ జేయఁదొడంగితి
రామరాయకవీంద్ర! వ్రాయ వేమి?
శతవధానీ! యని సాకూతిఁ బిల్చెదే
శిష్యవత్సల కోపచిహ్న మేమి?
పుత్త్రిలు లే రన్నఁ బొత్తము ల్పాపింతు
విపుడు చూపింపఁగా నేఁగ వేమి?
కలితభాష్యార్కప్రకాశముద్రణపత్ర
మిదె తప్పు చూడంగఁ గదియ వేమి?
గురువు దైవం బటం చనుకొనెడు మమ్ముఁ
దనయుఁ డారాముఁ డనుకొను తల్లిగారి
యాజ్ఞవల్క్యగురుండుగా నరయు భార్య
విడిచి పోయితె? కవివర్య! విజ్ఞధుర్య!

మ. కవితావల్లిక కాలవాల మయి లోకఖ్యాతుఁడౌ నాకుసం
భవుఁ డేఁగెం; దరువాత నీ కడియెఁ దా భవ్యాత్ముఁ డావ్యాసహా
నివరుం; డయ్యె నుపఘ్న మంతటను వాణీరూపుఁ డాకాళిదా
సు; వసంతాకృతి నీవు దోఁప వికఁ సంశోషింపదే సత్కవీ!

### III

### చావలి వేంకటకృష్ణయ్యగారు

ఉ. ఏగతి సంస్కృతం బిఁకను వృద్ధిగనున్ మన కొండవీట? వే
ఱేగతి బీదకుఱ్ఱలకు నేర్పడు శాస్త్రము లభ్యసింపఁగా?
సాగునె వేఱుచోట నిటు సత్రము? పాండితి గోపురంబులో
నేగునసొద్దఁ గల్గు? వచియింపుము, మాగతి యేమి కావలెన్?

ఉ. ఏకిని జూచుకొంచు వహియింతు మిఁకన్ గరువంబు నేము? వే
ఱేరికి నబ్బు నీ ప్రతిభ? యేరికినైనను నేర్పియుంటివో?
నేరిచికోఁగ వీలగునె నీదశ? జ్ఞానధునీశ! నిన్నుఁబోల్
వారు జనించుమాట శతవత్సరముల్ గతియించువిూఁదఁగా!

చ. అభినవశంకరుండవు; రవంతయిన న్నిటఁ బొల్లు లేద; యా
సభ గెజవాడలోనఁ గడు శాంతియు దాంతియుఁ దోఁపఁ బల్కితీ
వు 'భువిని వాడబుల్ గనఁగఁబోలదు భేదము' లంచు; నీకు నే
మి భయము? తత్త్వవేత్తలను మేటివి, నీ కెటు గల్గు భేదముల్?

ఉ. జ్ఞానము గల్గు నాత్మకుఁ బ్రసాదము బ్రహ్మముతోడ నైక్యమున్
మానవదేహమున్ వదలి మానుగఁ బొందుట యందు నేర్పదే?
యా నియమంబునే సతము నాత్మను నిల్పి చరించుచుంటి వీ
వో నయశీల! తుచ్ఛ మగు యోజన సుంత తెఱుంగకుండఁగన్.

మ. మునుమున్ వ్రాసితి మీఁదిపద్యముల నీ పోఁకన్ విచారించుచున్;
మనమం దుండెను నమ్మకంబు సుతసంతానంబు ప్రాప్తించు నీ
కనుచున్, వ్రాయఁగఁజాలనైతి; అది సత్యంబయ్యె నీ నాఁటి కో
యనఘా! ధన్యుఁడ వైతి, వవ్వయము భవ్యంబై విశంబించుతన్!

# ఆంధ్రసారస్వతవాహినీనూతన తరంగములు

వేమూరి విశ్వనాథశర్మగారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

మన యాంధ్రసారస్వతాభివృద్ధి యను దివ్యభవనమునకుఁ బునాదులు రమారమి ముప్పది సంవత్సరములకుఁ బూర్వమే వేసి రని చెప్పవచ్చును. ఆంధ్రభాషావధూటి తన ప్రాఁతసింగారములతోఁ దృప్తిఁజెందక నూతనాలంకారములఁ దాల్ప నిచ్ఛగించెనో యనఁ గ్రొత్తత్రోవలఁ ద్రొక్కనారంభించెను. భాషాసేవకులు వంశపరంపరగా వచ్చుచున్న పురాణేతిహాసప్రబంధరచనలతో సంతుష్టులు గాక అపూర్వనిర్మాణములకుఁ గడంగి కృతకృత్యులయిరి. నాఁటినుండి నేఁటి వఱకును పద్యగద్యకావ్యములందుఁ గలిగిన మార్పులును, భాషాసేవకులు చేసిన యభివృద్ధియు నీవ్యాసమునం దించుక వివరించెదను.

## పద్యకవిత్వము

పద్యకావ్యములయొక్క శైలియందును వర్ణనాంశములయందును మార్పులు గలిగినవి. ఆదిమకవులును, వారి తరువాతివారిలో మఱికొందఱును పురాణేతిహాసములఁ గాని తదితరము లగు మతవిషయికగ్రంథములఁ గాని రచింపఁదొడఁగిరి. భాషాంతరీకరణమునందు మాత్రమే కాక స్వతంత్రగ్రంథరచనమునందు నిట్లే జరుగుచుండెను. శ్రీనాథాదులు మొదలుకొని వర్ణనాంశములు మాఱిపోయెను. ఇతఁడు పురాణములనే గాక మతసంబంధము కాని నైషధకావ్యమును భాషాంతరీకరించెను. స్వతంత్ర మగు ప్రబంధరచన మనుచరిత్రతోఁ బుట్టిన దని చెప్పవచ్చును. నాఁటినుండియుఁ బురాణరచన యరుదు, ప్రబంధనిర్మాణము మెండు. ఈ మార్పుతో స్వతంత్రగ్రంథములు ప్రబల, భాషాంతరీకరణము తగ్గినది. కాని యీ మార్పువలనఁ గవులకుఁ గొన్ని నూతనకష్టము లేర్పడినవి. పురాణములయందలి యితివృత్తము పెద్దది, గాథలు మెండు. ప్రబంధములయం దితివృత్తములు కొలఁది, కథ చిన్నది. వర్ణనాంశము స్వల్పము. ఈ కారణములను బట్టి కవులకుఁ గొన్ని నిర్బంధము లేర్పడెను. ప్రబంధములయందలి కథ చిన్న దగుటచే గ్రంథము నింపుటకుఁ బడికట్టువర్ణన లధికమై సంస్కృతములోవలెనే యాంధ్రప్రబంధములలోఁ గూడ అష్టాదశవర్ణన లుండవలయు నను నిర్బంధము గలిగెను. మూఁడు మాటలలోఁ జెప్పఁదగిన వసుచరిత్రాంశము నంతగఁ బెంచి వ్రాసినకవి పాట్లు అనుభవవేద్యములు. ఎన్ని కల్పనలు లేనిదే ఇంత గ్రంథ మెట్లు పూర్తి కాఁగలదు? కథ చిన్నదియై వర్ణనాంశము లొకటియే యగుటవలనఁ బ్రబంధములయందలి భావములు చర్వితచర్వణము లగుచుండును. ఒక యుదాహరణమును గమనింపుఁడు. పురవర్ణనమునందు సౌధాగ్రములు చంద్రునియందలి లేడిపిల్లను ముద్దుపెట్టుకొనుచున్న వని ఒక ప్రబంధకారుఁడు వర్ణించినచో, మఱియొక ప్రబంధమునందు విమానముల నెక్కి వియన్మార్గమునఁ బోవుచున్న దేవతలు సౌధాగ్రములఁ బట్టుకొని పడిపోవుచుందు రని వర్ణించియుందురు. ఇతివృత్తమునం దించుక భేదము తప్ప, ఇతరవిషయములలోఁ బ్రబంధము లన్నియు నొకరీతి నుండును. ఒక ప్రబంధమును జక్కఁగఁ జదివినచోఁ దక్కిన ప్రబంధములు చదువనక్కఱ లేదు; చదువుటవలన లాభమును గలుగదు. ఇంత మాత్రముచేత ఒక గ్రంథకర్త మఱియొకని ననుకరించి వ్రాసె నని చెప్పుటకంటె నిర్బంధవశత్వము వేఱొండు గానఁబడదు. ఇన్ని నిర్బంధములు గల ప్రబంధరచనయందు భావసమత్వ ముండక తప్పదు. ఇన్ని నిర్బంధము లుండి వర్ణనాంశము లొకటి యైనను తమ కల్పనాచమత్కృతిని జూపి, అపూర్వకల్పనలను గుప్పించి కేవలము నూత్నభావములే యని స్ఫురింపఁ జేయఁజాలిన వసుచరిత్రాదిగ్రంథకర్తలకుఁ జేతులు జోడింపవలసి యున్నది.

## నాటకాదులు

ప్రబంధరచనకాల మంతరించిన దని చెప్పవచ్చును. దానికి బదులుగ నాటకములు, కథలు మున్నగునవి పద్యరూపమున వ్రాయఁబడుచున్నవి. ముప్పదిసంవత్సరములకుఁ బూర్వమే సంస్కృతనాటకము మొదట నాంధ్రీకరింపఁబడినది. ప్రథమమున భాషాంతరీకరణము లయినను, క్రమముగ స్వతంత్రనాటకములు వెలయ నారంభించెను. ఇవి మొదటమొదట కేవలము గద్యములో వ్రాయఁబడి రానురాను ప్రదర్శకుల లోపమువలననో చూపఱ యభీష్టమును దీర్చుటకో ప్రస్తుతము పద్యపూరితము లయినవి. ఇది కడు విచారణీయము. ఏలన, పామరు లగు చూపఱలయొక్క మనస్సులయం దున్న తాదర్శములు చక్కఁగ నాటుకొనవలె నన్నచో, గద్యనాటకములే ముఖ్యసాధనములు. ఈ విషయము కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గద్యనాటకముల ప్రదర్శనమును జూచినవారి కనుభవవేద్యము. మంచి విద్యావంతు లైనఁ గాని ప్రదర్శకులు గద్యనాటకములయందలి రసము నొప్పింపఁజాలరు. అందువలన నాటకరంగములు గూడ ఉన్నతస్థితిని జెందును.

ఇప్పటి తెలుఁగునాటకములలోఁ జాలభాగము ఇతివృత్తముయొక్క కల్పనాచమత్కృతి గానరాదు. అనఁగా అంకవిభజనము తప్ప, ఇట్టినాటకములకును, బొబ్బిలికథలకును భేద ముండదు. కథాంశము లొకదానివెంట నొకటి యుండును. చూపఱ కథావిధానము కొఱకై నిరీక్షించియుండుట కవసర ముండదు. వారి కన్నులు తప్ప, మనస్సు పనిచేయ నక్కఱలేదు. కల్పనాచమత్కృతి యున్న నాటకము లట్లు గాక చూపఱకుఁ బరిపరివిధముల నాలోచనలు పుట్టించి వారి మనములను ప్రదర్శనమునందే లగ్నము చేయుచుండును.

## రసపోషణము

కవిత్రయమువారును, వారి తరువాతివారిలోఁ గొందఱు కవులును నవరసములను పక్షపాతము లేక సాదరముగఁ బోషించిరి. వీరి శృంగారరసము కూడ మనోహరముగ నుండి యా రసరాజముయొక్క పేరు సార్థకపఱిచెను. కాని ప్రబంధరచనాకాలమున శృంగారము విపరీతకల్పనలకును, అశ్లీలభావములకును ఆకరమయ్యెను. ఈమార్పునకుఁ బ్రబలకారణ మొకటి యుండవచ్చు నని తోఁచును. ప్రబంధకవులలో ముప్పాతిక మూఁడువీసములు రాజుల పోష్యవర్గములోనివారు. ప్రబంధములలోఁ జాల భాగము రాజులకే యంకితములు. ఈ కారణమును బట్టి కవులు రాజుల చిత్తానుసరణముగ వ్రాయవలసినవా రైరి. ఆస్థానకవులు తమ రాజులయొక్క భాషాభిరుచికనుగుణముగ వ్రాయఁ

దొడంగిరి. ఈ రీతిని రానురాను శృంగారము శ్రుతిమించి రాగానఁబడి, కటికచజారత్వసంభోగాదివర్ణనలు లేని ప్రబంధములు శృంగారరసప్రధానము లనిపించుకొనుటకుఁ దగ వని యభిప్రాయ మేర్పడెను. ఇందునకుఁ దారాశశాంకవిజయాదులే తార్కాణము. మనోదౌర్బల్యముచేఁ జంచలమనస్కుఁడై గురుభార్యయెడల ద్రోహము గావించిన తరువాత నైనను పశ్చాత్తప్తహృదయుఁ డైనచో శృంగారమునకుఁ జాటు వాటిల్లు నను భీతిచేఁ గాఁబోలు చంద్రుఁడు వియోగదుఃఖమును భరింపలేక విరహవేదనఁ జెందనారంభించెను.

ఇప్పుడు భాషాభిరుచి మాఱినది. ఇంకను మాఱవలసియున్నది. శృంగార మన స్వభావవిరుద్ధము లగు సంగతులును, అశ్లీలము లగు వర్ణనలును గాక స్వభావోక్తులును మనోహరము లగు వర్ణనలే కవిత్వమునకు నిజమైన శృంగార మని ఇప్పటి కవులయొక్క గ్రంథములే చాటుచున్నవి. మన సమకాలికులు వ్రాసిన గ్రంథములలో చమత్కారకథాకల్లోలిని మొదలగు గ్రంథములు తప్పఁ దక్కిన వన్నియుఁ గొంచె మించుమించుగ నవీనపద్ధతుల ననుసరించియే వ్రాయఁబడియున్నవి. ఇది మాత్రము ప్రబంధములలోని శృంగారరసవిజృంభణమునందు తారాశశాంకమును తలఁదన్నిపోయినది. ఇటువంటి శృంగారము పైఁ గవులకును పాఠకులకును మోజు పోయినది. మన సమకాలికులలోఁ గొందఱి గ్రంథములయందు కొంతవఱకుఁ బ్రబంధశృంగారమున్నను దానికిని ప్రాఁతదానికిని తారతమ్యము కనఁబడక మానదు.

ప్రబంధరచనాకాలముననే శబ్దాలంకారముల కెక్కుడు ప్రముఖత గలిగినది. ఇంతకుఁ బూర్వపుఁగవులు శబ్దాలంకారములను భావగాంభీర్యముతో మిళితముచేసెడివారు. కాని కొన్ని ప్రబంధములలోఁ గేవలశబ్దచమత్కారముకొఱకు వ్రాసిన పద్యములు కొన్ని కానవగును. ఏకాక్షరి మున్నగు నియమములఁ బెట్టుకొని వ్రాయుట ఇట్టి సామర్థ్యమును వెల్లడించుటకే. ఇటీవల వ్రాసిన ప్రబంధములలోఁ గూడ శబ్దచమత్కృతికై ఏకాక్షరి మున్నగు నియమములతో వ్రాసిన పద్యములు కొన్ని గలవు. వీనిని బట్టి మనతరమువారిలోఁ గూడఁ గొందఱికి భావగాంభీర్యపులోటు వాటిల్లినను శబ్దాలంకారములపై మనసుపాఱిన దని తేలుచున్నది. కాని యిది మిక్కిలి యరుదు. సర్వసాధారణముగ నిప్పటికవులు భావగాంభీర్యమునకే పాటుపడుచున్నారు. సులభశైలిలో మృదుమధురపదములనే వాడుచున్నారు.

## గద్యకవిత్వము

పద్యభాగమునకంటె గద్యభాగమున మన భాష ఎక్కువ వృద్ధిఁగాంచినది. ఏవిషయమును బట్టుకొనినను తెలుఁగులో గ్రంథములు దొరకఁగలవు. పాశ్చాత్యుల భౌతికశాస్త్రాదినవీనశాస్త్రములు గూడఁ దెలుఁగున వ్రాయుటకుఁ బ్రయత్నించుచున్నారు. గద్యకవితావధూటికి వయసు తక్కువైనను, ఏండ్లను మించిన యూహలున్న వని చెప్పవచ్చును. వచనభారతము సుమారు రెండువందల సంవత్సరముల క్రిందటఁ బుట్టినను తెలుఁగులో గద్యప్రబంధములు వ్రాయ వీలున్న దని త్రోవఁ జూపినది చిన్నయసూరి యనియే చెప్పవలయును. ఈయనశైలి సంస్కృతపదభూయిష్ఠమై దీర్ఘసమాసములు గలిగి కొంతవఱకుఁ బ్రబంధములోని వచనములను బోలియుండును. చదువుటకు మిగుల మనోహరముగ నుండును. ఇది ఇతరుల కొకమాత్రమునఁ బట్టువడదు. సుమనోమనోజ్ఞము కొంతవఱ కీశైలిని బోలియున్నది. మఱి కొందఱు గూడ చిన్నయసూరిగారి శైలి ననుకరించిరి. కాని మన కాలువారి కీశైలి యలవాటుపడదు. ఒకవేళ ప్రయత్నించినను గట్టి విఱిచిన ట్లుండు నేమో యని సందేహము కలుగుచున్నది. భాషాజ్ఞానము కలుగుటకు మిత్రభేదమువంటి గ్రంథములు మఱికొన్ని కావలసియున్నవి.

చిన్నయసూరి తరువాత వచనరచనయందు క్రొత్తపుంతఁ జూపినది వీరేశలింగము పంతులుగారు. వీరి శైలియే ఇప్పటికిని సారస్వతప్రపంచమునందు రాజ్యము చేయుచున్నది. వీరు భౌతికశాస్త్రములు మొదలుకొని మతవిషయికగ్రంథము లటుండ సాధారణముగఁ గొఱుకుపడని తర్కశాస్త్రమువఱకును తెలుఁగులో వ్రాసి మార్గదర్శకులైరి. వీరు వ్రాసిన గ్రంథము లనేకులకుఁ బ్రోత్సాహము గలిగించి వివిధవిషయికగ్రంథోత్పత్తికిఁ గారణము లైనవి.

## నవలలు

ముఖ్యములైనవి. ఇవి పామరజనులకొఱకే ఏర్పడిన వని కొందఱి యభిప్రాయము. పాశ్చాత్యులలో నవలలు చదువ మని దీక్షవహించిన వారు గూడఁ గొందఱు గలరు. ఏదియె ట్లున్నను చదువుటయం దభిలాష పుట్టించుటకు నవలలే ముఖ్యసాధనము లని చెప్పక తప్పదు. అందులో నూటికిఁ దొంబదిమువ్వురు నిరక్షరకుక్షులై యున్న మన యాంధ్రులకు నవలలయొక్క యావశ్యకతను గూర్చి వేఱె చెప్ప నక్కఱలేదు. ఇవి చదువువారికి నాటకములవలె నుండును. వ్రాయువారికి నాటకములలో నుండునన్ని నిర్బంధములు లేవు. దేశకాలనిర్బంధములు లేక గ్రంథకర్త పాత్రోచితముగఁ దన యిష్టము వచ్చిన సంగతులను సందర్భవశమున నిముడ్చుటకు వీలున్నది. ఈ కారణమును బట్టి తెలుఁగులోఁ జాల నవలలు బయలువెడలుచున్నవి. కాని కథావిషయములు కొంతవఱకు మాఱినఁ గాని జనసామాన్యమునకు రుచి గలిగి లాభకారులు కాఁజాల వని తోఁచుచున్నది. నవలలయందలి కథాంశములు పాఠకులకు సంబంధించియుండవలయును. అనఁగాఁ బ్రపంచజ్ఞానమును గలిగింపవలయును. అందుకొఱకై సాధ్యమైనంతవఱకు సాంఘికవిషయములును, నిత్యకృత్యములం దనుభవయుక్తములగు నాచారవ్యవహారములు మొదలగు విషయములును నవలలయందుండుట యవసరము. అప్పుడే సామాన్యపాఠకులు కవి వ్రాసినది అరణ్యరోదనము గా దని గ్రహింపఁగలరు. ప్రస్తుతము మన భాషలో నిట్టి సాంఘికనవలలు లెక్కకు నాలు గైదు కాన్పించుచున్నవి. తక్కినవి పూర్వ మాంగ్లభాషలోవలె చరిత్రాంశములు. ఆంగ్లేయభాషలో చరిత్రవిషయికనవలలు వ్రాయుటకుఁ గొన్ని సౌకర్యములు గలవు. సాంఘికాచారముల నయ్యైకాలములలో వర్ణించు గ్రంథము లనేకము లున్నవి. మన దేశమున నిట్టి గ్రంథములు చాల కొలఁది. విదేశీయులు వ్రాసిన గ్రంథములు మాత్ర మొకటి రెండు గలవు. ఆంధ్రుల సాంఘికవ్యవహారములను వర్ణించు గ్రంథములు బొత్తిగా సున్న. కావుననే మన భాషలోని చరిత్రాత్మకనవలలకుఁ దగినంత వ్యాపకము లేదు. సామాన్యపాఠకులకు రామదాసుచరిత్ర రుచించినట్లు లీ నవలలు రుచించుట లేదు. కథయా యే ఢిల్లీనగరములోనో జరిగియుండును. ఏ రాజపుత్త్రుఁడో కథానాయకుఁడు. ఎవరో యొక రాచకన్నియ ప్రచ్ఛన్నవేషముతో యుద్ధముచేసి చివరకు నారాజపుత్త్రుని వివాహమాడును. లేదా ఎవరో యొక బైరాగివాఁడు మంత్రాంగముచేసి వీరిద్దఱిని సమావేశముచేయును. ఆంధ్రప్రపంచములో నెట్టి సంబంధమును లేని ఇట్టి కథలు పామరజనులకు రుచించుట దుర్లభము. కావున నాంగ్లభాషలో జార్జి ఇలియట్, డికెన్సు మున్నగువారివంటి కవులు బయలుదేఱి యాంధ్రదేశమునకు సంబంధించిన సాంఘికవిషయికనవలలు వ్రాయవలెను.

## వ్యాసరచన

భాష యంతయు నొక యెత్తు. వ్యాసరచన యింకొక యెత్తు. ఒకభాషలో నున్న వ్యాసములను బట్టి యా భాషయొక్క యభివృద్ధి నూహించుట కవకాశ ముండును. వ్యాసములను రెండు విధముల విభజింపవచ్చును.

1. విమర్శకవ్యాసములు. 2. తదితరములు. ఇందు మొదటి తరగతి వ్యాసములు పండితజనాశ్రయములు. వీనిని గూర్చి వేఱొకచో వ్రాయఁబడును. రెండవతరగతి వ్యాసములయందు వివిధవిషయములను గూర్చి వ్రాసి రసస్ఫూర్తిఁ జూపి పామరజనులకుఁ గూడ నాహ్లాదముఁ బుట్టించునట్లు చేయవచ్చును. ఇంగ్లీషుభాషలో "ల్యాంబ్", "డిక్విన్సీ" మున్నగువారు వ్రాసిన వ్యాసము లిట్టిజాతిలోఁ జేరినవి. మన భాష వ్యాసరచనయందు మిగుల హీనస్థితిలో నున్నది. వీరేశలింగము పంతులుగారు వ్రాసిన సాంఘికమతవిషయములును, మఱియొకరిద్దఱు వ్రాసిన యుపన్యాసములును దప్ప, ఆంధ్రమున జనసామాన్యమునకు రుచింపఁగల వ్యాసములు లేవు. ఇది మిక్కిలి శోచనీయము. కాఁబట్టి ఇంతటనైనను భాషాభిమానులు నవీనపద్ధతుల ననుసరించి వివిధవిషయములను గుఱించి వ్యాసరచనకుఁ బూనుకొనవలసియున్నది.

## భాషాసంఘములు

కడచిన ఏడెనిమిది సంవత్సరములలో మనభాష వృద్ధిఁ జెందినట్లు ఇదివఱలోఁ జెందియుండలేదు. అంతకుఁ బూర్వము తెలుఁగన్నను, తెలుఁగుపుస్తకము లన్నను చిరాకుగ నుండెడి హూణవిద్యాపారంగతులు తెలుఁగులో వ్రాయుటయు, చదువుటయుఁ దమ గౌరవమునకు లోపము కా దని గ్రహించిరి. ఇప్పుడు భాషాసంఘములు మన దేశములోఁ బదులకొలఁది గలవు. భౌతికశాస్త్రములు, చరిత్రలు, నవలలు, మహాపురుషుల జీవితములు మున్నగు నపూర్వగ్రంథములు బయలుదేఱుచున్నవి. ఇదివఱకు మన భాషలో లేని యాంధ్రదేశముయొక్క చరిత్ర యుపక్రమింపఁబడినది. తెలుఁగున "విజ్ఞానసర్వస్వము" బయలుదేఱుట కీ భాషాసంఘములే కారణ మని చెప్పవచ్చును. పూర్వపుఁ గట్టుదిట్టములఁ బోషించుటకును, అనవసరములగు మార్పులచే భాష ధ్వంసము కాకుండుటకుఁ గవిపండితజనామోదమును బడసిన 'సాహిత్యపరిష' త్తొకటి నెలకొల్పఁబడినది. ఈ సంఘము లన్నియుఁ బాఠకుల సంఖ్యను హెచ్చించినవి. విద్యయం దభిలాషను బుట్టించినవి. కావున వివిధవిషయములను గూర్చి వ్రాసిన గ్రంథకర్తలకంటెను వారి యుత్పత్తికిఁ గారణభూతము లగు నీ భాషాసంఘములు మన కెంతయు వందనీయములు.

## పత్రికానిర్వహణము

ఈ పది సంవత్సరములలోఁ బత్రికల సంఖ్య కూడ హెచ్చినది. ఆంధ్రమునఁ బత్రికలు వెలసి నలువది సంవత్సరములకు మించలేదు. అప్పటి పత్రికలకును ఇప్పటివానికిని జాల తారతమ్య మున్నది. ఇప్పుడు మాసపత్రికలకంటె వారపత్రికలు హెచ్చుగ నున్నవి. దీనిని బట్టి జనసామాన్యమునఁ బాఠకుల సంఖ్య హెచ్చిన దని చెప్పవచ్చును. పూర్వపుఁ బత్రికలలో మత, సాంఘిక, భాషా విషయములు మాత్రము చర్చింపఁబడుచుండెడివి. ఇప్పుడు పత్రికాధిపతులు రాజకీయవ్యవహారములు గూడ నిరాఘాటముగఁ జర్చించుచున్నారు. మన భాషలో దైనికపత్రిక లే దను కొఱఁత గూడ శీఘ్రకాలములోఁ దీఱఁగల దనుట పత్రికాభివృద్ధిని సూచించుచున్నది. పత్రికానిర్వహణమునం దింకను సామర్థ్యముఁ జూపుట కవకాశ మున్నది. కాని సర్వకలాశాలలయం దుత్తీర్ణులై పట్టపరీక్షలలో జయమునందిన హూణవిద్యాపారంగతులు పత్రికానిర్వహణమునకుఁ బూనుకొన్నఁగాని తెలుఁగుపత్రిక లున్నతస్థితికి రాఁజాల వను నభిప్రాయముతో నే నేకీభవింపఁజాలకున్నాను. ఇప్పు డాంధ్రపత్రికలు నడుపువారిలో నిట్టివారు లేరు. లేకపోయినను కొన్ని పత్రికలయందుఁ బ్రతివిషయమును గూర్చియు నద్భుతముగ వ్రాయుచున్నారు. సంపాదకీయములు భాషాంతరీకరణములు గాక స్వతంత్రవ్యాసములై యున్నవి. పత్రికా నిర్వహణమునకు హూణవిద్యాభ్యాస మవసరమె కాని పట్టపరీక్ష నిచ్చినవారే యర్హు లనుట నేతిబీరకాయవలెగా నుండును. దేశక్షేమమును గాపాడుచుఁ బ్రపంచమునందు జరుగుచున్న వ్యవహారజ్ఞానమును జనసామాన్యమునకు బోధించుట పత్రికల విధియైయున్నది. పత్రికాధిపతు లెవరైన నట్టి పత్రికలకు గౌరవము రాకమానదు.

## వ్యాఖ్యారచన

కవిహృదయమును దెలుపుటకు వ్యాఖ్యానము లద్దములవంటివి. చక్కని వ్యాఖ్యానములు లేక కొన్నిగ్రంథములు బోధపడుట దుర్లభము. సంస్కృతములో నిట్టి గ్రంథముల కన్నిఁటికిని వ్యాఖ్యలు గలవు. ఈపద్ధతి ననుసరించి నైషధము మొదలగు నాంధ్రప్రబంధములకు విశుద్ధపాఠములతో వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్యాఖ్యలను వ్రాసియున్నారు. ఆముక్తమాల్యదకు వ్రాయుచున్నారు. కొలఁది పాండిత్యము గలవారికిఁ గూడ నిట్టి గ్రంథములయం దభిరుచిని బుట్టించి జ్ఞానాభివృద్ధికిని, భాషాభివృద్ధికిని వ్యాఖ్యానములు సహాయభూతము లగును. కొలఁదికాలములో నింక నిట్టి యమూల్యములగు వ్యాఖ్యానములను రచించి యభినవమల్లినాథులై మాతృభాషకుపకారముఁ జేయుదురుగాక!

## కృతివిమర్శనము

విమర్శనమునందు మనభాష మిగుల హీనస్థితియం దున్నది. ఈ విషయమున మనభాషయభివృద్ధిఁ జెందుటకు బదులుగ నానాఁటికి తీసికట్టులోనికి వచ్చుచున్నది. ముప్పది సంవత్సరముల క్రిందటి "అముద్రితగ్రంథచింతామణి"లోని విమర్శనములకును ఇప్పుడు పత్రికలలో వచ్చెడి విమర్శనములకును తారతమ్యమును జదువరులే సులభముగ గ్రహింపఁగలరు.

విమర్శించునపుడు మోమోటము లేక నిశ్చయముగ వ్రాసి తమయందు తప్పున్నప్పుడు మూసిపెట్టక బహిరంగముగఁ బశ్చాత్తాపము నొందుచుండవలెను. సంపాదకునియెడల నిష్పక్షపాతబుద్ధియు, ధైర్యమును గావలసియున్నవి. ఇప్పుడు ముప్పావలిక మూఁడువీసములు "దళసరి కాగితములు, పెద్దచ్చు, వెల సులభము" అని తప్ప సరియైన విమర్శనము లేదు. ఇట్టి స్థితికిఁ బత్రికాధిపతులే కాక పాఠకులు గూడఁ జాలవఱకుఁ గారకులై యున్నారు. "నేను ఏఁడాదినుండి మీపత్రికకుఁ జందాదారుఁడనై యున్నాను. నేను పంపిన ఉత్తరమును మీ పత్రికలోఁ బ్రచురింపకపోవుటకుఁ గారణము తెలియదు." అని బెదిరించి జాబులు వ్రాయు కాలములోఁ గవులయొక్క గ్రంథములను స్వేచ్ఛగ విమర్శించుటకు సంపాదకు లెంత భయపడుదురో యూహింపుఁడు. కవులలోఁ బార్టీలుపడి యుభయపక్షులవారును బలాబలములఁ జూపుట తటస్థించుచున్నది. దీనికిఁ బై పెచ్చు శాఖాభిమానము తోడై అటు కొందఱు, ఇటు కొందఱు పుల్ల లెగఁద్రోయుచుండినచోఁ బత్రికాధిపతుల యవస్థ

యుంచఁ జెప్పనక్కఱలేదు. ఏపక్షమువా రాపత్త్రికను బోషించుచుఁ దక్కినపత్త్రికల కుప్పుఁ బుట్టనీయరు. శాఖాభేదపిశాచము భాషావిషయముల నావేశించినయెడల భాషాభివృద్ధికిఁ గలుగు నాటంకములు వర్ణనాతీతము లగును.

విమర్శనాభివృద్ధికి రెండు మార్గములు దోఁచుచున్నవి. నిష్పక్షపాతబుద్ధితోఁ గేవలము భాషావిషయములను మాత్రము చర్చించుటకై యొక మాసపత్త్రిక కావలసియున్నది. ఇది జయప్రదముగ జరుగుటకు పండితుల సాహాయ్యము కావలసియున్నది. భాషావిషయములు తప్ప ఇతరవిషయము లుండినయెడల వీరు సాహాయ్యము చేయరు. అముద్రితగ్రంథచింతామణి యంతకాల మవిచ్ఛిన్నముగ జరుగుట కిదియే కారణము. ఇట్టిపత్త్రిక కవుల కొక విధమైన యంకుశముగ నుండుటయే కాక జనసామాన్యముయొక్క పాండిత్యాభివృద్ధికిఁ గూడఁ దోడ్పడఁగలదు.

విమర్శనాభివృద్ధికై పత్త్రికాధిపతులు మఱియొక మార్గమును గూడ నవలంబించుట యవసరము. ప్రత్యేకవిషయముఁ గూర్చి చర్చించుటకు వేర్వేఱు విమర్శకుల నేర్పఱచుకొని వారి కాయా విషయముల గ్రంథములను విమర్శనార్థము పంపుచుండవలెను. వీరు గ్రంథములను చక్కఁగఁ జదివి నిష్పక్షపాతబుద్ధితో నిర్భయముగ విమర్శించి పత్త్రికాధిపతులకుఁ దోడ్పడినఁ గాని మన భాషలో కృతివిమర్శనము వృద్ధి కానేరదు.

## కవిపండితసభ

కవులలో పార్టీలు పోయి పరస్పరాసూయ నశించుటకు వారి కప్పుడప్పుడు సమావేశము చేయుట మిక్కిలి యవశ్యమై యున్నది. ఇట్టి సభలవలన గ్రంథకర్తలలో నైకమత్య మభివృద్ధిఁ జెంది దూషణ గ్రంథముల కవకాశ ముండకపోవుటయే కాక భాషావిషయముల చర్చించి దాని శుచిత్వమును గాపాడుట కూడ నేర్పడును కావున భాషాభిమానులు ప్రతిసంవత్సరమును కవిపండితజనమును సమావేశము చేయఁ బ్రయత్నింపవలసియున్నది. పాశ్చాత్యదేశములలో గ్రంథకర్తలయొక్క సంఘములు చేయుచున్న యుపకారములు సర్వజనవిదితములు గాన నిచ్చట ప్రత్యేకించి వ్రాయనక్కఱలేదు.

## గ్రామ్యాగ్రామ్యవాదములు

ఇంకొక విషయమును జెప్పకయే యీ వ్యాసమును బూర్తి చేయుటకు వీలులేదు. ఈ గ్రామ్యాగ్రామ్యవాదములు రెండు మూఁడు సంవత్సరములనుండి పత్త్రికలలోను సభలలోను విరివిగ చర్చింపఁబడుచున్నవి. ఇవి భాషాభివృద్ధికిఁ దోడ్పడఁగలవని చెప్పక తీరదు. ప్రతాపరుద్రీయనాటకములో మొట్టమొదట పాత్రోచితముగ గ్రామ్యభాష వాడఁబడినది. కవియొక్క భావస్ఫూర్తి పాఠకుల మనస్సులయందు నాటుటకు కొన్నిపట్ల గ్రామ్యభాషవలె సలక్షణభాష యలవడ దని యీ నాటకమును జదివినవారికి బోధపడకమానదు. జనసామాన్యమునకు గ్రామ్యభాషలోఁ జెప్పిన సంగతులు మనసుకుఁ బట్టినట్లు సలక్షణభాషలో పట్టఁజాలవు. కాని యింతవఱకును గ్రామ్యాగ్రామ్యవాదులు ఒండొరులను చక్కఁగ తెలిసికొనలేదు. ఉభయులకును భాషాభివృద్ధియే ముఖ్యోద్దేశము కాని యొండొరులపై వ్రాసికొనుచున్న వ్రాఁతలు గర్భనిర్భేదములుగ నున్నవి. కన్యాశుల్కముయొక్క భాషయే గ్రామ్యవాదులకు వేద మని చెప్పుట అగ్రామ్యవాదులకు సరి కాదు. అగ్రామ్యభాష యెట్లుండునో యెత్తిపాడుచుటకై మచ్చుకొఱకు గిడుగు రామమూర్తిగారు ఇటీవల ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలో ప్రచురించిన తమ "ప్రౌఁదెలుఁగుఁగమ్మ" ప్రస్తుతపు సలక్షణభాషయొక్క నిజస్థితి నెంతమాత్రమును సూచింపదు. ఇది తెగులుదాఁకిన తెలుఁగు కాని నవనవలాడుచు నిప్పుడు కోమలముగా దినదినప్రవర్ధమానముగఁ బెరుఁగుచున్న సలక్షణమైన తెలుఁగు గాదు. సలక్షణగ్రంథములలో పాత్రోచితముగ గ్రామ్యభాషను వాడుట కంగీకరించి యీ యుభయకక్షులవారును రాజీ చేసికొనినయెడల భాష నిరాటంకముగ నభివృద్ధికి రాఁగలదు. లేదా గ్రామ్యవాదు లొకపని చేయవలసియుండును. గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాయుచు నొకపత్త్రికను గూడ గ్రామ్యభాషలోనే ప్రచురింపవలెను. అప్పుడు ప్రజాదరణమును బట్టి యేభాషయందు జీవ మున్నదో తేలును. సజీవమగు భాష నిలిచి నిర్జీవమగు భాష నశించును. ఇంతియకాని, గేదెను నీటిలో నుంచి కొమ్ములు చూపి బేరమాడినట్లు పుస్తకములు లేక శుష్కవివాదములవలన ఉభయకక్షులవారికిని మనస్స్పర్థలు గలుగుట తప్ప వేఱు ప్రయోజన ముండదు.

మన తరములో నాంధ్రభాషాభివృద్ధికిఁ దోడ్పడిన విషయములలోఁ గొన్నిటిని నాకుఁ దోఁచినసరణి వ్రాసితిని. ఇంకను కొన్ని యుండవచ్చును. అందు ముఖ్యమగునది యాంధ్రోద్యమ మని చెప్పవలసియున్నది. ఈ యుద్యమమునకు వయసు కొలఁది యైనను, విద్యావిషయములలో మనవారు మునుపటికంటె నెక్కువ శ్రద్ధ వహించుచున్నారు. అన్ని విషయములయందును ఐకమత్యము కుదురనై యున్నది. ఈ భావమే గ్రంథకర్తలయందు కూడ ప్రబలి భాషను పోషించుఁ గాక!

ఉ. పుట్టునె భూమియం దొక యపూజ్యుఁడు 'నా కిది మాతృభాష, నేఁ
బుట్టిన దేశ మిద్ది' యని పొంగక, ప్రాణము గల్గు పీనుఁగై?
పుట్టవె తల్లికడ్పునను బుర్వు ల వెన్ని యొ? వానిలోన నీ
కట్టెఁడి యెంచ నొక్కఁ డగుఁగాక, నరుం డని యెంచ దోషమా.

# ఆంధ్రరాష్ట్రోద్యమ చరిత్రము

చల్లా శేషగిరిరావుగారు, బి. ఏ., ప్లీడరు

ఆంధ్రరాష్ట్రోద్యమము ఎప్పుడు మొదలిడినదియు తెలిసికొనుటకు చాలమందికి ఈ కాలమున కుతూహలము కలిగియుండవచ్చును. ఆంధ్రపత్రికాధిపతి చెన్నరాజధాని వెలుపలనుండి తన విశాలదృష్టితో చూడఁగా ఆంధ్రుల యభివృద్ధికి ఆంధ్రరాష్ట్రము ముఖ్యావసర మని వారి సూక్ష్మబుద్ధికి గోచరించెను. వెంటనే 1911 సంవత్సరమున ఢిల్లీదర్బారునకు పూర్వమే ఆంధ్రపత్రికలో ఆంధ్రరాష్ట్రముయొక్క ఆవశ్యకమును గూర్చి యొక వ్యాసము వ్రాయఁబడెను. ఈ కోరిక సవ్యమయిన దని ఆంధ్రులకు తోఁచినను, అప్పటికి రిత్తకోరిక యని తోఁచెను. ఢిల్లీదర్బారుదినము ఆంధ్రదేశప్రబోధమునకు ముఖ్యకారణ మని చెప్పనగును. ఆ దినముననే భాషనుబట్టి రాష్ట్రముల నేర్పఱచుట దొరతనమువారి రాజనీతికి విరుద్ధము కా దనియు ఆంధ్రరాష్ట్రనిర్మాణము సాధ్యమగు విషయములలో నొకటి యనియు జనుల మనంబులకు పొడగట్టెను. వంగదేశవిభజనము రద్దుచేయఁబడు ననియు విహారదేశము వంగదేశమునుండి విడఁదీయఁబడు ననియు రాష్ట్రవిభజనము భాషైక్యమును బట్టి జరుగు ననియు నదివఱకు ఎవరును తలఁచియుండ లేదు. మార్లేవంటి రాజనీతిజ్ఞుఁడు "నిర్ణయాంశము" అని చెప్పిన బంగాళావిభజనము జనుల కోరికప్రకారము రద్దుచేయఁబడెను. ఆంధ్రరాష్ట్రము ఎందుకు సాధ్యముకాదు? అను ప్రశ్న వెంటనే కొందఱి యాంధ్రుల మనంబులలో నాటుకొనెను. దర్బారుదినముననే దేశాభిమానిపత్రికాధిపతి యగు దేవగుప్తము శేషాచలపతిరావుగారు తమ యకుంఠిత దేశాభిమానముతో ఆంగ్లేయభాషలో తమ పత్రికకు సప్లిమెంటుగా నొక పత్రికను గుంటూరిలో ప్రచురించెను. అందు 1911-వ సం. డిసెంబరు నెలలో ఆంధ్రరాష్ట్రముయొక్క ప్రయోజనములను తెలుపుచు న్యాపతి నారాయణరావుగారు వ్రాసిన వ్యాసమును, ఆ నెలలోనో తరువాతనో రెండు సంచికలలో నేను వ్రాసిన వ్యాసమును ప్రచురింపఁబడినవి. అప్పటినుండియు దేశాభిమానిపత్రిక సప్లిమెంటులో ఆంధ్రరాష్ట్రమును గూర్చి విపులముగా చర్చింపఁబడి, ఆ విషయమయి ఉపవిలేఖకులు వ్రాసిన వ్యాసములు ప్రకటింపఁబడుచుండెను. గుంటూరులోని విద్యార్థులలో ముఖ్యముగా యువజనులలో ఆంధ్రరాష్ట్రముయొక్క యావశ్యకమును గూర్చి అనేక చర్చలు జరుగుచుండెను. ఆంధ్రపత్రిక దప్ప తెలుఁగు పత్రికలలో అప్పటికి ఏపత్రికయు ఈవిషయమును గూర్చి వ్రాయ మొదలిడ లేదు. కాని దేశాభిమానిపత్రికలో వ్రాయఁబడిన వ్యాసములను గూర్చి కొన్ని ఆంగ్లేయపత్రికలలో అభిప్రాయము లియ్యఁబడెను. 1912 సంవత్సరము ఫిబ్రవరినెల హిందూస్థాన్ రివ్యూలో తత్పత్రికాధిపతి ఆంధ్రరాష్ట్రమునుగూర్చి వ్రాయుచు ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్ర మవసర మని అభిప్రాయము నిచ్చెను. కలకత్తాలో ప్రచురింపఁబడు మాడర్న్ రివ్యూ పత్రికాధిపతియు అనుకూలాభిప్రాయ మొసఁగెను. లండను నగరములో ప్రచురింపఁబడు రివ్యూ ఆఫ్ రివ్యూస్ పత్రికాధిపతియు ఆంధ్రరాష్ట్రనిర్మాణమును ఆశీర్వదించెను. అటుపిమ్మట, చెన్నపట్టణములో ప్రచురింపఁబడు "ఇండియను పేట్రియాటు" అను ఆంగ్లేయదినవార్తాపత్రిక ఈ విషయమును విపులముగ చర్చించుచు ఆంధ్రరాష్ట్రోద్యమము ఆంధ్రుల యభివృద్ధికి తోడ్పడు ననియు తదితరజాతుల యభివృద్ధికి భంగకరము కానేర దనియు స్పష్టముగా వ్యక్తీకరించెను. ఈ పత్రికాధిపతి మళయాళదేశీయుఁడగు కరుణాకరమీనను గారు. ఈయన ఆంధ్రోద్యమమునకు కావించిన మహోపకారము ఇంత యని చెప్పుటకు వీలు లేదు. అయినను ఈపనికి ప్రేరేపించినది కేవలము పరోపకారబుద్ధియే గాని స్వలాభాపేక్ష యొంత

మాత్రము కాదు. ఆంధ్రులకు ప్రత్యేకము ఆంగ్లేయభాషలో దినపత్రిక లేకపోయినను ఈ పత్రిక ఆ లోపమును కొంతవఱకు పూర్తిచేసిన దని చెప్పవచ్చును. ఆ సంవత్సరము మే నెలలో నిడుదవోలులో కృష్ణా గుంటూరు కాన్ఫరెన్సు జరుపఁబడెను. ఆ సభలోనే గుంటూరు కృష్ణా జిల్లాల సభలు వేఱుచేయఁబడెను. ఆ సభకు పూర్వము గుంటూరు జిల్లాసంఘమువారు ఆంధ్రరాష్ట్రము గూడ నొక చర్చనీయాంశముగా నుంచుటకు సభ గావించిరి. ఆ సభలో ఈ విషయము విపులముగా చర్చింపఁబడి కాన్ఫరెన్సువారికి తెలుపఁబడెను. ఆహ్వానసంఘమువారును ఈ విషయమును తీర్మానింపఁబడు విషయములలో నొకటిగా చేర్చిరి. కాన్ఫరెన్సులో ఈ విషయమును విచారించునట్లు ప్రోత్సాహము చేయుటకు గుంటూరులోని యువజనులు చాలమంది కాన్ఫరెన్సునకుఁ బోయియుండిరి. ఆ సభకే గోదావరిజిల్లా ప్రముఖులు, కృష్ణా గుంటూరు గోదావరి జిల్లాలు కలసి ఒక సభ చేయునట్లు ఆ సభవారిని కోరుటకు వచ్చియుండిరి. కాన్ఫరెన్సు దినమున భోజనములు అయినతరువాత సభ ప్రారంభమునకు పూర్వమే ప్రతినిధుల బసలో గుంటూరు బందరు రాజమహేంద్రపుర వాసులలోఁ గొందఱొకచోటఁ జేరిరి. ఆంధ్రరాష్ట్రము పేరు చెప్పఁగనే గోదావరి జిల్లావారు కొందఱు నవ్వసాగిరి. కాని హిందూస్థాన్ రివ్యూ మొదలగు పత్రికల యభిప్రాయములను మాలో కొందఱు చదువ మొదలిడఁగా ఆంధ్రరాష్ట్రోద్యమ మన వ్యర్థవాక్యములు కా వని కొంచెము శ్రద్ధతో వినసాగిరి. గుంటూరునుండి వెళ్లినవారిలో వక్తృత్వమువలన సభను రంజింపఁ జేయు సమర్థత గల ఉన్నవ లక్ష్మీనారాయణ గారు ఆంధ్రరాష్ట్రవిషయములో నుత్సాహము కలిగియుండియు కార్యాంతరమున ఆ సమయములో బొంబాయికి వెళ్లియుండిరి. బందరులో న్యాయవాదిగా నున్న వల్లూరి సూర్యనారాయణరావుగారు ఆంధ్రు లందఱు మధ్యపరగణాలతోఁ జేరిన బాగుండు నని కొంతవఱకు వాదము చేసి చివరకు ఆంధ్రరాష్ట్రముయొక్క ఆవశ్యకమును ఒప్పుకొనిరి. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు గూడ ఈ వాదమున కనుకూలాభిప్రాయ మొసఁగిరి. అప్పటికి మా కోరిక కొంత నెఱవేఱిన దని యుత్సాహము కలిగెను. రాజకీయసభయొక్క చివర దినమున విషయనిర్ణయసభలో ఈ విషయము చర్చింపఁబడెను. ఆంధ్రమహాజనసభలో ఆంధ్రరాష్ట్రము విషయమయి యతిసమర్థతతో పోరాడిన వేమవరపు రామదాసు పంతులు గారు నిడుదవ్రోలు సభ కగ్రాసనాధిపతిగా నుండిరి. విషయనిర్ణాయకసభలో ఈ విషయమును చర్చింపవలె ననువారు మొదట నెక్కువగా నుండినను రెండవసారి లెక్కించుటలో ప్రతికూలు రెక్కువయిరి. అంతట నీ విషయము చర్చనీయాంశములనుండి తొలఁగింపఁబడెను. కాని వల్లూరి సూర్యనారాయణరావుగారు బహిరంగసభలో ఈ తీర్మానమును ప్రవేశపెట్టెద నని వాక్రుచ్చిరి. ఈ తీర్మానము సభాంత్య మగువఱకు ప్రవేశపెట్టుటకు వీలుపడలేదు. తుట్టతుదకు ఈ తీర్మానము విషయము చర్చింపఁబోఁగా, కూర్మా వేంకటరెడ్డి నాయుఁడు గారును పెద్దాడ సాంబశివరావుగారును ఈ తీర్మానము రాఁబోవు సంవత్సరము వఱకు నిలుపవలయు నని ఆక్షేపణ చెప్పిరి. సభలో విశేషముమంది ఈ యభిప్రాయమునే కలిగియుండిరి. అందువలన ఈ విషయము చర్చింపఁబడలేదు. జరగిన వృత్తాంత మంతయు ఇండియన్ పేట్రియటు సొంత యుపవిలేఖకుఁడు విపులముగా పత్రికకు తంతిమూలమున తెలియఁ జేసెను. ఆదినమున ఈతీర్మాన మంగీకారము నొందకుండుట ఆంధ్రరాష్ట్రోద్యమమునకు మేలు కలిగిన దని చెప్పవచ్చును. ఎందు కన, కృష్ణా గుంటూరు జిల్లాలు మాత్రము ఈ తీర్మానమంగీకరించిన, ప్రయోజన మేమి? ఈ సమస్య ఆంధ్రు లందఱు కలసి విచారించుట యావశ్యకము. ఆ సంవత్సర మీతీర్మాన మామోదింపఁబడినచో ఆంధ్రమహాజనసభ ఇంత త్వరలో కూడియుండ దని నా నమ్మిక. నిడుదవోలు కాన్ఫరెన్సులో విఫలమనోరథు లయిన తరువాత ప్రతివారికిని ఆంధ్రు లందఱు నొకచో సమావేశమయి ఈ తీర్మానమును గావించి దొరతనమువారికి తెలియఁ జేసిన బాగుండు నని తోఁచెను. నిడుదవోలు సభానంతరము కృష్ణాపత్రిక ఈ విషయ

మయి వ్రాయ మొదలిడి ఆంధ్రరాష్ట్రమందలి తత్త్వ
మును గంభీరశైలితో చాటించెను. ఆంధ్రమహాజనసభ
ను త్వరలో జరపుట యావశ్యక మనియు వ్రాసెను.
తెలుఁగుపత్రిక లన్నియు మొత్తముమీఁద ఆంధ్రరాష్ట్ర
నిర్మాణము నామోదించెను. ఇంతవఱకు వ్రాసిన సంగ
తులంబట్టి చూడ, ఆంధ్రోద్యమ మాంధ్రరాష్ట్రాభిలాష
తో వృద్ధి గాంచెను. ఆంధ్రవిశ్వవిద్యాలయము గాని ఆం
ధ్రులవిద్యాభివృద్ధి గాని ఆంధ్రోద్యమమునకు ప్రధానాం
గములు గానేరవు. ఈ సంగతి మఱుఁగుపఱచి కొందఱు
ఆంధ్రోద్యమము విద్యావిషయికప్రయత్నము మాత్ర
మే యని సభలలోఁ జెప్పిరి. కాని ఆంధ్రరాష్ట్రాభిలాష
లేనిది ఆంధ్రోద్యమము ఇంత యభివృద్ధి గాంచనేరదు.
ఆంధ్రరాష్ట్రనిర్మాణమువలన ఆంధ్రుల యభివృద్ధి త్వరలో
సమకూరును. బిహారరాష్ట్రనిర్మాణ మయిన తరువాతనే
విశ్వవిద్యాలయము స్థాపింపఁబోవుచున్నారు. హైకోర్టు
రెండు సంవత్సరములలో ప్రత్యేకముగా నేర్పఱుపఁ
బడును. రాష్ట్రవిషయికమగు ప్రయత్నము లన్నియు
ఏకజాతీయతకు భంగకరము లనియు ఆంధ్రప్రముఖులు
ఈ యుద్యమ మామోదింపలే దనియు హిందూపత్రిక
యాక్షేపించెను. ఇంతలోనే ఆంధ్రప్రముఖులు మేల్కాం
చి ఆంధ్రోద్యమమును గూర్చి పత్రికలకు వ్రాసిరి. న్యా
పతి సుబ్బారావు పంతులు గారు కొంత యనుకూలము
గను కొంత ప్రతికూలముగను వ్రాసిరి. డాక్టరు పట్టాభి
సీతారామయ్య గారును మిట్టదొడ్డి వేంకటసుబ్బారావు
పంతులుగారును ఇంక ననేకవిద్యాధికులును ఆంధ్ర
రాష్ట్రనిర్మాణ మావశ్యక మని పత్రికలలో వాదించిరి.
వివిధాభిప్రాయములు గలవారు ఈ సమస్యను గూర్చి
యొకచోట సమావేశమయి నిర్ధారణచేయుటకు ఆంధ్ర
మహాజనసభ కూడవలె నని యెల్లరకు తోఁచెను.
ఈ మహోద్యమమునకు దైవము గూడ సాయ మొన
రించెను.

గుంటూరు జిల్లాసంఘమువారు వెంటనే యాంధ్ర
మహాజనసభ జరపుట కంగీకరించిరి. ఇది మొదటి సభ
గాన, వారు ఆ సభను గూర్చుటలో చాల కష్టములకు
లోనయిరి. కాని అక్కడ సమావేశ మయిన యాంధ్రుల
యుత్సాహమునకు మేర లేకుండెను. దేశీయమహాజనసభ
కంటెను ఎక్కువ పట్టుదలతోను ఉత్సాహముతోను వైభ
వముతోను జరపఁబడెను. ఆంధ్రరాష్ట్రము విషయమై
విషయనిర్ణాయకసభలోను బహిరంగసభలోను తీవ్ర
మైన చర్చ జరగెను. ప్రతినిధు లందఱును ఆంధ్రరాష్ట్ర
నిర్మాణమును గుఱించి ఏకాభిప్రాయము గలిగియుండిరి.
కాని ప్రథమసంవత్సరముననే దొరతనమువారికి ఈవిష
యమున తీర్మానము నంపుట కూడ దని కొందఱియభిప్రా
యము. ఉభయపక్షములవారును వారివారి హేతువుల
నతిసమర్థతతో తెలియఁజేసిరి. వల్లూరి సూర్యనారాయణ
రావుగారును వేమవరపు రామదాసు పంతులుగారును
ఈ సభలో రాష్ట్ర మావశ్యక మని తీర్మానించుట సమం
జస మని యభిప్రాయ మొసంగిరి; దొరతనమువారికి తెలు
పుటను గూర్చి జనుల యభిప్రాయము కనుఁగొనుట కొప్పి
కొనిరి. కాని ముట్నూరి ఆదినారాయణయ్య గారును
గంటి వేంకటరామయ్యగారును జనుల యభిప్రాయము
ముందు కనుఁగొని తరువాత తీర్మానము చేయుట యుక్త
మని నుడివిరి. వీరును ఆంధ్రరాష్ట్ర మనవసర మని చెప్పి
యుండలేదు. దాని యావశ్యకము ప్రతినిధు లందఱి
మనంబుల నాటుకొనియుండెను. ఈ వివాదములో ఓటులు
తీసికొనిన, ఈతీర్మానము ఆమోదింపఁబడియుండెడిది. కాని
ఇంత గొప్పవిషయములో ఏకీభావము కలిగియుండుట
శ్రేయస్కర మని యెంచి తీర్మానమును ప్రవేశపెట్టిన
వారు, రాష్ట్ర మనవసర మని సభలో కొందఱు అభి
ప్రాయపడుచున్నందున ఈ విషయమై జనాభిప్రాయము
కనుఁగొనుట అవసర మను అమెండుమెంటును అంగీక
రించి, సభను జయప్రదముగా ముగింపుచేసిరి. ము
ట్నూరి ఆదినారాయణయ్యగారు తమ యసమానవా
గ్ధోరితో కొన్ని ప్రబలముగాఁ గనఁబడు సందేహముల
సూచించిరి. అప్పటికి అవి సభలోఁ గొందఱికి నిజమగు
ఆటంకములుగాఁ దోఁచెను. గంజాము విశాఖపట్టణము
జిల్లాలు ఒకవయిపునను దత్తమండలములు మరియొక
వయిపునను ఈ యుద్యమమునకు విముఖు లయినచో ఈ

యుద్యమ మెటులు జయప్రద మగు నని ప్రశ్న వేసిరి. ఈ ప్రశ్నకు వెంటనే యొక ప్రక్కనుండి యుత్తరము వచ్చెను. విశాఖపట్టణపు జిల్లాసభ జరపఁబడెను. ఆ సభకు మంథా సూర్యనారాయణరావుగా రగ్రాసనాధిపత్యము వహించి ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి విపులముగా చర్చించి ప్రతిపక్షులు చెప్పు యుక్తు లన్నియు సహేతుకముగా ఖండించి మహోపన్యాసము గావించిరి. హిందూస్థాన్ రివ్యూ పత్రికయును ఇండియన్ పేట్రియటు పత్రికయును ఈ యుపన్యాసమును విశేషముగాఁ గొనియాడెను. ఇంతే గాక, విశాఖపట్టణపు జిల్లాసభయందు ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి ఆంధ్రమహాజనసభలో చేసిన తీర్మానమువంటి తీర్మానమును చేసియుండిరి. విశాఖపట్టణపు బెదురు అంతటితోఁ దీఱెను. విశాఖపట్టణములో "ఆంధ్ర అడ్వకేటు" అను ఆంగ్లేయవారపత్రిక స్థాపింపఁబడి ఆంధ్రరాష్ట్రోద్యమమును వ్యాపింపఁజేయుచున్నది. విజయనగరములో ప్రచురింపఁబడు భారతిమాతయును ఆంధ్రరాష్ట్రము నామోదించుచునే యున్నది. కాని దత్తమండలముల జడుపు తీఱు టెట్లు? ఆంధ్రమహాజనసభలో నేర్పఱుపఁబడిన స్థానికసభవారు ఇతర సభలవలె సంవత్సర మంతయు నిదురఁబోయి సంవత్సరాంతమున మేలుకొను నాచారమును పాటింపక చుఱుకుఁదనముతో సంవత్సర మంతయు పని చేసిరి. విద్యార్థులు ఆంగ్లేయభాషలో ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి వ్రాసిన వ్యాసములను, పత్రికాధిపతు లిచ్చిన యభిప్రాయములను, అనుకూలప్రతికూలాభిప్రాయములను అన్నిటిని జేర్చి స్థానికసభవారు "ఆంధ్రరాష్ట్రము" అను నొకపత్రమును ప్రచురించిరి. కొంతమంది ప్రముఖులు చేరి దత్తమండలము లన్నియుఁ దిరిగి ఆంధ్రరాష్ట్రమును గూర్చి యుపన్యాసము లొసఁగిరి. వీ రేయూరు వెళ్లినను అచ్చటి పౌరులు వీరికి తగు సత్కార మొనరించి వీరు చెప్పు సమాధానములను శ్రద్ధతో నాలకించి ఆంధ్రరాష్ట్రనిర్మాణము విషయమయి తమకుఁ గల యామోదమును వెల్లడించిరి. ఇంత యేల? రాష్ట్రనిర్మాణము దేశాభివృద్ధికి భంగకర మని వాదముచేసిన ఆనరబిల్ కేశవపిళ్లగారు ఆంధ్రరాష్ట్రము ఆదర్శముగా నొప్పికొనవలసినవా రైరి. ఇప్పుడు ఆంధ్రదేశమం దంతటను ఆంధ్రరాష్ట్రమునకు ప్రతికూలురు బహుస్వల్పసంఖ్యాకు లయియున్నారు. ఆంధ్రదేశీయులు బహుసంఖ్యాకులు రాష్ట్రనిర్మాణ మావశ్యక మనియు మనము త్వరలో ప్రభుత్వమువారిని కోరుట శ్రేయస్కర మనియు అభిప్రాయపడియున్నారు. ఇతరసంఘములలోని ప్రముఖులును ఆంగ్లేయ రాజనీతిజ్ఞులును రాష్ట్రనిర్మాణమున కనుకూలురైయున్నారు. కాని ఆంధ్రమహాజనసభయందు ఈ తీరుమాన మామోదింపఁబడినఁ గాని దొరతనమువారిని గోరుటకు వీలుపడదు. రాఁబోవు ఆంధ్రమహాజనసభ బెజవాడలో జరగనున్నది. ఆ సభ గతవత్సరసభకన్నను జయప్రదముగా జరగు సూచనలు పొడగట్టుచున్నవి. సంఘసంస్కరణసభయు, వస్తుప్రదర్శనసభయు, సాహిత్యసభయు, ఆంధ్రమహాజనసభాకాలమునందే జరగును గనుక జనులు విశేషముగా వచ్చెదరు. విజయవాడకు ఆంధ్రదేశముయొక్క యన్నిభాగములనుండియు రైలుమార్గము లుండుటవలన దూరప్రయాణీకులకు సౌకర్యముగా నుండును. కృష్ణానది యొడ్డున నుండి నీటివసతి గలిగియుండుటవలన ఈ పట్టణము బహుజనుల నాకర్షించును. ఈస్టరు సెలవులలో కాలవ్యవధి తక్కువయగుటచేత కొంతమందికి ఇబ్బంది కలుగు నేమో యని మాత్రము సందేహము కలదు. రాఁబోవు సభలో ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి ఆ సభకు దయచేయు ప్రముఖు లెల్లరు నాలోచించి, ఏవియో యుక్తులు చెప్పి కాలము గడపక, నిష్పాక్షికబుద్ధితో ఏకగ్రీవముగా నా తీరుమానము నామోదించుట ముఖ్యకర్తవ్యము. సఖ్యమునం దాదరము మనలో నింకను వృద్ధికావలెను. ఒక విషయమును నమ్మి వేఱొకటి యాచరించుట సంఘదౌర్బల్యసూచకము. ఈ యుద్యమము, ఇండియను పేట్రియటు పత్రిక వ్రాసినట్లు, పట్టుదలతో పనిచేసిన కొనసాగఁగలదు. దొరతనమువారు ఇందుకు అనుకూలముగా నుండెదరు. జనాభిప్రాయ మనుకూలముగా నున్నది. నాగరికప్రపంచముయొక్క చరిత్రము గమనించిన, ఆంధ్రరాష్ట్రము ఆవశ్యక మని చాటుచున్నది. ఆంధ్రు లింక కార్యశూరులై భగవంతుని సాయముతో నీ యుద్యమమును జయప్రదముగా నెఱవేర్చెదరుగాక!

# పంచాయతీ సభలు

## కోపల్లి కృష్ణారావు పంతులుగారు

భారతఖండమునందలి ప్రజలలోఁ జాలమంది విద్య లేక చేవ్రా లయినను జేయ శక్తిలేనివారుగా నుండి రపుడు వారిలో వారు వ్రాసికొను క్రయవిక్రయఋణముల పత్రములు మొదలగునవి ఆయా గ్రామములో నుండు నొకరిద్దఱు లేఖకులలో నెకరిచే నే తాటియాకు మీఁదనో వ్రాయించుటయు, అందుకు క్రయికుఁడో, అధమర్ణుఁడో, గంటము మొట్టిన గుర్తునో లేక చూచిన గుర్తునో వేయించుటయు, సాక్షులు సూర్యచంద్రు లుండుటయుఁ గలదు. అక్కాలంబున సూర్యచంద్రులు ప్రత్యక్షముగ సాక్ష్యముఁ జెప్పుదు రను జ్ఞానము గలదు కాఁబోలును. అటుపిమ్మట కొంత కాలమునకుఁ బుట్టిన దస్తవేజులు ఈ దేశమునఁ జేయఁబడు మందపు పేఁచు కాగితములమీఁద వ్రాయఁబడుటయు వానిమీఁద వ్రాసి యిచ్చినవాని చేవ్రాలు నిశానీ ల టుండ సాక్షులు వ్రాయఁగలవా రయినను వారిపేళ్లను గూడ లేఖకుఁడె 1, 2 సంఖ్యలు వేసి వ్రాయుటయుఁ గలదు. సాక్షుల చేవ్రాళ్లువారి దస్తూరిని లేకపోయినను వేఱువిధముగఁ జెప్ప రని అప్పటివారి ధైర్యమై యుండును. ఇక్కాలంబున తాను జేసిన చేవ్రాలును కూడ తప్పుసాక్ష్య మిచ్చుట వలన కలుగు శిక్షాస్మృతిశాసనమున కయినను వెఱవక తనది కా దని చెప్పు సాక్షులు ఆకాలంబున లేకుండ నుండవలయును.

రానురాను చదువు వృద్ధియయి, నాగరికత హెచ్చి, యితరదేశసంబంధము విశేషించిన కొలఁదిని, ఇట్టి దస్తవేజులు క్రయికునియొక్కయు, అధమర్ణుని యొక్కయు స్వలిఖితములు కావలసివచ్చెను. సాక్షులు స్వయముగ సాక్షివ్రాళ్లు చేయవలసిన యావశ్యకము కలిగెను. సూర్యచంద్రు లిద్దఱి స్థానమందును విశేష సంఖ్యగల నిజాకృతులతో నిలువఁబడు సాక్షు లేర్పడిరి.

కొంతకాల మిట్లు జరగినపిమ్మట మనకు బ్రిటిషు దొరతనమువారి పరిపాలన నానాఁటికి స్థిరపడి, ఈ ప్రెసిడెన్సీలో 1802-వ సం. 2-వ రిగ్యులేషన్ ప్రకారము ప్రత్యేకన్యాయసభ లేర్పడి, 1802-వ సం. 3-వ రిగ్యులేషన్‌లో ఏర్పడిన కొన్ని పద్ధతులతో న్యాయవిమర్శ ప్రారంభమయినది. ఇందుకు క్రమముగా ప్రత్యేకసభ లేర్పడినవి. ఈ సభలలో దొరతనమువారివలన వేతనములు పుచ్చుకొని న్యాయమును గనిపెట్టు ఉద్యోగస్థులు నియమింపఁబడిరి.

అంతవఱకు ప్రజల నడుమ పుట్టు దస్తవేజులు వాని పుట్టుక కాలమందు రాజకార్యస్థానములను చూచు నాచారము లేకున్నను, పాశ్చాత్యదేశాచారమును బట్టి మరణశాసనములు, తాకట్టుదస్తావేజులు మొదలగునవి రిజస్టరుచేయఁబడుటకు 1802-వ సం. 17-వ రిగ్యులేషనను నొకశాసనము పుట్టినది.

ఇట్లు దస్తవేజులకును, న్యాయవిమర్శకును రాజకీయస్థానము లేర్పడినను, గ్రామములలో జరగు న్యాయమును బొత్తుగ లేదనఁగూడ దని వ్యాజ్యెములలోని వివాదములకు పంచాయతీలను కోరుకొను హక్కును నిలిపియుంచినట్లు లొక శాసనము (1802-వ సం. 21-వ రిగ్యులేషను) ఏర్పడెను.

ఇది మొదలు అనేకన్యాయసభలు వివిధమయిన పేర్లతో పెరిఁగినవి. డిస్ట్రిక్టు మునసఫు కోర్టులు, ఆగ్జిలియరీ కోర్టులు, అదాలతు కోర్టులు, సర్క్యూటు కోర్టులు, ప్రొవిన్షియల్ కోర్టులు, సదరదాలతు కోర్టు అను పేరులతో అసలు, అప్పీలు, పయి అప్పీలుకుఁగాను వ్యయముతోను, ప్రయాసముతోను కూడుకొనిన వేర్పడినవి.

వీనివలన ప్రజలకు తృప్తి లేదను కారణముననో మరి యేకారణముననో గ్రామ మునసఫులు కొన్ని చిరాస్తి వ్యాజ్యెములకు గ్రామపంచాయతీలను ఏర్పఱుప

వచ్చు నని 1816-వ సం. 5-వ రిగ్యులేషనును, డిస్ట్రిక్టు
మునసఫులు డిస్ట్రిక్టుపంచాయతీలను ఎంత కిమ్మతు గల
వ్యాజ్యేమున కయినను ఎట్టి ఆస్తికయినను ఏర్పఱుప
వీలు కలిగియుండునట్లు 1816-వ సం. 7-వ రిగ్యులేషనును
పుట్టినవి.

ఇటీవల జరగిన మార్పులును, ఏర్పడిన న్యాయ
స్థానములును ఇప్పు డందఱకును దృష్టియం దున్నవే
యై యున్నవి. గ్రంథవిస్తరభీతిచే వాని వివరములు
వ్రాయఁబడ లేదు.

ఇప్పటి పద్ధతుల ప్రకారము ప్రజలు పరస్పరాను
కూల్యముమీఁద తమ న్యాయమును తామే చక్కఁబెట్టు
కొనుటకు సివిల్ స్వభావము గల తగవులకు పంచా
యతీవ్యవహారము నిలిచియున్నది. క్రిమినల్ వ్యవహార
ములలో దొరతనమువారు అసెస్సర్లని జూరీ లని ప్రజ
లకు ఇలాకాను కలుగఁజేసియున్నారు. ఆంగ్లేయప్రభు
త్వములో ఇంగ్లాండులో నుండు సివిల్ కేసులలోని
జూరీపద్ధతి యీ దేశస్థులకు వ్యాపింపఁజేయఁబడ లేదు.

దస్తవేజులు దొరతనమువా రేర్పఱిచిన స్టాంపు
కాకితములమీఁద నుండనిపక్షమున నిరుపయోగము
లని, రిజష్టరు కానియెడల పనికిరా వని యేర్పఱిచిన
పద్ధతులు దేశమం దంతటను పంచాంగశ్రవణములుగ
నున్నవి.

ఇవి యిటుండ, న్యాయము కనుఁగొనుటకు
పద్ధతు లేర్పడినవి. శ్రోతమూల మైనవానికి పయిన
చెప్పిన స్టాంపు రిజస్టరీ యిబ్బందులు సర్వవిదితములు.
వాగ్రూపక మైన న్యాయవిచారణకు ప్రథమములో
శాసన మొక టేర్పడి, అది చాల దని పాశ్చాత్యపద్ధ
తుల ననుసరించి 1872-వ సం. నె 1 రు ఆక్టు అను సాక్ష్య
శాస్త్ర మొకటి పుట్టినది. ఇందులోఁ జెప్పిన పద్ధతు
లకు అనుకూలముగ నున్నప్పుడు మాత్రమే యొక
సాక్షి సాక్ష్య మంగీకరింపఁబడును. స్వాభావికన్యాయ
మునకు మాఱురూపు లేర్పడినవి.

ఒక వ్యవహారము స్వభావసిద్ధముగ నిజమైనది
న్యాయమైనది అయినను, ప్రతికక్షి అక్షరాలా వ్రాసి
చేవ్రాలు చేసినది అయినను, పయినఁ జెప్పిన స్టాంపు
రిజస్టరీలు లేక సాక్ష్యముగ అంగీకరింపఁబడదు. అనఁగా
జరగినది జరగనట్టుగా నేర్పడును. దానినే వేలుమాట
లతో వ్రాయఁబూనిన, నిజము కల్లగా పరిణమించును.
ఇందుకు ఎచ్చట నయిన మినహాయింపు లుండును గాని
యిది సాధారణపద్ధతి. మఱియు నిట్టులే సాక్షుల సాక్ష్య
మును ఏర్పఱుచును. అనఁగ పయినఁ జెప్పిన ఆక్టు పద్ధతు
లకు అనుగుణముగా నుండునప్పుడు మాత్రమే నిజమును
న్యాయమును అంగీకరింపఁబడును. లేనియెడల నవి యవి
శ్వసనీయములు. దీనికి దృష్టాంతముఁ జెప్పనిపక్షమున
విరుద్ధముగ కనఁబడును. కావునఁ జెప్పఁబడును. ఒక
సాక్షి రాముఁ డనువానికి భీముఁ డనువాఁడు తన
యెదుట రు 1000 లు ఇయ్యఁగాఁ జూచెను. అట్టి సాక్షి
న్యాయసభలో తాను జూచిన సంగతి, ఉభయులకును
కలిగిన వివాదములోఁ జెప్పఁబోఁగా, ప్రతికక్షి వకీలు లేచి
'ఈరూపాయీలకు తాకట్టు దస్తవేజు ఏమయిన వ్రాయఁ
బడెనా?' అని ప్రశ్నింప, సాక్షి 'పుట్టినది' అనఁగానె,
'సాక్ష్యశాస్త్రప్రకార మీ సాక్షి సాక్ష్యము పనికిరా'
దని చెప్పను. అప్పట్లో పుట్టిన దనెడు దస్తవేజు కోర్టుకు
తీసికొనిరానిచో ఈ సాక్షి సాక్ష్యము అవిశ్వసనీయ
మగును. పుట్టిన దస్తవేజు స్టాంపుమీఁద లేనందునను,
రిజస్టరు కానందునను కోర్టువారు దానిని చూడఁజాలరు.
కావున నీ సాక్షి యెంత సత్యవంతుఁ డయినను, ఈయన
చెప్పిన యంశమును నిజమును పనికిరాకపోవుచున్నవి.
ఇందువలన స్వభావసిద్ధ మయిన న్యాయమును నిజ
మును, రాజకీయమయిన కొన్నిక్రియలను బట్టి అన్యా
యముగాను, అవిశ్వసనీయముగాను పరిణమించుచు
న్నవి. ప్రప్రథమములో సూర్యచంద్రులను సాక్షుల
నుగాఁ బెట్టుకొని, సాక్షుల సాక్షివ్రాళ్లు సయితము
అక్కఱలేకుండ, క్రయములు విక్రయములు దానములు
తాకట్లు మొదలగు అనేకవ్యాపారములను జరపుకొనిన
భరతఖండవాసు లగు ప్రజలకు, పశ్చిమదేశవాసులకు
ఏ కారణముననో విశేషమైన బందోబస్తులతో పుట్టిన
శాసనములను నెలకొల్పి 'వానిప్రకారము జరపుకొనక

పోయిన, మీకు న్యాయ మన్యాయముగను నిజము అబద్ధముగను పరిణమించు' ననిన, ఏమి చెప్పవలయును? ఇట్లు జరగుట మాత్రమే గాక, కొంతకాలము క్రిందట ఇట్టి నాగరికత తక్కువగుటచేతనో, ఇప్పటి విద్యావాసన లేకపోవుటచేతనో, స్వభావముగ జరగినదానిని మరి యేదృష్టాంతమును లేకుండఁగనే యొప్పుకొనుచుండిన భరతఖండవాసి, యిప్పుడు పాశ్చాత్యసాక్షితోఁ బోల్పఁబడి నమ్మఁగూడని సాక్షిగా న్యాయసభలలోని తీరుమానములలో, పదేపదే వ్రాకువ్వఁబడుచున్నాఁడు. ఇట్టి మార్పు ఎట్లు లలవడెనో ఆలోచింపవలసినదై యున్నది. పూర్వము సూర్యచంద్రులు సాక్షులుగా నుండిన, తన నిశాని దస్తావేజును నిరాకరింపఁజాలనట్టియు నిరాకరింపఁడను దేశవిశ్వాసము గలట్టియు భారత పుత్రుఁడు, స్టాంపుమీఁద దస్తవేజు వ్రాసి, రాజకీయోద్యోగస్థునియెదుట రిజస్టరుచేయించి సైతము నిరాకరించునను అపవాదమునకు లోనగుట కేది కారణ మయినదో తెలియకున్నది. ఈ దేశమందలి స్థిరాస్తి నంతను దాని హక్కుదార్ల పేర రాజకీయస్థానములయందు వ్రాఁత మూలముగ నుండునట్లు రికార్డు లేర్పఱుచుటకు పుట్టినదనెడి రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటుయొక్క యుద్యమములు ఎంతవఱకు పరిపూర్తి కానున్నవో తెలియకున్నది. ప్రపంచస్వభావము సర్వమును మార్చునదిగా నున్నట్టులే, స్థిరాస్తి అనునది కూడ దినదినమును ఒకరి చేతులలోనుండి మరియొకరి చేతులలోనికి చిత్రవిచిత్రమైన మార్పులతో పోవునదిగా నున్నది. ఎట్లనఁగా, రాము. డనువాఁడు కొనిన య 100 ల ఆస్తిలో య 10 లు భీమునికి దాన మిచ్చును; య 10లు లక్ష్మణునికి తాకట్టు పెట్టును; సీతమ్మకు య 10 లు జీవితకాలానుభవమున కిచ్చును; య 10 లు శత్రుఘ్నునకు విక్రయించును; య 15 లు వెంకనికి వ్యవసాయమున కిచ్చును; మిగిలినవి తాను పెట్టుకొనును. ఈ పరాధీనముల రిజస్టరీ ప్రాబల్య మేమి? ఈ జరగిన పనుల సాక్ష్యమునకే రిజస్టరీ లని చెప్పుదమా, ఇంతకంటె వేలు లక్షలు గల చరాస్తి వ్యాపారములు రిజస్టరీలు లేకయె జరగుచున్నవి. వానిలో వేలు లక్షలు కంపెనీలలో వేసికొని ప్రజలు కోలుపోవుచునే యున్నారు. ఈ స్థిరాస్తిసంబంధ మగువానిలో ప్రజలకు స్టాంపు రిజస్టరీల ఫీజులు భరింప నలవికానివిగా నేర్పడుచున్నవి. భావికాలమునకు వీనిని రాజకార్యస్థానములయందు సాక్ష్యముగా నుంచుదు రనుకొందమా, రెండు సంవత్సరముల కిచ్చిన యిజారాదస్తావేజుయొక్కయు, రు 50లకు వ్రాసికొని సంవత్సరములోఁగా తీరుమాన మయ్యెడి తాకట్టుదస్తవేజు యొక్కయు శాశ్వతప్రయోజనము లేశమును కనఁబడదు.

ఎచట వివాదము పుట్టునో అచట దాని నెఱిఁగిన వారి సమక్షమున, అవ్యవహితకాలమందు సూక్ష్మమార్గమున పరిసమాప్తి నొందఁదగిన స్వభావము గల న్యాయమునకును; అట్టి వివాదమునే న్యాయస్థానము లను దూరస్థలములకుఁ గొనిపోయి, యచ్చట దాని పూర్వోత్తరముల నెఱుఁగక దానినే జీవనమున కాధారముగ పెట్టుకొనిన యొక ప్లీడరుచెవిని పడవేయఁగ, దాని నాయన తన కుచిత మని తోఁచిన రీతిని న్యాయకర్తకు నివేదించుటయు, ఆ న్యాయకర్త దానికి వేఱు మార్గమును కల్పించి ప్రతికక్షి వ్రాకుచ్చిన సంగతులను విని యెటు చేయను తోఁచక, మరల వివాదము నామూలాగ్రమెఱిఁగినట్లు చెప్పఁగోరిన యుభయుల సాక్షులను రప్పించి వారివలన వారికి తెలిసిన సంగతులను వినక, తన కాలు సేతులు బంధించిపెట్టిన శాసనపద్ధతుల ననుసరించి చెప్పు వాక్యములను మాత్రము విశ్వసించి, తన బుద్ధికి న్యాయ మని తోఁచినప్రకారము గాక, ఏర్పడిన పద్ధతుల ప్రకారము చేయు న్యాయమునకును; ఏమి తారతమ్య ముండునో యీ పద్ధతుల నెఱుఁగని యితరదేశస్థునికిఁ జెప్పిన తెలియఁగలదు. ఇట్టి వివాదమును గూర్చి మొదట డిస్ట్రిక్టు మునసబు కోర్టులో జరగిన అంశములు డిస్ట్రిక్టు కోర్టు అప్పీలులో మాఱుటయు, అచ్చటి మార్పులు ఆ రెండు కోర్టులవారును చెప్పని మూఁడవ మార్గమున హైకోర్టులో మాఱుటయు అనుదినమును అనుభవము గల పార్టీలకును తత్సంబంధము గలవారికిని తెలియుచునే యున్నది. ఈ మూటిలో ఏ కోర్టుది నిజమైన నిజమో

న్యాయమో ఇతరు లెవరును చెప్పఁజాలరు. తుదకుఁ జెప్పినది కొన్ని విషయములలో ప్రత్యక్షవిరుద్ధముగ నుండు ననుటకు సందేహ మేమియు నుండఁజాలదు గాని, అదియె న్యాయముగను నిజముగను వర్తించుచున్నది. ఇంతవఱకు ఈ న్యాయమును పొందుటకు వాదిప్రతివాదుల కయ్యెడు ధనవ్యయమును శరీరాయాసమును ఇతరుల నాశ్రయించుటయు పనులచెఱుపును ఎంతగా నుండునో వ్యాజ్యగానికే యెఱుక. వివాదములు నానాఁటికి దొరతనమువారు కోర్టులు వృద్ధిచేసిన కొలఁదిని పెరుఁగుచునే యున్నవి. కోర్టులు చాలకయే యున్నవి. జాడ్య మెఱుఁగక చికిత్సచేయు వైద్యునిపోలిక వివాదముల వృద్ధికి కారణమును తన్నివారణమునకు సాధనమును సరిగా విచారింపక న్యాయసభలను వృద్ధిచేసిన కొలఁదిని హెచ్చుచునే యుండును. పయినఁ జెప్పినలాగు తగవు పుట్టినచోటనె దాని నివారణమునకు పని జరగిన, జాడ్య మంకురింపఁగనే చికిత్సచేసిన ట్లగును. సులభములోనే నివారణ మగును. ఇందుకు ప్రథమములో దొరతనమువా రాలోచించిన రీతిని గ్రామపంచాయతీలు, తాలూకాపంచాయతీలు, డిస్ట్రిక్టుపంచాయతీలు ఏర్పఱుపఁబడుటకు తగు సదుపాయములను శాసించి వారి కాలుసేతులను కట్టు బంధముల నేర్పఱుపక న్యాయమే ప్రధానగమ్యముగ నొక్కి చెప్పిన నీ దేశపు ప్రజలు బాగుపడఁగలరు. ద్రవ్యవంతులు కాని యీ దేశపు ప్రజలు ఈ కోర్టుల కెంత ద్రవ్యమును వెచ్చించుచున్నారో కోర్టులకు వచ్చు స్టాంపుల రాఁబడియె తెలియఁజెప్పఁగలదు. ఒక మద్రాసు రాజధానిలో మాత్రము 1912-వ సంవత్సరమునకు సివిల్ క్రిమినల్ వ్యవహారములవలన సర్కారునకు వచ్చిన ఆదాయము రు 94,46,361 లుగను కర్చు రు 69,11,497 లుగను ప్రకటింపఁబడినది చూడ, కొంతవఱకు తెలిసికొనవచ్చును. ఇందులో రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటుతో సంబంధించిన ఆదాయవ్యయములు చేరియుండనట్లు కనఁబడుచున్నది. దీని కెన్నిరెట్లు కోర్టు వెలుపలి కర్చు లున్నవో అనుభవజ్ఞులకే విదితము. స్వభావసిద్ధమైన నిజముతో కూడిన న్యాయమును ఇతరమైన ప్రయోజనములకు వ్యయపఱుపఁగలిగిన కష్టార్జిత ద్రవ్యమును వినియోగపఱిచి సంపాదించుటకు ప్రయత్నించుటకంటె, మరియొక సులభమార్గమును కనిపెట్టుట ప్రజలకును వారి పరిపాలకులకును విధియును అవశ్యకమును అయి యున్నట్లు సులభముగ తెలిసికొనఁదగియున్నది. ఉభయకక్షులకును స్పష్టముగ తెలిసియున్న న్యాయమును మాఱువేషములతో న్యాయసభ లను రంగములలో ప్రవేశపెట్టి తాము వాని వదలినప్పటికిని జీవచ్ఛవము లగుచున్నా రనునది, వారికిని సభికులకును స్పష్టముగ తెలిసిన యంశమే యైయున్నది.

కాఁబట్టి ఇంతట నయిన దీనిని అనుభవమునకు తెచ్చుకొని తమ న్యాయమును తాము తమలోనే చక్కఁబెట్టుకొనుటకు తమ పూర్వీకు లేర్పఱిచిన పద్ధతులను గమనించి ఉభయుల క్షేమమును కోరిన తమ పెద్దలను కోరుకొని వారి తీరుమానమునకు లోఁబడుటకు జనులు ప్రయత్నపడవలయును. ఈర్ష్య, కక్ష మొదలగునవి ప్రధానములుగ పెట్టుకొనక న్యాయమెదృష్టియందుఁ గల పార్టీలకు ఇదియే అవలంబనీయము. దీనినే పంచాయతీపద్ధతి అని యిప్పుడు చెప్పుదురు. పయినఁ జెప్పినట్లు గాక వేఱే యుద్దేశములు గల వారికి కోర్టులను నిలిపి యుంచుకొనవచ్చును.

దొరతనమువారు వీలైనంతవఱకును ఇప్పటి పద్ధతుల ననుసరించి యైనను, ఎచ్చటి కలఁతలను అచ్చటనె నివర్తించుటకు రాజకీయమైన, వ్యయకరము గాని, ఏర్పాట్లను జేసి ప్రజలను రక్షించుటకు తోడ్పడవలయును. తమ పిల్లలు, మంచి దెఱుగక కూడని మార్గముల బోయిన, తల్లిదండ్రులే గదా వారిని మంచిమార్గమునకుం దేవలయును. వారు పోవు త్రోవలకే అనుకూల్యముల గల్పించుట యుభయత్ర కూడనిదే యై యున్నది.

# ఆంధ్రసారస్వతము

కొణిదెన బాలకృష్ణయ్యగారు

ఆంధ్రదేశవాసు లందఱు నాంధ్రు లనఁబడుదురు. వీరికి వాడుకభాష యాంధ్రము. ఇది ద్రవిడభాషాజనిత మని విద్వాంసుల యభిప్రాయము. దీనికి ఆంధ్రము, త్రిలింగము, తెలుఁగు, తెనుఁగు నను నామములు గలవు. ఆంధ్రదేశమునకుఁ గూడఁ బై నామములు గలిగియున్నవి. ఆంధ్రభాషావిషయమును గనుఁగొనఁ బ్రయత్నించెద నేని మొదట నాంధ్రదేశమునకు, ఆంధ్రదేశము, త్రిలింగదేశము మున్నగు నామము లెట్లు గలిగెనో విచారింపవలసియున్నది.

## ఆంధ్రదేశము

శ్లో. అనంతం ధారయ త్యేష । దేశ శ్శైలాకృతిం తతః
అనంతధ్ర స్సఏ వాంధ్రః । పరోక్షే ణేంద్రవ త్స్మృతః.

అర్థము — శైలరూపమున నుండు అనంతుని నీ దేశము ధరించియున్న కతమున, దీనికి "అనంతధ్ర" దేశ మను పేరు గలిగె. అదియే "ఆంధ్రదేశ" మని చెప్పంబడుచున్నది. ఇంద్రుఁడు తొలుత "ఇదంద్రుఁ" డను పేరు పొంది పరోక్షప్రియు లగు దేవతలవలన "ఇంద్రుఁ" డని పేర్కొనఁబడినట్లు ఈ దేశమును, మొదట "అనంతధ్ర"ముగ వాడఁబడి పిదప "ఆంధ్ర"దేశముగ మాఱినది.

## త్రిలింగదేశము

శ్లో. ఆంధ్రనాథో మహావిష్ణు । ర్నిశుంభదనుజాపహః
పురా స్వాయంభువమనోః । కాలే కలియుగే హరిః
కాకులే రాజవర్యస్య । సుచంద్రస్య తనూభవః
అభవ త్సర్వదేవైశ్చ । సేవితో లోకపూజితః.
శ్రీశైలభీమకాళేశ । మహేంద్రగిరిసంయుతమ్
ప్రాకారం సుమహ త్కృత్వా । త్రీణి ద్వారాణి చాకరోత్
త్రిలింగరూపే ణాఽవస । త్త్రిద్వారేషు గణై ర్వృతః
ఆంధ్రవిష్ణు స్సురయుతో । దనుజేన నిశుంభునా
యుద్ధ్వా త్రయోదశయుగాన్ । హత్వా తం రాక్షసోత్తమం
అవస త్తత్ర ఋషిభి । ర్యుతో గోదావరీతటే
తత్కాలప్రభృతిక్షేత్రం । త్రిలింగ మితి విశ్రుతమ్.

ఆంధ్రవిష్ణుఁ డను రాజు నిశుంభుఁ డను రక్కసుని జయించి, శ్రీశైల భీమేశ్వర కాళేశ్వరముల మధ్యభాగమున నుండు భూమిని పాలించుచుండెను. అది మొద లీ మూడు క్షేత్రములకును లోపల నున్న దేశము త్రిలింగదేశ మని చెప్పఁబడుచున్నది.

## తెలుఁగు దేశము

శ్లో. సరసా స్తిలవ ద్గావ । స్సంతి యత్ర సహస్రశః
వా దేశ స్తిలగు ర్నామ । తతోఽసౌ యజ్ఞియ స్మృతః.

తిలల చందమున రసవంతంబు లగు గోవులు వేనవేలుగా నే దేశంబునఁ జెన్నారునో యా దేశము "తిలగు"దేశ మని చెప్పఁబడును. అది యజ్ఞార్హ మగు ప్రదేశముగా నెన్నఁబడును. కావున మన దేశ మిట్టిదిగా నుండి "తిలగు" అను నామమునఁ జెన్నారి యదియే "తెలుఁగు" అను రూపమును ధరించియున్నది.

ఈ విషయములఁ జర్చింప నింకెన్నియో నిదర్శనము లున్నవి. గ్రంథవిస్తరభీతిమై నొక్కొక యుదాహరణమును మాత్రమే యిచటఁ జూపితిని.

పైన వివరించిన యంశములవలన నాంధ్రదేశమునకు భిన్నభిన్ననామములు గలుగుటకుఁ గారణములు విశదమయ్యెను. ఈ దేశనామముల ననుసరించియే మన తెలుఁగుభాషయును వేర్వేఱు నామములచేఁ బ్రాజ్ఞులవలనఁ బేర్కొనఁబడుచున్నది. ఇఁక నీ వాఙ్మయ మెప్పటినుండి యున్నదో కనుఁగొనుట యావశ్యకము.

## ఆంధ్రభాష

ఆంధ్రభాష గడుఁ బ్రాచీన మైనది. ఇది హిమాలయోత్తరభాగమునుండి యార్యులు దక్షిణదిశకు వచ్చుటకుఁ బూర్వమునను యుండినదిగాఁ గన్పట్టుచున్నది. మరియు,

"త్రిలింగభాషాయాః కో ధాతుః, కః ప్రత్యయః, కిం ప్రాతిపదిక" మితి భగవతా భాష్యకారేణ క్షేపః కృతః.

"ఏషా త్రిలింగభాషా సంస్కృతభాషాతుల్యేతి ప్రసిద్ధాయాశ్చ పూర్వమేవ ఏకశ్శబ్ద స్సమ్యక్ప్రయుక్తః స్వ లోకే కామధుగ్భవతి" పతంజలి.

ఈ వాక్యములవలన పతంజలిమహాఋషి కాలమునాఁటికి ఆంధ్రభాష యున్నట్టును, దీనికి లక్షణము లెవ్వియు లేనట్టును, అయినను, నిది సంస్కృతభాషాసదృశగా భావింపఁబడుచు, ప్రయోగమే శరణమైనదిగా నున్నట్టును దోఁచుచున్నయది. ఇది గాక,

"పూర్వమే వాంధ్రభాషోత్పత్తి ర్భగవద్భిః కణ్వ పుష్పదంత సోమచంద్ర రావణ నిర్ఝరాచార్యైః మహర్షిభిః భగవతా వాల్మీకి నాచ పోషితా"

అనుటవలన నాంధ్రభాష వాల్మీకిమహర్షికిం బూర్వము నుండియు నున్న దనుటకు సందియము గనంబడదు. ఇంతేగాక,

"ఆంధ్రసంస్కృతభాషాభ్యాం కవిత్వ మృషితాప్రదం" అని కాణ్వస్మృతియందును, "త్రిమూర్తీనాం సంస్కృతాంధ్రప్రాకృతాస్తు ప్రియంకరాః" అని అథర్వశిఖోపనిషత్తునందును చెప్పఁబడియున్నది. ఇందువలన నీ భాష యుపనిషత్తుల కాలమునాఁటికే యుండి, సంస్కృతప్రాకృతతుల్యముగఁ జూడఁబడుచుండె నని

Lady Atkinson's Garden party to Madras Indian Ladies.



లేడీ అట్కిన్సనుగారు మదరాసు హైందవ నారీమణులకు తోటవిందు జేయుట.

London Mission Girls' High school, Madras.



లండనుమిషను హైస్కూలు విద్యార్థినులు, ఉపాధ్యాయులు.

The Maharani of Cooch Behar.



కూచిబేహారు మహారాణిగారు.

Mrs. Sarojini Devi.



శ్రీమతి సరోజిని దేవిగారు.

Mrs. Mallanna.



శ్రీమతి మల్లన్నగారు.

Miss Krishna Bai M. A.



శ్రీమతి కుమారి కృష్ణాబాయిగారు.

Mrs. Dwarakabai Kamalakar.



శ్రీమతి ద్వారకాబాయి కమలాకరు.

Mrs. Harikishanlal.



శ్రీమతి హరికిషన్లాలగారు.

Miss. K. Kelavker.



శ్రీమతి కేలావ్కరుగారు.

Miss. Tarabai Kelavker.



శ్రీమతి తారాబాయి కేలావ్కరుగారు.

Miss. Tarabai



శ్రీమతి తారాబాయి, ఇండియను లేడీస్ హోంలో

Mrs. M. Kamalamba.



శ్రీమతి మణిపారం కమలాంబగారు.

Sreemati K. Kanakamma.



శ్రీమతి క. కనకమ్మగారు.

Mrs. K. S. Lakshmamma.



కొండపి సుబ్బలక్ష్మమ్మగారు.

తేలుచున్నది. అయినను నార్యు లీ దేశమునకు వచ్చుటకుఁ బూర్వమునసే యున్న ఆంధ్రభాషను ద్రవిడాదిరాజ్యస్థాపకు లగు నృపాలురు కొంతవఱకు సంస్కరించియుందురు. పిదప నార్యు లీ భాషను గౌరవించి తమ స్వభాష యగు గీర్వాణమునందలి పదములఁ గొన్నిఁటి దీనిలోఁ జేర్చి యాంధ్రభాషను దమ సంస్కారమువలన వెలయించి యుందురు.

ఇట్లు చిరకాలము క్రిందనే యాంధ్రభాష యుండి "ద్రావిడ పంచకాజ్జాతం యత్పదం, తద్దేశ్యం సంజ్ఞ స్యాత్" అనెడి లాక్షణికోక్తి చొప్పున ద్రావిడభాషాభవము లగు దేశ్యపదములచే నలరి, ఆర్యులు దక్షిణదేశమునకు వ్యాపించుటవలన, సంస్కృత భాషాసాహాయ్యముఁ బడసి, యా భాషాజన్యము లగు తత్సమ తద్భవ శబ్దములతోఁ గలసి, మహామహు లగు కణ్వ హేమచంద్రాదుల సంస్కారమును గాంచి, పదఁపడి నన్నెచోడ నన్నయ తిక్కనాది మహాకవివరుల జిహ్వాగ్రములఁ జిత్రవిధముల నటించి, దేశభాషలం దసమాన మై విలసిల్లుచున్నది.

ఈ భాష చిరకాలమునుండియు వర్ధిల్లుచున్నట్లు పెక్కు నిదర్శనములు గానవచ్చుచున్నను, కొన్ని శాసనములు దప్పఁ, బది శతాబ్దములకుఁ బూర్వమున రచింపఁబడిన గ్రంథము లెవ్వియు నిపుడు గనఁబడవు. దీనికిఁ గారణములు, విదేశీయుల దండయాత్రలలో దహింపఁబడిన గ్రామములతోఁబాటు మన ప్రాచీనగ్రంథభాండారములును దహింపఁబడుట, ప్రత్యంతరములు లేక యేకమాతృకలై నశించుట మున్నగునవియే. అయినను, నాంధ్రభాష వాడుకలో నున్న దేశమును, పూర్వ మాంధ్రులచే జయింపఁబడిన దేశములను శోధించినయెడల, నన్నెచోడుని కుమారసంభవమువలె నింకఁ గొన్ని సనాతనాంధ్రగ్రంథములు దృష్టిపథగతము లగు నేమో యను సందియము గలుగుచున్నయది. నన్నయభట్టారకునకుం దరువాత ననేకు లగు కవితల్లజులచే రచింపఁబడి నామావశిష్టములై మనకు లభింపకున్న గ్రంథములు కొన్ని యుండలేదా? ఇఁక మిగులఁ బ్రాచీన కావ్యములు గన్పడ వనుటలో వింత యే మున్నది?

ఈ విషయము నటు లుంచి యిఁకఁ బ్రస్తుతము మనకుఁ దెలిసియున్న కవులలో నెవ్వ రెవ్వ రే యే విధమున "ఆంధ్రసారస్వతము"ను బోషించినదియుఁ గనుఁగొనుట ముఖ్యము. కావున నక్కవుల విషయ మించుక నిటఁ దెలుపవలసియున్నది. ఈ విషయ మంతయు (1) భాషాంతరీకరణయుగము (2) కావ్యయుగము (3) నవీనయుగము నను భాగములుగా విభజించి, ఆయా యుగములలోని కవిముఖ్యు లాంధ్రభాష నెట్లెట్లు వృద్ధినొందించిరో తెలియఁజేయుచున్నాను.

## భాషాంతరీకరణయుగము

భాషాంతరీకరణయుగమున నాంధ్రకవు లందఱిలోను ముఖ్యులని తలంపఁబడుచున్నవారు నన్నయభట్టు, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ యను మువ్వురు కవులు. వీరు మువ్వురుం జేరి "కవిత్రయ" మని చెప్పఁబడుదురు. ఆంధ్రభాషకుం బరమప్రమాణముగ నెంచఁబడెడి "ఆంధ్రమహాభారతము" నీ కవిత్రయమే సంస్కృతమునుండి యాంధ్రీకరించిరి. భారతాంధ్రీకరణము నన్నయవలనఁ దొలుత నారంభింపఁబడినది. ఈ యనఘుఁడు దీనిని వేఁగీదేశమున కేలిక యగు రాజనరేంద్రుని ప్రోత్సాహముకతనఁ దలపెట్టెను. భారతమందలి మొదటి రెండు పర్వములును, అరణ్యపర్వమందుఁ గొంతయు నిక్కవి తెనిఁగించెను. సంస్కృతగ్రంథము లాంధ్రీకరించుటయం దీకవి, తనకుఁ బిమ్మటి కవులకు మార్గదర్శకుఁడు. ఈయన కవిత్వము సంస్కృతపదబాహుళ్యము గలిగియున్నను, సరళమై, అర్థగాంభీర్యము గలిగి, చదువఁ జవు లూరుచుండును.

నన్నయభట్టును ప్రథమాంధ్రకవి యని సాధారణముగా మనవారు వక్కాణించెదరు. కాని నన్నెచోడుని కుమారసంభవమున నున్న

క. మును మార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్.

అను పద్యమువలనను, నన్నయభట్టారకుని కాలముననే యొకరిద్దఱు తెలుఁగుకవు లుండుటవలనను, నిక్కవిని ప్రథమాంధ్రకవి యనుట ప్రమాద మని తోఁచుచున్నది. అయినను తెనుఁగున కియ్యనఘుఁడు పరమోపకారమును జేసియున్నాఁడు. నన్నయ విషయము చరిత్రగ్రంథములవలన జగద్విఖ్యాతమై యున్నది. కావున నిచ్చట నింక విస్తరింపఁ బని లేదు.

కవిత్రయమున రెండవవాఁ డగు "తిక్కనసోమయాజి" కవిత్వము పరమశ్లాఘ్యమై, పండితపామరజనాహ్లాదకరమై, యలరారుచున్నది. నిజమగు తెలుఁగుకవి యన నీతఁడే యనవలసియున్నది. ఇక్కవి నిర్వచనోత్తరరామాయణమును, భారతమునఁ బదేను పర్వములను విరచించెను. ఉత్తరరామాయణశైలి కొంచెము కఠినమైనది. భారతము ద్రాక్షాపాకమునఁ గడు హృద్యముగ నుండును. తిక్కన కవిత్వమున గీర్వాణపదము లరుదుగఁ గనఁబడును. ఇతని పలుకులు మృదువులై, మధురరసమును వెల్లిగొల్పుచుండును. ఇందుకు భారతమే నిదర్శనము. ఇక్కవికి నన్నయభట్టుపైఁ గడు గౌరవము గలదు.

మఱియుఁ దిక్కనకవి,

క. తెలుఁగు కవిత్వము చెప్పం
దలఁచిన కవి యర్థమునకుఁ దగియుండెడు మా
టలు గొని వడులుం బ్రాసం
బులు నిలుపక మొగిని బులిమిపుచ్చుట చదురే?

క. లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలంతి తునియలుగ
హాల సంధించిన విధంబు నమరఁగవలయున్.

అని నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పికొనిన విధముననే తన గ్రంథముల రచించియున్నాఁడు. కవిత్వమున నన్నయకన్న

నిక్కువిదే మిన్న యని కొందఱు విబుధు లభిప్రాయపడుచున్నారు. పూర్వపు ఔన్నత్యము నంతయు ననేకము లగు కారణాంతరముల వలనఁ గోల్పడి కృశీభూతయై యుండి, నన్నయభట్టారకుని కృపకుం బాత్రమై, మరలఁ గ్రమక్రమమునఁ దన తొంటివికాసము నందఁ జూచుచున్న యాంధ్రకవితాలత, కవిబ్రహ్మ యగు తిక్కన వాగమృతధారవలననే చెట్టుగట్టి, యాతని కాలమునుండియు గ్రంథరూపముల ధరించియున్న తీయని ఫలముల నాంధ్రులకుఁ బ్రసాదించుట కారంభించెను. వే యేల? ఇప్పటివఱకుఁ దెనుఁగుదేశమున జనించిన కవులలో తిక్కనవంటి కవి యొకఁడును గానరాఁ డనుటకు సందియము లేదు. తిక్కన స్వయముగఁ గృతులు రచించియు కృతుల నంకితముగఁ జేకొనియు కవిత్వమును గౌరవించి ఆంధ్రసారస్వతమును బోషించిన కవులలోఁ బ్రథముఁడుగా నెన్నఁదగియున్నాఁడు.

ఎఱ్ఱాప్రెగడ భారతారణ్యపర్వశేషమును, నృసింహపురాణమును, హరివంశమును, రామాయణమును రచించి ఆంధ్రభాషాయోష నలంకరించెను. ఈ కవిశిరోమణి నన్నయ తిక్కనలయం దతిశయమగు భక్తి గలవాఁడై, వారిరువురంబోలి తానును గవిత్వమును జెప్పియున్నాఁడు. ఇతఁ డతులితశివభక్తియుక్తుఁడై "శంభుదాసుఁ" డనియు, చక్కని గ్రంథముల నొనర్చి తన దేశభాష నుద్ధరించుటచే "ప్రబంధపరమేశ్వరుఁ" డనియు బిరుదుల నందెను. రామాయణము తప్ప నితని తక్కిన గ్రంథములు ముద్రితములై యున్నవి.

ఇటు లనవద్యకవితాసామ్రాజ్యపట్టభద్రు లగు నీ కవిత్రయము రచించిన గ్రంథము లన్నిఁటియందును భారతము మిగులఁ బొగడ్తఁ గని ఆంధ్రకవిత్వలక్షణము లన్నిఁటికిని లక్ష్యగ్రంథమై, సంస్కృతవాఙ్మయమునఁ బంచమవేదాఖ్య నొందియున్నను, ఆంధ్రభాషకుఁ బ్రథమవేదమై, భాషాభివృద్ధి నందఁగోరువారికిని ఐహికాముష్మికఫలముల నందఁగోరువారికిని బఠనయోగ్యమై, సమస్తధర్మములకును బుట్టినిల్లయి, ఆంధ్రదేశమున భారతమువలెఁ బవిత్రమును సలక్షణము నగు గ్రంథము వేఱొండు లే దను ప్రాశస్త్యమును గాంచియున్నది. మన పూర్వకవు లందఱును దీనియందు మహాదరము గలవారై, కవిత్రయవిరచిత మగు భారతములోఁ గనఁబడని ఆంధ్రశబ్దములఁ గవులు కావ్యములలో ప్రయోగించుట దూష్య మని నిబంధించిరి. వర్తమానకవులలోఁ గూడఁ జాలమంది యీ విధి ననుసరించియె తమ గ్రంథములయం దాంధ్రశబ్దప్రయోగముం జేయుచున్నారు. కవిత్రయకవిత్వమును భారతమును గుఱించి విమర్శించి వ్రాయవలె నన్న, నేండ్లును బూండ్లును బట్టును గాన, "ఆంధ్రసారస్వతము" కవిత్రయము వలననే యుజ్జీవము నొంది, "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యనియు, "తూర్పుదేశపు ఇటలీభాష" అనియు మహారాజులు, ఖండాంతరవాసులు మున్నగువారిచేఁ బొగడుఁ గాంచిన దని చెప్పి, వీరి విషయము నింతట ముగించుచున్నాను.

నన్నయభట్టు కాలముననే "పావులూరు మల్లన" యను కవి గణితశాస్త్రమును రచించెను.

నన్నయభట్టారకునకుఁ దరువాత నాంధ్రదేశమునఁ బెక్కురు కవు లుద్భవించిరి. వీ రందఱు నన్నయమార్గము ననుసరించి, తమ శక్తి కనువగునట్లు సంస్కృతమునుండి పురాణములను, లక్షణగ్రంథములను, ధర్మశాస్త్రములను ఆంధ్రీకరించియున్నారు. ఇందువలన రాజనరేంద్రునికిని కృష్ణరాయలకును నడుమ నున్న కాలము "ఆంధ్రుల సారస్వతము"నకు భాషాంతరీకరణయుగమై యున్నది. ఈ యుగమునఁ జెప్పఁదగిన కవు లెందఱో యున్నను, గ్రంథబాహుళ్యమునకు వెఱచి, వారిలో ముఖ్యులుగా నెన్నఁదగినవా రగు "కేతన, నాచన సోమన, శ్రీనాథుఁడు, పోతన" యను నలువురను మాత్ర మిందుఁ జేర్కొనుచున్నాను.

కేతన తన కాలమునాఁటి కాంధ్రభాషయందు లేని వ్యాకరణమును, ధర్మశాస్త్రమును రచించెను. ఇందు మొదటిదానికి "ఆంధ్రభాషాభూషణ" మనియు, రెండవదానికి "విజ్ఞానేశ్వరీయ" మనియు నామములు. ఇతఁడు "దశకుమారచరిత్రము" నాంధ్రీకరించి తిక్కన కంకితముచేసి, యతనివలన మెప్పు గొనియున్నాఁడు. వ్యాకరణ ధర్మశాస్త్రములను తెలుఁగునఁ జెప్పినవాఁ డగుటవలన నాంధ్రభాషకీతఁ డొక నూతనాలంకారముం గలిగించినాఁ డనుటకు సందియము లేదు. ఇతనికి "అభినవదండి"యను బిరుద మున్నది. ఇతఁ డాంధ్రభాషయందు నూతనగ్రంథములు నిర్మించినందునను, తిక్కనమనీషి మెచ్చుకొనునంతటి కవిత్వతత్త్వము గలవాఁ డగుటను ఆంధ్రవాఙ్మయచరిత్రమున నుత్తమస్థానము నలంకరింపఁదగియున్నాఁడు.

నాచన సోమనను సర్వజ్ఞుఁ డందురు. ఇతని కవిత్వము కవిత్రయకవిత్వముకన్న విశేషగుణమును గలిగియున్న దని వాఙ్మయవిమర్శకు లనుచున్నారు. ఏమైనను సరే, ఈతని కవిత్వము భారతకవుల కవిత్వములకుం దీసిపో దనుట నిజమగు విషయము. సోమకవి రచించిన గ్రంథములు రెండు. ఈ రెంటిలో "వసంతవిలాస" మనునది యిప్పటికి నామమాత్రావశేషముగ నున్నది. ఇంకొకటి యగు "ఉత్తరహరివంశము" నిరర్గళమగు కవితామహిమయును, మృదుమధుర మగు భావగాంభీర్యమును గలదియై నాతికఠినముగ నుండి, యెంత చదివినను దనివిసనక యుండును. ఆంధ్రసారస్వతమున కితఁడును బ్రధానపోషకుఁడై, కవిత్రయతుల్యుఁడుగఁ బరిగణింపఁదగియున్నాఁడు.

ఇఁక శ్రీనాథకవి విషయముఁ గనుఁగొందము. ఇతఁడు గడుం జమత్కారియు, చక్కని ప్రౌఢకవియు నై యున్నాఁడు. స్వకల్పితకవిత్వమునఁ గావ్యములు రచించుటలో, ఇతని తరువాతివా రగు ఆంధ్రకవితాపితామహుఁ డాదిగాఁ గల కవితల్లజులకు నిమ్మహాత్ముఁడే మార్గదర్శి యని కొంతమంది పెద్దల యభిప్రాయము. ఈయన కవనము గీర్వాణపదబంధురముగ భాసిల్లుచుఁ జదువరుల కుత్సాహజనకముగ నుండును. ఇక్కవికృతకృతిపుంజమున "శృంగారనైషధ" మనునది ఆంధ్రపంచకావ్యములలో నొకటిగా నెన్నఁబడినది. ఇదియును సంస్కృతశబ్దభూయిష్ఠమై యుండుటచేఁ గాఁబోలు దీనిని గూర్చి "బహుళదీర్ఘసమాసపదములు గూర్చి శ్రీనాథుండు గూలార్చె నైషధంబు"

అని కొందఱు వ్రాసియున్నారు. సకలవిద్యాసనాథుఁ డగు శ్రీనాథుని మార్గములు బహువిచిత్రములుగ నుండును. ఈయన

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు,
పలుకు నుడికారమున నాంధ్రభాష యందు;
రెవ్వ రేమన్న నండ్రు, నా కేమి కొదవ?
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష.

అని నిబంధించుకొని తన కావ్యము లన్నియుఁ బ్రౌఢముగనే రచించియున్నాఁడు. ఈతని గ్రంథములలో తెలుఁగుపదము లసదుగ నుండుటచే నితఁ డాంధ్రభాష కుపకారి కాఁడని యిటీవలఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కాని యది శ్రీనాథునిలోపముగాదు. గీర్వాణభాషాపాండిత్యము దమకు లేకున్నను, ఆంధ్రభాషాభివృద్ధి నందఁ గోరువారికి సోపానములవంటి వగు నాంధ్రకావ్యములనైనను గన్నులఁ జూడక, చూచినను వానిని బఠించి యందలి మార్గముల నన్నిఁటిని గ్రహింపనేరక, గ్రహించినను గ్రంథమును మూయఁగనే తమమనోనేత్రమును గూడ మూసికొని గ్రహించిన విషయముల వెంటనే మఱచుచు, ఆంధ్రనైషధకావ్యపఠనమునకుం దొరఁకొనెడి మనవారి లోపమేమో యని సందేహింపవలసియున్నది. పైగుణము లన్నియుఁ గలిగియున్నవారికి మాత్రమే నైషధకావ్యమహిమం దెలిసికొనుటయును, దానియందలి రసము రసనల కెక్కువారు తనియుటయును సంభవించును.

కావున శ్రీనాథుఁడు ఆంధ్రసారస్వతమున కుపకారియే గాని యపకారి యనుట సమంజసము గాదు. "నైషధమ్ విద్వదౌషధమ్" అనే ప్రశస్తి వహించిన నైషధము నాంధ్రులకుఁ బ్రసాదించినందున కాంధ్రు లెల్ల రీతని మఱవక స్మరింపవలసియున్నారు. ఇక్కవి గ్రంథము లాంధ్రదేశమున వెలసియే యున్నవి.

శ్రీనాథుని సమకాలికుఁడును బంధుఁడును భాగవతోత్తముఁడును నగువాఁడు బమ్మెర పోతనామాత్యుఁడు. ఇతనిని గుఱించి యనేక కథలు చెప్పెదరు. ఈయన భక్తిరసప్రధానం బగు భాగవతము నాంధ్రీకరించి రామునకు సమర్పించెను. పోతన సహజపాండిత్యుఁడు; పవిత్రమగు భాగవతపురాణము నాంధ్రమునకుం దెచ్చి యాంధ్రసారస్వతమున భక్తియోగమును బోధించు నుద్గ్రంథములు లేని కొఱంత వాపినందున కితఁడు తెలుఁగుబాసకు సొంపు సంపాదించిన కవిముఖ్యులలో నొకఁడుగా నెన్నఁదగియున్నాఁడు. సహజపాండిత్యుని కృతమగు భాగవతమందలి భాగములు కారణాంతరములవలన నుత్సన్నములైనందున నొక రిద్దఱు కవు లా భాగములఁ బూర్తిచేసియున్నారు. పోతన కవిత్వము పదలాలిత్యము గలిగి యమకాద్యలంకారయుక్తమై కడు మనోజ్ఞముగ నుండును. ఈయన కవిత్వమునఁ గొన్ని దోసము లున్న వనియు లేవనియు లక్షణగ్రంథకర్తలును పండితులును పెక్కు చర్చలు చేసియున్నారు.

భాషాంతరీకరణయుగమునందే, యుగ్రకవి యగు "వేములవాడ భీమకవి" యున్నాఁడు. ఇక్కవి యొకటి రెం డాంధ్రగ్రంథములు చేసియున్నాఁడు. ఇతఁడు శాపానుగ్రహసమర్థుఁ డని లక్షణగ్రంథములు చెప్పుచున్నవి. ఈక్రింది పద్యముఁ గాంచిన నీతని శక్తి చదువరులకు గోచరించును.

చ. హయము మది సీత, పోతవసుధాధిపుఁ డారయ రావణుండు, ని
శ్చయముగ నేను రాఘవుఁడ, సహ్యజ వారిధి, మారుఁ డంజనా
ప్రియతనయుండు, లచ్చన విభీషణుఁ, డా గుడిమెట్ట లంక, నా
జయమును బోతరక్కసుని చావును నేఁడవనాఁడు చూడుఁడీ.

ఇట్లాంధ్రసారస్వతము దినదినప్రవర్ధమానమై, రాజనరేంద్రుని కాలమునుండి కృష్ణరాయలు రాజగుపర్యంతముఁ గేవలభాషాంతరీకృతగ్రంథసముదయముచే నలంకరింపఁబడుచుండెను. కృష్ణరాయఁడు ప్రభు వగునప్పటికి ఆంధ్రజనులకుఁ దమ భాషయం దభిరుచి మెండై నూతనాంశముల గ్రహింప నుత్సుకులై యుండిరి. కవులకు నవీనాభిప్రాయములు సముద్రతరంగముల భంగి హృదయముల నుప్పొంగ నారంభించె. తిట్టుకొనుటయందును ప్రశ్నించుటయందును కవులు పరస్పరము పద్యములనే యుపయోగించుచుండిరి. చాటుపద్యములలోను కొన్ని కావ్యములలోను చమత్కృతిగా కర్ణాట తురుష్కభాషాపదములు చేర్పఁబడుచుండెను. కృతిభర్తలు,

ఉ. కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁ దీఱిన జాతిరత్నముల్,
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

అని విద్వత్కవులఁ గాంక్షించుచుండిరి. అప్పటి దేశకాలపాత్రంబుల ననుసరించి, భారతకవుల మార్గముల నవలంబముగఁ గొని, నూతనము లగు నభిప్రాయములను కల్పనలను జేర్చి, కవిపుంగవులు కావ్యములు రచించి, తమ నిరంకుశాధికారమును వెల్లడించుటకుఁ బ్రయత్నించిరి. కావునఁ గృష్ణరాయలకును ఆంగ్లేయప్రభుత్వమునకును మధ్యకాలము "ఆంధ్రసారస్వతము"నకుఁ గావ్యయుగ మని చెప్పవలసియున్నది.

## కా వ్య యు గ ము

కావ్యయుగమునకు "అల్లసాని పెద్దనామాత్యుఁడు" బ్రహ్మ యని చెప్పఁదగును. ఇతఁడు శిరీషకుసుమపేశలసుధామయోక్తులచే మనుచరిత్రమును విరచించి మూరురాయరగండఁ డగు కృష్ణరాయలచే "ఆంధ్రకవితాపితామహుఁడు" అను బిరుదమును బడసెను. కృష్ణరాయలు ఆంధ్రభాషాభివృద్ధిఁ జేయ సమకట్టి, తత్కార్యనిర్వాహకు లగు కవులఁ బోషించి, వారలచే ననేకకావ్యములఁ జేయించియు, తాను స్వయముగఁ గవియై కావ్యములు రచించియు "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని తా నన్న వాక్యమును నిలుపుకొనఁజాలునంతటి ప్రబలప్రయత్నములు సల్పి ఆంధ్రభాషకు మహోపకారమును జేసియున్నాఁడు.

కావ్యయుగ మారంభించిన దాది, యాంధ్రదేశమునఁ గవులు పుంఖానుపుంఖములుగా వ్యాపింప మొదలిడిరి. ఆంధ్రభాషయం ద

సంఖ్యగ్రంథము లీ కాలముననే రచింపఁబడినవి. ఆంధ్రపంచకావ్యముల లోని వగు మనువసుచరిత్రములును, ఆముక్తమాల్యదయు, రాఘవపాండవీయమును ఈ కాలమున జనించినవే; ఇవి గాక, శ్లేషకావ్యములు నిఘంటువులు శుద్ధాంధ్రగ్రంథములు మున్నగున వెన్నియో కావ్యయుగముననే రచింపఁబడెను. ఈ కాలపు కవుల చరిత్రము వివరించుట యన్న సాధ్యపుఁబని కాదు. కావున నీ యుగమునందలి విఖ్యాతచరిత్రు లగు కవిశ్రేష్ఠులలోఁ గొందఱను మాత్ర మిట దిక్ప్రదర్శనముగఁ జేర్కొనుచున్నాను.

కృష్ణరాయని ప్రోత్సాహమున మొదట నాంధ్రమున స్వకల్పిత కావ్యమును రచింపఁదలపెట్టినవాఁడు "అల్లసాని పెద్దనకవి". ఈయన కవిత్వము ద్రాక్షాపాకమునఁ దనరి, పదలాలిత్యము గలిగి, బహుమనోహరముగ నుండును. ఇక్కవికి శ్రీనాథుని కవిత్వమునం దాదర మెక్కుడగుటవలనఁ గాఁబోలు, నైషధకావ్యమందలి పద్యములఁ బోలి, మనుచరిత్రమునఁ గొన్ని పద్యములను వ్రాసియున్నాఁడు. స్వతంత్రకావ్యములు విరచించుట కీతఁడే మార్గదర్శి. ఆంధ్రభాష నభ్యసింపఁగోరువారి కీతని మనుచరిత్రమే తొలుతఁ జదువఁదగిన గ్రంథము. ఆంధ్రభాష కీతఁడు గొప్పమేలు చేసియున్నాఁడు.

సాహిత్యరసపోషణుం డగు రామరాజభూషణుఁడు ప్రతిపద్యరసాస్పదం బని పేరుగాంచిన వసుచరిత్రమును, హరిశ్చంద్రనలోపాఖ్యాన మను శ్లేషకావ్యమును రచించి, తన మాతృభాష యగు నాంధ్రమునకుఁ గడు వన్నియం గలిగించియున్నాఁడు. ఆంధ్రభాషావిద్యార్థులు మనుచరిత్రమును జదివిన వెనుక నీతని "వసుచరిత్రము"ను చదువవలసియుందురు.

కవిసార్వభౌముఁ డగు 'పింగళి సూరన' ఆంధ్రపంచకావ్యములలో నొకటగు "రాఘవపాండవీయ" మను శ్లేషకావ్యమును, "ప్రభావతీప్రద్యుమ్న" మను ప్రబంధరాజమును, స్వకపోలకల్పితం బగు చక్కని కథాభాగము గల "కళాపూర్ణోదయము"ను రచించి, భాషాయోషకమూల్యాభరణము లగు తన కృతులచే నలంకారమును గావించెను. ఇతని కవనము మృదుపదవిలసితంబై, అర్థగౌరవమున నావంతయుఁ గొఱంత లేక, భావగాంభీర్యము గలిగి, ముద్దులు మూటఁగట్టుచుండును. తెలుఁగుబాసను బోషించినవారిలో నీతఁడును ముఖ్యుఁడైయున్నాఁడు. ఇఁక "తెనాలిరామకృష్ణు" ని విషయ మించుక తెల్పెదను.

రామకృష్ణకవి చరిత్ర మద్భుతావహముగ నుండును. అయినను మనవారు చెప్పుచుండెడి నీతిబాహ్యములును హాస్యరసప్రధానంబులును నగు కథ లన్నియు రామకృష్ణుని కల్పితము లని గాని, యతని చరిత్రమును దెల్పున వని గాని నమ్ముటకు సందేహింపవలసియున్నది. ప్రఖ్యాతచరిత్రు లగు సత్పురుషులను కులముతక్కువవా రనియు దాసీపుత్రు లనియు నిందించుట చిత్రవిచిత్రము లగు కథల నల్లి ప్రొద్దుపోఁకకుఁ జెప్పికొనుచు తన్మూలమున పామరుల సంతసింపఁజేయుచు చెడుమాటలైనను పూర్వోక్తము లయ్యెనేని వానిని శిరసావహించి మెచ్చుట, యీ మాటల కన్నిఁటికి నంతరార్థ మింకొకటి యున్న దని పిట్టపీఁగుట, తప్పుమాట లయ్యెనేని పూర్వు లట్లేల వచించుదురని తలఁచుట, సమకాలికుఁ డగు నక్కవియొక్క నూతనకావ్యమును రచించెనేని దానిగుణమును గ్రహింపనేరక, ఈ పుల్లయ్య కవిత్వము నే నెఱుఁగనా? ఇట్టి కపిత్వ మెంతైనఁ జెప్పవచ్చు' నని సాధుకవులను పరిహసించి, తత్కృతకావ్యములఁ ద్రుణీకరించుట మున్నగు నాచారములు మనవారికిఁ జిరకాలమునుండి యున్నవి గాన, నైనఁ జెప్పిన చిత్రకథల కర్తృత్వమును మనవారు శ్రీనాథునకో రామలింగనికో యింకొక చమత్కారకవికో యారోపించుచుందురు. ఇట్టి వింతకథల నల్లి చెప్పెడి టకటొంకుగాండ్రును, అవి నమ్మెడి పామరులును నింకను దెలుఁగుదేశమున నున్నారనుట యెంతయు శోచనీయముగ నున్నది. కాని కొంతదనుక విమర్శింపఁగా, రామకృష్ణుఁడు నిర్భయుఁడును, నిష్కపటియు, నిస్సంశయుఁడును గాఁ జెప్పఁదగియున్నాఁడు. ఈ యంశము రామకృష్ణకవి చెప్పిన యీ క్రింది చాటుపద్యమువలన మన మెఱుఁగ వలనగును. ఇది రాజసభలో పండితులు పరస్పరము చేసికొనుచున్న విద్యావివాద సమయమునఁ జెప్పినదఁట.

చ. తెలియని వన్ని తప్పు లని దిట్టతనాన సభాంతరంబునం
బలుకఁగరాదు రోరి పలుమాఱు; పిశాచపు పాడెగట్ట! నీ
పలికిన నోట దుమ్ముపడ, భావ్య మెఱుంగవు; పెద్దలైనవా
రల నిరసింతురా? ప్రెగడరాణ్ణరసా! విరసా! తుసా! బుసా!

ఇతఁ డిట్లు తనకుఁ దోఁచిన యంశముల నిముసమైనను దాఁచ లేక, మొకమోట మావంతయుం గనక, తన భావముల వెల్లడించు నైజము గలవాఁ డగుటచేతనే, మనవారి కుశాగ్రబుద్ధిచేఁ గల్పింపఁబడిన కథానకముల కన్నిఁటికిని గర్త యనుటకు సందు గలిగినది.

రామకృష్ణకవి యెట్టిఁడైనను, అతని కవిత్వము కావ్యయుగమునందలి తక్కినవారి కవనముకన్న మిన్నయై, ప్రతిపద్యమునందును అమృత మొట్టిపడుచుండును. ఆంధ్రభాషాచరిత్రమునం జెప్పెడు కవులలో నీతఁడును ముఖ్యుఁడుగా నెంచఁదగియున్నాఁడు. ఇక్కవి రచించిన గ్రంథము "పాండురంగమాహాత్మ్యము".

కావ్యయుగమునఁ జెప్పఁదగు కవులు నంది తిమ్మన, రామభద్రుఁడు, కూచిమంచి తిమ్మన మొదలగువారు పెక్కు రున్నారు. గ్రంథబాహుళ్య మగు నను భీతిచే, నమ్మహామహుల చరిత్రములు గాని వారి విరచితము లగు గ్రంథములు గాని యిచ్చటఁ జేర్కొనుటకు వీలు లేదు. ఆంధ్రభాష యీ యుగమున నత్యున్నతవైభవము నంది, పరిపరివిధములఁ దన ప్రాగల్భ్య మంతయుఁ గనఁబఱుపఁజాలియున్నది. ఇఁకఁ గావ్యయుగానంతరమున నాంధ్రభాష యేవిధమునఁ జెంపొందుచున్నదియుఁ గనుఁగొందము.

## నవీనయుగము

ఇప్పు డాంగ్లేయులు మన దేశమునకు పాలకర్తలైనందున, ఆంధ్రులలోఁ జాలమంది యాంగ్లేయభాషాకోవిదులై తెలుఁగుబాస యందు లేనివియు హూణభాషయం దున్నవియు నగు కొన్ని

యంశముల గ్రహించి, తాము గ్రహించిన నూతనవిషయములచేఁ దమ మాతృభాష యగు నాంధ్రమునకుఁ గ్రొత్తక్రొత్త యలంకారములఁ జేకూర్చుటకు మొదలిడిరి. కావున నీ కాలమున నాంధ్రభాషయందు "నవీనయుగ" మొకటి యేర్పడినది. ఈ యుగచరిత్రమును గూడ నిట సంగ్రహముగా వివరించుచున్నాను.

ఈ యుగమునకుఁ గారణభూతుఁడు రావు బహద్దర్ బిరుదాంకితుఁ డగు శ్రీయుత కందుకూరి వీరేశలింగము పంతులుగారు. వీ రాంధ్రభాషలోఁ జేర్పఱచిన నూతనపద్ధతు లనేకములు గలవు. తెలుఁగునఁ జిత్రవచనకావ్యములు చరిత్రములు ప్రకృతిశాస్త్రములు ప్రహసనములు మున్నగునవి రచింపఁబడుట కీ యనఘుఁడే మార్గదర్శి యై యున్నాఁడు. మఱియు సంస్కృతాంగ్లేయభాషలయందలి రసవంతము లగు చక్కని నాటకము లెన్నియో తెలిఁగించియు పూర్వపు టాంధ్రకవులవలె నిర్దుష్టము లగు చక్కని కావ్యములు రచించియుఁ దమ జీవితమును పవిత్రవంతముగ నొనర్చుకొనిరి. ఆంధ్రభాష కిమ్మహామహుఁ డొనర్చిన యుపకృతి వర్ణనాతీతము. వే యేల? ఈ యుగమునందలి భాషాభిమానులలోను పండితులలోను స్వార్థత్యాగు లై మాతృభాష నుద్ధరించినవారిలోను వీరేశలింగము పంతులుగారే యగ్రస్థాన మధిష్ఠింపఁదగియున్నారు. వీ రవలంబించిన మార్గములవలన నాంధ్రసారస్వతమునకు "నవీనయుగ" మేర్పడిన దన్న సందియ మేమున్నది?

ఈ కాలమున నాంధ్రభాషాగ్రంథముల విమర్శించు పద్ధతి యొకటి జనించినది. దీనికిఁ గీర్తిశేషు లగు పూండ్ల రామకృష్ణయ్యగారు కారకులు. మఱియు శ్రీయుతు లగు వేదము వేంకటరాయశాస్త్రులవారు, వావిలికొలను సుబ్బారావుగారు, వడ్డాది సుబ్బారాయుఁడుగారు మున్నగు విద్వత్ప్రకాండు లెందఱో ఆంధ్రకావ్యముల విమర్శించియు నూతనగ్రంథముల రచించియు భాషం దగు విధమున సంస్కరించియు నాంధ్రవాణిని వివిధాలంకారశోభితఁగా నొనర్చుచున్నారు.

విజ్ఞానచంద్రికామండలియును ఆంధ్రభాషాభివర్ధని ఆంధ్రప్రచారిణీ సంఘములును ఆంధ్రదేశమున నెల్లెడలను బ్రకృతిశాస్త్రములు, దేశచరిత్రములు, నవలలు, సత్పురుషజీవితంబులు మున్నగు సద్గ్రంథములను వ్యాపింపఁజేయుచున్నవి. పూర్వకవికృతాంధ్రకావ్యములఁ బ్రకటించుటకును, వర్తమానకవుల సన్మానించి గ్రంథరచనకుం బ్రోత్సాహపఱచుటకును ఆంధ్రమున నొక నూతననిఘంటువును రచించుటకును మన రాజధానీనగర మగు మదరాసున "ఆంధ్రసాహిత్యపరిషత్తు" నెలకొల్పఁబడినది.

జనులకు నీతి మత దేశ రాజకీయ విద్యా విషయముల సకారణముగఁ జర్చించుచు, నుత్తమపద్ధతి భోధించుచున్న వార్తాపత్రికలు కొన్ని తెలుఁగుభాషయందు వెలయుచున్నవి. ఈ పత్రిక లన్నిఁటిలో నాంధ్రపత్రిక మాత్రము కొంత యభివృద్ధిం గాంచియున్నది. తక్కిన వన్నియు నల్పసంఖ్యాకు లగు చందాదారులు గలిగి తగినంత వ్యాప్తిఁ గననేరకున్నవి. అయినను మన భాషయందు పత్రికాభివృద్ధి మిగుల వెనుకఁబడియున్నది. పత్రికాధిపతు లెంత స్వార్థత్యాగులై యుత్సాహమునఁ బని చేయుచున్నను, వారికిఁ దగినంత ప్రోత్సాహమును సహాయమును నమరియుంటకై చాలమంది చందాదారులును, విద్యాధికులును అనుభవజ్ఞులును నగు లేఖకులును దప్పక యుండితీరవలెను. ఇట్టి యాధారములు లేని కారణముననే మన భాషయందు పత్రికాభివృద్ధి యడుగంటుచున్నది. ఈ విషయమున నాంధ్రులు తగినంత ప్రయత్నమును జేసి తమ భాషాపత్రికల సంరక్షించుకొనవలసియున్నారు.

ఇక్కాలమున నాంధ్రదేశమున నున్న కవులకు లెక్క లేదు. వీరిలో బాలురు స్త్రీలు మొదలగువారు సైత మనేకు లున్నారు. ఈ కవులలో గర్వసంస్తంభులును పరవంచనాసక్తులును స్వార్థపరాయణులును ఆంధ్రభాషావర్ణసంఖ్య నైనను జెప్పఁజాలని పాండిత్యాతిశయముచే మీసలు మెలఁద్రిప్పువారును గొందఱు లేకపోలేదు. వీరు గాక, సంస్కృతాంధ్రాంగ్లేయభాషాసాహితీమండితులై తమభాష నుద్ధరించి దేశమును ప్రజలను విజ్ఞానతేజోవిరాజమానులుగ నొనర్పం జాలెడి కవివతంసు లెందఱో మన దేశమున వెలసియున్నారు. ఇక్కవుల చరిత్రములును వీరు రచించిన గ్రంథములును నిప్పటి జనసామాన్యమునకుఁ దెలిసియే యున్నవి. ఆంధ్రభాష మొదటి రెండు యుగములకంటె నవీనయుగమున నధికం బగు నభ్యుదయముం గని మనోహరంబు లగు తన చిత్రగతులచే మనల సంతసమున నోలలాడించుచున్నది.

ఈ సందర్భమున నొక విషయము చదువరులకుం దెలుపవలసియున్నది. ఆంధ్రభాష యెంతకాలమునుండి వర్ధిల్లుచున్నదియు, ఎప్పుడెప్పు డెటు లభివృద్ధిఁ గాంచినదియు, నీపై విషయములఁ జదువుట వలన గోచరింపకపోదు. మిగులఁ బురాతనవిషయ మెట్లున్నను, నన్నయకాలమునుండియు నాంధ్రసారస్వతము శుక్లపక్షచంద్రునిమాడ్కి క్రమక్రమాభివృద్ధిం గాంచుచున్నయది. ఈ వ్యాసమునం దున్న మూఁడు యుగములలోను ఈ భాష కెట్టి యంతరాయములును గలిగినట్లు గాన్పింపదు. మఱియు నంతకంతకు భాష యౌన్నత్యమును గనుచున్నది. ఇట్టి దశయం దున్న యాంధ్రమున కిప్పుడు కొందఱు కుశాగ్రబుద్ధులవలనఁ గ్రొత్త సంస్కారము జరగవలసిన కాలము ప్రాప్తించినది. వారి సంస్కారపదతిఁ గొంచె మిటఁ దెల్పవలసియున్నది.

### ఇప్పటి యపూర్వసంస్కరణము

ఈ సంస్కార మెట్టిదో యని చదువరులు భ్రాంతిపడవలదు. ఇది బహుసులభ మగు విషయము. ఏ మన, ఇప్పటికిని విద్వత్కవుల చేతను, సంస్కృతాంధ్రాంగ్లేయాదిభాషలయందు సర్వంకషప్రతిభ గలిగియున్న పండితులచేతను దూష్య మని యెంచఁబడుచున్న గ్రామ్యమును గ్రాంథికాంధ్రభాషతోఁ జేర్చి యాంధ్రభాషాయోషను గురూపిణిఁగ నొనర్చుటయే. ఈ నవీనసంస్కర్తలకు ఛందోవ్యాకరణాలంకారము లన్నఁ దల కంటగించును. గ్రాంథికాంధ్రభాషను వెక్కిరించుచు నీ నడుమ నొక పండితశిరోమణి వ్రాసిన జాబును

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించినం గని, యీ ప్రాంత్యముల యందలి విద్వాంసు లెల్లరును వారి యపూర్వప్రతిభకుం దల్లడిల్లిరి. గ్రాంథికాంధ్రభాష ప్రాఁతపడి వృద్ధ యై చచ్చినదానిఁబోలె నున్న దనియు, మనము మాటలాడుకొను భాషవలెనే యేమార్పును జేయక గ్రంథముల రచించిన చదువనేర్చిన ప్రత్యాంధ్రునికిని పాండిత్యము కరతలామలక మగు ననియు, భాషాభివృద్ధి నొందించుట కిది యొక త్రోవ యనియు వీ రనుచున్నారు. గ్రాంథికగ్రామ్యభాషావాదు లిరుతెగలవారును, ఒకరి మతము నింకొకరు ద్వేషించుచున్నను, ఉభయులును నాంధ్రభాషాభివృద్ధిఁ గోరువారే యై యున్నారు. ఇప్పటికి రేఫ శకటరేఫ వివాద మొకటియు అర్ధబిందు ద్రుత విషయిక మగు చర్చ యొకటియు నాంధ్రపండితలోకమునం బెద్ద కల్లోలమును గలిగించి, యవి యిప్పుడిప్పుడే యొకప్రక్క నస్తమిల్లుచున్నవి. అయినను నీ చర్చలవలనఁ దెలుఁగుబాస కొంతదనుక మెఱుఁగెక్కెనే గాని వికాసహీనతను గాంచలేదు. ఈ నవీనసంస్కారమువలన నాంధ్రభాష కెట్టి గతి ప్రాప్తియగునో సంశయింపవలసియున్నది. ఆంధ్రసారస్వత మిటు లాంధ్రాక్షరముల పోలిక మాత్రము దెలిసి "భాషామర్మములు మాకుఁ దెలియుట దుస్సాధ్యము, మా కాంగ్లేయభాషాప్రావీణ్య మున్నది గాన, తెలుఁగును మా యిచ్చవచ్చినట్లు సంస్కరించెదము" అని పెనఁగులాటకుం డీకొనినవారిచేతులలోఁ బడి నలుఁగుచున్నయది. కావున ఆంధ్రవాల్మీకులును కవిరాజులును కింకవీంద్రఘటాపంచాననులును మహామహోపాధ్యాయులును వీరివాదము లల్పము లని యుపేక్షింపక, యాంధ్రభాష తొల్లిటి యౌన్నత్యమును దొరఁగకుండుటకును నైజరూపమును వీడి వికారవేషమును ధరింపకుండుటకును దగిన సిద్ధాంతములను సకారణముగ నొనర్చి, తమ భాషాభిమానమును వెల్లడించి యాంధ్రుల వందనముల నందుకొనవలసి యున్నారు.

మరియు నిక్కాలమున నాంధ్రకవిత్వముఁ జెప్పుచున్న కవులును కవిత్వమును జెప్పఁగోరి భాషాపరిచయమును గలుగఁజేసికొనుచున్న యాంధ్రయువజనులును పూర్వోక్తలక్షణంబుల మఱువక చక్కని మృదుమధురరసబంధురంబు లగు కావ్యములను బాలురు స్త్రీలు సైతము స్వయముగ గ్రహించునట్లుగ నొనర్చి పూర్వకవులపోలిక శాశ్వతమగు కీర్తి గడించుటకుఁ బ్రయత్నింపవలసియున్నారు.

కవితఁ జెప్పవారందఱును,

క. ముదమున సత్కవికావ్యము
చదరఁగ విలుకాని పట్టి నమ్మను బరమా
ర్థదమై తల యూపింపని
యది కావ్యమె? మలరి పట్టినదియుం గరమే?

అని చెప్పిన నన్నెచోడుని వాక్యములను జ్ఞప్తియం దుంచుకొని, తమ కావ్యము లేవిషయమునను గళంకయుతములు గాకుండఁ జేసెదరుగాత మని దైవమును బ్రార్థించుచున్నాను.

# రాజభక్తి

## పురాణము సూర్యనారాయణ తీర్థులుగారు

శ్రీ నింపారెడి జార్జిదేవునకు మేరీదేవికిన్ భారతో
ర్వీనారీమణికిం దదాత్మజులకున్ వేడ్కం గులన్ వారి మే
తానీతిం గనుచుండువారలకు నీ యానందసంవత్సర
మ్మానందమ్ము నొసంగుఁగాత మని నే నాశీర్వదింతున్ సదా.

క. శ్రీలం జాల నొసంగుచుఁ
ద్రైలోక్యమువారి నీతి దప్పక యేలం
జాలినధర్మువు నిలుచుతఁ
జాలకుఁ దగు జార్జిసార్వభౌమునిమదిలోన్.

ఉ. భూపరు లెందఱేనియుఁ బ్రభుత్వముఁ జేసిరి గాని హైందవో
ర్వీవలయమ్ము నీవలె వివేకము గల్గి సమస్త మా ప్రజల్
భావము పల్లవింపఁగఁ గృపామతివై నులి కెక్కురీతిగాఁ
బ్రోవఁగఁ బూను రాజును నెఱుంగ దెఱుంగదు జార్జిచంద్రమా!

ఉ. ఏయెడ నేదురాత్ముఁ డేక నేమి యొనర్చునొ యంచుఁ గించవే
హాయిగ నిద్ర యైనఁ దుద కందక కుందెదు హైందవోర్వికిన్
వీరాయవ నాఁటినుండియు సుమీ కనులారఁగ నిద్రవోవఁగా
నాయెను దివ్వెపెట్టి వెదలామెకె మ్రొక్కుడుమయ్య భక్తితోన్.

శా. కంజాతుంబలె సత్త్వమూర్తులు మహాగంభీరచిత్తుల్ ప్రజల్
రంజిల్లం దగ నేలువారు ప్రభుకార్యవ్యగ్రు లైనట్టి హా
ర్డింజిశ్రీప్రభు లుత్తముల్ ప్రతియు మంత్రిశ్రేష్ఠుఁడై యుండ నీ
కుం జార్జిక్షితిపాల! సద్యశము మాకున్ వృద్ధి సేకూఱదే?

తే. జయము విక్టోరియావంశజలధిమణికి
జయ మలగ్జాండ్రపట్టికి జయము గుణికి
జయము మేరీహృదయపంకజద్యుమణికి
జయము భారతకువలయశైత్యఘృణికి.

# హెచ్చరిక

రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

(కామధేనువు కథకు పీఠికగ వ్రాయబడినది)

ఒకటి రెండు సంవత్సరాలనుంచి న్యూసుపేపర్లలో నేమి మీటింగులలో నేమి తెలుంగుభాషనుగురించి చర్చలున్నూ వాదప్రతివాదములున్నూ జరుగుతూవున్నవి. నన్నయ్య, తిక్కన్న, యెఱ్ఱన్న, పెద్దన్న, యిటువంటి పెద్దలు వ్యాకరణనిబద్ధంగా వుపయోగించినభాషే తెలుంగుభాష, అదే నేర్చుకోతగినది, ఆభాషలోనే గ్రంథాలు వ్రాయదగును, తక్కినభాష గ్రామ్యభాష, అవాచ్యము, వర్జనీయము, అప్రశస్తము ఇట్లని కొందరు పండితులున్నూ— సామాన్యంగా అందరికీ బోధపడని గీర్వాణానికి భాషఅని పేరుపెట్టడం కేవలం హాస్యాస్పదం, కట్టుబాట్లతో చచ్చిపడివున్నది భాష కానేరదు, ప్రాణముతో పెరుగుతూవున్నదే భాష, అదే గౌరవార్హము, అట్టిదే దేశాభివృద్ధికి ఆధారము—ఇట్లని కొందరు పండితులున్నూ గుద్దులాడుకోవడమేగాక తగవుతీర్చుకోవడానికి కచేరీలకు యెక్కడందాకా కూడా వచ్చింది! అజ్ఞానం హరించి అవివేకము శమించుగాక!

ఉన్నమాటంటే ఉడుకుబోతుతనం వస్తుందంటారు.] అయినా ఒకప్పుడు అనక తప్పదు, ఇంతకూ ఆకాశవాణికి భయమేమిటి? ఆమె అన్నిభాషలకూ తల్లి. ఆంధ్రభారతి ఆంధ్రభారతి అని యిక్కడ అందరూ నన్ను మాటలతో పూజిస్తూవున్నారేకాని క్రియలో రొష్టుపెట్టుతూవున్నారు—అని ఆమె మొత్తుకుంటూవున్నది. అదుగో వినబడుతూవున్నది ఆమె మొఱ వినండి!

ఆకాశవాణిమొఱ

ఓ నాబిడ్డలారా! నాకు అన్నిభాషలూ ఒకటే అయినప్పటికీ సంగీతసాహిత్యవిద్యలమీద నాకువుండే ప్రీతిచేత ఆంధ్రభాషను యెక్కువ మక్కువతో ప్రేమించి ఆంధ్రభారతి అనే పేరుతో యిక్కడ నెక్కొని చిరకాలంనుంచి ఘనంగా ఆదరింపబడుతూ వుంటిని. వయసు గడచినకొద్దీ నాకు వన్నె వచ్చి యౌవనం హెచ్చిందిగాని నారూపలావణ్యాలు యెంతమాత్రం మారలేదు. కాని, యిటీవల పడమటి బిడ్డలతోటి సాంగత్యంవల్ల నా ముద్దుబిడ్డల బుద్ధి చెడి నాయెడల అనాదరణ యేర్పడి నాకళకాంతులకు కూడా మబ్బుపట్టడం ఆరంభించింది.

అయ్యయ్యో! ఏదిక్కునవిన్నా నాబిడ్డల పోట్లాటలే వినబడుతూవున్నవి. నాకు యేమి దుర్గతి పట్టనున్నదో ఏమిదుస్థితి రానున్నదో గాని నాపెద్దబిడ్డలే వుపకారమని పేరుపెట్టి నాకు అపకారం చేస్తూవున్నారు.

తండ్రులారా! ఎందుకు ఈలాగు తన్నులాడుకుంటారు? తూర్పు పడమరల భేదం తెలియకుండా యెందుకు గుద్దులాడుకుంటూవున్నారు? అజంతభాష, హలంతభాష, పురుషభాష, స్త్రీభాష, ఈభేదంతోవున్న భాషాతత్వం పడమటిబిడ్డలలో ఎంతటిపండితులకైనా తెలియకపోవడం ఆశ్చర్యంకాదు. వారి పుట్టుకలోనే దానికారణంవున్నది. ఆ రహస్యం తెలియకుండా వారు బోధించే భాషాతత్వం అన్నిభాషలకూ సమానంగా చెల్లదని మీరుతెలుసుకోలేక వారిపోలికలను మీయందు ఆరోపించుకుని ఎందుకు బొందలో పడుతూ నన్నుపడద్రోస్తూవున్నారు? అయ్యయ్యో! ఈ తత్వరహస్యం సంపూర్ణంగా తెలిస్తే మీకు భేదంగాని పోట్లాటగాని వుండదుగదా! నేను యెంతనిమీతో మొఱపెట్టుకుందును. నా మొఱ మీకు వినబడడంయేలాగు? వినపడకపోతే విని తెలిపే మొనగాడెవడున్నాడు. తెలిపించి నా చింతతీర్చే నాథుడెవడున్నాడు? అయ్యో! అంతా నాకు అయోమయంగా వున్నది!

అజంతభాష, హలంతభాష, పురుషభాష, స్త్రీభాష, వీటికిగలభేదము—భాషయొక్క ప్రాణము, శరీరము, బీజము, క్షేత్రము, స్వరప్రస్తారము, మాత్రాప్రస్తారము, గణప్రస్తారము, నానాజాతి వృత్తప్రస్తారము, వీటియొక్క తత్వరహస్యములు—భాషయొక్క మాధుర్యము, గానయోగ్యత, యివి దేని ననుసరించి వుండేదీ, యెట్టిభాషలు సంగీతసాహిత్యవిద్యల సంపూర్ణప్రస్తారమునకు యోగ్యములో, స్త్రీపురుషాక్షరసంజ్ఞలయొక్క సంయోగము, ఐక్యము, ప్రత్యేకరూపము—ఎట్టిభాషలో పదములు విడివిడిగా వుండునో, యెట్టిభాషలో జడగా అల్లుకొనిపోవునో, యేమికారణమో—యెట్టిభాషలోముందుకే సూటిగా అన్వయమో యెట్టిభాషలో ముందుకు వెనుకకు దుమికి దుమికి అన్వయమో, యేస్వాభావికధర్మంవల్ల యిది యేర్పడుతుందో—ఈమొదలైన తత్వరహస్యములు తెలిస్తే అన్నిభాషలకూ ఒకటేవర్ణమాల యేర్పాటు చేస్తామని, అన్నిదేశాలకూ ఒకటేభాష యేర్పాటు చేస్తామని, అన్నిభాషలను వుచ్చారణప్రకారమే వ్రాయవలసినదని, యిట్టి పిచ్చివాదములు వుండవుగదా! నాబిడ్డలు భాషాభివృద్ధి పేరుచెప్పి అవలంబిస్తూవున్న వృథాప్రయత్నములున్నూ వృథావ్రయమున్నూ తప్పిపోవునుగదా! ఏమిచేతును? ఎంతని మొఱపెట్టుకొందును? నాచింత తీరేమార్గము యేమివున్నది? అయ్యో యేమిగతి!

ప్రతిభాషయందున్నూ వ్యవహరించడములో—అనగా వాడుకలో—కొన్నిమార్పులు కలగడం స్వాభావికమై వున్నది. ఈ మార్పులు బిడ్డలవల్ల, పామరులవల్ల, సామాన్యజనులవల్ల, ఒకవిధంగాను —

పెద్దలవల్ల, బుద్ధిమంతులవల్ల, పండితులవల్ల, మరివొకవిధంగాను — కలిగింపబడడం కూడా స్వాభావికమే.

ఇంతేకాక మొట్టమొదట ఒకరితో వొకరు నోటిమూలంగా మాట్లాడుకోవడానికి యేర్పరుచుకోబడిన పదములు వ్రాతమూలంగా చదువుకుని గ్రహించుకోవడానికి వుపయోగింపబడడంవల్ల మరికొన్ని మార్పులుకూడా భాషలో తటస్థిస్తూవున్నవి. ఈచెప్పబడ్డ అన్ని మార్పులవిషయంలో అజంతభాషలకున్నూ హలంతభాషలకున్నూ పురుషభాషలకున్నూ స్త్రీభాషలకున్నూ వాటి స్వాభావిక ధర్మమును బట్టి చాలాభేదం యేర్పడుతూవున్నది. దీనివివరం గ్రహించుకోకపోవడంవల్లనే పోట్లాటలు, గుద్దులాటలు, గుడ్డివాదములు, చెడ్డభేదములు సిద్ధిస్తూవున్నవి. ఇది టూకీగా చెప్పదగినవిషయము కాదు. అందరికీ సులభంగా బోధపడేవిషయమున్నూ కాదు.

ఏభాషలోనైనా సరే పుట్టుకలో యేర్పడ్డట్టుగానే పదాలు స్పష్టంగా సంపూర్ణంగా వుచ్చరిస్తూ మాట్లాడితే ఆలస్యం అయి వ్యవహారం కడతేరదు కాబట్టి వాడుకలో అనేకపదాలయందు స్వరలోపమున్నూ అక్షరలోపమున్నూ కలుగుతుంది. వ్రాసేటప్పుడు నిదానంగా వ్రాయవచ్చును గనుక యీలోపం అవసరంలేదు. మరిన్నీ సామాన్యజనులుగాక బుద్ధిమంతులున్నూ పండితులున్నూ వ్రాసేటప్పుడు, కొత్తకొత్త శబ్దజాలంకల్పించి సమస్తమైనవారు నిదానంగా చదివి నెమ్మదిగా నేర్చుకుని జ్ఞప్తియం దుంచుకోవలసినవిషయములున్నూ గంభీరమైనవిషయములున్నూ తెలుపుతూ గద్యములు పద్యములు, పదములు మొదలయిన కవితలతో గ్రంథాలు రచియిస్తారు. ఈప్రకారంగా మాటభాష, వ్రాతభాష, గ్రాంథికభాష అని మూడు తెరగులు ఏర్పడుతున్నవి. సామాన్యంగా లోకంలో సంభాషణ, వుత్తరప్రత్యుత్తరాలు, వ్యవహారవిషయములు, మొదలయినవాటి సంబంధంలో వుపయోగింపబడుతూవున్నందున మాటభాషను వ్రాతభాషను కూడా వాడుకభాష అని చెప్పవచ్చును. గ్రాంథికభాషలో సంభాషణగాని, వుత్తరప్రత్యుత్తరములుగాని వ్యవహారములుగాని జరుపరు. అయితే యీ సందర్భంలో అజంతభాషలకున్నూ హలంతభాషలకున్నూ వాటిస్వాభావికధర్మమునుబట్టి కొండంతభేదం యేర్పడుతూవున్నది. హలంతభాషలు, స్త్రీభాషలు, వీటివిషయంలో వొకటే కాలపు వాడుక భాషకు గ్రాంథికభాషకు వుచ్చారణలో యెంతభేదంవున్నా వ్రాతలో వుపయోగించే అక్షరసంజ్ఞలలో భేదం వుండదు. ఇది స్వాభావికధర్మమునుబట్టే తటస్థించును. ఈకారణం వల్ల హలంతభాషలో గ్రంథాలు చెవులతో విన్నప్పుడు అర్థం అవుతూవున్నప్పటికీ కంటితో గ్రహించి చదవడం కష్టంగా యేర్పడుతుంది. కాబట్టి యావజ్జీవము, ఉచ్చారణ నేర్చుకుంటూ మార్చుకుంటూనే వుండవలెను. పైగా కాలానుగుణ్యంగా భాషాస్వరూపం కూడా మార్పు చెందుతూ వుంటుంది గనుక సామాన్యసంభాషణలోను, సాధారణపు వ్రాతలలోను, గ్రంథాలలోను, వర్ణభేదం, వైఖరీభేదమే గాని భాష వొకటిగానే కనిపిస్తూ, నానాటికి కలిగేమార్పులు కిందికీ పైకీ కూడా వ్యాపిస్తూ వుండడంవల్ల భాష జీవించివున్నట్టుగా యేర్పడుతుంది. ఇంక అజంతభాషలు, పురుషభాషలు, వీటివిషయంలో యెట్లావుంటుందంటే - స్వరలోపాది కారణములవల్ల కలిగే మార్పులు చాలా అధికమగుటచేత సామాన్యంగా ఉపయోగింపబడే మాటభాషకున్నూ సామాన్యంగా వుత్తరప్రత్యుత్తరములలోను వ్యవహారంలోను వుపయోగింపబడే వ్రాతభాషకున్నూ గద్యపద్యాదికవిత్వాలయందు వుపయోగింపబడే గ్రాంథిక భాషకున్నూ చాలావ్యత్యాసం యేర్పడడమే గాక ఈ జాతిభాషలు వాటి స్వాభావికధర్మమునుబట్టి వ్రాసిన ప్రకారమే వుచ్చరించి చదువబడవలసిన కారణంవల్లను, గురులఘుప్రస్తారములతో పద్యాదికవిత్వములు గణబద్ధమై లేశమైనా మార్పుచెందడానికి వీలులేకుండా బిగిసివుండేకారణంవల్లను, మాటభాష వ్రాతభాష గ్రాంథికభాష అని మూడు స్వరూపములుగా యేర్పడుతూవున్నవి. ఈ మూడింటియొక్క తారతమ్యమున్నూ విలువయున్నూ తెలుసుకోలేకనే హలంతభాషలయందువలె వొకటేజీవభాష యేర్పరచవలెనని ప్రయత్నించడం, గ్రాంథికభాషను దూషించడం, వ్రాతభాషను ఆదరింపకపోవడం, మాటభాషను గ్రామ్యమని నిందించడం - ఇదంతా కేవలం అజ్ఞానము సూచిస్తున్నది. అయ్యో! నాపెద్దబిడ్డలే నాకున్నూ నాచిన్నబిడ్డలకున్నూ అపకారులైనారా! ఏమి విపరీతకాలంవచ్చింది!

గ్రాంథికభాషను పూజించే నా దొడ్డబిడ్డలారా! గ్రామ్యభాషను నిరసిస్తారే! అది నా చిన్నిబిడ్డలు, పేదబిడ్డలు మాట్లాడే భాష కాదా! నా చిన్నిబిడ్డల వచ్చీ రాని పలుకులు నాకు ముద్దుగా వుండవా? ఎందుకు నిందిస్తారు. మీ చెవులకుకూడా ఆనందకరంగా వుండబట్టేగదా గ్రామ్యభాషలో ప్రసంగాలున్నూ పదాలున్నూ మీగ్రంథాలలో అక్కడక్కడ వుపయోగించి హాస్యరసం అనుభవిస్తారు. మీకు గ్రామ్యభాషవల్ల హాస్యరసం వుదయించి ఆనందం కలిగినట్టే అల్పజాతులబిడ్డలకు వాళ్లసుద్దులలో మీభాషవుపయోగించిన సందర్భమందు హాస్యరసం వుదయిస్తుంది. వాళ్ల సుద్దులున్నూ పదాలున్నూ పాటలున్నూ వాళ్లగ్రంథాలు. మీకవిత్వాలు మీగ్రంథాలు. వాళ్లగ్రంథాలు వినగూడదు, వ్రాయగూడదు, చదువగూడదు, అవి గ్రంథాలు కావు, మా గ్రంథాలే గ్రంథాలు అని యెందుకు పిచ్చివాదాలు చేస్తారు?

తెలుంగుభాష మాతృభాషగాగల జనులు 2,30,00,000 రెండుకోట్ల ముప్పై లక్షలమంది వున్నారుగదా! వీరిలో మాటరాని వాళ్లక్రింద 30 లక్షలను తీసివేయండి. తెలుంగుమాట్లాడే తక్కిన రెండుకోట్లమందిలో యెందరు గ్రాంథికభాషలో వుత్తరప్రత్యుత్తరాలు, వ్యవహారాలు, జరుపుకుంటారు? ఎందరు భారతభాగవతాది గ్రంథాలు చదువుతారు? ఇది కొంచెం తలచుకోనండి. అప్పుడు అంతా మీకు స్పష్టంగా బోధపడుతుంది.

తెలుంగుభాష మాట్లాడే రెండుకోట్లమంది జనులలో గ్రాంథికభాష మాట్లాడేవారు వొక్కరుకూడాలేరని చెప్పవచ్చును. ఎవరైనా

The Late Rajah of Pithapuram



శ్రీమన్మహారాజ శ్రీ రావు మహీపతి గంగాధర రామారావు బహద్దరువారు

The Rajah of Pudukotah



శ్రీ పుదుక్కోట రాజాగారు

The Kumara Rajah of Venkatagiri



శ్రీ వేంకటగిరి కుమారరాజాగారు

The Hon. Mr. P. Ramarayaningar with his brothers



గౌ॥ పానుగంటి రామారాయణింగారును, వారిసోదరులును

The Maharajah of Bobbili & his Family



శ్రీ బొబ్బిలి సంస్థానాధీశులు

The Minor Zamindars of Karvetinagar





కార్వేటినగరపు మైనరు జమీందారులు

Mr. Lodd Govindadas



లాడ్ గోవిందదాసుగారు

Mr. Hem Chandra Sircar



హేమచంద్ర సర్కారుగారు



The Zamindar of South Vallur

దక్షిణవల్లూరు జమీందారుగారు



The Zamindar of Mukteswarapuram

ముక్తేశ్వరపురం జమీందారుగారు

V. Jagapatiraju garu



శ్రీ వత్సవాయి జగపతిరాజు గారు



The Dewan of Banaganapalli

బనగానపల్లి దివానుగారు

Blocks by the Madras Phototype Co.

వుంటే వారు మహా మహా మహా పండితులే! పెండ్లాములతోను, బిడ్డలతోను, చాకలివాళ్లతోను, మంగలివాళ్లతోను, భారతాదిగ్రంథముల భాష మాట్లాడే మహానుభావుడు వుంటే ఆయనగారి గొప్ప మెచ్చుకోవచ్చును. తర్వాతిమాట – ఈచెప్పిన రెండుకోట్లమందిలో భారతాది గ్రంథముల భాషలో వుత్తరప్రత్యుత్తరములున్నూ వ్యవహారములున్నూ జరుపుకునే మహానుభావు లెందరున్నారు? ఒకవేళ వున్నప్పటికీ వ్యవహారములు కొనసాగునా? నా దొడ్డబిడ్డలలో కొందరు బుద్ధిమంతులు సంధులు విడగొట్టి, జడలు చిక్కుదీసి, సులభశైలిలో గ్రాంథికభాష వుపయోగిస్తూ మాట్లాడగలరు, వ్రాయగలరు. నిజమే, అలాగు చేయగలవారు వందలుగాని వేలులేరు. వారి వ్రాతలుకూడా లక్షమందికంటె యెక్కువమందికి బోధపడజాలవు. తక్కిన 199లక్షల మంది గతి ఏమికావలసినది? గ్రాంథికభాష చదివితేను వింటేను అర్థం చేసుకోగలవారు లక్షమందికంటె యెక్కువ లేరని మీకు స్పష్టంగా బోధపడవలెనంటే ఆయా జిల్లాలు తాలూకాలు గ్రామాలు వీథులు యిండ్లు గుడిసెలు— యీప్రకారంగా ఆంధ్రదేశంలో వొక మూల నుండి వొకమూలకు మీ మనోదృష్టి విప్పిచూడండి! మనస్సుతో చూడకుండా వూరికే నోటితో మాట్లాడకండి! మనోదృష్టి వ్యాపింపజేసిచూస్తే ఆంధ్రదేశంలో యెక్కడగాని మాట్లాడుకొనడానికిన్నీ సామాన్యపువ్రాతలకున్నూ వ్యవహారాలకున్నూ సంధులు విడగొట్టిన సులభశైలిగల గ్రాంథికభాషకూడా వుపయోగించబడడం లేదనీ వుపయోగించడానికి సాధ్యం కాదనీ స్పష్టంగా బోధపడగలదు. సులభశైలి అయినా కఠినశైలి అయినా గ్రాంథికభాష దొడ్డగ్రంథాలకే ప్రయోజనము. అనగా కట్టుబాట్లకు లోబడి మార్పులు చెందకుండావుండే ప్రౌఢమయిన శబ్దజాలము మూలమున భక్తి, ముక్తి, నీతి, విజ్ఞానము, ఆనందము మొదలయిన సార్వకాలికవిషయములను తెలిపే గద్యపద్యకావ్యములను కల్పించడమే గ్రాంథికభాషయొక్క వుపయోగము. ఎంతసులభశైలిని వ్రాసినా, ఒకటి రెండు లక్షల మందికి మాత్రమే యీగ్రంథముల వుపయోగము. తక్కిన 199 లక్షల మందిని యేగ్రంథాలు చదువుకొమ్మన్నారు? గ్రాంథికభాష బంగారమే. ఎన్నోవన్నెలు ఉండవచ్చునుగాక! బంగారు బంగారే. గ్రాంథికభాషే భాష, తక్కినదిభాష కాదు, భారతాదిగ్రంథములు తప్ప తక్కినవి గ్రంథములు కావంటే, తెలుంగుభాష తెలుంగు గ్రంథాలు లేనట్టే భావించుకోవలసి వస్తుంది. భారతాదిగ్రంథములు అర్థంకాని నా 199 లక్షలమంది బిడ్డలు గ్రంథాలులేనివారు, చదువురానివారు అవుతారు సరేగదా! వారు తెలుంగు మాట్లాడగలవారైనప్పటికీ మూగవాళ్లే మృగములే అని చెప్పవలెను. ఈవాదం మీకు బాగా వున్నదా?

భారతాదిగ్రంథములు చాల దొడ్డగ్రంథములు, ప్రశస్తమైన గ్రంథములు, అని అందరూ వొప్పుకుంటారు. చక్కగా చెక్కి నునుపుచేసి వన్నెపెట్టిన మానుతోను శిలతోను నిర్మించిన శాశ్వతసౌధములు రమ్యముగా వుండడం ఆశ్చర్యమా? నవరత్నాలుచెక్కిన బంగారు ఆభరణాలను మెచ్చుకోనివారు వుంటారా? పట్టుబట్టలు జరీబట్టలు, యివి అందరికీ కన్నులపండువుగానే వుండును. అయితే సమస్తమైనవారు సౌధములే కట్టవలెను—మిద్దెలు, మేడలు నిర్మించుకొనే కాపురముండవలెను, సామాన్యపు యిండ్లు కట్టగూడదు – పూరియిండ్లు, గుడిసెలు బొత్తిగానే వుండగూడదు— అందరూ రత్నాభరణములు, బంగారు ఆభరణములు, వీటినే ధరించవలెను— అన్నివస్తువులు, అన్నిపనిముట్లు బంగారుతోనే చేయవలెను— పెద్దలూ పేదలూ అందరూ పట్టుబట్టలు, జరీబట్టలు, వీటినేధరించవలెను, అన్ని వేళలయందు వాటినే కట్టుకోవలెను, అన్నిసమయములయందు రూపనిర్బంధములతో నిర్మించిన దుస్తులే ధరించుకోవలెను— ఈలాగు యేర్పాటుచేస్తే లోకము జరుగుతుందా? సౌఖ్యంగా వుంటుందా? మరి యెందుకు గ్రాంథికభాషను వృద్ధిచేయడము అని పేరుపెట్టి దానికట్టుబాట్లను కొద్దికొద్దిగా చెరిపి పాడుచేసి దాని అందమును మాధుర్యమును ధ్వంసంచేస్తారు? గ్రాంథికభాషను సడలించి, పలుచనచేసి, చులకనచేసి సామాన్యకార్యములకు వుపయోగపరచవలెనని యెందుకు వృథాప్రయత్నము చేస్తారు? ఎందుకు పరిశుభ్రమైన వాడుక భాషను నిందిస్తారు? బంగారుతో నీళ్లకాగులు నిర్మిస్తారా, గడ్డపారలు చేస్తారా? చేస్తేకూడా అవి బాగా వుపయోగపడునా? గ్రాంథికభాష దొడ్డభాష, పూజనీయమైన భాష. అది లోకవ్యవహారములయందు వుపయోగపడదు. రెండుకోట్లమంది ఆంధ్రజనులలో 199 లక్షల మందికి అది లభింపనే లభింపదు. కాబట్టి, నాదొడ్డబిడ్డలారా! నా మొర కొంచెము చెవిని పెట్టండి! గ్రాంథికభాషయొక్క తత్వము తెలియక దానిలోకి పిచ్చిమార్పులు కూర్పులు తెచ్చిపెట్టి, పరిశుద్ధముగానున్న నాదివ్యసౌధములను పాడుచెయ్యకండి. అగ్రగణ్యులైన మహాకవులు అప్పుడప్పుడు కల్పించే, కూర్చే కొత్త అందములతో తృప్తిచెంది మీ బుద్ధి అంతా వాడుక భాషను ప్రసిద్ధిలోకి తెచ్చి, పరిశుద్ధపరచి, వృద్ధి పరచుటయందు వుపయోగించండి

వాడుకభాష అందరికీ కావలసినభాష—అందరు జనులు సామాన్యసంభాషణయందు, వుత్తరప్రత్యుత్తరాలయందు, లోకవ్యవహారాలయందు, ప్రతిదినం ప్రతినిమిషం వుపయోగిస్తూవున్నభాష. వాడుకభాషను కాగితము మీద నిందించేవారు కూడా యింట ఆలుబిడ్డలతో మాట్లాడేది వాడుకభాషే! మరెందుకు వాడుకభాష అంటే నిందింపవలెను. యేల సిగ్గుపడవలెను? సామాన్యజనులు, పామరులు— నాబిడ్డలలో 199 లక్షలు వీరే—వీరి నిమిత్తము కల్పింపబడే గ్రంథాలువాడుకభాషలోనే వుండవలెను. ప్రస్తుతకాలములో అన్యసంబంధములవల్ల లభిస్తూవుండేజ్ఞానము వాడుకభాషలోనే వెల్లడి కావలెను. కొత్తకొత్త చరిత్రలు, శాస్త్రములు, కథలు, హాస్యములు, పాటలు, పదములు—యివన్నీ ప్రజలకు, బిడ్డలకు బోధపడవలెనంటే సంకరముచేసి పాడుచేసిన గ్రాంథికభాషలోగాక, నిజమైన, పరిశుద్ధమైన, మనోహరమైన వాడుకభాషలోనే వుండవలెను. ఈవాడుకభాష అనే ప్రత్యేకభాష అవిచ్ఛిన్నముగా యేర్పడివుండడము. అజంత

భాషలయొక్క, పురుషభాషలయొక్క గొప్ప భాగ్యము. వార్తాపత్రికలను నాబిడ్డలు లక్షలకొలది చదివి అభివృద్ధికి రావలెనంటే వాటిని వాడుకభాషలోనే వ్రాయవలెను. కొంచెముగా గొప్పగా పడలించిన గ్రాంథికభాషకూడా జనసామాన్యమునకు బోధపడదు. కాబట్టి గ్రాంథికభాషను కనికరములేక వంకరటింకరలుగా తిప్పి తిప్పలు పెట్టి తప్పులుకూర్చి పిచ్చిపిచ్చి శబ్దజాలమును కల్పించి గ్రాంథికభాషను, వాడుకభాషను, రెంటినీకూడా పాడుచేయకండి. నాదొడ్డబిడ్డలలో కొందరు పెద్దవ్రాతలని పేరుపెట్టి గ్రాంథికభాషలో పిచ్చివ్రాతలను వ్రాసి నాకు విచారం కలిగిస్తూ వున్నప్పటికీ, కొందరు దొడ్డగ్రంథాలు కల్పించి నాగర్వము పెంపుచేస్తూన్నారు. ఇదినాకు పరమానందమే. కాని, వీరు సమర్పించే పరమాన్నము నాబిడ్డలలో లక్షలమందికూడా ఆరగించి అనుభవించడం లేదు. పరిశుద్ధమై రుచికరముగా వుండే అంబలే 199 లక్షలమంది బిడ్డలకు ఆరోగ్యకరమైన ఆహారము. ఇది అత్యావశ్యకము. దీనినికూడా సంపాదించగలవారు నాదొడ్డబిడ్డలే. ముందటికాలంలో కొందరు బుద్ధిమంతులు వాడుకభాషలో కథలు, కీర్తనలు, పాటలు పదములు హాస్యములు, మొదలైనవి కల్పించివున్నారు. గంగావివాహము, కుసలాయకము, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, క్షేత్రయపదములు, సారంగపాణిపదములు, లంకాయాగము— మొదలైనవి నాబిడ్డలకు ప్రాణములు. వాడుకభాషలో అనేకగ్రంథములు నోటిపాఠాలలోను తాటాకుల పుస్తకాలలోను పై ప్రాణాలతో నిలిచియున్నవి. వీటిని రక్షించి చక్కగా ముద్రించి సర్వజనులకు సులభంగా దొరకేటట్లు చేయడం యెంతో పుణ్యకార్యము. ఈ కాలంలోకూడా కొందరు బుద్ధిమంతులు వాడుకభాషలో హాస్యములు, కథలు, శాస్త్రములు, ధర్మశాస్త్రములు మొదలైనగ్రంథాలు వ్రాసియున్నారు. ఇవి ప్రతిపల్లెటూరిలో పూజింపబడుతూవున్నవి. కన్యాశుల్కము చదివి సంతోషించనివారుందురా? సంస్కర్తగారి గ్రంథాలలో, వాడుకభాషలో వ్రాసిన హాస్యములేకదా అందరూ చదివి ఆనందిస్తూ వున్నారు. కాబట్టి దొడ్డనాయనలారా! విద్వాంసులారా! గ్రాంథికభాషను సంకరము, చేసి నాగర్వమును కుంగించక, వాడుకభాషను లఘుమార్గములో వృద్ధిచేసి, పరిశుద్ధిచేసి, మనోహరమైన కల్పనలతో రమ్యముచేసి, జ్ఞానమును ఆనందమును పెంచే సర్వజనోపయోగములైన గ్రంథాలు వ్రాయండి, ముద్రించండి, ప్రచురించండి! చిన్నబిడ్డలు 199 లక్షలమందికి అభివృద్ధిమార్గము యేర్పరచండి! తల్లి ఆశీర్వచనమును పొందండి! శాశ్వతమైన కీర్తిని సంపాదించండి!!

తే. నోటితో పల్క వినఁదగు ♦ నుడుఁగు లెల్లు
కాగితముపయి వ్రాయంగ ♦ గర్హ్యములగు?
తప్పు మీయందె కల దని ♦ చెప్పనేల,
మంచినీళ్లు నిందింతురో ♦ మధువు మరగి ?

# ఆంధ్రదేశపురోవృద్ధిప్రశంస

చావలి వేంకటకృష్ణయ్యగారు

ఆల నారోజిని దేశ మెల్లెడల దాదాభాయి యంచున్ ముదం
బలరన్ బూజలొనర్చి దేవునిఁబలెన్ ధ్యానించుటల్, కృష్ణగో
కలెనామంబును విన్నయంతటనె హృత్కంజంబు లుప్పొంగుటల్
దిలకింపంగ స్వదేశమాతృహితకృత్తేజఃప్రభావాఢ్యులై
చెలఁగన్ గాదె; పవిత్ర మాపథము కించిత్తేని యోజింపుఁడీ.

మ. కల కర్తవ్యము లెన్నియో భరము వక్కాణింప నాంధ్రావనిన్
కెలువొప్పార నొనర్పు; నన్నిటను నెంతే ముఖ్య మా గ్రామవా
సులకున్ జ్ఞానముఁ గూర్చు నుద్యమము; ధీశూరుల్ ప్రయత్నింపఁగా
వలె, భూపాలుర దోడ్పడన్ వలెను దద్భాగ్యం బెసంగన్వలెన్.

ఉ. క్రూరముగాఁగ బాడబులు "ఘోరపుఁబాపులు మాలమాదిగల్
దూరమునందు నుండవలె దోసము డగ్గఱఁ జేరినన్ సదా
చారము లివ్వి సు" మ్మనుచు సాహస మూనెడి పల్కులే సుఁడీ
వేఱుమతంబుఁ జూచుకొనఁ బ్రేరణసేయుట వారి నందఱన్.

గీ. 'దూరముగ నుండురా యోరి పేరిగాఁడ!'
యన్న పల్లె యనును గాని, యల్ల యతఁడె
రేపు "పేతు" రై మీ మచ్చమాపుఁగాదె?
రైలుబండిలో మీ పజ్జ వ్రాలునపుడు.

చ. అరయుఁడు వేదశాస్త్రములయందలి మూలపుటర్థముల్ వివా
దరహితబుద్ధి; సాంఘికపు ధర్మములన్ వివరింపుఁ డెవ్వి యా
చరణ మొనర్పఁగావలెనొ; సల్పకుఁడయ్య "యయోమయంబు" సు
స్థిరమగు జ్ఞానమార్గపువిధిన్ మతి మార్పును జెందు ధర్మముల్.

తే. మంగళ మగు నాంధ్రులకున్
మంగళ మగు వారియుద్యమంబుల కెల్లన్
మంగళము పొరుగువారికి
మంగళ మీ హిందుదేశమాతకు నెందున్.

# మతవిషయము

పోతరాజు నరసింహము పంతులుగారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

ఈ వ్యాసమునందు వ్రాయబోవునది క్రొత్తవిషయము కాదు; క్రొత్తమతమును గురించియు కాదు. ప్రస్తుతము అవలంబింపబడు మతములలో మనకు కావలసిన దంతయు ఉన్నది. ఇంతకు యెక్కువగ కూడ ఉన్నది. మనకు క్రొత్తమతము కూడ అక్కరలేదు. ఉన్న మతములనే వాటిలో అనావశ్యకమైన సంగతులను విడిచివేసిన చాలును. ఇందులో వ్రాయ నిశ్చయించుకున్న ముఖ్యాంశమేమనగా మనచుట్టు మతభేదములు పెరుగుచున్న ప్రస్తుత స్థితిలో మన మేమి చేయవలయును? ఈ భేదములు ముఖ్యములా? ఇవి మనకు ఐకమత్య మిచ్చుటకు ఏవిధముగా మార్చబడవలయును? అని.

ముందుగా ఆలోచించవలసిన విషయము ఏ మనగా, మనము మతాంశము లని నమ్ము సంగతులు నిజముగా మతసంబంధ మయినవా లేక సాంఘికసంబంధ మయిన పరిపాటిలో నుండు ఆచారములా? జాగ్రతగా ఆలోచించి చూచినయెడల, ఈ రెండు విషయములు మన ప్రస్తుతపు నడవడిలో బాగుగా విభజింపబడియుండలేదు. ఈ రెండును ఒక అంశముగానే యున్నట్టు మనము ప్రవర్తించుచున్నాము. గాని ఈ రెంటిని విభజించిన గాని మనకు సాంఘికవిషయములో నుండు నీచస్థితి తొలగనేరదు. మత మనునది సర్వసాధారణముగా అందరికిని విశేషముగ భక్తిభయములతో కూడిన విషయము. దానినుండి సాంఘికాచారములు కూడ మతాచారములుగ నమ్మినవారికి వీటి రెంటియొక్క భేదమును నిరూపించకుండ సంఘసంస్కరణయందు అపేక్ష కలుగు నని నమ్ముట నిష్ప్రయోజకము. అయినను ఈ విషయముగూర్చి మనకు ప్రస్తుతము సంబంధము లేదు. ఈ వ్యాసములో మత మనునది కూడ ఒక సాంఘికాంశముగా చూచి, ప్రస్తుత మతభేదములనుండి మనుష్యులకు ఐకమత్యము ఏవిధముగా కలుగవచ్చునని ఆలోచించెదము.

అన్ని భేదములకంటె మతభేదములు మనుష్యులను ఒకరినుండి ఒకరిని వేరుపరచుచుండుటయే గాక వారియందు ఒకవిధమయిన ద్వేషమును అసహనమును కూడ కలిగించుచున్నవి. ఈ స్థితి నిజముగా ఉండవలసినది కాదు. అన్యమతద్వేషము నాగరికతలక్షణము కాదు. ఇందులో ముఖ్యముగా కొన్ని మతములు తక్కినమతములవారిని తమ మతములోనికి కలుపుకొనుట ముఖ్యోద్దేశము కలిగినవై పైనచెప్పిన విలక్షణమును విశేషముగా కలిగియున్నవి. మనము సరిగా ఆలోచించి చూచినయెడల అన్యమతద్వేషము ఏమతమునకును ముఖ్యాంశముగా కనపడదు. ఏదైన మతమును అవలంబించు మనుష్యులను బట్టి ఆ మతముయొక్క ఉత్కృష్టత్వము గాని నికృష్టత్వము గాని కలుగుచున్నది. మరియొక విషయము కూడ కలదు. హిందూమతము ఇతర మతములవారిని తమ మతమునకు మార్చు పరిపాటి లేనిదైనను, వారిలోనే హీనజాతివారును గొప్పజాతివారును అను జాతిభేదములు కలుగజేసి మనుష్యులలో ఐకమత్యము లేకుండ జేయుటయందు అనాగరికత లక్షణము చూపించుచున్నది. ఈస్థితి నిజముగా హిందూమతాంశములనుండి కాకపోవచ్చును. గాని మతమునుగూర్చి మాట్లాడినప్పుడు అట్టిమతమును అవలంబించినవారి నడవడినే మనము గ్రహించవలసినది గాని నిజమైన మతాంశములు. ఇట్టివి అట్టివి అని నిరూపించుట వలన కేవలము మనకంటియెదుట జరుగుచున్న విషయములకు కళ్లు మూసుకున్నవారమై ఏదో మన మానసికములయిన అభిప్రాయములు కలగన్నవాని కలనుపోలె నిజములుగా భావించువార మగుదుము. కాబట్టియే బుద్ధిమంతులు నిజమైన మతాంశములను తక్కిన అనవసరమైన అంశములనుండి విడదీసి వాటిని మాత్రమే మతాభిప్రాయములుగా వ్యవహరించవలయును. హిందూమతములో కేవలము సాంఘికసంబంధమయిన జాతిభేదము మొదలగు దురాచారములను వదలి ముఖ్యమైన మతాంశములనే అవలంబించినయెడల ప్రజలకు చాలా ఉపయోగమును మతమునకు ఉత్కృష్టతయు కలుగు నని నమ్మవచ్చును. మనలో యుండు సాంఘికస్థితి చాలావట్టుకు యీ రెండు అంశములను వేరుచేయలేమిచే కలిగినదే. మతముకాని అంశము కూడ పూర్వాచారపరాయణత్వముచే మతాంశమే అని నమ్మబడి మనము ఏవిధమయిన అభివృద్ధి చెందకుండ ఆటంకముగా కలుగుచున్నది. కావున నిజమయిన మతాంశమేమని మనము ఆలోచించదగియున్నది.

మత మనునది ఏదో చాలామంది పండితులు ఇదివరకు చర్చచేసియున్నారు. మత మనునదియే అవివేక మనియు, మన పూర్వులు అజ్ఞానముచే భౌతికసంబంధమయిన కార్యములను తెలియజాలక అవియేదో అనిర్వచనీయములయిన కారణములు కలిగియున్నవనియు జ్ఞాన మధికమయినకొలది మత మనునది మాయమైపోవు ననియు నమ్మువారు కొందరు కలరు. వారి అభిప్రాయములతో మన కేమి ప్రసక్తి యిక్కడ లేదు. గాని కొందరు భౌతికశాస్త్రజ్ఞుల మాటలు మనము వినవలసియుండును. అందులో ముఖ్యముగా సర్ ఆలివరు లాడ్జిగారి గ్రంథములు చదివిన మన పూర్వీకులు అంతగా బుద్ధిహీనులు కారనియు, మనకు ఇంద్రియగోచరము లగు వస్తువులే గాక ఇంకను అతీంద్రియము లగు పదార్థము లనేకములు గల వనియును వాటినిగూర్చి పరిశ్రమచేసినయెడల మతములలో నుండు నిజము తేటపడు ననియు తెలియవచ్చును. మతసంబంధమయిన స్ఫురణ అవివేకమునుండి గాక నిజమయిన ఆంతరంగికజ్ఞానమునుండి కలిగినట్లు ఈవిషయముల గురించి పరిశీలించినవారికి విశదమగుచున్నది. గాని యిట్టి జ్ఞానోదయమునుండియే మతాంశ మనునది సాంఘికాంశము కా దనియు, ప్రస్తుతము రెంటిని ఒకటిగా చూచునదియే అవివేక మనియు, ఈ రెంటిని వేరుగా చూచువారికి మత మనునది దాని సహజమయిన ఔచిత్యమును పొంది దాని తత్త్వము తెలియుటయే గాక మతాంశములయందు ఉండవలసిన గౌరవము కలుగు ననియు, అందునుండి సాంఘికసంబంధమయిన వ్యవహారములలో కూడ అన్యోన్య

గౌరవమున్ను, ఎక్కువగా సాంఘికాభివృద్ధికి కావలయు స్వేచ్ఛయు రాగలదనియు నమ్మగలము. కాబట్టి నిజమయిన మతాంశములకు మనము వ్యవహారనిమిత్తమై కల్పించుకున్న భేదములతో పని లేదు. మన జాతిభేదములు యీ రెండవ తరగతిలోనివి. మతమో మన మనస్సంబంధమయినది. అది చిత్తశుద్ధికై వచ్చినది గాని వ్యవహారవిషయములలో అగపడు మానవతారతమ్యములను ఎక్కువచేయుటకు కాదు. మతమును వ్యవహారముతో కలిపివేసిన నిజమైన మతము గాని సంఘమునందు అభివృద్ధి గాని కలుగనేరదు. ఇట్లు ఆలోచించినయడల మతములో నుండు నిజము మనలో నుండు జీవాత్మకున్ను ప్రపంచమంతటను వ్యాపించియున్న పరమాత్మకున్ను ఉండు సంబంధమును నిరూపించునదిగా కానబడుచున్నది. ఈ రెంటి సంబంధము స్వానుభవములో నుండు యోగులు తమకు తెలిసిన విషయమువల్ల అందరు బాగుపడవలయు నను ఉద్దేశముతో మతములను స్థాపించిరి. వారి అభిప్రాయము సాంతముగా తెలియజాలక వారిని అనుసరించిన మతాధిపతులు మతద్వేషములను మొట్టమొదట కలిగించియుందురు. బౌద్ధుడు, యేసుక్రీస్తు, మహమ్మదు, మనదేశమునందు అవతరించిన ఇతరమతోద్ధారకులు ఎవరు గాని వారి నోటితో అన్యమతస్థులను ద్వేషించుమని చెప్పియుండలేదు. నిజముగా ఆత్మతత్త్వమును ఎరిగినవారు ఎన్నడును మరియొకరిని ద్వేషించుమని చెప్పలేరు. ఏలననగా వారి ఆత్మసాక్షియే మన వాక్కునకు అగోచరమైన ఆత్మైకత్వమును వారికి స్వానుభవముగా నిరూపించియుండును. ఆత్మయోగము కలవారు ఎన్నడును ఒకరిని ద్వేషింపలేరు. వారు పరమాత్మతత్వమును ఎరిగి అట్టి పరమాత్మవలె దయాస్వరూపులై లోకసంగ్రహమును గోరుచు ఉండువారు. మతద్వేషము అట్టివారినుండి పుట్టినది కానేరదు. కాబట్టి నిజమైన మతసారము ఎవరి ఆత్మకు దగినట్లు వారికే తెలియును; అట్టివారు ఇతరులను ద్వేషింపజాలరు.

మతముయొక్క నిజస్వరూపము అట్టిదై యుండగా మతమను పేరు పెట్టుకొని మతాంశము లేశమైన లేక ఏవో లేనిపోని తంతులు సృజించుకొని ప్రజలలో అన్యోన్యము ద్వేషము కలిగించు కుమతములను మనము విశ్వసింపరాదు. ఈ కుమతములు మెండు. నిజమైన మతాంశము ఆత్మగోచరమైనవారికి ఇట్టి మతములతో పనిలేదు. అన్ని గొప్పమతముల సారాంశములు జాగ్రతగా పరిశోధించినవారికి వాటిలో ముఖ్యాంశములు అన్నిటిలో ఒకటిగా నున్నట్లు మనస్సునకు బోధపడును. కాబట్టి భేదములు అసహనము ఎక్కడినుండి వచ్చియుండునో అని ఆలోచించినయడల మనకు ఇటీవల వచ్చిన మతాధిపతుల అజ్ఞానమునుండి అని తోచును. మతము ఆత్మసంబంధమైన చన్న సంగతి మరచిపోయి యేదో లేనిపోని తంతు వకటి నిర్మించి దానిని స్థాపించుటకై కొన్ని కల్పనలు పన్ని వాటిని వృద్ధిజేయగోరువారు సాధారణముగా ఇట్టి మతాధిపతులు. వీరు అందరు మతస్థాపకులు ఒక్కసంగతే చెప్పియున్నారు అన్న సంగతి బొత్తిగా వదలివేయుదురు; అనావశ్యకమైన సంగతులలో భేదములు పెద్దవిగా జేసి వాటినుండి అన్యోన్యద్వేషము కలిగించుచున్నారు. ఇట్టి స్థితి పూర్ణమైన అజ్ఞానమునుండియు, నిజమైన మతాభిప్రాయముల లేమినుండియు కలిగినది. ఐరోపాలో నాలుగైదు వందల సంవత్సరముల క్రిందట మామూలుగా వుండిన అన్యమతఅసహనము అందరికిని తెలిసిన సంగతియే. శంకరాచార్యులవారికి కూడ కొన్ని చరిత్రలలో అట్టి అసహనము దానితోపాటు క్రూరత్వము ఉన్నట్లు వినియున్నాము. అది ఎంత నిజమో తెలియదు. ద్వేషముచేతను క్రూరతచేతను అభివృద్ధిచేయబోవు మతము అట్టి సాధనమునుండియే కుమతమనియు కేవలము అజ్ఞానమనియు స్పష్టమగును. నిజముగా మతమునందు సత్యమున్నయడల అది అందరకు హితవుగా ఉండును గాని ఒకరికైనను ద్వేషము కలిగింపనేరదు. ఏమాత్రమైనను ద్వేషమున్నయెడల అది మతము కానేరదు. కాబట్టి మతముయొక్క ముఖ్యాంశము అందరియందు దయయు ప్రేమయు కలవారమై యుండుట. ఇవి లేనివి మతములు కావు; అవి కుమతములు. క్రైస్తవమతమంతటికి ముఖ్యమయిన వాక్యము ఏదనిన, ఈశ్వరునివలె ప్రేమస్వరూపుడై యుండుటయే. యేసుక్రీస్తు ప్రేమస్వరూపుడనియు ప్రపంచమునందుండు కీడును మాపుటకై తన ప్రాణము నిచ్చెననియు, అట్టి క్రైస్తవాంశ అనగా ప్రేమస్వరూపము అందరియందున కలిగిన గాని ముక్తి కానేరదనియు క్రైస్తవమతము చెప్పుచున్నది. బుద్ధుడు దీనికి తక్కువకాని మాటలచే ప్రేమ దయ బోధించియున్నాడు. అతని జీవితమే ఒక ప్రేమస్వరూపముగా భాసిల్లుచున్నది. శ్రీకృష్ణుండు భగవద్గీతలో "సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని, ఈక్ష్యతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః" (6 29) అని అర్జునునకు చెప్పియున్నాడు. ఇట్టి వాక్యములు ఎన్నో చదివి చూపించవచ్చును. అయినప్పటికి వీరిలో వీరు ద్వేషపడుట ఎంతయు శోచనీయము. మతాంశ మంతయు పైన చెప్పిన వాక్యములలోనే యున్నది. తక్కినవాటి గురించి భేదములున్నను ఉండవచ్చును; గాని ముఖ్యాంశములో భేదము లేనిచో ఎందుకు అన్యమతస్థులను ద్వేషింపవలయును? ద్వేషము లేశమైనను ఉన్నయడల అది ఈశ్వరప్రీతి ఎన్నటికిని కానేరదు. మనము ఆలోచింపవలసిన ఇంకొక అంశమేమనగా, ఇప్పుడు ఉన్న మనుష్యులలోనే చిత్తశుద్ధితో వెదకినయడల కొందరు మహాపురుషులు కనపడుదురు. వారు ఎక్కడో కొండగుహలలో యున్నారనుకోనక్కర లేదు. మనతోపాటు తిరుగువారే. వారికి ఆత్మసాక్షిగా ఈశ్వరుడు ఆత్మస్వరూపుడై యున్నట్లు విశదము. వారికి ద్వేషమనునది మాటమాత్రము. వారు దయయే మూర్తి అయినట్లుగా అగపడుదురు. అట్టివారు విశేషముగా ఉండువారు కారు గాని బొత్తిగా లేనివారు కూడ కారు. ఎల్లప్పుడు స్వార్థపరాయణచిత్తులమైన మనకు అట్టివారు గాలిలో పక్షులవలె అగపడరు; గాని ప్రయత్నముతోను ఆత్మశుద్ధితోను చూచినయడల అగపడుదురు. పైకి సాధారణమనుష్యులవలెనే యుందురు. ఇందుకు ఉదాహరణగా అందరికి తెలిసిన మనుష్యులలో టెనిసన్ కవీశ్వరు డొకడట్టివాడు. ఆయనచరిత్ర చదివినవారికి ఆయనకు కలిగిన ఆత్మజ్ఞానము విశదమౌను. కవి అయియు తన జ్ఞానానుభవము మాటలచే చెప్పలేకపోయెను. ఇట్టివారు చెప్పునది ఏమనగా ఆత్మ అనునది ఒక్కటియే అనియు, అట్టి అనుభవమువలన సర్వసమత్వ ముండు ననియు, అది మానవులను ప్రేమస్వరూపులను

జేయు ననియును. ఇంతకన్న మతములో ముఖ్యాంశ మేది కలదు? ఏది కావలయును? ఈశ్వరు డున్నా డను సంగతి ఆత్మ యున్న దను సంగతియే. కాబట్టి తక్కిన విషయములలో అభిప్రాయము లెట్లు లున్నను ఈ విషయములో భిన్నాభిప్రాయ ముండరాదు. ఈమాట యొకటియే నమ్మి ప్రవర్తించువారికి తక్కిన విషయములతో పనిలేదు.

మతాంశ మిట్టి దని తెలిసిన తర్వాత మనము చేయునది ఏమి? మనచుట్టు ఇట్టి మతభేదములు ఉన్నప్పుడు మనము చేయునది ఏమి? వేరువేరుగా వున్న యీ మతముల నన్నిటిని వదలి క్రొత్తగా అందరికి ఒకటే మతము స్థాపించుటకు వీలగునా? ఈ విషయములో మతాంశము సాంఘికాంశములలో ఒక అంశముగా అగుచున్నది. లోకసంగ్రహముకొరకు మతము ముఖ్యమయిన సాధనముగా కాగలదు. మతముయొక్క ముఖ్యాంశ మేమో ఇదివరకు చూచియున్నాము. ఇప్పుడు మతమునకును సంఘముయొక్క ఐకమత్యమునకును గల సంబంధము చూతము ఒకటే మత మున్నయెడల అట్టి ఐకమత్యము కాగల దని కొందరి అభిప్రాయము. గాని అట్టికోరిక మనవంటి మానవలోకములో జరుగు ననునది భ్రమ. మనుష్యులలో భేదములు తారతమ్యములు ఉన్నంతకాలము ఒకరిమతము మరియొకరిమతము ఒకటిగా వుండనేరదు. అట్లు ఉండుటవలనను కూడ ఏమయినను లాభ మున్నట్టు అగపడదు; ప్రతిమనుష్యునకు ఉండు స్వాతంత్ర్యము పోయి కీలుబొమ్మలవలె ఆడువార మగుదుము. బలవంతముగా అందరికి ఒకటే మతము చేయుద మన్నను దాని లాభము మన మానవత్వము పోగొట్టుకొనుటయే. మనము పైకి హిందువుల మని గాని క్రైస్తవుల మనిగాని మరి ఇతరమతస్థుల మని గాని అనుకున్నప్పుడు మన మనస్సులో ఏమి అభిప్రాయ మున్న దని ఆలోచించి చూచినయెడల ఏవో కొన్ని అంశములలో ఏకాభిప్రాయుల మయినను మరికొన్ని విషయములలో ఎవరికి వారు భిన్నాభిప్రాయులుగా ఉన్నట్టు విశదమగును. ఇందులో ముఖ్యాభిప్రాయ మిది యని ఎవరు స్థాపింపగలరు? కాబట్టి ఈ ప్రకారము ఆలోచించినయెడల మనకు తోచునది ఏమి? ఒకటియే మార్గముగా అగుపడుచున్నది. అది ఏమనిన ఎవరికి వారు ఆత్మసాక్షిగా మంచి దని నమ్మినట్టు నడుచుటయు ఇతరులకు కూడ అట్టి స్వేచ్ఛాభిప్రాయము ఉండవలె నని కోరుటయు అయియున్నది. బుద్ధికి మంచి దని తోచినదానిని ఇతరులకు నిష్కల్మషముగా తెలియజేయుటయు, అట్లు తోచినదాని ప్రకారము నడుచుటయు, మతములందు కలుగు భిన్నాభిప్రాయములను సమదృష్టితో చూచుటయు, ఈ మూడును కలిగియున్నయెడల ఎట్టి మతభేదములున్నను మనుష్యులు ఐకమత్యమును పొందగలరు. అన్యమతాభిప్రాయములను మన్నింపవలయు నను సంగతి భగవద్గీతయందు "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం। మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః" అను శ్లోకముచే బాగుగ విశదమగుచున్నది. గాని తాము అనుకున్నదే సరియైన అభిప్రాయ మనియు ఇతరుల అభిప్రాయములు సకళంకము లనియు యోచించినయెడల ఐకమత్యము కలుగనేరదు. అయినను మీద మన మనుకున్న మూడు అంశములు ఒక నియమముమీద మాత్రము ఐకమత్యమును కలుగచేయగలవు. అది ఏమనిన మతభేదము లెట్టివైనను ఒక విషయమునందు మాత్రము వాటికి ఏకాభిప్రాయ ముండవలెను. అనగా ఇంతకు ముందు చెప్పిన ప్రకారము అంతటియందు ఒక ప్రాణమే, ఒక జీవమే, ఒక ఈశ్వరుడే అనియు, అన్నిటియందు దయ గలిగియుండుట అనగా ప్రేమస్వరూపుడుగా యుండి ఏవస్తువునందును ఎట్టి ద్వేషము లేకుండుటయు, అను ఈ రెండు అంశములందు సామాన్యాభిప్రాయ ముండవలెను. ఇట్లు గాక మతాంశ మను పేరుపెట్టి ఇతరులను ఏవో గోప్యమైన కారణముల బట్టి ద్వేషించు మని చెప్పు మతములతో ఐకమత్యము కోరుట ఉట్టి తెలివితక్కువ. కాబట్టి బుద్ధిమంతులు నిజముగా మతాంశమును గ్రహించినయెడల మతభేదము లున్నను, ఏకమతస్థాపన అసాధ్యము నిష్ప్రయోజన మయినను, సరిగా ప్రయత్నము చేసినయెడల, సంఘమునందు ఐకమత్యము కలుగచేయుటకు తోడ్పాటు కాగలదు. మతము పేరున అనేకసాంఘికభేదము లుండుట మతములయొక్క ముఖ్యాంశములు కానేకావనియు, కాబట్టి వాటిని వ్యావహారికభేదములుగా తెలియవలె ననియు, ప్రజల ఐకమత్యముకొరకు ఈ భేదములను పెంచక అంతకంతకు జ్ఞానోపదేశములచేత మతముయొక్క నిజాంశమును అందరకు తెల్పి వీటిని లేకుండ చేయవలె ననియు, ఏకాభిప్రాయులై ప్రవర్తించినయెడల, ప్రపంచము చాలా శాంతిని పొందగల దని వేరే చెప్పనక్కరలేదు. ఈ విషయములబట్టియే ఒక మతమునుండి ఇంకొక మతమునకు మార్పు అనావశ్యకము అవివేక మని కూడ విశదము కాగలదు. ముఖ్యమతాంశ మిట్టి దని తెలిసిన తర్వాత భిన్నాభిప్రాయములు గల ఇతరాంశములకొరకు మతభేదము ఎందుకు పొందవలయును? అన్ని మతములను సమదృష్టితో చూచి ముఖ్యాంశములను తమ ప్రవర్తనలో మన్నించినయెడల ఇట్టి మార్పులు అవివేకములుగా అగుపడవా? నిజమైన మతాంశము ఇతరులకు ఎన్నడును హాని కలుగచేయనేరదు. గాని మతము పేరున ఇతరులు హాని చేయునప్పుడు బుద్ధిమంతులు నిజమైన మతము పేరుననే "అహింసా పరమో ధర్మః" అనునట్లు అట్లు ఇతరులు హాని చేయకుండ సహకారులై అజ్ఞానమును నాశనముచేయ ప్రయత్నింపవలయును. మన పెద్దలు చెప్పినట్లు జ్ఞానదానముకన్న గొప్పదానములేదు. కాబట్టి అజ్ఞానము పోగొట్టి ప్రజలయందు ఐకమత్యము అన్యోన్యప్రేమ కలుగునట్లు చేయుటకన్న లోకోపకారము లేదు. మనము కొంచెము ఆలోచించి చూచినయెడల ప్రపంచములో ఉండు కీడులో ముఖ్యభాగము మతము కానివాటిని మతములుగాను, వాటి ముఖ్యాంశములుగాను చూచుటయే. ఈశ్వరుని గాని మానవులను గాని ఎవరి వీలుప్రకారము వారు భజింపవచ్చును. గాని ఆ స్వేచ్ఛ అందరకును కూడ ఉండవలె నను సంగతి మరవకూడదు. ఈప్రకారమాలోచించినయెడల మత మనునది మన ఐకమత్యముకొరకును సంఘసంస్కరణకొరకును సహకారిగా అగుపడును గాని విరుద్ధముగా అగపడదు. ఏదైనను ఒకమతమనునది సరియైనదని తెలియుటకు ఒకటే గురుతు; అది ఏమనిన, అట్టి మతము సంఘమునందు సంతోషము, శాంతి, అన్యోన్యప్రేమయు, నమ్మకమును, అందరును కలసి మెలసి జీవించుటయు, సంఘపటుత్వమును కలిగించు నని గాని, 'నన్ను తాకక వేరుం' డనుటయు, స్వార్థత్వము, అసూయ, ద్వేషము, గర్వమును అభివృద్ధి చేయుట కాదు.

# సంక్షిప్తలిపి

ఏలేశ్వరపు రామచంద్రశాస్త్రిగారు

ఇంగ్లీషు, ఫ్రెంచి మున్నగు భాషలలో నిచ్చు నుపన్యాసములను నిమిషమాత్రములో నవలీలగ నొక మాటయైన విడువకుండ వ్రాయ వీలగులాగు పశ్చిమ ఖండవాసు లగు దొర లనేకులు చిరకాలము క్రిందటనే సంక్షిప్తలిపిని గనిపెట్టిరి. మఱికొందఱిప్పటికిని గనిపెట్టుచున్నారు. ఈ శాస్త్రము కూడ దినదినక్రమమున నూతనకల్పనల నొందుచున్నది. ప్రస్తుతము అమెరికా దేశమందు గ్రాహం, బెన్ పిట్మన్, మన్సన్, ఓస్ గుడ్ బై, లాంగిలీ, మార్ష్ మున్నగు గొప్ప లేఖకులు కూడ వారివారి పద్ధతులఁ దేటపఱుచు గ్రంథము లనేకములఁ బ్రచురించి గొప్ప గౌరవమును బొందిరి. వారందఱి పద్ధతులలో గ్రాహం దొరవారి పద్ధతి విశేష క్లిష్టతకును మన్సన్ దొరవారి పద్ధతి యెక్కువ విరివికిని వన్నె కెక్కె.

ఇంగ్లాండు నివాసు లగు సర్ ఐజాక్ పిట్మన్ దొరవారీ లిపిని మొట్టమొదట 1837-వ సంవత్సరములోఁ గనిపెట్టిరి. ఇప్పటికి వీరీ లిపిని గనిపెట్టి 76 సంవత్సరము లయినది. కాలము గడచుచున్న కొలఁదిని వీరి పద్ధతులు కూడ పలుమార్పులఁ జెందుచు తదితరులు గనిపెట్టిన పద్ధతులకంటె సర్వజనాదరణీయమై సమస్తదేశములఁ బ్రఖ్యాతి నొందుచున్న దన్న వార్త లోకవిదితమే. ఈ సంక్షిప్తలిపి మన చెన్నపురిరాజధానిలో 1882-వ సంవత్సరముననో యా ముందువెనుకలనో పీటర్సన్ దొరవారిచే ప్రవేశపెట్టఁబడియె. ఇప్పుడీ లిపి రాజధాని ముఖ్యపట్టణ మగు చెన్నపట్టణమందే గాక యితరపట్టణములను గ్రామములను చిన్న పల్లెలం గూడ నతిబాహుళ్యమును గాంచె. 30 సంవత్సరములకుఁ బూర్వము సంక్షిప్తలిపి యన నెట్టిదో యెఱుఁగని మనము దాని యుత్కృష్టపదవి నిప్పుడు ప్రత్యక్షముగాఁ జూచుచుంటిమి గదా! హూణవిద్యాధురీణులు దీని నభ్యసించి ఆంగ్లేయపత్రికలకు వృత్తాంతసంపాదకులుగాను న్యాయసభలందును వాణిజ్యశాలలందును లేఖకులుగాను పాఠశాలలం దుపాధ్యాయులుగాను పలు తెలుఁగులఁ బని చేయుచుండుట మన మెఱిఁగిన విషయమే. అట్టి లిపి యుండఁబట్టియే గదా హిందూదేశమునందే గాక యితరదేశములందుఁ గూడ జరగుచున్న రాజకీయన్యాయసంఘమతసభలలోని వార్తలు, హూణావిద్యాధురంధరుల గంభీరోపన్యాసములు, ప్రసంగములు మున్నగునవి వాయువేగమున వార్తాపత్రికల మూలముగను, పుస్తకముల రూపమునను అత్యల్పధనవ్యయముతో ప్రపంచ మెల్లెడల విద్యానిపుణుల వీనులకు విం దొనరించుచున్నవి.

ఈ సంక్షిప్తలిపి హూణభాషోపన్యాసకుల పదోచ్చారణధ్వనుల ననుసరించి వ్రాసెడి సన్నని లేక దళసరి రేఖల సమ్మేళనము. ఈ సంక్షిప్తరేఖ లన్నియు చాల భాగము క్షేత్రగణిత రేఖాకారములుగ నున్నవి.

ఇట్టి లిపి మన దేశభాషలకుఁ గూడ నున్న మన కెంత లాభకారియో నేను వేఱుగ వ్రాయ నేల? ఆంగ్లేయప్రభుత్వమువారీ లోపమును నివారింపఁబూనిరి గాని సాహసముతో నెవరును నట్టి లిపిని గనిపెట్టెదమని ముందునకు అంజ వేయరైరి. తుదకు వెల్లూరు పోలీసు పాఠశాలయం దుపన్యాసకులును, ఆంగ్లేయ సంక్షిప్తభాషానిపుణులును అగు మడకసిర శ్రీనివాసరావు పంతులుగారు తమ ప్రియమిత్రు లనేకులచేఁ బ్రేరేపింపఁబడి అఱవము, తెలుఁగు మున్నగు ద్రవిడభాషల కట్టి లిపి గనిపెట్టి లిపి లేని కొఱఁతను దీర్చిరి.

1908-వ సంవత్సరములో నఱవభాష కీ లిపి గనిపెట్టుట వీరి ప్రథమోద్యమము. ఆ గ్రంథమును పూర్తి చేసి కొందఱు పోలీసు ఉద్యోగస్థులను వివిధమండలములనుండి రప్పించి వారి కా లిపిని నేర్పి నిమిషమునకు 90, 100 మాటలు వ్రాయ శక్తిగలవారినిగాఁ జేసి గవర్నమెంటువారిచే నియమింపఁబడిన కమిటీయొద్దకు వారిని పరీక్షకుఁ దీసికొని పోయిరి. మఱికొందఱు గూడ తాము గనిపెట్టిన నూతనపద్ధతులను కమిటీయెదుటఁ బెట్టిరి గాని కృతార్థులు కాలేక పోయిరఁట. వీరు గనిపెట్టిన పద్ధతి మిగుల కట్టుదిట్టమయిన దనియు, పిట్మను పద్ధతి ననుసరించి యున్న దనియు కమిటీవా రగు గౌ. దివాన్ బహదూర్ ఎల్. డీ. స్వామికన్ను పిళ్లెగారును, సి. ఏ. సౌటరు, ఐ. సి. ఎస్. గారును వ్రాయుచు వీరిచేఁ దీసికొనిపోఁబడిన విద్యార్థులను రెండుదినములు వరు

సగం బక్షీంప, నా విద్యార్థులు నిమిషమునకు 100 మాటలు కూడ వ్రాసిరంట. అనంతరము కమిటీవారు గవర్నమెంటువారికి తమ యభిప్రాయమును వ్రాయ, పంతులుగారికి 500 రూపాయిలు బహుమాన మొసంగి ఆ పరీక్షలో కృతార్థు లయిన విద్యార్థులకుం గూడ పారితోషికముల నొసంగిరంట. ఈ గ్రంథము 1910-వ సంవత్సరములో నచ్చొత్తింపంబడియె. ఆగ్రంథమునకు గా. దివాన్ బహదూర్ ఎల్. డీ. స్వామికన్ను పిళ్లె గారు వ్రాసిన యుపోద్ఘాతమును చాలమంది చదివి యుందురు. ఇప్పు డఱవభాషలో నిచ్చు నుపన్యాసములను బాగుగ వ్రాయ సామర్థ్యము గల పోలీసు సబిన స్పెక్టర్లు పలువురు గలరు.

గవర్నమెంటువారు పంతులుగారిని తెలుంగు, కన్నడము, మలయాళములకు కూడ సంక్షిప్తలిపిని గనిపెట్టు మని కోరిరి. ఇప్పుడు తెలుంగుభాష కట్టి లిపిని గనిపెట్టుట పంతులుగారికి రెండవ యుద్యమము. అట్టి లిపి మనకుం గూడ నుండిన నిఁక మన యాంధ్రభాషలో నుపన్యసించు పండితుల మృదుమధురవ్యాసములు గాలికిం బోక సంక్షిప్తాంధ్రలిపిలేఖకుల పరిశ్రమముచే వార్తాపత్రికల మూలముగను, పుస్తకముల రూపముగను మన యెదుట ప్రత్యక్షమగును. ఇట్టి లిపి యున్న, మన యాంధ్రవారపత్రికలు దినపత్రికలుగ మాఱకుండ నీలుండునా? పంతులుగా రాంధ్రుల కిట్టి లోపమును దీర్చుటకు మిక్కిలి ప్రయత్నించిరి. ఆంధ్రభాషకు సంక్షిప్తలిపిని గనిపెట్టుట సముద్రమున కేతా మెత్తఁబ్రయత్నించుటయే. అట్టి యంతులేని తెలుంగుభాషకు సయితము పంతులుగారు పిట్మన్ పద్ధతులమీఁదనే సంక్షిప్తలిపిని గనిపెట్టి యున్నారు. వీరికి తెలుంగు కన్నడభాషలలో విశేషానుభవము లేకపోయినను వీరు చేయసాహసించిన పని కడు శ్లాఘనీయమే. వీరి కాంధ్రదేశము జన్మస్థలము కానప్పటికిని వీరి కాంధ్రులపైం గల యనురాగము చూడుడు. మన తెలుంగు వ్యాసముల నతివేగముగ నీ లిపిచే వ్రాయం గల లాభమును త్వరలో పొందెద మని తలంచెద. ఈ లిపిచే గద్యపద్యాత్మకము లగు గ్రంథములను గూడ సులభముగా వ్రాయవచ్చును. ఈ తెలుంగు సంక్షిప్త లిపిని గనిపెట్టుటలో విశాఖపట్టణము జిల్లాలో పోలీసు సబినస్పెక్టరుగా నున్న కృష్ణాజిల్లా నర్సాపురము వాస్తవ్యు లగు ఏలేశ్వరపు రామచంద్రశాస్త్రిగారిని గవర్నమెంటువారు పంతులుగారికి సహకారిగ నొసంగిరి.

ఈ గ్రంథము ముద్రాక్షరశాలకుం బంపక పూర్వము పరీక్షించుటకు గా. దివాన్ బహదూర్ ఎల్. డీ. స్వామికన్నుపిళ్లె గారు గవర్నమెంటువారిచే పంపఁబడిరి. వారీ పద్ధతులను సావధానముగం బరీక్షించిరి. పిమ్మట కార్యనిర్వాహకసభలో మెంబ రగు గా. సర్. ఎచ్. స్టూవర్టు దొరవారు నెల్లూరు విజయముచేసినప్పు డీ తెలుంగు సంక్షిప్తలిపిని వ్రాయు పద్ధతులను జూచి మిగుల సంతసించిరి. అప్పుడు వా రొకరిచే తెలుంగు వ్యాసము నొకటి చదివించి మఱియొకరిని వ్రాయు మనిరి. అట్లు వ్రాసిన పిదప దానిని తిరిగి చదువు మన, వ్యాసము చదువుటలో చదువరి చేసిన తప్పును గూడ లేఖకుఁడు వానియెదుటం జదివెను. అందులకు దొరవారు ఆనందభరితు లయిరి. గవర్నమెంటువారు పంతులుగారి శ్రమకు 500 రూపాయిలను, నూఱు గ్రంథములను బహుమాన మొసంగి, వారి వ్యయముతో 500 గ్రంథములను ప్రస్తుత మచ్చొత్తించుచున్నారు. బీదసాదలు కొన వీలగులాగున ప్రతి 1-కి రూ. 2-8-0 ల వెలం బెట్టి కాపీరైటును వారే తీసికొనిరి.

అఱవ గ్రంథమువలెం గాక, యీ గ్రంథమును గుఱించి మఱియొక విశేషాంశ మేమన, నాంగ్లేయభాషాపరిచయ మక్కఱలేకయె మనవా రందఱును తమంతట తాము విశ్రాంతిసమయములలో దీనిని నేర్చుకొన వీలగులాగున ఇంగ్లీషు తెలుంగు భాషలు రెండును ఈ గ్రంథమునం దిముడ్పంబడినవి. ఇది కొలంది కాలములోనే క్రయమునకు సిద్ధమగును.

కన్నడభాషకు సంక్షిప్తలిపిని గనిపెట్టుట పంతులుగారి మూడవ యుద్యమము. అదియును సిద్ధ మగుచున్నది. అనంతపూర్ జిల్లాలో పోలీసు సబినస్పెక్టరుగా నున్న బేలూరు వాస్తవ్యు లగు బి. కే. దాసన్ గారిని సర్కారువారు పంతులుగార్కి కన్నడభాషకు లిపిని గనిపెట్టుటలో సహాయకారిగ నొసంగిరి. ఆటుపిమ్మట పంతులుగారు మలయాళమును దీసికొని పని మొదలుపెట్టెదరు.

ఇప్పు డీ గ్రంథములు మన రాజధానిలోని సెకండరీ పాఠశాలలలోను, టెక్నికల్ పరీక్షలలోను ఒక ముఖ్యాంశముగా సర్కారువారిచే కొలంది కాలములోనే చేర్పఁబడఁబోవుచున్నవి.

# నూజవీడు సంస్థాన సంగ్రహచరిత్రము

వైద్యుల కృష్ణారావు పంతులుగారు

నూజవీడు సంస్థాన ముత్తరసర్కారులలోఁ జాలఁ బ్రఖ్యాతి గల జమీందారీలలో నొకటై యున్నది. ప్రథమ మం దీ సంస్థానములో దాదాపుగఁ గృష్ణాగోదావరీమధ్యమున నుండు దేశ మంతయుఁ జేరియుండెను. ఇది దాదాపుగ నాలుగు వందల సంవత్సరముల క్రిందఁ బద్మనాయకవీరులచే స్థాపింపఁబడి వారి సంతతి వారిచే నిప్పటికిని బాలింపఁబడుచున్నది. వీరి యాదిపురుషుఁడు సేకా బసవన్నగారను వెలమశూరుఁడై యుండెను. దక్షిణహిందూ దేశ మంతయు నరాజకముగా నుండుటచే ధైర్యసాహసములు గల వీరుఁడు వెడలి రాజ్యము స్థాపించుట కవకాశము కలిగియుండు కాలములో నీ వీరుఁడు ప్రబలి కృష్ణానది కుత్తరదిశ నుండు "గొల్లపల్లి" పురమున నొక కోట కట్టి రాజ్యాంకురమును నాటెను. ఈ కాలమందు జగత్ప్రసిద్ధి గాంచిన కృష్ణదేవరాయలు విజయనగరరాష్ట్రమందును శూరాగ్రేసరుఁ డగు కుటుబ్‌షా సుల్తాను గోలకొండ యందును బరిపాలన మొనర్చుచుండిరి. బసవన్నగారి మునిమనుమలు కోనప్పగారు; వారిద్వితీయపుత్రు లగు వేంకటాద్రిగారు క్రీ.శ.1652-వ సంవత్సరమున గొల్లపల్లి పరగణాను సంపాదించెను. వీరి కుమారులు అప్పన్నగారను విజయఅప్పారావుగారు అసమాన పరాక్రమవంతులు. విశేషధైర్యసాహససంపన్నులై, రణరంగమందు అనుపమఖ్యాతి గాంచి గోలుకొండ నవాబువారి మెప్పు వడసెను. ఇట్టి వీరాగ్రేసరునికి నవాబుగారు 'తహావరు, వజులాలతు, దస్తగహ' అను బిరుదముల నొసంగి నౌబతు నగారా నుంచుకొనుటకును బంగారపుటంచు గల జాలరుపల్లకీ నెక్కుటకును నధికారము నిచ్చిరి. మరియు "రాజా", "బహద్దరు", "అప్పారావు" అను బిరుదుల నొసఁగిరి. ఈ శూరాగ్రణి మొదలు "అప్పారావు" అను పౌరుషనామమే వీరి గృహనామముగా వాడఁబడుచున్నది. వీరి కుటుంబములో ప్రతిపురుషుని నామమునకు అప్పారాయాహ్వయము మకుటమణిగ విరాజిల్లుచున్నది. ఈ విజయ అప్పారావుగారే నూజవీడునొద్ద కోటను గట్టించి ఆపురమును రాజధానిగ నేర్పఱిచినవారు. నూజవీడు అను పేరు వచ్చుట కొక కథ కలదు. విజయఅప్పరావుగారు వేఁటకు వచ్చియుండఁగ నూజవీడుపురము కట్టిన స్థలమున నొక మేఁక తోఁడేలును ధైర్యముతో నెదిరించుటను చూచి, అది బహుశౌర్యరేఖాకర మగు స్థలమని యెంచి, అచ్చట కోటను గట్టించి పట్టణము నేర్పఱిచిరి. కోట గట్టిన ప్రదేశము నువ్వులచేను అగుటచేత నూజవీడు అని పేరు వచ్చుటకు కారణమైనది. వీరి కుమారులు వేంకటాద్రి అప్పారావుగారు. వారు మూడుపరగణాలు ఉపరిగ సంపాదించిరి. వీరికి నరసింహ అప్పారావు, శోభనాద్రిఅప్పారావు అను పుత్రు లిరువురు గలిగిరి. వీరి కాలములో నీ సంస్థానము మహోన్నతదశయం దుండె నని చెప్పవచ్చును. నరసింహ అప్పారావుగారు విశేషప్రసిద్ధి గాంచిరి. వారికి, మూడు వేల మంది భటులను యుద్ధసమయమందు హాజరుపెట్టవలసిన షరతు గలిగి యుండుటచే "తీన్ హజారు మనసబుదా" రను బిరుదమును హైదరాబాదు నవాబుగారొసఁగిరి. నూజవీడు సంస్థానాధిపతులుగ ప్రప్రథమమున గౌరవింపఁబడినవారు వీరే. వీరే "ఇందుమతీపరిణయ" మను గ్రంథమును కృతినొందిరి. వీరి తమ్ములగు శోభనాద్రి అప్పారావు బహద్దరుగారి కాలములో నీ దిగువఁ జెప్పఁబడిన పదునెనిమిది పరగణాలు వీరి యాధిపత్యములో చేరినవిగా నుండెను.

| | |
|---|---|
| 1. గుండుగొలను. | 10. విజయరాయి. |
| 2. పెంటపాడు. | 11. గొల్లపల్లి. |
| 3. నిడుదవోలు. | 12. గుడివాడ. |
| 4. బహారుజల్లీ. | 13. కలిదిండి. |
| 5. ఏలూరుహవేలీ. | 14. చిన్నకోట. |
| 6. పుయ్యూరు. | 15. బత్తరుజల్లీ. |
| 7. మేడూరు. | 16. రాయగుడి. |
| 8. నున్నస్థలం. | 17. కుదికొండ. |
| 9. చత్రాయి. | 18. కపిలవాయి. |

మొదటి తొమ్మిదియు ఏలూరు సర్కారులోనివి. తక్కినవి కొండపల్లి సర్కారులోనివి.

శోభనాద్రి అప్పారావుగారి శత్రువు లగు నూరానేనివారు కొంతమంది జ్ఞాతులను పురస్కరించుకొని వచ్చి అగిరిపల్లివద్ద గొప్ప యుద్ధము చేసి రనియు, అప్పారావుగారు అసమానశూరత్వము చూపి జయము పొంది రనియుఁ జెప్పెదరు.

ఈ సహోదరు లిరువురకు సంతు లేనందున వీరి జ్ఞాతు లగు అప్పన అప్పారావుగారికిని వారి యనంతరము వారి పినతండ్రి కుమారు లగు రామచంద్ర అప్పారావుగారికిని రాజ్యము సంక్రమించెను. రామచంద్ర అప్పారావుగారు రాజ్యమేలుచుండఁగ హైదరాబాదు నవాబగు "నైజాముల్ ములకు" గారు కర్ణాటకపు దేశముమీఁదికి దండయాత్ర వెడలెను. అప్పుడు వీరు లోఁబడనందున మూడు మాసములు నూజవీడుకోట ముట్టడివేయఁబడెను. తుదకు నైజామువారి సేనాధిపతి యగు రుస్తుమల్లీఖాను కోట పట్టుకొని రామచంద్ర అప్పారావుగారిని సంహరించెను. అటుపిమ్మట ఈ సంస్థానమును రుస్తుమల్లీఖాను స్వయముగాఁ బన్రెండు సంవత్సరములు వ్యవహరించెను. కాని ఖానునవంతరము వచ్చిన ఉద్యోగి అప్పారావుప్రభువుల యాశ్రితు లగు కమదన అప్పన్న రాయన్న గార్లను ఈ సంస్థానపు సిస్తులను వసూలుచేసి వ్యవహరించునట్లుగ నేర్పాటుచేసెను. ఇట్టి ప్రవేశము

The Judges of the Madras High Court



మదరాసు హైకోర్టు న్యాయమూర్తులు

The late Mr. Justice P. R. Sundarier



కీర్తిశేషులయిన పీ. ఆర్. సుందరయ్యరుగారు

The Advocate General : Madras



మదరాసు హైకోర్టులో అడ్వొకేటు జనరలుగారు

The Hon. Mr. Horne



గౌ॥ హార్న్ గారు

The Hon. Mr. Clegg



గౌ॥ క్లెగ్ గారు

The Bishop of Madras



మదరాసు బిషప్ గారు

The Rev Mr. Andrews



రెవరెండు ఆండ్రూసుగారు

Mr. Rasul



రసూలు గారు

Sir Henry Cotton



సర్ హెన్రీ కాటన్

The Police Commissioner, Madras



మదరాసు పోలీసు కమిషనరు గారు

Dr. Rash Behari Ghose



డాక్టర్ రసవిహారి ఘోషుగారు

వలన వారు తిరిగి అప్పారావుసంస్థానమును నిలుపవలె నను రాజవిశ్వాసము కలవా రయి, పైనఁ జెప్పియున్న కోనప్పగారి సంతతిలోఁ జేరిన రామన్నగారి కుమారు లగు వేంకటాద్రి అప్పారావుగారికి ఈ జమీ తాలూకాలను క్రమక్రమముగా ఇజారా కిచ్చునట్లు అప్పటి యుద్యోగస్థులతో మాటలాడి యేర్పాటుచేసి యిప్పించిరి. లింగయ్య అప్పారావు అనెడి వీరి జ్ఞాతి కూడ కొంత దేశము నాక్రమించి వ్యవహరించినట్లును, కమదనవారివలన ఆయన పొడిచివేయఁ బడినట్లును జెప్పెదరు. ఇంతటితో తృప్తిచెందక యీ కమదనసహోదరులు హైదరాబాదు పట్టణమున కేగి యీ పరగణాల కన్నిటికిని తిరిగి జమీఁదారీసనదును వేంకటాద్రి అప్పారావుగారి పేరఁ దీసికొనివచ్చిరి. కాని వారు నూజవీటికి వచ్చుసరికే ప్రభువు పరలోకగతుఁడయ్యె. ఐనను కుటుంబమందు అభిమానము వదలక వారి తమ్ము లగు జగన్నాథ అప్పారావుగారిని జమీందారుగా నేర్పాటుచేసిరి. కాని కొంతకాలమునకు వీరు కృతఘ్ను లయి కమదనవారిని దేశములో నుండి వెడలఁగొట్ట ప్రయత్నింపఁగా ఉభయకక్షులవారికిని ఘోరమగు యుద్ధము జరిగెను. దానిలో అప్పారావుగా రపజయము నొంది కమదనవారివలనఁ బట్టుకొనఁబడిరి. అట్టి స్థితిలో నిడుదవోలు పెంటపాడు పరగణాలు వారి కిచ్చునట్లు వాగ్దానము చేయించుకొని ప్రభువును వదలివైచిరి. కాని స్వాతంత్ర్యము వచ్చినవెంటనే జగన్నాథ అప్పారావుగారు కమదనవారిని దేశమునుండి తఱిమివైచిరి. అందుమీఁద వారు తిరిగి హైదరాబాదునకుఁ బోయి నూజవీడు సంస్థానమున కంతకును తమ పేరున సనదును బొంది నూజవీటికి వచ్చిరి. అందుమీఁద జగన్నాథ అప్పారావుగారు భీతిఁ జెంది సనదును రద్దుచేయించినయెడల భాగమహాలు ఎప్పటటును వారి కిచ్చివైచెద నని చెప్పిరి. మరల ప్రభువాక్యమున విశ్వాసము గలవా రయి హైదరాబాదునకు వెళ్లి వా రట్లు జరగించిరి. కాని వారు వచ్చినతరువాత వాగ్దానానుసారముగ ప్రభువు వర్తింపఁడయ్యె. అప్పటికి ఫ్రెంచివారు ఈ సంస్థానములోఁ జేరిన "దివి" గ్రామమునఁ గోటకట్టి వర్తకము చేయుచుండిరి. కావున కమదనవారు వారి సాహాయ్యమును గోరిరి. అందుమీఁద వారు అప్పారావువారితో యుద్ధము చేసి ఓడించి జగన్నాథ అప్పారావుగారిని ఖైదీగా తీసికొని పోయిరి. వీరు 1756-వ సంవత్సరములోఁ బ్రసిద్ధిగాంచిన ఫ్రెంచి సేనానాయకుఁ డగు "బుస్సీ" స్వాధీనములో నుండి గుల్బర్గా యను పట్టణమునొద్ద కాలధర్మము నొందిరి. కొంతకాలము ఫ్రెంచివారే సంస్థానమును పరిపాలించిరి. తరువాత కూడ కమదనవారు అప్పారావు కుటుంబమునందు విశ్వాసమును వదలఁజాలక యేలూరులో సంహరింపఁబడిన రామచంద్ర అప్పారావుగారి మునిమనుమఁ డగు వేంకటాద్రి అప్పారావుగారనువారిని తీసికొనివచ్చి 1463-వ సంవత్సరమున వారికి పదునైదు పరగణాలకు హైదరాబాదు నబా బగు నైజా మల్లీఖానుచేత సనదు నిప్పించిరి. తుట్టతుద కీ అప్పారావుగారు కమదనవారియందు కృతజ్ఞతను చూపి భారుమహాల్లు అనఁగా గుడివాడ చిన్నకోట కలిదిండి బత్తరుజల్లి తాలూకాలను ప్రత్యేకముగ వారికి జమీందారీగ ఇచ్చివేసిరి. వారి వంశస్థు లిప్పటికిని గుడివాడలోను గుగజలోను అలవెన్సు జమీందార్లుగ నున్నారు.

ఈ వేంకటాద్రి అప్పారావుగారు తమ తమ్ము లగు నరసింహ అప్పారావుగారిని తమతో సమానముగ సంస్థానవ్యవహారము నిర్వహించునట్లు చేసెను. వీ రుభయులును రాజ్యము చేయుచుండఁగ అనఁగా 1766-వ సంవత్సరమున ఈ సంస్థానమం దొక భాగముగా నున్న కొండపల్లి సర్కారును ఈస్టు ఇండియా కంపెనీవారికి హైదరాబాదు నబాబుగా రొసఁగిరి. 1771-వ సంవత్సరములో వేంకటాద్రి అప్పారావుగారు కాలముచేసినందున నరసింహ అప్పారావు అను నారయ్యప్పారావు గారే ప్రభువై పరిపాలించుచుండిరి. కాని నరసింహ అప్పారావుగారు జాగ్రత్తగా వ్యవహారము చేయనందున ఇంగ్లీషువారికి నబాబుగారి యేర్పాటు ప్రకారము సైన్యసాహాయ్యమునకు ప్రత్యామ్నాయముగ చెల్లించుటకు ఏర్పాటుచేసికొనియున్న పన్నును బాకీలో నుంచిరి. అందుమీఁద అనఁగా 1773-వ సంవత్సరములో బందరునుండి యొక సేన యింగ్లీషువారిచే పంపఁబడెను. అప్పుడు బందరులోని కంపెనీ యుద్యోగస్థులయొద్ద జమీందారుగారు సొమ్ము అప్పుతీసికొని పన్నుబాకీ తీర్మానముచేసెను. అప్పిచ్చియున్న "వైటుహిల్లు" "హాడ్జను" అనువారలు జమీందారుగారిని మిక్కిలి చిక్కులుపెట్టినందున మదరాసు గవర్నమెంటువారికి తెలియఁజేయుచుకొనఁగా నప్పటి గవర్న రగు "లార్డు మెకార్టనీ" గారు కంపెనీయుద్యోగస్థుల నడతను నిందించుచు లండనునకు రికార్డును పంపెను. కాని యిది యంతయు నాలస్య మగుచుండుటచే అప్పారావుగారు అర్జీలవలన న్యాయము కలుగ దను నమ్మిక గలవారై 1783-వ సంవత్సరమున నూజవీడు కోటను ముట్టడికి సిద్ధపఱచి యుద్ధమునకు సేన నాయత్తముచేసిరి. అప్పుడు "మేజరు టవున్సు" అను సేనాధిపతితో సేనను నూజవీటికి పంపిరి. కాని ఆయన అప్పారావువారి సైన్యమును జయిం పస్థైర్యము చాలనివాఁ డగుటచే మఱియొక సేనాధిపతిని తోడు పంపిరి. అప్పు డుభయసైన్యములును తారసిల్లఁగా ఘోరయుద్ధము జరగెను. అప్పారావు సంస్థానపు సేనాధిపతి యగు చెలికాని వెంకయ్యగారు రణరంగమందు మడిసిరి. ప్రభువు కోట బిడ్డిగుమ్మముగుండ తప్పించుకొని వెళ్లి భద్రాద్రి యడవులకు చేరెను. అందుమీఁద నైజామునకు వ్రాసి యీ ప్రభువును స్వాధీనపఱచుకొనుటకు కంపెనీవారు ప్రయత్నించుచుండఁగా వారే స్వయముగా రాజమహేంద్రవరములో నున్న "డానియల్" అను ఆఫీసరువద్దకు వచ్చి, తమ తిరుగుఁబాటును క్షమించి తిరిగి జమీందారీని స్వాధీనము చేసినయెడల బాకీపన్ను చెల్లించెద ననియును సర్కారునకు విధేయుఁడనై యుండెద ననియు చెప్పినందున, ఆయన నమ్మి జమీని తిరిగి వీరికి స్వాధీనపఱిచెను. కాని బాకీ పూర్తిగా నియ్యక సర్కారువారి యుత్తరువులను తృణీకరించినందున "కాప్టెను మాన్ గోమరీ" అను సేనాధిపతిని సేనతో నూజవీడు కోటకు పంపిరి. అప్పు

నొందెను. అటుపైన తనకు కలిగిన అన్యాయమును విశదపఱచుకొనఁగా అందులకు మదరాసు గవర్నమెంటువారు సమ్మతించి ఇదివఱకు చేసిన రెండుభాగములను రద్దుపఱిచి మూడుభాగములు చేయుటకు అనేకప్రయత్నములు చేసిరి గాని తుదకు కొనసాగలేదు. అప్పుడు ఉభయులతో చెప్పి బలాత్కారముమీఁద అలవెన్సు ఇప్పించిరి. నిడుదవోలు ఎస్టేటులోనుండి తంగెళ్లమూడి ఎస్టేటును నూజవీడు ఎస్టేటులోనుండి చేవెండ్రముతాలూకును ఇచ్చివేయఁబడెను. నరసింహప్పారావుగారి పెద్దకుమారుఁ డగు సింహాద్రి అప్పారావుగారికి తంగెళ్లమూడి ఎస్టేటు వచ్చియుండెను. వారికి పుత్రసంతతి లేనందున వారియనంతరము వారి దౌహిత్రు లగు వేంకటగిరిమహారాజుగారి పెద్ద కుమారునికి సంక్రమించుటచే వారు ప్రస్తుతము అనుభవించుచున్నారు. మూడవ కుమారు లగు వేంకటాద్రిఅప్పారావుగారికి చేవెండ్ర రావిచెర్ల వచ్చియుండెను. వారి కుమారులే శ్రీ రాజా పార్థసారథి అప్పారావుగారై యున్నారు. వీరు స్వప్రయోజకత్వముచేత మాతామహుల యాస్తి యగు పోలవరంచ భద్రాచలము ఎస్టేట్లను సంపాదించుటయే కాక నిడుదవోలు ఎస్టేటులో మూడవ భాగమునకు వ్యాజ్యెము తెచ్చి ప్రీవీకవున్సిలులోఁ గడచిన జూలై నెలలో డిక్రీని పొందియున్నారు. వీరి పెద్దకుమారులు శ్రీ రాజా నారయ్యాప్పారావుగారు. రెండవ కుమారు లగు శ్రీ వేంకటరామయ్య అప్పారావుగారు కొద్దిమాసముల క్రిందట పరలోకగతు లైనారు. పెద్దకుమారు లగు శ్రీ రాజా నారయ్యాప్పారావుగారికి ముగ్గురు పుత్రులు గలరు.

శనివారపుపేటలో పెద్దన్నగా రగు శ్రీ రాజా వేంకటనరసింహ అప్పారావు బహద్దరుగారు 1827-వ సం. జూను 5వ తేదీని కాలధర్మము నొందిరి. వారికి పుత్రులు లేనందున చిన్నతమ్ము లగు నరసింహప్పారావుగారి ద్వితీయపుత్రు లగు నారయ్యాప్పారావుగారిని *దత్తుచేసికొనిరి. వారికిని పుత్రులు లేనందున తన భార్య లగు శ్రీ చిన్నమ్మారావు, పాపమ్మారావు గార్లకు పుత్రస్వీకారమునకు అనుజ్ఞ యిచ్చి 1864-వ సం.న పరలోకగతు లైరి. చిన్నమ్మారావుగారు కాలముచేసిన తరువాత పాపమ్మారావుగారు ప్రథమములో నూజవీడు భాగస్థులలో నొకరైన మేడూరు జమీందా రగు వేంకటరామయ్యాప్పారావుగారిని, వారియనంతరము వారి మైనరు కుమారునిని దత్తుచేసికొనిరి. ఆ పిల్లవాఁడును వారి జీవితకాలములోనే కాలముచేసినందున, పాపమ్మారావుగారియనంతరము వారసు లగు శ్రీ రాజా పార్థసారథి అప్పారావుగారికిని, నూజవీడు సంస్థానములోని ఉయ్యూరు ఎస్టేటు జమీందారు లగు శ్రీ రాజా రంగయ్యాప్పారావు బహద్దరుగారికిని, మీర్జాపురము జమీందారు లగు శ్రీ రాజా వేంకటనరసింహప్పారావు బహద్దరుగారికిని సమానభాగములు వచ్చియున్నవి.

---

* వీరు అప్పుడు మైనరు అగుటచే 1835-వ సంవత్సరమువఱకు ఎస్టేటు కోర్టాఫ్ వార్డ్సు పరిపాలనలో నుండెను. ఋణము అధిక మగుటచేతను, గవర్నమెంటు పన్ను చెల్లించక పోవుటచేతను, సుంకుగాలను పెరటపాసు వరగణాలు 1843-వ సం. లో వేలముపేయఁబడెను. 1851-వ సంవత్సరమందు పన్నుబాకీనిమిత్తము వేలముపేసి గవర్నమెంటువారే కొనిరి. తిరిగి కనికరించి 1860-వ సంవత్సరమున జమీందారున కొసంగిరి.

నూజవీడులో ప్రభుత్వము చేయుచున్న రామచంద్రప్పారావుగారు 1814-వ సంవత్సరములో పరలోకగతు లైరి. వారి కుమారు



లగు శ్రీ రాజా శోభనాద్రి అప్పారావు బహద్దరుగారు అప్పటికి ఐదు సంవత్సరముల వయస్సు గలవా రగుటచేత వారి మైనారిటీ వెళ్లువఱకు ఎస్టేటును కోర్టు.ఆఫ్ వార్డ్సువారు పాలించిరి. వారు 1831-వ సంవత్సరమున ఎస్టేటు స్వాధీనపఱచుకొని త్యాగభోగశీలు లై ప్రజారంజకముగ ప్రభుత్వము చేసి 1868-వ సంవత్సరము అక్టోబరు 18-వ తేదీని పరలోకగతు లైరి. వీరు భీమడోలు మున్నా గ్రామములను కొనిరి. వీరికి ఏడుగురు కుమారులు.—

1. శ్రీ.రాజా నారయ్యాప్పారావు బహద్దరుగారు. వీరు 1868-వ సం. మొదలు బహుదర్పముగ పరిపాలనచేసిరి. ఎస్టేటును పరిపాలన చేయుటలో మిక్కిలి సమర్థులని ప్రఖ్యాతి పొందిరి. వీరు ప్రభుత్వము చేయుచుండఁగనే వీరి తమ్ములు ఎస్టేటును భాగింపవలసినదిగా వ్యాజ్యెము తెచ్చిరి. కాని వారు జీవించియుండునంతవఱకును జిల్లా, హైకోర్టులలో భాగమునకు అర్హత లేదని తీర్పు కాఁబడెను. వీరి కాలములోనే రాజధాని యగు నూజవీడుపురమును బాగుపఱిచినారు. రోడ్లు వేయించి, చెఱువులు త్రవ్వించి, పట్టణపు వైఖరికి తెచ్చినారు. అగిరిపల్లి పర్వతముమీఁద వెంచేసియుండు కుటుంబముయొక్క యిష్టదైవ మగు శ్రీ శోభనాచలపతిస్వామివారి దేవాలయము సోపానములు గట్టించిరి. వీరు 1877-వ సం. జూలై 19-వ తేదీని కాలముచేసిరి. తదనంతరము ప్రీవీ కవున్సిలువారు ఎస్టేటు భాగార్హ మని తీర్పుచేసిరి.



ఇందలి అప్పారావు కుటుంబములోనివారి నామములు చిత్రపటముల వివరణమున చూచునది

నొందెను. అటుపైన తనకు కలిగిన అన్యాయమును విశదపఱుచుకొనఁగా అందులకు మదరాసు గవర్నమెంటువారు సమ్మతించి ఇదివఱకు చేసిన రెండుభాగములను రద్దుపఱిచి మూఁడుభాగములు చేయుటకు అనేకప్రయత్నములు చేసిరి గాని తుదకు కొనసాగలేదు. అప్పుడు ఉభయులతో చెప్పి బలాత్కారముమీఁద అలవెన్సు ఇప్పించిరి. నిడుదవోలు ఎస్టేటులోనుండి తంగెళ్లమూడి ఎస్టేటును నూజవీడు ఎస్టేటులోనుండి చేవెంద్రముతాలూకాను ఇచ్చివేయఁబడెను. నరసింహాప్పారావుగారి పెద్దకుమారుఁడగు సింహాద్రి అప్పారావుగారికి తంగెళ్లమూడి ఎస్టేటు వచ్చియుండెను. వారికి పుత్రసంతతి లేనందున వారియనంతరము వారి దౌహిత్రులగు వేంకటగిరిమహారాజుగారి పెద్ద కుమారునికి సంక్రమించుటచే వారు ప్రస్తుతము అనుభవించుచున్నారు. మూఁడవ కుమారులగు వేంకటాద్రిఅప్పారావుగారికి చేవెంద్ర రావిళ్ల వచ్చియుండెను. వారి కుమారులే శ్రీ రాజా పార్థసారథి అప్పారావుగారై యున్నారు. వీరు స్వప్రయోజకత్వముచేత మాతామహుల యాస్తి యగు పాలవంచ భద్రాచలము ఎస్టేట్లను సంపాదించుటయే కాక నిడుదవోలు ఎస్టేటులో మూఁడవ భాగమునకు వ్యాజ్యెము తెచ్చి ప్రీవీకవున్సిలులోఁ గడచిన జూలై నెలలో డిక్రీని పొందియున్నారు. వీరి పెద్దకుమారులు శ్రీ రాజా నారయ్యప్పారావుగారు. రెండవ కుమారులగు శ్రీ వేంకటరామయ్య అప్పారావుగారు కొద్దిమాసముల క్రిందట పరలోకగతులైనారు. పెద్దకుమారులగు శ్రీ రాజా నారయ్యప్పారావుగారికి ముగ్గురు పుత్రులు గలరు.

శనివారపుపేటలో పెద్దన్నగారగు శ్రీ రాజా వేంకటనరసింహ అప్పారావు బహద్దరుగారు 1827-వ సం. జూను 5వ తేదీని కాలధర్మము నొందిరి. వారికి పుత్రులు లేనందున చిన్నతమ్ముఁడగు నరసింహాప్పారావుగారి ద్వితీయపుత్రులగు నారయ్యప్పారావుగారిని *దత్తుచేసికొనిరి. వారికిని పుత్రులు లేనందున తన భార్యలగు శ్రీ చిన్నమ్మారావు, పాపమ్మారావు గార్లకు పుత్రస్వీకారమునకు అనుజ్ఞ యిచ్చి 1864-వ సం.న పరలోకగతులైరి. చిన్నమ్మారావుగారు కాలముచేసిన తరువాత పాపమ్మారావుగారు ప్రథమములో నూజవీడు భాగస్థులలో నొకరైన మేడూరు జమీందారగు వేంకటరామయ్యప్పారావుగారిని, వారి యనంతరము వారి మైనరు కుమారునిన్ని దత్తుచేసికొనిరి. ఆ పిల్లవాఁడును వారి జీవితకాలములోనే కాలముచేసినందున, పాపమ్మారావుగారి యనంతరము వారసులగు శ్రీ రాజా పార్థసారథి అప్పారావుగారికిని, నూజవీడు సంస్థానములోని ఉయ్యూరు ఎస్టేటు జమీందారులగు శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారికిని, మీర్జాపురము జమీందారులగు శ్రీ రాజా వేంకటనరసింహాప్పారావు బహద్దరుగారికిని సమానభాగములు వచ్చియున్నవి.

* వీరు అప్పుడు మైనరు అగుటచే 1835-వ సంవత్సరమువఱకు ఎస్టేటు కోర్టాఫ్ వార్డ్సు పరిపాలనలో నుండెను. ఋణము అధికమగుటచేతను, గవర్నమెంటు పన్ను చెల్లింపక పోవుటచేతను, గుండుగొలను పెంటపాడు పరగణాలు 1843-వ సం. లో వేలమువేయఁబడెను. 1851-వ సంవత్సరమందు పన్నుబాకీనిమిత్తము వేలమువేసి గవర్నమెంటువారే కొనిరి. తిరిగి కనికరించి 1860-వ సంవత్సరమున జమీందారునకొసంగిరి.

నూజవీడులో ప్రభుత్వము చేయుచున్న రామచంద్రప్పారావుగారు 1814-వ సంవత్సరములో పరలోకగతులైరి. వారి కుమారు



లగు శ్రీ రాజా శోభనాద్రి అప్పారావు బహద్దరుగారు అప్పటికి ఐదు సంవత్సరముల వయస్సు గలవారగుటచేత వారి మైనారిటీ వెళ్లువఱకు ఎస్టేటును కోర్టుఆఫ్ వార్డ్సువారు పాలించిరి. వారు 1831-వ సంవత్సరమున ఎస్టేటు స్వాధీనపఱుచుకొని త్యాగభోగశీలులై ప్రజారంజకముగ ప్రభుత్వము చేసి 1868-వ సంవత్సరము అక్టోబరు 18-వ తేదీని పరలోకగతులైరి. వీరు భీమడోలు ముఠా గ్రామములను కొనిరి. వీరికి ఏడుగురు కుమారులు.—

1. శ్రీ. రాజా నారయ్యప్పారావు బహద్దరుగారు. వీరు 1868-వ సం. మొదలు బహుదర్పముగ పరిపాలనచేసిరి. ఎస్టేటును పరిపాలన చేయుటలో మిక్కిలి సమర్థులని ప్రఖ్యాతి పొందిరి. వీరు ప్రభుత్వము చేయుచుండఁగనే వీరి తమ్ములు ఎస్టేటును భాగింపవలసినదిగా వ్యాజ్యెము తెచ్చిరి. కాని వారు జీవించియుండునంతవఱకును జిల్లా, హైకోర్టులలో భాగమునకు అర్హత లేదని తీర్పు కాఁబడెను. వీరి కాలములోనే రాజధాని యగు నూజవీడుపురమును బాగుపఱిచినారు. రోడ్లు వేయించి, చెఱువులు త్రవ్వించి, పట్టణపు వైఖరికి తెచ్చినారు. అగిరిపల్లి పర్వతముమీఁద కెంచేసియుండు కుటుంబముయొక్క యిష్టదైవమగు శ్రీ శోభనాచలపతిస్వామివారి దేవాలయము సోపానములు గట్టించిరి. వీరు 1877-వ సం. జూలై 19-వ తేదీని కాలముచేసిరి. తదనంతరము ప్రీవీకవున్సిలువారు ఎస్టేటు భాగార్హమని తీర్పుచేసిరి.

ఆ తీర్పు ననుసరించి 1882-వ సంవత్సరములో భాగము పంచువఱకును ఎస్టేటు కోర్టాఫ్ వార్డ్సువారి స్వాధీనములో నుంచఁబడినది. శ్రీ



శ్రీ రాజా నారయప్పారావు బహద్దరుగారు

ముగ్గురు కుమారులును వీరివంతునకు వచ్చిన ఆఱవ భాగ మగు వెంట్రప్రగడ ఎస్టేటును తిరిగి మూడు భాగములుగ పంచుకొనిరి.



i శ్రీ రాజా రాజగోపాల అప్పారావు బహద్దరుగారు. వెంట్రప్రగడ యెస్టేటు జమీందారులు. వీరు నిస్సంతుగా 1793-వ సం. జూలై 13-వ తేదీని కాలముచేయుటవలన వారి "వియలు" ప్రకారము వారి తమ్ముల కుమారు లగు శ్రీ రాజా సింహాద్రి



అప్పారావు బహద్దరుగారు ప్రస్తుతము ఎస్టేటుకు ప్రభువులై యున్నారు.



ii శ్రీ రాజా రామచంద్ర అప్పారావు బహద్దరు గారు, ముసునూరు ఎస్టేటు జమీందారులు. వీరు 1909-వ సం. మే 4-వ తేదిని కాలము చేసినందున వీరి జ్యేష్ఠపుత్రు లగు శ్రీ రాజా నారయ్యప్పారావు బహద్దరుగారు ఎస్టేటును వ్యవహరించుచున్నారు. రెండవ కుమారులు వెంట్రప్రగడ జమీందారు లని పైన వ్రాసియున్నాము. మూడవ కుమారు లగు శ్రీ రాజా రాజగోపాల అప్పారావు గారు బాలు రగుటచేత విద్య నభ్యసించుచున్నారు.

iii శ్రీ రాజా వరదరాజ అప్పారావు బహద్దరుగారు. వీరు గన్నవరము ఎస్టేటు జమీందారుగారు. వీరికి పుత్రసంతతి లేదు. ఇరువురు పుత్రికలు కలరు.

2. శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారు. వీరు మొదటి నుండియు అన్నగారియందు విశేషానురాగము గలవారై యుండిరి. శాస్త్రీ భాషయందు పాండిత్యము గలవారు. "మహానమా" అను పారసీకగ్రంథమును ఆంధ్రీకరించిరి. వీరు అధికధార్మికు లనియు భూతదయ గలవా రనియు ప్రఖ్యాతి గాంచిరి. వీరు నూజవీడు సంస్థానపు జనుల యుపయోగము నిమిత్త మొక హైస్కూలును నూజవీడునందు స్థాపించిరి. బెజవాడలో వికలాంగులకు ప్రతిదినమును అన్నము పెట్టుట కేర్పాటుచేసిరి. వీరి సత్కార్యములును పరోపకారచింతయు గవర్నమెంటువారు కనిపెట్టి వీరికి "రాజా" అను బిరుదు నొసంగిరి. వీరు 1906-వ సంవత్సరము జూలై 20-వ తేదీని పుణ్యలోకప్రాప్తిని పొందిరి. వీరికి పుత్రసంతానము లేనందున వీరి తమ్ముని కుమారులును కపిలేశ్వరపురము జమీందారులును అగు శ్రీ రాజా వేంకటరంగయ్యప్పారావు



శ్రీరాజా రంగయప్పారావు బహద్దరుగారు



3. శ్రీ రాజా వేంకటజగన్నాథ అప్పారావు బహద్దరుగారు. వీరు తండ్రిగారు సజీవు లయి యుండఁగనే హైదరాబాదులో కాలము చేసినారు. వీరు ప్రబలబలాఢ్యు లని శూరు లని ఖ్యాతి పొందిరి. వీరు వివాహము కాకపూర్వమె గతించినందున ఎస్టేటులో భాగము పంచుకొనియుండలేదు



బహద్దరుగారి జ్యేష్ఠపుత్రు లైన శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారిని 1902-వ సం. లో దత్తత చేసికొనియున్నారు. వీరు మైనరు అగుటచేత ఎస్టేటు ఇంకను కోర్టాఫ్ వార్డ్సువారి క్రింద నున్నది. వీరికి నిడుదవోలు ఎస్టేటులో మూఁడవ భాగమే గాక మేడూరు ఎస్టేటులో రెండవ వంతు కూడ మిర్జాపురము జమీందారుగారితో పాటు ఇయ్యఁగలందులకు ప్రీవీ కవున్సిలువారు తీర్మాన మిచ్చియున్నారు. శ్రీ మైనరు రాజాగారు రాఁబోవు ఏప్రియలు 29-వ తేదీని మేజరు అయ్యెదరు.



4. శ్రీ రాజా వేంకటనరసింహ అప్పారావు బహద్దరుగారు. వీరు మిర్జాపురము ఎస్టేటు జమీందారుగారు. 1881-వ సంవత్సరమందు ఎస్టేటును భాగించి తమ యారవ భాగము నిప్పించవలసినదిగా వ్యాజ్యము తెచ్చి, ప్రీవీ కవున్సిలులో తుదకు జయమును పొందినవారు

వీరే అయియున్నారు. వీరికి నిడుదవోలు ఎష్టేటులో రాజా పార్థ సారధి అప్పారావుగారితో మూడవ భాగమును అన్న శ్రీ రాజా రంగయ్యాప్పారావు బహద్దరుగారితో పాటు మేడూరు ఎష్టేటులో రెండవ భాగమును వచ్చియున్నవి. వీరు 1911-వ సంవత్సరము మే 13-వ తేదీని పరలోకగతు లయిరి. పెద్ద కుమారు లగు శ్రీ రాజా వేంకట రామయ్యాప్పారావు బహద్దరుగారును రెండవ కుమారు లగు శ్రీరాజా శోభనాద్రి అప్పారావు బహద్దరుగారును మైనరు లగుటచే ఎష్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సువారు పరిపాలించుచున్నారు.



5. శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు. వీరు కపిలేశ్వరపురము.ఎష్టేటు జమీందారులు. వీరు కూడ భాగమునకై అన్నగారిమీఁద ప్రత్యేకముగ వ్యాజ్యెము తెచ్చిరి. కాని ప్రీవీ కవున్సిలు తీర్పు రాకపూర్వమే గతించిరి. వారి కుమారు లగు శ్రీ రాజా వేంకట రంగయ్యాప్పారావు బహద్దరుగారు అప్పటికి మైనరు అయినందున ఎష్టేటు కోర్టాఫ్ వార్డ్సువారివలన పరిపాలింపఁబడి 1894-వ సంవత్సరము శెప్టెంబరు 9-వ తేదిని ఒప్పగింత చేయఁబడినది. వీరి ముగ్గురు పుత్రులలో జ్యేష్ఠులను ఊయ్యూరు రాజాగారికి దత్తు ఇచ్చినారు. రెండవ కుమారు లగు శ్రీ రాజా శ్రీమన్నారాయణప్పారావు బహద్దరుగారును, మూడవ కుమారు లగు శ్రీ రాజా శ్రీనివాస అప్పారావు బహద్దరుగారును చిన్న లగుటచే విద్య నభ్యసించుచున్నారు.

6. శ్రీ రాజా సింహాద్రి అప్పారావుగారు. వీరు తేలప్రోలు ఎష్టేటు జమీందారుగారు. వీరు బహుబలశాలు లని ధైర్యము కలవారని ఖ్యాతివడసిరి. వీరు 1889-వ సంవత్సరము నవంబరు 29-వ తేదిని పరలోకగతు లైరి. వీరి కుమారు లగు శ్రీ రాజా శోభనాద్రి అప్పారావు బహద్దరు జమీందారుగారు అప్పటికి కొన్నిమాసముల శిశువై యున్నారు. అందుచే చాలకాలము ఎష్టేటు కోర్టాఫ్ వార్డ్సువారి



శ్రీ రాజా సింహాద్రి అప్పారావు బహద్దరుగారు

స్వాధీనములో నుండి 1910-వ సం. ఆగష్టు 31-వ తేదిని శ్రీ రాజా గారికి అప్పగింత చేయఁబడినది. వీరు సర్వజనోపయుక్త మగు గోషా ఆసుపత్రిని నూజవీడునందు కట్టించుచున్నారు. వీరి సోదరీమణిగారు శ్రీ పిఠాపురము దత్తకుమారరాజాగారి జ్యేష్ఠపుత్రుల జనానావారై యున్నారు. వారికిఁగాను తమ యెష్టేటులో ఇరువదివేలు చెల్లు పాములపాడు అను గ్రామమును సమస్తమైన హక్కులతోను ఇచ్చియున్నారు.



7. శ్రీ రాజా వేంకటరామయ్యాప్పారావు బహద్దరుగారు. వీరు మేడూరు ఎష్టేటు జమీందారులు. నూజవీడు ఎష్టేటులో ఆఱవ

The Kondapalli Fort




కొండపల్లి దుర్గము

Gopura of Ranganayaka, Nellore



రంగనాయకుల గాలిగోపురము, నెల్లూరు

The Town Hall, Nellore



నెల్లూరు పురమందిరము

The Depressed Classes School, Madras



పంచమజాతుల పాఠశాల, మదరాసు

Members of a Criminal Tribe



రక్షకసేనలోని దొంగజాతులవారు.

Salvation Army boys learning Sericulture



రక్షకసేనలో పట్టుపరిశ్రమను నేర్చుకొనుచున్న బాలురు.

Mr. Nunjundayya, Councillor



శ్రీ కౌన్సిల్లరు నంజుండయ్యగారు, మైసూరు

Pro. D. K. Karve





ప్రొఫెసర్ డి. కె. కర్వేగారు

Mr. S. Hanumanta Rao



శ్రీ. శి. హనుమంతరావు గారు

Mr. V. Suryanarayana Rao



వల్లూరి సూర్యనారాయణ రావుగారు

**Rao Bahadur S. V. Narasimha Rao.**



రా॥ బ॥ ఎస్.వి.నరసింహరావుగారు.

**Mr. T. V. Venkata Rama Iyar.**



టి.వి.వేంకట రామయ్యరుగారు

**Mr. A. Kondappa.**



అయలినేని కొండప్పగారు

**Dr. K. Gopala Rao**



డా. గోపాలరావుగారు

**Mr. Tennety Suryanarayana**



టెన్నేటి సూర్యనారాయణగారు

**Dr. K. Ahobala Rao.**



కో॥ డా॥ అహోబలరావుగారు



# శ్రీమత్త్యాగరాజచరిత్రము

హరి నాగభూషణముగారు, బి. ఏ.

చదువరులారా! నా భాగ్యమే కదా భాగ్యము. ఎవరు ప్రపంచస్వరూపుండును, బ్రపంచనిలయుండును నగు శ్రీ పరమేశ్వరుని యంశచే జన్మించి ప్రపంచంబునకు సుస్థితిఁ గల్పింతురో యట్టి మహనీయుల గోష్ఠి మనోవాక్కాయకర్మంబుల సల్పుటయే మనుజుని ముఖ్యకర్తవ్యము. ఇపుడు శ్రీ పరమేశ్వరాంశాసంభూతుఁడై జగంబు నుద్ధరించిన మహామహస్సంపన్నుఁడగు శ్రీమత్త్యాగబ్రహ్మముయొక్క చరిత్రను నివేదించు భాగ్యము నాకుఁ గల్గుటచే నేను మిగుల ధన్యుఁడను.

ఈ మహామహుం డవతరించిన స్థలము ముముక్షుజనాలయం బగు పంచనదక్షేత్రము (తిరువయ్యారు). ఆ పుణ్యక్షేత్రంబున,

ఉ. నాలుగు శాస్త్రము ల్బహుళనైపుణి నేర్చి కవిత్వసంపదల్
మేలుగఁ దన్వరింపఁగ భళీ యని కంజదళాక్షుకీర్తనో
న్మీలితచిత్తుఁడై కరగ మమేయవిలక్షణభక్తిఁ గల్గు శో
భాలసనంబు లుప్పతిలఁ బావనుఁడే గిరిరాజు రాజిలెన్.

ఈ భాగవతోత్తమునకు జనించిన మైనుగురు పుత్రులలోఁ గనిష్ఠుండు రామబ్రహ్మ మను పేరఁ బరఁగుచుండె. ఈతఁడు భిక్షుకజీవనాలంబకుఁడై మహాభక్తిపరతంత్రతఁ గాలము గడుపుచుండె. ఇంతలో

ఉ. దేవమునీంద్రకోటికి నిదే ముద మొప్పఁగఁ జేతు నంచు నా
పావనమూర్తి శంకరుఁడు పద్మవిలోకను ధ్యాననిష్ఠమైఁ
జేవ వహించు రామసరసీరుహజన్మున కుద్భవించె ధ
ర్మావనశీలనుం డగుచు నార్తశరణ్యుఁ డుమాధవుం డిలన్.

ఈ బాలునకు రామబ్రహ్మము ఆ గ్రామమందు వెలసిన శ్రీత్యాగరాజేశ్వరుని నామం బిడె. ఈ ముద్దులపట్టి స్వభావజనిత తేజోవిరాజమానుఁడై దినదినప్రవర్ధమానుఁడై యైదారేడుల ప్రాయము రాఁగానే సంస్కృతాభ్యాసము సేయఁగడంగి తద్విద్యాపారగుఁడైనంత నుపనీతుఁ డాయె. అంత వేదాభ్యాసము సేయ మొదలు పెట్టె. అట్టియెడ

ఉ. మాటల నాడుచు న్గురుని మౌనముమై భజియించునప్పుడుం
బాటవ మూని సంస్కరణపద్ధతుల న్నెఱవేర్చు వేళలం
బాటల నాటలం జరుపు పట్ల మతింపని నైన రామునే
చాటుచునుండె భావమునఁ జైద్యము వోవఁగ నిశ్చయుక్తుఁడై.

ఇట్లు వేదశాస్త్రాభ్యాసపరిపక్వమనంబున రామధ్యానమరందపానమత్తుఁడై,

ఉ. నోరది నొవ్వ రాముని వినూత్నపుఁ బ్రేమ భజించి మోద మే
పారఁగ ధర్మసంభృతివశాత్మక మెంతయు గాన మంచు లో
నారసి గాన మభ్యసన మందఁగఁ గోరుచు లక్ష్యలక్షణో
దారులు నేరు నాకు గురుధర్మముఁ జూపుదు రంచు నెంచెడున్.

అంతటఁ గుశీలవశేఖరుండును భాగవతోత్తముండును నగు శొంఠి వేంకటరమణయ్య యను నాంధ్రునియొద్ద నొక సంవత్సరంబులోన సమగ్రంబుగ సంగీత మభ్యసించి తదభినవపాండితీభరంబు నంతయు రామసమర్పితంబుఁ జేయుచుండఁగా,

మ. ఈ విధంబునఁ ద్యాగరాజు మహేశుమూర్తిని నొప్పెఁ ద
ద్భావభృంగము మామనోహరపాదపంకజవర్తిగా
న్భావనాత్ముఁడు ధీయుతుండు వినమ్రశీలవిరాగి యొం
డా వశంవదచిత్తుఁ గాంచి ముదాతిరేకతఁ బల్కెడున్.

తే. సానఁ బట్టంగఁ దేజోవిశాల మగుచుఁ
దనరు మానికమును బోలె దైవభక్తి
పూజ్య మగు నీదు గానంబు పూర్ణ మగుచు
వెలయు రామతారకమంత్రవిలసనాప్తి.

అని యా భాగవతశిఖామణి శ్రీమత్త్యాగరాజునకు రామ మంత్ర ముపదేశించి చనియె. తదాది శ్రీ రామమంత్ర ముపదేశవిధానము ననుసరించి 96 కోట్ల నామమును జపింపఁగా నొక రాతిరివేళ,

చ. అమృతముఁ జిల్కు మోమును భయార్తిఁ గలంగు శ్రితాళిఁ బ్రోచుహ
స్తము, సురబృందశీర్షమణిసాంద్రమహాస్ఫురణంబు పాదయు
గ్మము, కరుణావిలోకసితకాంతి ధరించి వరించి రామమూ
ర్తి మనమునం బ్రసన్నుఁ డయి దీవన లీయఁగ డంగె నాతనిన్.

శ్రీ రామచంద్రుఁడు ప్రసన్నుఁ డగుటతోడనె సుధామాధురీధురీణం బగు కవితావనితామతల్లి కూడ నాతనికి సాక్షాత్కరింప, మృదుమధురవాక్సుగుంభముల ననేకకీర్తనంబుల స్తుతిఁ జేయఁగడఁగె. ఇది మొదలుగా శ్రీ రామచంద్రునే మనంబున నిడికొని సర్వకాలసర్వావస్థలయందును మఱియొక చింత లేనివాఁడై వాని లీలల ననేకవిధంబులఁ బొగడుచుండ, నా పొగడ్త లన్నియు ననిర్వాచ్యభావసంపూజ్యంబు లగుటచే గేయకల్పనలుగాఁ బరిణమించుచుండె. ఎట్లన.—

హరికాంభోజి రాగము - రూపకతాళము

ప. ఉండేది రాముఁ డొకఁడు - ఊరక చెడిపోకె మనసా!
అ. చండమార్తాండమధ్య - మండలమునను వెలుఁగుచు-నుండేది.
చ. కామసాదిగుణరహితుఁడు - ధర్మాత్ముఁడు సర్వసముఁడు
క్షేమకరుఁడు త్యాగరాజ-చిత్తహితుఁడు జగము నిండి-యుండెడి

ఇట్టి యనన్యప్రపత్తిపారావారతరంగరంగద్హృదయారవిందుం డై తన సంగీతపాండితిని సార్థకంబు చేయుచున్నంత నాతని భక్తిపారతంత్ర్యనిష్ఠం బగు గానవైదగ్ధ్యంబును బరీక్షించి యాతనికీర్తి దిగంతవిశ్రాంతము సేయ నెంచి నిరుపమానసమాధినిష్ఠాగరిష్ఠుఁ డగు నారద మహాముని సన్యాసివేషధారి యై వచ్చి యాతనిని బరీక్షించి తదనంతరము 'స్నానాదివిధుల నాచరించి యిదె వచ్చి భిక్షఁ గైకొందు' నని చెప్పి మఱలిపోయె. పిమ్మట సన్యాసికై యెంత తడవు వేచినను రాకున్న మిగుల వగఁ జెంది యా దిన మంతయు నుపవాసము సేసి శయనించునంత,

ఉ. వీణను జేతఁ బూని తన వీనుల కింపు జనింపఁ బాడుచు
న్గానఁగనాయె నారదుఁడు కంజదళాక్షుని కీర్తనంబుచే
మేను గరంగువాఁడు మధుమిశ్రితవాక్చతురుండు మించురూ
పూనెడువాఁడు గానమున నొజ్జయు నబ్జభవాత్మజుం డొగిన్.

ఇట్లు నిద్రాయోగంబునఁ గానుపించి మధువు సోనల నీను వాగ్విలాసంబుల నిట్లనియె.—

మ. యతివేషంబును దాల్చి నీకడకు నే నాతిథ్యముం గోరి వ
చ్చితిఁ బ్రాతస్సమయంబున న్మధురసచ్ఛ్రీ లొల్క నీ గానమం
దతిమోదంబును బొందినాఁడఁ దగు దీ వా విద్యనుం బ్రోచి యీ
క్షితినిం దోఁచెడు దోషసంగతులకు స్నేహంబు సేకూర్పఁగన్.

అని చెప్పి యొక పొత్త ముతనికి నందిచ్చి నారద మహాముని యంతర్హితుఁ డాయె. అంతట నా పొత్త మందుఁ గల సంగీతసంప్రదాయముల నెఱింగి యా నారదునిఁ దనకు గురువుగా భావించి యెల్లకాలం బా మహానుభావుని చారిత్రంబు స్మరించుకొని యమితా నందపరవశుం డగుచుండె. ఎట్లన.—

దర్బారురాగము - ఆదితాళము

ప. నారదగురుస్వామి!-యికనైన-నన్నాదరింప వేమి?-కోదు వేమి?
అ. సారెకు సంగీతయోగనైగమ - పారంగతుఁ డైన పరమపావన!
చ. ఇతిహాసపురాణాగమచరితము - లెవరివల్లఁ గలిగె?
పతిని దానమీయ బుద్ధి సత్య - భామ కెటులఁ గలిగె?
ద్యుతిజితశరదభ్ర! నిను వినా మది - యతుల కెటులఁ గలిగె?
క్షితిని త్యాగరాజవినుత! నమ్మితి-చింతదీర్చి ప్రహ్లాదునిఁ బ్రోచిన-
నారద.

ఇటుల నా జన్మముక్తుం డగు త్యాగరాజు భక్తి పరవశుఁ డై గేయకల్పనలు వేనవేలుగ రచించుచుండ, నాతని కీర్తినిగుఱించి వినినవాఁ డై సంగీతసాహిత్యవిద్యా సన్మానాయత్తచిత్తుం డగు తంజాపూరు మహారాజు ఆ మహామహుని గానంబు విననెంచి యనేకప్రకారంబుల ననునయపూర్వకంబుగఁ గబురులుపంపఁ ద్యాగరా జా రాజమౌళి గౌరవంబు నిచ్చగింపనివాఁ డై యీ తీరున నుత్తర మొసఁగె.—

కళ్యాణిరాగము - చాపుతాళము

ప. నిధి చాల సుఖమా? రాముని స
న్నిధిసేవ సుఖమా? నిజముగఁ బల్కు మనసా?
అ. దధినవనీతక్షీరములు రుచో? దాశ
రథి ధ్యానభజనసుధారసము రుచో?
చ. దమశమ మను గంగాస్నానము సుఖమా? క
ర్దమదుర్విషయకూపస్నానము సుఖమా?
మమతాబంధనయుతనరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా?

రాజసన్మానంబుల సైతము తృణముకంటె హీన ముగాఁ జూచు వైరాగ్యముతోడ నిరంతరపరంతపోభాస మానుఁడై సదా శ్రీరామధ్యానమకరందపానసంరంభుఁడై జన్మము గడ తేర్చుచుండె. శ్రీరామనామసంకీర్తనమం దా మహానుభావున కెంత రుచి యుండెనో చూడుఁడు.—

ఖరహరప్రియరాగము - ఆదితాళము

ప. రామా! నీయెడ ప్రేమరహితులకునీ-నామరుచి తెలియునా?ఓసీతా.
అ. కామినీవేషధారికి సాధ్వినడత-లేమైనఁ దెలియునా?-ఆరీతి సీతా.
చ. తన సౌఖ్యము తా నెఱుఁగక యొరులకుఁ-దగు బోధన సుఖమా?
ఘనమగు పులి గోరూప మైన-త్యాగరాజనుత! శిశుపాలు గల్గునా?

ఇట్టి నిరంతరప్రపత్తితోడ శ్రీరాముఁ బూజించుచుండ నాతని కనేకులు శిష్యులై తమ జన్మంబులఁ దరించు యతనంబుల సల్పుచుండిరి. ఇటు లమనస్కరాజయోగవైభవంబున జన్మసిద్ధి నొంది తమ యవతార మిట్టి దని జనుల కుద్బోధించుచు త్యాగరాజుగారు కలియుగాది 4948-వ సంవత్సరము పుష్య బహుళ పంచమి నాఁడు పరమపదము నొందిరి. ఈయన సుమారు 80 వత్సరములు జీవయాత్ర గడపిరి. వారికిఁ బుత్రసంతానము లేకుండె. స్త్రీసంతానము ద్వారా వంశము కొంతవఱకు సాగి యంతరించె. ఈ సందర్భమున శ్రీ త్యాగరాజుగారి యవతారప్రాధాన్యముం గూర్చి ముచ్చటించిన బాగుండును. తన యవతారమును గూర్చి యాతఁడు తనంత తా నేమి నుడివెనో చూచెదముగాక.

తోడిరాగము - ఆదితాళము

ప. దాశరథే! నీ ఋణముఁ దీర్ప నా-తరమా? పరమపావననామ!
అ. ఆశ దీఱ దూరదేశములను బ్ర-కాశింపఁజేసిన రసికశిరోమణి!
చ. భక్తి లేని కవిజాలవరేణ్యులు-భావ మెఱుఁగలే రని కలిలోనఁ జ
భుక్తి ముక్తి కల్గు నని కీర్తనముల-బోధించిన త్యాగరాజకరార్చిత!

హే దాశరథే! దిగంతవిశ్రాంత మగు కీర్తిని నా కొసంగిన నీయొక్క ఋణము నేను దీర్చుకోఁగల్గుదునా? తండ్రీ! సరిసరి. నీవు నాకు యశోధనము నిచ్చియుండ, నేను నీకు ఋణగ్రస్తుండ నగుట తగునా? వేదవేదాంతాగమంబుల నన్నిటిం జదివి కవు లయ్యు, ననగాఁ బండితు లయ్యు నీయొక్క భావ మెఱుఁగలేక యధోగతిఁ జెందుచుండ, వారికి నీ నామసంకీర్తనం బను పీయూషంబు నొసంగి వారి జన్మములఁ గడ తేర్చుటకుఁ గదా నే నీ కలియుగంబున జన్మమొందినది. దానంజేసి మద్గేయకల్పనల నట్టి పండితంమన్యులకు నీయొక్క భక్తి

తంత్రంబు నివేదించినాఁడ. నా కీర్తనలు పాడుటచే నట్టి యహంకరణప్రధానుల కిహంబున భుక్తియుఁ బరంబున ముక్తియు సంభవించు. ఇందుకు సందియము లేదు. కాన నో శ్రీరామచంద్రా! నీవు నాకుఁ బరమభక్తుం డనియు గాయకశ్రేష్ఠుం డనియుఁ గీర్తిని గల్పింప, పరమపావననాముఁడ వగు నీ భక్తితత్వంబు వెదఁజల్లి నీ లీలల నభివర్ణించు కృతుల నేనును నీకు యశంబుఁ గల్పించియున్నవాఁడ. కాన నీకు నేను ఋణవిముక్తుఁడ నైతిని.——అను నిందాగర్భితస్తుతి నీ కృతియం దిమిడ్చి తన యవతారకారణంబు నుడివియున్నాఁడు.

అవతారకారణం బరసినపిమ్మట నద్దాని విశేషంబుల నరయుదుముగాక! అందునుగూర్చి త్యాగరాజు గారి సాక్షాచ్ఛిష్యులలో ముఖ్యశిష్యు లగు కుప్పయా వేంకటరమణభాగవతులవా రిట్లు చెప్పుచున్నారు.——

శ్లో. వ్యాసో నైగమచర్చయా, మృదుగిరా వల్మీకజన్మా మునిః,
వైరాగ్యే శుకఏవ, భక్తివిషయే ప్రహ్లాద ఏవ స్వయం,
బ్రహ్మనారద ఏవ చాప్రతిమయో సాహిత్యసంగీతయో
యో రామామృతపాననిర్జితశివ స్తం త్యాగరాజం భజే.

తా. వేదవేదాంతార్థంబుల నిరూఢిఁ దెల్ప వేదవ్యాసుండును, మృదుమధురవాగ్ఝరీవిలాసంబుల వాల్మీకియు, వైరాగ్యశీలంబున శుకుండును, భక్తివిధానంబునఁ బ్రహ్లాదుండును, విద్యావిశారదత్వంబున శారదామనోహరుండును, సంగీతవిద్యాపరిణతియందు నారదుండును, రామామృతపానసంరంభంబున శ్రీపరశివుండును నగు శ్రీత్యాగరాజసద్గురువును నమస్కరించువాఁడ.

ఈ విశేషణంబు లామహానుభావునం దెటు లన్వర్థంబు లాయెనో యతని గేయకల్పనంబుల యర్థంబులఁ గొంత పరిశీలించి చూతము.

1 వ్యాసో నైగమచర్చయా

దేవామృతవర్షిణిరాగము - ఆదితాళము.

ప. ఎవ రని నిర్ణయించేదిరా? ని - న్నె ట్లారాధించేదిరా? నరవర!
అ. వుఁ డనో మాధవుఁ డనో కమలా-భవుఁ డనో పరబ్రహ్మ మనో?
చ. శివమంత్రమునకు మ జీవము, మా
ధవమంత్రమునకు రా జీవము; ఈ
వివరము దెలిసిన ఘనులకు మ్రొక్కెద
భితరణగుణ! శ్రీత్యాగరాజనుత! - ఎవ రని.

ఈ కృతియందుఁ దన కుపాసనాదైవం బగు శ్రీరాముని స్వరూపతత్వము నివేదించువాఁడు. అట్లు తెలియఁజేయ నెంచి తన యవతార యాథార్థ్యమును దెలియఁజేయవలసినదిగా శ్రీరామునే ప్రశ్నించువాఁడు.

"ఓరామా! నీ వెవరుగా నిర్ణయింతు? ఎవరుగా నిర్ణయించి తన్నిర్ణయానుసారముగాఁ బూజింతు? నీవు శివుఁడవా, మాధవుఁడవా, కమలాభవుఁడవా, లేక త్రిమూర్త్యాత్మకస్వరూపి యగు పరబ్రహ్మవా?" ఇట్లు ప్రశ్నించి యా ప్రశ్నకుఁ దానే యుత్తర మొసఁగువాఁడు. "నారాయణమంత్రమునకు బీజం బగు రా యను నక్షరమును శివపంచాక్షరీమహామంత్రబీజం బగు మకారంబుతోఁ గూర్చిన రామ యను శబ్ద మగును. ఈ వివరముఁ దెలిసి రాముని భజించువారు నిర్గుణపరబ్రహ్మోపాసనోన్ముఖు లగు యోగివర్యులు కాన వారికి మ్రొక్కెద" నని చెప్పుచున్నాఁడు. అనఁగా నేమి? "రాముఁ డనఁగా దశరథాత్మజుఁ డగుటంజేసి మనుష్యమాత్రుఁ డని యెంతు రేమో? అటు గాదు. రాముఁ డనఁగా త్రిమూర్త్యాత్మకపరబ్రహ్మ మనియుఁ, త్రిగుణాతీతుఁ డనియు, చైతన్యస్వరూపి యనియు నెంచి యట్టి నిరాకారనిరంజనసచ్చిదానందవిగ్రహు నాదోపాసనచేఁ బూజించు మహానుభావులు కేవలము అమనస్క-సాంఖ్య యోగులు కాన నట్టివారు నాకు వందనీయులు" అని యీ కృతి యర్థము.

కళ్యాణిరాగము - ఆదితాళము.

ప. ఏతావునరా నిలుకడ నీకు? - ఎంచి చూడ నగపడవు.
అ. సీతాగౌరీవాగీశ్వరు లను - స్త్రీరూపములందా? గోవింద!
చ. భూకమలార్కానిలనభములందా?-లోకకోటులందా?ఇందఱిలోన
శ్రీకరుఁ డగు త్యాగరాజకరార్చిత!-శివమాధవబ్రహ్మదులయందా?

తా. "హే రామా! నీ వవాఙ్మానసగోచరుఁడవు. అందుచే నీ స్థితి యెట్టిదో నేఁ దెలియఁజాలకున్నాను. నీ కెయ్యది యునికిపట్టయినది తెలియకుంటచే నీ స్వరూప మెట్టిదో తెలియ నెవరికిని తరముగా కున్నది. నీవు లక్ష్మీపార్వతీసరస్వతీస్వరూపముల నుందువా? అనఁగా నీవు స్త్రీరూపధారివా? లేక పృథివ్యాపస్తేజో వాయురాకాశమ్ము లను పంచభూతస్వరూపివా? లేక తత్పంచభూతా

త్మకం బగు ప్రపంచలక్షితుండవా? లేక పంచభూతాతీతు లగు బ్రహ్మవిష్ణుమహేశ్వరాదిస్వరూపనిష్ఠుండవా? తెలుపుము."

ఇచ్చటఁ గూడ తత్వదర్శనము ప్రశ్నరూపకంబు ననే కనఁబఱిచె. రాముఁ డనఁగా స్త్రీరూపంబుల స్త్రీరూపధారి యనియు, పంచభూతస్వరూపి యనియు, తత్పంచభూతాత్మకం బగు ప్రకృతి యనియు, తత్ప్రకృతి కంటెఁ బరుం డనియుఁ దాత్పర్యము. ఈకృతిలోని యర్థ మీ క్రింది భగవద్గీతార్థంబును బ్రతిపాదించుచున్నది.

శ్లో. యచ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున!
న త దస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్.

శ్లో. అథవా బహునై తేన కిం జ్ఞా తేన త వార్జున!
విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్.

ఇట్టి పరమాత్మతత్వనిర్ణయాత్మకంబు లగు కీర్తన లనేకంబులు గానవచ్చెడిని. వాని నన్నిటి నిచ్చట నుడివి యర్థంబుల విశదీకరింప నెంచుట సముద్రమును దెప్పకొయ్యతో దాటసమకట్టుటయే కాన నింతటితో నా విషయమును ముగించెద.

## 2. మృదుగిరా వల్మీకజన్మా మునిః

వాల్మీకి యనఁగా నెట్టివాఁడో ముందుగా నాలోచింతము.

శ్లో. కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలం.

అని కదా వాల్మీకి మనచే నుపాసితుం డగు. కవితాశాఖాశిఖ నధిరోహించి మధుమాధురీపరిభావదక్షం బగు రామాక్షరసముదాయంబు మంజులారావకందళన శోభితంబుగ గానంబుసేయు కోకిల గదా వాల్మీకి యనిన! "ఆరుహ్య కవితాశాఖాం" అనుటచే వాల్మీకి కవికులావతంసుఁ డనియు, "మధురం" "కోకిలం" అనుటచే వాని కవిత్వమునం గల మాధుర్యశోభ యింకెవని కబ్బంబుననైన దబ్బరయే యనియు, "మధురాక్షరం" "రామ రామ" అనుటచే నాతఁడు రామధ్యానసుధారసపానమత్త చిత్తుఁ డనియుఁ దాత్పర్యము. ఈ గుణము లన్నిటికిని బుట్టినిల్లు పుట్టినిల్లని చెప్పుట కుద్గ్రంథరాజం బగు శ్రీరామాయణాంశే సాక్షీభూతంబు. అట్టి రామాయణ గ్రంథంబుచే శ్రీరామచంద్రుని గుణకథనంబు సేసినవాఁడే మృదుగిరాశోభి యనందగుఁ గాని వేఱొండా విశేషణంబునకుఁ దగునా? అట్టి కవిజెట్టి వచఃపరిపాటియందు మన కథానాయకునికిఁ బోల్పఁబడుటచే నీతఁడు గూడ నట్టి సుగుణమణి వాణీవిలసితుండే యనందగు. అది యెట్టులో చూతము. శ్రీ త్యాగరాజు 24,000 గ్రంథం బగు శ్రీమద్రామాయణంబుతోఁ దులతూఁగునట్లు 24,000 కృతుల రచించియున్నాఁడు. శ్రీమద్రామాయణంబువలెనే ఈతని కృతులం దెచ్చటఁ జూచినను శ్రీరామచంద్రుని గుణకథనంబును వేదవేదాంతార్థబోధయు సమస్తధర్మ నిరూపణయు క్షీరసాగరంబున క్షీరకణంబులవలెఁ బరిఢవిల్లుచునుండు. ఇందున కుదాహరణంబు లగు కొన్ని కృతులఁ బేర్కొందము.

శ్రీరామగుణకథనము చూడుఁడు.

నీతిమతిరాగము - దేశ్యాదితాళము

ప. వాచా మగోచరమే మనసా! - వర్ణింపఁదరమే రామమహిమ?
అ. రేచారి మారీచునిఁ బడఁగఁగొట్టి- రెండోవాని శిఖి కొసఁగెనే.
చ. మానవతి మది యెఱింగి చా-మర మాట కర్త్రము సేయ కని
మానంబుకై మెడ దాచఁగ-మాధవుండు కని కరఁగి వేగమే
దీనార్తిభంజనుఁడై ప్రాణ-దానం బొసఁగ మును చనిన [మహిమ.
బాణంబు నటు చెదరఁజేయలేదా?- గానలోలత్యాగరాజనుతు

కాంభోజిరాగము - ఆదితాళము

ప. మా జానకి చెట్టఁబట్టఁగా! - మహారాజ వైతివి.
అ. రాజరాజ! వరరాజీవాక్ష! విను-రావణారి యని రాజిలు కీర్తియు.
చ. కాన కేగి యాజ్ఞ మీఱక మాయా-కార మునిచి శిఖిచెంత నేయుండి
దానవుని వెంటనే చని యశోక - తరుమూలను ఉండి
వానిమాటలకు కోపగించి కంట - వధియింపకయే యుండి
శ్రీనాయక! యశము నీకే కల్గఁ- జేయలేదా? త్యాగరాజపరిపాలా!

పతివ్రతాలలామం బగు సీతామహాదేవి తన పాతివ్రత్యమహిమచేతనే కామమోహితుం డగు రావణునిఁ గంటిచూపు మాత్రన భస్మీభూతునిఁ జేయఁజాలియు, దుష్టనిగ్రహప్రతిజ్ఞ పట్టిన శ్రీరామచంద్రునికే రావణ ప్రహారయశంబు రావలె నని యూరకుండె నని శ్రీమద్రామాయణంబున వ్రాయఁబడియుండె. ఈ యర్థమే పై కీర్తనయందు వ్రాయఁబడియె. ఇది దీని బాహ్యార్థము.

ఇంకొక్క విశేషము కలదు. "మా జానకి చెట్టఁబట్టఁగా మహారాజ వైతివి" "మాయాకార మునిచి"

"శిఖచెంతనే యుండి" ఇత్యాదివిషయంబుల యంతరార్థంబు గమనింపుఁడు. అధ్యాత్మరామాయణంబున సీతామహాదేవి యాంజనేయునికి శ్రీరామగుణకథనంబుఁ జేయుచు రామతత్త్వ మిట్టిదని నిరూపించె.

శ్లో. రామో నగచ్ఛతి నతిష్ఠతి నానుశోచ
త్యాకాంక్షతే త్యజతినో నకరోతి కించిత్
ఆనందమూర్తి రచలః పరిణామహీనో
మాయాగుణా ననుగతోహి తథా విభాతి.

రాముఁ డనఁగా నానందమూర్తియు నచలుండును బరిణామహీనుండు ననియు, మాయాస్వరూప యగు తన కూడికచే రామునియందు గమనాగమనాది కార్యంబు లుపలక్షితంబు లగుచున్న వనియు నీ శ్లోకార్థము. రాముఁ డనఁగా ప్రకృతికంటె పరుఁ డనియు, నాతని యోగమాయయే యీ వికారోపలక్షితం బగు ప్రపంచం బనియు నర్థము. జానకి చెట్టఁబట్టుటచే రాముఁడు మహారాజాయె ననుట యోగమాయాసమావృతుండగు రాముని జగదావిర్భావంబును సూచించు నీ పై శ్లోకార్థమునే ప్రతిపాదించుచున్నది. మఱియు "మాయాకార మునిచి" యనుటచే రావణుఁడు గైకొన్నది మాయాసీత యనియు ననఁగా రావణుని కామాదులను మోహం భావరించె ననియు "శిఖచెంతనే యునిచి" యనుటచే విద్యామాయ రామునియందే లీనంబైయుండె ననియు నర్థము.

ధర్మనిరూఢి చూడుఁడు.

నాటకురంజిరాగము - ఆదితాళము

ప. మనసు విషయనటవిటులకొసఁగితే-మా రామునికృపగల్గు నోమనసా!
అ. తన తలు పాకరింటికిఁ దీసిపెట్టి-శాఁ గుక్కలఁ దోలు రీతి గాదే?

ఈతని కవితావిజృంభణవిషయమై నేను వేఱుగా వర్ణింప నవసరము లేదు. ఏకృతిఁ జూచినను మృదుమధురాక్షరసమన్వితంబు గదా. పిల్లవాండ్రకుఁ గూడఁ దెలియునా యనున ట్లుండు వాఙ్మిగుంభముల కల్పన లొప్పుచుండు. రామాయణంబువలెనే శైలి చులుకనగాఁ గనుపించును గాని యధికారిభేదంబులఁ బ్రతికృతియు నర్థకల్పనలకు నాలవాలంబు. ఈతఁ డుపమానంబులయందు వాల్మీకియే. ఒక్కచో వేషధారు లగు భాగవతులు "మత్త పాలరుచిఁ దెలియు సామ్యము" గా రామునిఁ దెలియుచుందు రని నుడివియుండె. ఆహా! ఉపమానసారస్యము!

ఇఁక రామధ్యానసుధారసపానమత్తత గనుఁడు.

తోడిరాగము - ఆదితాళము

ప. కొలువమరెఁగద-కోదండపాణి.
అ. నలువకు పలుకుల-చెలియకు రుక్మిణికి
లలికకు సీతకు-లక్ష్మణుని కరుదైన.
చ. వేఁకువజామున-వెలయుచు తంబుర
చేకొని గుణముల-చెలువొందఁ బాడుచు
శ్రీకరుని శ్రాశ్రిత-చింతామణికిని
ఆకలి దీఱ పాలారగింపఁజేసే.

ఈ కీర్తనయందు శ్రీరామధ్యానమరందపానసంరంభు లగు వాణీవిరించులకును సీతారుక్మిణీపార్వతులకును లక్ష్మణునకును గూడ సంభవింపని శ్రీరాముని కొలువు తన కబ్బె నని చెప్పుచున్నాఁడు. దానినిబట్టి త్యాగరాజు సర్వదా యనన్యప్రపత్తి గలిగి రామునే భజించుచుండె నని తేటతెల్లంబు. ఈ లక్షణంబులఁబట్టి "మృదుగిరా వల్మీకజన్మా మునిః" అను విశేషణము త్యాగరాజునెడ సార్థకం బాయె నని చెప్ప సందియ మే మున్నది?

3. భక్తివిషయే ప్రహ్లాద ఏవనన్వయం.

ప్రహ్లాదుని భక్తి యెట్టిదో ముందు విచారింపవలెను.

శ్లో. చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతి నోర్జున!
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!

ఆర్తుఁడు, జిజ్ఞాసుఁడు, అర్థార్థి, జ్ఞాని యని భక్తులు నాల్గు విధంబులుగా నుందు రని భగవద్గీతలు చెప్పుచున్నవి. ఈ చతుర్విధభక్తులలో

శ్లో. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినో త్యర్థ మహం సచ మమప్రియః.

అనుటచే జ్ఞాని యందఱికంటె శ్రేష్ఠుఁడు. ఎందువలననో చూతము. ఆర్తుఁ డనఁగాఁ దస్కరరోగాదులచే నాపన్నుఁడై తదపనయార్థము రామభజనోన్ముఖుం డగువాఁడు; జిజ్ఞాసుఁ డనఁగా భగవంతునిఁ దెలిసికొనఁగోరువాఁడు, అనఁగా ముముక్షువు; అర్థార్థి యనఁ ధనాదిసంగ్రహాలోలుండై తత్ప్రాప్తికై యీశ్వరారాధనము సేయువాఁడు. జ్ఞాని యనఁగా బ్రహ్మవేత్తయై తత్సాక్షా

త్కారానుభూత్యానందమగ్నుండై భక్తిసేయువాఁడు. మొదటి ముగ్గురును సకాము లయి యీశ్వరధ్యానము సేయువారు. జ్ఞానియోగి చిద్వైక్యానుభూతిఁ బడసి నిష్కామ భజనంబు సేయువాఁడు. "ప్రియోహి జ్ఞానినో త్యర్థ మహం సచ మమప్రియః" అనుటచే జ్ఞాని పరమాత్మైక్యంబుఁ బొందినవాఁ డని యర్థము. అట్టివాఁ డయ్యు భక్తి సేయువాఁడే భక్తు లందఱిలో శ్రేష్ఠుఁడు. అట్టివాఁడె ప్రహ్లాదుఁ డని యీ క్రింది పద్యము సూచించుచున్నది.

క. ఇందుఁగలఁ డందు లేఁ డని-సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన-నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

కాన ప్రహ్లాదునివంటి జ్ఞానయోగియే మన త్యాగరాజు గూడ ననుటకు ముం దుదాహరించిన కీర్తనలే సాక్షులు. వాని భక్తినిష్కామంబును, ననన్యశరణంబును, బ్రహ్మసాక్షాత్కారానుభూతిధుర్యంబును ననుట కుదాహరణంబులుగ నీక్రింది కీర్తనలఁ బేర్కొందు.

సురటిరాగము - రూపకతాళము

ప. భజనపరుల కేల దండ-పాణిభయము? మనసా!
అ. అజరుద్రసురేశుల కా-యా స్థాన మొసఁగు రామ!
చ. అండకోట్ల నిండిన కో - దండపాణి ముఖమును హృ
త్పుండరీకమునను జూచి - పూజ సల్పుచు
నిండు ప్రేమతో కరంగు - నిష్కాములకు వరవే
దండపాలు దాసుఁడైన - త్యాగరాజు సేయు రామ.

తోడిరాగము - రూపకతాళము

ప. నిను వినా సుఖము గాన - నీరజనయనా!
అ. మనసు కెంతో ఆనంద - మై మై పులకరింపఁగ.
చ. కరుణారసపరిపూర్ణ!-వరదా! మృదుభాషలు గల. 1
రూపము ప్రతాపము శర-చాపము సల్లాపము గల. 2
రాగరసిక! రాగరహిత! - త్యాగరాజభాగధేయ! 3

ఈ కృతులయొక్క యర్థమును గమనించినచోఁ బై శ్లోకార్థములఁ బ్రతిపాదించుచున్నవి. వాని యర్థమును గ్రమంబుగఁ బేర్కొనవలె ననిన నొక పొత్తమగును గాన కుశలు లగు చదువరులే యీ కృతులందుఁ గల పరమార్థంబును గ్రహింతురుగాక!

4. బ్రహ్మనారద ఏవ బా ప్రతిమయో స్సాహిత్యసంగీతయోః

అప్రతిమము లగు సాహిత్యసంగీతము లనుటచే నేమి యర్థమో ముం దాలోచింతము. వేదశాస్త్రార్థంబులఁ జదివి యా చదువును బ్రాపంచికసుఖసంధానంబునకై యుపయోగించిన నా చదువునకు నిరర్థకత చేకూరును. "చక్రహస్తుఁ బ్రకటించు చదువు చదువు" అని గదా ప్రహ్లాదుఁడు నుడివియున్నాఁడు. కాన నెనని చదువు రామభజనాయత్తం బగునో యద్దియే సార్థకం బగు. అట్టి చదువే యప్రతిమం బగు. బ్రహ్మదేవుని సాహిత్య పటిమంబు భగవత్ప్రకటనసమర్థం బగుట నాయదియు, నారదుని సంగీతపాండితి యంతయు నారాయణధ్యాన పరాయణం బగుట నాయదియు నప్రతిమంబు లని యర్థము. అటులే త్యాగరాజు తనకుఁ గల సాహిత్య సంగీతపాండిత్యము నంతయు రామభజనపరంపరదంబుగాఁ జేయుటచే నాయది సార్థకంబును నప్రతిమంబును నని యెంచవలెను. త్యాగరాజు సంగీతం బన నెట్టిదిగా నిరూపించెనో చూతుఁడు.

ధన్యాసిరాగము - ఆదితాళము

ప. సంగీతజ్ఞానము భక్తి వినా-సన్మార్గము గలదే? మనసా!
అ. భృంగిననటేశసమీరజఘటజమ తంగనారదాదు లుపాసించు.
చ. న్యాయాన్యాయములు దెలియును జగములు
మాయామయ మని తెలియును దుర్గుణ
కాయజాదిషడ్రిపుల జయించు
కార్యము తెలియును త్యాగరాజునకు

తా. "భక్తి లేని సంగీతప్రశంస కేవలము వ్యర్థము. భృంగిననటేశసమీరజఘటజమతంగనారదాదిపరమభాగవతు లుపాసించిన సంగీతము భక్తిపూరితము కాని వేఱు కాదు. వారే సంగీతోపాసనానిరూఢిఁ దెల్పిన వా రగుటం జేసి వారి మార్గమే యనుసరణీయము. ఇట్టి భక్తియుతం బగు సంగీత ముపాసించినచో ఫలిత మేమి యందు రేమో న్యాయాన్యాయవిచక్షణ గల్గును. సదసద్వివేకము గల్గును. కామక్రోధాద్యరిషడ్వర్గజయం బు గల్గును. తుదకు బ్రహ్మైక్యంబు సంభవించు. ఈ ఫలము భక్తిపూరితముగా సంగీత ముపాసించినఁ గలుగు ననుటకు నేనే (అనఁగా త్యాగరాజే) తార్కాణము. ఈ యర్థమునే యీక్రింది భగవద్గీతాశ్లోకములు ప్రతిపాదించుచున్నవి.

శ్లో. ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే.
శ్లో. భక్త్యా మా మభిజానాతి యావాన్య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్.

శ్రీరంజనిరాగము - రూపకతాళము

ప. సొగసుగా మృదంగతాళము జతగూర్చి నిను
సొక్కఁజేయు ధీరుఁ డెవ్వఁడో?

అ. నిగమశిరోర్థము కల్గిన- నిజవాక్కులతో స్వరశుద్ధముతో.

చ. యతివిశ్రమసద్భక్తివి-రతి ద్రాక్షారసనవరస
యుతకృతిచే భజియించే-యుక్తి త్యాగరాజుని తరమా? శ్రీరామ!

అని త్యాగరాజు చెప్పుచున్నాఁడు. నిగమశిరోర్థము గల్గిన (అనఁగా ఉపనిషదర్థప్రతిపాదకము లగు) నిజవాక్కుల (ననఁగా ననన్యభక్తిమాన్యంబు లగు వాక్కుల)గుదిగూర్చి శ్రుతిలీయంబుగ మృదంగాదివాద్యసహితంబుగ నెవండు గానంబు సేయునో వానికి శ్రీరాముండు సులభుం డనియు, నట్టివాఁడే ధీరుఁడు అనఁగా జ్ఞాని యని తాత్పర్యము. ఇత్యాదికృతులందు త్యాగరాజు సంగీతసాహిత్యంబులఁ బరమార్థంబు దర్శించుచుఁ దద్యాథార్థ్యనిరూపణఁ జేసియున్నాఁడు. ఇఁక నా మహామహుని సంగీతసాహిత్యపాండితీగరిమ యనవద్యంబును ననన్యసామాన్యంబు నని వేఱె నుడువవలెనా? అతని కృతులే వేనోళ్ల ఘోషించుచున్నవి. కర్ణాటకగానంబునకుఁ గ్రొత్త మహాయుగముఁ గల్పించినవాఁడు గదా శ్రీమత్త్యాగరాజు. అట్టి యనితరసాధ్యమృదుమధురాభినవపంథాసంధాయి యగు శ్రీమత్త్యాగరాజు గేయకల్పనల యున్నతిని గూర్చి నుడువవలె ననిన నూఱు తలలు గల యాదిశేషునకుఁ గూడ శక్యము కాదు.

5. రామామృతపాననిర్జితశివగి

ఇదివఱలోఁ జెప్పినదానిని బట్టియే యీ విశేషణసార్థక్యము పొడకట్టియుండును. అయినను శ్రీత్యాగరాజు చేసిన కృతి నొకదాని నుదాహరించి యీ విశేషణాన్వర్థతను ప్రత్యేకించి విశదీకరించెద.—

హరికాంభోజరాగము - ఆదితాళము

ప. ఎంత రానీ తన కెంత పోనీ నీ- చింత విడఁ జాల శ్రీరామ!

అ. అంతకారి నీచెంతఁ జేరి హను-మంతుఁడై కొలువలేదా?

చ. శేషుఁడు శివునికి- భూషుఁడు లక్ష్మణ-శేషియై కొలువలేదా? 1
శిషుఁడు మౌనివ-రిష్ఠుఁడు గొప్ప వ-సిష్ఠుఁడు హితుఁడు కాలేదా?2
ఆగమోత్తమము-లగు నీ గుణములు శ్రీ - త్యాగరాజు పాడఁగ లేదా? 3

ఈ విశేషణంబు లన్నియు సార్థకంబుగ వర్తింపఁజాలు మహనీయుని మఱియొకనిఁ జేర్కొనవలె ననిన శ్రీమదాంజనేయునే చెప్పవలెను. "అంతకారినీచెంతఁ జేరి హనుమంతుఁడై కొలువలేదా?" యని త్యాగరాజు సెప్పుటచే నా హనుమంతుఁడు శ్రీపరశివుండే గదా. కాన నా సచ్చిదానందవిగ్రహుం డగు శ్రీపరమేశ్వరాంశయే యీ హనుమంతుఁడుగాను, త్యాగరాజుగాను భూలోకంబున నవతరించి భక్తిపారతంత్ర్యమును నివేదించి లోకము నుద్ధరించె నని మన మెంచవలెను.

## త్యాగరాజు ధర్మబోధ

ఈతఁ డేవిషయమును చెప్పినను భక్తిమార్గంబునే యనుసరించి యుండును. సాంఖ్యమార్గము విశదీకరించుచుండినను, భక్తిమార్గమును వెల్లడించుచున్నను, నిష్కామకర్మయోగనిరూపణఁ దెల్పుచున్నను, మఱియే ధర్మవిధుల నివేదించుచున్నను, నది యంతయు భక్తిపరంబుగా నుండును. దీని యాథార్థ్యమును చదువరు లిదివఱలోనే గుర్తించియుందురు. ఇంకను వ్రాయవలసిన సంగతు లనేకము లున్నను నీక్రింది పద్యముతో విరమించువాఁడ.

సీ. గరళంబు మ్రింగని కార్తికేయునితండ్రి
జగములఁ జెఱుపని శంకరుండు
త్రిపురాసురుల నాజిఁ ద్రెంపని కఱకంఠుఁ
డగ్నినేత్రము లేని హరుఁ డతండు
పీయూషకరు జటాపింఛమందున లేని
కామారిమగఁడు వికల్పనుండు
సాధ్వి రతీదేవి జంటకన్నుల నీరు
నింపని కైలాసనేత యతఁడు
ఇరవు రాలుల పోరున నీగకుండ
నెమ్మది వహించు నీశుండు నిర్మలుండు
గానశాస్త్రము నుద్ధార మూనదెంచి
యవతరించిన త్రిపురారి యతఁడుసుమ్ము!

# ఋతుచక్రవర్ణనము

శ్రీమతి జూలూరి తులశమ్మగారు

శ్రీ లసలరారునట్టి యీ క్షితిని బెంపు
సొంపు వెలయించు దినముల సొరిది వినుఁడు.
మాసములలోన నుత్తమమాస మొకటి;
అదియె మధుమాస మని జను లాడుచుందు. 1
రా దినంబులు వచ్చిన యవసరమునఁ
జైత్రుఁ డరుదెంచు వనముల చిత్రముఁ గన
నంచు వాసంతుఁ డతిమోద మంకురింపఁ
దనకుఁ గలయట్టి భటుల ర మ్మని వనమ్ము 2
లెల్ల శృంగార మొనరింపుఁ డెల్లి యనుచుఁ
బంపెనో యన నుద్యానభాగములను,
ప్రాఁతచీరలు విడనాడి పణఁతు లెల్ల
పట్టుపుట్టంబులను దారు కట్టులీల, 3
తరుసమూహంబు లెల్లను దాల్చె నరుణ
కిసలయంబులఁ; దోడ్తోన కసిమసంగి
కోరకంబుల బారులు దీరె; నందు
దరవికస్వరపుష్పముల్ దనరె; విరుల 4
వెడలు మకరంద మానెడు వేడ్క వచ్చు
గండుతుమ్మెదగుంపు ఝుంకార మెసఁగె;
కోకిలాంగన లేమావికొమ్మఁ జేరి
వేడ్క నభినవపల్లవవితతి మెసవి, 5
భూజనోత్సాహమును గూర్పఁబూనినట్టి
దేవభామినివలెఁ, దాను దెలియరాక
పాడఁజొచ్చెను వీనులపండువుగను;
చాలుదీరిన తరులందు మేలిపులుఁగు 6
లెల్ల వింతవింత మొలుంగు లెసఁగఁ జేరి,
యల్లుకొను మల్లెతీవియలందు నిల్చి
యుయ్యెలల నూఁగి, కలహంబు లొనర లేచి
బుజ్జు మని యెగె నొండొండ్లఁ బొడుచుకొనుచు; 7
సద్గుణంబులచే నొప్పు సతులయట్ల
తరులతాదులు క్రొవ్విరుల్ దాల్చి వినత
లయ్యె; నిఖిలనికుంజపుంజాంతరములఁ
జారుతరలీల వికసించెఁ జక్కనైన 8
మల్లె సురపొన్న మందారమాలతులును
మొల్ల జాజియుఁ గురువకహల్లకములు;
వివిధఖగకోటిరుతములు వివిధగతుల
డెందమున కమందంబుగ విందుసేసె; 9
ఆ దినంబులలోననే హాయి గలుగు;
ఆ దినంబులనే యెండ లధికమౌను.
తనకుఁ బూర్వము గల్గు శాంతమును బాసి
భానుఁ డెంతయుఁ గ్రోధసంధానుఁ డగుచుఁ 10
బగటివేళలఁ గాలాగ్ని పగిది జనులఁ
గరసహస్రంబులను బట్టి కరుణ మాలి
తాపతప్తులఁ గావించెఁ; దరణికీల
కోర్వఁజాలక జను లెల్ల నుదకకాంక్షఁ 11
బోవఁ, గొలఁకుల నీ రింకిపోయియుండె;
ఇసుకతిన్నెలు వెల్వడి యించుకంత
జలము లుండియు లేనట్లు చెలఁగె నదులు;
తాపసంతప్తులై జనుల్ తాళలేక 12
యెప్పు డెదఁ గోరుదురు నీటికొప్పెరలను;
అగ్నికీలల గతు లెండ లౌర! యింకఁ
బ్రాణములపైనఁ గల యాస మానవలెను;
చల్లనైనట్టి జలముల స్నానపాన 13
ములను గావించుకొని వీవనలను బూని
విసరుకొంచును ముంగిళ్ల వేయఁబడిన
పందిరులలోన శీతలవారి చల్లి
యందుఁ గుర్చీల వసియించునట్టివారు, 14
మేడకిటికీల కెల్లను మేలిమి గల
వట్టివేళుల చాఁపల నట్టె గట్టి
చల్లనీటిని వానిపైఁ జల్లువారు,
మలయశిఖరోద్ధితాయాతమారుతములు 15

వికచకుసుమాళిపరిమళవితతితోడ
వచ్చి మేనుల సోఁకఁగ మెచ్చుకొంచు
"హాయి హాయిరె!" యనువారు, హర్షమునను
తనివిగైకొని వేనోళ్ల ననిలసూను 16
హెచ్చరించుచు సంతోష మచ్చుపడఁగ
నుండి; రయ్యెడ దినమణి యొదిగి తాను
తల్లికడ కేగు బాలు విధమ్ము దోఁప
చరమగిరి యను మాతను జేరఁబోయె; 17
అంత నక్కాంత తనపుత్రుఁ డచ్చటచటఁ
దిరిగి రా నెఱ్ఱసేటిచే దృష్టిఁదీయ
పల్లెరం బన దినమణిప్రభలు చెలఁగె;
వనము లెల్లను గెంజాయ ననుకరించె; 18
వస్తుతతి స్వర్ణమయమట్లు వఱలఁజొచ్చె;
పులుఁగు లెల్లను మేఁతకై పోయి మరల
తమ కులాయంబులకుఁ జేరఁ, దల్లు లిడెడు
మేఁతఁ గైకొనుఁ బిల్ల లత్యాతురమున; 19
యామినీకాంత కచభారమా యనంగ
ఇరులు తఱుచయ్యె దిక్కులవరుసలందు;
కాలపురుషుండు యామిని కరమునందు
కొప్పు సవరించుకొన నిడ్డ గొప్పు యద్ద 20
మో యనఁగ శీతకిరణుఁ డమోఘరీతి
నవతరించెను; జను లెల్ల హా యనంగ
పిండి యారంగఁబోసిన ట్లుండె జ్యోత్స్న;
జనులు చల్లపందిరులందు శయ్యలందు 21
చందనాగురుకర్పూరచర్చతోడ
నల్ల శయనించి ముచ్చట లాడుచుండ,
బాలు రెల్లరు వెన్నెలపట్టులందుఁ
జేరి, కొందఱు చెడుగుడి కోరి యాడ, 22
కొంద ఱందంద వెన్నెలకుప్ప లాడ,
సందడిమనంబులను హర్ష మావహించె.
అంత సుఖదుఃఖముల రెంటి నవసరముగఁ
బొందు నిద్రాసతియుఁ దాను బొందె; నంద 23
ఱమ్మహాదేవి సమ్మోహనాస్త్రమునకు
లోఁబడిన వెన్కఁ దెలవేఁగ లోక మెల్ల;
తఱుచు లైనట్టి యెండలతరుణ మరిగె;
కాఱుమబ్బులు గగనంబుఁ గలయఁగ్రమ్మె; 24
మేఘదర్శనహర్షంబు మేకొనంగ
పింఛముల విప్పి హర్షంబుపేర్మి మీఱ
నాడఁజొచ్చె మయూరంబు లందముగను;
క్రొమ్మెఱుంగులు వేనవేల్ గ్రమ్మ, యుఱుము 25
లొక్కపెట్టున నెడలేకయున్న, జనులు
'అర్జునః ఫల్గునః పార్థ' యని తలంచు
కొంచు భయమున నుండి; రమ్మించుగుముల
కాంతు లంతంత నణఁగెను, గాలపురుషు 26
చేతి యంత్రాళి కైవడి భీతి గొల్పి
మాయమగుచుండె; నప్పుడు మఘువుచేత
విడువఁబడినట్టి గజతతివడువు దోఁప,
కరికరోన్నతధారల యురువు గలిగి, 27
కుంతికొడుకు కాజిలోఁ దాననంతమైన
శరపరంపరఁ గురియించు చందమునను
సాంద్రతరనీరధారల జలదవితతి
గురిసెఁ; గరకలకొలికయి యరుగుదెంచు :8
వార లెల్లను దడిసి రవ్వాననచేత;
'వణఁకు గలిగెను జలి' యనువారు కొంద,
'ఱింతలో వర్ష మిటు వచ్చె నెఱుఁగ' మనెడు 29
వారు, 'కాలంబు నొకరీతి వచ్చునటరె?'
యనెడువా రైరి; జను లిటు లగుటఁ జూడ,
కాల మీ రీతి బహుభంగిఁ గానుపించుఁ,
గాన నెద్దియు స్థిరముగాఁ గానఁబడదు; 30
కానఁ జిత్రంపుసృష్టికిఁ గర్తయైన
నిత్యనిరుపమనిర్వ్యాజనిఖిలవేద్య
సత్యచారిత్రు నెదలోన సంస్తుతించి,
తిరిగిరానట్టి దిక్కును దెలిసికొనిన 31
పదవి యొకటియె సత్యమా వసుధలోన.
స్థిరముగా నుండు వస్తువుఁ దెలియవలయు
జ్ఞానయుతులార! సద్గుణచతురులార!
అన్నలార! సుపూజ్యతాప్రసన్నులార! 32

# హిందూసంఘసేవ

నా. కృ. వేంకటేశముగారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

మన హిందూసంఘమును గుఱించి చదువుకొనినవారు బహువిధములైన యభిప్రాయములను గలిగియున్నారు. కొందఱీ సంఘమును బొత్తిగా వదలి, క్రొత్త సంఘమును నిర్మించుకొనినఁగాని, మనదేశము ముందుకు రా దని చెప్పెదరు; కొందఱు పాశ్చాత్యులయొక్క సంఘాచారములను బట్టి మన యాచారములను మార్చుకొనినఁగాని, మనము ముందుకు రాలే మని యభిప్రాయపడెదరు; మఱికొందఱు మన సంఘము ఋషులవలన ఏర్పడిన దనియు, ఇప్పుడు మార్చుటకు మనవల్ల సాధ్యము కా దనియు చెప్పెదరు. యోచించినచో, ప్రతికాలమందును ప్రతిసంఘములోను ఈ మూఁడు విధములైన యభిప్రాయములను గలవార లుందురు. ఇప్పుడు హిందూసంఘము ఏస్థితిలో నున్నది? మన దేశము ముందుకు వచ్చి ఇతరదేశములలో తానును ఒక దేశము అనిపించుకొని ఉన్నతస్థితిని పొందుటకు మనము ఏమి చేయవలెను? — అని యోచింతము.

మనలో ఇంగ్లీషు చదువుకొనినవారిలో అనేకులు మన హిందూసంఘము చాల క్షీణించిపోయిన దనియు, అనేకసంవత్సరములు అన్యదేశీయుల రాజ్యభారముక్రింద నుండినందువలన మన సంఘమునకు దౌర్బల్యము కలిగిన దనియు పశ్చిమదేశపు సంఘము మన సంఘమునకంటె విశేషము కలిగిన దనియు, ఇంకను మన సంఘము వృద్ధిపొందవలె ననిన వారలను చూచి నేర్చుకొని మన సాంఘికాచారములను మార్చుకొనవలె ననియు తలఁచెదరు. లోకములో రెండు సంఘములు ఒకే రీతిగా నుండి ఒకే విధముగా వృద్ధిపొందిన వని చెప్పుట చరిత్రములు చదివినవారికి నీలుకాదు. సారాంశమును బట్టి చూచినయెడల, హిందువుల సంఘము కూడ నాగరికత గలిగి యాధ్యాత్మికమైన దని చెప్పవలెను. పశ్చిమదేశమువారిది యాధిభౌతిక మని చెప్పవలెను. సేవకావృత్తియు, వాణిజ్యమును, రాజ్యభారమును, బ్రహ్మవిద్యయు, అన్నియు అనంతరము ఆత్మపరిణామమున కని మనము తలఁచెదము. అన్ని వృత్తులును ఆత్మసుఖమున కని పాశ్చాత్యులు చెప్పెదరు. కనుక మన సంఘములో ఇప్పుడు ఈ రెండు మతములను కలపి ఆధ్యాత్మికమును బోఁగొట్టక ఆధిభౌతికమును వదలక యెట్లు మన సంఘమును నిర్వహింపఁగల మని యోచింతము.

ఆర్యులకు అన్నిటికంటె ముఖ్యమైనది ధర్మాచరణము. వర్ణాశ్రమధర్మమును వదలినవాఁడు అనార్యుఁడు. ధర్మమునకు ముఖ్యసాధనము యోగ్యత. స్త్రీపురుషు లిరువురకును ముఖ్యము యోగ్యత. మన నడవడిక యోగ్యతను అనుసరించి యుండవలెను. బ్రాహ్మణుఁడు తన కేర్పడిన ధర్మాచరణమును వదలి నడుచుకొనుటవల్ల ఆర్యత్వము పోవును. అటులే ఇతరవర్ణములవారికిని ఆధ్యాత్మికమైన స్వధర్మమును ఆధిభౌతికమునకుఁగాను వదలిపెట్టుట శ్రేయస్కరము కాదు అనావశ్యముగా లోకవ్యవహారమునకును లోకాభివృద్ధికిని స్వధర్మములను వదలి పరధర్మములను అనుసరింపవలె నని తలఁచుట పొరపాటు అని నా యభిప్రాయము. తమ తమ స్వధర్మములను వేదోక్తముగా వారువారు సాధ్యమైనంతవఱకును ఆచరించి పారమార్థికసుఖమును అనుభవించుటయే న్యాయము. ఇట్లు ధర్మమును అవలంబించిన వారియెడ కొన్ని గుణములు ఏర్పడుచున్నవి. దేహశుద్ధియును స్థిరబుద్ధియును ఇంద్రియనిగ్రహమును అంతఃకరణపరిశుద్ధియును మనస్సమత్వమును ఏర్పడును. ఇవి స్థిరముగా నేర్పడినప్పుడు పరస్పరవిశ్వాసమును స్వసుఖత్యాగమును వెంటనే వచ్చును. స్వల్పకాలములో నా యనుభవమును బట్టి నాకు తోఁచిన దేమనఁగా, ధర్మములను ఆచారములను గుఱించి ఎన్ని యుపన్యాసములను చేసినను, ఎన్ని వ్యాసములు వ్రాసినను సంఘాభివృద్ధి కానేరదు. ప్రతిదినమును నిత్యనైమిత్తికకర్మములను తప్పక చేయుచు భగవద్ధ్యానముతో కూడ నిర్మలమైన మనస్సుతో దేశభక్తిని మనస్సునం దుంచి న్యాయమార్గము తప్పక నిజమార్గము వదలక మనము చేయవలసిన లౌకికకర్మములను విధి తప్పక కాలహరణము చేయక క్రమముగ చేసినయెడల మన సంఘమునకు సరియైన సేవ మనము చేసినవార మగుదుము.

ఇంగ్లీషుభాష చదివినందువల్ల మనము ఇంగ్లీషువారము కానేరము. వారు పోయిన త్రోవనే మనము పోవలెనని తలఁచుట భిన్నాభిప్రాయ మని అనేకులకు ఇప్పుడే తెలియుచున్నది. మనకు మతము లుండినట్లే వారికిని మతము లున్నవి. మనకు దురభిమానము లున్నట్టే వారికిని గలవు. మనకు మూఢభక్తి యున్నట్లే వారికిని ఉన్నది. పూర్వాచరణమందు ఎంత గౌరవ ముండవలె నని శిష్టులు చెప్పి యున్నారో అంత వారియందును గలదు. మనము మాత్రము మతభేదములను పోఁగొట్టి పూర్వాచారములను వదలి శిష్టులను పరిహసించి ధర్మములకు సెలవిచ్చి కర్మములను త్యజించి యోగ్యతను సన్మార్గమును మాత్రము పొందవలె నని తలఁచుట యెంత శ్రేయస్కరమైన యభిప్రాయమో యోచింపుఁడు.

అట్లే స్త్రీలకును వర్ణాశ్రమములకు తగినట్లు ధర్మములను ఆచరించినచో తప్పునడవడికలకు పోవుటకు సందర్భము లుండవు. కుటుంబములో స్త్రీపురుషుల కిద్దఱికిని తగిన ధర్మము లేర్పఱుపఁబడి యున్నవి. పురుషులకు పూర్ణవిద్య యిచ్చినఁగాని యెట్లు సంపూర్ణయోగ్యత రానేరదో అటులే స్త్రీలకును పూర్ణవిద్యను మనము ఇచ్చినప్పుడే, మన సంఘము పూర్ణాభివృద్ధి పొందు నని నా మతము. పూర్వ

కాలమున దేవభాషలో పూర్ణపాండిత్యమును స్త్రీపురుషు లిద్దఱును పొందియుండినందువలననే స్త్రీపురుషుల కిద్దఱికిని ఇహపరసుఖములకు ఉపయుక్తమైన ధర్మములు పొందియుండినవి. పతివ్రతాధర్మ మనుట యుక్త మాటయే కాదు. పతిని దైవ మని తలఁచుటకు పతియందు ఎన్ని గుణము లుండవలెను, ఎట్టి గుణము లుండవలెను? పతిశుశ్రూషయే వ్రత మని తలఁచుటకు పత్నియందు ఎన్ని గుణము లుండవలెను, ఎట్టి గుణము లుండవలెను? పతిపత్నులకు ఇట్లు ధర్మసంయోగము ఏర్పడినప్పుడు ఆ కుటుంబము ఎట్లుండవలెను? అట్టి కుటుంబములు చేరిన యా కులము ఎట్లుండవలెను? ఇట్టి కులము లోకార్థముగా బ్రహ్మవిద్యను వృత్తిగా పొందిన నేమి, రాజ్యభారమును వృత్తిగా పొందిన నేమి, వాణిజ్యమును వృత్తిగా పొందిన నేమి, పరిచర్యను వృత్తిగా పొందిన నేమి? అందఱికిని యోగ్యత పూర్ణముగాఁ గలిగియుండును గనుక సంఘము అభివృద్ధి పొందుటకు సందియము లేదు. అట్లే ధర్మపరాయణలై జ్ఞానాభివృద్ధి పొందిన స్త్రీ లుండిన యెడ, వరశుల్కములును కన్యాశుల్కములును ఉండుట కవకాశము ఎటు లుండును? అట్టివారలకు వైధవ్యము కలిగినచో వారలు ఏమి చేయవలెనని తలఁతురో, మనము చెప్పఁగలమా? నాకు తెలిసి ఒక స్త్రీ వైధవ్యమును పొంది, బి. ఏ. పరీక్ష నిచ్చి, పునర్వివాహోద్దేశము లేక తనవంటివారలు దేశసేవచేయుట కుపయుక్తలుగ నుండునట్లు మన యొకటనే పనిచేయుచున్నది గదా! అట్లు కాక వివాహము చేసికొనవలె నని ఇచ్ఛపడినవారలకు ధర్మము అడ్డమే గాని శాస్త్రము అడ్డము గాదు. స్త్రీల విషయమైన ఆచారములలో ఏదైన మార్పు లుండవలసినయెడల, వారలే ఆ విషయమైన ఏర్పాటులు చేసికొనుట యుక్తముగా నుండును. అనావశ్యముగా మనము లేని యోచనలను పెట్టుకొని మన సంఘములో నేమియో తప్పు లున్నవని భ్రాంతిఁ జెంది, ఇంగ్లీషు చదివినందువల్ల నెట్లెట్లో మనము ఉండవలె నని భ్రమపడి, స్త్రీలకు ఇది బాగుండునో అది బాగుండునో అని యోచనలు కల్పించుకొని, మనము ఐకమత్యమును దేశాభిమానమును కలిగి యేకదేశీయులము కావలె నని యోచనచేయుచు, అట్లుండుటకు అస్తిభారముగా నుండు దేహశుద్ధియు, మనస్థైర్యమును, సన్మార్గమును, పరస్పరవిశ్వాసమును, ఆత్మత్యాగమును మఱచిపోవుచు, దేశాభిమానులవలె నటించి, మనము ఆకాశదుర్గములను ఏర్పఱిచి వ్యర్థాలోచనలు చేసి, ఇదియే మన సంఘాభివృద్ధికి మనము చేయవలసిన సేవ యనుకొనుచున్నాము. ఇట్టి మిథ్యను వదలి ఎప్పుడు మన దేశపు స్త్రీపురుషులు వేదోక్తమైన ధర్మాచరణములను సంఘసేవను అవలంబింతురో అని యెల్లప్పుడును శ్రీనివాసుని వేఁడెదను.

# అగస్త్యవైద్యము

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి వైద్యరత్న పండిత

డి. గోపాలాచార్యులుగారు, ఏ. వి. యస్.

జగన్నిర్మాత యగు నా పరమాత్మ సర్వజనారోగ్యంబునకై యొసంగిన హేతు (రోగములు జనించుటకుఁ దగు కారణములు) లక్షణ (రోగములం జక్కఁగఁ దెలుపు చిహ్నములు) ఔషధ (రోగసామాన్యమును నివర్తిచేయు వివిధచికిత్సోపాయములు) స్కంధత్రయాత్మకమై విరాజిల్లుచు ననాది యని ఖ్యాతిఁ జెందిన యాయుర్వేదము వివిధచికిత్సల సౌకర్యమునకై శల్యము శాలాక్యము మున్నగు నెనిమిది యంగములతోఁ గూడియున్నను, "కాయచికిత్స" "శల్యచికిత్స" యను రెండు ప్రధానభాగములతో నిమిడియున్నది.

*ఆయుర్వేదము దాని ప్రధానభాగములు.*

అందు ఆత్రేయ అగ్నివేశ భేడాది మహర్షి ప్రణీతము లగు కాయచికిత్సాబోధకతంత్రమునకు నాత్రేయ సంప్రదాయ మని పేరు.

*ఆత్రేయ సంప్రదాయము.*

ధన్వంతరి సుశ్రుత ఔపధేనవ ఔరభ్ర గోపురరక్షిత ప్రభృతి మహర్షులచే విరచిత మగు శల్యతంత్రము ధన్వంతరిసంప్రదాయ మని తెలిసెడిని.

*ధన్వంతరి సంప్రదాయము.*

వైదికమహాయుగము మొదలు క్రమముగ నభివృద్ధిని బొందిన పై రెండు సంప్రదాయములను నాయుర్వేదతత్త్వజ్ఞులు వైదిక వైద్యసంప్రదాయము లని వాడెదరు.

తాన్త్రిక యుగమున నాగార్జునాదులచే వృద్ధిని బొందింపంబడిన ఖనిజవస్తుసమ్మేళనతోఁ గూడిన వైద్యక పద్ధతులకు తాన్త్రిక సంప్రదాయము లేక రససంప్రదాయమని వాడుక గలదు.

*రస సంప్రదాయము.*

ఈ మూడు సంప్రదాయములకన్నను భిన్నముగ దక్షిణదేశమున విఖ్యాత మగు "నగస్త్య వైద్యము" అను వైద్యము గలదు. అయ్యది పై మూడు సంప్రదాయములలోఁ జేరినదియా లేక తద్భిన్నమా? ఇయ్యది యేకాలమునుండి యారంభ మైనది? దీని మూలప్రవర్తకులు పరంపర మొదలగువానిని సంక్షేపముగ వ్రాయుచున్నాఁడను.

*అగస్త్య సంప్రదాయము.*

సకలజనవంద్యు లగు శ్రీరామచంద్రులు జననీజనకుల యాజ్ఞం దైకొని పదునాల్గు వత్సరముల కాలమును విదేశములఁ గడపుచు క్రమముగ నగస్త్యాశ్రమమునకు విచ్చేసినటుల శ్రీరామాయణమునం గల వాల్మీకి వాక్యరత్నములు సర్వజనవిదితములు. ఈ వాక్యతతిచే శ్రీరామమూర్తికన్నను మున్ముందు అగస్త్యులు దక్షిణాపథయాత్ర సలిపి రని తెలియుచున్నది. అగస్త్య మహర్షి దక్షిణాపథగమనమును సలిపిన యెంతకాలమునకు రామభద్రుండు అగస్త్యాశ్రమమునకు విచ్చేసెనో యా కాలమును మాత్రము నిర్ణయించుట కష్టతరము.

*చరిత్ర.*

శ్రీరామాయణరచనను గురించియు రామరావణుల యుద్ధమును గురించియు కాలమును నిర్ణయించుటలో చరిత్రకారుల యాశయములు పలు తెఱంగులఁ గానంబడినను శ్రీరాఘవుండును కుంభసంభవుండును సమకాలికు లను విషయము పై కారణములచే సుస్పష్టము. జానకీజాని యగు నా శ్రీరాములు అయోధ్యను వదలి క్రమముగ లంకాపట్టణముఁ జేరువఱకును శోభించు మార్గమున నుండు దండకారణ్యమం దక్కడక్కడను తక్కిన మార్గ మంతయును నగరరాజములచేతను పురవరములచేతను మునిపల్లెలచేతను జనపదములచేతను శోభితమై మిక్కిలి యెక్కుడగు నాగరికతఁ జెందిన దని శ్రీ వాల్మీకి వాక్యములచే నూహింపఁదగును. మరియు రాక్షసరాజమూర్ధన్యుం డగు దశాస్యుని రాజధానియందు పురవీథులను ప్రాకారములను ఉద్యానవనంబులను క్రీడాసరోవరంబులను అంతిపురంబులను అందలి స్త్రీసమాజంబులను వారి క్రీడలను కేవలస్వభావగుణములచే లోకోత్తరముగ శోభిల్లినట్టులు వాల్మీకిచే వర్ణింపంబడిన వాక్యజాలములు సర్వలోకవిదితములు.

ఈరీతి నాగరికతఁ జెందిన కాలమునం గల మనుజులకు మిథ్యాహారవిహారములచే జనించి పలు తెఱంగుల నపాయములను గలిగించు రోగములకుఁ దగు చికిత్సారూపము లగు శమనోపాయంబు లుండు ననుట స్పష్టము. ఆ శమనోపాయంబులు సుప్రసిద్ధాయుర్వేదీయ వైద్యకచికిత్స లనియె చెప్పక తప్పదు.

అనాదికాలమునుండియు ప్రజల యారోగ్యమును బాధించు వ్యాధిసామాన్యమును రూపుమాపుటకై యా పరాత్పరుని దయచే ననుగ్రహింపఁబడినది యాయుర్వేదము దక్క వేఱొండు లే దని ఋగ్వేదాదులయం దనేకచికిత్సాప్రతిపాదకమంత్రరాజంబు లుద్ఘోషించుటచేతను ప్రపంచమునం గల వైద్యకపద్ధతులలో నాయుర్వేదీయసంప్రదాయమే యనాది యని సకలదేశచరిత్రకారులును వైద్యవిశారదులును తగు ప్రమాణముల నుదహరించుటం జేసియు నాయుర్వేదమే మొట్టమొదటిది యని యొప్పుకొనకతప్పదు.

దక్షిణాపథమున వానరవర్గములోఁ జేరిన కాయచికిత్స శస్త్రచికిత్సలయం దసమానుఁడై సర్వ సైనిక ప్రధాన చికిత్సకత్వమును వహించిన సుషేణుఁడు దశాస్యునిచే ప్రయోగింపంబడిన శస్త్రాస్త్రాద్య

యుద్ధఘాతములచే మూర్ఛితుఁడైన లక్ష్మణుని సమ్మోహరహితునిఁగఁ జేయుటకై సస్యరూపముగ నుపయోగించిన "సంజీవకరణి" (మృతప్రాయు లగువారి సుజ్జీవింపంజేయు శక్తి గల యోషధుల) నుండియు, శస్త్రచికిత్సాప్రతిపాదక మగు "విశల్యకరణి" (శరీరమున గుచ్చుకొనిన బాణముల ములుకులను బైటికి వెడలించు శక్తి గల యోషధులు) "సావర్ణ్యకరణి" (వ్రణప్రదేశములం గల చర్మమునకు యథాపూర్వ మగు వర్ణము నిచ్చు శక్తి గల యోషధులు) "సంధానకరణి" (విఱిగిన యెముకలను జతపఱచు శక్తి గల యోషధులు) మొదలగువాని కృత్యములు స్వరూపములు మున్నగునవి స్పష్టముగ శ్రీరామాయణయుద్ధకాండము 102-వ సర్గయందు వర్ణింపంబడియుండుటచేత నాయుర్వేదీయ వైద్యకపద్ధతులు పై కాలమునకు ముందు నుండియు ప్రచారములోఁ గలవని వ్రాయుట యనవసరము. అగస్త్యాగమనమునకు ముం దనార్యభూయిష్ఠ మన్ని తలఁచెడి కొందఱి మతముల ననుసరించి దక్షిణాపథమున ఆయుర్వేదీయ వైద్యకమార్గము లున్నవన్నఁ బలువురకు ఆశ్చర్యమును విస్మయమును గలుగకమానదు. ఇయ్యది కేవలభ్రమ యని తోఁచుచున్నది.

దశకంఠుండు పులస్త్యబ్రహ్మకు పౌత్రుఁ డనియు నాకానాక సమయమున నీశ్వరునింగూర్చి సామవేదములచే స్తోత్రముఁ జేసె ననియు నీరి మరణానంతరము విభీషణుఁడు ఉత్తరక్రియలం జేయు సమయమున ఆర్యులలో యాగాదిక్రతువులం జేసినవారికిఁ జేయురీతిని ఆహితాగ్ని సంస్కారములను జేసె ననియు, మతంగ శరభంగాది మునిపల్లెలతోడను మార్గము గూడియున్న దనియు వర్ణితము లగు వాల్మీకిపుంగవుని వాగ్గుంభనలు ప్రబలముగఁ గనంబడుటచేతను అగస్త్యుని యాగమనమునకు చిరకాలమునకు పూర్వమే యల్పసంఖ్యాకు లగు నార్యులు వచ్చియుండినం గాని పై యార్యసంప్రదాయకచిహ్నలు గలిగియుండ వని ఇక్కాలపు చరిత్రకారులు గొందఱు నుడువుటచేతను, విమర్శిత మగు అగస్త్య సంప్రదాయమందును ఆర్ష వైద్యమున ప్రధానప్రమేయము లగు వాతపిత్తకఫము లనెడి దోషత్రయమునె యాధారపఱచుకొని ద్రవిడవైద్యగ్రంథము లన్నియుఁ గానంబడుటచేతను, నింక ననేక కారణాంతరములచేతను నీ దక్షిణభూభాగము శ్రీ యగస్త్యచరణకమలసంస్పర్శము గలుగుటకు పూర్వమే యార్యభూయిష్ఠ మనుట విశద మగుచున్నది.

అల్పసంఖ్యాకు లగు నార్యులచే నావరిత మగుటచేత నెట్టి యభివృద్ధియు నార్యవిద్యలకుఁ గలిగియుండుట కవకాశము లేకుండెను. అగస్త్యమునివరుండు వచ్చినపిదప వారి నిజవిద్యాప్రభావము లన్నిటిచేతను దక్షిణాపథమున భాష మొదలు సమస్తవిద్యలను సంస్కరించుట కారంభించె నని తోఁచుచున్నది.

అందు వైద్యకసంస్కారము సర్వజనుల కత్యంతావశ్యక మైన దగుటచే క్రమముగ నార్యవైద్యసాహాయ్యంబున మూలికలయొక్కయు ఖనిజములయొక్కయు జ్ఞానము వినియోగములు ప్రక్రియలు మొదలగునవి సంస్కారపూర్వక మగు నభివృద్ధిం గాంచె. పిదప నా ప్రవర్తకులయొక్క సంఘమును పరంపరలను నేర్పఱిచి కట్టుఁబాట్లు నేర్పఱిచెను. దానంజేసియె యీ ద్రవిడదేశమున నభివృద్ధిని బొందించిన పై వైద్యకపద్ధతు లన్నిటికిని "అగస్త్యవైద్యము" అను నామధేయముచే నిచ్చటి వైద్యలోకంబున వ్యవహారము గలిగె.

ఈశ్వరుఁడు పార్వతికిని పార్వతి నందీశునకును నందీశుఁ డశ్వనీదేవతలకును వారలు ధన్వంతరికిని ధన్వంతరి యగస్త్యులకును అగస్త్యులు పులస్త్యులకును అతఁడు తేరయ్యర్‌కును వీరు ఊహామునికిని క్రమముగ నీ వైద్యతంత్రము నుపదేశించినట్టు లిందలి గ్రంథముల గాననగును.

అగస్త్య సంప్రదాయ పరంపర.

ఈ సాంప్రదాయప్రవర్తకులు నలువదిరెనిమిది మంది యని కొందఱును మఱికొందఱు ఇరువదిమంది యనియు ఇంకను కొందఱు పదునెనిమిదిమంది యనియు భిన్నమతములు సూచించిరి. ఈరీతి భిన్నమతము లున్నను పదునెనిమిది మంది యను పక్షమునే అందఱు నంగీకరించినట్టులును ఈ తంత్రప్రవర్తకు లందఱకును సిద్ధులని పేరు గల్గినట్టులును దెలియుచున్నది.

శస్త్రప్రవర్తకులు.

నందీశ్వరర్, అగస్త్యర్, మత్స్యముని, పిడినాక్కీశర్, పులస్త్యర్, పుంకుండర్, కరువూరార్, తిరుమూలర్, చట్టముని, రోమరుషి, భోగర్, బ్రహ్మముని, సుందరర్, వామదేవర్, తేరయ్యర్, కపిలర్, కమలముని, కొంగణర్ అను నీ పదునెనమండ్రును ఈ సంప్రదాయప్రవర్తకు లని యందఱు నంగీకరించినట్టులు ఊహాముని మొదలగువారి గ్రంథములచేఁ దెలియుచున్నది.

పదునెనిమిదిమంది సిద్ధులు.

వీరిలో నగస్త్య పులస్త్య ధన్వంతరి నందీశ ప్రభృతి సంస్కృతభాషామయము లగు వ్యావహారిక నామములు గలవారలు ఆయుర్వేద వైదిక వైద్యమునను తాంత్రిక వైద్యమునను సమర్థులనియు కరువూరార్ చట్టముని తేరయ్యర్ పిడినాక్కీశర్ పులిప్పాణి భోగర్ మొదలగు ద్రావిడ నామధారులు ద్రవిడదేశజ మగు అగస్త్యసంప్రదాయరసవైద్యకప్రవర్తకు లనియు వారివారి గ్రంథముల విమర్శనమునుండి తేటపడుచున్నది.

రెండువిధముల సిద్ధులు.

మఱియు సాంస్కృతిక తాంత్రిక వైద్య రచనా పద్ధతులు దెలిసినవారిని "వడ" (ఉత్తరము) సంప్రదాయజ్ఞు లనియు కేవలద్రవిడదేశ వైద్యకపద్ధతులఁ దెలిసినవారిని "తెన్" (దక్షిణము) సంప్రదాయజ్ఞు లనియు వ్యవహరించెదరు. ఈ "తెన్" "వడ" సంప్రదాయములయందు సమర్థు లగు సిద్ధులచే విరచితము లగు గ్రంథములఁ బరికించినచో నాత్రేయ ధన్వంతరి నాగార్జునాది సంప్రదాయ సంమ్మేళన రూపముగ నుండు గ్రంథములం బోలెఁ గాన్పించుచున్నయవి.

అగస్త్య సంప్రదాయ ప్రవర్తకులచే విరచితము లగు గ్రంథములయందలి జారణ మారణా ద్యుపాయములకును ప్రక్రియాపరిభాషలకును నాగార్జునుఁడు సోమనాథుఁడు మొదలగువారి పారిభాషిక పదములకును ప్రక్రియాభాగములకును జారణ మారణా ద్యుపాయములకును నెట్టి

అగస్త్యవైద్యస్వరూపము, దానిస్వతంత్రత.

సంబంధము నున్నట్టు గానరాదు. మరియు నీ ప్రక్రియాది భాగములు నాగార్జునాది రస తంత్ర సంప్రదాయముకన్న సులభతరములుగను గుణాతిశయములుగను గన్పట్టుచున్నవి.

ఆర్ష సంప్రదాయమున రోగ నిదాన శారీర శల్య శాలాక్యాది భాగములు ప్రత్యేకముగ నున్న విధముగ స్వతంత్రము వహించిన అగస్త్యసంప్రదాయమున ప్రకృతము బహిరంగముగ దొరకు గ్రంథములయందుఁ గానరావు. ఈగ్రంథములు ఆర్ష తాంత్రిక చికిత్సా మిశ్రము లగు గ్రంథములం బోలినవిగను వైదిక వైద్య సంప్రదాయములతోడను ద్రవిడదేశజ రసతంత్ర సంప్రదాయములతోడను జేరి యున్నట్టు విశేషగ్రంథముల విమర్శనలచేత తెలియుచున్నది.

ఈ యుభయసంప్రదాయములయందలి గ్రంథములను నందలి ప్రక్రియాది భేదములను సూక్ష్మదృష్టిచేఁ జూచిన నగస్త్యసంప్రదాయమే యుత్తమ మనియు నాగార్జునాదిరసతంత్రసంప్రదాయమునకన్న భిన్నమైన దనియు స్పష్టము.

చికిత్సాసామాన్యమునకు ప్రధానాంగ మగు గుణపాఠముల యందు వైదికవైద్యులకన్న నీ దేశజులు కేవలము ద్రవిడదేశమందలి

గుణపాఠములు, ఓషధి జ్ఞానము.

యనేక మూలికలను భిన్నభిన్నరోగముల కుపయోగించుచు వాని మహిమలను "గుణపాఠము"లను గ్రంథములుగ రచించిరి. ఈ గుణపాఠములు ఆర్య సంప్రదాయమందలి గుణపాఠములయందు రస వీర్య విపాక ప్రభావ గుణము లను భేదోపాయములచే బోధింపఁబడు ప్రకారము లేక కేవలము ఆయా వస్తువు లాయా రోగములం బోఁగొట్టు నని మాత్రము గనఁబడుచున్నవి. వీనిని జూడ ద్రవిడదేశజులు వస్తుగుణములను నిరూపించునపుడు ఆర్షసంప్రదాయకమార్గములకన్న భిన్న మగు నేమార్గములచేతఁ గనిపెట్టిరో తగినన్ని గ్రంథములు ప్రకృతము దొరకక పోవుటచేత వస్తుగుణనిరూపణమునుగుఱించి విశేషముగ వ్రాయఁజాలకున్నాఁడను.

కేవలచికిత్సాగ్రంథములు మాత్రము ఎక్కువగా నున్నట్టు పైనఁ దెలిపియుంటిని. వానిలో వైదికవైద్యప్రక్రియాభాగములను వదలి కేవలము రసతంత్ర సంప్రదాయములను గుఱించి

రసశాస్త్రాభివృద్ధి.

ఇంచుక పరికించిన నయ్యవి నాగార్జునాది రసతంత్రములవలె మహారసములు సాధారణరసములు ఉపరసములు లోహములు రత్నములు అను భేదములచే వివరించినట్టు కనఁబడకున్నను ఖనిజ వస్తు సామాన్యమును వదలక చెప్పినట్లు తోఁచుచున్నది. మరియు నాగార్జునాదిరసతంత్రములకన్న క్షారములు, లవణములు, క్షారజద్రవములు (ద్రావకములు), విషసంయోగములు, పాషాణములు, రసకర్పూరములు, రసముల వికార మగు సౌవీరము వానిభేదములు, పాషాణసంయోగములు, వాని భేదములు వాని విభాగములును, రసవాద ప్రక్రియాభాగములును విపులముగ వర్ణితములు. ఇట్టి విభాగములతోఁ గూడిన గ్రంథములు పెక్కులు గలవు.

యోగవిహిత మగు భాగభేదముతో కూడిన క్షారలవణములు మొదలగువానిని సంయోగము చేసి యా సముదాయమును పాతాళ

జయనీరు.

యంత్రమున నునిచి అయ్యది నియమితకాలమువఱకు భూమియం దుంచి పిదప దానిని భూమినుండి పైకిఁదీసి యంత్రమును విప్పిన నందుండి పైనఁ జెప్పంబడిన క్షారలవణముల సముదాయము ద్రవరూపముగఁ బరిణమించును. ఈ ద్రవమునే "జయనీరు" అని యీ సంప్రదాయజ్ఞులు వాడెదరు. ఈరీతి జయనీరులు చేయు విధముల నీ సంప్రదాయజ్ఞులు రెండు విధములఁ జెప్పియున్నారు. ఇట్టి జయనీరులచేత శంఖపాషాణము మొదలగు పాషాణవర్గములను రసవర్గములోఁ జేరిన రసము సౌవీరము ఇంగిలీకము మొదలగువానిని "చుఱుకు" అను సంస్కారముచే నిప్పునం దుంచినను ధూమరూపమును బొందక స్థిరముగ నుండునట్లు చేయుదురు. ఈరీతి ప్రక్రియలచేత సిద్ధమగు శంఖపాషాణాదులను రోగములయందు స్వల్పప్రమాణముచేత నుపయోగించెదరు. ఔషధయోగములయందును జేర్చుచుందురు.

భాగభేదములతోడం గూడిన యుప్పులు మొదలగువానిం జేర్చి యోగోక్త మగు నోషధిరసములతో భావన చేసి పిదప

ముప్పు.

నగ్నిచే పచనము చేయుదురు. ఈ రీతి సంస్కారముచేత సిద్ధమగు సముదాయమును "ముప్పు" అని యీ సంప్రదాయపరులు వాడుదురు. ప్రాయికముగ దీనిని రోగములయందును గంధకాదిభస్మములను జేయుటయందును పరిమాణభేదములచే వినియోగించెదరు.

ఆర్షాదిసంప్రదాయమున ననేకపుటములచేఁగాని నిశ్చంద్రికమును (తళుకు లేకుండుటను) బొందని వజ్రాభ్రకమును నీ సంప్రదాయము

అభ్రకభస్మము.

వారు "కుక్కపాగాకు" లేక "నాయి పాహిలై" అను మూలికారసముచేత నూటి 10, 12 పుటములు వేసి నిశ్చంద్రిక మగు సింధూరమును జేసెదరు. ఇది నాగార్జునాది తంత్రములయందలి ప్రక్రియలచేఁ జేయఁబడిన యభ్రకసింధూరమున కన్న పెక్కుమడుంగులు గుణాధిక్య మని నా మతము.

మైలుతుత్తమును గాని సౌవీరమును గాని కొన్ని మూలికల సాయంబున "డమరుక" యంత్రంబున నునిచి యగ్నిచే పాకము

గురుభస్మము.

చేయుదురు. నియమితకాలానంతరము యంత్రము నుండి భస్మమును గ్రహించెదరు. ఈ భస్మమును మిక్కిలి సూక్ష్మ మగు మోతాదుచే పక్షవాతము సర్వాంగవాతము సర్వాంగశీతము మహోదరము మొదలగు వ్యాధులయం దుపయోగించెదరు. కొన్ని మోతాదుల యుపయోగపరచిన కొలఁది కాలములోపలనే నిరుపమానమైన గుణముల నిచ్చును.

ఈ రీతి బంగారు వెండి తగరము సీసము ఇనుము కాంతము శంఖపాషాణము తాళకము ఉప్పులు క్షారములు మొదలగువానిని మూలికాసాహాయ్యమున భస్మము సింధూరము కట్లు (బద్ధములు) ద్రావకములు మొదలగునవి చేయు నుపాయములు నీ సంప్రదాయమున పెక్కులు గల వని వ్రాయుట యతిశయోక్తి కాదు.

పైనఁ జెప్పఁబడిన భస్మసింధూరద్రావకములు మొదలగునవి చేయు ప్రక్రియలు మొదలగునవి నాగార్జునాది రసతంత్రములయందున్న వానికన్న అధికములుగను సులభతరములుగను నున్నట్లు తెలియుచున్నది. ప్రక్రియాభేదములతో పాటు యంత్రసంయోజనాదులయందును చాల భేద మున్నట్లు కనఁబడుచున్నది.

*అగస్త్యసంప్రదాయరసచికిత్సల స్వతంత్రము. వాని గౌరవము.*

ఈ ద్రవిడసంప్రదాయకచికిత్సలు ప్రక్రియలు మొదలగునవి చెన్నపురికి దక్షిణదేశమునను సింహళము (యాళ్ప్పాణము) జాఫ్నా సింగపూరు బర్మా టిబెట్టు మొదలగు దేశములయం దిప్పటికిని వ్యాపకములో నున్నయవి.

*వ్యాపకము.*

ఈ సంప్రదాయప్రవర్తకు లగు పార్వతీపరమేశ్వరులు నందీశులు విశ్వేదేవులు అశ్వనీదేవులు ధన్వంతరి మొదలగువారు రచించిన గ్రంథములు సంపూర్ణముగఁ గానరాకున్నను నక్కడక్కడ నైనను కొన్ని ప్రతులు దొరకుట దుర్లభముగా నున్నది.

*గ్రంథలుప్తత.*

అగస్త్యులు తేయరయ్యర్ చట్టముని భోగర్ కరువూరార్ పులిప్పాణి తిరుమూలరర్ మొదలగువారు సంస్కృతమునను ద్రవిడభాషయందును రచించిన గ్రంథములు మాత్రము ప్రకృతము కొన్ని లభ్యములు.

*పదునెన్ సంప్రదాయ గ్రంథపరంపర.*

“అగస్త్యర్ ఆయుశ్వేదం-ఆయరత్తైరనూఱు” అను గ్రంథమునందు వస్తుగుణములను, రస వీర్య విపాక ప్రభావము లనెడు ఆర్షవైద్యకమార్గములవలెఁ గాక కేవలము ప్రభావరూప మగు గుణములనె పదార్థములకుఁ జెప్పియున్నది.

అగస్త్యర్ ఆఱునూఱు. అగస్త్యర్ పరిపూర్ణం నానూఱు. అగస్త్యర్ వైద్యకావ్యం. అగస్త్యర్ చెందూరం. పులిప్పాణి అయినూఱు. భోగర్ ఏడునూఱ్. ఊహాముని ఆయరం. ఉరోమబుషి అయినూఱ్. తిరుమూలర్ నాడిశాస్త్రం. ఈ మొదలగు ననేకగ్రంథములు కేవలము ద్రవిడసంప్రదాయములతోఁడను ఆర్షతాంత్రికమిశ్రమములుగను వ్రాయఁబడియున్నవి.

ఈ సంప్రదాయప్రవర్తకు లగు సిద్ధులు ఇరుతెఱంగుల భేదములు గలవారలని పైనఁ దెలిపియుంటిని. అందు అగస్త్యర్ ధన్వంతరి నిత్యానందసనాథులు మొదలగువారలు ఆర్ష ద్రవిడ సంప్రదాయములను దెలిసినవార లనియు సంస్కృత ద్రవిడభాషల గ్రంథముల రచించినట్లు అగస్త్యులు ఆయుర్వేదసూత్రములకు వ్రాసిన భాష్యమునుండియు నిత్యానందసనాథులు ఆయుర్వేదసూత్రమునకు వ్రాసిన వ్యాఖ్యానమునుండియుఁ దెలియుచున్నది.

*పదసంప్రదాయ గ్రంథములు.*

చట్టముని తేరయ్యర్ కరువూరార్ మొదలగువారలు ద్రవిడభాషామయగ్రంథములు మాత్రము రచించినట్లు గ్రంథపరిశీలనమునుండి విశదమగుచున్నది.

*ఔన్ సంప్రదాయ గ్రంథరచన.*

ఈ సిద్ధులలో కొందఱు సంస్కృతభాషయందలి యనేకార్షవైద్యగ్రంథముల ననుసరించి ఆకాలముననె ద్రవిడభాషయందు కొంత గ్రంథపరివర్తనము కూడ చేసినట్లు తేరయ్యర్ తిరుమూలర్ మొదలగువారి గ్రంథసంచయమునుండి తెలియుచున్నది.

*గ్రంథపరివర్తనము.*

ఆర్షవైద్యకసంప్రదాయమందును ద్రవిడసంప్రదాయమందును సమాన మగు ధన్వంతరి అగస్త్యులు మొదలగువారి విరచితములకు సంబంధించిన పౌర్వాపర్యములను గుఱించి విమర్శనలు విశేషముగఁ జేయఁ దగుట యావశ్యకము. దాని విషయమగు చరిత్రాంశములు మిక్కిలి దుర్ఘటములు. సంప్రదాయకగ్రంథములు విరళప్రచారములు. ప్రకృతము సిద్ధముగ దొరకు గ్రంథములు కేవలము సాంకేతికపదభూయిష్ఠములు. ఉపమాద్యలంకారసహిత మగు ప్రాచీనద్రవిడభాషావిరచితములు. సంప్రదాయకముగ లక్ష్యలక్షణముల నభ్యసించిన విద్వద్వైద్యు లల్పసంఖ్యాకులు. సంప్రదాయక మగు ప్రక్రియాభాగములును సందేహాస్పదములు. గ్రంథముల ననుసరించి యథామతిగఁ జేసిన పరిశీలననుండి నాగార్జునాది రసతంత్రములకన్న నగస్త్యసంప్రదాయక రసతంత్రములు మున్ముం దని తోఁచినను సిద్ధాంతముగఁ జెప్పుటకు ప్రకృతము అశక్యము.

*పౌర్వాపర్య విచారణ.*

చిరకాలముగ ద్రవిడసంప్రదాయములనుండి గనుఁగొనిన విషయములకును నాగార్జునాది రసతంత్రములం గల విషయములకును పరిభాషాపదములు ప్రక్రియా విభాగములు విశ్వేదేవులతోఁ గూడిన యపూర్వ సంప్రదాయ క్రమములు మొదలగునవి వేర్వేఱుగ నుండుటచేత ఉత్తరపథమున నాగార్జునాదులచే నభివృద్ధికిఁ దేఁబడిన రసతంత్రములకన్న ద్రవిడదేశమున నగస్త్యాదులచే వృద్ధి పొందింపఁబడిన రసతంత్రసంప్రదాయములు ప్రాచీనములనియు భిన్న మనియు తలఁచుచున్నాఁడను.

*రసతంత్ర స్వతంత్రత.*

ద్రవిడభాష నభివృద్ధి నొందించుటకు చిరకాలమునకు పూర్వమనేకసంఘము లేర్పఱుపఁబడిన వనియు వేదాంతశాస్త్రము సంస్కృతమందుకన్న విపులముగఁ గల దనియు ద్రవిడభాష లగు ఆంధ్ర కర్ణాట కేరళాది భాషలకు మాతృభాష యనియు ననేకచరిత్రకారులు వ్రాసియుండుటచేతను ఇంక ననేక కారణములచేతను స్వాతంత్ర్యమును వహించిన ద్రవిడభాషామయ మగు నగస్త్యసంప్రదాయము నాగార్జునాది రససంప్రదాయములకన్న మున్ముం దని తోఁచినను అట్టి సంప్రదాయకగ్రంథముల కూలంకషముగ విమర్శింపక యెట్టి సిద్ధాంతమును జేయుట కశక్తుఁడనై ప్రకృతము నాపరిశీలననుండి తెలిసికొనిన విషయములను సుజనులును విద్వత్పక్షపాతులును నగు మహాశయులకు విన్నవించినాఁడ.

*స్వాభిమతము.*



Rajkumars reading at Newington

న్యూయింగ్టనులో చదువుచున్న రాజకుమారులు

Teachers & Pupils of the National College, Masulipatam



బందరు జాతీయ కళాశాలలోని విద్యార్థులు, ఉపాధ్యాయులు

Mr. M. Venkata Ramana Rao



ఎం. వెంకటరమణ రావుగారు

Mr. J. Rangavadhanulu



జనస్వామి రంగావధానులు గారు

Mr. Ch. Bhanumurty



చెన్నాప్రగడ భానుమూర్తి గారు

Mr. V. Krishna Rao



వైద్యుల కృష్ణారావు గారు

Pro. K. Rangachary



రా॥ బ॥ కె. రంగాచారిగారు

Mr. P. Narasimham



పోతరాజు నరసింహాముగారు

Mr. G. Kotilingam



గరికపర్తి కోటిలింగముగారు

Mr. A. L. Narayana Rao



ఎ. ఎల్. నారాయణ. రావుగారు

Mr. G. V. Krishna Rao



జి. వి. కృష్ణారావుగారు

Mr. G. Jogirazu



జి. జోగిరాజుగారు

# ఆంధ్రోద్యమము

ఎమ్. సుశీల గారు

ఆంధ్ర దేశోద్యమ సంచలనము ఆంధ్రజనహృత్క్షేత్రములయం దంకురించి పెరుఁగుటకు మొదలిడియున్న దనుటకు ప్రబలనిదర్శనము లాంధ్రప్రపంచాంతరిక్షమున దృగ్గోచర మగుచుండుటఁ గని ఆంధ్రు లమందానందకందళితహృదయులై యున్నా రని చెప్పిన నన్ను అనృతవాదిఁగా నెంచ రని నమ్ముచున్నాఁడను. కాని యుత్తరమండలవాసులు త్యక్తమండలవాసులపైఁ దెచ్చిన యపవాదమును బాపుట కొక్కింత సందర్భము దొరకుట యెంతయో ధన్యతమము. దత్తమండలవాసు లాంధ్రోద్యమము నెడల అనాదరణఁ జూపుచున్నా రను అపవాదము న్యాయమైనది కా దని యిందువల్ల ఉత్తరమండలవాసులు గ్రహింపఁ బ్రార్థితులు.

సదుద్యమములు సత్యసంస్థాపనసంకల్పములు. తత్సంకల్పములు పరోపకారధురీణులకు భగవంతుఁ డనుగ్రహించు కృపావరములు. ఆవరములకార్యరూపకముఁ గావించుటపరోపకార ధురీణులకర్తవ్యము. కార్యప్రయత్నములునూతనోజ్జీవకల్పితములు. నూతనోజ్జీవమునూతనాదర్శకములకుమార్గమునూతనాదర్శకాన్వేషణముసదుద్యమపూరితులలోమాత్రమే గాక తదితరులహృదయములలోకూడవ్యాపించుటనైజము. భగవత్సంకల్పములు ఫలదాయకంబులు. కార్యనిరతియందలిసాధకబాధకములు మానవాధీనములు.

ఆంధ్రోద్యమము సదుద్యమభరితమైన మహాదుద్యమము. ఇట్టి మహాదుద్యమముయొక్క పరమావధి విషయమున భిన్నాభిప్రాయము లుండవు గాని తత్కార్యసాధనమం దుపయోగింపఁబడు సాధనప్రయత్నములయందు అభిప్రాయభేదము లుండుట సహజము. ఆంధ్రదేశోద్యమము ఆంధ్రజాతీయత నుద్ధరించు సాధనము. కాఁబట్టి విద్యావంతు లైన కొంద ఱాంధ్రులకు మాత్రమే గాక జనసామాన్యమునకు కూడ ఈ హక్కు చెందియున్న దనిగ్రహించుట సమంజసము. ఈ మహాదుద్యమము భావగర్భితము గనుక నీ నిజభావమును సామాన్యజనగ్రాహ్యతకు అందునట్లు సవిస్తరముగా విశదీకరించుటకు పాటుపడుట| మిక్కిలి యవసరము. అవిస్పష్టకాహళధ్వనికి యోధు లేలాగు సిద్ధపడరో ఆలాగే ఆంధ్రోద్యమభావనివృత్తి ఆంధ్రుల కెల్లరకు విశదముగా తెలియునవఱకును ఈ యుద్యమము కార్యరూపముఁ దాల్చుట అసంభవము. ఎట్టి యుద్దేశ మైనను, ప్రారంభదశయందు అస్పష్టముగా నుండి కాలాంతరమున విశద మగు ననుట నిక్కం బైనను దాని భావమును కొంతమట్టుకు తెలిసికొన్నవారు ఇతరులకు బోధపఱుచుట ధర్మము. కాఁబట్టి యీ యుద్యమభావమును జనసామాన్యమునకు వెల్లడిచేయకుండిరేని వా రా యుద్యమము పట్ల నీరసభావమును జూపి రనిన చోద్యముగా నుండదు.

నేను మున్ను చెప్పిన రీతిని ఈ యుద్యమసాధనమునందు అభిప్రాయభేదము లుండక మానవు. అయినను భిన్నాభిప్రాయ మొక కార్యమునకు భంగకరముగా నుండ నవశ్య ముండదు. సాధారణముగా మానవులు తమతమ యభిప్రాయములను పూజించి ఆరాధించుట కొక విగ్రహముగాఁ జేసికొని తదారాధన మందే మగ్నులై ఇతరుల యభిప్రాయములను మన్నించుట కొప్పుకొనరు. ఆంధ్రోద్యమోద్ధారకు లిట్టి కార్యవైపరీత్యమునుండి తటస్థులై యుండుట తప్పని కర్తవ్య మని గ్రహింపఁ బ్రార్థితులు. అభిప్రాయభేదములచేఁ గలుగు వైషమ్యము నేమాత్రమును పాటింపకుండుట కార్యసిద్ధికి తగిన చిహ్న మని గ్రహించునది. ఆంధ్రోద్యమము నుపపాదించినవారు తాము పూనిన కార్యనిర్వహణమునందే నిష్ఠులై పైఁ జెప్పఁబడిన లోపమునకు దూరస్థులై యుందురుగాక.

ఆంధ్రోద్యమ మనఁగా ప్రత్యేకాంధ్రవ్యక్తినిర్మాణము. హిందూసమాజములో ప్రత్యేకవ్యక్తిప్రతినిధు లుండినఁ గాని సంపూర్ణసమాజము గా నేరదు. ఇందువలన హైందవజాత్యుద్ధరణమునకు ప్రత్యేకాంధ్రవ్యక్తి మిక్కిలి యవసరమైన ప్రతినిధి యని వెల్లడియగుచున్నది. ఆంధ్రవ్యక్తి ఆంధ్రజాత్యుద్ధరణము సేయుటకై జన్మ మెత్తియున్నది. ఆంధ్రదేశమున సదుద్యమములు లేకపోవుటచే ఆంధ్రులు కార్యసాధకధీరత్వమును మానుకొని పెక్కు శతాబ్దములవఱకును గాఢనిద్రలో నుండి రనుట యెల్లవారు నెఱిఁగినదే. ఇట్టి సుషుప్తినుండి ఆంధ్రుల మేల్కొలిపి తిరిగి వారిని పూర్వపు టౌన్నత్యమునకుఁ దెచ్చుటకును ఆంధ్రదేశ మితరదేశములకు మేలొనగూర్చునదిగాఁ జేయుటకును తగిన సమయ మిప్పుడు సంభవించినది. మన యాంధ్రులు పూర్వకాలమున భారతలక్ష్మిని మహోన్నతవైభవములో నాల్గు శతాబ్దములు నిరంతరాయముగాఁ గాపాడి పోషించి దక్షిణాపథంబున వెలసిన సమస్తరాష్ట్రములను జయించి యేలి రని చరిత్రము నిరాఘాటముగాఁ జాటుచుండుట లేదా? అట్టి ధీరపురుషోత్తముల పుత్రుల మైన మన మాంధ్రదేశమును మాత్రమే పోషించి కాపాడుట కశక్తుల మని ఆంధ్రోద్యమవిముఖులు వచించుట యెంతయు సత్యబాహ్య మైన వాక్కని నుడువనొప్పు. జనసామాన్యమునకు జ్ఞానోదయమును కలిగించుకొఱకును సంఘముల విశుద్ధికై పాటుపడుకొఱకును తమ జాతీయత నుద్ధరించి దానికి ఉన్నతదశను కల్పించుకొఱకును తమ సర్వస్వమును కోలుపోనెంచిన యొక్క మహాపురుషధీరుని వ్రేలెత్తి చూపలేని ద్రవిడులు ఆంగ్లేయప్రభుత్వమువలనఁ జేకూరు సమస్తసౌకర్యముల ననుభవించుచుండుటయు ఆంధ్రప్రపంచమునకు శుభ మొనగూర్చుటయే తమ జీవితముయొక్క ముఖ్యోద్దేశముగా నెంచి తమ సర్వస్వమును విడనాడిన మహాపురుషు లసంఖ్యాకు లగు ఆంధ్రులు ప్రభుత్వమువారి గౌరవమునకుఁ బాత్రులు కాకుండుటయుఁ జూచిన నన్యాయపుదైవ మాంధ్రుల వెంటాడిన చందంబు గానవచ్చుచున్నది. ఇట్టి యన్యాయపుదైవమును బాఱఁద్రోలుటకే ఆంధ్రరాజ్యలక్ష్మికి పుత్రోదయ మైయున్నది. ఇట్లు కాలసంపూర్ణతయందు జననము గాంచిన యా శిశువును పోషించుట ప్రతియాంధ్రునికిని పరమకర్తవ్య మని చెప్పనొప్పు. తమ యంతర్భేదంబులు విడనాడి జాతివైషమ్యంబులు పాటింపక నిమ్నోన్నతస్థితులను గమనింపక ఆంధ్రరాజ్యమునకు వైభవోన్నతిని కల్పించుటకై దృఢప్రయత్నములతో పాటుపడు ఆంధ్రమహానుభావులసమితిని పోషించి కాపాడినంగాని ఆంధ్రోద్యమసంచలనమువలనఁ గలుగనైయున్న పరమావధి లభించుట కలలోని వార్త. కావున ప్రత్యేకాంధ్రవ్యక్తికి పోషణ మవసరము. వ్యక్తి జీవనోపాధిక

వలయు సాధనోపకరణముల సంగ్రహించుట ఆంధ్రజనుల యనివార్యంబైన కర్తవ్యం బని నుడువఁజెల్లు. వ్యక్తికి వలయుజ్ఞానసాధనములలో,

మొదటి విద్య— విద్య యనఁగా సర్వకళాశాలలో నున్నతవిద్యాశాఖయందు తేఱుగడ నొందుట యని మాత్రమే కాదు. జ్ఞానమని గ్రహింపనగు. కాఁబట్టి జ్ఞానసంపాదనమున కవశ్యములైన సాధనము లన్నియు ఈ వ్యక్తికి సిద్ధముచేయఁబడియున్నవా యని చూడవలయును. ఆంధ్రులు విద్యయందు ద్రవిడులకంటె మిక్కిలి హీనదశయం దున్నా రని చెప్పిన నందు సాహస మేమియు నుండదు. కాని యిందుకుఁ దగిన కారణము లేకపోలేదు. ద్రవిడవ్యక్తి జ్ఞానసంపాదనమునకు అవసరమైన సౌకర్యము లన్నియు అమర్పఁబడియున్న వని దక్షిణదేశమున ప్రయాణము చేసినవారికిఁ దెలియును. పూర్వ మాంధ్రదేశమున నుండిన కొన్ని సౌకర్యములను కూడ నిటీవల తీసివేసియున్నారు. ఇట్లు తగిన యున్నతవిద్యాశాలలును కళాశాలలును లేకుండిన ఆంధ్రవ్యక్తి జ్ఞాన మెట్లు సంపాదింపఁగలదు? ఇప్పు డిప్పుడు ఆంధ్రులలో కొందఱు ఆంధ్రవ్యక్తికి వలయు కొన్ని కొన్ని సాధనము లేర్పాటు చేసియున్నారు. వార్తాపత్రికలును గ్రంథరచనసమాజములును పరిషత్తులును కల్పించియున్నారు గాని సర్వకళాశాలలు స్థాపించుట ప్రభుత్వమువారి పని. అందువలన ఆంధ్రు లందఱు నేకముగాఁ జేరి తమ కోరికలను ఆశలను ప్రభుత్వమువారికిఁ దెలియఁజేసిన కొంతవఱకైన మన యభీష్టములు నెఱవేఱు నని చెప్పుటకు సందియం బుండదు. కొందఱు ఇది తగిన యదను కా దని వాదించుచున్నారు గాని ఈ సందర్భమును వ్యర్థపఱుచుకొన్నచో మరియొక సందర్భము లభించుట యరుదు. లాభనష్టములు భగవదధీనములు. సందర్భప్రయోగములు దేశసేవకుల యధీనములు. ఆంధ్రదేశబాంధవు లీ సత్యమును గ్రహించి కృషి చేయవలసియున్నారు.

దత్తమండలవాసుల దౌర్భాగ్యస్థితిని వర్ణించుట కాంధ్రభాష చాలదు. ఉన్నతవిద్యాశాల లనిన, ఆ పదమున కర్థ మేమో యెఱుఁగరు. ఇఁక కళాశాలలు విశ్వవిద్యాలయము లన్న అవి క్రొత్త మృగములో లేక దేశముల పేర్లో యనుకొనునంతటి నిర్భాగ్యు లగు దత్తమండలవాసుల భావిపరిణామము ఊహింప నశక్యము. ఆంధ్రదేశము యొక్క యితరభాగములయందు వార్తాపత్రిక లనేకము లున్నను దత్తమండలములలో నొక్కటియైనను లేకుండుటయే వీరి యనాగరకమును జూపుచున్నది. మెట్టుకు తమ దుస్థితిని గుర్తింపలేనంత పామరత్వమున మునిఁగియున్నారు. కనుక ఉత్తరమండలవాసుల సాహసముచే నైనను వీరికి కొంత మంచిస్థితి యబ్బు నని నిరీక్షింపఁబడుచున్నది.

విద్యచే సర్వసద్గుణములును మనుష్యునికి లభించును. పరోపకారకు లగుటకు విద్యయే కారణము. విద్య యైహికమునకు మాత్రమే కాదు. ఆముష్మికమునకుఁ గూడ సహాయ మొనరించుచున్నది. "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే" ఇహపరలోకముల సుఖములను గడించి యిచ్చునది విద్యయే గాని వేఱొండు కాదు. కనుక నాంధ్రదేశారాధకులారా! ప్రత్యేకాంధ్రవ్యక్తి వృద్ధికిని ఆంధ్రదేశాభ్యుదయమునకును పామరులకు జ్ఞానోదయము కలిగించుటకును అవసరమైన విద్యాశాలలను స్థాపించకుండిన ఆంధ్రుల జ్ఞాన మంతయు బూడిదెలోఁ బోసిన నెయ్యి చందమున నశించి ఆంధ్రజాత్యుద్ధరణ మసాధ్యమైన కార్యమై పరిణమించును.

ఉన్నతవిద్యాశాఖలయందు తేఱుగడ నొందిన అనేకాంధ్రయువకులు తమ దేశాభివృద్ధికై పోరాడుటకుఁ బూను ప్రసక్తి కలిగియున్నారు. అయినను వా రేలాగు అట్టి కార్యమును నిర్వహించవలెనో యెఱుఁగక యాందోళమున నున్నవారు. కర్తవ్యమును విశదముగా వీరికి బోధపఱచినయెడల ఇంతకుమున్ను ఆంధ్రరాజ్యము నుద్ధరించిన మహాపురుషులఁబోలి వీరును పాటుపడుటకు యత్నింతు రనుట కే సందేహము నుండదు. వారిని జూచి యాంధ్రదేశమునం గల యువకు లందఱును వారిదారినే యనుసరింతు రని చెప్పవచ్చును. కాఁబట్టి ప్రథమమున ఆంధ్రవ్యక్తికి అనుకూలములైన విద్యాశాలలును జ్ఞానము కలిగించు విజ్ఞానమండలులును స్థాపించుటకు యత్నింపవలసియున్నది.

రెండవది పరిశ్రామిక విద్య— పరిశ్రామికవిద్య యనఁగా వ్యవసాయము వాణిజ్యము చేతిపనులు మొదలైనవి.

మన హిందువులలో మూఁడు వంతులమంది వ్యవసాయకులే యని పేరువడసియున్నారు. భరతవర్షము మిగుల సారవంతమైన దేశమైనందున మనవారు కృషికి తగిన పాటుపడకయే తమకు కావలసిన పంటలను సులభముగా పండించుకొనుచువచ్చి యిప్పటికిని అదే రీతిగాఁ జేయఁజూచుటవలన మన దేశపు వ్యవసాయము మిక్కిలి హీనస్థితియం దున్నది.

వ్యక్తి జీవనము చేయుటకు భోజన మవసరము. అందువలన వ్యవసాయమును కూడ నూతనపద్ధతుల ననుసరించి చేసినయెడల భూమి ఆంధ్రదేశమునకు మాత్రమే గాక ఇతరఖండవాసులకు కూడ ఎగుమతి చేయునంతటి పంట పండును. తెలుఁగుదేశమువారు అఱవదేశమువారికంటె యుక్తిగాను బాగుగాను దమభూమిని సాగుబడి చేయుచున్నా రనియు, వ్యవసాయమున కుపయోగించు ఉపకరణములు కూడ తగిన వనియు ప్రభుత్వమువారు కనుఁగొనియున్నారు. అయినను ఇతరదేశములవారు వ్యవసాయవిషయములో పాటుపడినంత మన యాంధ్రులు పాటుపడ రనుటది నిశ్చయము. అందుకై వ్యవసాయ విద్యాశాల యొకటి యాంధ్రదేశంబున నెలకొల్పిన ప్రత్యేకాంధ్రవ్యక్తి తనజీవనోపాధికై ఇతరభాగముల వారిని ఆశ్రయింపక తన్నుఁ దానే పోషించుకొనును.

వాణిజ్యము—ఇతరదేశములతో వ్యాపారము జరపని దేశము పాడగును. పూర్వకాలమున మచిలీపట్టణపు వస్త్రములు ప్రశస్తములని లోక మంతట పేరువడసియుండె ననుటకు మసలిన్ అను గుడ్డ యొక్క పేరే గొప్ప నిదర్శనముగా నున్నది. అప్పటివారు పట్టణమను పదమును బోనాడ మచిలీ అని వాడుచుండినందున అక్కడ చేయఁబడుచుండిన వస్త్రమున కదే పేరు కలిగెను. లోక మంతట ఆ గుడ్డ పేరు మోయుటకు కారణంబు మనవా రితరప్రదేశములతో వర్తకవ్యాపారము జరుపుచుండి రనునదే. మచిలీపట్టణము మన యాంధ్రదేశములోని యొక రేవుపట్టణ మని ఆంధ్రు లెఱుఁగరు కాఁబోలు! తూర్పు ఇండియా వణిక్సంఘ మను పేరున ఆంగ్లేయ వర్తకులు వ్యాపారముతోనే మన హిందూదేశమును జయించి యిప్పుడు మనల నేలుచున్నారుగదా! కనుక తెగించి పరదేశములకు వెళ్లి వ్యాపారము చేయు పద్ధతిని మనవారు తప్పక యవలంబించియే తీరవలెను. ఇక్కడ కూడ ఆంధ్రులు తమ దేశమున తగిన రేవుపట్టణము లేక చిక్కుపడియున్నారు. ఆంధ్రదేశములోని, సరకుల నెగుమతిచేయుట కనువగు రేవును కల్పించి యిచ్చుట యాంధ్రదేశాభివృద్ధికి శ్రేయస్కరము. ఆంధ్రవణిక్సంఘ మొకటి స్థాపింపవలెను.

మూఁడవది సంఘసంస్కరణము— అనఁగా ఆంధ్ర జనులయందలి శాఖోపశాఖలలోని లోటుపాటులను సంస్కరించుట.

జాతిపద్ధతి. ఈ పద్ధతియే మన యాంధ్రదేశమునకు మిక్కిలి కీడు మూడఁజేసియున్న దని నుడువఁజెల్లు. చతురన్వయము లుండిన దేశముల లక్షలకొలఁది శాఖలచే ఛేదింపఁబడియున్నది. ఒకరి నొకరు నీచముగా నెంచుచు తమ్మఁ దామే లెక్కనవారినుండి వేటాయించుకొని యొకరి సుఖదుఃఖముల నొకరు గణింపక ప్రత్యేకముగా నుండుట దేశమునకు అనర్థదాయకమే యని చెప్పనొప్పు. జాతిపద్ధతివల్ల పరస్పరసంఘీభావము నశించెను. సంఘ మనఁగా ఒకనికొఱకు అందఱును అందఱికొఱకు ఒకఁడును అను అర్థము గాక మరేమి? హిందూసంఘమును ప్రస్తుతహీనస్థితికిఁ దెచ్చిన విషయము లన్నిఁటిలోను జాతిపద్ధతినే మొదటిదిగా నెంచిన బాధక మెవ్వరికిని కలుగదు. ఆంధ్రదేశమును అజ్ఞానదశలో ముంచిన నిందను కులాచారమే మోసికొనవలెను గాని వేఱొకయాచారమును కాదు. వ్యవసాయమును హీనముగా నెంచినది యీ కులాచారమే. వణిక్సంఘమును అడుగంటఁ గొట్టివేసినది యీ కులాచారమే. ఐకమత్యశ్వత్థవృక్షమూలములను ఛేదించినది యీ భూతమే. నైతికజీవమును వేఱంటనూడఁబెఱికినది యీ జాతిపద్ధతియే. ముండమోపులపాలిటి పెనుభూత మీ కులాచారమే. ఈ జాతియే బాలికలకు ముసలము. సదుద్యమములకు ఆటంక మీ జాతిపద్ధతియే.

గృహచ్ఛిద్ర మను దోషస్థాపనముక్రింద ఈ జాతి పద్ధతి నిలువఁబడియున్నది. ఒకటే కుటుంబముగా నుండవలసిన ఆంధ్రదేశమును విభాగించి అఱువది లక్షల యాంధ్రలక్ష్మీపుత్రులను అంత్యజులఁగాను చండాలురఁగాను నెంచి వారిని తన సరిహద్దులలోనుండి పాఱఁద్రోలియున్నది. రెండుకోట్ల యిరువదియైదులక్షల యాంధ్రులలోనుండి యఱువదిలక్షలమందిని కడకు త్రోసి ఆంధ్రరాష్ట్రమెట్లు లితరరాష్ట్రములతో స్పర్థింప నేర్చునో దుర్గ్రాహ్యము. అనాచారాజ్ఞానయుతంబైన యిట్టిసంఘము ఆంధ్రవ్యక్తి నెట్లుస్వీకరించునో గ్రహించుట దుర్లభము

కాలమై పరీక్ష్య మేమో గాని రాజ్యాంగనిపుణులును పరోపకారులును నగు కొందఱు హైందవులు, అంత్యజులు క్రైస్తవమత ప్రవిష్టులగుచుండుటను జూచి, దిగులుచెంది వారిని హిందూమతములోనే యుండునట్లు చేసినయెడల దేశమునకు హితము గల్గును గాని లేనియెడల తప్పక కీడు వాటిల్లు నని చెప్పుచున్నారు. ఈరీతిగా ననేకులు పలుమాఱు నుడువుటలో వారిభావ మేమో స్పష్టముగా తెలియకున్నది. ఏల ననఁగా మానవసేవానిరతుఁడై తన్ను తాను దీనత్వముతో తగ్గించుకొనిన గురువుయొక్క పాదసేవకులైన నిజక్రైస్తవులలో నొక్కఁడును దేశసేవకుఁడే యని చెప్ప సాహసించుచున్నాను. క్రైస్తవమతము పంచములకు కీడు చేసినదా? లేక మేలు చేసినదా?—అని విచారింపక తమ నోటికి వచ్చిన పదముల నుపయోగించుట వారి యజ్ఞానమును మాత్రమే వెల్లడిచేయుచున్నది. క్రైస్తవమతము ప్రతిమానవునిని నీతియుతునిఁగాను స్వతంత్రునిఁగాను పరోపకారినిఁగాను దేశసేవకునిఁగాను జేయుటకే పనిపూనియున్న దని చెప్పిన నది సూనృతమే గాని యనృతము కాదు. క్రైస్తవు లైన కొందఱి ప్రవర్తన మయుక్తముగా నుండిన, అది క్రైస్తవు లందఱికిని జెల్లుచున్న దని చెప్పిన,తర్కశాస్త్రము నెడల మన మన్యాయము చేసినవారమగుదుము. నే నీ విషయము నిక్కడ చేర్చినది యప్రమేయముగా నుండ దని నమ్ముచున్నాఁడను. కాఁబట్టి సంఘములోని దురాచారములను తొలఁగించి సంఘమును శుభ్రపఱచి, అభివృద్ధికి ఆటంకములుగా నుండు విషయముల నన్నిఁటిని పాఱఁద్రోలి, ఆంధ్రుల నందఱిని తిరిగి యొక కుటుంబముగాఁ జేసి, వారిని దేశాభిమానులును కార్యధురంధరులును పరోపకారపారాయణులును నీతికోవిదులును మానవసేవానిరతులు నగు సుపుత్రులనుగాఁ జేసి ఆంధ్రరాజ్యలక్ష్మికి సమర్పించువారు హిందువులైనను క్రైస్తవులైనను భేదముచేయక ఆంధ్రమాత వారిని తన పుత్రులనుగా పరిగణించు ననుట నిస్సందేహము. కావున నొకే పరిణామమునకై పాటుపడువారి విధులలో భేదము లుండిన భయపడ నేల?

భాష— మన యాంధ్రభాష సుభాష. నోటిలో వెన్నవలె కరఁగి పెదవులు దాటఁగనె మధురరససారవాక్యములుగా పరిణమించి వీనులకు విందుగొలుపుచుండును. విదేశీయులు సుభాష యని కొనియాడిన భాషామతల్లికి పుత్రుల మైన మనము ఆ భాషను సంస్కరించి శుభ్రపఱచి ఆ భాషలోనె యుద్గ్రంథములను రచించి లోకములోని సమస్తశాస్త్రముల నాంధ్రీకరించి ప్రయోగమందును లాలిత్యమందును శృంగారమందును మార్దవమాధుర్యములందును ప్రస్తుతము సమ్మిళితమై యుండు సప్తస్వరములను పోఁగొట్టి భాషను పరిశుద్ధిగావించి యాంధ్రవ్యక్తికి సమర్పించుట మన కర్తవ్యము.

ఆచారసంస్కరణము—ఆంధ్రసంఘ సంబంధమైన యనేకదురాచారములు ఆంధ్రులెఱుఁగని రీతిగా తత్సంఘమును బహువిధముల బాధపెట్టుచుండుట యందఱు నెఱిఁగినదే. ఈ విషయ మాంధ్రప్రముఖులప్పుడే విశదముగా ప్రకటించియున్నారు. దురాచారముల సంఖ్య వర్ణనాతీతము కాన నందు గొన్నింటిని మాత్రమే చెప్పఁబూనినాఁడను. ఇట్టి దురాచారములను దొలఁగింపకున్న నవి యాంధ్రవ్యక్తి పూనిన కార్యమునకు మిగుల భంగకరములై పరిణమించును.

బాల్యవివాహము— ఈ దురాచార విషయమై యింతకుమునుపు అనేకులు వ్రాసిన వ్యాసములకు పరిమితియే లేదు. బాల్యవివాహము వలన ఆంధ్రులసంఖ్య క్రమముగా క్షీణించుటయే గాక దేశమున కనర్థము లెన్నియో కలుగుచున్నవి. ఈ యనాచార మాంధ్రసంఘమును వీడిపోయిననే ఆంధ్రుల సంఖ్య వృద్ధియై దేశమునకు హితము కలుగును. లేకున్న ఆంధ్రజాతి యంతరించిపోవు ననుట కేసందియంబు నుండదు.

విధవావివాహనిషేధము— ఈ యాచార మశాస్త్రీయ మని విద్యాసాగరులు మొదలైన పురుషోత్తములు స్థిరపఱచియున్నారు. ఈ ఘోరాచారమువలనఁ గలుగు కీడులు పెక్కులు గనుక విధవల సధవలఁ జేయు యత్నము లాంధ్రదేశమున నిప్పుడు జరుగుచున్నను, మరింత దృఢచిత్తముతో నీ యాచారమును బొత్తిగా తొలఁగించుటకు ప్రయత్నములు చేయఁబడవలెను.

స్త్రీవిద్య—"పొలఁతుల కేల పొత్తముల జోలి?" యను సామెత మన దేశమున వాడుకయై యుండుట మన మెఱిఁగినదే. మాతృస్తన్యపానమే ఆంధ్రవ్యక్తికి ప్రథమపోషణము గాన ఆ క్షీర మజ్ఞానాచారసంకలితమై యుండిన, నదియే యా వ్యక్తి రక్తమున జేరి దాని నెడఁబాయకుండును. అటుగాక యా పాలు జ్ఞానసద్గుణసమితిసమ్మేళనమై యుండిన నాంధ్రసంఘవిశుద్ధికిఁ దగు సాధనమై యుండు.

పరదేశగమనము— ఈ యాచారము సైత మశాస్త్రీయము. ప్రాక్కాన మనవారు వ్యాపారమును జేయుటకై జలనిధి దాటి పరదేశమునకు వెళ్లినట్టు చరిత్రము నిస్సంశయముగా సాధించియున్నది. విద్యను సంపాదించుటకై విద్యార్థులును వాణిజ్యమునకై వ్యాపారులును జలయానముచేసిన, వారిని బహిష్కరించుట ఆంధ్రదేశాభ్యుద

యమునకు మిక్కిలి కీడును గలిగించుట నిస్సంశయము. వారు పరదేశములలోని కష్టముల కోర్చి తమ మాతృభూమిసేవకై సమస్తవిద్యల నేర్చి స్వదేశమునకు తిరిగి వచ్చునప్పుడు వారి కిచ్చు స్వాగతము బహిష్కారమై యున్న నది గొప్ప యాటంక మని నే వేఱె చెప్పవలయునా?

మతసంస్కరణము—మత మనఁగా ప్రతియొకఁడును తాను భగవంతునియెడలఁ గలిగియుండు అభిప్రాయమే. ఈ ధరణిలో ననేక మతము లున్నను అవి యన్నియు ఒకే పరమావధిని వెల్లడిచేయుచున్నవి. మహమ్మదీయమతము క్రీస్తుమతము కన్‌ఫూసియస్‌మతము హిందూమతము మున్నగునవన్నియు ఏకగ్రీవముగాఁ దెలుపునది ఏకదేవోపాసనమే గనుక ఆంధ్రప్రపంచమున నిర్మలమైన ఏకదేవోపాసనమును స్థాపించి దానిని ఆంధ్రులు మానసికారాధనగాఁ జేయున ట్లేర్పఱిచిన వివిధాభిప్రాయముల కెడమియ్యక నిర్మలచిత్తముతో మన పూర్వీకు లేలాగు దృఢభక్తిచిత్తులై యుండిరో తద్రీతి ఆంధ్రు లందఱును భగవంతునియెడల భక్తిపరులై ప్రవర్తింతురు.

నాగ్గవది రాజ్యాంగము—మన పూర్వీకు లనఁగా ఆంధ్రులు సుప్రసిద్ధ చరిత్రము గలవారు. వీరు రాజ్యపరిపాలనా నిపుణులును, సమరసింహులు నై యుండి రని తెలిసెడిని. వారు తమ యాంధ్ర సామ్రాజ్యమునకు రాజధానుల నేర్పాటుచేసికొని వర్తకవ్యాపారమునకై రేవుపట్టణములను నిర్మించుకొని కోటలు గల పట్టణములను గావించుకొని సేనా సన్నాహములు గల్గి లోకమం దంతటను యశోపేతులై యుండి రని చరిత్ర పలుకుచున్నది. వారి యాశ్చర్యచరిత్రను జ నఁజదువ మేను కంపించి గగుర్పాటు నొందుచున్నది. కొన్నిసమయములలో వారి విఖ్యాత చరిత్ర వినునప్పుడు పరవశుల మగుటయు కలదు. ప్రస్తుతము మన హీనస్థితిని జూచిన మనము నిక్కముగా వారి వంశజులమా లేక యిది యొక కలయా యని తోఁచుచున్నది. హీనస్థితిలో నుంటిమిపో వారి వీర్యశౌర్యములును రాజనీతియును మనలను విడనాడినవా? విడనాడలే దనుట కీ యాంధ్రోద్యమమే బలవత్తర సాక్ష్యము. రాజ్యపరిపాలనాది విధులయందు మిగుల నేర్పరులై ప్రజలకు సకలహితము లొనగూర్చుటయందు కార్యసాధకులై యుద్ధమునందు పరరాజులకు మేటిమగలై వెలసినట్టి పురుషోత్తముల వంశజులైన ఆంధ్రులకు స్వపరిపాలనకు యుక్తసమయము రాలే దనుట హాస్యాస్పదమే యని చెప్పిన నది యసత్యముగా నుండదు. ఇప్పటి మద్రాసు రాజధానిలోని పదునొకండు మండలములును పార్శ్వగత స్వదేశరాష్ట్రములలోని కొన్నిభాగములును జేరి ఆంధ్రదేశముగాఁ బరఁగుననియు వైశాల్యము ఇంచుమించు 14 వేల చదరపుమైళ్లనియు ప్రస్తుతము నిర్ణయింపఁబడినది. ఇంతటి వైశాల్యము గల రాష్ట్రమున కొక రాజధానియును ఆ రాజధానిలో ఆంధ్రుల కవసరమైన కళాశాలలును విశ్వవిద్యాశాలయు కర్మశాలలును నిర్మింపఁబడకుండుట ఆంధ్ర రాష్ట్రాభివృద్ధికి మిక్కిలి భంగకర మగుటయే గాక ఆంధ్రవ్యక్తి యంతరించుటకుఁ గూడ యుక్తసాధనమై యున్నది. కనుక ఆంధ్రరాజ్యమున కొక ముఖ్యపట్టణమును గల్పించుట మిక్కిలి యవసరము. ఇట్టి లోపమును బాపి ఆంధ్రుల కోర్కెను స్థిరపఱచుటకే, ప్రత్యేకాంధ్రవ్యక్తిని నిర్మాణము చేయుటకే ఆంధ్రోద్యమము పనిపూని యున్నది.

మరియొక విచిత్ర మే మనఁగా, వీరస్వర్గముఁజూఱగొన్న ఆంధ్రశూరుల పుత్రులమైన మనలను ఆంగ్లేయప్రభుత్వమువారు సైన్యములో యోధులుగా ప్రవేశపెట్టకుండుటయే. ప్రభుత్వమువా రాంధ్రులను సేనలో సైనికులుగా చేర్చుకొన కుండుట ఆంధ్రుల మనస్సులను మిక్కిలి వ్యాకులత జెందఁజేసి యున్నది. మరియు నిది మన పూర్వీకుల చరిత్రకు ఒక కళంకము నారోపించి యిఁక రాఁబోవు వారికి మన చరిత్ర హాస్యాస్పదముగా నుండునట్లొనర్చుచున్నది. ఇట్టి కళంకమును తొలఁగించి ఆంధ్రుల ధైర్యస్థైర్యసాహస పరాక్రమాదులను లోకమునకు ప్రకటించుట కీ యాంధ్రవ్యక్తిజననముగాంచి మనలను ధన్యులఁ గావించుచున్నది.

ఇఁక నావ్యాసములోని పర్యవసానము మాత్రము కొంచెము విశదీకరించి విరమించెదను.

ఈ వ్యాసమువలన కొంతమట్టునకైనను మనప్రయత్నము లెట్టి మార్గముల ననుసరింపఁదగినవో మరియు మన మాంధ్రోద్యమమునెడల జూపవలసిన ఆదరణ మెట్టిదో విశదమై యుండునని నమ్ముచున్నాను.

ఆంధ్రరాజ్యము ప్రత్యేకరాష్ట్రముగా మార్చి రాజ్యమునకగత్యమైన యొక రాజధానిని స్థాపించి రాజధానిలో ఆంధ్రుల విద్యకును పరిశ్రామిక విద్యకును తగుసదుపాయములను గల్పించి ఆంధ్రదేశమున నుత్పత్తి యగు వస్తువుల నెగుమతి చేయుటకొక రేవును ఆంధ్ర దేశమునందే నిర్మించి, సేనలో నాంధ్ర యువకుల భటులుగా నంగీకరించి ఆంధ్రదేశమున నాంధ్రోద్యోగియులనె నియమించి తర్వాత వారిని స్వపరిపాలనానిపుణుల జేసి సమస్తవిషయములయం దాంధ్రులను ప్రోత్సాహపఱచుటకు ప్రభుత్వమువారు బాధ్యులై యున్నారు. ఇట్టి యాంధ్రజాత్యుద్ధరణము హైందవజాత్యుద్ధరణమునకును సమగ్రమానవజాత్యుద్ధరణమునకును తప్పకుండ నడిపించును. ఇదియే యాంధ్రోద్యమముయొక్క చరమవ్యవస్థ. ఈ దృఢసంకల్పము ఫలించుటకు మానవసేవయే గొప్ప సాధనము. తమంత తమకును తమవారికిని సేవఁజేసి మెప్పువడయుట కనిష్ఠమును మృగప్రాయము నై యుండును. తన పొరుగువానికి సేవఁ జేయుట మధ్యమము. తా నెన్నఁ డెఱుఁగనివానికి సేవఁ జేయుటయే యుత్తమము. ఇందులో మధ్యమమార్గము ననుసరించి యుత్తమమార్గమునకును వచ్చుట శ్రేయస్కరము. ఒక గొప్ప బోధకుఁ డీలాగు సెలవిచ్చియున్నాడు. "సేవఁ జేయించుకొనుటకు కాదు. చేయుటకే మనుష్యకుమారుఁ డవతరించెను" ఈ బోధ నాంధ్రు లనుసరించిన దాము కోరినట్లు కార్యసిద్ధి బడయుదురు. ఏల నన, ఆంధ్రరాజ్యలక్ష్మియెడల ప్రత్యక్షము కాఁబోవు ధన్యత కిప్పటి మన ప్రయాసము లత్యల్పము లని యెంచుచున్నాను.

మూఁడవది సంఘసంస్కరణము— అనఁగా ఆంధ్ర జనులయందలి శాఖోపశాఖలలోని లోటుపాటులను సంస్కరించుట.

జాతిపద్ధతి. ఈ పద్ధతియే మన యాంధ్రదేశమునకు మిక్కిలి కీడు మూడఁజేసియున్న దని నుడువఁజెల్లు. చతురన్వయము లుండిన దేశముల లక్షలకొలఁది శాఖలచే భేదింపఁబడియున్నది. ఒకరి నొకరు నీచముగా నెంచుచు తమ్ముఁ దామే తక్కినవారినుండి కేటాయించుకొని యొకరి సుఖదుఃఖముల నొకరు గణింపక ప్రత్యేకముగా నుండుట దేశమునకు అనర్థదాయకమే యని చెప్పనొప్పు. జాతిపద్ధతివల్ల పరస్పరసంఘీభావము నశించెను. సంఘ మనఁగా ఒకనికొఱకు అందఱును అందఱికొఱకు ఒకఁడును అను అర్థము గాక మఱేమి? హిందూసంఘమును ప్రస్తుతహీనస్థితికిఁ దెచ్చిన విషయము లన్నిఁటిలోను జాతిపద్ధతినే మొదటిదిగా నెంచిన బాధక మెవ్వరికిని కలుగదు. ఆంధ్రదేశమును అజ్ఞానదశలో ముంచిన నిందను కులాచారమే మోసికొనవలెను గాని వేఱొక యాచారమును కాదు. వ్యవసాయమును హీనముగా నెంచినది యీ కులాచారమే. వణిక్సంఘమును అడుగంటఁ గొట్టివేసినది యీ కులాచారమే. ఐక్యాన్యోన్యతావృక్షమూలములను ఛేదించినది యీ భూతమే. నైతికజీవమును వేఱంటనూడఁ బెఱికినది యీ జాతిపద్ధతియే. ముండమోపులపాలిటి పెనుభూత మీ కులాచారమే. ఈ జాతియే బాలికలకు ముసలము. సదుద్యమములకు ఆటంక మీ జాతిపద్ధతియే.

గృహచ్ఛిద్ర మను దోషస్థాపనముక్రింద ఈ జాతి పద్ధతి నిలువఁబడియున్నది. ఒకటే కుటుంబముగా నుండవలసిన ఆంధ్రదేశమును విభాగించి ఆఱువది లక్షల యాంధ్రలక్ష్మీపుత్రులను అంత్యజులఁగాను చండాలురఁగాను నెంచి వారిని తన సరిహద్దులలోనుండి పాఱఁద్రోలి యున్నది. రెండుకోట్ల యిరువదియైదులక్షల యాంధ్రులలోనుండి యఱువదిలక్షలమందిని కడకు త్రోసి ఆంధ్రరాష్ట్ర మెట్టు లితరరాష్ట్రములతో స్పర్థింపఁజేర్చునో దుర్గ్రాహ్యము. అనాచారాజ్ఞానయుతంబైన యిట్టిసంఘము ఆంధ్రవ్యక్తి నెట్లుస్వీకరించునో గ్రహించుట దుర్లభము.

కాలవైపరీత్య మేమో గాని రాజ్యాంగనిపుణులును పరోపకారులును నగు కొందఱు హైందవులు, అంత్యజులు క్రైస్తవమతప్రవిష్టులగుచుండుటను జూచి, దిగులుచెంది వారిని హిందూమతములోనే యుండునట్లు చేసినయెడల దేశమునకు హితము గల్గును గాని లేనియెడల తప్పక కీడు వాటిల్లు నని చెప్పుచున్నారు. ఈరీతిగా ననేకులు పలుమాఱు నుడువుటలో వారిభావ మేమో స్పష్టముగా తెలియకున్నది. ఏల ననఁగా మానవసేవానిరతుఁడై తన్ను తాను దీనత్వముతో తగ్గించుకొనిన గురువుయొక్క పాదసేవకులైన నిజక్రైస్తవుల లో నొక్కఁడును దేశసేవకుఁడే యని చెప్ప సాహసించుచున్నాను. క్రైస్తవమతము పంచములకు కీడు చేసినదా? లేక మేలు చేసినదా?—అని విచారింపక తమ నోటికి వచ్చిన పదముల నుపయోగించుట వారి యజ్ఞానమును మాత్రమే వెల్లడిచేయుచున్నది. క్రైస్తవమతము ప్రతిమానవునిని నీతియుతునిఁగాను స్వతంత్రునిఁగాను పరోపకారినిఁగాను దేశసేవకునిఁగాను జేయుటకే పనిపూనియున్న దని చెప్పిన నది సూనృతమే గాని యనృతము కాదు. క్రైస్తవులైన కొందఱి ప్రవర్తన మయుక్తముగా నుండిన, అది క్రైస్తవు లందఱికిని జెల్లుచున్న దని చెప్పిన,తర్కశాస్త్రము నెడల మన మన్యాయము చేసినవార మగుదుము. నే నీ విషయము నిక్కడ చేర్చినది యప్రమేయముగా నుండ దని నమ్ముచున్నాఁడను. కాఁబట్టి సంఘములోని దురాచారములను తొలఁగించి సంఘమును శుభ్రపఱచి, అభివృద్ధికి ఆటంకములుగా నుండు విషయముల నన్నిఁటిని పాఱఁద్రోలి, ఆంధ్రుల నందఱిని తిరిగి యొక కుటుంబముగాఁ జేసి, వారిని దేశారాధకులును కార్యధురంధరులును పరోపకారపారాయణులును నీతికోవిదులును మానవసేవానిరతులు నగు సుపుత్రులనుగాఁ జేసి ఆంధ్రరాజ్యలక్ష్మికి సమర్పించువారు హిందువులైనను క్రైస్తవులైనను భేదముచేయక ఆంధ్రమాత వారిని తన పుత్రులనుగా పరిగణించు ననుట నిస్సందేహము. కావున నొకే పరిణామమునకై పాటుపడువారి విధులలో భేదము లుండిన భయపడనేల?

భాష— మన యాంధ్రభాష సుభాష. నోటిలో వెన్నవలె కరఁగి చెవులు దాటఁగనె మధురరససారవాక్ఫలముగా పరిణమించి వీనులకు విందుగొలుపుచుండును. విదేశీయులు సుభాష యని కొనియాడిన భాషామతల్లికి పుత్రుల మైన మనము ఆ భాషను సంస్కరించి శుభ్రపఱచి ఆ భాషలోనె యుద్గ్రంథములను రచించి లోకములోని సమస్తశాస్త్రముల నాంధ్రీకరించి ప్రయోగమందును లాలిత్యమందును శృంగారమందును మార్దవమాధుర్యములందును ప్రస్తుతము సమ్మిళితమై యుండు నపస్వరములను పోఁగొట్టి భాషను పరిశుద్ధి గావించి యాంధ్రవ్యక్తికి సమర్పించుట మన కర్తవ్యము.

ఆచారసంస్కరణము—ఆంధ్రసంఘసంబంధమైన యనేకదురాచారములు ఆంధ్రులకెఱుఁగని రీతిగా తత్సంఘమును బహువిధముల బాధపెట్టుచుండుట యందఱు నెఱిఁగినదే. ఈ విషయ మాంధ్రప్రముఖులప్పుడే విశదముగా ప్రకటించియున్నారు. దురాచారముల సంఖ్య వర్ణనాతీతము కాన నందు గొన్నింటిని మాత్రమే చెప్పఁబూనినాఁడను. ఇట్టి దురాచారములను దొలఁగింపకున్న నవి యాంధ్రవ్యక్తి పూనిన కార్యమునకు మిగుల భంగకరములై పరిణమించును.

బాల్యవివాహము— ఈ దురాచార విషయమై యింతకుముం దనేకులు వ్రాసిన వ్యాసములకు పరిమితియే లేదు. బాల్యవివాహము వలన ఆంధ్రులసంఖ్య క్రమముగా క్షీణించుటయే గాక దేశమున కనర్థము లెన్నియో కలుగుచున్నవి. ఈ యనాచార మాంధ్రసంఘమును వీడిపోయిననే ఆంధ్రుల సంఖ్య వృద్ధియై దేశమునకు హితముకలుగును. లేకున్న ఆంధ్రజాతి యంతరించిపోవు ననుట కేసందియంబు నుండదు.

విధవావివాహనిషేధము— ఈ యాచార మశాస్త్రీయ మని విద్యాసాగరులు మొదలైన పురుషోత్తములు స్థిరపఱచియున్నారు. ఈ ఘోరాచారమువలనఁ గలుగు కీడులు పెక్కులు గనుక విధవల సధవలఁ జేయు యత్నము లాంధ్రదేశమున నిప్పుడు జరుగుచున్నను, మరింత దృఢచిత్తముతో నీ యాచారమును బొత్తిగా తొలఁగించుటకు ప్రయత్నములు చేయఁబడవలెను.

స్త్రీవిద్య—"పాలఁతుల కేల పొత్తముల జోలి?" యను సామెత మన దేశమున వాడుకయై యుండుట మన మెఱిఁగినదే. మాతృస్తన్యపానమే ఆంధ్రవ్యక్తికి ప్రథమపోషణము గాన ఆ క్షీర మజ్ఞానాచారసంకలితమై యుండిన, నదియే యా వ్యక్తి రక్తమున జేరి దాని నెడఁబాయకుండును. అటుగాక యా పాలు జ్ఞానసద్గుణసమిళితసమ్మేళనమై యుండిన నాంధ్రసంఘవిశుద్ధికిఁ దగు సాధనమై యుండు.

పరదేశగమనము— ఈ యాచారము సైత మశాస్త్రీయము. ప్రాక్కాన మనవారు వ్యాపారమును జేయుటకై జలనిధి దాటి పరదేశమునకు వెళ్లినట్లు చరిత్రము నిస్సంశయముగా సాధించియున్నది. విద్యను సంపాదించుటకై విద్యార్థులును వాణిజ్యమునకై వ్యాపారులును జలయానముచేసిన, వారిని బహిష్కరించుట ఆంధ్రదేశాభ్యుద

యమునకు మిక్కిలి కీడును గలిగించుట నిస్సంశయము. వారు పరదేశములలోని కష్టముల కోర్చి తమ మాతృభూమిసేవకై సమస్తవిద్యల నేర్చి స్వదేశమునకు తిరిగి వచ్చునప్పుడు వారి కిచ్చు స్వాగతము బహిష్కారమై యున్న నది గొప్ప యాటంక మని నే వేఱె చెప్పవలయునా?

మతసంస్కరణము—మత మనఁగా ప్రతియొకఁడును తాను భగవంతునియెడలఁ గలిగియుండు అభిప్రాయమే. ఈ ధరణిలో ననేక మతము లున్నను అవి యన్నియు ఒకే పరమావధిని వెల్లడిచేయుచున్నవి. మహమ్మదీయమతము క్రీస్తుమతము కన్‌ఫూసియస్‌మతము హిందూమతము మున్నగునవన్నియు ఏకగ్రీవముగాఁ దెలుపునది ఏకదేవోపాసనమే గనుక ఆంధ్రప్రపంచమున నిర్మలమైన ఏకదేవోపాసనమును స్థాపించి దానిని ఆంధ్రులు మానసికారాధనగాఁ జేయున ట్లేర్పతిచిన వివిధాభిప్రాయముల కడమియ్యక నిర్మలచిత్తముతో మన పూర్వు లెలాగు దృఢభక్తిచిత్తులై యుండిరో తద్రీతి ఆంధ్రు లందఱును భగవంతునియెడల భక్తిపరులై ప్రవర్తింతురు.

నాల్గవది రాజ్యాంగము—మన పూర్వు లనఁగా ఆంధ్రులు సుప్రసిద్ధ చరిత్రము గలవారు. వీరు రాజ్యపరిపాలనా నిపుణులును, సమరసింహులు నై యుండి రని తెలిసెడిని. వారు తమ యాంధ్ర సామ్రాజ్యమునకు రాజధానుల నేర్పాటుచేసికొని వర్తకవ్యాపారమునకై రేవుపట్టణములను నిర్మించుకొని కోటలు గల పట్టణములను గావించుకొని సేనా సన్నాహములు గల్గి లోకమం దంతటను యశోపేతులై యుండి ని చరిత్ర పలుకుచున్నది. వారి యాన్నత్యచరిత్రను జ నఁజదువమేను కంపించి గగుర్పాటు నొందుచున్నది. కొన్నిసమయములలో వారి విఖ్యాత చరిత్ర వినునప్పుడు పరవశుల మగుటయు కలదు. ప్రస్తుతము మన హీనస్థితిని జూచిన మనము నిక్కముగా వారి వంశజులమా లేక యిది యొక కలయా యని తోఁచుచున్నది. హీనస్థితిలో నుంటిమిపో వారి వీర్యశౌర్యములును రాజనీతియును మనలను విడనాడినవా? విడనాడలే దనుట కీ యాంధ్రోద్యమమే బలవత్తర సాక్ష్యము. రాజ్యపరిపాలనాది విధులయందు మిగుల నేర్పరులై ప్రజలకు సకలహితము లొనగూర్చుటయందు కార్యసాధకులై యుద్ధమునందు పరరాజులకు మేటిమగలై వెలసినట్టి పురుషోత్తముల వంశజులైన ఆంధ్రులకు స్వపరిపాలనకు యుక్తసమయము రాలే దనుట హాస్యాస్పదమే యని చెప్పిన నది యనృతముగా నుండదు. ఇప్పటి మద్రాసు రాజధానిలోని పదునొకండు మండలములును పార్శ్వగత స్వదేశరాష్ట్రములలోని కొన్ని భాగములును జేరి ఆంధ్రదేశముగాఁ బరఁగు ననియు వైశాల్యము ఇంచుమించు 14 వేల చదరపుమైళ్లనియు ప్రస్తుతము నిర్ణయింపఁబడినది. ఇంతటి వైశాల్యము గల రాష్ట్రమున కొక రాజధానియును ఆ రాజధానిలో ఆంధ్రుల కవసరమైన కళాశాలలును విశ్వవిద్యాశాలయు కర్మశాలలును నిర్మింపఁబడకుండుట ఆంధ్ర రాష్ట్రాభివృద్ధికి మిక్కిలి భంగకర మగుటయే గాక ఆంధ్రవ్యక్తి యంకురించుటకుఁ గూడ యుక్తసాధనమై యున్నది. కనుక ఆంధ్రరాజ్యమున కొక ముఖ్యపట్టణమును గల్పించుట మిక్కిలి యవసరము. ఇట్టి లోపమును బాపి ఆంధ్రుల కోర్కెను స్థిరపఱచుటకే, ప్రత్యేకాంధ్రవ్యక్తిని నిర్మాణము చేయుటకే ఆంధ్రోద్యమము పనిపూని యున్నది.

మరియొక విచిత్ర మే మనఁగా, వీరస్వర్గముఁ జూఱగొన్న ఆంధ్రశూరుల పుత్రులమైన మనలను ఆంగ్లేయప్రభుత్వమువారు సైన్యములో యోధులుగా ప్రవేశపెట్టకుండుటయే. ప్రభుత్వమువా రాంధ్రులను సేనలో సైనికులుగా చేర్చుకొనకుండుట ఆంధ్రుల మనస్సులను మిక్కిలి వ్యాకులతఁ జెందఁజేసి యున్నది. మరియు నిది మన పూర్వికుల చరిత్రకు ఒక కళంకము నారోపించి యిఁక రాఁబోవు వారికి మన చరిత్ర హాస్యాస్పదముగా నుండునట్లొనర్చుచున్నది. ఇట్టి కళంకమును తొలఁగించి ఆంధ్రుల ధైర్యస్థైర్యసాహస పరాక్రమాదులను లోకమునకు ప్రకటించుట కీ యాంధ్రవ్యక్తిజననముగాంచి మనలను ధన్యులఁ గావించుచున్నది.

ఇఁక నా వ్యాసములోని పర్యవసానము మాత్రము కొంచెము విశదీకరించి విరమించెదను.

ఈ వ్యాసమువలన కొంతమట్టునకైనను మన ప్రయత్నము లెట్టి మార్గముల ననుసరింపఁదగినవో మరియు మన మాంధ్రోద్యమమునెడల జూపవలసిన ఆదరణ మెట్టిదో విశదమై యుండు నని నమ్ముచున్నాను.

ఆంధ్రరాజ్యము ప్రత్యేకరాష్ట్రముగా మార్చి రాజ్యమునకగత్యమైన యొక రాజధానిని స్థాపించి రాజధానిలో ఆంధ్రుల విద్యకును పరిశ్రామిక విద్యకును తగు సదుపాయములను గల్పించి ఆంధ్రదేశమున నుత్పత్తి యగు వస్తువుల నెగుమతి చేయుటకొక రేవును ఆంధ్ర దేశమునందే నిర్మించి, సేనలో నాంధ్ర యువకుల భటులుగా నంగీకరించి ఆంధ్రదేశమున నాంధ్రోద్యోగియుల నె నియమించి తర్వాత వారిని స్వపరిపాలనానిపుణుల జేసి సమస్తవిషయములయం దాంధ్రులను ప్రోత్సాహపఱచుటకు ప్రభుత్వమువారు బాధ్యులై యున్నారు. ఇట్టి యాంధ్రజాత్యుద్ధరణము హైందవజాత్యుద్ధరణమునకును సమగ్రమానవజాత్యుద్ధరణమునకును తప్పకుండ నడిపించును. ఇదియే యాంధ్రోద్యమముయొక్క చరమవ్యవస్థ. ఈ దృఢసంకల్పము ఫలించుటకు మానవసేవయే గొప్ప సాధనము. తమంత తమకును తమవారికిని సేవఁజేసి మెప్పువడయుట కనిష్ఠమును మృగప్రాయము నై యుండును. తన పొరుగువానికి సేవఁ జేయుట మధ్యమము. తా నెన్నఁ డెఱుఁగనివానికి సేవఁ జేయుటయే యుత్తమము. ఇందులో మధ్యమమార్గము ననుసరించి యుత్తమమార్గమువఱకును వచ్చుట శ్రేయస్కరము. ఒక గొప్ప బోధకుఁ డీలాగు సెలవిచ్చియున్నాడు. "సేవఁ జేయించుకొనుటకు కాదు. చేయుటకే మనుష్యకుమారుఁ డవతరించెను" ఈ బోధ నాంధ్రు లనుసరించిన దాము కోరినట్లు కార్యసిద్ధి బడయుదురు. ఏల నన, ఆంధ్రరాజ్యలక్ష్మియెడల ప్రత్యక్షము కాఁబోవు ధన్యత కిప్పటి మన ప్రయాసము లత్యల్పము లని యెంచుచున్నాను.

# మహమ్మదీయమతము

ఉమ్రే అలీషా కవిగారు

పరమేశ్వరుని సృష్టివైచిత్ర్య మెవ్వరికిని తోఁపరాదు. ఏది కేవల మవిద్యామయమై మృత్తికప్రాయమై యుండునో అందొకదివ్య తేజము నుదయింపఁజేయును. ఒక చిన్న యింటియందు శక్తియందు ముత్యమువలె నొక గొప్ప రాజకీయము దాఁగియుండును. అట్లే యరబ్బీ కఱకురాళ్లయందు మహమ్మద్ అను రత్న ముదయించి పరశువేది యినుమును బంగారమొనరించునట్లు ఆ క్రూరపశువుల నొక్కసారిగా సాధువులను జేసి జగత్తునం దర్ధభాగమునకంటె నెక్కుడు భూభాగమును జయింపఁజేసి కోటులకొలంది ప్రజలచే బ్రహ్మాండకటాహపంక్తు లన్నియెడల తన మంత్రగీతికల పాడించి ఆ మృదునిస్వనంబుల నెందతినో పూతచరితులం జేయుచున్నది. ఆహా ! మహమ్మదు దిక్కులేని యొక పేదబాలుఁడే గదా !

మొదటినుండియునరబ్బులుసర్వతంత్రస్వతంత్రులు. యూదులకువలె దాస్యశృంఖల వారిమెడ నెన్నఁడును వ్రేలాడఁబడి యుండలేదు. మిసర్ (ఈజిప్టు) లో ఫిరవోనులపై వలెను, హిందూదేశమున నార్యులపై వలెను, దౌర్జన్యమును పీడాకరమును గలుగఁజేయు నేలెగయును వారిపై నధికారమును చలాయింపలేదు. అలగ్జాండరు సైన్యము పూర్వదిగ్భాగమునఁ గల దేశముల నెల్ల నల్లకల్లోలపఱిచినది గాని యీ యరబ్బులవంక కన్నెత్తియైనఁ జూడలేకపోయినది. వాని ధ్వజపటము క్రింద నెందఱో శరణాగతులైరిగాని యరబ్బు లొక రాయబారినైన పంపి యెఱుంగరు. వారలు క్రీస్తునకు పూర్వము మూఁడువందల యేండ్ల క్రిందటనే నిక్కిలి నాగరకులై స్వరాజ్యమును స్థాపించుకొనిరి. అప్పుడే అల్‌జబర్ అనువాఁడు ఆల్జిబరాయును, ఉఖిలీదస్ అనువాఁడు యూక్లిడ్డును వ్రాసిరి. ఇతరులనేక తత్వశారీరకశాస్త్రముల పూరించిరి. ఇవి నేఁటికిని గలవు. ఆ కాలమున వెలువడిన కోట్లకొలఁది గ్రంథము లిప్పుడు లండన్ పేరిసు నగరములలో అరబ్బీ భాషలోనే విరాజిల్లుచున్నవి.

మహమ్మదు తన మతమును ప్రబోధించు నప్పటికి అరబ్బులు నిరంతర కలహప్రియులై గృహవివాదంబులఁ దగులుకొని పోరాడుచుండిరి. ఆఁడుపిల్లలఁ గాంచుట పౌరుషహీన మని నిర్దయులై పాతిపేయుచుండిరి. నీళ్లనూతులయొద్ద కలహములు, దారినడుచుటయందు పోరాటములు. దేశ మంతయు కలహములతో నిండి నిరంతర మల్లకల్లోల మగుచుండెను. మహమ్మదు వానినన్నిఁటిని మాన్పి జనులను స్థిరప్రజ్ఞులను జేసి దేశోద్ధారణమునకై మరలించి వారికి మతప్రచారమునం దుత్సాహమును గలిగించెను. వారి హృదయములను తేజఃపుంజములచే నింపెను. పూర్వము యూదులు గూడ నిట్లే బయలు వెడలిరి కాని వారు తమ మతమునం దొరులకుఁ జోటియ్యక దానిని సొంతకాణాచిగా నెంచుకొను చుండిరి. ఆర్యుల తరువాత భారతీయులును నిట్లే పలుకఁజొచ్చిరి. ఆ వెఱ్ఱి నేఁడు మఱింత ముదిరిపోవుచున్నది. ఇది యచ్చపు విద్య కొఱంత గలవారి కార్యములు.

మహమ్మదు తన పేరుతో యూదులవలెను క్రైస్తవులవలెను మతము నెలకొల్పి పురాణమునే ప్రమాణముగా పెట్టలేదు. తన మతమునకు "ఇస్లామ్" అను పేరు పెట్టెను. దాని కర్థము 'అనాదిసిద్ధమైనది' అని తేలుచున్నది. అనఁగా ఇస్లాము మహమ్మదు తోడనే గాదు, ప్రపంచ ముదయించి నప్పటినుండియు నున్నది. ఏకేశ్వరప్రతిపాదక మైన దంతయు ఇస్లా మనియే యర్థము.

ఇది వేదములయందును బైబిలునందును ఖురానునందును జెప్పఁబడియున్న దనియు ఖురాను ప్రపంచముతోపాటు సృజింపఁబడిన దనియు మహమ్మదు నిర్వచించెను. వేదములు ప్రపంచములకంటె పూర్వ మని ఋగ్యజుస్సామవేదములవలన యథాక్రమముగా మూఁడు వ్యాహృతులు పుట్టెను. పరిశుద్ధములైన యవి తప మొనర్పఁగా వానివలన, అకార, ఉకార, మకారము లను మూఁడు వర్ణము లుత్పన్నములైనవి. అవి యొక్కొక్కటిగాఁ గూడి, ఓంకారమైన దనియు ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ సర్వం ఖల్విదం బ్రహ్మ యనియు ఆ యోంకారము బ్రహ్మమైన దనియు ఆబ్రహ్మను ప్రపంచమును సృజించె ననియుఁ జెప్పఁబడియున్నది.

ఇది యిట్లుండ "అనంతో వై వేదాః" అనఁగా వేదము లనంతములు అని చెప్పఁబడియున్నది. ఖురానులోని ఆయత్ అనఁగా ఋక్కు.

అక్, యౌమ, అక్‌మల్‌తొ, లకుం, దానొకుం<br>
వ, అత్, మంతొ అలేకుం, న్యామతి.<br>
ఓ, రజయితొలకుం, యిస్లా మదానన్.

అనఁగా ఈ ధర్మము మీకొఱకు పూర్తి గావించితిని. ఈ యమృతము అనఁగా ఈ మోక్షపదార్థము అనగా ఇస్లాముమతము సాంతముగా మీకొఱకు పరిసమాప్తి గావించితిని. దీనిని నేను సమ్మతించితిని - అని యున్నది. దానిని బట్టి చూడఁగాననంతధర్మము గల వేదమునకు ఖురాను అంత్యధర్మముగా మన మంగీకరించినయెడల నిర్వివాద మేర్పడుచున్నది.

మహమ్మదు తాను కడపటి పయంబర్ (రిఫార్మరు) నని ప్రకటించుకొనియెను. ఏ మనిన పరమేశ్వరునిచే సృజింపఁబడిన ప్రపంచము సవరణ చేయ నవసరము లేనిది. ఏయే యుపకరణము లెందుకెందుకు కావలయునో యవి యన్నియు నొకేసారి సమకూర్చియున్నాఁడు. మరల నొక నూతనావయవమును గాని యొక నూతనభూతమును గాని పుట్టింప నగత్యము లేదు. మనుష్యు లొనరించు కార్యముల కన్నియో

సవరణలు కావలయును. ఎన్నియో మార్పులు కావలయును. ఈశ్వర కార్యమున కేదియు నగత్యము లేదు. అట్టి యీశ్వరుని ప్రధానోద్దేశము ప్రపంచమున తనొక్కనిగా నారాధింపఁజేయుటయే యని నిశ్చయింపవలసియున్నది. బహ్వీశ్వరోపాసన యీశ్వరుని సంకల్పము గాదు. కేవలము మనుష్యకల్పితము. "అజ్ఞానభావనార్థాయాం ప్రతిమాః పరికల్పితాః" అజ్ఞానులకొఱకు ప్రతిమార్చనము కల్పింపఁబడినది. అని చెప్పబడియున్నది. వేదములయం దీశ్వరుఁ డొక్కఁడనియే వివరింపఁబడియున్నది. "ఏకో దేవస్సర్వభూతేషు గూఢః" అనియు "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అనియు ననేకశ్రుతులున్నవి. కాని పౌరాణికుల ప్రబోధనాతిరేకంబున భారతీయుల రక్తనాళములయందు శివవిష్ణ్వాది భిన్నదేవతల భక్తి జీర్ణమై మరల్పరాని యజ్ఞానాంధకారమున కీడ్చుటచేత నేకేశ్వరత్వబుద్ధికి హాని సంధిల్లినది. బౌద్ధు లన్ననో నాస్తికులు. క్రైస్తవులు ఈశ్వరునిచే బిడ్డను గనిపించిరి. ఇట్లందఱు కందఱును పెడమార్గములను ద్రొక్కి జాతివ్యక్తులను మార్చుకొని నిలిచిపోయిరి. మహమ్మదీయులయం దెవ్వని నడిగినను నీశ్వరుఁ డొక్కఁ డనియే సాక్ష్య మిచ్చును గాని యన్యథా చూపనేరఁడు. ఆవిషయమై యతనికి రెండవ చింతలేదు. అట్టి స్థిరజ్ఞానము సంఘమున నాబాలగోపాలము నం దొక్కటే తీరున వ్యాపింపఁజేయుటయే పరమేశ్వరుని ప్రవక్త. అనఁగా రిఫార్మరుయొక్క ఆశయము. ఇది మహమ్మదు పూర్తిఁ గావించెను. కావున మఱియెప్పటికిని ఏరిఫార్మరును బయలువెడల నావశ్యకము లేదు. దానంజేసియే మహమ్మదు తాను కడపటి రిఫార్మరు నని చెప్పుకొనియెను.

అతనితరువాత నెందైన నే రిఫార్మరైన బయలుదేఱె ననుకొందము. ఇంతకన్న పెద్దసంగతి యేదియును స్థాపింపఁజాలఁడు. ఏమైన కొన్నికర్మములయందు మార్పును కనిపెట్టునేమో గాని అవియైనను ననేకవివాద భూయిష్ఠము లై సర్వజనసాధారణములు గాక యేదో యొక మూల నొదిగియుండును. అం దార్యబ్రహ్మసామాజిక సంస్థాపకులు గూడ రిఫార్మరుల మని చెప్పుకొనుచున్నారు. చెప్పుకొందురు గాక వీ రీశ్వరప్రతిపాదకమున నేకత్వము నే యంగీకరించి ప్రబోధించుచున్నారు. ఇది మహమ్మను జనసామాన్యమునందు వ్యాపింపఁజేసియే యున్నాఁడు. రెండవది యహింస. హింస విషయమై పెద్ద వివాద మున్నది. అది యింకను తెగలేదు. మొదటినుండియు మహాశాస్త్రకారులును ఆగతానాగతవేత్తలైన మునులును గల యాస్తికమతము లన్నియు ననఁగా హిందూ క్రైస్తవ మహమ్మదీయ మత మతాంతరము లన్నియు హింస కంగీకరించినవే. అంగీకరింపనివారు నాస్తికులైన బౌద్ధులు. దాని హేతు వేమో యింకను వివాదమున నున్నది. హింసవలనఁ గలిగిన పాపమును శిక్షించెడి యీశ్వరుఁడే యనుమాన మైనప్పుడు, జన్మజన్మాంతరములందును హింసాస్తేయములా యవశ్యాచరణయోగ్యములు? ఇది సర్వదా మిథ్యాపవాదము.

బ్రహ్మసామాజికులు సమస్తమతములలోని మంచి విషయములను తీసికొనియెదమని చెప్పుదురు. ఇది యెంత మట్టుకు సమంజసము? దినదినమును మాఱిపోవుచున్న యభిప్రాయభేదయుక్త మైన మతములయందు ఎప్పటి కేది మంచి దని నేమింపఁగలరు? ఎవరికి సమ్మతమైన మతమునందు వా రున్న బాధకము లేదు. ఆ మతమునందలి మంచి నాకర్షించుద మనుటతోడనే వివాద మేర్పడుచున్నది. అనఁగా మంచిది చెడ్డది అని మొదట విమర్శింపవలసియున్నది. అప్పుడు బాగోగులు విమర్శించుట కడు దుర్లభము. ఏ మనిన, వాదతత్త్వ మనంతమైనది. కావున అగును కా దను నిరువురిలోను నెవ్వఁడో యొకఁ డోడవచ్చును. గెలిచిన భాగము మనము స్వీకరించుట కిచ్చగించెదము. మఱియొకఁడు వచ్చి యేది యోడెనో ఆ మతమునకు జీవము పోసి నిలువఁబెట్టి దానిచే మొదట గెలిచినదాని నోడించును. అప్పుడు మన మేది మంచిది యని గ్రహింపవలసియుండును. ఇట్లు నిరంతరాయా వివాదలభ్యజ్ఞానము స్వీకారయోగ్యము గాదు. కావున వాదమునందు మనుష్యులే యోడిరి గాని వాద మోడలేదు. మిరెపకాయ నొకఁడు కారముగ నున్నదనును. మఱియొకఁడు తియ్యఁగా నున్న దనును. అదియె ట్లనిన తీపులేకున్న చీమలు పట్టునా? అని యుదాహరణ మిచ్చును. అప్పుడు మన 'ఔనౌ' నని తల పంకించెదము. వాదము కేవలము యుక్తిప్రధానమైనది. కావున త్యజింపవలసినది. ఇతరమతములందుఁగల మంచిని తీసికొనియెద మనువారికి వాదమునకు వినా శరణ్యము లేదు. అందు తేలిన మంచి నిశ్చయమైనదా? అనిన నది వివాదజన్యము గావున మలిన మయినది. అనఁగా మరియొక భిన్నాభిప్రాయము గలవాని వాదముచే ఖండింపఁబడుచున్నది. ఇట్లు భ్రాంతులైనవారు ఎండమావులకుఁ బాఱు మృగములను బోలినవారు. తృప్తి లభించుట కవకాశము లేదు. అతృప్తుఁడు మోక్షార్హుఁడు గాఁడు. అనఁగా జ్ఞానవ్యవసాయము పూర్తి గావింపనేరఁడు. కాని జిజ్ఞాసువు మాత్ర మగును.

మఱియు నిదివఱకు మోక్షాపేక్షులైన విద్వత్తులు అన్ని త్రోవలు త్రొక్కియే విడిచిరి గావున క్రొత్త మతము (రిఫారము) కనిపెట్టుట యసంభవము.

జ్ఞానవాసిష్ఠమునందు లోకాయతాదిమతము మొదలు సాంఖ్యమతమువఱకును గల 27 మతములవారును జీవుని గుఱించియు, తృణార్చకులు మొదలు యోగమతస్థులవఱకును 27 గల మతములవారును నీశ్వరుని గుఱించియు భ్రాంతులైనవా రని చెప్పియున్నది.

# ఆంధ్ర నాటక రంగస్థలము

శ్రీపాద కామేశ్వరరావుగారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

ఉద్దేశము— ప్రస్తుతమందు ప్రతిజాతివారును రంగస్థలమును సాంఘికసంబంధము లగు నేర్పాటులలో నొకటిగ గణించుచున్నారు. మన దేశమందును చాల నాటకసంఘము లేర్పడినవి. వీని వలన ముఖ్యముగ మూఁడు లాభములు కలవు:—

1. రంజకత్వము—ఇవి ప్రజలకు విలాసార్థ ముపయోగించును. ప్రతిమనుజునకును జీవయాత్ర చేయునపు డేదో యొక ఆధిసంప్రాప్త మగుట అనుభవవేద్యము. మనోవ్యాకులతకు మందులలో సంగీత మొకటి. ఇట్టి సంగీతము రంగస్థలమున నొక యంగము. ఇతరవిషయ మగుటచే నందలిదృష్టిచేత తమమనోవ్యాకులతను డిందుపఱచుకొనుటకు రంగస్థలము జనులకు వీలు కలుగనిచ్చును. ఇఁక ఆధిపీడితులు కానివారిని రంగస్థలము సంతుష్టిపఱచు ననుట విదితమే. ఇందు నాల్గు కళలు సమ్మేళన మొందును. అందొక్కొక్కటియు సంతోషకారణము. కావున రంగస్థలము సంతోషజనక మగుట వింత కాదు.

ఈ విషయమున భిన్నాభిప్రాయములు కలవు. కృష్ణాపత్రికా సంపాదకులు, "కళ యేకాగ్రతఁ గోరును. కావున కళాసమ్మేళనము కళాసాంకర్యమునకే సాయపడును గాని రసోత్పాదనమునకు తోడ్పడఁజాలదు" అని గతించిన డిసెంబరు 6వ తేదీ పత్రికలో వ్రాసిరి. అందుననే మఱియొక లేకరి "యీ కళలకు పరస్పరము అవినాభావ సంబంధమున్నది కావున నొకటి లేనిదే వేఱొకటి చిత్తరంజన మొనరింపఁజాల"దని వ్రాసిరి. వేఱొకరు "దీనికి పరస్పరవిరోధము కలదని వాదించుట సత్యముకాదు. అవినాభావసంబంధ మున్న దనుటకు వీలు లేదు. కళాసమ్మేళనము శాస్త్రీయము, యుక్తము, నావశ్యక"మని తీర్మానించిరి.

2. హితబోధ— నాటకములయందలి యితివృత్తము ప్రసిద్ధ మగుటచే నందలి పాత్రములు తదర్హము లగునవిగా నుండును. అట్టివారి జీవితములను పరికించిన పిమ్మట మన జీవితములను బాగుపఱచుకొనుటకు ప్రయత్నింతుము. ఒకవేళ దుష్టపాత్రములనే చూడవలసివచ్చినను వారు చేసినట్లు చేయకుండవలయు నని నిర్ధారణచేసికొందుము. ఇందుమూలమున హితబోధ యలవడును. కొన్నివేళల నాటకముల యుద్దేశము కూడ హితబోధగా నుండును. హరిశ్చంద్ర, నల, రామ, సారంగధర నాటకము లిట్టివి. కేవలబోధకంటె మన కండ్లయెదుట మహనీయులు వర్తించునపు డందలి ఫలము ఘన మగును.

3. జీవనోపాధి— నాటకప్రదర్శన మొక వృత్తిగా నేర్పడి కొందఱకు జీవనాధార మగుచున్నది. ప్రతివృత్తియందును కొన్ని శక్తు లావశ్యకములై యుండును. ఇట్టివి స్వభావజనితములు. ప్రదర్శన శక్తియు నట్టిదే కాని దీనిని తగినరీతి నభివృద్ధి నొందింపకుండిన నది క్షీణించును. ఈ శక్తి కలవారు వేఱొక వృత్తియందు ప్రవేశించిన, దీనియం దెంత ప్రసిద్ధిగాంతురో, ఎంత గౌరవనీయు లగుదురో, అంతవఱకు ఇతరవృత్తులయందు కారు. తమ శక్తుల కనుగుణ్యము లగు వృత్తులయందు ప్రవేశించినవారి జీవితము లానందదాయకము లగును. పది సంవత్సరములనుండి యిది యొక వృత్తిగ నేర్పడినది. ఇఁకమీఁదట దీనివలన ననేకులు జీవించుటకు వీలు కలదు. యిరోపా, అమెరికా ఖండములయందలి రంగస్థలముల చర్య పరికించినవారి కిది తెల్ల మగును.

## రంగస్థలమునకు ముఖ్యాంగములు

I ప్రదర్శకులు-ప్రతిరంగస్థలమునను సామాజికులు ముఖ్యులు. ఇందధికారులు కొందఱు. మిగిలినవారు తాబేదారులు. వీరి యన్యోన్యసంబంధములు వారి యుద్దేశముల ననుసరించి యుండును. వీనిని బట్టి మూఁడు విధములవా రేర్పడుచున్నారు:—

(1) అందు మొదటివారు దీనిని వృత్తిగా స్వీకరించువారు. వీరు వలయు ధనమును వ్యయముచేసి ప్రదర్శకులను రంగస్థలములను అమర్చి పనిసేయుదురు. వీరిలో కొందఱప్పుడప్పుడు ధర్మార్థమై ధనము వెచ్చపెట్టుట కలదు. మిగిలినవేళల పైని చెప్పఁబడిన మూఁడు విధములగు రంగస్థలోద్దేశములను నిర్వర్తించి సంఘసేవ చేయుచు జీవించెదరు.

(2) రెండవవారు ఔత్సాహికులు. వీరు దీని నొక వృత్తిగా భావింపక యితరవిధముల జీవనోపాధి సంపాదించుచు విలాసార్థము నాటకములను ప్రదర్శించుచు ఆర్జించిన కొంతధనముతో రంగస్థలముల నభివృద్ధిపఱచి మిగిలినదానితో ధర్మకార్యముల నిర్వర్తింతురు. ఇందు రెండు విధములవారు కలరు. కొందఱు నియమితముగా శాలల నేర్పఱచుకొని, దుస్తులు మొదలగు పరికరములను జాగ్రత్తపెట్టుదురు. మఱికొందఱు శాలలు లేక దుస్తులు లేక అప్పుడప్పుడు వానిని బదులుగొని నాటకముల నాడుచు నందువలన కూడిన ధనమును ధర్మార్థము వెచ్చపెట్టుదురు.

(3) మూఁడవవారు మొదట నుత్సాహమువలన నేర్పడి ధనార్జనమున ధనికు లయి ధర్మపరాయణులవలెనే పైకగపడుచు తద్ద్రవ్యమును స్వవిషయమై యుపయోగింతురు. మఱికొందఱిట్లే యేర్పడి ధనము నార్జించుటలో వంతులు తెగక నిరంతర ఋణగ్రస్తులై ధర్మపరాయణత మాని యన్యవిషయాసక్తు లగుచున్నారు.

ఈ మూఁడువిధముల సామాజికులలో నుద్యోగస్థులకును తాబేదారులకును గల సంబంధ మెట్లున్నదో పరిశీలింతము. ఔత్సాహికులలో నప్పుడప్పుడు ప్రదర్శించువారు సమిష్టి కలిగి యెవరినో యొకరిని ధనవిషయమున పెద్దగా నేర్పఱచుకొని వా రెట్లు చెప్పిన నట్లు

తక్కినవారు నడుచుకొందురు. వీరి కట్టి వివాదములు నుండవు. నియమితముగా నాటకముల నాడు ప్రోత్సాహకులు హెచ్చు తక్కువ అను భేదము నంతగా పాటింపక ప్రతివిషయమునకును తమలో కొందఱిని కమిటీగా నేర్పఱచి వారినే నమ్మి సర్వము నడుపుచుందురు. వీరు కేవల మన్యాయము చేసినట్లు విశదమయినప్పుడు తప్ప చర్చయే పెట్టుకొనక అందఱు నేకాభిప్రాయులై, చిక్కులు తగ్గించుకొనుచు, మీఁదిని బడక, సమిష్టితో వ్యవహారములు నడుపుకొందురు. ఇఁక మొదటి తరగతివారిలో నధికారులకును తాబేదారులకును సమంజససంబంధ ముండుట కడు నరిది. తక్కినవారిలో 'వీరధికులు, వీరు కారు' అను మాట లేదు. సాంఘికులలో నెవ్వరో అట్లు నియమింపఁ బడుదురు. వారా పదవిని యుక్తముగా నిర్వహించుకొనకుండినచో పదచ్యుతి శీఘ్రముగా నగును. ఇఁక వీరియందో, ధనవ్యయము చేయువా రధికారులు. జీతములు పుచ్చుకొనువారు తాబేదారులు. వారు చెప్పినట్లు వీరు నడుచుకొనవలయు; లేకుండిన తప్పుల ననుభవించితీరవలయు. ఇట్టియెడ నెట్లు సంబంధము సమంజసముగా నుండ దని సంశయము పుట్టవచ్చును. దీనికి కారణ మే మన, అధికారులకు తాబేదారులయందు పుత్రవాత్సల్య ముండుట విధి. అట్టియెడ తాబేదారు లధికారులను పితృప్రీతితో చూడవలయు. పదిమంది చేతిక్రింద నున్నప్పుడు వారివారి స్వభావముల ననుసరించి వర్తించుట అధికారి విధి. అట్లు కాక యొకరియందు ప్రేమాతిరేకము మరియొకరియం దౌదాసీన్యము ఇతరులయం దనిరసనము నుండఁ గూడదు. అట్టి చూపు చూచువా రధికారపదవి కర్హులు కారు. గుణాగుణములను విద్యాబుద్ధులను బట్టి ప్రేమ యొకరియెడ నెక్కుడుగా నుండుట సహజ మయినను, ఆచరణ మం దది కనఁబడఁగూడదు. ఇట్లు చేసినచో మనోవ్యథ జనించును. అధికారి హృదయమున నే ముంచుకొన్నను, వాక్కాయకర్మములందు మాత్రము నిష్పక్షపాతుఁడై యుండవలయు గాని పాక్షికుఁడు కాఁగూడదు. ఇందువలన తక్కిన వారి మనసులు నొవ్వక మానవు. ఈ పక్షపాతముచే కొందఱకు చనువు హెచ్చగును. వీ రాంతరంగికు లగుదురు. ఎల్లప్పుడు నితరులపై కొండెములం జెప్పి తమయందలి యాదరము నభివృద్ధి చేయఁ దలంతురు. ఇందువలన మొదట నుదాసీనభావముతో చూచువారిని అధికారులు నిరసింతురు. నిరసించినవారిని నిందింతురు. ఇందువలన కొంతవఱకు సమిష్టి చెడును. కొంద ఱిష్టులు మరికొంద ఱనిష్టులు నగునప్పు డాదరణ 'మతివృష్టిఅనావృష్టి' యగును. ఒకరి కాకు,మరియొకరికి కంచము; ఒకరికి నూనె వేఱొకరికి నేయి. సమాదరణ లేనప్పుడు స్పర్థల కేమి కొఱఁత? స్పర్థవలన కక్ష లేర్పడును. కక్షలవలన ననేకత్వమును తద్ద్వారా నిరసనమును కలుగును. ఇంతలో నాఁగక న్యాయస్థానములను చూచినం గాని కలఁతలు మానవు. ఒకరికి చూపెడు ఆదరమును చూచి వేఱొకరు నేర్చుకొనెదరు.

ఇది యటుండఁ ప్రదర్శకు లెట్టివారో యాలోచింతము. వీరిలో విద్యాధికులును, ఇతరజీవనోపాధి కలవారును మిక్కిలి యరిది. విద్యాభ్యాసము చేసినవా రీవఱకీ వృత్తిని మనదేశమందు గ్రహింపలేదు. జీతమున కున్నవారు విద్యాభ్యాసము కొనసాగక దానిని వీడి స్వేచ్ఛానుసారముగా నుండవచ్చు నను బుద్ధితో నిందు ప్రవేశింతురు. పిమ్మట "స్వర్గమునకు పోయినను సవతిపోరు" అనునట్లు వీరు శ్రద్ధ వహించి పాఠములు చదువుదురా? ఏనాటకమును బహిరంగముగా ప్రదర్శింప నెంచినను ముందుగా పలుమాఱు తమలో తాము ప్రదర్శించుకొనుట యాచారము కదా. వీనిని రిహార్సల్స్ అందురు. ఇట్టివి ఎన్నిసారులు వేసిన నాటక మంత బాగుగ నుండును. జర్మనీదేశమందలి నాటకులు ఏబదిసారు లిటు చూచుకొననిదే నాటకము వేయరఁట. అందుచే వారి నాటకములు బాగుగ నుండు ననియు ముప్పది సారులే యట్లు చేసెడు ఫ్రెంచివారి నాటకములు దోషములతో కూడియుండు ననియు ప్రబలమైన యభిప్రాయము కలదు. ఇట్టియెడ మనవారి సంగతి నిం దుదహరింప నక్కఱ లేదు. నాటకులలో సంగీతము పాడుట, పద్యములు చదువుట, గద్యమును చెప్పుట, అభినయము చేయుట, ముఖవైఖరి చూపుట మొదలగునవి కొందఱియందు బాగుగ నుండుట మరికొందఱియం దట్లు లేకుండుట స్వాభావికము కదా! ఇందలి భేదములంబట్టి యుత్కృష్టులు తక్కువవారియెడ నిరసనభావము వహింతురు. తమయందలి యుత్కృష్టాంశమునే పాటించి లోపముల గణింపక స్వాతిశయమును ప్రకటింతురు. దీనిచే నీర్ష్య పుట్టును. విద్యావినయములు లేనివా రగుటచే గోరంతదానిని కొండంత చేయుదురు. ఇట్లుండుటచే వారియం దుండవలసిన గౌరవము గూడ పోవును. ఇతరేతరగౌరవములు చెడుటచే వీతమర్యాదులై వర్తింతురు. వీరిని చూచి యితరు లీ దుర్గుణముల నభ్యసింతురు. ఇద మిత్థ మని యొకరి లోపములు వారి కెఱుకచేయకపోవుట యజమానుల లోపము. ఇది నిర్ణయించు సమర్థుల కీ శక్తి లలవడవలయును. అనఁగా వారు మంచి ప్రదర్శకులు కావలయును. నే నెఱుఁగునంతవఱకును మంచి ప్రదర్శకుల యధికారముక్రింద నేర్పఱుపఁబడిన నాటకసమాజములు మిక్కిలి తక్కువ. తమకు శక్తి లేనివా రట్టివారిని నియోగింపరు. ఇందులకు సామాన్యప్రదర్శకులు కాక అన్నిపాత్రములకు నన్నివిషయములను బోధించు సామర్థ్యము గల యుపాధ్యాయులు లేరు. సంగీతము చెప్పుటకు మాత్ర మచ్చటచ్చట కలరు. అభినయము చెప్పనక్కఱ లేకయే అలవడు నని వీరి యభిప్రాయము. మరియు ప్రదర్శకుల నందఱిని ప్రవర్తనవిషయమున క్రమమైన శిక్షలో నుంచరు. ప్రదర్శకుఁడు దేహదార్ఢ్యము కలవాఁడుగ నుండవలయు; ఇందులకు వ్యాయామ ముండవలయు; ఇది శూన్యము. పిమ్మట వారు తినెడి యాహారము యుక్త మగున ట్లుండవలయును. ఆహారపదార్థములకును కంఠమునకు నత్యంతసంబంధము కలదు. అజీర్ణపదార్థములు తినుచుండుటచే దేహశక్తి నానాఁటికిని తగ్గి కంఠమున మాధుర్యము చెడును. పిదప నిద్ర. ఇది లేకుండిన, వేడి చేసి కంఠము చెడును. ఆహారనిద్రలు నియమితముగా నుండవలయు నని యందఱు నెఱుంగుదురు. కాని వారమునకు రెండు మూడు నాటకముల నాడి నిద్ర లేక శరీరమును కొన్నివేళల పాడుచేసికొందురు. వస్త్రధారణము - ఇది యుత్తరసర్కారులందు నేను చూచినంతవఱకు నసహ్య మగుచున్నది. నాటకవేషధారి చెవులకు

The Maharaja of Jeypore



శ్రీ జయపురము మహారాజుగారు

The Kumara Maharaja of Jeypore



శ్రీ కుమారమహారాజుగారు, జయపురం

Mr. Jayarama Row



జయరామరావుగారు

Mr. A. Panchapakesa Iyer



పంచాపకేశ అయ్యరుగారు

Mr. G. Mukunda Row N aidu



జి. ముకుంద రావునాయుడుగారు

Yedla Ramadass Garu



ఎడ్ల రామదాసుగారు

Mr. B. Prakasam



బి. ప్రకాశంగారు

Mr. K. Sreerama Sastry



కందర్ప శ్రీరామశాస్త్రిగారు

Mr. K. Ramarow Pantulu



కొప్పరపు రామారావు పంతులుగారు

M:. S. B heemasankar am



సారంగు భీమశంకరంగారు



౧౯౧౩ [illegible]

Mr. M. Hanumanta Row



మాడపాటి హనుమంతరావుగారు

Mr. D. L. Suryaprakasalingam



డాక్టరు॥ సూర్యప్రకాశలింగంగారు

Mr. V. Viswanatham Pantulu



వి. విశ్వనాథం పంతులుగారు



శ్రీపంచమజార్జి చక్రవర్తి కుటుంబము

దుద్దులును, సన్నని పట్టుత్తరీయమును, చెప్పులజోడును, త్రాడుతో కట్టిన జుట్టును, సన్నని యంగవస్త్రమును సమర్చుకొని నోట చుట్ట లేక సిగరెట్టు నిడి నల్గురును తన్ను చూచునట్లు తక్కుచు తాలుచు తన విషయము తెలియునట్లు వర్తించును. ఏవృత్తిలో నుండువారును తమ వృత్తిద్యోతక మగు వేషమును అవసరములేని కాలములలో వేయుటకు సంకోచింతురు. వీరు మాత్ర మట్లు చేయరు. అందుచే నీ రాత్మగౌరవమును నిల్పుకొనఁజాలకున్నారు. నల్గురును వేషధారియెవ్వరో యని యుత్కలిక జనింప వెదకుచు వచ్చుటకు బదులు వేషధారియే మఱునాఁడు బాజాలలో ప్రత్యక్ష మగును. ఎవ్వరేని కనుపించినఁ, నా వేష మెటు లున్నది?-అని మొదటి ప్రశ్న. "బాగున్నది కాదు" అని చెప్పువారు శత్రువులు; లేదా అవివేకులు - అని యభిప్రాయపడుచుండును. వీరిలో నీ రాడుకొను భాష మర్యాద నతిక్రమించి యుండును. పెద్దచిన్న యను వివక్ష లేదు. అందఱిని దెప్పువాఁడొకఁడు. నిందించువాఁ డొకఁడు. చూచి నవ్వువాఁ డొకఁడు. 'నేను తప్ప నితరు లెవ్వరును మంచి ప్రదర్శకులు కారు. ఎక్కడ చూచినను తప్పులే.' అని భావించుచుండిన ప్రదర్శకునియెడ గౌరవ మెవరి కుండును? భక్తిశ్రద్ధ లలవడవలె నన్న భయ ముండవలయును. అధికారుల యెడ భయ ముండదు. దీనికి కారణ మిదివఱకే తెల్పితిని. దాని తోడిదే భక్తి. ఇది యుండినఁ గాని విద్యరాదు. అందుచేత వినయము కానరాదు. ఇట్టి సుగుణములకు తోడు సత్ప్రవర్తనకుఁ గూడ దూరులగుదురు. దీని విషయమై చర్చింప నవసరము లేదు. వృత్తివలె నేర్పడిన పిమ్మట ప్రదర్శకులు ధనాశచే నొక సంఘమునుండి మరియొక సంఘమునకు పరుగెత్తుచున్నారు. ఒక సమాజ మని నియమము లేదు. ఒకనియొద్ద సొమ్ము ముందుగా పుచ్చుకొంటి మను మాటలేదు. మాట యిచ్చితి మన్న నియమము మొదలేలేదు. మిత్రద్రోహము పాటించుటయే లేదు. తాఁ జెడ్డ కోఁతి వన మెల్ల చెఱిచె ననునట్లు నీచ ముచ్చము నాక మగ్గములోని కండెవలెనే తాలుమా అగుదురు. కాని ఐరోపా అమెరికా ఖండములందు ఘనత వహించిన ప్రదర్శకులే రాజపూజితులయి బిరుదము లంది తమ ఖ్యాతిని జగత్తున వ్యాపింపఁజేయుచున్నారు. మన సంస్థలములనుండి కూడ ఇట్టివారు పలువురు వెలువడుదురుగాక !

కొన్ని సమాజములలో స్త్రీప్రదర్శకులు కలరు. ఇట్టివి తక్కువగా నున్నవి. సురభి యను గ్రామమున నేర్పడి మన దేశమం దెల్ల సంచారముచేసి పొట్టపోసికొనుచున్నవా రొకరు. వీరికి ధనలాభము విశేషము కలదు. ఎక్కడకుఁ బోయినను బహుమానముల నిత్తురు. ఇందుకు తగిన సామర్థ్యము వారియందు కానరాదు. ఇది గాక బందరునం దొక సమాజము కలదు. ఏలూరునం దొకటి కల దని వినియున్నాను. వీని ప్రసిద్ధి స్థానికమే.

## నాటకములు

ఇవి యధునాతనకాలమందు ప్రబలినవి. కొన్ని పరివర్తనములు, అనఁగా ఇతరభాషనుండి యాంధ్రీకరింపఁబడినవి. ఇట్టివానిలో జనానురాగము వడసినవి అభిజ్ఞానశాకుంతలమును వేణీసంహారమును. ఇందు మొదటి దంతగా నిప్పుడు ప్రదర్శింపఁబడుట లేదు. రెండవది యుత్తరసర్కారులలో నుతికెక్కినది. నెల్లూరు మొదలగు తక్కిన తెలుఁగు జిల్లాలలో నంతగా వాడరు. అచ్చట స్వకపోలకల్పితములు తఱుచు. ఏల యన, బళ్లారి వాస్తవ్యులును కీర్తిశేషులును అగు ధర్మవరము కృష్ణమాచార్యులవారును, ఆపురవాసులే యగు శ్రీ కోలాచలము శ్రీనివాసరావుగారును ప్రస్తుతమందు చెన్నపట్టణముననున్న శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారును స్వకపోలకల్పితము లగు నాటకములను రచియించిరి. వీనినే నెల్లూరు బళ్లారి జిల్లాలయందు ప్రదర్శించుచుందురు. ఉత్తరసర్కారులవారు వీనిలో నచ్చుపడ్డవానిని, ఇతర గ్రంథకర్తల నాటకములను నాడెదరు. ఇక్కడ శ్రీయుత చిలకమర్తి లక్ష్మీనృసింహకవి రచితము లగు నాటకములను తఱుచుగ నాడుదురు. స్వకపోలకల్పితములలో కొన్ని యితివృత్తములు క్రొత్తవి. మఱికొన్ని పౌరాణికములో లేక యితరభాషాగ్రంథములలోనివో యని యెఱుంగునది. ఈ నాటకములలో చాలభాగము నుతి కెక్కలేదు. తత్కారణములను మానవసేవ యను మాసపత్రిక, 1913 వ సం. అక్టోబరు సంచికలో విశదముగ వెల్లడిచేసితిని.

ఇతివృత్తమును బట్టి నాటకములను పౌరాణికములు చరిత్రాత్మకములు సాంఘికవిషయములు అని మూడు తెగలుగా భాగింపవచ్చును. ఇందు చివరతరగతి నాటకములలో మిన్నలు శ్రీయుత గురుజాడ అప్పారావు పంతులుగారిచే రచియింపఁబడిన "కన్యాశుల్కము"ను కీర్తిశేషులయిన శ్రీయుత వల్లూరి బాపిరాజుగారిచే రచింపఁబడిన "సుగుణమణి"యు. నాటకరచన యొక కళ. అందంతర్భాగములు-1. కవిత నాటకకళ. వీనిని గూర్చి చర్చించెదము.

1. కవిత — ఇది 1880 వ సం. ప్రాంతమున గద్యాత్మకముగా నుండెడిది. అప్పుడప్పుడు పాటలు కూడ చేర్చుచుండిరి. ఈ విధమగు నాటకము లిప్పుడరిది. పూర్వలిఖితపుస్తకములయందు తప్ప ముద్రితము లగు ఆంధ్రగ్రంథములయం దిట్టివి కాఁబడవు. పిమ్మట పది సంవత్సరములలో నివి పద్యాత్మకము లయ్యెను. స్త్రీపురుషపాత్రవివక్షణ లేక అన్నిటికిని పద్యములు రచియింపబడినవి. అక్కడక్కడ పాటలుండెడివి. దీనికి మార్గదర్శులు కృష్ణమాచార్యులవారు. ఇప్పటినాటకములలో కొందఱు పాటలు రచించుటలేదు. కాని నటకులు కొన్ని నాటకములలో పాటలు చేయించుకొని పాడుచున్నారు.

## వివాదాంశములు.

నాటకములయందలి భాషనుగుఱించి యించుక చెప్పవలసియున్నది. వీనిలో చాలభాగ మన్నిపాత్రములకును గ్రాంథికభాష యుపయోగింపఁబడియున్నది. కొన్నిటిలో పాత్రానుసారముగా గ్రామ్యభాష వాడియున్నారు. ఇందు శ్రీ వేంకటరాయశాస్త్రిగారు ప్రథములు. శ్రీ గురుజాడ అప్పారావుగా రిట్లే రచియించిరి. ఈ రెండింటియందును ఇంకొక విచిత్రము కలదు. భాష వైకృతము చెందినది. వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయమున తురకలు నూటలాడు వికృతపు తెలుఁగు కలదు. కన్యాశుల్కమం దన్ననో ఆంగ్లేయ

భాషాసంపర్కము కలిగి నడుమ నడుమ విభాషీయపదములు కలవు. ఇటీవల విశాఖపట్టణములోని కళాభిలాషిణీ సమాజమువారు గ్రామ్యమే నాటకములయందు పాత్రానుగుణ్యముగా నుపయోగించుచున్నారు. ఈ సాంకర్యము మా జిల్లాలో లేదు. ఇక్కడి నాటక భాష గ్రాంథికమే.

పద్యములను రచియించుటలో గీతములును అరుదుగా సీసములును వాడవలయునే కాని వృత్తములను వాడఁగూడ దను నొక వాదము ప్రబలినది. ఇందులకు కారకులు శ్రీయుత పానుగంటి లక్ష్మీనృసింహముగారు. వీరు నాటకముల రచియించుటలో చాలభాగము గీతములే వాడిరి. వృత్తములు తాళమానము లగుటచే ప్రదర్శకులు చదువునపుడు తైతక్క లాడుదు రనియు, వీనిలో నిబంధన లెక్కుడనియు, అవి యాంగ్లేయభాషలోని రైమింగు వర్సను పోలియుండును కావున దానిని ఆంగ్లేయకవులు పరిత్యజించి బ్లాంకు వర్సును నియమము లంతగా లేనందున వాడునట్లే, మనముకూడ విశేషనియమములు కల వృత్తములను మాని గీతములనే యుపయోగింపవలయు ననియు వీరి యభిప్రాయము. ఇది సర్వజనాదరణీయము కాదు. ఇంకను చర్చ చేసిన కాని నిజము తేలదు. సువర్ణలేఖ యను పత్రిక యీ వాదము నవలంబించినది. ఇట మరియొక చర్చ కలదు. 'నాటక మంతయు స్త్రీపురుషభాషాపూరిత మగుటచేత మాటలాడునపుడు, విశేషించి వీర రౌద్ర కరుణ రసములయం, దెవ్వరును పద్యము లుపయోగించుట యనుభవవిరుద్ధము. తిట్టునపుడును శోకించునప్పుడును పద్యము లుపయోగింతురా? కావున నీపట్ల పద్యము లుండుట యసంగతము; గద్యమె యుండవలయు' నని కొందఱి యభిప్రాయము. వీరు శృంగారమున పద్యము లుండవచ్చు నందురు.

ఇందులకు వ్యతిరేకముగా 'రసము మిక్కుట మగునప్పుడు అనిర్వాచ్య మగును. అట్టిచోటుల బహుపదభూయిష్ఠ మగు గద్య మసంగతము. మాటయే నోట రాదు. వచ్చినను మిక్కిలి ప్రయాస మగును. కావున నిట్టిచోటుల పద్యమే యుండవలయు' నని కొందఱి యభిప్రాయము.

గద్యమే యుపయోగింపవలె నని చెప్పువారు నాటకము స్వభావానుసారి కావలె నను వాదము మానివేయవలయు. రంగస్థలమున దీర్ఘములు దీసి 'అయ్యో, మొఱ్ఱో' అని యఱచుట రసభంగము. ప్రదర్శన మెప్పుడును భావనానుసారిగా నుండవలయు. స్త్రీలు రోదనము చేయురీతి రోదనము చేయవలసినయెడ నాటకవేషధారి నిజముగు పాత్రమే యగును గాని నటుఁడు కానేరఁడు. కావున గద్య ముండవలయు నను మాట యసంగతము. ప్రదర్శనము యాథార్థ్యము నన్నివిషయముల ననుకరింపవలయు నని భావింపఁగూడ' దని కొందఱి యభిప్రాయము.

ఈ విషయమున నా యాశయ మే మన—గద్య పద్యము లెక్కడ నుండవలయునో తెలియఁజేసెడు నియమము లేదు. కవి తన యిష్టానుసారము భావమును వెల్లడిసేయుటకు వీనిలో నేది తన కుచిత మని తోచునో యది యుపయోగించును. మనము నిబంధనను చేత మని దొరఁకొనిన, కవి స్వేచ్ఛాకల్పనకు ప్రాతికూల్యమును కల్గింతుము. అట్లు చేయఁగూడదు. అనిర్వాచ్య మగు భావము పద్యమందే కాక గద్యమున కూడ ద్యోతకమగును. రసస్ఫురణకు పదరచన ముఖ్యవిషయము గాని, గద్యపద్యాదిరూపభేద మనావశ్యకము. స్వభావము ననుకరించు భావనయు భావన ననుకరించు స్వభావమును కలిగి నాటకము సమంజసముగా నుండవలయు.

కవిత నాటకప్రదర్శనమందలి యొక కళ యని చెప్పితిని కదా. ఈ విషయమై చర్చనీయాంశము లుండనట్లే తక్కిన కళల విషయమునఁ గూడఁ గలవు.

## సంగీతము

రంగస్థలమందు సంగీత మేరీతి నుపయోగింపవలయును? ఈ విషయమై కొందఱిట్లు వాదించిరి. అనిర్వాచ్యమగు రసప్రదర్శనము మాటచే కానేరదు. కావున సంగీతము సహకారి కావలయు. సంగీతమున చిత్తవృత్తిని మార్పఁగల శక్తి కలదు. రాగాలాపమున మనసు కరఁగుట లోకానుభవము. కావున రసము మిక్కుట మగునపుడు మాటతో ద్యోతకము కాని రసము సంగీతముచే ద్యోతక మగును.

ఇట నా కొక సందియము కలదు. నోట మాటరా దని కదా గద్యమును వీడి పద్యము రచింపు మనిరి. మాటయే రానప్పుడు సంగీతాలాప మెట్లు కుదురును? కంఠస్తంభితభావప్రవృత్తి కలుగు నపుఁడు రాగాలాపము సేయఁజాలునా? మరియు సంగీతము తగిన రీతిని పద్యమున మిశ్రమముచేసి దేనికిని భంగము లేకుండ రసోచితముగ పద్యమును చదువువారి సంఖ్య చాలతక్కువ. సంగీతము నెఱింగినవారందలి తమ ప్రకర్షము చూపింపవలయు నని రాగాలాపముకొఱకై పద్యమును యుక్తము కానిచోటుల విఱిచి హ్రస్వములను దీర్ఘములుగ చేసి, తుది యక్షరములను పలుకక నానావిధములను పద్యమును పాడుచేయుచుండుట చూడ, పద్య మెట్టిచోటనైనను అనుచిత మన వలసినదే కాని, ప్రదర్శకుల లోపములు కళయం దారోపింపఁగూడదు. తగిన రీతిని కవితాసంగీతసమ్మేళనమున ప్రదర్శకులు పాటు పడునట్లు చేయుట శ్రేయము. ఈ విషయము క్రిందటి నెలలోని ఆంధ్రకేసరిని కృష్ణాపత్రికను చదువరులు సావధానముగా చూడవచ్చును.

ఇఁక చిత్రలేఖనము. ఇది యెంతవఱకు నావశ్యకము? ఈవిషయమై వీధి నాటకములను మన నాటకములను పరికించినవారికి తెలియును. మొదటివానియందు చిత్రలేఖనము శూన్యమని చెప్పవచ్చును. దట్టమైన యొక తెఱ మాత్రముండును. నటులు వచ్చునపు డదియు తీసివేయుదురు. రంగమరణ్యమో, పట్టణమో, సముద్రతీరమో, ఉద్యానవనమో చూపఱయే భావించుకొనవలయు. మన రంగస్థలముల నట్లు కాదు. ఇంచుమించుగా రంగము తెరలచే ద్యోతక మగును. ఏల యన కేవలమరణ్యమనిగాని పర్వతమనిగాని చూపఱు లెప్పటికిని తలంపరు. మరియు కొన్ని వర్ణనావిషయముల కొన్నిచోటుల పరికరబాహుళ్య ముండును. సూర్యోదయము,నది,తరంగములు, ప్రతిబింబములు, ఇంకను ఓడలు, అగ్నిపర్వతములు మొదలగునవి యమర్చుటలో బిరోపా

అమెరికా దేశస్థులు లెక్కలేని మొత్తము వెచ్చపెట్టి యాథార్థ్యము తోఁపజేయుచున్నారు. వీరిని చూచి మనదేశమున పార్సీ ఆంగ్లేయ నాటక సమాజములవారు తమపరికరముల నభివృద్ధిచేయుచున్నారు. మనయాంధ్రులు కూడ వేలకొలఁది ధనము వెచ్చ, పెట్టుచున్నారు. ఇది యుక్తమా కాదా యని చర్చింపవలసియున్నది.

మాడరన్ రివ్యూలో లోకప్రసిద్ధులగు రవీంద్రనాథఠాకురుగారు బంగాళాభాషనువ్రాసినదానిని ఆంగ్లేయభాషలోనికి తర్జుమాచేసి ప్రకటించిరి. అందు వారి యభిప్రాయ మే మనయాథార్థ్య మెంత యాలపడఁజేయు నని యత్నించిన భావనాశక్తి యంతతగ్గును. ఇట్లు భావనశక్తి తగ్గించుట మనమున కాహ్లాద ముండదు. కావున నీ విషయమున పరికర బాహుళ్యము తగ్గింపవలయు. దీని ననుసరించి కృష్ణాపత్రిక సంపాదకులు తెరలు మొదలగునవి అనవసర మనియు, కాళిదాసు నాటకములలో పరికరబాహుళ్య మక్కఱలేదు కావునను, కళాసాంకర్యముచే తెరలు మనముల నాకర్షించి యర్థములకు భావముల మాపుఱయహ్లాదములఁ జొఱనీయకపోవుటచేతను, యాథార్థ్యమును దోపఁజేయుట గొప్పదోస మనివ్రాసిరి. పరికరబాహుళ్య ముండఁగూడదు. ఇందు భావనాశక్తి లోపించుట యొక కారణము; బలవత్తర మగు రెండవ కారణము ధనవ్యయము. తెరలకును దుస్తులకును పెట్టిన సొమ్ము గోడకు పెట్టిన సున్నము వంటిది. ఎంత నేర్పరి యగు చిత్రకారుఁడు కావలెనన్న నంత ధనవ్యయము. క్రొత్త ప్రియము కదా. మూఁడవదియు బలవత్తర గునదియు నెద్ది యన నిదియే. ముఖ్యాంశముగ గమనించి మంచి ప్రదర్శకుల జాగ్రత్తచేయుటకు తగిన ధన ముండదు. ఉండినసొమ్ము వీనియందు పోటీచే వ్యయపెట్టుచున్నారు. ఇది విచారహేతువు. బొత్తిగా తెల్ల గుడ్డలు కాక తగుపాటి ధనము ఖర్చుపెట్టి పరికరములు జాగ్రత్తచేసిన ప్రదర్శనమందు శ్రద్ధ యెక్కుడగును. లేకున్న సీనులు మంచివి దుస్తులు చిత్రమైనవి. తక్కిన దేది యెట్లుండిన నేమి యందురు.

ఇఁక అభినయము. తక్కిన కళ లభివృద్ధిచెందినకొలఁది నీ కళ యడుగంటుచున్నది. ఈ విషయమై చర్చచేయువారే లేరు. చాల మంది యభిప్రాయ మేది యన 'తక్కిన కళలు బాగుగ నుండిన చాలును. దీని జోలియే యక్కఱ లేదు. ఈ కళ సూక్ష్మము కావున పండితులకే గాని పామరులకు గోచరము కాదు. ధనము వచ్చునది వీరిచేతనే కదా? పండితులును విద్యాధికులును తక్కిన కళలచే సంతోషించుటచే నీలోపమును గణింపరు. అదిగాక ప్రతివాఁడును అభినయము స్వభావముచేతనే యెఱుంగును. ఒకరు బోధింప నక్కఱలేదు. ఎంత చిందులు త్రొక్కిన నంత గొప్ప. దుమ్ము రేఁగినకొలఁది దోషముల కప్పిపుచ్చును. శ్రావ్యమైన యంత్రగాత్ర సంగీతము కలిగినచో నభినయ మెవ్వరు చూచెదరు?' ఇంతకంటె పెడత్రోవ మతి యుండదు. పామరులు సూక్ష్మములగు మనోభావముల పరికింపఁజాలరు. కాని స్థూలభావముల నెఱుంగుటలో పండితుల కీడగుదురు. సంగీతము లేకపోయినను కంఠము శ్రావ్యమయినది కాకపోయినను, సరసముగ నర్థమును సూచించునట్లు పద్యములు చదివి, అర్హముగు అభినయము చేసెడు ప్రదర్శకులను పండితపామరులు మెచ్చుకొనుట నే నెఱుంగుదు. రసభావములను చూచి యానందించుటలో నిద్దఱు నొకటే. అయినను మంచి యభినయము చేయు ప్రదర్శకులు లేకపోవుటచే సంగీతమో, తెరలో, దుస్తులో చూచి సంతోషించుచున్నారు. కాని యభినయమునకు సంతసింప నేరక కాదు. అందలి తారతమ్యము తెఱుంగక కాదు. సూక్ష్మవిషయముల పరికింప నేర రని చెప్పియుంటిని కదా. అందుచే యాథార్థ్యమునకంటె కొంచెము హెచ్చుగా ప్రదర్శింపవలయును. ఇట అభినయ మన నేమో యను విషయము చర్చింపవలయు. పతాకాదిహస్తములఁ జూపుచు శాస్త్రరీతి చేసెడు అభినయ మొకటి. ఇందు ప్రతిమాటకు నభినయింపవలయు. ఒకదానికే యనేకవిధముల నభినయింపవలయు. ఇది మేజువాణీల యందు గణికాజనము ప్రదర్శించునది. భరతశాస్త్రానుసారి కావున నిర్ణీతము. నాటకప్రదర్శకున కిట్టి యభినయ మక్కఱలేదు. ఉండిన దోషమగు. ప్రతిమాటకు నభినయించినచో మూకప్రదర్శన మగు. దీనిని ఆంగ్లేయమున 'పాంథోమైమ్' అందురు. ఇందు సూక్ష్మభావములు కనఁబఱుఁబడును. నాటకాభినయము స్థూలరూపము కలది. ప్రతివిషయము నభినయింపఁబడగూడదు. స్థూలభావములే ద్యోతకములు కావలయు.

ఈ కళ మనదేశమున నడుగంటినది గాని ఇతరఖండములయందిట్టి యభినయమువలననే ప్రదర్శకులు ప్రసిద్ధికెక్కిరి. సర్ హెన్రీ ఇర్వింగు గారిక్, బర్బేజి, రాబర్ట్సన్ మొదలగువారీకళచేతనే నుతికెక్కిరి వారినాటకములయందు సంగీతమక్కఱలేకపోవుటచే కాను. ఆదేశములయందు సంగీతమును, అభినయమును వేర్వేఱ మెచ్చుచున్నారు అభినయమునుపట్టియే ప్రదర్శకుని గౌరవము నిలుచుచున్నది. మనదేశమందు కూడ కృష్ణమాచార్యులుగారికి సంగీతమందు పాండిత్యము లేకున్నను, వారు పద్యములు చదువుతీరు, చేసెడు అభినయమునుబట్టి ప్రసిద్ధికెక్కిరను వాడుక కలదు. ఉత్తరసర్కారులు చెన్నపట్టణము మొదలగు ప్రదేశములయందలి ప్రస్తుతనాటకసమాజములలో అభినయము చేయు ప్రదర్శకులు అరిది.

తక్కిన కళలవిషయ మేమి ఇతరవిషయముల నేమి యాంగ్లేయుల మార్గదర్శకులుగా నెంచుకొను మనవారీవిషయమున నట్లేల సేయరో? ఇఁక నాటకకర్త తెలియఁదగిన కళ వేఱొకటి కలదు.

## నాటక కళ

దీనినిగూర్చి మనవారు లక్షణగ్రంథములయందు విశేషచర్చ చేసిరి. దశరూపకము ప్రతాపరుద్రీయము లోనగువానిలో నుదహరించియున్నారు. కాని యిప్పటి నాటకకర్తలు వాని నంతగా పాటించుట లేదు. ఇందు మూఁడు విషయములు కలవు.

1. వృత్తము. ఇది ప్రసిద్ధమై యుండవలయు ననియు, పౌరాణికమైనను కల్పితమైనను కావచ్చు ననియు చెప్పిరి. మొదటిదానివలన హితబోధయు రెండవదానివలన లోకవృత్తజ్ఞానమును ఫలములు. రెండవది అరుదుగా పాటించుచుండిరి. ఇట్టివి బృహత్కథనుండి గ్రహించుచుండిరి.

2. రసము. ఇది తొమ్మిదివిధములు. అందులో ప్రధానమగునవి శృంగారము వీరము. తక్కిన రసము లప్రధానములు. భవభూతి మాత్రము కరుణారసమునకు ముఖ్యత నుత్తరరామచరితమం దిచ్చెను. మఱ

లో సుఖాంతము నియమితమగుటచే కరుణరసమంతగా ప్రజ్వరిల్లలేదు. రసము ఇతివృత్తము ననుసరించి యుండును.

3. పాత్రములు. ఇవి ఇతివృత్తము ననుసరించియుండును. వీనిని ఉత్తమపాత్రములనియు నీచపాత్రములనియు మధ్యమపాత్రములనియు విభజింపనగు. వీని పేళ్లు ఆ యాజనులఁబట్టి వచ్చుచుండెను. భాషకూడ ఉత్తములకు సంస్కృతమును నీచములకు ప్రాకృతమును వాడుచుండెడువారు. స్త్రీపాత్రముల కంతట ప్రాకృతమే వాడుచుండినను, వానిలో కూడ భాషావ్యత్యాసము కలదు. ఉత్తమనాయికలు వాడెడు భాష చేటులు సఖులు వాడెడుభాష కాదు. యోగినులుగాక తక్కిన స్త్రీజనమునకు ప్రాకృతమే వాడబడుచుండెను. మరియు స్త్రీపాత్రములకు తఱచుగ గద్యమే కాని పద్యములు లేవు. కాళిదాసుకాలమునాఁటికి గద్యరచన విశేషముగ నుండనట్టు తోఁచెడిని. దండి, బాణుఁడు, సుబంధుఁడు లోనగువారు ప్రబలి గద్యగ్రంథములను రసవంతముగ రచించిరి. పిదప వ్రాయఁబడిన నాటకములయందు గద్య మెక్కుడుగ వాడుచుండిరి. దీనికి భవభూతి, భట్టనారాయణుఁడు వ్రాసిన నాటకములే సాక్ష్యములు.

పురుషపాత్రములయందలి నాయకులను కొన్ని తరగతులలోనికి విభజించి నాటకమునకట్టివాఁడే నాయకుఁడుగ నుండవలె ననియు, ప్రకరణమునకు వేఱొకఁడనియు నియమించిరి. ఇట్లే నాయికలను గూడ విభజించి నియమించిరి. ఈకాలము గతించినపిమ్మట నుత్కృష్టమగు నాటకములు వ్రాయువారు లేక కవు లనేకవిధములగు నాటకములవ్రాసిరి. వీని కన్నిటికిని జాతివాచకము రూపకము. అది దశవిధము. భాణము డిమము ఇత్యాదులు. ఇప్పటికి రచనకళ తగ్గి పలువిధముల వికారముఁ బొందెను. నాటకరచనయందు స్వేచ్ఛావృత్తి శాస్త్రనియమముచే చెడినది. అలంకార మొక శాస్త్రమై దాని నియములనాదిరిని మన పూర్వికులు కళలకు కూడ నిబంధనలు చేసిరి. వీనిని పోఁద్రోసి వ్రాసినచో లక్షణవిరుద్ధ మని తలఁచి మనవారు వీనిని మార్పలేదు. అతిక్రమింప లేదు. ఇటీవల తగిన శేముషీవంతులును కనుపట్టరు.

ఆంధ్రంబున నాటకోత్పత్తికి మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నకవికృ తాంధ్ర నరకాసురవిజయము ప్రాథమికము. ఇది సంస్కృతమునుండి పరివర్తనము. స్వతంత్రరచనకు రావుబహదూర్ కందుకూరి వీరేశలింగకవి రచిత హరిశ్చంద్రనాటకము మార్గదర్శి. దీనియందు నాటకకళ యుక్తముగా లేదని నా యభిప్రాయము. వృత్త మెట్లు పోషింపవలెనో దానిని గూర్చి దశరూపకమందు కొన్ని నియమములు కలవు. ఏయే పాత్రముల నెట్లు రచింపవలెనో నియమించిరి. కాని యిట్టి నియమము లుండుట లోకవృత్తమున మనముచూచెడువా రీజాతులలోనికి విభజింపఁబడక సంకరజాతివారగుటచే నట్టివారికి ప్రకరణమందు గాక యితరత్ర చోటు లేదు. ఇట్టి ప్రకరణములు చాల తక్కువ. అందుచే మన నాటకములు పరమావధిద్యోతకములుగా నుండెనే కాని యథార్థభూతములు కాలేదు. ప్రకరణములు రెండవ జాతికి చెందియున్నవి. ఇందు ఘనత చెందినవి మృచ్ఛకటికము, మాలతీమాధవము. సాంఘికసంబంధ మగు నాటకములు గాని, చరిత్రకు సంబంధించినవి గాని యరుదు.

మన యాంధ్రనాటకములు కూడ కొంతవఱకు గీర్వాణపక్కిని బోయి యిప్పుడు కవులు స్వేచ్ఛావర్తను లగుచున్నారు. ఇందు కొంతవఱకు ఆంగ్లేయులతోను వారివాఙ్మయముతోడను సాంగత్యమువలం కలుగుచున్నది. ఇప్పట్టున మన మార్గదర్శకు లితరదేశీయులా మనవారా శ్రేష్ఠతరులు అను సంశయము కలుగుచున్నది. హూణవిద్యాసక్తు లాఙ్గ్లేయగ్రంథముల ననుకరింపు మనుచున్నారు. ఇందువలన కవులకు ధీరోదాత్తుఁడే నాయకుఁడుగా నుండవలయు నను నియమ ముండదు. తక్కిన బంధములు కూడవీడును. రచనకళ వ్యాప్తమగును. గీర్వాణనాటకరుచి కలవారు వానినే యనువర్తింపు మందురు. ఈ విషయమున సువర్ణలేఖా పత్రికాసంపాదకులు ఆంగ్లోనాటకము లన్నియు దోషభూయిష్ఠమగు నితివృత్తములతో కూడియుండును గాన, మన దేశమునకు షేక్స్పియర్ మార్గదర్శకుఁడు కాఁగూడదు. కాళిదాసాదులే కావలయు. వారి నియమములే మన కుచితము లని వ్రాసిరి. దీని నిట చర్చింప వీలులేదు. కాని కాళిదా సెట్టి జగద్విఖ్యాతుఁడో షేక్స్పియర్ అట్టివాఁడే. చారిత్రక విషయముల నితివృత్తముగా గ్రహించినందున నెక్కుతరగతుల మనుష్యులను పాత్రలుగా చేయవలసివచ్చెను. వీనివలన మనకు కలుగు నాపద వీరు చెప్పునంత ప్రమాదజనకము కాదని నా యభిప్రాయము. ఇక్కాలమున హెన్రీ ఇబ్సన్ అనువాఁడు సుప్రసిద్ధుఁడు. వానినాటకముల ననుసరించిన బాగుండునని నా యుద్దేశము.

ఏది యెట్లున్నను ఇతివృత్తరచనలో కొన్ని నియమము లుండవలయును. అందలి భాగములు స్వాభావికముగా నతుకవలయుకాని అల్లికజిగిబిగి తప్పఁగూడదు. ప్రతివిషయము కూడ మొత్తమునకు సమవాయసంబంధమున నుండవలయు. అనఁగా వృత్తము అవయవి, భాగము అవయవము. అంతేకాని ఏభాగము వదలినను మొత్తమునకు లోటులేకుండ నుండఁగూడదు. పిమ్మట భాగములకు సంబంధము చిక్కగా నుండవలయు. కార్యకారణసంబంధబద్ధములుగనో లేక ఏకకారణజనితములుగనో యుండి యన్నియు ఇతివృత్తమున సరసముగా పొందుపడవలయు.

ఇఁక పాత్రములు. ఇవి వివిధముగా నుండవలయు. ప్రతిదానికి నిర్ణీతలక్షణము లుండవలయు. ఇవి యాపాత్రముచే చేయించుపనులయందును పల్కించెడుమాటలయందును తోఁపవలయును. పాత్రమున విరుద్ధధర్మము లొక్కవేళనే స్ఫురింపఁగూడదు. అవస్థాభేదమున పాత్రధర్మములు మాఱునప్పుడు పాత్రమున కుండు నౌచితి చెడఁగూడదు. స్వభావ విరుద్ధము స్ఫురింపఁగూడదు. పురాణమునుండి పాత్రము గ్రహించిన యెడల అందు నిర్ణీతములగు లక్షణములకు భంగము కలుగునట్టి కల్పన లుండ కూడదు. కల్పితపాత్రములైనచో స్వభావవిరుద్ధము లేకుండ రచియింపవలయు.

ఇట్టినియమములు సాధారణముగ బుద్ధిశాలికి పొడఁగట్టును. అయినను కొన్ని వేళల ప్రమాదము సంభవింపవచ్చును. అట్టి స్ఖాలిత్య

ములను విమర్శకులు మాపవలయు. అట్టివిమర్శల గుణదోషము లారసి తథ్యమిథ్యావివిక్తి కలిగి కవులు నడుచుకోవలయు. కొలఁది దినముల క్రిందట ఇట్టి విమర్శనము చేయఁగా నది కువిమర్శన మనియు, విమర్శకునకు గీర్వాణసాహిత్యగ్రంథగంధము లేఁ దనియు నొకరు ప్రతివిమర్శనము చేసిరి. విమర్శనములోని తప్పులు దిద్దవలయునే గాని విమర్శకుల నేల దూఱవలయు? ఇట్టి విపరీతచర్యలవలన లాభము లేదు. తిట్టులకు బూనుకొనిన వాఙ్మయ మభివృద్ధి చెందునా? విమర్శనము లేక విచ్చలవిడిగా వచ్చువడి మన ధనమును జూఱగొనుచున్న గ్రంథముల నణఁచుట మన విధి కాదా? విమర్శకునియందు లోప ముండిన గౌరవ నీయమగు మాటలతో చెప్పి దిద్దవలయు.

III ఇఁక మూఁడవముఖ్యాంగము ప్రదర్శనములు. ఇందలి ముఖ్యవిషయములు—సంగీతము,అభినయము,రంగపరికరములు,వాచకము. మొదటిమూఁడింటిగూర్చి కొంతవఱకుచర్చచేసియుంటిని. ఇఁక నాల్గవదానిఁ గూర్చి చెప్పవలసియున్నది. చివరచెప్పఁబడినను ముఖ్యతయందిది నికృష్టము కాదు. ఇతివృత్తము ననుసరించి పాత్రములును రసము నుండు నని చెప్పియుంటిని. పాత్రల గుణదోషప్రకటనము భాషామూలమున. ఇట్టి భాషకు జీవకళ వాచకము. ఇదిబాగుగ నుండనిచో పాత్రవిధ మెట్టిదో వినువారు చెప్పఁజాలరు. ప్రదర్శకునికుం డుండవలసిన ముఖ్యలక్షణము చక్కని వాచకము. ఇందుచ్చారణ రసానుగుణ్యముగానుండి పాత్రోచితమగురీతితో కూడియుండవలయు. మంచియుచ్చారణకు లక్షణములు శుచి, స్పష్టత, వడి, ధ్వని యుక్తముగ నుండవలయు. శుచి యన తప్పులులేకుండ పలుకవలయు. ఒత్తక్షరములు దీర్ఘములు బాగుగ గమనింపవలయు. బాధ, శాపములు, రోదసి మొదలగు మాటలు సాధారణముగ తప్పగా నుచ్చరింపఁబడును. పదవిభజనము యుక్తముగా నుండవలయు. వాక్యమున ముఖ్యమగుమాటను తక్కినవానికంటె నుచ్చస్వరమునఁ బలుకవలయు. లేనిచో నర్థము స్ఫురింపదు. ప్రశ్నము ఆశ్చర్యార్థకము మొదలగునవి తగినరీతిని బలుకవలయు. ద్రుతమును అనుస్వారమును గమనించి అక్షరములను మ్రింగకుండవలయును. ఉచ్చారణ మెంతశుచిగా నున్నను స్పష్టతలేకున్న నర్థము కాదు. పిమ్మట వడికూడ కాలానుసరణముగ నుండవలయును. కడువడిగ చదివినచో వినువారను సరింపలేరు. నిదానించిపల్కినచో కాలవ్యయము. కంఠధ్వనియొకటి. ఈవిషయమున మన ప్రదర్శకులు పాటుపడరు. ఎట్టిస్వరముతో చెప్పిన మాడవచ్చినవారికందఱకును వినిపించునో యెఱింగి వర్తింపవలయు. ఇది శాలయొక్క వైశాల్యమునుబట్టి యుండును. సాధారణముగా పదిమంది ప్రదర్శకులలో నెనమండ్రు చెప్పినది వినుపించదు. ఇందుచేతనే సాధారణముగా శాలలలో నల్లరిపుట్టుచుండును. అందఱకును స్పష్టముగా వినిపించునట్లు పలికెడి ప్రదర్శకుఁడు రంగస్థలమునకు వచ్చుసరికి అల్లరియే యుండదు. ఈవిషయమున పార్సీనాటకుల నందఱు ననుకరింపవలయు. వారు మాటలాడునపు డుండు స్పష్టత, వడి, ధ్వని యెంతయు యుక్తముగానుండును. పరికరబాహుళ్యము ప్రదర్శనాయోగ్యతకెట్లు ప్రతికారియో వివరించితిని. మంచియుచ్చారణకు ముఖ్యప్రతిబంధకము సంగీతము. రాగపునడకనుబట్టి హ్రస్వదీర్ఘాక్షరముల రూపములు మాఱును. ఉచ్చారణ బాగుగనుండవలయునన్న సంగీతము హృద్యముగానుండదు. గొంతుత్రిప్పినఁ గాని సంగీతప్రకర్ష గాన్పింపదు. ఉచ్చారణసంగీతములను యుక్తముగ మిళితముచేయు ప్రదర్శకులరిదియని చెప్పియుంటిని. ఇది సంగీతమందలి యభిమానమువలని దోషము. చాలమందికి ఈలోప ముండును. సంగీతము సహకారియే కావున ఉచ్చారణననుసరింపవలయు. సంగీతపరీక్ష రంగస్థలముల గాదు. ఉచ్చారణ యుక్తముగానుండుట కర్థజ్ఞానముండవలయు. ఇందు వివేకమత్యావశ్యకము. వివేకము బోధవల్ల నలవడును. బోధనలేమిచే నాగరక రుచులలవడవు. ఏలయన భావనాశక్తి తగ్గును. అభిరుచినిబట్టి భావన కుదురును. ఎట్టిపాత్ర మేవిషయముల నెట్లు వర్తించునో యెఱుంగుట కష్టము. సాధారణపాత్రముల చిత్తవృత్తులను భావించుకొనుటయే కష్టసాధ్యమగునప్పు డుత్తమపాత్రల విషయమై చెప్పనక్కఱలేదు. గాంభీర్యముత్తమపాత్రలక్షణము. ప్రతిరసమును పాత్రమునుబట్టి మారుచుండును. దీనిబట్టిమాటలురచింపఁబడును. చిత్తవృత్తుల నెఱింగినఁగాని యభినయము పాత్రోచితముగానుండదు. అట్లుండినఁగాని మెప్పురాదు. పాత్రముల స్వభావమును గుర్తింపనేరక ప్రదర్శకులు గణనకెక్కఁజాలరు.

## సుప్రదర్శకులు లేమికి కారణములు

ప్రదర్శకులకుండవలసిన లక్షణముల నిటవివరించుటకు కాలమును స్థలమును చాలవు. ముఖ్యమైనవిషయము ఉపపత్తి. విద్యాభ్యాసము కొంతవఱకు సాంగముగా జరిపినఁ గాని వివేకముకుదురదు. ఇట్టివివేకమువలన అర్థజ్ఞానము, జిజ్ఞాస పుట్టును. తమకు తెలియని యంశము నితరులవలన గ్రహింపవలెనను కోరిక గలవారు తప్పక యభివృద్ధి కర్హులగుదురు. అర్థజ్ఞానము కుదిరినపిమ్మట నొకరిని చూచి నేర్చుకొనవలయునను కోరిక జనించును. తనయభిప్రాయమునకును ఇతరులయభిప్రాయములకునుగల తారతమ్యము నెఱింగి యుక్తతరమైనదాని నవలంబించును. నానాఁటికి నభివృద్ధిచెందును. దీనికంతకు మూలము వినయము, విద్య. ఇట్టివిద్యయన మిడిమిడిజ్ఞానము కాదు. దీనివలన నహంభావముదయించును. భక్తిశ్రద్ధలతో కూడుకొనిన విద్యసహకారియగును. అహంకార మభివృద్ధికి ప్రతికారి. విద్యాధికులీవఱకు రంగస్థలమునకు తఱచు రాలేదు. వా రిది గౌరవహీనమగు పనిగా నెంచుచున్నారు. ఇట్టివా రాంగ్లేయదేశస్థులలోని ప్రసిద్ధి వహించిన ప్రదర్శకులను చూచి రంగస్థలము నెక్కుటమర్యాదకాదని భావింతురుగాక. కొన్నిపట్టణములయందు గౌరవనీయులగు నుద్యోగస్థులు ప్రదర్శకులుగానుండి యున్నారు. మొట్టమొదట సంఘముల నేర్పఱచునపు డుద్యోగస్థులే త్రోవదీసి నేటికి నిరుద్యోగులు రంగస్థలములఁ బ్రవేశించినతోడనే తామక్కడనుండి తొలఁగిరి. ఇట్లు వీరు సేయుటవలన నర్థఫలమే కలిగెను. సంఘముల నేకములు ప్రబలినవి. ఇట్టివానిని యుక్తగతిని నడుపుట కూడ వీరివిధియే. అదినిర్వర్తింపలేదు. ఈలోపమును సవరించుభారము వారిది. వారది దించుకొనినఁగాని రంగస్థలమునమంచిప్రదర్శకులుండరు. ఏలన ప్రస్తుతపువారికి బోధనచేయువారు కాని, ఇదియిట్లుండవలయునని చేసిచూపించువారుగాని లేరు. ఎవరైన చెప్పదొరకొన్నచో "చెప్పుటసులభము. చేయుటకష్టము" అని యందురు. యుక్తప్రదర్శ

కులు చేసి చూపించువారు బయలుదేఱుసంతవఱకు నీలోపముండవలసి నదే. ఇదియునుంగాక ప్రదర్శనము విమర్శించువారుకూడ లేరు. ఎవ్వరైన వార్తాపత్రికలలో నట్లు సేయఁబూనిరేని వారు ప్రదర్శనముచాల బాగుగనుండెననువారే కాని లోపములను చూపువారుకారు. మరియు నింతవఱకు నాటకప్రదర్శకులనుచూచి సంతసించువారేకాని, వారిని పరీక్ష సేయఁబూనినవారే లేరు. కఠినపరీక్షలనుచేసి మంచిచెడ్డలను తీర్మానించు ప్రయత్నము లిదివఱకు చేయఁబడలేదు.

## ఆధునికప్రయత్నములు

ఇప్పుడిప్పుడు ఈవిషయికమయిన ప్రయత్నములు జరుగుచున్నవి. శ్రీకిందటిసంవత్సరమున కొండపల్లిలో నొకసంఘము మేర్పడి బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహకవి రచిత గయోపాఖ్యాననాటకమునందలి అర్జునపాత్రమును జనరంజకముచేయు నుత్తమప్రదర్శకునకు రు 116 లు విలువగల బంగారుపతకమును రెండవవానికి రు 60 ల పతకమును బహుమానముగా నొసంగిరి. పరీక్షకులు నాటకప్రదర్శనములఁగూర్చి బాగుగ నెఱింగినవారు. తగినయదను నియ్యనందున చాల మంది ప్రదర్శకులు పరీక్షకు కట్టలేదు. ఈ సంవత్సర మా సంఘము వారు వే ఱొద్దియో నాటకమున పరీక్షచేయుదు రని వినుచున్నాను.

రెండవదియు నా సంవత్సరముననే మొదలు పెట్టఁబడినది. "ఆంధ్రకేసరి"యందు నాటకప్రదర్శనము లను మకుటముక్రింద కొన్ని వ్యాసములు ప్రచురింప బడినవి. "సువర్ణలేఖ" యందు కొన్ని విషయములు చర్చింపఁబడినవి. "మానవసేవను" గూర్చి యిదివఱకె చెప్పియుంటిని. "కృష్ణాపత్రికయందు కొంద ఱీవిషయముల చర్చించుచున్నారు. కావున కొంచెము కదలిక పుట్టినది. విమర్శనములు ప్రతివిమర్శనములు, ఖండనములు మండనములు బయలుదేఱుచున్నవి. చర్చల మూలమున కొంత సంశయచ్ఛేద మగుచున్నది.

ఈ రెండును మంచిత్రోవలే; కాని వీనిఁ గూర్చి యించుక చెప్ప వలసియున్నది. పతకముల నిచ్చు సంఘము లింకను ఏర్పడవలయు. సంస్కృతము, తెనుఁగు, ఆంగ్లేయము మొదలగుభాషలలో నాటకములను ప్రదర్శించునట్లేర్పాటులు చేయవలయు. సంస్కృతనాటకము లిప్పు డాడువారే లేరు. దేవభాష నిట్లుపేక్షించుట యుక్తముకాదు. అందు పరిశ్రమచేసినచో తెలుఁగుభాషాజ్ఞానమభివృద్ధినొందును. ఉత్తమ నాటకముల నాడునప్పు డుత్తమప్రదర్శకులు తెలుపడుదురు. చూచు వారల రుచులు నాగరకము లగును. నాటకకర్త లుత్తమనాటకముల వ్రాయుటకు వీలుచిక్కును.

ఇటులే యాంగ్లేయనాటకములను ప్రదర్శించుచుండిన విదేశీయుల రుచులను గ్రహింతుము. సంగీతమక్కఱలేనందున అభినయము వృద్ధిలోనికి సూక్ష్మముగ రాగలదు.

పరీక్ష ఉత్తరసర్కారులలోనివారికే గాక ఆంధ్రదేశమునందంతటను వ్యాపింపవలయు.

విమర్శకులు న్యాయదృష్టితో గుణదోషములను విశదీకరింపవలయును. విమర్శకుల అభిప్రాయములనే ఖండింపవలయునుకాని వారిని నిందింపరాదు. ఇట్లొకరినొకరుదూషించుటచే విమర్శనయొక్క ముఖ్యోద్దేశము చెడును. విమర్శకుఁడు దోషైకదృక్కు కాఁగూడదు. మోమోటముంచుకొనఁగూడదు. మొదటనప్రియమయ్యు తుదికరంబు పథ్యమగుమాట బల్కుచునుండవలయు. గ్రంథకర్తలు లభ్యములగు విమర్శాంశములచొప్పున గ్రంథములను సవరించుకొనవలయును.

## ఇంకేమికావలయు

1. నాటకములయందును ప్రదర్శకులయందును మంచిమాదిరులుండవలయును. నాటకరచన యొకవిధమగు సృష్టి. ఇది బాగుగనుండుటకు మొదలు అనుకరణముండవలయు. పిదప నూతనసృష్టి యొనర్పవలయు. ఏభాషయందేని మంచియున్న దానిని గ్రహించి యాంధ్రంబున రచింపవలయు. వీలుండుసంతవఱకును వివిధభాషల నాటకముల ప్రదర్శించుచుండవలయు.

2. నాటకసామాజికులు పూనికఁదాముపూనుకొనియున్న పనిని నిర్వర్తింపవలయు. వీరుభాషాజ్ఞాన మభివృద్ధిచేసికొనవలయు.

3. చూపఱకును, ప్రదర్శకులకును కవులకును అన్యోన్యసమష్టి సంబంధముండి అందఱియభిరుచులు సంస్కరింప బడి నాగరకార్హములై యుండవలయు. నాటకములప్రవృత్తము చారిత్రక, సాంఘిక, మత సంబంధము కల దగుచు సంస్కరింపబడవలయు.

4. విద్యాధికులును, ధనాధికులును నాటకములయెడలను, తత్ప్రదర్శనములయెడలను, సుముఖులై యుండవలయు. ఎందేని తప్పు కనఁబడినయెడల దిద్దుటకు ప్రయత్నింపవలయు. తా ముత్సాహము కలవారై తమమిత్రుల కుత్సాహము పుట్టింపవలయు.

5. చతురులగు ప్రదర్శకులచేతి ఉత్తమనాటకము ప్రదర్శించి నేర్చుకొనువారికి మార్గదర్శకులు కావలయు.

## విజ్ఞాపనము

సంఘాభిమానులాలా! నాటకశాలలు సాంఘికసంబంధములగు ఏర్పాటులు కావున వానిని తగురీతిని సంస్కరించి యభివృద్ధిలోనికి తెచ్చుటకు పూనుకొనుఁడు. మీ రిట్లుదాసీనభావము చూపుచున్నచో నివి తప్పులకుప్పలై సంఘమునకు చేటుదెచ్చును. శీఘ్రకాలములో వానిబాగుపఱుపనిచో 'ఆలస్యాదమృతంవిష' మ్మనునట్లు కొలఁదివత్సరములలో నవి సంస్కారానర్హములై తత్సంబంధికులనెల్ల చెఱచును.

ఈ నావ్యాసము నేననుకొనిన దానికంటె హెచ్చినది. దీనిని నాయందలి వాత్సల్యముచే ముద్రించిన పత్రికాధిపతులకును, కాలవ్యయమును పాటింపక తుదముట్ట నోపికతో చదివిన నామిత్రులకును నేక సాష్టాంగదండప్రణామములు. సర్వేజనా స్సుఖినో భవంతు.

# చిత్రపటముల వివరణము

## చెన్నపురి గవర్నరులు.

వీరు 1790 మొదలు 1914 వఱకు చెన్నపురి గవర్నరులుగా నున్నవారిలోఁ కొందఱు. కారన్‌వాలిస్ ప్రభువు గవర్నరు జనరలుగను వెల్లస్లే ప్రభువు సర్వసేనానిగను నుండిరి. కిచనర్ ప్రభువు హిందూ దేశపు సర్వసేనాధిపతిగా 1900 మొదలు 1909 వఱ కుండెను. ఇప్పు డీయన ఈజిప్టులోఁ బ్రిటీషు ప్రతినిధిగా నుండి ఏలుచున్నాఁడు.

## సర్. ఎస్. శేషాద్రి అయ్యరు.

వీరు మైసూరు దివానుగా నుండి ఆదేశము నున్నతస్థితికిఁ దెచ్చినవారిలో నగ్రగణ్యులు. వీరి కాలమునందు దేశాదాయము వృద్ధియయి, అనేకజనోపయోగములయిన కార్యములు చేయఁబడెను.

## గౌరవనీయులగు పి. ఎస్. శివస్వామయ్యరు గారు, సి. ఐ. ఇ., సి. ఎస్. ఐ.

వీ రిప్పుడు చెన్నపురి గవర్నరుగారి కార్యనిర్వాహక సభ్యులలో నొక్కరు. నెల 1కి 5833-5-4 జీత మొసంగఁబడును. ఈపని యొసంగఁబడక పూర్వము న్యాయవాదిగను అడ్వొకేటు జనరలుగను చెన్నపురి హైకోర్టునందుండిరి.

## సర్ గురుదాస్ బెనర్జి, కేటి. ఎం. ఏ., డి. ఎల్., పి. హెచ్.డి.

కలకత్తా హైకోర్టు న్యాయవాదిగ నుండి పిమ్మట హైకోర్టు జడ్జి యయ్యెను. ధర్మశాస్త్రోపన్యాసకుఁడుగా నుండి ధర్మశాస్త్రగ్రంథములను వ్రాసెను. శిక్ష, కర్మ యను రెండు పుస్తకములను బెంగాలీలో రచించెను. ఇప్పు డుపకారవేతనమును బుచ్చుకొని వృద్ధాప్యమును కలకత్తా నగరమందుఁ గడపుచున్నారు.

## వి. పి. మాధవరావు గారు, సి. ఐ. ఇ.

34 సం.లు మైసూరు సంస్థానములో కొలువునం దుండిరి. 1904-06 సం.లలో తిరువాన్కూరు దివాను పనిని, 1906-1909లలో మైసూరు దివానుపనిని జేసిరి. రెండు మాసముల క్రిందట బరోడా దివానుగా నియమింపఁబడిరి.

## జి. వి. సుబ్రహ్మణ్య అయ్యరు గారు.

చెన్నపురిలోఁ బ్రచురింపఁబడు "హిందూ" పత్రికకు సుప్రసిద్ధ సంపాదకులుగా నుండి కీర్తి కెక్కిరి, ఆర్థిక రాజకీయ విషయములలో వీరి జ్ఞానము లెస్స. దేశీయ సభానాయకులలో నొకరు. సముద్రమును దాటి ఇంగ్లాండునకు వెల్లిన మొదటి అఱవబ్రాహ్మణుఁడు. తన విధంతు బాలికకు పునర్వివాహముఁ జేసిన సంఘసంస్కర్త. అఱవములో దైనిక పత్రికగాఁ బ్రస్తుతము ప్రచురింపఁ బడుచున్న "స్వదేశమిత్రన్" పత్రిక కధిపతి, సంపాదకుఁడు. 60సం.ల వయస్సుగలదు.

## కె. ఎల్. దత్తు, సి. ఐ. ఇ. గారు

హైందవులకు సాధారణముగా లభింపని యున్నతోద్యోగమగు అక్కౌంటెంటు జనరలు పనిని చెన్నపురిలో నిర్వహించుచున్నారు. భోజనపదార్థముల ధర ఈదినములలో వృద్ధియగుటకుఁగల కారణములను వ్రాసి గవర్నమెంటువారు కోరఁగా పంపియుండెను.

## డాక్టరు జగదీశచంద్ర బోస్, సి. ఐ. ఇ., సి. ఎస్. ఐ.

ఈయన లోకవిఖ్యాతిగాంచిన ప్రకృతిశాస్త్రవేత్త. కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో నుపాధ్యాయుఁడు. ఈయన వ్రాసిన ప్రకృతిశాస్త్రవిషయకపుస్తకములవలనను, చేసిన పరిశోధనలవలనను ఈ లోకములో నున్న గొప్ప శాస్త్రజ్ఞులలో నొక్కరుగా భావింపఁబడుచున్నారు.

## డాక్టరు ప్రాఫుల్ల చంద్ర రే, సి. ఐ. ఇ.

కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో సుప్రసిద్ధిని గడించిన రసవాద శాస్త్రవేత్త. బోసుగారివలెనే నీయనయు లోకఖ్యాతిని దమ పరిశోధనలవలన గడించిరి. హిందూ రసవాద శాస్త్ర మని రెండు గ్రంథములను ఇంక ననేక రసవాదశాస్త్ర గ్రంథములను ఇంగ్లీషున రచించిరి. పి. హెచ్. డి., డి. ఎస్. సి. అను బిరుదులు గలవు. బ్రహ్మచారిగా నుండి తమజీవితమును గడుపు చున్నారు.

## డాక్టరు బ్రజేంద్రనాథ సీలుగారు.

ఈయన కలకత్తాలో నొక కళాశాలకు ప్రధానోపాధ్యాయుఁడుగా నున్నాఁడు. తత్వశాస్త్రమునం దసమానుఁడు. కొన్ని గ్రంథములను వ్రాసెను. విద్యార్థులకాయనయందు పితృవాత్సల్యము కలదు. వంగదేశమునం దున్న అద్భుతమేధాసంపన్నులలో నొకఁడు. బ్రహ్మసామాజికుఁడు.

## మహేంద్రలాల్ సర్కారు.

వంగదేశమందలి విద్యాధికులలో నొక్కరయి యుపాధ్యాయవృత్తి నవలంబించినవారిలో నొక్కరు. గ్రంథకర్త. దేశాభిమాని.

## బంకించంద్రచాటర్జీ, డి. ఎల్. రాయి.

## రాయబహదూర్ దీనబంధుమిత్ర.

వీరు సుప్రసిద్ధ వంగదేశపు కవిశేఖరులు. బంకించంద్రుని నవలలు తెలుఁగులోనికి భాషాంతరీకరింపఁబడినవి. ఆయన వందేమాతరం కీర్తన జాతీయగీతముగాఁ బరఁగుచున్నది.

## ప్రెన్సిపల్ హేరంబచంద్రమైత్ర గారు.

కలకత్తాలో దేశీయులచే నడపఁబడుచున్న సిటీకాలేజీకి ప్రిన్సిపలుగా నున్నారు. గొప్ప మేధాసంపన్నుఁడు. వక్త. దేశాభిమాని. బ్రహ్మసమాజపు నాయకులలో నొకరు. యూరపుఖండమందు జరిగిన

సర్వమత సమావేశమునకు హైందవ ప్రతినిధిగా వెళ్లియుండి యొక గొప్ప యుపన్యాస మొసంగి పరదేశీయులను రమింపఁజేసిరి.

### కూచ్ బేహారు మహారాణిగారు.

బరోడా మహారాజుగారి యేక పుత్రిక. కూచ్ బేహారు మహారాజును తల్లిదండ్రుల యిష్టము లేకనే లండనులో 1 సం. క్రింద వివాహమాడెను. మెట్రిక్యులేషను పరీక్షలో నెగ్గినది. మిక్కిలి సౌందర్యవంతురాలు.

### శ్రీమతి సరోజినీదేవి

వంగదేశములో నుద్భవించి ఆంగ్ల కవిత్వము చెప్పఁగల వారిలో సుప్రసిద్ధురాలు. ఈమెకీర్తి గొప్ప దేశభక్తురా లని మన దేశ మంతట వ్యాపించినది. వర్త. ఆంధ్రులగు కేప్టన్ గోవిందరాజులు నాయుఁడుగారి సతీతిలకము.

### కన్యా కృష్ణాబాయి.

ఈమె మహారాష్ట్రస్త్రీ. ఈ సంవత్సరమే ఎం. ఏ. పరీక్షలో నుత్తీర్ణురా లయినది.

### విద్యాధికలయిన అక్కచెల్లెండ్రు.

శ్రీమతి ద్వారకాబాయి కమలాకరు, శ్రీమతి హరికిషన్‌లాలు, శ్రీ కేలాల్కర్, శ్రీ. తారాబాయి, శ్రీ. మల్లన్న, వీరయిదుగురు అక్కచెల్లెండ్రు. బొంబాయి రాజధానివారు. హిందూ రాజపుత్ర కుటుంబమగు కేలాకరు కుటుంబమునకుఁ జెందినవారలు. మొదటివారు, మూడవవారు, వైద్యవిద్య నభ్యసించి డాక్టరుల పనిని జేయుచున్నారు. శ్రీమతి హరికిషన్ లాలుగారు బి. ఏ ప్యాసయి పంజాబులో బారిష్టరులగు హరికిషన్‌లాలుగారిని వివాహమాడిరి. శ్రీమతి మల్లన్నగారు హైదరాబాదులో నున్న డాక్టరు మల్లన్నగారి సతీతిలకము.

### కన్యా తారాబాయి.

ఈమె లేన మల్లవిద్యాప్రావణ్యముచేత హిందూ లోకమును రంజింపఁజేయుచున్నది. బరోడా పురవాసి. లేడిసాండో అని పిలువఁబడుచున్నది.

### శ్రీమతి మణపాక కమలాంబ.

ఈమె కలపటపు నారాయణ రావుగారను బ్రాహ్మణ క్రయిస్తవుల పుత్రిక. రెండు సంవత్సరముల క్రిందట నార్యధర్మమును స్వీకరించి మచిలీపట్టణ వాస్తవ్యులును ప్రసిద్ధవంశస్థులును నగు శ్రీమణపాక కళ్యాణ నాగభూషణము నాయఁడుగారిని వివాహము చేసికొనెను. ఈమె కాంగ్లేయ విద్యయందును, సంగీతసాహిత్యములందును, చిత్రలేఖనమునందును అభినివేశము కలదు.

### శ్రీమతి కే. కనకమ్మగారు.

ఈమె నెల్లూరు పురవాసి. వితంతువు. విజ్ఞాన చంద్రికా పరీక్షలలో నన్ని బహుమానములను బొంది, అన్ని బంగారు పతకములను సంపాదించెను. చక్కగ కవిత్వము చెప్పఁగలదు. కొన్ని చిన్న గ్రంథములను రచించినది. పత్రికల కనుదినము వ్రాయుచుండును. ఇప్పుడు గవర్నమెంటువారి యుపకారవేతనమును బుచ్చుకొని తిరువల్లిక్కేణిలోని గరల్సు హైస్కూలునందు ఆంగ్లేయవిద్య గఱచుచున్నది.

### కీర్తిశేషురాలగు కొండపి సుబ్బలక్ష్మమ్మగారు.

ఈ సాధ్వీమణి వంగవోలులో న్యాయవాదులగు శ్రీయుత కొండపి రామకృష్ణారావు పంతులు బి. ఎ. గారి సతీతిలకము. ఈమె వంగవోలులోని "లక్ష్మీసహాయస్త్రీసమాజ వ్యవస్థాపకురాలు. సంస్కృతాంధ్రములఁ జక్కగాఁ జదివిన నారీలలామ. ఈమె లెఱుగా నీసమాజపక్షమున నుపన్యాసముల నిచ్చి, సమాజము నెక్కుడుగా నభివృద్ధినొందించెను. ఈ పతివ్రతా శిరోమణి 28-యేట గీర్తిశేషురాలైనది.

### పుదుక్కోట రాజుగారు.

పుదుక్కోట సంస్థానము దక్షిణమునఁగల స్వతంత్ర సంస్థానములలో నొక్కటి. ఈ రాజుగారు అనేక దేశములలోఁ దిరిగి గొప్ప యనుభవమును సంపాదించి దేశమును వృద్ధిలోనికిఁ దీసికొని వచ్చుచున్నారు.

### పానుగంటి రాజులు.

గా. పి. రామారాయణంగారును, వారి సహోదరులును తెలుఁగుజిల్లాలలోఁ ఎం.ఏ, బి.ఏ, పరీక్షలలో గృతార్థులయి పేరెన్నిక గాంచిన జమీందారులలో నగ్రగణ్యులు. శ్రీరామారాయణంగారు చెన్నపురి జమీందారుల ప్రతినిధులుగా నున్నను ప్రజా ప్రతినిధుల కంటె నెక్కువ యాసక్తితో తమ విధ్యుక్త ధర్మములను సామ్రాజ్య శాసన సభలో నిర్వర్తించుచున్నారు.

### లాడ్ గోవిందదాసుగారు.

చెన్నపురి నివాసులు. గుజరాతులు. ధనికులు. చెన్నపురి షెరీఫ్ పని యొసంగఁబడినది. ధర్మాత్ములు.

### హేమచంద్ర సర్కారుగారు.

బ్రహ్మ సమాజ మతమును ఆంధ్రదేశమున వ్యాపింపఁ జేయుటకయి అనేకపర్యాయములు కలకత్తానుండి వచ్చుచు, మతవిషయికోపన్యాసము లొసంగుచు, ఈ మతమును వ్యాపింపఁజేయుచున్నారు. ఎం. ఏ పరీక్షలో ప్యాసయినను దారిద్ర్యమునే వ్రతముగాఁ బూని ఉదరపోషణమున కగు ఖర్చులను దీసికొనుచు తమకాలము నంతయు మతవ్యాపకమున కుపయోగించుచున్నారు.

### దక్షిణ వల్లూరు జమీందారుగారు.

విద్యాధికులు. దేశాభిమానులు. వీరివలన నాంధ్రదేశమున కెక్కువ యుపకారము కలుగఁగల దని యూహింపఁబడుచున్నది.

### శ్రీముక్త్యేశ్వరపురం జమీందారుగారు.

వీరి సంస్థానము పురాతనమునుండి ప్రసిద్ధిఁ జెందినది. వీరు శ్రీచంద్ర మౌళీశ్వర ప్రసాదు బహద్దర్ మన్నేసుల్తాన్ అని పిలువఁబడు

చున్నారు. ముక్త్యాలలో కాపురముందురు. ధర్మాత్ములు. ఆంధ్ర భాషాపోషకులు.

### శ్రీవత్స వాయిజగపతి రాజుగారు.

పెద్దాపురపు వంశములో నున్న వారిలో పెద్దలు. 80 సం॥ ల వయస్సు. గీర్వాణాంధ్ర భాషాకోవిదులు. వైద్యశాస్త్ర వేత్త. గ్రంథకర్త. 7గురు మనుమలు, 12మంది మనుమరాండ్రు, 1ముని మనుమడు, 2 ముని మనుమరాండ్రు కలరు.

### చెన్నపురి హైకోర్టు న్యాయాధిపతులు.

ఈ పటము 1913 సం॥లో జస్టీసు బెన్సనుగారుద్యోగమును మానుకొని వెళ్లునపుడు తీయబడినది. ఎడమ వయిపునుండి పేర్లను జదువ వలయును. జస్టీసులు (1) ఠయబ్జి (2 సదాశివయ్యరు (3) సుందర అయ్యరు (4) మిల్లరు (5) బెన్సను (6) సర్ ఆరనాల్డువైట్ (ప్రధాన న్యాయాధిపతి) (7) సర్ వాలెస్ (8) శంకరంనాయరు. (9) మన్రో (10) ఓల్డుఫీల్డు.

### కీర్తిశేషులయిన సుందరం అయ్యరుగారు.

సుప్రసిద్ధ న్యాయవాది. హైకోర్టు జడ్జి. దేశీయ నాయకులలో నొక్కరు. వారి యకాలమరణము దేశమునకు గొప్పలోపమును గలిగించినది.

### అడ్వొకేటు జనరలుగారు.

వీరిపేరు కార్డ్యూటు దొరగారు. చెన్నపురికి సీమనుండి వచ్చి కొలదికాలమేఅయినను చెన్నపురి హైకోర్టులో హైందవ న్యాయవాదులయొక్కయు, ఇంగ్లీషువారి యొక్కయు మన్ననలకు పాత్రులయిరి.

### నవాబు సయ్యదు మహమ్మదుగారు.

చెన్నపురి శాసన నిర్మాణ సభవలన నెన్నుకొనబడిన సామ్రాజ్య శాసన నిర్మాణ సభ్యుడు. దేశీయనాయకుడు. ప్రజాభిమాని. గతసంవత్సరము కరాచిలో జరిగిన దేశీయ మహాసభ కగ్రాసనాధిపతి.

### హరిశ్చంద్ర విష్ణు దాసుగారు.

సింధుదేశవాసుల పక్షమున బొంబాయి శాసననిర్మాణ సభ కెన్నుకొనబడిన దేశభక్తుడు. కరాచిలో జరిగిన దేశీయమహా సభాహ్వాన సభాధ్యక్షుడు.

### దివాన్ కౌమామల్ చందనమల్.

సింధుదేశపు నాయకులలో నొక్కరు. ప్రజానురాగమును గడించినవారు. కరాచిలో జరిగిన సంఘ సంస్కరణ సభ కధిపతిగా నుండెను.

### డాక్టరు సండరులాండు.

క్రైస్తవ మతమును విడనాడి ఏకేశ్వర వాదియై అమెరికాలోని యూనిటేరియనులకు నాయకుడయ్యెను. గొప్పగ్రంథకర్త. హిందూదేశమునందు భక్తియెక్కువ. ఈ సంవత్సరము కరాచిలో జరిగిన ఆస్తికమహాసభకగ్రాసనాధిపతిగనుండెను.

### గౌ. హారన్ దొరగారు.

25సం॥ల.నుండియు చెన్నరాజధానిలో కొలువున్నారు. అసిస్టెంటు కలక్టరు ద్యోగమునుండి బోర్డు ఆఫ్ రెవిన్యూలో ముఖ్యుడగు నంత ఉన్నతోద్యోగములను జేసెను. ఫారెస్టు కమిటీకి అగ్రాసనాధిపతిగనుండి జనుల కనుకూలమగు సిఫారసులను వ్రాసిపంపెను. వీరింకను గొప్పయుద్యోగములను జేయగలరు.

### క్లేగ్ దొరగారు.

వీరును పైదొరగారివలెనే ఉన్నతోద్యోగములనుజేసి బోర్డు అఫ్ రివిన్యూలో ప్రథమోద్యోగమును జేయుచున్నారు.

### మదరాసు బిషప్‌గారు.

వీరు హైందవ ప్రజాభిమానులు. దక్షిణాఫ్రికా గడబిడలో భారతీయులపక్ష మవలంబించి తగిన సమయము నందు గొప్ప సహాయమును జేసి మనవారి కృతజ్ఞతలకు పాత్రులయిరి. వీరిని జూచి అనేక మంది యూరోపియనులు ఈ కలహములలో మనవైపు జేరగలిగిరి.

### రెవరెండు ఆండ్రూసుగారు.

వీరు ఢిల్లీలో నొకకళాశాలలో నుపాధ్యాయులు. హిందూదేశమందు వీరికున్న యనురాగము వర్ణనాతీతము. రవీంద్రనాథ టాగోరుగారియందు వీరికి గురువాత్సల్యత గలదు. అనేకవ్యాసములను దేశీయ పత్రికలకువ్రాయుచుందురు. గౌ. గోఖలేగారుకోరగా దక్షిణాఫ్రికాకు వెళ్ళి అచట శాంతివచనములను బలికి సంధానేర్పఱచుటలో నెక్కువగా కృషిసలిపి భారతీయుల మన్ననలకు పాత్రులయిరి.

### సర్ హెన్రీ కాటన్.

ఈయన 30 సం. లు ఆంగ్లేయోద్యోగిగ మనదేశమందుండెను. హిందూదేశాభిమాని దేశీయ మహాసభ కధ్యక్షుడుగా గూడనుండెను. హిందూదేశమును గురించి పుస్తకములను వ్రాసెను. సర్ విలియం వెడ్డరుబరనుగారివలెనే నెల్లప్పుడు ఇంగ్లాండులో మనదేశీయులకయి పాటుపడును.

### డాక్టరు రసవిహారిఘోషు.

దేశీయ మహాసభాధిపత్యమును రెండు పర్యాయములు వహించెను. కలకత్తాలో నతిప్రఖ్యాతిని గడించిన న్యాయవాది. నెలకు 20,000 లకు పయిగా నార్జించునట. కలకత్తా విశ్వవిద్యాలయమువారికి 10 లక్షల రూపాయలు ప్రకృతి శాస్త్రాభివృద్ధికయి దానము జేసి తన దేశాభిమానమును లోకమునకు వెల్లడించెను.

### రసూలు గారు.

హిందువులతో మహమ్మదీయు లెక్కువ సఖ్యతను గలిగియుండవలయునని వాదించు మహమ్మదీయులలో నొక్కరు. గొప్ప బారిష్టరని ప్రతీతికలదు. ఆంగ్లేయయువతిని పెండ్లియాడెను.

## నెల్లూరు పురసౌధము.

ఈ పురమందిరమును శ్రీయుత రేబాల లక్ష్మీనరసా రెడ్డిగారు చాలధనమును వ్రయముచేసి కట్టించుట వలన వారి పురాభిమానము వెల్లడి యగుచున్నది. ఇట్టి పురమందిరము ఏజిల్లా యందును లేదని చెప్పుచున్నారు. ఇంకను కట్టడము పూర్తికాలేదు. ఇప్పటికే నలుబది వేలకు మించినదట.

## మదరాసు నిమ్నజాతుల పాఠశాల.

చెన్నపురి సంఘసంస్కరణ సమాజమువారిచే నడుపబడుచున్నది. ఈ పాఠశాలవలన ఈజాతుల కెక్కువయుపకారము గలుగుచున్నదనుట నిర్వివాదాంశము.

## రక్షక సేనవారు.

దొంగజాతులను తమపోషణము క్రింద తీసికొని మంచి జీవనోపాయముల గలిగించుచు చెడ్డవృత్తి నుండిమరల్చుచున్నారు. అట్టి వారి సంచికలోని పటమునందు గలరు. రెండవ పటములో పట్టుపరిశ్రమమును నేర్చుకొనుచున్న అంత్య జాతుల బాలురు కలరు.

## కౌన్సిల్లరు నంజుండయ్య గారు సి. ఐ. ఇ.

వీరు మైసూరు ప్రభుత్వ సేవయందు సుమారు 25 సం॥లకు పయిగా నుండి స్వల్పోద్యోగము నుండి మైసూరు ప్రధాన జడ్జి ప్రథమ కౌన్సిల్లరు మొదలగు గొప్ప పదవులను బడసిరి.

## ప్రొఫెసరు కర్వేగారు.

మహారాష్ట్ర బ్రాహ్మణులు. పునహావితంతు శరణాలయమును స్థాపించిన వారు. తమ యావజ్జీవమును స్త్రీలోకాభ్యుదయమున కయి వినియోగించుచున్నారు.

## సెడింబి హనుమంత రావు పంతులుగారు.

కృష్ణాజిల్లా సంఘపు ప్రెసిడెంటుగారును దొరతనము వారి న్యాయవాదులును నగువీరి సాధుగుణ సౌశీల్యములు నుదార స్వభావమును సుప్రసిద్ధములు. ఆంధ్రదేశమునందు ప్రారంభమైన దేశాభ్యుదయ ప్రయత్నములందు వీరి చేయూతలేని దొక్కటియు లేదు. ప్రతి సత్కార్యమునకును వీరుచేయు స్వార్థత్యాగమును, పరిశ్రమయు, చూపు నుత్సాహమును సార్వజనైకాను కరణీయములు.

## వల్లూరు సూర్యనారాయణరావు పంతులుగారు.

ఆంధ్రదేశనాయకులందలి నిర్భయప్రవర్తకులలో నొక్కరును, రాజకీయ, సాంఘిక, సంస్కర్తలలో మున్నెన్నదగిన వారును నగు సూర్యనారాయణరావు పంతులుగారు ఆంధ్రోద్యమ నిర్వాహణ ధురీణులై ప్రఖ్యాతి గాంచియున్నారు. సర్వజన సమత్వమును మనోవాక్కాయ కర్మలయందు బ్రకటించుట యందును, ప్రజోపయోగ కార్యములను బహుదీక్షతో నెరవేర్ప బ్రయత్నించుటయందును, వీరు కనపఱచు నుత్సాహము మిక్కిలి గణనీయము. కొలది కాలములో వీరు తమసర్వశక్తులను దేశహితైక కార్యములకై వినియోగింపనున్నారు.

## రావుబహదూర్ వి. నరసింహారావుగారు.

వీరు కర్నూలు మునిసిపలు చైరుమను పనిని జేసి ప్రజల యొక్కయు ప్రభుత్వమువారి యొక్కయు మన్ననలకు పాత్రులయిరి. వీరికి గవర్నమెంటు వారు రావుబహదూర్ అను గౌరవ బిరుద మిచ్చి సత్కరించిరి.

## టి. వి. వేంకటరామయ్యరు గారు.

నెల్లూరులో ఖ్యాతిపడసిన న్యాయవాది. వీరి సహోదరులు టి. వి. శేషగిరి అయ్యరుగారు హైకోర్టుజడ్జి యయినందున చెన్నపురిలో న్యాయవాదిత్వము నవలంబించుట కయివచ్చిరి.

## అమలినేని కొండప్పగారు బి.ఏ. బి. ఎల్.

కమ్మకులజులు. బళ్లారిలో న్యాయవాదులై యున్నారు. అనంతపురం జిల్లా కల్యాణదుర్గం తాలూకాలో బి. ఎల్. ప్యాసయిన వారు వీరొక్కరే.

## డాక్టరు కే. గోపాలరావుగారు.

బి.ఏ. పరీక్షలో కృతార్థులైనపిమ్మట నిజాముగారిచ్చినవిద్యార్థి వేతనమును బొందివైద్యశాస్త్రము నభ్యసించుటకై ఎడెంబరోపట్టణమునకుబోయి ఎం. బి; సి. ఎం; సి. ఎచ్. బి. మున్నగుపరీక్షలలో సగౌరవముగను తీర్ణులైరి. వైద్యశాస్త్రమేకాక మానసికశాస్త్రము మొదలగు విషయములందును మంచిజ్ఞానముగలవారు. వీరిప్పుడు జిల్లాసివిలుసర్జను ఉద్యోగమునందున్నారు. నిజామురాజ్యములోని తెలుగు ప్రాంతమునుండి సీమకుబోయిన బ్రాహ్మణులలో వీరే మొట్టమొదటివారు. ఆంధ్రసాహిత్యమున సమర్థులు. సీమనుండివచ్చినతరువాత వీరిని ప్రాయశ్చిత్తమునకు లోబరచుయత్నములు జరిగియుండెను; కాని వీరు వానికిలొంగలేదు. వీరివినయాదిసద్గుణములు ప్రశంసనీయములు

## శ్రీయుత తెన్నేటి సూర్యనారాయణగారు బి. ఎ

వీరి వయస్సు 21 సంవత్సరములు. వీరు 1911 వ సం॥ న బి.ఎ. పరీక్ష యందు కీర్తియుతముగ జయమునంది క్రితము అక్టోబరు నెలలో శ్రీపిఠాపురము రాజావారి విశేషసాహాయ్యమున ఐ.సి.ఎస్. పరీక్షయందు కృతార్థులగుటకు సీమకుపోయిరి. వీరుధరించియున్న పతకము బి. ఎ. పరీక్షయందు ఆంధ్రదేశమున ప్రథములుగా జయముగొని గణించిన "మార్డొనాల్డు" సువర్ణపతకము. గణితము వీరికి అభిమాన శాస్త్రము. బాల్యమునుండియు వీరీవిధముననే ప్రతితరగతి యందును ప్రథములుగానుండి, పతకములను విద్యార్థి వేతనములను అవ్యవధిగా అనుభవించియున్నారు. వీరిని ఇంతవరకు దయజూచిన జయలక్ష్మి ప్రస్తుతప్రయత్నమునగూడ కృతార్థుల జేయుగాత !

## డాక్టరు కోకా అహోబలరావుగారు.

వీరు, బందరు నివాసులును, ప్రసిద్ధపురుషులును, నగు కోకా నారాయణస్వామినాయుడుగారి పుత్రులు. 1906 మొదలు 1910 సంవత్సరము వఱకు ఎడింబరావిశ్వ విద్యాలయమున వైద్యశాస్త్రము

నభ్యసించియున్నట్టి ఎం. బి, పట్టమును; డబ్లినులో సి. హెచ్. బి. పట్టమును; లివర్పూలులో డి. టి. ఎమ్ పట్టమును; బడసిరి. పిమ్మట మాత్రసంబంధమగు వ్యాధులను పరిశోధించు నిమిత్తమై న్యూయార్కు, బోస్టను, చికాగో, సియాటిలు, టోకియో నగరములందలి వైద్యాలయములను దర్శించి 1911 సం॥న స్వదేశమునకు మఱలివచ్చిరి. ప్రస్తుతము స్వస్థానమగు బందరు పట్టణముననే నివాసమేర్పఱచుకొని ఎందరికో ఉచితముగ వైద్యసహాయ మొసఁగుచున్నారు. దయార్ద్రహృదయులు. శాంతస్వభావులు. సమర్థులగు వైద్యులు. వ్యాయామములందు నిపుణులు.

### న్యూయింగ్టను పాఠశాల.

ఈ పాఠశాల చెన్నపురి రాజధానియందలి జమీందారుల బిడ్డలు చదువు కొనుటకయి చెన్నపురిలో నొకభాగమగు తేనాంపేటలో నుంచబడినది. ఈపటము ఇంగ్లీషు విద్యగఱచున్న మైనరులును, వారి తండ్రులును, ఉపాధ్యాయులును సాంవత్సరి కోత్సవదినమున దీయించుకొనినది.

### కొత్తి వేంకటరమణారావుపంతులుగారు.

ఐ. ఎమ్. ఎస్. అను గొప్పపరీక్షయందు కృతార్థులైన ఆంధ్రులలో మొదటివారు. లండను విశ్వవిద్యాలయమున ఎమ్. ఆర్. సి. ఎస్., ఎల్. ఆర్. సి. పి పట్టములను బడసిరి.

### జనస్వామి రంగావధానులుగారు.

1912 సంవత్సరమున వీరు బి. ఇ. పరీక్షయందు రాజధానిలో మొదటివారుగ కృతార్థులైరి. ఇంతకు పూర్వమునయాంధ్రులెవ్వరును నీపరీక్షయందు ప్రసిద్ధివహించినవారులేరు. హైడ్రాలిక్కు (జలయంత్రశాస్త్రము) ఇంజనీరింగులో వీరికి డేవిడ్సను సువర్ణపతకము లభించినది. ప్రస్తుతము వీరుగుడివాడసబుడివిజనుకు లోకలుఫండుఅసిస్టెంటు ఇంజనీరు గానున్నారు.

### చెన్నాప్రెగ్గడ భానుమూర్తిపంతులుగారు.

చాలకాలమువీరు బందరు నోబిలుకళాశాలయందు గణితశాస్త్ర పండితులుగనుండిరి. బోధనాకౌశలముచేతను, విద్యార్థిబృందమునందలి యనురాగముచేతను, సుగుణసంపత్తిచేతను వీరు సర్వజనులకును సుహృద్వరులై భాసిల్లిరి. అనర్గళముగను, సులలితముగను, చిత్తరంజకముగను నగుకవిత్వము చెప్పగలసమర్థులు. గొప్పసంస్కృతవిద్వాంసులు. ప్రస్తుతము చెన్నపురి దొరతనమువారి తెలుగు ట్రాన్సులేటరు పదవియందున్నారు.

### వైద్యులకృష్ణారావుగారు.

వీరుచాలకాలము నూజవీడులోని శ్రీరాజా రంగయప్పారావుగారి పాఠశాలలో నుపాధ్యాయులుగనుండిరి. వీరి విద్యార్థులపైనభిమానమును, స్నేహితులయందు వాత్సల్యమును, నిర్దుష్టమగు వర్తనమును, మర్యాదలక్షణమును ప్రశంసనీయములు.

### ప్రొఫెసరు ఎమ్. రంగాచార్యులుగారు, రావుబహద్దరు.

సంస్కృతాంగ్లభాషా కోవిదులును, ప్రసిద్ధవ్యాఖ్యాతలును, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారాధి పతులునునైన వీరు ప్రస్తుతము ప్రెసిడెన్సీ కళాశాలలో తత్వశాస్త్రపండితులుగనున్నారు. వీరియభిమానవిద్య ప్రకృతిశాస్త్రమైనను, ఆంగ్లభాషయందును, సంస్కృతసాహిత్యమునందును అపారపాండిత్యముగడించి సర్వతోముఖ పట్టమునకర్హులైన స్వల్పసంఖ్యాకులగు దేశీయులలో వీరొక్కరు. వీరి దేశహితైకనిరతియు, జంకుకళంకులేని ప్రవర్తనమును, శ్లాఘ్యములు

### పోతరాజు నరసింహముగారు.

రాజధానికళాశాలయందు బోధకులు. తత్వశాస్త్రమున గొప్ప పండితులు. వీరివ్యాసములు తత్వశాస్త్రపత్రికలయందు ఆదరపూర్వకముగా ముద్రింపబడుచుండును.

### గరికిపర్తి కోటిలింగముగారు.

మచిలీపట్టణవాసులు. గొప్పసంగీతవిద్వాంసులు, వీరిగానపాఠశాలయం దెందరో స్త్రీలు, పురుషులు విద్యనభ్యసించుచుందురు. స్త్రీలలో గానవిద్యావ్యాపనమునకై వీరుచేసిన కృషి మఱియొక్కరు చేయలేదు. వీరియొద్దనున్నాయి నేర్చుకొనినవా రెందరో బహుఆహ్లాదకరముగా వాయించగలరు. కోటయ్యదేవరగారి కీర్తిదక్షిణ దేశమందు కూడ వ్యాపించి యున్నది.

### ఎ. ఎల్. నారాయణరావుగారు.

వీరు బి. ఇ. పరీక్షలోగడచిన సంవత్సరము రాజధానిలో రెండవ వారుగ నారితేరిరి. ప్రస్తుతము గూడూరు డివిజనుకు లోకల్ ఫండు అసిస్టెంటు ఇంజనీరుగనున్నారు.

### జి. వి. కృష్ణారావుగారు. బి. ఏ.

ఈయన బి. ఏ. ప్యాసయిన తరువాత క్షయవ్యాధిచేత బాధితులై, ఔషధములవలన కుదురనందున కూనీగారి తొట్టివైద్యము జేసి దానివలన పూర్ణారోగ్యముబొంది, బి. ఎల్, చదువుటను మానుకొని తమయావజ్జీవమును ఈతొట్టివైద్యవ్యాపకమునకయి వినియోగించుచున్నారు. అనేకమంది దీర్ఘవ్యాధులను కుదిర్చి పొగడ్తలనొందుచున్నారు.

### గోటేటి జోగిరాజుగారు.

పిఠాపురమురాజుగారి వ్యవసాయనిదర్శన క్షేత్రమున కధిపతులుగనున్న జోగిరాజు పంతులుగారు తమయభిమాన శాస్త్రమునందు చాలసమర్థులు. వ్యవసాయశాస్త్రపరీక్షయందు వీరురాజధానిలో మిక్కిలి యున్నతస్థానమువహించిరి. వీరియాధిపత్యము క్రింద పీఠికాపురమునందలి క్షేత్రముమిక్కిలి జయప్రదముగా నిర్వహింపబడుచున్నది. విజ్ఞానచంద్రికా మండలివారికి వ్యవసాయము విషయమై అమూల్యములగు రెండుసంపుటములను రచించియున్నారు.

జయపురం మహారాజుగారు, కుమార రాజుగారు.

ఈసంస్థానము విశాఖపట్టణము జిల్లాలో కలదు. మహారాజుగారుదాతలు. సంస్థానము మిక్కిలి ఫలవంతమైనదని ప్రసిద్ధికెక్కినది.

జయరామరావుగారు.

వీరు కృష్ణాజిల్లాలోని నర్సాపురంలో నోబెలు హైస్కూలు హెడ్మాష్టరుగనున్నారు.

పంచాపకేశయ్యరుగారు.

చెన్నపురి మైలాపురంలోని పి.ఎస్. హైస్కూలు హెడ్మాష్టరుగనున్నారు.

జి. ముకుందరావు నాయడుగారు.

గంజాంజిల్లా శ్రీకాకుళములోని హైస్కూలు హెడ్మాష్టరు.

ఎడ్ల రామదాసుగారు.

హరిభక్తులు. గ్రంథకర్త. ఆంధ్రదేశమం దనేకమంది శిష్యులుగలరు.

బి. ప్రకాశంగారు.

వీరు బందరు పురవాస్తవ్యులు. సంగీత సాహిత్యములందు మంచి పాండిత్యముగలవారు, హిందూ బాలికా పాఠశాలయందును హిందూ పాఠశాలయందును నుపాధ్యాయులుగ నుండి విద్యాభివృద్ధికి పాటుపడిరి. సంగీతపాఠకులకు ప్రకాశముగారి పాండిత్యము విదితము.

కందర్ప శ్రీరామశాస్త్రిగారు.

శ్రీరామశాస్త్రిగారు బందరుపుర వాస్తవ్యులు. నోబిలు కళాశాలయందు కొంతకాల ముపాధ్యాయులుగ నుండిరి. వీరి మేధాప్రజ్ఞ యద్భుతము. అద్వైతసిద్ధాంతము బోధించుటయందు విశేష శక్తి గలవారు. పాశ్చాత్య తత్వగ్రంథములను నద్వైత సిద్ధాంతగ్రంథములను సమన్వయించి బోధించెడి విశేషసామర్థ్యము వీరి కుండెడిది. వీరు రెండేండ్లకు బూర్వము కాలధర్మము నొందిరి. వీరు స్థాపించిన సమాజము గుడివాడయందు గలదు.

కొప్పరపు రామారావు పంతులుగారు.

ఫస్టుగ్రేడు ప్లీడరు, మునిసిపల్ చైరుమన్, పబ్లికు ప్రాసిక్యూటరు, పనులను నెల్లూరులో జేసియున్నారు. తరువాత జిల్లా మునసబు హోదానుకూడ బడసిరి. ఈయన 20,000 వరకు దానధర్మములనుజేసి రాచపుండువలన మృతినొందెను. నెల్లూరుజిల్లాలో గొప్ప పేరును పొందినవారు.

సారంగుభీమశంకరముగారు

న్యాయవాది. రాజమండ్రి మునిసిపాలిటీకి చైరుమనుగానున్నారు.

మాడపాటిహనుమంతరావుగారు.

ఆంధ్రభాషాభిమానులు. కవనము జెప్పగలరు. ఇప్పుడు శ్రీనిజాము ప్రభుత్వమువారికి తెలుగుట్రాన్సు లేటరుగానున్నారు.

దారాలింగయ్యగారి సూర్యప్రకాశలింగముగారు.

విజయనగరములో గొప్పవర్తకులు. కొన్ని గ్రామములను సంపాదించి గొప్ప భూస్వాములైనట్టివారు.

వేములకొండ విశ్వనాథము పంతులుగారు బి. ఎ.

వీరు భీమునిపట్టణపాలనాసంఘాధ్యక్షులు. ప్రజాభిమానము గలవారు.

నూజవీడు జమీందారుల పెద్దపటము.

మొదటివరుసలో నిలుచున్నవారు:— శోభనాద్రి అప్పారావుగారు, 2. నారయ్యప్పారావుగారు, ముసునూరు, 3. రాజా నారయ్యప్పారావు బహద్దరు కుమారరాజాగారు భద్రాచలము పాల్వంచ వగైరా, 4. రాజా రాజగోపాల అప్పారావు బహద్దరు జమీందారుగారు ముసునూరు వెంట్రప్రగడ ఎస్టేటుదారుల కనిష్టసోదరులు, 5. అప్పారావు కుటుంబములోనివారు కారు, 6. రాజాసింహాద్రి అప్పారావు బహద్దరు జమీందారుగారు, ఇప్పటి వెంట్రప్రగడ ఎస్టేటు ప్రభువు, 7. కీర్తిశేషులైన రాజా వేంకట్రామయ్యప్పారావు బహద్దరు జమీందారుగారు, రాజా పార్థసారథి అప్పారావుబహద్దరుగారి ద్వితీయపుత్రుడు, 8, రాజా శ్రీమన్నారాయణ అప్పారావు బహద్దరుగారు, కపిలేశ్వరపురము జమీందారుగారి ద్వితీయపుత్రుడు, 9, రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, ఇప్పటి ఉయ్యూరు మైనరు జమీందారు, 10. అప్పారావు కుటుంబములోనివారు కారు.

రెండవవరుసను కూర్చుండినవారు:— 1, రాజా శోభనాద్రి అప్పారావు బహద్దరుజమీందారుగారు మిర్జాపురము ఎస్టేటు మైనరు సోదరులలో చిన్నవారు, 2, 3 అప్పారావు కుటుంబములోనివారు కారు, 4. రాజా పార్థసారథి అప్పారావుబహద్దరుగారు, శనివారపుపేట పాల్వంచ సంస్థానాధీశులు, 5. అప్పారావు. కుటుంబములోనివారు కారు, 6. రాజా వేంకట రంగయ్యప్పారావు బహద్దరు జమీందారుగారు, 7. అప్పారావు కుటుంబములోనివారు కారు, 8. రాజా వేంకట రామయ్యప్పారావు బహద్దరుగారు మిర్జాపురము మైనరు జమీందారులలో పెద్దవారు.

DECORATE! DECORATE!! DECORATE!!!

## YOUR HOUSE

# With our cheapest & best furniture.

మీయిల్లు నలంకరించుటకు కావలసిన యన్ని సామానులను సులభక్రయమునకు మే మొసంగగలము.

ఈసామాను శ్రేష్ఠమయినది. బహుకాలముండును.



మావద్ద.—

కుర్చీలు,
ఏకు మంచములు,
ఇనుప మంచములు,
స్ప్రింగు మంచములు,
మడత మంచములు,
చక్కని సోఫాలు,
అనేకరకముల కుర్చీలు,
వివిధములైన బీరువలు,
నిలువు టద్దములు,
చలువరాతి బల్లలు



మీగృహము నలంకరించుకొనుటకు మదరాసులో ఎట్టివస్తువులు దొరకగలవో అవన్నియు చౌకగా లభించును. వందలకొలది జనులు మావద్ద కొని తృప్తిపడియున్నారు.

అనేకమయిన బొమ్మలతో ముద్రింపబడిన క్యాటలాగు పంపమని వ్రాసినవారికి పంపుదుము.

దానిని జూచి కావలసిన వస్తువుల నేర్పరచుకొనవచ్చును.

తక్షణమే వ్రాయుడు.

పి. ఎస్. పొన్నుస్వామి పిళ్లె
అండు సన్
కాబినెట్ మేకర్సు,
40,41,242 రాటన్ బజారు
మద్రాసు.

**P. S. Ponnuswamy Pillai & Son**
CABINETMAKERS,
40,41,&42 Rattan Bazar Row
MADRAS.

## డాక్టరు వామన్ గోపాలుగారివనస్పతికృత, అయోడైజ్డు

# సరసపరిల్లా



రక్తమే మనుజులకు ప్రాణము. రక్తము దోష సహితమైనచో రోగములకు కారణమని చెప్పపనిలేదు. దీనిని చక్కగా శుద్ధిచేసి రక్త పుష్టిచేయుటకు ఈ సరసపరిల్లా ఇప్పటికి 40 ఏండ్లనుండి అనుభవముచే ప్రసిద్ధిగాంచినది. ఇది రక్తశుద్ధిని బాగాజేయుటయేగాక సవామేహమును, దానివలన గలుగు వాతాదిభయంకరరోగములు, సంధివాతము, గండమాల శరీరమునందుబుట్టు కురుపులను, నల్లనిమచ్చల సంధి బంధనముల పీనసము అనగా ముక్కుకుళ్ళు దిబ్బడవేయుట, కొన్ని చోట్ల స్పర్శజ్ఞానముతగ్గుట, రసములినుటచే గలుగు గ్రంధులయుబ్బు, పంటిజబ్బులు మొదలగు జబ్బులనన్నిటిని ఈ సరసపరిల్లా వాడిన నయము చేయును. దీనివలన నపాయములేదు, బలముగలుగును. గొప్ప డాక్టరులుకూడా రోగులకు దీనిని వాడుచున్నారు. బాగా గుణముచేయుటకు 5 సీసాలు కావలయును. వెల సీసా 1-కి రు 1-4-0, సీసాలు 4 కి రు 4-8-0 వి. పి. ఖర్చులు కొనువారే భరించవలయును.



## మెదుడుకు పుష్టిజేయు మంచి మందు

## ఫాస్పరస్ మాత్రలు భాస్వరమాత్రలు.

నరముల పుష్టికి ఫాస్పరస్ నకు సమానమయిన వస్తువింకొకటిలేదు. బలహీనములయిన స్పర్శనాడులకు యిది ప్రాణము నిచ్చుచున్నది. శక్తిని గలిగించుచున్నది. నరముల బలహీనతవలన కలిగిన రోగవికారములకు యిది మంచి మందు.

అతి మనోపరిశ్రమవలనగాని, నరముల బలహీనమువలనగాని దుర్బలత్వ మేర్పడినపుడు యీ మాత్రలు విచిత్రముగా పనిచేయును. శుక్లనష్టములు, స్వప్నస్ఖలనములు, యింద్రియ స్ఖలనములు మొదలగు జబ్బులకిది బాగుగా పనిజేయును. ఈ మాత్రలు మనోదుర్బలమును బాగుజేయుటయేగాక మనోదారుఢ్యమును బుట్టించుటకును నుపయోగపడును. ఇంద్రియస్ఖలనము, స్వప్నస్ఖలనము దురభ్యాసము మొదలగువాటివలన పుంసత్వమునకు హానికలుగుచున్నది. పుంసత్వమును కలిగించుటకు భాస్వరమువంటిమందు వేరొకటిలేదు.

దీనితో క్వైనా చేర్చుటవలన తలనొప్పులను పోగొట్టును. వీటికి తోడు లోహము, స్ట్రిక్నియా, డామియానా వీటిలో చేర్చబడినందువలన రక్తహీనము, బలహీనము, అగ్నిమాంద్యము మొదలగువాటికి మంచి మందు.

ఋతువికారములు, ఋతుశూల, వంధ్యత్వము మొదలగు వికారములను గలిగిన స్త్రీలకు సయితమీ మాత్ర లుపయోగించును.

24 మాత్రలుగల సీసా వెల 0-14-0, 1 మొదలు 4 సీసాల వరకు పోస్టుఖర్చులు 4 అణాలు.

## ప్రొప్రైటరు గౌతమరావు కేశవ, ఠాకూరుద్వారు, బొంబాయి.

ఏజంట్లు:—అమృతాంజనం డిపో, ఫోర్టు, బొంబాయి.

# ఆర్. మార్టిను వారి మందులు.

## డెమియానా మాత్రలు

ఇవి స్త్రీపురుషసంబంధమయిన యేవిధమయినను శక్తి నశింపఁజేయు వ్యాధిగ్రస్తులకు, వారిశక్తి పునఃప్రాప్తికిని, రక్తవృద్ధికిని, జ్ఞాపకశక్తినభివృద్ధిపరచుటకును, కండనరములయందలి దుర్బలత్వము పోగొట్టుటకును, శరీరావయవములకు అసాధారణబలము నిచ్చుటకును, నిద్రావస్థలోఁగాని, జాగ్రదవస్థలో గాని, యింద్రియస్ఖలితము, మూత్రద్వారా తెలియకుండ, యింద్రియముపోవుట కలవారికిన్ని యితరమగు యీసంబంధవ్యాధులకును యీగుళికలు ఉత్కృష్టమైనవి. ఈ అమోఘమైనమాత్రలు, పునర్జీవితము కలుగజేయునటుల మెదడునకు చురుకు పుట్టించుటకును, నరములయందు శక్తి వృద్ధిపఱచుటకును సాధకములు. ఇవి ఆఁకలి పుట్టించుటకును, కండనరములయందు శక్తి కలిగించుటకు, ఆరోగ్యమును వృద్ధి జేయుటకు తయారు కాబడిన మాత్రలు. మానవశరీరసంబంధమయిన యేవ్యాధులనైనను కుదుర్చుటలో నద్వితీయము. ఒక్కొకమాత్ర వాడుచో, క్రొత్తశక్తిని కలుగ జేయుచు ఉత్సాహమును పుట్టించుచుండును. **42** మాత్రలు గల సీసా **1**-కి రు. **2-8-0** సీసా **3**-కి **6-8-0.**

## ఏగ్యు మిక్శ్చరు

ఇది అనేక పరిశోధనలు శ్రమలవలన పరిశోధింపబడి దీనియొక్క అద్భుతగుణమున కెంతయు పొగడికనంది యున్నది. ఇది యేవిధమైన మందులచే పోజాలని, జ్వరవ్యాధులు నివారింపఁజేసి ఖ్యాతిని పొందినది. ఈలోకప్రఖ్యాతిమగు మందు చలిజ్వరము, వణుకు జ్వరము, మలేరియా (రోజువిడచి రోజువచ్చు జ్వరము) విషజ్వరము సమయమునకుమ వచ్చుచు తగ్గుచుండు పాపిజ్వరములను, పోగొట్టుటలో అమృతోపమానమైన మందు, ఇది యేభయము లేకయే చిన్నపిల్లలకు సయితము వాడవచ్చును. దీనియందు సుగుణమేమన దీనిని వాడుటకు ముందు విరేచనమునకు వేరుమందవసరములేదు. పడిశెమునలని తెగులు ఊళ్లసంబంధమైన వ్యాధికిని ఇది సర్వసాధారణముగా పని జేయును. వెల సీసా **1**-కి రు. **0-12-0** లు.

## వాయువు పోటుకు మందు

ఇది సర్వవిధమైన వాయువుపోట్లు, వాతరోగము, తిమ్మిరి వాయువు, ఇలుకు లేక బెణుకునొప్పి, నాడినొప్పి, కండనరములబాధ, శిరోబాధ, వ్రణబాధ, కంఠమునందలి నొప్పి, నడుమునొప్పికి, గాయములకు, సంధులలో నొప్పులకు, వెన్నెముకనొప్పికి, బొమ్మనందలి పోట్లకు, మోకాలితీపులను కుదుర్చుటలో అమోఘమైనమందు. పైవ్యాధులకు ఒకటి రెండుసార్లు రాచినంతటనే తిరిగి యెన్నడు రాకుండజేయు అద్భుతశక్తి గలదు. వెల సీసా **1**-కి రు **1-4-0** డజను **1**-కి **18-8-0.**

## ఆయోడైజ్డు సరసపరిల్లా

ఇది అన్నివిధములయిన రక్తశుద్ధిపరచు యింగ్లీషుమందులతో తయారుచేయబడి, రక్తవృద్ధికి, రక్తశుద్ధికి, స్వాభావికముగ స్రవించెడు మలమూత్రద్వారములశుద్ధికి, కురుపు, సవామేహము, గండమాలతో కూడినయెముకవ్యాధులకు, శీతాదములకు, మాంసగ్రంధిసంబంధమైన ఉబ్బులకు, చర్మసంబంధమైన బొబ్బలు, నడుము నొప్పిగలవారికి, కీళ్ళ సంధులయందలి బాధలకు వాయువునొప్పి, నాడివ్యాధి, తీరని వ్రణబాధలతో కూడినవారికి, ఇతర రసలోహసంబంధమైన మందులను తినినందుకలనఁ గలుగు తిమురు, వాయువు, నాడివ్యాధి, విషగంధుల వ్యాధులకు అత్యంతోపయుక్తముగ పని జేయును. ఈ మధురమయిన సిద్ధౌషధము కండనరములయందలి వాయునొప్పులకు, కఠినమైన బొబ్బలకు, ఊపిరితిత్తులు ఉబుకుటచేఁ గలిగిన అంతరంగ బాధలకు, ఉబ్బసమునకు, వొంటిలోని నొప్పులకు, లాభకరమగు గుణముల నిచ్చును. సర్వసాధారణముగ బజారునదొరకు రక్తశుద్ధి మందులలో నిది కాయుచొక వెల సీసా **1**-కి రు, **2-0-0** మాత్రమే.

## దంతధావనచూర్ణము

దంతక్షీణము కానీయక కాపాడునట్టి దంతచూర్ణము అమోఘమయినది మావద్ద నుండఁగా ప్రజలు సొమ్మును వృధాగా వెచ్చపఱచి బజారులలోని బాధకరములగు పండ్లపొడులను ఏల కొనుచున్నారు? ఈ సువాసనపొడిని వాడుచో దంతపుష్టి, దంతకాంతి, బలిష్టతను కలుగఁజేయుచు సువాసన గలపరిమళము నిచ్చి రక్తము కారకుండఁజేసి దంతక్షీణము కాకుండఁజేసి బాధను మాన్పి, వాసనను పోఁగొట్టి పండ్లను ముత్యములవలెఁ జేయును. ఇంను బాధకరము లగుపుప్పిపండ్ల బాధను పోగొట్టు ఇంగ్లీషుమందులు చేర్చఁబడినవి. వెల డబ్బి **1**-కి రు **0-8-0.** డజను **1**-కి రు **5-4-0.**

## గ్లీటోకైను

ఈ ఆశ్చర్యకరమగు, విశ్వసనీయమయిన మిశ్రమపదార్థము, సర్వసాధారణముగ సివిలు మిలిటేరీ వారిచలన వాడబడి, స్త్రీ పురుషులయొక్క శగరోగములను, తత్సంబంధమైన రోగములను కుదుర్చుటకు శ్లాఘింపబడినది. ప్రొద్దున లేవగనే, మూత్రద్వారమునుండి యింద్రియబాధచే గలుగు దీర్ఘనీటి విసర్జనమును మూత్రాశయము యొక్క మంటయు, మూత్రమునుండి యిసుకవంటి పదార్థము వెలువడుటయు, మూత్రాశయముయొక్క బాధయు, ఇతర యే మూత్రవ్యాధులను, దివ్యముగను, ఆశ్చర్యకరముగను కుదర్చ గలుగును. ఉపద్రవకరములగు యేమందులు దీనియందు లేవని హానియేమియు లేదనియు రూఢీపఱుచుదుము. వెల సీసా **1**-కి రు. **1-12-0.**

ఆర్. డి. కార్ట్లె అండు కో., నెం A. ప్రెరీరోడ్డు, ఫోర్టు, బొంబాయి.

## రాస్ కోప్ లీవరు గడియారము.

దీనికి 5 సం॥ గారంటి పత్రమివ్వబడును.

దీని ధర గొలుసుతో సహా 2-6-0




ఈ గడియారము చూచుటకు బహు సుందరముగాను, సరియైన కాలమును చూపుటయందు అసమానమైనది ఇదివర యీలాటి గడియారములను చూచియుండని నమూనాగాను యుండును, ఇదిగాక మాయొక్క కంపెనిలో విక్రయించు యీ రాస్కోప్ లీవర్ గడియారము నకు నొక ప్రక్క దళమయిన అద్దముతో మూతవేయ బడినదిన్ని॥ వెనుక ప్రక్క రెండుమూతలుగలదిన్ని, ముల్లు త్రిప్పుటకున్ను తాళమిచ్చుటకున్ను తలలో మరగలదిన్ని, రెండు ప్రక్క, రాస్ కోప్ గడియారము అని ముద్రవేసి యుండును. ఈలాటి గడియారము యేకంపెని యందున్ను దొరకదని దృఢముగా చెప్ప గలము. జేబికి అనుకూలగా నుండును. కష్టపుపనులకున్ను గడియార ముంచుకొని పరుగెత్తినను ధుమికినను వలవక జక్కగా నడచును. ఒకటికొని నిజము చూడుడు. వెల నెం. 1 గొలుసుతో సహా 2-4-0

నెం. 2 డిటో మేలురకం 3-0-0

నెం. 4 కెంపులుగలది. నిమిషముల ముల్లుతో 6-8-0

## గంట కొట్టు కారేజ్ గడియారము.



ఈగడియారములు గంట అర్ధగంట కొట్టుటయు, అలారమువాయించుటయు, గంటకు బదులు వాద్యము వాయించుటయు గలదు ఇవి యెప్పటికిన్ని వెండివలెనే ధగధగాయమానముగాయుండును. ముందుభాగములోచిత్ర పనులు జేయబడియుండును, యెట్లు వుంచినను గంట సమముగా పోవును, కొన్ని గడియారములకువలె సమముగా తెవలుగూడ పనిలేదు, ఇది ప్రతియిండ్లలోను స్కూలు మొదలయిన చోట్లలోను అవశ్యం వుంచతగినది. పూర్వపుధరలకన్న ఇప్పుడు సరసమయినధరలకే విక్రయించెదము.

నెం 60 గంట అర్ధగంటయును కొట్టునది 4-12-0

నెం 61 గంట అర్ధగంట కొట్టుచు అలారముతో సహా 5-4-0

నెం 62 గంట కొట్టుటకు బదులు ప్రతిగంటకు నొక విధ మయిన వాద్యము వాయించునది. 6-0-0

## నిక్కలు వెండి హంటింగు గడియారము.



ఈ గడియారము బహువృద్ధియును సుందరమయిన పనితరము గలదిన్ని మేలైన సామానులతో చేయబడినది. సైమూతగల హంటింగ్ గడియారము తెరవవలసిన యెడల దీనితలలోని స్ప్రింగు (విల్లు) వుంచియున్నది వాటిని అదిమిన అవియే తెరచుకొనును. తర్వాత గంటజూచుకొని ఆమూతను మూసి అదిమిన మూసుకొనును ఇదిశృంగార మయినదిన్ని ఆశ్చర్యముగల గడియారము దీనిని నిక్కల్ వెండికి సమమగు లోహముతో చేయబడినది. నెం 14 నిక్కల్సు వెండిహంటింగు గడియారము 5-0-0

నిక్కల్ వెండి

## రైల్వే గార్డులీవరు పాకెట్ గడియారం.

దీనికి 5 సం॥ గారెంటి పత్రము యివ్వబడును.

దీనికి ముందుధర 3 రూపాయలు. ప్రస్తుతపుధర రూ 2-8-0 మాత్రమే




ధనధన వంతులారా! ఈ గడియారము యొక్క పేరును యెప్పుడైనను వినియున్నారా! యెప్పుడున్ను విని యుండరు ఏమనగా దీనిని మాయొక్క స్వంత ఆర్డర్ మీద స్పెషలుగా రప్పించబడినది. మిగుల గట్టి సామానులతోను అనేక దినముల వరకు చెడకుండ యుండునటులతయారు చేయించిరప్పించబడినది. దీనిచూచు ప్రతివారున్ను అవశ్యం కొనతగినది. ఈ ప్రతిమను చూచితిరా రైల్వేగార్డునిలిచి చేతిలో దీపముంచుకొని రైల్వే వుసుపులతో నిలిచి యున్నాడు. ఈలాటిరైల్వే గార్డులు మొదలగు వుద్యోగస్తులకు సప్లయిచేయుటకు ప్రత్యేకముగా తయారు చేయబడినది. మాయొక్క గార్డులీవరు పాకెట్టుగడియారము బహుదృఢ మయినది. బహుసుందరమయినది, కొన్ని అంబక్ గడియారములవలె యుండదు. దీని ధరించుకొని గుర్రపుసవారి చేసినను బహువేగముగా పరుగెత్తినను తటాలున గడియారము క్రిందబడినను నిలువక సమముగా నడచును. ఈలాటి స్వల్పగడియారము ప్రతివారివద్ద యుండవలయునని ధరతక్కువగా విక్రయించు చున్నాము. ఈ శృంగారపాకెట్టు గడియారమునకుత్వరపడుడు. కొన్ని దినములవరకే యీతక్కువధరకు విక్రయించబడును.

## చేతిలో ధరించు అసలు వెండి లేడి గడియారం

## చేతితో ధరించు లేడి గడియారం

ఒకనైపున దళమయిన అద్దముతో మూతగలదిన్ని తలలో తాళముగలదిన్ని బహుచిన్నసైజు బంగారముగలది, స్త్రీలున్ను పురుషులున్ను చేతిలోకట్టుకొనుట కుపయోగముగ నిక్కల్ వెండి తో చేయబడినది. దీని నొకప్పుడు జేబిలోనుకూడా ధరించుటకు వుపయోగమయినది. నెం 18 నిక్కల్ వెండి లేడీగడియారము ధర 8-8-0

నెం 19 డిటో నాణ్యమైనది పనితరముగలది ధర 4-8-0



ఈ వెండి లేడీ గడియారమును ఇష్టమయినపుడు చేతులోను మరియొక వేళ జేబులోను ధరించవచ్చును శృంగారమయినది దృఢమయినది మేలైనసామానులతో, చేయబడినది. కొనతగినది. ధరించ తగినది.

2 లేడీ వెండి గడియారము ధర 4-8-0

నెం 21 డిటో మేలయిన రకం ధర 5-8-0

దర్బారువేరుహావుసు, పోస్టుబాక్సు నెం 200 మదరాసు.

# అమృతాంజనము

**అమృతాంజనము గాయము పుండ్లకు ఘనమయినమందు.**

చక్కని డబ్బీతో సహా సీసా 1-కి రూ. 0-8-0 ప్రతియింట నుండదగినది.

అమృతాంజనము లోకప్రసిద్ధిని బడసియున్నది. అమృతాంజనము అన్ని నొప్పులకు సిద్ధామృతము.

## దంతచూర్ణము

పంటినొప్పులకు దివ్యౌషధము.

డబ్బీ 1-కి 0-2-0 12-కి రూ. 1-2-0

## మోహినీ తైలము

స్త్రీ పురుషులు వాడుటకు యోగ్యమైనది.

5 తులముల నూనెగల సీసా 1-కి 0-12-0

## తామర తైలము

తామర, తీట, దురద మొదలగువాటికి మంచిమందు.

అనేకసంవత్సరములు, మాసములు బాధపడినవారు దీనివలన తత్క్షణమే సుఖము పొందిరి.

వేలకువేలు డబ్బాలు విక్రయము. వెల 0-6-0

హా! నిదురపట్టక బజబజ బజుకుచుండు అవస్థ పగవానికైనను వద్దు.

రాజారాణిగల బొమ్మను చూచికొనుట మంచిది.

అమృతాంజనము డిపో, 109, ఫేరిరోడ్డు, ఫోర్టు, బొంబాయి. లేక నెం. 9, జహాంగీరువీధి, మద్రాసు.

---

**ఆయుష్యు, బలము, శక్తి. డాక్టరు గోఖలె ఎమ్. ఎ ఎమ్. డి గారి**

# బాలామృతము.

## స్వదేశకలకండతో చేయబడినది.

పిల్లలకు ఆకలిని గలిగించుటకు ప్రసిద్ధికెక్కి నిరుపమాన మహిమగలది. ఈఅమృతము పుష్టినిజేయు స్వదేశవస్తువులచేతను సుగంధమూలికలచేతను కలకండచేతను, చేయబడి రమ్యముగాను పరిమళముగాను మధురముగా నుండును.

35 సంవత్సరములనుండి డాక్టర్ గోఖలే బాలామృతము వహించిన ఖ్యాతిచే బూటకపువైద్యులు కొందరు భ్రమించి ధనాశచే నకళ్లను కల్పించినారుగాని బాలామృతమును కొనునపుడు డాక్టరు గోఖలేగారి పేరుచూచి కొనిన మోసపోరు.

సీసా 1-కి రూ. 1-0-0. వి. పి. ఖర్చుతో 1-4-0.

## అయొడైజుడు సరసపరిల్లా

చర్మరోగములను, రక్తదోషములను బాగుచేసి రక్తమును వృద్ధిచేయుటకు అప్రతిమానమయిన మందు-

వెల స్వల్పము! సీసా 1-కి రూ. 1-0-0. వి. పి. ఖర్చుతో రూ. 1-4-0. ఫలమధికము!!

మూడునాలుగుబుడ్లు పుచ్చుకొనినయెడల పూర్ణముగా దేహస్వస్థత జెందవచ్చును. 3 బుడ్లు ఒకేపర్యాయము కొనువారికి వి. పి. ఖర్చులేదు.

కొనువారు డాక్టరు గోఖలేగారి పేరును చూచి కొనవలయును.

అనేకస్థలములందలి ప్రదర్శనములలో బంగారు వెండిపతకములును, ప్రశంసాపత్రములును నియ్యబడినవి.

అన్నిటిలో పురాతనమైనది, చెడురక్తమును బాగుచేయును.

ఏజెంట్లు:—అమృతాంజనము డిపో, 109, ఫేరిరోడ్డు, ఫోర్టు, బొంబాయి.

# వైద్యరత్న. పండిత. డి. గోపాలాచార్లు ఏ. వి. యస్. ఏ యం. బి గార్ల ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు దెనిగించిన గ్రంథములు.

**1. మాధవనిదానము వెల రు. 3-0-0**

ఆంధ్రభాషయందు రోగములను గుర్తించుటకు నిట్టి విపులమగు గ్రంథము వేరొకటిలేదు.

**2. పథ్యాపథ్యము. వెల. 1-0-0**

వైద్యులకు అద్దమువంటిది. ప్రతిరోగమున కుపయోగించెడు అన్నముహారలు మొదలగువానియొక్క పథ్యము, అపథ్యములను దెలుపును.

**3. ఆయుర్వేదభాష. వెల. 0-8-0**

ఆంధ్రభాషలో నిట్టి గ్రంథము యిదివరకును లేదు. వైద్యులు జేయదగిన లేహ్యములు, తైలములు అనేకవిధములగు మందులు మొదలగువానిని జేయురీతిని వాని పరిమాణములు తూనికలు మొదలగు వానిని చక్కగ దెలుపును.

**4. వస్తి. (పిచికారి) వెల. 0-4-0**

అనగానేమి దాని యుపయోగము స్వరూపము దీనిచే నివర్తి యగు వ్యాధులు మొదలగువానిని దెలుపును.

**5. శల్యతంత్రము. (శస్త్రచికిత్స). వెల. 0-4-0**

ఇది ఆయుర్వేదమున మహర్షులకాలమున గనుగొనినది. గాని నభ్యసించుమార్గములు భేదములను ప్రాచీనతను వివరముగ దెలుపును.

**6. ఆయుర్వేదము. వెల. 0-4-0**

అనగానేమి ఏకాలమునుండి ఆరంభమయినది. అందు యేయే భాగములు గలవు. వాని యుత్కృష్టత, మొదలగువానిని దెలుపును. ప్రతియొకరు జూడదగినది.

మా గ్రంథమాలయందలి మాధవనిదానము దక్క మిగత గ్రంథములన్నియు చందాదారులకు రు. ౧-కి 0-4-0 అణాలు తగ్గించియివ్వబడును. పోస్టేజివగైరాలు వేరుగానివ్వవలెను.

చరకము. సుశ్రుతము. శారీరము. (ఫిజయాలజి) త్వరలో వెలుబడును.

## వైద్యరత్న. పండిత. డి. గోపాలాచార్యుల వారి సుప్రసిద్ధాయుర్వేదౌషధములు.

విద్యార్థులకు బలహీనులకును మిక్కిలి యుపయోగము.

## అమృతామలక తైలము

అన్నివిధములగు తలనొప్పులను బోనడచును. మెదడుకు, కండ్లకుచలువజేయును. నేత్రరోగముల రానివ్వదు. చర్మమందలి దోషములబోగొట్టు రక్తమును చక్కగా బారునట్లుజేయును. వెంట్రుకలను చక్కగ పెంచును. వెల.బు1-కి 0-12-0 12 బుడ్లు. రు. 8-0-0

## జీవామృతము.

బలమును వృద్ధిజేయువాటిలో నుత్తమమైనది. రక్తమును పుష్టని ధాతుశక్తి మొదలగువానిని వృద్ధిజేయును. విద్యార్థులకు బాలురకు గర్భిణిస్త్రీలకును బలమునిచ్చుటయం దద్వితీయమైనది. వెల. బు 1-కి 3-0-0

12 బుడ్లు. రు 34-0-0 ప్యాకింగుపోస్టేజి వేరుగా నివ్వవలెను.

అనేక ఆయుర్వేదయౌషధములు సిద్ధముగనుండును. కోరువారికి సూక్ష్యాటలాగు లుచితముగ బంపబడును.

## వైద్యరత్న. పండిత. డి. గోపాలాచార్లు ఏ. వి. యస్; ఏ యం. బి.

టెల్లిగ్రాఫు అడ్రస్ } పండిట్ మద్రాస్.

చిరునామా:— ఆయుర్వేదాశ్రమము, జార్జి టవున్, మదరాస్.

# సుగంధనస్య శిరోమణి

## సుగంధనస్యము! సుగంధనస్యము!! సుగంధనస్యము!!!

తలనొప్పులు, జలుబులు, పీనసము

## నశించును

మెదడు కుత్తేజముగలుగును, బద్ధకము, నిద్రపారిపోవును, మనశ్శక్తివృద్ధియగును.



అంగములయందెల్ల శిరస్సును, ఇంద్రియములయందెల్ల నయనములును, ప్రధానము లను విషయము సర్వజనులకు తెలిసినవిషయమేకదా! ఈ రెంటియందును కలుగు వ్యాధులు సాధారణముగా ప్రాణహాని కలిగించకున్నను అవి వ్యాధిగ్రస్తుని జన్మమును నిష్ప్రయోజకముగాఁ జేసి యామరణాంతమును బాధించు చుండును. ఇట్టి వ్యాధులకు లోనికి తీసికొనుమందు లనేక ముపయోగింపఁ బడుచు వచ్చినవి గాని యవి యావ్యాధులను నివారింప లేక పోవుటయే గాక రసవిషగంధకాదులు చేరినవిగా నుండుటచేత తుదకు దేహారోగ్యము నంతను చెడఁదీయునవిగాఁగూడ నేర్పడినవి. తరువాత వైపులేలును పట్లును నవనాగరికులచేత మంచివైద్యములుగా తీర్మానింపఁబడి యట్టి మందులుకూడ ననేక మిప్పు డుపయోగింపఁబడు చున్నవి గాని యవికూడ నంత ప్రయోజనకరములుగా గ్రహింపఁబడుట లేదు.

ఈ సందర్భము లన్నియును యోచించి చిరకాలము పరిశ్రమచేసి యాయుర్వే దాంగిలేయ యునానీ వైద్యములం దారితేరి లోకోపకారార్థమై తమ సర్వస్వమును వినియోగించుచున్న డాక్టరు, జీ. బీ. గారీ సుగంధనస్య శిరోమణిని కనిపెట్టిరి. ఇది యిదివరకే లోకమందంతటను వ్యాప్తము చేయఁబడి సుప్రసిద్ధమైనది కాబట్టి దీనిని గురించి మేము విశేషించి ఘోషించ వలసిన పని లేదు. ఒకసారి యుపయోగించిన యెడల దాని యుత్కృష్టగుణము నదియే స్థాపించగలదు. దీనిచే బాధానివృత్తి గావించి కృతజ్ఞతా పూర్వకముగా గొప్పవారును కొలఁదివారును పంపిన యోగ్యతా పత్రికలు లెక్కకు మిక్కిలిగా నున్నవి.

ఈ సుగంధనస్య శిరోమణి నుపయోగించుటవల్ల మెదడు, ముక్కు, కన్నులతో సంబంధించిన సమస్తవ్యాధులును సమూలముగా నశించును. పీనసము, ఒంటి తలనొప్పి తలలోనిపోట్లు, జలదోషములు, మొదలైన కంఠమునకు పైబడిన 96 వ్యాధులకును ఈ సుగంధ నస్య శిరోమణి పెట్టినది భిక్షము. ఇట్టి గుణవిశేషము గలిగి యింతసులభముగా విక్రయింపఁబడు నౌషధ మిది తప్ప మఱియొకటిలేదు. చిరకాల ముంచినను చెడని సుగంధ విశేషమువలన పొడి యభ్యాసము లేనివారికి సహిత మిది హితవుగా నుండును.

సాధారణముగా పొడివేయువార లీ సుగంధ నస్యమునుకట్టి, రెండుసారు లుపయోగించిన యెడల, ఇది సాధారణపు పొడి 10, 15 సారు లుపయోగించినంత పనిచేయును. కాలణా వెలగల సాధారణపు పొగాకు పొడిలో నీసుగంధ నస్యము నొక చిటిక కలిపినయెడల నాపొగాకు పొడి యంతయును మిక్కిలి పరిమళ వంతమగును.

బుడ్డి 1 కి రూ. 0-4-0 వి. పి. ఖర్చు 0-3-0. డజను 1 కి రూ. 2-8-0 వి. పి. 0-6-0.

విలాసము:—

గురుబసవ అండు కంపెనీ, మద్రాసు.

## ఎండల సభయము లేదు.

నూతనముగాకనుగొనబడిన మనోహరమగు ఔషధరత్నములు—ఉపయోగించిచూడుడు.

### తాపశమనపానకము.

దీనిని 10, 20 చుక్కలునీటిలో వేసిపుచ్చుకొనిన మిక్కిలి రుచికరముగా నుండుటయేగాక ఎండవేడిమిని, వడదెబ్బ, తాపము, అత్యుష్ణము, దాహము, మలబద్ధము, నిక్కాక, మొదలగు ఎండవేడిమి వల్లకలుగు బాధలను హరించిదేహమునకు మిక్కిలి చల్లదనము నిచ్చును. సీసా 1 కి రు 0-8-0 (6 సీ రు 2-8-0)

### అభ్యంగనతైలము.

దీనితో మాడున అంటుకొని అభ్యంగన స్నానముచేసిన తలనొప్పులు, పార్శ్వపునొప్పులు అత్యుష్ణము, ఎండతాపము, మాడుపోటు, చుండు, కండ్లుమంటలు, నేత్రముల నీరుకారుట, పుసికట్టుట, మొదలగు ఉష్ణసంబంధమగు వ్యాధులను హరించి మెదడుకు చల్లదనమునిచ్చి వెంట్రుకలను మృదువు పరచి నల్లగాపెంచును.

సీసా రు 0-8-0 (6 సీ రు 2-8-0)

### సుగంధకేసరిపొడి.

ఇది కొంచెము నీటిలో కలిపి దేహమునకు పూసుకొనిన మంచి సువాసన నిచ్చుటయేగాక, ఎండవేడిమిని, దేహమునకు తగలనివ్వదు.

డబ్బీ రు 0-8-0 (6 డ రు 2-8-0)

ఈ యండలకు యీ రత్నత్రయములేని గృహముండగూడదు.

అడ్రసు:— ఆయుర్వేదసమాజం. పొందూరు, గుంటూరుజిల్లా,

---

### పంచతిక్త.

ధాతుగతమయిన జ్వరములకు, దోషజ్వరములకు మరియు అన్ని విధములయిన జ్వరములకు అమృతముతో సమానమైనది. ఎటువంటి జ్వరములయినను 3 రోజులలో నెమ్మది యగును.

వెల సీసా రు 1-0-0.

### వాజీకరణరసాయనం.

ఈ సిద్ధౌషధము శుక్లనష్టమును, బలహీనమును పోగొట్టి, పుష్టిని, రక్తవృద్ధిని గలుగ జేయును, వెల టిన్ను రు 1-0-0.

### హిమవటి.

నీరుచురుకు, తెలుపు, పసుపు స్రవించుట, సెగరోగములకు మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. వెల రు 1-0-0.

### శోణితశోధిని.

మేహపొడలు, కొరకములు, తీట, మొదలయిన రక్తసంబంధములగు వ్యాధులను పోగొట్టి రక్తమును శుద్ధపరచును.

వెల సీసా రు 2-0-0.

ఆయుర్వేదభూషణ

పండిత. సి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి,

ఎ. కె. & సి. సీనియర్ ఫిజిషన్, యస్. కె. పి. డి. హాస్పిటల్.

నెం 79, గోవిందప్పనాయుడి వీధి, మద్రాసు.

## వావిలకొలను సుబ్బరాయకృత గ్రంథములు

1. ఆంధ్రవాల్మీకిరామాయణము, రెండవకూర్పు, మునుపటికంటెను జక్కగ సవరించి కొన్ని పద్యము లెక్కువగను వ్రాయఁబడినది.

| | |
|---|---|
| 7. కాండములు 2 సంపుటములు- కాలికో అట్ట | 4-8-0 |
| 6. ప్రతులొక్కసారి కొనిన | 24-0-0 |

2. డిలో పారాయణమునకు కిత్తలినార అట్ట. దీనిపై ధ్యానశ్లోక ప్రకారము రామ పంచాయితన పచిత్రము ముద్రింపఁబడినది. 4-12-0

6. ప్రతులు. 24-12-0

3. పైదానిలో సుందరకాండ మాత్రము కిత్తలినార అట్ట మీఁది దానివలెనే. 1-4-0

6. ప్రతులు. 5-10-0

4. సుభద్రావిజయనాటకము. నాటకరాజము. 0-9-0

6. ప్రతులు. 3-0-0

6. సులభవ్యాకరణము. 1వ భాగము 0-8-0 రెండవ భాగము 0-9-0 మూడవభాగము 0-6-0 } 1-7-0

6. భీమఖండము. శ్రీనాథప్రణీతము. 0-10-0

7. ఆర్యచరిత్రమాలకా గ్రంథములు. పురాణములలోని నీతికథలన్నియు బాలురకు బాలికలకు స్త్రీలకుఁ దెలియునట్లు మిక్కిలి సులభశైలిలో వ్రాయఁబడినవి. పిల్లవాండ్రక్షేమముఁ గోరు పెద్దవారీ పుస్తకములను వారిచేఁ దప్పక చదివింపవలెను. ఇవిదేశమున విస్తారముగ వ్యాపించి యుండుటచే విశేషముద్రాయఁబనిలేదు. దీనికిఁజేరి యిప్పటికి సిద్ధమయిన గ్రంథములు.

(1) ఆర్యకథానిధి ౧వ భాగము 0-2-6 (2) రెండవ భాగము 0-2-6, (3) మూడవభాగము 0-2-6, (4) హరిశ్చంద్రచరిత్రము 0-3-0 (5) శకుంతులాచరిత్రము 0-3-0 (6) నలచరిత్రము, 0-4-0 సావిత్రీచరిత్రము, 0-3-6 ఇట్టులే రామాయణము, భారతము భాగవతము లోనగునవి కూడ ముద్రింపఁబడును. అన్నియు కాలికోఅట్ట మంచి ప్రతిమలు గలవి దీనిని 5-0-0 ల కొక్కసారి గొనువారికి 1-0-0 కి 0-4-0 త్రోసివేయబడును. కావలసినవారు (1) శ్రీరామజయమందిరము,

21 హనుమంతలాలావీధి, తిరువళిక్కేణి.

(2) కం, వేంకటశేషగిరిరావు, సంతపేట, నెల్లూరు.

అని వ్రాయవలయును.

# త్వరగా ద్రవ్యసంపాదన మార్గము!

ఆలస్యముచేయక త్వరపడుడు!! కష్టజీవనముల మాని సుఖింపుడి

కాక్ బయస్కోపు వెల రు. 275 ఫిలుము అనగా బొమ్మలుగల చక్కి ఒక్కొక్కటి ... 100 ...గుల పొడుగుండును. వెల అడుగు 1-కి రు. 0-2-6.

ఈమెషీనులో తనంతట తానే వెలిగే ఎలక్ట్రికుదీపము అమర్చబడియున్నది. అందువల్ల గ్యాసు తయా... చేయడము అరఖులు కొనడము యెన్నడు జరూరులేదు. తెరపయిన 5 అడుగుల బొమ్మ...



ఫిలుములు మండిపోవు గనుక ప్రమాదములేదు. మిక్కిలి దృఢమయిన మెషీను. గారడీలు, నృత్య...ములు, యుద్ధములు, సర్కసులు, హాస్యములు నదులు అగ్నిపర్వతములు మొదలుగాగల అ... విచిత్రము లున్నవి. త్వరగా ద్రవ్యసంపాదన చే...టకు యీ యంత్రము మంచిసాధనము. సుమా... రు. 600 ల మొత్తమునకు ఒక ప్రదర్శనమున... సరిపడే బొమ్మలతో సహా యావత్తు సామా... లున్ను కొనవచ్చును. పెట్టుబడిసొమ్ము ఒకటి రెం... నెలలలోనే గణించగలరు. స్వల్పపెట్టుబడితో యెక్కువలాభమువచ్చే వ్యాపారము. పట్టుదలగా పని ... వారు త్వరలో వేల సంపన్నులు కాగలరు. రెండు, మూడు తీర్థములకు మాత్రము సంవత్సరమున కొక... తీసుకొనివెళ్లినను సునాయాసముగా వేయిరూపాయలు గణించగలరు. నెలకు 15, 20, 30 రూపాయలకు ఒక చోట కాయక్లేశములుబడి నవుఖరీచేసి కష్టజీవనముచేయు వారొక మెషీనును సంపాదించుకొన్న యెడల కామధేనువును కలిగియున్నట్టు సుఖింతురు. 2 గంటలకాలములో సంగతులన్నీ నేర్చుకొనవచ్చును.

మావద్ద బయస్కోపు కొనువారి కోర్కెకి రాను పోను 3-వ క్లాసు రెయిలుఛార్జియున్ను ఒకరోజు బస భోజన సదుపాయములున్ను చేయుదుము.

## ఈశ్వరప్ప పంతులుగారి వినోదగ్రంథములు.

గారడీపుస్తకము 1-వ భాగము 10 అణాలు. 2-వ భాగము 10 అణాలు. వీటిలో పేకయంత్రములు కనికట్టు విద్యలు, మళయాళయంత్రములు, మహేంద్రజాలములు మొదలుగాగల అనేక గారడీలు కలవు. మేధావి రు. 0-8-0 జ్ఞాపకశక్తికి మంచిమార్గము. శతావధానముచేయుటకు శక్తికలుగును. చతురంగదర్పణము 10 అణాలు. చతురంగపు ఆటవిధులు, 100 లండ నెత్తులు గలవు.

విచిత్రమంజరి 8 అణాలు. వినోదమాల 6 అణాలు. పరమానందము 4 అణాలు. ఆనందము 2 అణాలు. చమత్కారరత్నాకరము 2 అణాలు. హ్యూమర్ (ఇంగ్లీషు) 4 అణాలు. } ఇవి కడుపుచెక్కలగునట్లు నవ్వువచ్చే హాస్యగ్రంథములు. మంచినీతి గలదు. ముఖ్యముగాఅందరు చదువతగినవి.

## కారనేషన్ బయస్కోపు అండు ట్రేడింగు కంపెని.

121, పెద్దవీధి, తిరువళిక్కేణి, మద్రాసు.

THE

# ...SH CYCLE IMPORTING Co.,

23, BROADWAY, MADRAS.

...our name and fame are too wellnown to re-...ecommendation. We sell the largest number of ...es and their accessories, Motor ...cles and their ...ories cheaper than anybody else in Madras or ...here. We Control the Agencies of several ... **Grade** CYCLES such as R...er, Rudgewhit-...h, Raleigh, Royal Enfield, Sun, ...olf and others. ... also keep in stock Children Perambulators, ...ycles, Waterman's Fountain Pens, Primus ...ves, Gold Medal Camp Cots &c

Ask for a descriptive Catalogue of all goods.

## ఇంగ్లీషు సైకిల్ ఇంపోర్టిగు కంపెనీ

23 బ్రాడ్వే, మదరు.

చెన్న రాజధాని యందంతటను మాపేరెఱుంగని ...వారు లేరు. అనేక వందలమందికి మారకుల నమ్మి గొప్ప ...ఖ్యాతిని బొందియున్నాము. మావద్దసైకిలులు, వానికి కావలసిన యితర సామానులు, మోటరుసయికిలులు వాని సామానులు, ఎన్నిగావలయునిన అన్నికొల్లగా దొరకగలవు. మాధరలు చెన్నపట్ణమం దితరుల ధరల కంటె చౌకయయినవి. అనేకయుత్తమయిన సైకిలుల ఏజెంసీలు మాచేతిలో గలవు. ...వరు, రడ్జివిట్వర్తు, రేలైరాయలు ఏన్ఫీల్డు, సన్, రోలు ఇంకననేక సైకిలుల ఏజెంసీలు మావద్దయున్నవి.మావద్దను పిల్లలకై పెరాంబ్యులేటరులు, ట్రయిసికలు, వాటరుమేన్, ఫౌంటెను కలములు, నెప్ట్యూనఫౌంటెను కలములు, ప్రైమసుస్టేవులు, బంగారుమెడల్ క్యాంపుకాటులు,ఇరత విధములయిన మంచములును బవు.

మా పెద్దక్యాటలాగుకయి వ్రాయుడు. ఏవికావల యునో అందుండి ఏర్పఱచుకొనవచ్చును. ఉత్తరములు తెలుగున వ్రాయక ఇంగ్లీషున వ్రాయవలయును.

## చదువరులారా.

మీకు హార్మోనియములు ఫిడేలులు, వాచీలు, గడియారములు గాని ఫౌంటెన్ పేనాలుగాని ప్రైమసు బర్నర్లు. ట్రయిసికిల్లులుగాని కావలసినయడల ఈ దిగువ యడ్రసుకు వ్రాయుడు. ఈ కంపెని మిక్కిలి నమ్మకమైనది. వస్తువులు గ్యారంటీపై నిచ్చెదరు. ధరలు అతిచౌక. వీరు సీమనుంచి డయిరక్టుగా తెప్పించెదరు. కోరినయడల క్యాటలాగు పంపెదరు.

పి సుబ్బారావు అండు సన్సు.

కాకినాడ.

---

## గౌతా అండు కంపెని.

రామకోటి బిల్డింగు, జార్జిటవును, మదరాసు.

1. అల్సోనియా టీక్లైంపీసు 2" డయల్ 3 సంవత్సరముల గ్యారంటీ — 2—4—0
2. జర్మని క్లైంపీసు 4" రూ. 1—0—0 అలారముతో 1—8—0
3. క్యారేజీక్లాక్, గంటయు, అరగంటయు వాయించును. 3 సంవత్సరముల గ్యారంటీ — 4—8—
   పై మ్యూజికల్ గడియారము 5 సంవత్సరముల గ్యారంటీ — 4—12—0
4. 50 సంవత్సరముల వరకు చక్కనిపని జేయగల ప్రఖ్యాతి జెందిన సెత్ తామస్ గడియారము 8 పట్టిలు 12 డయల్ 16 1/2 అంగుళము 14 1/2"2 జెల్లులు, కదుపున గంట కొట్టును. వారమునకు ఒకతూరి కీగము 10 సంవత్సరముల గ్యారంటీకో — 13—8—0
   పైగడియారమే 10॥ డయల్ 14 కెడల్పు 21॥ పొడుగు 10 సంవత్సరముల గ్యారంటీ — 12—12—0
   పై గడియారమే 8 డయల్ 11 1/2 కెడల్పు 18 పొడుగు 10 సలవత్సరముల గ్యారంటీ — 12—0—0
   ఇది గంటయు అరగంటయు కొట్టును. కొత్తరక ములవి తక్షణమే వ్రాయుడు.

## THE MADRAS HARMON[illegible]ET



పనికిమాలిన హార్మోనియములకు పేరుకొరకై మీ సొమ్మును పాడుజేయకుడు.

ఇప్పటిదినములలో ప్రతియింటను సంగీతవిద్య పురుషులకు స్త్రీలకు ముఖ్యమయినదియే గాక ప్రతివారికి ఆనందము కలిగించునదియైనది. మరియు బాలికలకు యీవిద్య ముఖ్యావశ్యకము. సంగీతవిద్యలు అనేకమోస్తరులు కలవుగాని వాటి యన్నిటిలో హార్మోనియము విద్యయే ముఖ్యమై యున్నది. కాబట్టి యీాపైన స్వరము కలిగినట్టియు శాస్త్రపు ప్రకారముగా తయారుకాబడి దృఢమైన పనితనము కలిగినట్టియు, మంచి నాదముగల ఒక మూన్పైన హార్మోనియము ప్రతియింటవుండుట మిక్కిలి ఆవశ్యకము. ఇట్టిది లేనియెడల నేర్చుకొనెడివారికి ప్రోత్సాహము కలిగించదు. ఈ అంశములు సంపూర్తిగా ఆలోచించి బజారులో సాధారణము విక్రయించు నిష్ప్రయోజనమైన హార్మోనియముల వలెగాక మేము స్వయముగా పురమాయించి అన్ని ఋతువులందును అన్నిస్థలములందును ఉపయోగమగునటుల సంగీతవిద్యలో ప్రవీణులని పేరువహించి అనేక యోగ్యతాపత్రికలను పొందినవారిచే హిందుస్థానీ వాయిద్యమునకును కర్ణాటక వాయిద్యమునకును తగునటుల 30-రకములు పెట్టెలు తయారుచేయించి అనేక సంవత్సరములనుంచి తెప్పించుచు అమ్ముచున్నాము. ఈ పెట్టెలు అనేకముగా పుద్యోగస్థులకును, సంగీతపు ప్రవీణులకును బాలికా పాఠశాలలకును పంపి వారి వద్దనుండి అనేక యోగ్యతాపత్రికలను పొందియున్నాము. చేతి హార్మోనియములు త్రొక్కుడు హార్మోనియములు రు. 20-మొదలు రు. 200-లు వరకును స్పృతిపెట్టెల 8-రకములు మావద్దవున్నవి. ప్రతిపెట్టె మేము జవాబుదారితో యిచ్చెదము. కాలములోపల ఏవైనా పాట్లు కలిగినప్పటికిన్ని వుచితముగా మరమ్మతుచేసి యివ్వబడును.

హార్మోనియము నేర్చుకొను పుస్తకములు యింగ్లీషు అరవ తెనుగుభాషలలో నున్నవి. హార్మోనియమునకు కావలసిన చిల్లర సామానులు యావత్తు మావద్ద దొరకును.

హార్మోనియములు, ఫిడేలులు మొదలయిన యావత్తు రకములు మరమ్మత్తు చేయబడును.

పూర్తికేటలాగు వ్రాసినవారికి పంపుదుము.

మద్రాసు హార్మోనియము మార్టు అండు ఆల్బట్స
సైకిల్ ట్రేడింగుకంపెని
15 బ్రాడ్వే మద్రాసు.

---

# अमृतांजन.

[illegible] दुःखावर राजमार्ग उपाय.

# అమృతాంజనము

## అన్నినొప్పులకు పరమామృతము.

ప్రతివారము వేలకువేలు విక్రయము.

సీసా 1-0-8-0 అణాలు మాత్రమే.



తలనొప్పుల మాన్పును. వాయువుపోట్ల బాపును.
పార్శ్వపునొప్పుల నరదోలును. పోట్లపోగొట్టును.
వనమూలికచే హిందూదేశమందు
తయారుచేబడు మంచిమందు.
సువాసనగలిగియుండును.
దీనిని విదేశములలోకూడ వాడుచున్నారు.
పంచభాష-చీటి చూడకొనిన మోసము గలుగదు.

## అమృతాంజనము డిపో,

109, ఫోరిరోడ్డు, ఫోర్టు, బొంబయి.

9, జహంగీరువీధి, జార్జిటవున్, మద్రాసు.

ములసేన మ్రునిట్జాలోని మిత్రమండలి సేనతో సంపర్కమును కలిగి యుండెను. బల్గరులు వైరిలెపు, మొనాస్టిరులను ముఖ్యముగా ముట్టడించిరి. ఇచ్చట సర్బులు శత్రువులను తీక్ష్ణముగా నెదిరించిరి. వారు బాబునా కనుమలలో బలీయమయిన స్థానములలో నుండిరి. వారి సహాయార్థమయి ఫ్రాంకో-బ్రిటిషు సేనలును తొందరగా పంపబడెను. నవంబరు 1 మొదలు 4 వ తేదీ వరకును ఈ బాబునాకనుమను వశముచేసికొనుటకయి బల్గరులు గట్టిపట్టుదలతో పోరాడిరి కాని ఫ్రాంకో బ్రిటిషు సేనలు సకాలమునకు వచ్చినందున బల్గరు లోడిపోయి వీల్సువరకును పరుగెత్తి వర్దారును దాటిపోయిరి. ఉత్తరమున బల్గరు అక్షౌహిణులముందర సర్బులాగజాలక నవంబరు 7 వ తేదీవఱకును స్థానములను కోలుపోవుచు పరుగెత్తుచునే యుండిరి. కాని ఈసైన్యము ముక్కలుగా కొట్టబడలేదు. సర్బియనులకు గొప్ప నష్టములును కలుగలేదు.

మాంటినీగ్రినులు బోస్నియా పొలిమేరలలో జయములను పొందుచు నవంబరు 5 వ తేదిని ఆస్ట్రియను సేన నోడించి 400 ఖయిదీలను, 8 ఫిరంగులను, కావలసినంత యుద్ధ సామగ్రిని పట్టుకొనిరి. ఇచ్చటి ఆస్ట్రియను సేనలు చాల పౌరుష హీనమయినవిగా చూపట్టెను.

వైరటు, నియాజెవాట్జులు బల్గరులచేతిలోఁ బడుటచే నిష్ నగరమును సర్వియనులు వదలి పెట్టవలసి వచ్చెను. నవంబరు 6 వ తేదిని ఈ నగరమును బల్గేరియను లాక్రమించుకొనిరి. ఉత్తరమున నాస్ట్రో-జర్మనులు ముందునకు వచ్చుచుండిరి. నవంబరు 7 వ తేదీ యప్పటికి వారు కాల్జేవో, తుషేవాట్జులను పట్టుకొనిరి. ఈ కడపటి పట్టణము పూర్వము సర్బియను రాజులకు స్థానముగా నుండెను.



బోటులవంతెనలతో శత్రుమండలి సర్బియా నదులనుదాటినవిధము

నిష్‌నగరము పడఁగానే ఇటు బర్లిను నుండి అటు కాన్‌స్టాంటినోపిలువఱకును, (బల్గేరియాగుండ) చక్కని రయిలు మార్గము శత్రుమండలి చేతిలోనికి వచ్చెను. కాని సర్బియను సయిన్యము వినాశము కాలేదు. కొండలకు చేరినది. మిత్రమండలి సేనలు సలోనికాలోనికి ప్రవేశింపఁబడుచుండెను. నిష్‌పడినను రయిలును ముందుగా సర్బియనులుపాడుచేయుటవలన బల్గరులకు తురుష్కులకు కావలసిన సామానులు డాన్యూబునది మీఁద జర్మనులు విడికొవఱకు పంపి అచ్చట నుండి రయిలుమీఁద వేయుచున్నారని యూహింపబడు చున్నది. ఒక నెలలోపల రయిలు పూర్తిగా బాగు కాఁగలదు. సర్బియను రాజధాని మిట్రోవిట్జాకు మార్చఁబడెను. డాన్యూబునది వద్ద నుండి తలుమఁ బడిన సర్బియను సేన మొరావాకుదక్షిణమునన్న శిఖరములపయి చేర్చబడినది. ఆస్ట్రియనులు నిష్‌లో నున్న బల్గరుల కాలుమైళ్లే దూరముననే ఉన్నారు. నవంబరు 12 వ తేదిన మొరావాకనుము లాక్రమింపఁ బడినవనియు, జనరలువాన్ గాలావిట్జుగారి సేన బాస్త్రేబాట్జు కొండలలో నున్న సర్బియనుల నోడించుటకు పోవుచున్న దనియు ప్రకటింపఁ బడెను. ఇచ్చట 1400 సర్బియనులు ఖయిదీలుగా బట్టుకొనబడిరి. 11 ఫిరంగులు చిక్కినవి. 13 వ తేదిని కొండలలో చొరబడుటకయి నిష్ నుండి వచ్చుచున్న బల్గరు లాపఁబడిరని సర్బియను అధికారులు ప్రకటించిరి.

మొత్తముమీఁద సర్వియనులు యుద్ధ మారంభమయినది మొదలు 30,000 మంది దెబ్బలుతినిగాని, మృతినొందిగాని నష్టపోయిరని ప్రకటింపఁబడినది. యుస్కుబుప్రాంతమున సర్వియనుల చేతులలో కాఛానిక్ కనుము లింకను నుండెను. స్ట్రూమునిట్జాయొద్ద దృఢముగా పోరులుజరిగినవి. క్రివోలకువద్ద బల్గరులు ఫ్రెంచిస్థాన

ములమీద నవంబరు 9-వ తేదిని పడిరి. దెబ్బలుతిని పరుగెత్తిరి. వేల్సుకనుమను నవంబరు 15-న ఫ్రెంచివా రాక్రమించుకొనిరి. ఆను కొనిరి. కాని అధిక సైన్యములు 30-వ తేదిని నీ నగరమును పట్టుకొనుటచే సర్బియనులు పరుగెత్తిరి. సర్బియను సైన్యములు పూర్తిగా సర్బియాను వదలిపెట్టెను. ఈదేశపు ప్రజలు విజయులచే నానా బాధలు పడుచుండిరి. అన్నము దొరకుట లేదు. బల్గేరియనుల, ఆస్ట్రో జర్మనుల బాధపడలేక ఇండ్లను వాకిళ్లను వదలి జనులు పరుగెత్తుచుండిరి. ఆ సేనలు గ్రీసుకు, మాంటినీగ్రోకు, ఆల్బేనియాకు శత్రుకృత్యముల నుండి తప్పించుకొనుటకయి తరలిపోయిరి. క్రిందినుండి పైవఱకును దేశము తగలబడిన దేశమువలె నుండెను. నిలిచియున్న ప్రజల కిష్టములకు మితిలేదు. ప్రజల కళేబరములచేత మార్గమంతయు వెదజల్లబడి యుండెను. పరుగెత్తుచున్న సర్బియా రాజుకు నీచమయిన వరతుల నేర్పఱచి జనరలు వాన్ మెకెన్సను



సర్బియా రాజు ఎద్దులబండి నెక్కి నగరమును వదలుట

## నోవీబజా రాక్రమించుకొనబడుట

నవంబరు 20-వ తేది శనివారము రోజున జర్మను జనరలు వాన్ మెకన్సనుగారు నోవిబజారును పట్టుకొనిరి. ఇందు 21,000 మంది జనులుకలరు. శత్రుమండలిసేనలు ఇప్పటికి "ప్రాత సర్వియా"యని పిలువబడు దేశమును ఆక్రమించుకొనిరి. ఉత్తరమునుండి ఆస్ట్రో—జర్మనులు మిట్రోవిట్జా, ప్రిష్టినాల వయిపున నడచుచుండెను.

## ఆశలు నిరాశయగుట

సర్వియాను తిరిగి సర్వియనులు మిత్రమండలి సహాయము వలన జయించెదరను ఆశలు కొంతకాలమువఱకును పోయినవి. గ్రీసు వెనుక ముందులాడుచు, సలోనికా రేవులో కావలసినంత సహాయము మిత్రమండలికి చేయకపోవుటచేత సత్వరితముగా వారిసేనలను సర్వియా సహాయమునకు పంపుటకు వీలుపడకపోయెను. 15-వ నవంబరున సర్బుసేనలు సర్వియాకొండలను పూర్తిగా వదలిపెట్టి మాంటినీగ్రోకును, ఆల్బేనియాకును వెళ్లుటకు సిద్ధమయ్యెను. స్ట్రూమునిట్జావద్ద ఫరాసులకు జయము సంభవించిన మాటనిజమే. కాని ఉత్తరమున నున్న సర్వియా సేనలతో వారికి సంబంధము కలియనేలేదు. రెండు సేనలకును మధ్య బల్గేరియను పటాలము లతి సామర్థ్యముతో పోరుచుండెను. బాబునా కనుమలలోనున్న సర్వియను సైన్యము కర్నలు వాసిక్కుగారిక్రింద 16 దినములు చెదరక నిలబడియుండెను. కాని బల్గేరియా సైన్యములు వీరిని తరిమివేసెను.

కర్నలు వాసిక్కుగారు ప్రయిలెప్ కు పరుగెత్తుకొని పోయిరి. కొన్ని ఫిరంగులను నయితము వదలి వెళ్లెను. మొనాస్టిరు నగర మిప్పుడు బల్గేరియనుల చేతిలో 2-వ డిసెంబరున పడెను. ప్రయిలెపును వదలి మొనాస్టిరు కీశాన్యమున స్థానములను సర్బియను లేర్ప



త్రోవతప్పిపోయిన అంధసైనికునికి సర్వియా స్త్రీ త్రోవచూపుట

సంధిరాయబారముల నంపెను. అలెగ్జాండరు రాజు అట్టి రాయబారములను తిరస్కరించెను.

## ఆల్బేనియాలో ఇటాలియనులు దిగుట

ఆల్బేనియా తీరమునందు కొంత ఇటాలియను సేన ఆదేశమును కాపాడుటకును, ఆల్బేనియాలోనికి పరుగెత్తుకొని వచ్చుచున్న సర్బియనులను కాపాడుటకును దింపబడెను. నవంబరు 29-వ తేదిన ప్రైజ్రెన్ వద్ద సర్బియను లోడిపోయిన తరువాత వారిసేన జాకోవా

రీగా, డ్వినస్కులను పట్టుకొనుటకు జర్మనులు చేసిన యత్నము లన్నియు విఫలము లయినవి. స్వెంటియను సరస్సు మొద్దనను పోరు జరిగెను. కాని జర్మనీయులు ముందుకు నడువలేకపోయిరి. రీగాను కాపాడుకొనుటయే గాక నవంబరు 1 మొదలు 11 వరకును రీగాను



రష్యాచక్రవర్తిగారి పెద్దకుమారుడును, యువరాజు

వదలి ముందుకు నడిచి, జర్మనీయులను పారదోలుచుండిరి. 11.వ తేదినాటికి కెమ్మెరన్, అంగెరు లాక్రమించుకొనబడియెను. జర్మనీల త్రోవలు లన్నిచోటులను ఆపివేయబడినవి. అందుచే సముద్రతీరమునకు జర్మనులు పరుగెత్తిరి. 16వ తేదిన రీగా-మిటా రయిలుమీదనున్న ఓలయిమీద జర్మనులు వచ్చిపడిరి. కాని జెలుసుబడిరి. డ్వినా ప్రాంతమున జర్మనుల ప్రయత్నము లన్నియు నిష్ఫలము లైనవనియే చెప్పవచ్చును. కెమ్మెరన్ వద్ద రష్యను లతి సాహసముతో పోరిరని కొనియాడబడిరి. కావలసిన యుద్ధసామగ్రులను జపానీయులు విరివిగా నిర్మించి రష్యనులకు పంపుచుండుటచే, ఈ కఱవు ఇప్పటికి తీరినదని సంతసించుచుండిరి.

## గలీషియా

తూర్పు గలీషియా రంగమున నవంబరున యుద్ధములు జరగుచునేయుండెను. ఆస్ట్రో-జర్మనులు తాము తాకుటకు ముందుగా రష్యను దెబ్బలను కాచుకొనుచుండిరి. అక్టోబరు మాసాంతమున స్ట్రిపానదిమీదనున్న జనరలు ఇవనోఫుగారు దానిని దాటి నవంబరులో ముందుకుపో ప్రారంభించెను. నవంబరు 2-4 వ తేదీలను సైమిలోక్-విస్ వద్ద రష్యను పంక్తులలో ప్రవేశింపగా చుట్టును రష్యనులు చుట్టుకొని ఖయిదీలనుగాఁ జేసిరి. స్టయిర్ నదిమీఁద జారుటో రిస్కీవద్ద దిట్టముగా పోరు జరిగినది. రష్యనులకే జయము లభించుట వలన 8600 ఖయిదీలు దొరకిరి. 31 యంత్రఫిరంగులు లభించినవి. జర్మను జనరల్ వాన్ లింసింగన్ జార్టోరిస్కీమీద తిరిగి వెడలి 1500 మంది జర్మనీయుల ఖయిదీలుగా జేసెను. కాని 20 వ తేదిన నీస్థలము తిరిగి రష్యనులచే నాక్రమింపఁ గొనబడినది. సెప్టెంబరు 15 మొదలు నవంబరు 18 వరకు రష్యనులు ఈ గలీషియా రంగమున 60,000 మంది ఖయిదీలను పట్టుకొంటిమని వెల్లడించిరి.

## తూర్పుఆఫ్రికా రంగము

ఇచ్చట బ్రిటిషుసైన్యములు ఎడతెగక ముందుకు జర్మనీయుల త్రోసికొని వెళ్లుచుండెను. జర్మనులును వెనుదీయక గొప్పసాహసముతో బోరాడుచుండిరి జర్మను లింత శౌర్యోత్సాహముతో బోరాడుటకు కారణములేకపోలేదు. ఈ దేశము జర్మనీకున్న అధినివేశములలో గొప్పది. 480 మైళ్ల సముద్రతీరము (జర్మనీ సామ్రాజ్యమునకు యూరపులోనున్న దానికి రెండు రెట్లు) గలదు. బ్రిటిషువారి తూర్పు ఆఫ్రికాదేశము యుద్ధకార్యములకయి సిద్ధ మెప్పుడును చేయబడియుండలేదు. కాని జర్మనులు తమదేశమును మొట్టమొదటినుండియు బాగుగా బలపఱచుచు వచ్చిరి. అందుచే ఈ దేశమునందు యుద్ధము 700 మైళ్ల సరిహద్దులలో చేయవలసివచ్చినది.



తూర్పు ఆఫ్రికాలో పోరుచున్న భారతీయసైనికులు

జర్మనులు ముందుగా బ్రిటిషు తూర్పుఆఫ్రికా మీఁదనే దండెత్తివచ్చిరి. వారితలంపు యుగాండారయిలును నాశనము చేయవలయునని. కాని యిది బ్రిటిషు భూమిలోనున్న ప్రతిమనుజుండును సహాయము చేయుటవలన కొనసాగినదికాదు. విక్టోరియా నయాంజాసరస్సునకు పశ్చిమమున బుకోబా అను జర్మనీ రేవుపట్టణమును బ్రిటీషువారు జయించి పట్టుకొన నిశ్చయించిరి. ఒకసైన్యము యుగాండాకు దక్షిణమున కాగేరా నదీముఖమునుండి వెడలెను. రెండవసైన్యము పొగనావలనెక్కి కిసుమునుండి బయలుదేరెను. ఉకేసుము అనునది మొంబాసారయిలు కంతము స్టేషను. కగేరినది మొదలు బుకోబాకు 30 మైళ్ల దూరము. దేశము బురదతో చితచితలాడుచుండును. దాటుట కష్టము. కిసుము, బుకోబాలకు మధ్య విక్టోరియా నయాంజా సరస్సు 240 మైళ్ల వెడల్పున ప్రవహించుచుండును. ఇటువంటి అననుకూలమయిన భూమినుండి బయలుదేరిన సైన్యములు 22-వ ఆగస్టున యుద్ధమారంభించెను. జర్మనులు గట్టిగా నోడిపోయి బ్రిటిషుసేనల ముఖమున పరుగెత్తిరి. మంబూయి నివద్ద సయితము పోరు సలుపబడెను. బ్రిగేడియరు జనరలు మల్లెసన్ గారిక్రింద బయలుదేరిన సేన 14 వ. ఆగస్టున మక్కావద్దనుండి బయలుదేరి మబూయినివద్ద 2000 సైనికులతోను, యంత్రఫిరంగులతోను నున్న జర్మను సేనపైఁ బడియెను. ఇచ్చట జరిగిన యుద్ధములో మొత్తము జయాపజయములు సమముగా నున్నవి.



సముద్రములో ప్రాణరు మునుగుటవలన గొట్టుకొనుచున్న జర్మనువాహికుల నింగ్లీషువారు కాపాడుచుండుట.

## సముద్ర రంగము

### బాల్టికు, మెడిటరేనియనులలో సందడి.

బాల్కనులలో జరుగుచున్న అల్లకల్లోలమునుండి మన మనస్సును కొన్ని నిమేషములు సముద్రముపై ద్రిప్పి ఏమి సంభవించుచున్నదో తెలిసికొనెదము గాక. బ్రిటీషు సబ్మెరయినులు బాల్టికు సముద్రములో చాల అడావుడిచేయుచుండెను. వీని బాధనుండి తప్పించుకొనుటకయి పెక్కింటిని ఉపాయములను జర్మనులు పన్నిరి. సముద్రరేవులలో దీపములు ఆరిసివేయఁబడెను. సముద్రమును కాచుచుండు డిస్ట్రాయరులలో దీపములను వెలిగించుట మాన్పివేసిరి. వర్తకనావలు గుంపులుగా ప్రయాణముచేయునట్లాజ్ఞాపింపఁబడెను. రేవులయొద్దనున్న దూరముపారు ఫిరంగులు కోటబురుజులమీఁది కెక్కింపబడియెను. నవంబరు 7 వ తేదిని బ్రిటిషు సబ్మెరయినొకటి 'యుండీన్' అను నొక జర్మను క్రూసరును క్రెల్లిబర్గుకు సామీప్యమున టార్పిడేతో కొట్టి రెండు నిమిషములలో ముంచివేసెను. బాల్టికు సముద్రములో ఈసబ్మెరయినుల అడావుడివలననే సైన్యములను సముద్రమార్గమున పంపి రీగాను పట్టుకొనుటకు జర్మనులు భయపడిరి. అందువలన రీగా పడకుండుట కారణమని రష్యనుపత్రికలు సయితము వ్రాసినవి. లీబా, విండాలకు వెళ్లుచున్న యుద్ధపరికరముల నావలు చాల పట్టుబడి సముద్రపుటడుగునకుఁ జేరెను.

మెడిటరేనియను సముద్రములో జర్మను సబ్మెరయినులు మిత్రమండలివారి యొక్కయు, తటస్థదేశముల యొక్కయు నావలను ముంచ మొదలుపెట్టెను. ఈ సబ్మెరయినులు ముంచిన నావల వివరము సైనికపత్రికలలో ముద్రింపఁబడియున్నది. ఇ 2 అను ఇంగ్లీషువారి సబ్మెరయిను తురుష్కులచే డార్డినల్సులో ముంచఁబడెను. నీటిపయి నిది 19 మైళ్లు గంటకు పరుగెత్తును. 800 టన్నులబరువు. తూర్పు మెడిటరేనియనులో 'లూయి' అను బ్రిటీషువారి టార్పిడో బోటు డిస్ట్రాయరు 965 టన్నులది ఒడ్డునుబట్టి తునకలయిపోయెను.

## మెసపటామియా రంగము

### ప్రారంభ యుద్ధములు

మెసపొటామియాకు సైన్యములు బొంబయినుండి పంపఁబడినవి. బొంబయినుండి పరిమ్యనుగల్ఫులో మెసపొటామియాకు దక్షిణమున మొట్టమొదటి ఫావో అను రేవు కలదు. ఆరేవునకును బొంబయికిని దూరము 1420 మైళ్లు. కరాచినుండి దూరము 1030 మైళ్లు. ఈ దేశము గోదావరీ, కృష్ణా డెల్టాలవలె అత్యంత ఫలవంత

మయినవి. 60 లక్షల ఎకరములు బంగారము పండు నేల కలదు. అనకట్టకయి రూ॥ 32 కోట్లు కావలయును. తురుష్కుల దుష్పరిపాలనము వలన దేశ మభివృద్ధిలోనికిఁ దీసికొని రాఁబడ లేదు. అరబ్బులు దేశస్థులు. రాజ్యమేలునది తురుష్కులయినను, అరబ్బులకు చాల స్వాతంత్ర్యములు, అనుభోగములు కలవు. టైగ్రీసు, యూఫ్రటీసునదులు పురాణప్రసిద్ధ మయినవి. ఈ రెండును బాస్రావద్ద సంగమించును.

హిందూదేశమునుండి పంపఁబడిన సేన ఫావోవద్ద 1914 నవంబరు 7 వ తేదిని దిగినది. నవంబరు 17 వ తేదిని తురుష్కులు సాహీలు వద్ద నోడింపఁబడిరి. 22 వ తేదిని బాస్రా ఆక్రమించుకొన బడియెను. బాస్రాలో కందకములు కోటలు కట్టఁబడినవి. షెయిబావద్ద బలీయమయిన గొప్పదుర్గము నిర్మింపబడినది. తురుష్కులు బాస్రాను పట్టుకొనుటకయి సన్నాహములనొనర్చిరి. తరువాత కూర్నా, అవాజుల మీఁద పోవలయు ననుకొనిరి. బాస్రాకు పయినున్న కూర్నా బ్రిటీషువారిచే నాక్రమింపఁబడుటచే బాస్రా సురక్షితముగా నుండెను. సైన్యము అధికముగుటవలన సర్వసేనాధిపత్యము జనరలు సర్ జాన్ నిక్సన్ గారి కొప్పగింపఁబడియెను.

జనవరి 20 తేది 1915 వ తురుష్క సైన్యములు కూర్నాకు 10 మైళ్లు దూరమునం దుండెను. కాని ఫిబ్రవరి మాసాంతరమునకుఁ గాని అవాజువద్ద 12,000 మంది శత్రుసైన్యము కూడ లేదు. అవాజునుండి బయలుదేరిన రెండు రాజపుత్ర బటాలియనులు ఈ సైన్యము నెదుర్కొని తిరిగి అవాజుకు ఎంతో కష్టముమీఁద చేరిరి.



మెసపొటేమియాకు వెళ్లుచున్న భారతీయసైనికులు

రాజపుత్రులలో 200 మంది మృతినొందిరి. కాని వీరు 1500 మంది తురుష్కులను కడతేర్చిరి. అందులో షేకు ఘజ్జాను గారి సోదరుఁడు కూడ నుండిరి. ఈ దినముననే నభయిలావద్ద హిందూదేశ అశ్వసేన 1500 మంది తురుష్క అశ్వసేనచే ముట్టడింపఁబడెను. తురుష్కులను 800 మందిని చంపి హైందవులు మిగిలినవారిని పారఁద్రోలిరి. ఈ రెండుపోటులలో చావుదెబ్బలు తినుటచే తురుష్క సేనాధిపతి జనరలు సులేమాను అస్కరీ పాషా కడుజాగ్రత్తపడి ఏప్రిలు నెల 11 వ తేదివఱకుఁగాని పోరును ప్రారంభించినవాఁడు కాఁడు. 20,000 మంది సైనికులతో షైబావద్ద జనరలు ఫ్రయిగారి మీఁద తురుష్కులుపడిరి. ఇచ్చటి సైన్యము చాలినంత లేదని సర్ జాన్ నిక్సను గారు జనరలు మెల్లీసుగారిని క్రొత్త సైన్యములతో పంపి 13 వ తేదిని ఆతని ఈ సేనకు నాయకునిగా చేసెను. 12 వ ఏప్రిలు తేది ఉదయము 5 గంటలకు తురుష్కులు శతఘ్నులను ప్రేల్చి కాల్పులమును పంపిరి. 8 గంటలకు ఇంగ్లీషువారి వేఁడిమికి తాళఁజాలక తురుష్కులు వెనుకకు మరలిరి. సాయంకాలము 2-15 గంటలకు దక్షిణమునుండి తురుష్కులు కాల్పు ప్రారంభించిరి. ఇచ్చోటగూడ నష్టపడి వెనుకకు పోయిరి. రాత్రివేళ కొంత తురుష్కసేన షెయిబాకు ఉత్తరమున నొకమయిలులో నున్న పీఠభూమిలోనికి చేరెను. జనరలు మెల్లీసు గారిదియాచి నాశీనముచే వారిమీఁదికు తెకెరి. ఉదయము 11 గంటలవఱకును పోరుజరిగి తురకలు తఱిమి వేయఁబడిరి. 800 మంది ఖైదీలు, 2 ఫిరంగులు విజయులకు దొరకినవి. తురుష్కులు షైబా కైదు మైళ్లు దూరమం దున్న జోబెహారునకు పోయిరి. గుజరాతీయ ఆరబ్బ

మునందును స్థానములను పొందుకొనిరి. వారిముందు సైన్యమునకును బ్రిటిషుముందు సైన్యమునకును 2½ మైళ్లదూరమే ఉండెను.



రాజపుత్ర సైనికోద్యోగులు

14 వ తేదిని జనరలు మెల్లిసు శత్రువులను ముట్టెను. అర ణ్యము ఇంగ్లీషువారిచేతిలోఁబడెను. కాని తురుష్కులువారి సహజ సాహస ధైర్యములతో అని సలిపిరి. సాయంకాలమయిదు గంట లకు తురుష్కుల పంక్తులు ఛేదింప బడుటచే నఖయిలాకు పరుగెత్తి పోవుచుండిరి. ఈదినమున ఆంగ్లులనష్టములు 700. 500 మంది ఖయి దీలు, చాల మెషీను ఫిరంగులు, యుద్ధపరికరములు, తుపా కులు, 450 పెట్టెలు తుపాకిమందు గుండ్లు ఇంగ్లీషువారి చేతికి చిక్కెను. తురుష్కులకు నష్టము వచ్చినవారు, దెబ్బలు తినిన వారు 6000 అని మతింపు చేయఁబడినది. ఏప్రిలు 20 వ తేది యగు నప్పటికి ఈ తురుష్క సైన్యము బాస్రాకు 90 మైళ్లు పయిగా పరుగెత్తి పోయెను.

## మైబా బిజ్జిసీయే పోరాటములు

బాస్రా దండయాత్ర నంతరింపఁ జేయుటయే గాక, కూర్నా అవాజులమీఁద పడఁదలఁచిన తురుష్కసేనను సయితము ఆంగ్లసేన నిలిపియుంచెను. మేజరు జనరలు గోరింజిగారి క్రింద కొంతసేన అవాజుమీఁదికి పంపఁబడెను. తురుష్కులు ఇల్లావద్ద కూడియుండిరి. వారి సైన్యములను చీల్చుటకయి చేసిన యెత్తు వఱదలవలన భగ్న మయ్యెను. టైగ్రిసునదిమీఁద నున్న అమారాకు వారు సురక్షితము గాఁ జేరిరి. ఈ అవాజు మెసొపొటామియాలో లేదు. పరిస్యాలో కలదు. ఇచ్చట కెరోసినాయిలు భూము లున్నవి. ఇచ్చటనుండి కొళ్ళాయిల మూలకముగా నూనె షావోకు పయి నున్న అబాడా నఱకును తీసికొని రాఁబడి స్టీమరులలో పోయఁబడి, రవాణా చేయఁబడుచున్నది. ఈ వర్తక మంతయు నింగ్లీషువారిది. అందుచే అవాజుయుద్ధమువలన వారి నూనెభూములు సురక్షితమయినవి. చుట్టుపట్లనున్న అరబ్బు నాయకులు తురుష్కులలోఁ జేరినందున కయి శిక్షింపఁబడిరి. కొళ్లాయిలను గాపాడు బాధ్యతను వారు వహించిరి. ఇఁక కుర్నాను భయపెట్టుచున్న తురుష్కసేనను పరి మార్చుటకయి మేజరు జనరలు టౌన్షెండుగారు పంపబడిరి. ఈయ నకు సహాయము కొన్ని గన్‌బోటులు కెప్టన్ నన్‌గారిక్రింద నది మీఁద పంపఁబడెను. మే 31-వ తేదిన కుర్నా కుత్తరమున రెండు మయిళ్లలో స్థానముల నేర్పఱచుకొనియున్న తురుష్కులు ముట్ట డింపఁబడిరి. రాత్రి 1-30 లకు యుద్ధము ప్రారంభింపఁబడెను. మరు నాఁడు మధ్యాహ్నము తురుష్కులు చెల్లాచెదరయి అమారావై పుకు పరుగెత్తుచుండిరి. 250 మంది ఖయిదీలు, మూఁడు ఫిరంగులు ఇంగ్లీషువారి వశమయ్యెను. నీళ్లమీఁదను, నేలమీఁదను ఈ సైన్య మును బ్రిటిషుసేన తఱుము మొదలిడెను. జూన్ 1-వ తేదిని తురు ష్కులు కూర్నాకుపయిగా 83 మయిళ్లవఱకును తఱుమబడిరి. ఈ కాలమున 300 ఖయిదీలు, యుద్ధపరికరములు, ఒకనావ ఆంగ్లేయుల వశమయ్యెను. జూన్ 3-వ తేది నాఁటికి ఈ టౌన్షెండుగారి సైన్య ము అవాజునుండి, జనరలు గోరింజిగారి సైన్యము ఇంకొకవైపు నుండి, రెండు వైపులనుండి అమారామీఁదికి వెళ్లుచుండెను. తురు ష్కు లిచ్చట చెదరఁగొట్టఁబడి, చుట్టుముట్టఁబడిరి. 700 మంది ఖయిదీలు, ఉద్యోగులు ఇంగ్లీషువారి వశమయిరి. జూన్ మూఁడవతేదినాఁటికి 200 మయిళ్ల భూమి యూఫ్రటీసు, టైగ్రీసు నదుల యొడ్డున ఆంగ్లేయుల వశమునందుండెను. మే 31-వ తేది మొదలు జూన్ 3-వ తేదివఱకు 13 గొప్పఫిరంగులు, 4 నదులలోని స్టీమరులు, 1 గన్‌బోటు, 12 తేలికయయిన స్టీమరులు, 2000 ఖయి దీలు, విశేషమయిన భోజనసామగ్రి యుద్ధపరికరములు బ్రిటీషువారి చేఁ బడెను. తురుష్కుల కధికారులుగా నున్న 6 గురు జర్మ నుద్యోగులలో మృతినొందినవారు గాని కయిదీలుగా పట్టుకొనఁ బడినవారు గాని 5 గురు.

## మెసొపొటేమియా రంగము.

### జూలయి 4—నవంబరు 30, 1915.

బ్రిటిషు ఇండియను సేన బగ్దాదువరకును దేశము నాక్రమించుకొనుటకయి పంపబడెనుగదా. ఆంగ్ల సేన మేజరు జనరలు గోరింజి గారి యాధిపత్యముక్రింద కుర్నాను జూను మాసాంతమున వదలెను. నదిమీఁద ప్రయాణము చాల కష్టముగా నుండెను. గోరింజి గారు షుకేస్టు షుయుూకువద్ద తురుష్కుల నోడించెను. తురుష్కులిచ్చటినుండి నసీరియాకు పరుగెత్తిపోయిరి. గోరింజి గారి సైన్యము బలపఱుపఁబడెను. అరబ్బులు,తురుష్కులుకలిసి ఈ నసీరియావద్ద ఇంగ్లీషువారిని కదలక ఆపిరి. క్రొత్త సేనకయి గోరింజి గారు వ్రాయగా 18-వ బ్రయిగేడు కుర్నానుండి పంపబడెను. జూలయి 24-వ తేదిని తూర్పున పడమట బ్రిటిషు సేనలు తురుష్కుల దట్టముగా ముట్టడించెను. శత్రువులును గొప్ప సాహస ధైర్యములతోఁ బోరాడిరి. కాని ఇంగ్లీషు వారి ఫిరంగులు శత్రువులను తుడిచివేసెను. 25-వ తేదిని నసీరియా ఆక్రమించుకొనఁబడెను. తురుష్కులువారి ఫిరంగుల నన్నింటిని పోఁగొట్టుకొనిరి. 700 మంది ఖయిదీలు దొరకిరి. 500 కళేబరములు లెక్కింపఁబడెను.



నదియొడ్డున తురుష్కసైనికు డతిసాహసముతో నాంగ్లసైనికులతో బోరుట

### తురుష్కులు కూటెల్ అమారావద్ద 20,000 సైన్యముతో నెదుర్కొనుట

బగ్దాదుకు నాలుమైళ్ల క్రిందనున్న కుటేల్ అమారావద్ద తురుష్కు లింగ్లీషు సేనలతో బోరుటకు నిలఁబడిరి. టైగ్రిసునదికి రెండువైపులను 7 మైళ్ల దూరమున కందకములను త్రవ్వుకొనిరి. నసేరియాలో దెబ్బలు తగిలి పరుగెత్తినవారు, కాన్‌స్టాంటునోపిలు వగయిరా స్థలములనుండి వచ్చిన వారు సెప్టెంబరు 20 వ తేది యగునప్పటికి 20,000 మంది యయిరి. 35 ఫిరంగు లుండెను. నూరుద్దీన్ పాషా వారికి సేనానాయకుఁడు. బ్రిటిషు సేన తురుష్కులస్థానముల వద్దనే దిగుచుండెను. కాల్బలము రెండు బ్రయిగేడులు జనరలు ఫ్రయి, డెల్మెన్ గార్లక్రిందను జనరలు బొస్లెండు గారిక్రిందను నుండెను. నదిమీఁద శత్రువులవుకంటెన కట్టఁబడుటచే ఆంగ్లసేనలకు రెండొడ్డులనుండి సంబంధము బాగుగా కుదిరియుండెను. 27 వ సెప్టెంబరున జనరలుసు ఫ్రయి, డెల్మెనులు రెండువైపులను ముట్టడించిరి. 28 తేదిన మరింత గట్టిగా ఇంగ్లీషువారు యుద్ధముచేసిరి. తురుష్కులును స్థలమొసంగక ధీరులవలె పోరాడిరి. సాయంకాలమగు నప్పటికి తురుష్కుల సేనాధిపతి క్రొత్తసైన్యములను తీసికొని వచ్చెను. ఆ సైన్యములును ఓడింపఁబడినవి. రాత్రియగునప్పటికి ఇంగ్లీషువారి బారుల కోర్వఁజాలక అమారాను వదలిపెట్టి తురుష్కులు బగ్దాదుకు పారిపోయిరి. తురుష్కుల నష్టము లధికముగా నుండెను. 1000 మంది ఖయిదీ లాంగ్లులకు దొరకిరి. 6 ఫిరంగులు పట్టుకొనఁబడినవి.

ఈ జయము సమకూరిన తరువాత వారు జయించిన దేశమును బలపఱచుకొనుటకును, క్రొత్త సైన్యముల కొఱకును, యుద్ధ పరికరముల కొఱకును, విశ్రాంతి కొఱకును బ్రిటీషు-ఇండియను సేన లిచ్చట కొంతకాల ముండెను. కాపాడవలసిన నదుల చాలవందల మైళ్లకు పెరిఁగెను. అందుచే కావలసినంత సేన ఈ కావలి పనులకే కావలసివచ్చెను. ఇంతలోపల బగ్దాదును కాపాడుటకయి తురుష్కులు పడమటనుండి సేనలను బంపుచుండిరి. నవంబరు నెలలో జనరలు టౌన్‌షెండుగారి సైన్యము బగ్దాదునకు 18 మైళ్లు దూరములో నున్న సిటెసైఫన్ పట్టణమువఱకును వెళ్లఁగలిగెను. ఇచ్చట తురుష్కులు దృఢమయిన కందకములను త్రవ్వుకొని యున్నట్లు కనుఁగొనఁబడినది. టౌన్‌షెండుగారు తురుష్కులు సైన్యాధిక్యతను గలిగియున్నను, వారితో యుద్ధమునకు బ్రారంభించెను. చాల నష్టపోయి జయమును పొందఁగలిగెను. 1600 మంది ఖయిదీలు టౌన్‌షెండుగారికి దొరకిరి. కాని యిది జయమనుటకే వీలులేదు

బగ్దాదునుండి క్రొత్తసేన తురుష్క సేనాధిపతికి సహాయార్థము పంపఁబడినది. ఇంత గొప్పసైన్యము టౌన్‌షెండు గారిని ముట్టడింపఁగా ఆయన 80 మైళ్లు క్రిందికి అమారా వఱకును తిరిగి పాఱిపోవలసినవాఁడాయెను. ఈ 80 మైళ్ల మార్గమందంతటను అధిక తురుష్కసేన నానాబాధలను ఆంగ్లసేనకు పెట్టెను. నవంబరు 30 వ తేదిని డిసంబరు 1 వ తేదిని టౌన్‌షెండుగారి సేనను పూర్తిగా నోడింపవలయునని తురుష్కులు విశ్వప్రయత్నములను జేసి యతిసాహసముతో పోరాడిరి. కాని యీ యత్నమును టౌన్‌షెండుగారు సాగనీయక తురుష్కులకు నష్టము కలుగఁజేసి సురక్షితముగా కూటెల్ అమారాను జేరెను. నదిలోని రెండు చిన్న గన్ బోటులు తురుష్కుల శతఘ్నులచే ముంచివేయఁబడినవి. ఇంగ్లీషువారి పక్షమున నష్టములు మొత్తముమీఁద 4,500. తత్కాలము బగ్దాదును పట్టుకొనుట ఆఁగిపోయినది. కావలసిన సైన్యము, యుద్ధసామగ్రి చేరఁగానే తిరిగి దండయాత్ర ప్రారంభింపఁ బడును.

జనరలు టౌన్‌షెండుగారు కుటెల్ అమారాయొద్ద పదివారములు ముట్టడింపబడెను. ఈదినములలో కాలమానస్థితి ఎంతమాత్రము బాగుండనందున తక్షణమే సేనలను ఈయన సహాయార్థమై పంపుటకు వీలుపడకపోయినది. తరువాత జనరలు అయిమరుగారీయనతో కలిసిరి. ఈ రెండుసేనలును మరికొన్ని సేనల సహాయమువలన బగ్దాదుమీఁదికి వెళ్లుట తిరిగి ప్రారంభింతురుగాని వెనుకకుఁ రాఁరని క్రూప్రభువు ప్రభువులసభలో వక్కాణించెను.



హైందవసైనికుడు శత్రుసైనికుని దాహము తీర్చుట

డిసంబరు మొదటివారము నుండియు కుటెల్ అమారా వద్ద తురుష్కులు టైగ్రిసునదిమీఁద జనరలు టౌన్‌షెండుగారి చుట్టును చుట్టుకొనిరి. ఈ టౌన్‌షెండుగారు బగ్దాదుమీఁద కదులుచుండఁగా సైఫన్‌వద్ద తురుష్కు లెదుర్కొనిరి. వారిబహుళసంఖ్యకుం దాళలేక ఈయన వెనుకకు మరలెను. తురుష్కులు వెంటనంటి చుట్టుకొనిరి. ఈయనకు బగ్దాదులో సహాయము చేయుటకయి పంపబడిన సేనలు రక్షకసేనలక్రిందమాఱినవి. షేకుసాదువద్ద జనవరి 7, 8 తేదీలను, వాడీవద్ద జనవరి 15 వ తేదిని ఈ రక్షకసైన్యములు తురుష్కులతోఁ బోరి ఓడించినవి. ఇందు ముప్పాతిక భాగము భారతీయులున్నారు. చలి, వడగండ్లవాన బాధ తురుష్కులబాధకంటె నీ ప్రదేశములో బలీయముగానున్నది. ఈ వాడీస్థలమునకును టౌన్‌షెండుగారికిని దూరము 24 మయిళ్లే. తీగలేని తంత్రీవార్తలవలన వారికిని వీరికిని సమాచారములు నడచుచున్నవి.

### కుటెల్ అమారాను పదివారములు ముట్టడించుట

డిసంబరు 3. — సెటిసైఫన్‌నుండి జనరలు టౌన్‌షెండుగారి సైన్యము మరలి కుటెల్ అమారా చేరుట.

డిసంబరు 25. — కట్ మీఁద తురుష్కులదాడి ఆపియుంచఁబడుట

జనవరి 7—9. — టౌన్‌షెండు గారికి సహాయము పంపబడిన జనరలు ఐల్మరుగారి సేన షేక్‌సాడ్‌వద్ద తురుష్కులతోఁ బోరి వారిని పాఱఁదోలుట. శత్రువులు కట్‌కు తూర్పున 6 మైళ్ల దూరములో ఎస్సిన్‌వద్ద స్థానముల నేర్పఱచుకొనుట.

జనవరి 18. — జనరలు ఐమర్‌గారు వాడీవద్ద తిరిగి పోరుట.

జనవరి 27, 1916 — తురుష్కులు కట్‌ను ముట్టడించిన సేనలో కొంత భాగమును మరలించిరని టౌన్‌షెండుగారు తెలియఁబఱచుట.

ఫిబ్రవరి 4, 1916 — జనరలు ఐల్మరుగారి సేనతో తురుష్కు లతి సాహసముతోఁ బోరుట.

### కామరూనులలో యుద్ధము

ఇది ఆఫ్రికాలోనున్న జర్మనుల దేశములలో నొక్కటి. ఆగస్టు 25, 1914 న ఉత్తరనైగేరియానుండి బ్రిటీషుసేన మొట్టమొదట బయలుదేఱెను. గారూకోటలవద్ద బ్రిటీషువారోడింపఁబడుటవలన ఈ సేన బ్రిటీషుదేశములో తిరిగి ప్రవేశించి జూన్ 1915 న తిరిగి యుద్ధసన్నాహములను జేసెను. గారూకోట ఆక్రమించుకొనఁబడెను. దక్షిణనైగేరియానుండి వెళ్లినసేనలు రెండు సానకాంగ్, ఆర్చిబాంగుల నాక్రమించెను. సానకాంగు సెప్టెంబరు 6, 1915 న తిరిగి జర్మనుల స్వాధీనమయ్యెను. కామరూన్‌నదిమీఁద నున్న బోనబేరి రేవుపై కంబర్లాండు, డ్వార్ఫు యుద్ధనావలు సెప్టెంబరు 27 వ తేదిని కాల్చి ఆరేవును ఆంగ్లో - ఫ్రెంచి సేన వశము చేసెను. అక్టోబరు 8 వ తేదిని నావికసైనిక ప్రయత్నములు వూరీనదిమీఁది జాబస్సే రేవుపయి సాగలేదు. కాని అక్టోబరు 14 న ఈ రేవు విజయులవశమాయెను. 19 వ తేదిని బోనబేరినుండి వెళ్లు రయిలుమీఁద నున్న మూసా ఆక్రమించుకొనబడెను. 29 వ తేదిని సనగానదిమీఁద సముద్రమునకు 56 మైళ్లదూరముననున్న ఈడియా యను గ్రామ

ఖ్యముగలపట్టణము ఇంగ్లీషు, ఫరాసువారి నావిక సైనికబలములకు లొంగిపోయెను. జర్మను అధినివేశముల కన్నింటికిని రాజధానిగనున్న బ్యూవానుకేరను స్పెనిషు గీనియా 18 వ నవంబరున యుద్ధనావల కుపకారాయి ఆంగ్లేయులవశమయ్యెను. బ్యూవాసమునను పట్టుకొనబడి నది. మూవానుండి వెళ్లిన కొంత సేన ముజూకాను పట్టుకొనినది. డిసెం



కామరూనులో ఫ్రెంచి ఆంగ్లసేనలు జర్మనుల కోటిం బడి చర్యావసానములోయుట

బరు 10 వ తేదివఱకును యుద్ధము తీక్ష్ణముగా జరుగుచుండెను. రైలు మార్గములన్నియు ఆంగ్లులవశము కాగా నే జర్మనులు దేశమధ్యమందున్న కొండలలోనికి పరుగెత్తి యాండీని రాజధాని పట్టణముగా జేసికొనిరి. ఈడియానుండి యాండీని పట్టుకొనుటకయి తూర్పుకు ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు పోవుచుండఁగా, ఫ్రెంచివారి యింకొక సేన పశ్చిమున పోవుచుండెను. గారూ జూన్ 10 వ తేదిని లొంగిపోయెను. నాం డేరి జూన్ 29 వ తేదిని వశమయ్యెను. మరునాడు కోంట్షాలో ప్రవేశించిరి. 16 వ ఆగస్టున గష్టాకాలో జేరిరి. నవంబరు 3 వ తేది నిటిబాటిలో విశ్రాంతి పుచ్చుకొనిరి. ఈడియానుండి వచ్చుచున్న బ్రిటిషు సేన అక్టోబరు 9 వ తేదిని 30 గంటలు పోరాడి వుంబియా గ్సనులో చొచ్చెను. ఉత్తరసైన్యములు బామెండాను, బానోయను పట్టుకొనెను. ఈనెలలోపలనే యాండేచుట్టు నున్న భూమియం తయు వశమయినది. ఈ స్థలము గూడ పడెనేని కామరూన్ దండ యాత్ర పూర్తి యగును.

## సలోనికాలో వ్యవస్థ

సలోనికాలో గ్రీసురాజు మిత్రమండలికి చాల ఇబ్బందులు కలిగించెను. పెద్ద రాయబారము లాయనతో జరుపవలసివచ్చినది. సర్వియా, సేనకు కావలసినంత సహాయము సకాలములో చేయ జాలని తరువాత నిచ్చట మిత్రమండలివారు కొండలలోని కోటలను బలపఱచుచు, కందకములు త్రవ్వుకొనుచు నగరమును, పరిసరము లను బలపఱచుచుండిరి. మిత్రమండలి వారిసేన కంతకును ఫ్రెంచి జనరలు సర్రేలు గారధిపతిగా నియోగింపఁబడిరి.

## శత్రుమండలి మాంటినీగ్రో నాక్రమించుకొనుట.

సర్వియాపని యయిన తరువాత మాంటినీగ్రోపయిని ఆస్ట్రియా దేశపు సేనలు ద్రోహింపబడెను. 1916 జనవరి 11 వ తేదిని ఘోరసంగ్రామము జరిగిన తరువాత మౌంటు లవ్‌సెన్ శత్రువుల వశమయ్యెను. మాంటినీగ్రినులు వారి సుప్రసిద్ధ సహజ పర్వతశ్రేణికటకముతో పోరు సలిపిరి. ఈ యుద్ధమునకయి ఆస్ట్రియనులు మాసిడోనియా, డాల్మేషియా, ఇస్ట్రియాలనుండి సైన్యములను మరలించిరి. కట్టారో రేవు ముందుగా పట్టుకొనఁ బడెను. 70,000 మంది సైనికులు, 200 ఫిరంగులు 30,000 మాంటినీగ్రినుల మీఁదికి పంపఁబడిరి. మాంటినీగ్రినులు 5000 మంది మట్టుకే మౌంటు లవ్‌సెన్‌లో నుంచబడిరి. యుద్ధనావల ఫిరంగులు కట్టారో అఖాతమునుండి నగరముమీఁద బాంబులను పడవైచెను. తూక్, బాబ్ జాక్ శిఖరములపయిని బాణపరంపరలు తావు లేకుండ వచ్చి పడెను. తరువాత నివి ఆక్రమించుకొనఁబడినవి. పరుగెత్తు చున్న మాంటినీగ్రినులు కెగూషీపై పునరు తఱుమఁబడిరి. రాజధాని యగు సెటింజీ నగరము 15 వ జనవరి తేదిని పట్టుకొనఁబడెను. మాంటి నీగ్రో రాజధాని పొడ్గోరిజ్జాకు మార్పఁబడెను.

తరువాత మాంటినీగ్రో ఆల్బేనియా దేశములు పూర్తిగా శత్రువులవలన నాక్రమించుకొనఁబడుటయు, సర్వియా, ఆల్బేనియా, మాంటినీగ్రో సేనలు మిత్రమండలివారివలన కార్ఫూ ద్వీపలంకకు తీసి కొనిపోఁబడుటయు, అచ్చట తిరిగి వారు యుద్ధసన్నద్ధులగుటయు తటస్థించినవి. ఈ సైన్యములు మిత్రమండలి సేనతో సలోని కాలో సిద్ధముగా నున్నవి. దేశమును కోల్పోయిన మాంటినీగ్రో సర్వియా, రాజులు వారి కుటుంబములతో ప్రస్తుతము ఇటలీ, ఫ్రాన్సులలోనున్నారు. ఇటలీరాజు మాంటినీగ్రో రాజుగారి కల్లుఁడు. ఆల్బేనియా సైన్యాధిపతిగా నుండి మిత్రమండలివారికి తోడ్పడిన ఎస్సదుపాషా గారును ఇటలీలోనే యున్నారు.

## బాల్టికుసముద్రములో బ్రిటిషు సబ్మెరయినులు

ఈ అంతర్గాములు పెట్టుచున్న తొందరలవలన నార్వే స్వీడను లతో జర్మని బాల్టికు గుండ చేయుచున్న వ్యాపారమునకు చాల భంగము కలిగినది. జర్మను వర్తకనావలను గాపాడుటకయి వీని వెంటబంపబడిన చిన్నతరగతి ఫిరంగినావలు చాల ముంచబడెను. పెద్దజర్మను యుద్ధనావలలో "మోల్టుకీ," "ప్రింజు అడల్బర్టు" అను నవి టార్పిడోలతో గొట్టబడి మునిఁగిపోయబడెను. రష్యారంగములో నున్న రీగావద్ద రష్యనుల వెనుక నుండి సైన్యమును బాల్టికు సముద్ర ముమీఁద పంపి దింపవలయు ననిన సంకల్పము ఈ యంతర్గాములవల ననే కొనసాగలేదు. జర్మనులు కోట్లకుకోట్లు వ్యయముచేసి 80

సంవత్సరములనుండియు నింగ్లాండులో పోటీకిదిగి కట్టిన మహాసముద్ర సేనయు, యుద్ధనావలును, కీలు కాలువలలోను, కీలు హార్బరులోను దాగుకొని కలసి వచ్చెను. ఉత్తరసముద్రాధిపత్యము ఒక్క క్షణ మయినను ఇంగ్లీషువారి చేతులను వదలలేదు. రష్యావారును చాల పటిష్ఠమయినవానిని కట్టి బ్రిటిషువారివలెనే జర్మను నావలను రీగా ఖైవు నుండి ముందుకుండిరి.

## డార్డెనల్సు యుద్ధము

. కాన్‌స్టాంటి నోపిలును పట్టుకొనుటకయి పంపబడిన మిత్ర మండలి సేనను గురించి వెనుక కొంత వ్రాయబడినది. డార్డెనల్సు నుండి సైన్యములు నష్టములు విశేషమయినందున మరలింపబడినవి. కాన్‌స్టాంటి నోపిలు పడుట సాధ్యము కాలేదు. ఇప్పటికి పంపబడిన బ్రిటిషు సేనాధిపతి సర్ ఇయాన్ హామిల్టనుగారొక దీర్ఘలేఖను బ్రిటిషు యుద్ధశాఖ వారికి వ్రాసి పంపగా నది ప్రకటింపబడినది. అందలిముఖ్యాంశము లివి:— ఆగస్టు నెలలో ఫ్రాంకో బ్రిటిషు సేనలు రెండుగా విభజింప బడినవి. ఇందలి విశేష సేన ఈ ద్వీపకల్పపు కొనను నుంచబడినది. ఆస్ట్రేలియాను సేన అంజాకు అని పేరుపెట్ట బడిన స్థలమునందు పై సేనకు 8 మైళ్ల దూరమున నుంచబడెను. క్రితియా అను స్థలముదగ్గఱ నుంచబడిన సేన ముందునకు పోవుటకు చాలినది కాదు. క్రొత్త సైన్యములు కావలయునని వ్రాయగా జూలయి 10 మొదలు ఆగస్టు 10 వఱకును 5 డివిజనులు ఇంగ్లాండునుండి పంపబడెను. గల్లిపోలి ద్వీపకల్పము పడుటకయి



కొండలపయిన తురుష్కులు, క్రిందమిత్రమండలి సేనలు గల్లిపోలీలో పోరుచున్నవి

హామిల్టనుగారొక యోచనను జేసిరి. (1) అచ్చిబాబావద్ద నున్న తురుష్క సైన్యములు కదలకుండ నుంచుటకయి క్రితియాలో చాలి నంత సేన నుంచుట (2) అంజాకులో నున్న ఆస్ట్రేలియనులకు వలసి నంత సహాయముపంపి వారిని 5 మైళ్ల దూరమందు మాత్రమే యున్న సారిబైర్ శిఖరములను పట్టుకొనునట్లు చేయుట. అటుల ఆశిఖర ములు పడినచో యుద్ధనావలకు, త్రోసికొనిపోవుటకు జలసంధి మార్గము సులభముగా నేర్పడునట్టిది. ఇప్పటి తురుష్క ఫిరంగులే యుద్ధనావలను జలసంధి ముఖమున ప్రవేశించుటకు వీలులేకుండ జేసి నవి. ఒక్కపర్యాయము నావలు చొరబడిన తరువాత కాన్‌స్టాంటి నోపిలునగరము ఆంగ్లేయులకు సులభముగా వశమయియుండెడిది. (3) అంజాకు సైన్యములు (ఆస్ట్రేలియనులు) దిగిన ప్రదేశమునకు పయిగానున్న సువ్లాఖాతమునొడ్డున కొంతసేనను దించుట. ఈ సైన్యము తూర్పున శిఖరములను పట్టుకొనును. కాబట్టి ఉత్తరమున కిరెచ్చిటేపి మొదలు దక్షిణమున గాబాటేపివఱకును తురుష్కుల మీద తలపడినయెడల (వారిసేనలు తక్కువగా ఈ ఆగస్టునెలలో అచ్చట నుండుటవలన) ద్వీపకల్పము పడిపోవునని హామిల్టను గారను కొనిరి. కాని ఈరంగమునందు తానొకటి తలచుట, దైవమొకటి తలచుట యయినది. ఈ సంకల్పమునకు కలిగిన కష్టములు:—(1) అన్ని తావులలోను పోరాడుచున్న సేనలకు తగిన సంబంధము కలి యకపోవుట. (2) సువ్లాఖాతము నొడ్డున త్రాగుటకు నీరులేక సేనలు అల్లాడుట (3) అందుచే ఇచ్చటిసేనలు అనుకొనినంత జయమును సమకూర్చలేకపోవుట. ఇచ్చటి సేనానాయకులు తగినంత

యుత్సాహవంతులు గాకుండుట (3) ఆంజాకు సేన పెద్దకొండలను ప్రాకి యుద్ధము చేయవలసివచ్చుట. తురుష్కులు జర్మనుల సహాయముచే ఉన్నత శిఖరములలో దుర్భేద్యముగా కట్టిన కోటలనుండి క్రిందుగనున్న లోయలపై ప్రాకుచున్న సేనలపై సతతము దొర్లించుచుండుటచేత ఈ శిఖరములు ఆంగ్లేయులవశము కాకపోవుట. (4) ఈ మహాత్కార్య నిర్వహణమునకయి ఆరితేరిన సైన్యము లుండవలసినదానికి యుద్ధమున నిలిచియుండనటువంటి సేనల నుపయోగించుట వలన (ఉత్సాహవంతమయినది యయినను, అనుభవము లేకుండుట చేత) నానాకష్టములు కలుగుట. (5) కావలసినవేళకు దురదృష్టవశమున తురుష్కులకు కావలసినంత సేనలు వచ్చుటయు, వారికుడిపరిగా నుండి సముద్రపుమట్టమున నున్న మిత్రమండలికి నష్టము లపరిమితముగా గలుగుటయు తటస్థించుట.

వివరములు

ఆగష్టు 6

ఆంజాకురంగము:— సాయంకాలము 5½ గంటలకు ఆంజాకు ప్రాంత్యమున యుద్ధము ప్రారంభమగుట లో'న్ పైన్ మొదలగు కందకములు పట్టుబడుట.

సూవ్లారంగము — 11 వ డివిజను ఇంబ్రోసు నుండి బయలుదేతే, అర్థరాత్రి యప్పుడు సువ్లా చేరుట. ఇచ్చటికే త్రాగుటకు నీరు సయితము పొగయోడలలో తెచ్చుకొనవలసి వచ్చినది.

ఆగష్టు 7

ఆంజాకు:—'చున్నా' అని పిలువఁబడిన కొండపయి ఆఘుయిల్ డేరి నుండి తీక్ష్ణమైన ముట్టడి. ఘూనాక్ బెయిర్ శిఖరము సామీప్యమునకు చేరగలుగుట.

సూవ్లా:—ఏమిపనియు జరుగలేదు. "ఇచ్చట పెద్దపెద్ద మాంద్యము, మాంద్యము, మాంద్యము." అని ముస్మోటు హామిల్టను గారు వ్రాసి యున్నారు.

ఆగష్టు 9

ఆంజాకు:—జనరలు బాల్డులిన్ గారి సైన్యము త్రోవ తప్పిపోవుట.

సూవ్లా:—ఘూన్నకు బెయిర్ ముట్టడి ఫలవంతము కాకపోవుట. మధ్య సైన్యము సూలాబాక్ గుండ పరుగెత్తుట.

ఆగష్టు 10.

ఆంజాకు:—ఘున్నక్ బెయిర్ శిఖరమునకు సామీప్యమున నున్న స్థానములు తిరిగి తురుష్కుల వశమగుట.

సూవ్లా:— 53 వ డివిజనుకలన మరల క్రొత్తముట్టడి.

ఆగష్టు 15

9 వ ఆర్మీకోరు యొక్క సేనాధిపత్యమును జనరలు స్టాఫర్డు గారు మానుకొనుట. మేజరుజనరలు డీ లిస్లీ గారు టెంపొరరీగా వారి స్థానమున నియమింపబడుట.

ఆగష్టు 21

సూవ్లా:— నాల్గవ ముట్టడి ప్రారంభము. హెట్మాన్ హైక్, ఎయిన్ కావక్‌లు పట్టుకొనబడుట. 100 వ నంబరు కొండమీద యోమెన్రీ సేన నతిపరాక్రమముతో తురుష్కుల బోడుచుట

ఆగష్టు 24.

9 వ ఆర్మీకోరు యొక్క అధిపత్యము జనరలు బైంగుగారికొసంగబడుట. ఫ్రాంకో - బ్రిటిషు సేనల ముట్టడులు ఆగిపోవుట.



సర్ ఇయాన్‌హామిల్టనుగారు ఫ్రెంచిసేనాధిపతితో దమసేనలు పొందిన జయమునుగురించిముచ్చటించు చున్నట

(ఎడమప్రక్కనున్నది హామిల్టనుగారు)

తురుష్కుల విజృంభణము నాపి పెట్టుటకే ముందుయత్నములు చేయబడుట.

సెప్టెంబరు, అక్టోబరు, నవంబరునెలలలో మిత్రమండలికి రంగమున జయములు సమకూరలేదు. అచ్చటచ్చట పోరు తీవ్రముగా జరుగుచుండెను. నవంబరు మాసమున జనరలు సర్ ఇయాన్ హామిల్టను గారిని సర్వసేనాధిపత్యమును వేరొక సైన్యాధిపతికొప్పజెప్పి ఇంగ్లండుకు రావలసినదని అజ్ఞాపింపబడిరి. నవంబరు మాసములోనే కిచెనరుప్రభువు ఈజిప్టు, డార్డనల్సు, సర్వియా, ఇటలీ,

ఫ్రాంసురంగములను జూచి డిసంబరునెలలో వచ్చెను; తరువాత జనవరి మొదటివారములో ఆంగ్లో-బ్రిటిషు సేవలన్నియు గల్లిపోలీ రంగమునుండి సర్వసామగ్రిని మరలించుకొనివచ్చినవి. డార్డినల్సు జలసంధిని, కాన్‌స్టాంటినోపిలును పట్టుకొని, రష్యాన రక్షకమునకు జలసంధిని తెఱవవలయునను మిత్రమండలివారి సంకల్పమీడేరకపోయినను, అనేక లక్షలమంది తురుష్క సైనికుల్లను అటు బాగ్దాదుపై



ఆస్ట్రేలియను సైనికుల తమవారికి జేయుసంజ్ఞలు

పున మెసపటామియాలో సహాయార్థము పంపుటకుగాని, లేక యిటు ఈజిప్టుమీద పడుటకు పంపుటకుగాని తురుష్కులకు వీలుకలుగకుండ జేయుట ఈ దండయాత్రవలన గలిగినలాభము. ఇంతలో సూయజు కాలువ, ఆధేన్యమును కొండగా మార్చనేయబడినది. ఈజిప్టుకు కొందర తప్పిపోయినది.

## పరిషియాలో కల్లోలముల గలిగింప యత్నించుట

మిత్రమండలిలో రష్యాకును, ఇంగ్లండుకును పరిషియాతో నెక్కువ సంబంధము కలదు. ఈదేశములో కల్లోలములు కలుగజేయవలయునని కొందఱు తురుష్కులును, జర్మనులును పంపబడిరి. ఈవిధముగానే మిత్రమండలి దేశములందంతటను శత్రుమండలివారు చేసిరి. తురుష్కులు, జర్మనులు కలిసి పరిషియా బాలరాజును టెహరాన్ ముఖ్యనగరమును విడిచి వెళ్లవలసినదని బలవంతపెట్టిరి. ఇంగ్లీషువారిని రష్యనులను చంపవలసినదనియు పారద్రోలవలసినదనియు జనులను బురికొల్పిరి. మహమ్మదీయులకు శత్రువులగు రష్యో-ఆంగ్లులమీద "పవిత్రయుద్ధము" ప్రకటింపుమనిరి. పరిషియాలో కొంత సైన్యము, కొంతమంది పలుకుబడి గల పెద్దమనుష్యులు జర్మనుల క్రింద తమకు స్వర్గము చేకూరునని వీరిలో చేరిరి. కాని పరిషియా బాలరాజు, ఆయన మంత్రులు జర్మనులవలలలో బడక ఆంగ్లేయులను రష్యనులను నమ్మియుండిరి. పరిషియా ప్రభుత్వమువారి భక్తిని మెచ్చుకొనుచు మిత్రమండలి మంత్రులు వారి పార్లమెంటులలో పలికిరి. మన రాజప్రతినిధి హార్డింజి ప్రభువు సయితము వారిని ప్రశంసించెను. రష్యను ప్రభుత్వమువారు ఈ యల్లరిమూకలను అణచివేయుటకయి సైన్యమును పంపిరి. కుట్రదారులు సైన్యము వచ్చుచున్నదనగానే టెహరాను లోని అమెరికా రాయబారిగారి శరణుజొచ్చిరి. తిరుగబడిన సైనికులను రష్యనులు సుల్తాను బులాకునద్ద నోడగొట్టి పారదోలిరి. డిసంబరు 16 వ తేదిన హామడాను నగరముకడకు వెళ్లి ఆ చుట్టుప్రక్కల చేరియున్న తిరుగుబాటు సేనలను చావమోది ఆ నగరమును ఆక్రమించుకొనిరి. టెహరానుకు 70 మైళ్ల క్రిందనున్న "కుం" అను పట్టణమును సయితము పట్టుకొని అచ్చట తిరుగబడిన వారిని శిక్షించిరి. ఈ కుం నుండియే జర్మనులు తురుష్కులు ముఖ్యస్థానము నేర్పఱచుకొని పరిషియాదేశము నంతయు అబద్ధపు వార్తలతో ముంచి జనులలో అశాంతి గలుగజేసినది. ఇచ్చటనుండి రేఁషా గారిని తమతో చేరనియెడల సామ్రాజ్యాధిపత్యము నుండి తొలగించెదమని బెదరించిరి. ఈ కుం వద్ద దెబ్బలుతిని ఇస్పహానుకు కుట్రదారులు, తురుష్కదారులు పరుగెత్తిరి. రష్యను సేనలు వెంటనంటి ఇస్పహానును మార్చి 20 వ తేది నాక్రమించుకొనినవి. ఇంతటితో పరిషియాలో గందరగోళము లాగిపోయినదనియే చెప్పవచ్చును. జర్మనుల ప్రయత్నములన్నియు విఫలములయినవి. షా గారి భక్తివలననే రాజ్యమును నిలుపుకొనగలిగిరి.

## ఇంగ్లండుమీద జెప్పెలినులదాడి

జనవరి 31-వ తేదిన జర్మనుల దాడియంత గొప్పది మరెప్పుడును జరిగియుండలేదు. 8 గంటలకు సాయంకాలమున ఇంగ్లాండులోని నార్ఫకు, లింకన్‌షైర్, డర్బీ, లీస్టర్‌షైర్, స్టాఫర్డుషైర్, సఫక్కు జిల్లాలమీద మొత్తము 300 బాంబులను జెప్పెలినులు గురిపించెను. 59 మంది జనులు మృతినొందిరి. 101 మందికి గాయములు తగిలినవి. చచ్చినవారిలో 20 మంది స్త్రీలు, 6 బిడ్డలు.

లోస్టాఫ్టు, వాల్మరులమీద సముద్రవిమానములు బాంబులను వేసివచ్చెను. యుద్ధారంభమునుండి ఇంగ్లాండుమీద నిది పదియవదాడి. తొమ్మిదిదాడులలో రెండు రాత్రిపూట, ఏడు పగటిపూట జరిగెను. పదియవదాడి ఉదయము 11 గంటలకు జరిగినది. మార్చి నెల 18-వ తేదిన అయిదారువేల అడుగుల యెత్తునుండి డోవరుమీద సముద్ర విమానములు బాంబులను వేసినవి. మరికొన్ని డీలు, రామ్సుగేటు, వెస్టుగేటులమీదను కురిపించి వచ్చెను. 8 పురుషులు, 1 స్త్రీ, 5 బిడ్డలు మృతినొందిరి. 17 పురుషులు, 5 స్త్రీలు, 9 బిడ్డలు గాయములను దినిరి.

## "అప్పము" నౌకను పట్టుకొనుట

ఈనౌక పశ్చిమ ఆఫ్రికా తీరమునుండి లండనుకు దాదాపు రెండువందల మంది ప్రయాణీకులతో వచ్చుచుండెను. ఈ స్టీమరు

వర్తకనావ దేవముడు వేసికొని, ఇతర తటస్థదేశముల పతాకము నెగరవేయుచుండు "మో" అను నౌక కలుగుచున్నది. ఈ "మో" లో గొప్ప ఫిరంగులు కనబడకుండ దాచబడినవి. వర్తకనౌకలు పోవు సముద్ర మార్గములలో పోవుచు అవి సమీపమునకు వచ్చినప్పుడు ఫిరంగు లను తెరచి ముంచివేయును. ఈవిధముగా రమారమి పద్దెండు



నౌకలుముంచబడి సెప్పుడిట్టి పెద్దతెప్పలుక్కిల్లమీదనౌకనుండి వదలబడును. ఈతెప్పమీద పరుకవిమందికి స్థలము కలదు

సామానుస్టీమరులను ముంచి జర్మను రేవులకు తిరిగి చేరెనని తెలియ వచ్చుచున్నది. ఈ "యప్పము" నౌక ముంచివేయబడక అమెరికాలోని నార్ఫకు రేవుకు 3000 మయిళ్లు పరికొంతమంది ముంచబడిన నావ లలోని ప్రయాణీకులతో బంపబడెను. ఈ నౌక మాకుదొరికిన నౌక గాన మాదని జర్మనులును, అటులకాదని ఇంగ్లీషువా రును అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారికి నివేదించిరి. అమెరికావారి నావ యుద్ధనౌకచే పట్టుకొనబడినది గాన జర్మను లదే యని తీర్పుచెప్పి, ప్రయాణీకు లందఱిని నింగ్లండుకు పంపివేసిరి. క్లాజు మెక్టవిష్ అను వర్తకనౌక "మోతో" పోరాడెను. కాని మో లోని పెద్దఫిరంగు లానావను పిప్పిపిప్పిచేసి ముంచివేసెను.

కకేషియారంగము

ఆసియా ఖండమందు తురుష్కులకున్న భూమిలో మెసపొ టేమియా తరువాత ఆర్మీనియా ముఖ్యమయినది. దీనిపయిన రష్యా భూమి, నల్లసముద్రము కలవు. ఈ ఆర్మీనియను క్రైస్తవ ప్రజలను తురుష్కులు నానాబాధలుపెట్టి లక్షలకొలది చంపివేసిరని పత్రి కలలో ప్రకటింపబడియే యున్నది. ఈ ప్రజలబాధలు తీర్చి, ఆసియా మైనరులోని ఆర్మీనియాను రష్యనులు, ఇంగ్లీషువారు మెసపొటేమి యాను, ఆక్రమించుకొనవలయునని నిశ్చయించుకొనిరి. రెండుచోట్ల తొందరవలన డార్డనెల్సులో విడువబడిన తురుష్కసేన జర్మను లతో యూరపురంగములందు చేరుటకుగాని ఈజిప్టుమీద వెడలుటకు వీలుపడదు. ఆసియా మైనరుమీద మరల్పవలసివచ్చును అని మిత్రి మండలివారి సంకల్పముగా కనుపడుచున్నది. జనవరినెల ఆరంభము నుండి రష్యనుల ముట్టడులు ప్రారంభమయినవి. ఎర్జెరము నగరము ఆర్మీనియాకు తురుష్కరాజధాని. దానిమీద సేనలు పంపబడెను. ఆనగరముచకు 70 మైళ్లు వరకు తురుష్కసేనలు దుర్గ ములలో నిచ్చటచ్చట నుంచబడియున్నవి. ఇచ్చట తురుష్కసైన్యము 1 లక్షకు లోపుగా నుండి యుండెను. రష్యా సైన్యము 70,000 మొట్టమొదట యుండెను. తరువాత మంచూరియా సైబేరియాలో నుండి చాల సేన పంపబడినట్లు తెలియవచ్చెను.

1916 జనవరి 10, 11 తేదులను ఎర్జెరముకు తూర్పున ఆరాసు నది కిరుప్రక్కలను సంగ్రామము జరిగెను. మొట్టమొదట తురుష్కులు జయము నొందిరని ప్రకటించిరి. కాని 19-వ తేదియగు నప్పటికి రష్యనులు తురుష్కుల నోడించు కొనుచు ముందుకు వచ్చుచుండిరి. వారు 2000 తురుష్క ఖైదీలను 50 మంది యుద్యోగులను, చాలసామానులను పట్టుకొనిరి. తురుష్క పటాల ముల నేకములు భస్మీపటలము గావింపబడెను. ఇచ్చట మంచిబాటలు లేక పోయినను నిరంతరము కండ్లు కనపడకుండ మంచు కురియుచున్నను



కందకములో జరిగినపోరు

గట్టి కోటలు తురుష్కుల కున్నను రష్యనులు గొప్పసాహ

సముతో వారిని వెంటవెంటనే తరుమ మొదలిడిరి. ఎర్జరమునకు 35 మైళ్లదూరములో నున్న కోప్రికేనివద్ద తురుష్కులు నిలబడి జూచిరిగాని వీలుపడలేదు. 18-వ తేదిని కోప్రుకేలును వారు వదలి పరుగెత్తిరి. రష్యను అశ్వసేన చిందరవందర యయిన తురుష్కసేనలను భీభత్సముగ నరికించెను. మంచుతో నిండి యున్న కొండలమీఁద లెక్కలేని శవములు గాని తురుష్కశవములు వెదజల్లఁబడి యుండెనట.

ఎర్జెరమునకు 24 మైళ్ల దూరములో నున్న హాసన్కలివద్ద తిరిగి తురుష్కులు పోరాడఁ జూచిరి గాని రష్యనుల ధాటికి తాళఁజాలక చాల నష్టముతో ఎర్జరమునకు తూర్పున నున్న కోటలలో శరణమునకయి పరుగెత్తిరి. రష్యను కొసక్కులు ఈ సేనను తరిమి చాలమందిని చంపివేసిరి. 1500 మంది హాసన్కలివద్ద ఖయిదీలు రష్యనులకు చిక్కిరి. వాన్ సరస్సువద్ద తురుష్కులు రష్యనులమీఁద పడఁగా తరిమి వేయఁబడిరి.

## ఎర్జెరము పడిపోవుట

ఈ ఎర్జెరము కోట ఏషియాటిక్ టర్కీలో గలదు. టారస్ కనుమలలో తూర్పుననున్న గొప్పకోట. తురుష్కసైన్యములకు ముఖ్యస్థానము. ఇటు రష్యా (కాకేసస్) అటు పర్షియాల మీఁద వెడలుటకు గాని, లేక వారు దండెత్తివచ్చిన కాచుకొనుటకు గాని ప్రధానమైన స్థానము. ఈకోట తురుష్కుల వశమునం దున్నంతవఱకు రష్యనులకు పర్షియాలోగాని, కాకేససులోగాని బాధయే. దాదాపు 2 లక్షల తురుష్కసైన్య మీకోటలలో నుండెను. కాని 50,000 మంది యుండిన కాకేససులో ఎన్వరు పాషాగారి క్రింద రష్యనుల నోడింపఁబోయి నానానష్టములను 1 సం. క్రిందట పొందిరి. ఈ నష్టపూర్తికై అపక్వసైనికులను ప్రోగుచేసి కొంతముసంఖ్యను పూర్తిచేసిరి. ఉద్యోగులును అనుభవము లేనివారే. ఈ కోటలో 400 ఫిరంగు లుండవలసినది.



యంత్రఫిరంగిని గాల్చుచుండుట

200 పట్టుకే గలవు. అవియు చాలభాగము ప్రాతకవని యని ప్రతీతి. రష్యనుసైన్యములు కొంత క్రొత్తవయినను సం. క్రిందట తురుష్కుల నోడించిన రణవీరులే యందు గలరు. తరువాత ఆధునిక ఫిరంగులు, పరికరములు వారికి గలవు. తురుష్కులు ట్రెబిజాండు రేవునకు రష్యనులవలన త్రోయఁబడిరి. ఎర్జెరమునకు దక్షిణమున రష్యనులకు జయములు శీఘ్రముగా సమకూరినవి. ఖినిస్ అఖలాటులు ఫిబ్రవరి 16, 17, (1916) వ తేదీల నాక్రమించుకొనఁబడెను. వాన్ సరస్సుమీఁది ముష్ పట్టణము 20-వ తేదిని పడిపోయినది. అనేకులు ఖయిదీలు, యుద్ధపరికరములు చిక్కినవి. రష్యనులు ఎర్జెరము నాక్రమించుకొనుటయేగాక ఓడిపోయిన రష్యా సేనలు తిరిగి కలిసికొనకుండ చెల్లాచెదరుగాఁ గొట్టి ఆర్మీనియాలో తురుష్కసేనను నిర్మూలము చేసి నవారయిరి.

ట్రెబిజాండు మార్చి నెల కడపట ముట్టడింపఁబడెనది. ఈకోటయు పడినప్పుడు తురుష్కసైన్యములు రెండుగా చీలిపోవును. కాన్స్టాంటినోపిలుకు, ఇతర సైన్యములకు సంబంధ ముండదు. మెసపొటామియాలో పోరుచున్న సేన పూర్తిగా వేఱగును. అప్పుడు మెసపొటామియాలోని బగ్దాదు సులభముగా హైందో-ఆంగ్లసేనల వశము కావచ్చును.

## గలీషియా

నవంబరుమాసములో స్ట్రయిర్ మీఁద యుద్ధములు జరిగినతరువాత రష్యారంగమున నిరుకక్షులవారును డిసంబరు మాసాంతమువఱకును మంచువలన పోరక వీలయిన కొలఁదిని స్థానములను బలపఱచుకొనుచుండిరి. రష్యనులు డిసంబరు అంత్యమున జర్నోవిట్జుపయి కేగిరి. దీనికి ముందున్న రక్షకస్థానము జారేని ముందుగా పట్టుకొనఁబడినది. అంతట ఆస్ట్రో-జర్మనులు టోపోరుజ్, రారక్జ పంక్తు

లకు వెడలిపోయిరి. యుద్ధ మతిక్లిష్టముగా జరిగినను ఎవరి పై జయమును గాలేదు. అందుచే సమానబలము లున్న స్థలమును వదలి రష్యనులు మధ్యస్థమునకు ప్రారంభమునాటికి వెడలిరి. రష్యనులు



శత్రుసైనికులు రంపుగొనజాడుట

మందుగుండు సామాను లోటు తీరుటచేత విచ్చలవిడిగా షెల్లులను శత్రువులమీద విడిచి వారిని యూపిరాడకుండఁ జేసిరి. శత్రువులు స్ట్రయిక్ ఎడమభాగమునకు తోలివేయఁబడిరి.

జారుటోరిస్కు పడుట

జనవరి 7 వ తేదిని జారుటోరిస్కు పడిపోయినది జర్మనులు తక్షణమే తలపడి పట్టణమును మగుల ఆక్రమించుకొనిరి. 15వ తేదితో నీరంగమున పోరుముగిసినది. ఎప్పటియట్లే ఎవరికిని లాభము లేదు. అందఱికిని బోలెడు నష్టము సంభవించినది. ఫిబ్రవరినెలలో బుర్కనోల్, బుక్ జాకస్సు, యుసెయిజ్ స్కో, జలేస్ జైకి కోటలవద్ద దట్టముగా పోరుజరిగినది. జక్నోవిట్జు సామీప్యమునకు రష్యను సేనలు వచ్చినవి. నీష్టరునదీభాగములు పడకుండుటకయి ఆస్ట్రో-జర్మనులు భగీరథ ప్రయత్నములను జేసిరి. ఇచ్చట యుద్ధము రక్తపాతము తోగూడినది. ఆరష్యనుల కనుకూలముగనే యున్నది. రీగా మొదలు గలీషియావఱకును రష్యనులు మార్చినెల మధ్యనుండి అన్నిప్రదేశ ములలోను ముట్టడులను ప్రారంభించిరి. కొన్నిచోట్ల శత్రువులు పరుగెత్తుచున్నారు. మహాఘోరయుద్ధములు వేసంగిలోపల నిచ్చట జరుగవలసియున్నవి.

వెర్డనుయుద్ధము

జూలయిమాసము మొదలు జర్మనులు రష్యాను నోడించి చెన్నపురి రాజధానియంత రష్యనుదేశమును పోలండు దేశముతో సహా నాక్రమించుకొనిరి. సర్వియా, మాంటినీగ్రో, ఆల్బానియాలు వారి వశమయినవి. డార్డనల్సు ముట్టడిని మిత్రమండలి సంహరించు కొనిరి. బర్లిను మొదలు కాన్ స్టాంటినోపిలువరకును రయిలు నిరా టంకముగా సాగుచున్నది. శత్రుమండలి దేశముమీద గాక మిత్ర మండలి భూమిమీదనే యుద్ధము జరుగుచున్నది. కాని ఆంగ్లేయ నౌకాబలము గోనెలోవేసి జర్మనీని త్రొక్కినది. జర్మనీ వ్యాపా రము పోయినది. భోజనపదార్థములకు కఱవు హెచ్చయినది. జర్మనీ దివాలాస్థితిలో నున్నది. పరదేశములు ఒక్కపయిసయిన అప్పు నిచ్చుట లేదు. దేశములో ద్రవ్యము క్షీణించినది. ప్రజలు ఉన్న సొమ్ము నప్పుగా నిచ్చుట కొల్లకున్నారు. సైన్యములు నశించినవి. బాలురు ముసలివారు రణరంగమునకు పంపబడుచున్నారు. స్త్రీలకు పురు షుల పను లన్నియు నొప్పజెప్పబడినవి. ఇప్పటికి జర్మనులు వారివని బడాయి కొట్టుకొనినను వానివలన లాభము సమకూరలేదు. పేరిసు పడలేదు. ఇంగ్లండునకు జెప్పెనుల దాడివలన మృతినొందిదెబ్బలుతినిన 400 మనుజులు, కొంత ఆస్తి నష్టములెప్ప మరేగొప్ప దెబ్బయునుతగల లేదు. మిత్రమండలి సేనలు వృద్ధియగుచున్నవి. రష్యా ముఖ్యముగా తేరు కొనినది. యుద్ధపరికరములో ప్రవాహమువలె దొర్లుచున్నవి. ధనమా ఇంగ్లండు అను బంగారపుగని యున్నంతవరకు మిత్రమండలికి భయములేదు. కాబట్టి యుద్ధ మారంభమయిన 20 మాసముల నాటి



రష్యా కొసక్కు సైనికుడు

కంటె జర్మనీస్థితి యిప్పుడు శోచనీయముగా నున్నది. సంధియా, ఆమాటనే మిత్రమండలి తలపెట్టరు. అందుచే తిరిగి ఫ్రాంసునకు చావుదెబ్బకొట్టి, పేరిసును పట్టుకొని సంధిచేసికొనవలయునని జర్మ నులు ఎప్పుడుజేయని ప్రయత్నములను జేసిరి. వెర్డనువద్ద మహాఘోర యుద్ధము మార్చినెలయంతయు జరిగెను. జర్మనులకు స్థలము పడ లేదు. దాదాపు 3 లక్షల జనమును గోలుపోయిన తరువాత యుద్ధ తీక్ష్ణము తగ్గిపోయినది. ఈ యపజయముతో జర్మనిగతి పశ్చిమమున తేలిపోయినదని యూహింపబడుచున్నది.

### ఆరంభ ప్రయత్నము

పెద్దయుద్ధము నుపక్రమించుటకు ముందు శత్రువులతో వివిధ ప్రాంతములందు తలపడి వారి బలాబలములను జూచి చూచుట జర్మను వారు ప్రారంభించినయాచారము. వెర్డను యుద్ధమునకు పూర్వము జర్మనీ వారిట్లు చేసిచూచిరి. జనేవరి 10 వ తేదిని జర్మనీవారు షాంపేనులో ముట్టడి ప్రారంభించి ఫిబ్రవరి 21 వ తేదిని స్విడ్జర్లాండు మీదకు బడిరి. జనేవరి 10 వ తేది మొదలు ఫిబ్రవరి 21 వ తేది వరకు రణరంగమందలి వివిధస్థానములందు వారు ముట్టడించుచువచ్చిరి. ముందెట్లాగా శత్రువులతో తలపడవలసియున్నది. ఇప్పటినుండియు కొద్దిగనో గొప్పగనో తమ సైనికులకు అభ్యాసము కుదురుటకు కాళ్ళోలు, ఫ్లాండర్సు, ఆర్టోయి, సోము, ఎయిను, షాంపేను, మోసెలు, ఆల్సేసు ప్రాంతములందు యుద్ధము నుపక్రమించిరి. ఆయాప్రాంతములందు మిత్రమండలి బలాబలములను కనిపెట్టుటయు వారియుద్దేశమై యుండును. మన నిలువసైనికులను ఒకచోటే యుంచకుండ నాలుగువైపులకు పంపుదుము కదా యని వారూహించిన యూహించియుండవచ్చును. కాని ఈయెత్తులలో దేనినిచూచియు మనము మోసపోలేదు. ఆయాప్రాంతముల ముట్టడించినప్పుడు ఆయాప్రాంతము వారితోనే యెదిరించుచు వచ్చితిమి. కాని ఏదోమునిగినట్లు ఇతరచోట్లనుండి సైనికులను తెచ్చి సైనికపంక్తిని బలహీనపరచలేదు. మనకిప్పుడు మంచి యదను కాదు. కనుక వారిని తీవ్రముగ యెదిరించవలసినను యెదిరించలేదు. మేము నిలువసైనికులలో నొకరినైన కదిపిన పాపమున బోలేదు.



అయిదుగురు జర్మనుసైనికులను పొడిచిన చదుసేను కన్నరమణి ఫరాసు వనిత

### వెర్డనుయుద్ధము

అన్నిసన్నాహము లైనతరువాత వెర్డను యుద్ధమునందు మొదటిరంగము ప్రారంభమైనది. "కోటుడి-మ్యూసు" అను ప్రదేశమున ఫరాసుసేన లున్నవి. ఇది చాల ముఖ్యస్థానము. ఈ సంగతిని జర్మను లెరుగకపోలేదు. వారికి పూర్తిగ తెలియును. ఫరాసుసేన లక్కడ యున్నందునకు జర్మనీవారికి చాల కష్టముగనున్నది. మనమక్కడనుండి ఏమాత్రము ముందుకు పోయినను జర్మనులకు విఘ్నమగును. అదిగాక, బ్రీబంటునకు ఉత్తరభాగముననున్న ఫరాసు సైనికపంక్తి పెట్టనికోటవలెనున్నది. దుర్భేద్యము. కందకములు త్రవ్వుకొని యుద్ధముచేయునప్పుడు శత్రువు తన కెదురుగ దుర్భేద్యమైన ప్రదేశమందుండుట యొప్పుకొనడు. ఫిబ్రవరి 21-వ తేది జర్మను వైమానికులు ఫరాసువారికి ఎంత నిలవసేనయున్నది తెలిసికొని బార్లీదకుకిని సీలమీద బాంబులను వేసిరి. జర్మనులు బోలెడుఫిరంగులను తెచ్చిరి. మరునాడు ఫిరంగులను బారుచేసి బ్రహ్మాండముగ అగ్నివర్షము కురిపించిరి. అప్పుడు బ్రాబంటు, హెర్బిబోలయధ్య పెట్టనికోటలవలె నున్నదని పైనితెలిపిన ప్రదేశము మీద జర్మనులు పడిరి. మొదటిదెబ్బతో వారికి హామాసుంటు ఆపీలిలుచేకులలో బడినవి. మరునాటి రాత్రి యెడతెరపిలేకుండ పదాతిసేన డీకొనుచు వచ్చెను. మలనకోర్టు మొదలు ఈటనువరకును పాతిక మైళ్లదూరము. ఈ పాతికమైళ్ల ప్రదేశముమీదను ఫిబ్రవరి 23 వ తేదిని జర్మనులు పెద్దపెద్ద ఫిరంగులతో నగ్నివర్షము కురిపించిరి. జర్మనులు ముందుకురాకుండ ఫరాసువారు దిట్టముగ నివారించి, హామంటుగ్రామమును వాళ్ళిలుఆడవిని వారు వదలివేసిరి. వెర్డనుకు ఉత్తరభాగమున నున్న సైనికపంక్తిమీద జర్మనులు ఫిరంగిగుండ్లవర్షమును కురిపించి పదేపదే యెదిరించిరి. ఒకపటాలమును ఊచకోత కోసినట్లు నాశనముచేసిన ఇంకొకపటాలము వచ్చిపడుచుండెను. కాని ఫరాసు సేనలు శౌర్యధైర్యములతో నిలువబడి జర్మనులు కూర్యుఆడవిని తీసికొనినతరువాత వారి చేతులనుండి తిరిగి కొంతభాగమును పట్టుకొనిరి.

ఫిబ్రవరి 23 వ తేది సాయంకాలమున జర్మనులు తిరిగి క్రొత్తసైనికులను తీసికొనివచ్చి రాత్రి తలపడిరి. మరునాడు ఫిరంగులవర్షము ద్విగుణీకృతమైనది. దీనిని సందుచేసికొని జర్మను పదాతిసేన ప్రాణములకు తెగించి తెరపిలేకుండ ముట్టడించెను. మ్యూజునది మొదలు, ఫ్రోము తేవరకునున్న ప్రదేశమంతయు ధగధగాయమానముగ మండుచుండెను. సామెనో బీమంటులను ముట్టడించినప్పుడు రక్తధారలు వర్షించినవి. జర్మను లెంతరక్తమును ధారపోసినను అడుగుముందుకు వేయలేదు, ఫరాసువారు వెనుకకు గొట్టుచుండిరి. జర్మనుసైనికులు వచ్చి కుప్పలు తిప్పలుగ పడుచుండిరి. కాని జర్మనుఫిరంగులనుండి హోరుమని వర్షించినట్లు గుండ్లుపడుటచేత, బ్రాబంటును వదిలిపెట్టవలసివచ్చినది. సాయంకాలమునకు ఫరాసుసేనాపంక్తి సామెనోకు దక్షిణపుకొండలు మొదలు ఆర్నీసునదివరకును వ్యాపించియుండెను. జర్మనులు బోలెడుమందిని బలిఇచ్చి బ్రాబంటు, హామంటు, సామోనా గ్రామము, బీమంటుకు ఉత్తరముననున్న అడవిప్రాంతమును పొందగలిగిరి.

ఫిబ్రవరి 24 వ తేది రాత్రి పదాతిసేన ముట్టడించలేదు. ఆ నాడు దట్టముగ మంచుపడినది. కాని తెల్లవారినతరువాతి యుద్ధము

తిరిగి జోరైనది. ఇదివరకు కప్పబడికొంటెను జర్మనులు, వేగముగను తీవ్రముగను ఫిరంగులను ప్రేల్చిరి. తుపానువలె మంచు కురియుచున్నను పరాసువారు జర్మనులు మీదకు కొండమీద పడినప్పుడు వెనుకకు గొట్టుచు వచ్చిరి. అగ్నిసహ దక్షిణము కొండలు మొదలు వెనుక కొంచెము తూర్పువరకును సాయంకాలము పరాసుసేనలు వ్యాపించియుండెను. శుక్రవారము రాత్రి యుద్ధముజరిగినట్టు లేదు. ఫిబ్రవరి 26 వ తేదీ శనివారము ఉదయమున తిరిగి యుద్ధము ప్రారంభమైనది. ప్రతిసారియు చాలనష్టముతో జర్మనీవారిని వెనుకకు గొట్టుచుండిరి. తీరకు బయలునందలి పరాసువారి మొదటి కందక [illegible] సను సైనికులు వదలిపెట్టి మ్యూజుకొండలలోని కందకము లాక్రమించుకొనవలసి వచ్చినది. డూయెంటుకోటను జర్మనుల 24 వ బ్రిగేడు బర్గు రెజిమెంటు ఎందరికో బలియిచ్చి పట్టుకొనలేక చివరకు [illegible] ఉదయమున పట్టుకొనినది. [illegible] జర్మనులు దానిని తాము కాపాడుకొనుచున్నామని చెప్పుచున్నారు.



సైనికులు కందకములనుండి విశ్రాంతి కయి తరలిపోవుట

ముగింపు

వెర్డను యుద్ధమునకు జర్మనులు 25 డివిజనులను తీసికొని వచ్చియుందురు. బోలెడు ఫిరంగులు కూడ వచ్చినవి గనుక వాను బెల్లనుగారిక్కడ నాయకత్వము వహించియుందురు. పడమటి రంగమున జర్మను సేనలు 118 డివిజను లుండవచ్చును. పదాతిసేన 14 లక్షలమంది యుందురు. బహుశః దీనికి కొందరు తగ్గినను తగ్గవచ్చును. ప్రజలు రాజనీతిజ్ఞుల ఒత్తిడిని పాటించి, తొందరపడి తగినయదను రానిదే పరాసువారు తిరిగి జర్మనులను డీకొనకూడదు. పరాసురిజర్వ్ సేనలలోని ఒకపిట్టసైనము ఇదివరకుకూడ పిరోలేదో సంశయము. మ్యూజు వద్దనున్న రిజర్వు సైనికులు అక్కడ కాచుకొనుటకు చాలుదురని మేము విశ్వసించుచున్నాము. జర్మనులను ఊరక పుర్రెలు బ్రద్దలు కొట్టుకొని బలహీనులు కానిండు! మనకువచ్చిన భయమేమి? వారి పని చప్పబడినతరువాత మనము వారిపని పట్టవచ్చును. అని లండను టైమ్సుపత్రిక యొక్క విలేఖరి వ్రాసియున్నాడు. వర్డనుయుద్ధము 40 దినములు జరిగినది. పట్టణము పడలేదు. జర్మనులు ప్రయత్నమును మానిరి.

# ఆంధ్రదేశ గ్రంథాలయ పట్టిక

## కృష్ణా జిల్లా

| సంఖ్య | గ్రంథాలయనామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 1 | రామమోహన ధర్మపుస్తకభాండాగారము | బెజవాడ | బెజవాడ | అయ్యంకి వేంకటరమణయ్యగారు |
| 2 | స్టూడెంట్సు సెల్ఫు ఇంప్రూవింగు సొసైటీ | ,, | ,, | జి. నాగేశ్వరరావుగారు |
| 3 | శ్రీ శంకర గ్రంథనిక్షేపము | ,, | ,, | చెరుకుపల్లి బుచ్చి రామయ్యగారు |
| 4 | ఆంధ్రభాషాభ్యాస జ్ఞానోదయానంద పుస్తకభాండాగారము | వల్లూరుపాలెం | ,, | బండి వెంకటకృష్ణయ్యగారు |
| 5 | ఆంధ్రవిజ్ఞాన పుస్తకభాండాగారము | కొలయ్యూరు | ,, | చిగురుపాటి వెంకటసుబ్బారావుగారు |
| 6 | శారదావిద్యానిలయము | తోట్లవల్లూరు | ,, | రాయప్రోలు చలపతిగారు |
| 7 | సత్యనారాయణ వరప్రసాదక్లబ్ | బొడ్డపాడు, | ,, | కస్తూరి వెంకటనరసింహారావుగారు |
| 8 | సాధనాశ్రమభాండాగారము | పడమటలంక | ,, | నారిశెట్టి హనుమయ్యగారు |
| 9 | శ్రీరామమోహన ధర్మపుస్తకభాండాగారము | ,, | ,, | కొమ్మ సీతారామయ్యగారు |
| 10 | శ్రీ సీతారామవిలాస విద్యానిలయము | పోరంకి | ,, | కొప్పరపు వేంకటరమణయ్యగారు |
| 11 | కారా సేవక రీడింగురూము | ఈడుపుగల్లు | ,, | కిష్టాల సూర్యనారాయణశాస్త్రిగారు |
| 12 | రామకృష్ణ పఠనమందిరము | ఇంద్రాజవరము | తిరువూరు | అన్నదేవర నాగభూషణరావుగారు |
| 13 | సుబ్బారాయ గ్రంథాగారము | సిద్ధాంతము | ,, | వి. నందీశ్వరరావుగారు |
| 14 | వివేకానంద పఠనమందిరము | పడమటివిప్పర్రు | ,, | పసుల రామమూర్తిగారు |
| 15 | రామమోహన్ పుస్తకభాండాగారము | ఇంగుటూరు | ,, | తిల్లాప్రగడ నరసింహశర్మగారు |
| 16 | కాగుపాడు పుస్తకభాండాగారము | కాగుపాడు | ,, | కడియాల సుబ్బారాయుడుగారు |
| 17 | దయానందసరస్వతీ పఠనమందిరము | కాకర్లమూడి | ,, | మామాప్రగడ వెంకటరత్నంగారు |
| 18 | సరస్వతీనిలయభాండాగారము | పోలమూరు | ,, | కొత్తపల్లి నరసింహంగారు |
| 19 | పంచమజార్జి పఠనమందిరము | ఆరవిల్లి | ,, | వెలగల వెంకటరెడ్డిగారు, కల్వగుంట శేషాచార్యులుగారు |
| 20 | జ్ఞానోదయ స్త్రీసమాజము | తిరువూరు | ,, | జాలూరి తులశమ్మగారు |
| 21 | బాలసరస్వతీ పుస్తక భాండాగారము | అంగలూరు | గుడివాడ | దుగ్గిరాల పూర్ణయ్యగారు |
| 22 | మేరీ పుస్తక భాండాగారము | ,, | ,, | 1 అట్లూరి వేంకటశీతమ్మగారు<br>2 పొట్లూరి వీరమ్మగారు |
| 23 | ఇ.ఎమ్.ఎ.ఎల్. విద్యాలయ పుస్తకభాండాగారము | కొత్తవరము | ,, | చెరుకువాడ వేంకట నరశింహ్మంగారు |
| 24 | బాలభారతీ పుస్తకభాండాగారము | పామర్రు | ,, | తుర్లపాటి హనుమంతరావుగారు |
| 25 | శ్రీనివాస పుస్తకభాండాగార స్త్రీసంఘము | గురుజ | ,, | కామినేని అన్నమ్మగారు |
| 26 | హనుమంతఫ్రీరీడింగు రూము | ,, | ,, | దేవరకొండ శీతారామయ్యగారు |
| 27 | పఠనమందిరము | పసుమఱ్ఱు | ,, | బూరుగుల పూర్ణయ్యశర్మగారు |
| 28 | వీరేశలింగకవి సమాజము | కుముదవల్లి | భీమవరము | భూపతిరాజు తిరుపతిరాజుగారు |
| 29 | శ్రీపోతన పుస్తకభాండాగారము | నిడుమర్రు | ,, | నిడమర్తి గుర్రాజుగారు |
| 30 | గోపాలకృష్ణగోఖలె క్లబ్బు | అగ్రహారగోపవరం | ,, | ఆత్మకూరి రామానుజాచార్యులుగారు |
| 31 | వుండి నవురోజక్లబ్బు | వుండి | ,, | కూనపరాజు పెదరామరాజుగారు |
| 32 | హిందూయువజన సమాజము | ఏలూరు | ఏలూరు | దుగ్గిరాల సుబ్బారావుగారు |
| 33 | వివేకానందక్లబ్బు | దెందులూరు | ,, | మొటుపర్తి చినవెంకయ్యగారు |
| 34 | శ్రీకృష్ణాపఠనమందిరము అను శ్రేయోభివర్ధని సంఘము | గుండుగొలను | ,, | కొండ సుబ్బరాజుగారు |
| 35 | యంగుమెన్సు ఫ్రెటర్నిటీ | మచిలీపట్టణము (ఈడేపల్లి) | బందరు | దెయితా శ్రీరాములుగారు |

| సంఖ్య | గ్రంథాలయనామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 36 | కమ్మ విద్యార్థి సంఘము | మచిలీపట్నము (బచ్చుపేట) | బందరు | 1 యెలమంచి వెంకయ్యగారు<br>2 దాసరి లక్ష్మీనారాయణగారు |
| 37 | బృందావనపుర స్త్రీసమాజము | మచిలీపట్నము | ,, | మోటుపల్లి రాజారాయమ్మగారు |
| 38 | శ్రీ ఆంధ్రవిద్యాభివర్ధనీ పుస్తకభాండాగారము | దొడ్డపట్ల | కైకలూరు | కోళ్లపర్తి సుబ్బారావుగారు |
| 39 | శ్రీకృష్ణాంధ్ర పుస్తకభాండాగారము | వెంకటాపురము | ,, | గుడిపాటి నరసయ్యగారు |
| 40 | రామమోహన్ క్లబ్బు | పాలకొల్లు | నర్సాపురం | ఆత్యం వేంకటరామచంద్రరావుగారు |
| 41 | శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర విలాససభ | ఐదుపూడి | ,, | సెక్కంటి సత్యనారాయణమూర్తిగారు |
| 42 | శ్రీరామచంద్రాంధ్ర గ్రంథాలయము | పోడూరు | ,, | మద్రరాజు నరసింహరాజుగారు |
| 43 | శ్రీరామమోహన పుస్తకభాండాగారము | ఘంటశాల | అవనిగడ్డ | గొర్రెపాటి వేంకటేశ్వర్లుగారు |
| 44 | జ్ఞానప్రసాదినీ పుస్తకభాండాగారము | నాగాయతిప్ప | ,, | కంఠంనేని శివరామయ్యగారు |
| 45 | దుర్గానాగేశ్వర భాండాగారము | పెదకళ్లేపల్లి | ,, | కొడాలి సత్యనారాయణరావుగారు |
| 46 | శ్రీపత్రనాలయము | తాళ్లపూడి | ఎర్నగూడెం | యేలూరుపాటి రామభద్రచయనులుగారు |
| 47 | యువజనసంఘము | తాడంకి | నూజివీడు | వెంపటి వెంకటేశ్వరరావుగారు |
| 48 | శారదా పుస్తకభాండాగారము | నందిగామ | నందిగామ | పండితారాధ్యుల విశ్వనాథంగారు |

## గుంటూరు జిల్లా

| సంఖ్య | గ్రంథాలయనామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 49 | యంగు మెన్సు లిటిరరీ అసోసియేషను | గుంటూరు | గుంటూరు | ఆర్. ఎల్. సోమయాజి గారు. బి. ఏ., బి. ఎల్. |
| 50 | త్రికల్యాణ విద్యానిలయము | ,, | ,, | వావిలాల సూర్యనారాయణ గారు |
| 51 | స్టూడెంట్సు లిటిరరీసొసైటీ | ,, | ,, | టి. చంద్రమౌళీశ్వర రావుగారు |
| 52 | వనితాగ్రంథమండలి | ,, | ,, | పాలపర్తి రామమూర్తిగారు |
| 53 | స్త్రీసనాతన ధర్మమండలి | గుంటూరు (అరండల్ పేట) | ,, | ఇప్పగుంట వేంకమాంబగారు |
| 54 | జ్ఞానప్రసాదినీ పుస్తకభాండాగారము | యేటుకూరు | ,, | నిశ్శంకరావు నాగయ్యగారు |
| 55 | శ్రీసరస్వతీ గ్రంథనిలయము | లాలుపురం | ,, | పెదమల్లు సూర్యనారాయణగారు |
| 56 | వివేకవర్ధని | అవంతి వరప్పాటి అగ్రహారం | ,, | మూలుపూరి చిదంబరరావు గారు |
| 57 | శ్రీజార్జి ధర్మపఠనమందిరము | తెనాలి | తెనాలి | చిన్నకోట వెంకటరంగారావుగారు, బి. ఏ, [యల్. టి. |
| 58 | యంగ్ మెన్సు ప్రోగ్రెసివు యూనియను | ,, | ,, | యం. వి. యల్. నరసింహారావుగారు |
| 59 | కమ్మవిద్యార్థి సంఘము | ,, | ,, | మల్లేపద్ది శ్రీకృష్ణన్ గారు |
| 60 | ఆనందభాండాగారము | ,, | ,, | కర్లపాలెం వేంకటనారాయణప్పగారు |
| 61 | సనాతన శైవమహాసమాజము | ,, | ,, | ములుగు కోటయ్యగారు |
| 62 | శ్రీయుభయ భాషాసంజీవినీసంఘము | అమృతలూరు | ,, | నాగలింగం రాఘవశర్మగారు |
| 63 | శ్రీభారతీవిలాస విద్యానిలయము | అనంతవరము | ,, | కుప్పా శ్రీ రామశర్మగారు |
| 64 | శ్రీనివాస సమాజము | ఈమని | ,, | అంచే శివయ్యగారు |
| 65 | శ్రీసనాతన శైవసమాజము | ,, | ,, | శ్రీపండితారాధ్యుల నాగలింగశాస్త్రిగారు |
| 66 | భాషాభిలాషిణీ సంఘము | దుగ్గిరాల | ,, | సత్తెనపల్లి హనుమంతరావుగారు |
| 67 | విద్యార్థిబృందము | కొల్లూరు | ,, | నేతి సీతారామయ్యగారు |
| 68 | కీడింగుక్లబ్బు | ,, | ,, | డి. పురుషోత్తంగారు |
| 69 | విశ్వబ్రాహ్మణ బాలసమాజము | ,, | ,, | కుందేపు వెంకటసుబ్బయ్యగారు |
| 70 | బాలసమాజము | పెదరావూరు | ,, | కోపూరి సీతారామయ్యగారు |
| 71 | విద్యాభిలాషిణీసంఘము | మోరంపూడి | ,, | కొంగర బ్రహ్మానందంగారు |
| 72 | సరస్వతీనిలయము | కూచిపూడి | ,, | అక్కపెద్ది రామకోటిశాస్త్రిగారు |
| 73 | బాలుర విద్యాభివర్ధనీ సమాజము | కుంచవరము | ,, | పిల్లుట్ల లక్ష్మీనరసింహంగారు |
| 74 | జ్ఞానప్రవర్ధనీ సమాజము | ఈపూరు | ,, | అమ్మిరాజు హనుమంతరావుగారు |
| 75 | సుజనవిధేయ సమాజము | గ్రాప | ,, | గొడవర్తి జగ్గయ్యగారు |

| సంఖ్య | గ్రంథాలయనామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 76 | ఆర్య బాలసమాజము | పెదపాలెము | తెనాలి | పుతుంబాక నర్సయ్యగారు |
| 77 | భారతీనిలయము | మునిపల్లె | బాపట్ల | చిల్లర సాంబయ్యగారు |
| 78 | ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము | మన్నవ | ,, | మన్నవ వెంకటకృష్ణయ్యశర్మగారు |
| 79 | పత్రికాపఠన మందిరము | ఈపూరు | ,, | బెండపూడి గురవయ్యగారు |
| 80 | హిందూవిద్యార్థుల భాండాగారము | ఒంగోలు | ఒంగోలు | ఎస్. వి. నారాయణశర్మగారు. |
| 81 | శ్రీ సి. వి. ఎస్. లైబ్రరి అండు రీడింగురూం | ,, | ,, | యస్. నరసింహంగారు, బి.ఏ. ఎల్ టి., |
| 82 | రామమోహన ధర్మపుస్తకభాండాగారము | గుత్తికొండ | పల్నాడు | అక్కిరాజు వాసుదేవరావుగారు |
| | **గోదావరి జిల్లా** | | | |
| 83 | శ్రీవీరేశలింగ పుస్తకభాండాగారము | రాజమహేంద్రవరము | రాజమహేంద్రవరము | కోరుకొండ లింగమూర్తిగారు |
| 84 | శ్రీవసురాయ పుస్తకభాండాగారము | ,, | ,, | అద్దంకి సత్యనారాయణశర్మగారు |
| 85 | హిందూబాల సమాజము | ,, | ,, | ఇలపకుర్తి గవర్రాజుగారు |
| 86 | శ్రీసరస్వతీవిలాస పుస్తకభాండాగార సమాజము | నర్శిపూడి | రామచంద్రపురం | 1 చేంబ్రోలు పట్టాభిరామయ్యగారు<br>2 మద్దూరి సుబ్బారావుగారు |
| 87 | శ్రీసీతారామ పుస్తకభాండాగారము | మండపేట | ,, | దంటు కృష్ణమూర్తిగారు |
| 88 | సంఘమేశ్వర పుస్తకభాండాగారము | ఏడిద | ,, | పెంట్యాల రామచంద్రరావుగారు |
| 89 | శ్రీసద్ధర్మవర్ధనీ పుస్తకభాండాగారము | వెలగతోడు | ,, | అవసరాల బుల్లిశేషయ్యగారు |
| 90 | జ్ఞానసూర్యోదయ పుస్తకభాండాగారము | జమీందారీ మేడపాడు | ,, | సత్యవోలు రామారావుగారు |
| 91 | శ్రీ మనోరంజన పుస్తకభాండాగారము | కల్లూరు | ,, | పోరంకి కామేశ్వర సోమయాజులుగారు |
| 92 | సనాతనధర్మసభ | వెదురుపాక | ,, | అప్పలకనకయ్యగారు |
| 93 | సరస్వతీనిలయము | తేకి | ,, | మామిళ్లపల్లి వేంకటరత్నంగారు |
| 94 | శ్రీలక్ష్మీనరసింహ పుస్తకభాండాగారము | పెదపళ్ల | ,, | 1 పెదపాటి రామచంద్రుడుగారు<br>2 దిగుమర్తి వెంకటరత్నంగారు |
| 95 | శ్రీబాలసరస్వతీ పుస్తకభాండాగారము | చోడవరము | ,, | చిక్కాని వెంకట్రత్నముగారు |
| 96 | హితార్థదాయినీ సమాజము | కపిలేశ్వరము | ,, | 1 మేకా జానకిరామయ్యగారు<br>2 క్రొవ్విడి శేషవెంకట కాశీపతిగారు |
| 97 | శ్రీకృష్ణదేవరాయల పుస్తకభాండాగారము | అమలాపురం | అమలాపురం | కొత్తూరి సుబ్బయ్య దీక్షితులుగారు |
| 98 | వివేకోదయ పుస్తకభాండాగారము | ముంగొండ | ,, | మహీధర సూర్యనారాయణగారు |
| 99 | గజానన పుస్తకభాండాగారము | ,, | ,, | పుల్య వెంకట సూర్యనారాయణ సోమయాజులు [గారు |
| 100 | బ్రహ్మానంద పుస్తకభాండాగారము | కొత్తలంక | ,, | 1 కొడమర్తి కామేశ్వరావధాని శర్మగారు<br>2 నండ అప్పారావుగారు |
| 101 | శ్రీసరస్వతీ పుస్తకభాండాగారము | గంటిపెదపూడి | రాజవోలు | కాట్రావులపల్లి రామమూర్తిగారు |
| 102 | సరస్వతీనికేతనము | వానపల్లి | ,, | అయ్యల సోమయాజుల విశ్వనాథంగారు |
| 103 | ఆంధ్రభారతీ పుస్తకాలయము | పలివెల | ,, | బొమ్మగంటి కృష్ణమూర్తిగారు |
| 104 | శ్రీవాణీనికేతనము | దుమ్ముగూడెం | భద్రాచలం | లగడపాటి వెంకట నాగభూషణంగారు |
| 105 | శ్రీసత్యపరమార్థప్రదాయినీ సంఘము | ,, | ,, | మహమ్మద్ మసూదం సాహేబుగారు |
| 106 | శ్రీ కన్యకాపరమేశ్వరీ గ్రంథనిలయము | ,, | ,, | శివ్వా పిచ్చయ్యగారు |
| 107 | శ్రీకల్పవల్లీ గ్రంథనిలయము | భద్రాచలం | ,, | శఠగోపము రామానుజాచార్యులుగారు |
| 108 | లక్ష్మీవిలాససంఘము | పెద్దాపురం | పెద్దాపురం | తేజోమూర్తుల అప్పన్నగారు |
| 109 | సత్యదేవమనోల్లాసినీ సమాజము | అరెంపూడి అన్నవరము | ,, | చాగంటి కామరాజుగారు |

| సంఖ్య | గ్రంథాలయము నామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 110 | కర్లమ్ముల క్లబ్బు | రవ్వతులపూడి | పెద్దాపురం | గోటేటి వెంకటరత్నంగారు |
| 111 | సర్వజనగ్రంథాలయము, ధర్మపరిపాలనమందిరము | కాకినాడ | ,, | పాలపర్తి నరసింహంగారు |
| 112 | కాకినాడ స్త్రీ ప్రార్థనాసమాజము | ,, | ,, | కుప్పలూరి నాగరత్నమ్మగారు |
| 113 | విద్యాభివర్ధనీ పుస్తకభాండాగారము | గొల్లప్రోలు | ,, | పెద్దాడ గంగరాజుగారు |
| 114 | రామానుజ పుస్తకభాండాగారము | తుని | ,, | కొండపల్లి జగన్నాథరావుగారు |
| 115 | శ్రీవాణీపుస్తకభాండాగారము | పోలవరం | పోలవరం డివి | మంత్రిప్రగడ పేరరాజారావుగారు |
| 116 | ఆంధ్రకవితా విద్యార్థి మండలి | పిఠాపురం | ,, | పెమ్మరాజు చిన్నమరాజుగారు |
| 117 | ఆంధ్రభాషాప్రవర్ధనీ పుస్తకప్రకాశనశాల | సికిందరాబాదు | నైజాం రా[illegible] | భాగి సుబ్రహ్మణ్యముగారు |
| 118 | ఆంధ్రకల్పవల్లీ ధర్మపుస్తకశాల | ,, | ,, | టి. సి. కుప్పారామయ్యగారు |
| 119 | సంస్కృతకళాసంవర్ధనీ | ,, | ,, | నాగం కృష్ణారాయశర్మగారు |
| 120 | శ్రీసరస్వతీ సమాజము | ,, | ,, | గాదిరెడ్డి రామస్వామి నాయుడుగారు |
| 121 | హిందూయువజనసంఘము | ,, | ,, | వేటేటి నరసింహారావుగారు |
| 122 | శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము | హైదరాబాదు | ,, | కర్పూరం పార్థసారథినాయుడుగారు |
| 123 | శ్రీబాలభారతీనిలయ ఆంధ్రభాషాభివర్ధనీ సంఘము | శంషాబాదు | ,, | తుమ్రి నారాయణరావుగారు |
| 124 | శ్రీరాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయము | హానుమకొండ | ,, | రామ కోటేశ్వరరావుగారు |
| 125 | శ్రీవిరాట్రాయాంధ్ర భాషానిలయము | నీలకొండపల్లి | ,, | గండ్లూరు శ్రీరామరావుగారు |
| 126 | శ్రీమనోమోహన ఆంధ్రపుస్తకాలయము | వడ్డేపల్లి | ,, | ధండాల మల్లికార్జునరావుగారు |
| 127 | మహాబూబియా ఆంధ్రభాషానిలయము | ఎర్రుపాలెము | ,, | జములాపురపు వెంకటరామారావు దేశపాండ్యా [గారు |
| 128 | శ్రీజ్ఞానవిద్యుత్ప్రవాహినీ ఆంధ్రభాషానిలయము | ఖమ్మంమెట్టు | ,, | కల్వల వెంకట రమణారావుగారు |

## నెల్లూరు జిల్లా

| సంఖ్య | గ్రంథాలయము నామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 129 | (1) తిక్కన పుస్తకభాండాగారము | నెల్లూరు | నెల్లూరు | రేబాల సుబ్బారాయుడుగారు బి.యే.బి.యల్., |
|  | (2) కారొనేషన్ లైబ్రరీ |  |  | మాడభూషి నరసింహాచార్లుగారు బి.యే. బి.యల్, |
| 130 | శ్రీజ్ఞానోదయసమాజము | ,, | ,, | యన్. నాగరాజరావుగారు |
| 131 | విద్యార్థులసంఘము | ,, | ,, | బి. జె. ప్రసాదరావుగారు |
| 132 | యువజనసమాజము | ,, | ,, | నాగరాజు పిచ్చయ్యగారు |
| 133 | సరస్వతీ సమాజము | ,, | ,, | శ్రీపతి మునుస్వామిరావుగారు |
| 134 | సుజనరంజనీ సమాజము | పోట్లపూడి | ,, | పొణకా పట్టాభిరామయ్యగారు |
| 135 | కార్నేషను క్రీడింగురూము | బుచ్చిరెడ్డిపాలెం | కావూరు | దొడ్ల బలరామిరెడ్డిగారు |
| 136 | పోతన పుస్తకభాండాగారము | ఇందుపూరు | ,, | విశ్వా శేషగిరిరావుగారు |
| 137 | శ్రీరాజారామమోహనరాయి క్రీడింగురూము | గండవరం | ,, | సర్వాభట్ల గోపాలకృష్ణగారు |
| 138 | ఆంధ్రపుస్తక భాండాగారము | ఉలవపాడు | కందుకూరు | యన్. వెంకటసుబ్బయ్యగారు |

## విశాఖపట్నం జిల్లా

| సంఖ్య | గ్రంథాలయము నామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| 139 | బాల విద్యాభివర్ధనీ సమాజము | మృత్యుంజయ నగరము | పార్వతీపురం | దేవరాజు సీతారామస్వామి పంతులుగారు |
| 140 | ఆంధ్రగ్రంథ భాండాగారము | రాయవరము | సర్వసిద్ధి | నేమాని జగన్నాథంగారు |
| 141 | శ్రీసుజనాకర్షణాంధ్ర పుస్తకభాండాగారము | ఎలమంచిలి | ,, | అయ్యగారి పొచ్చన్నశర్మగారు |
| 142 | శ్రీశారదలాడ్జి [ము | మాడుగల | వీరవల్లి | పి. సోమన్న శెట్టిగారు |
| 143 | ప్రాగ్రెసివ్ యూనియన్ స్త్రీ పుస్తకభాండాగార | విజయనగరము | విజయనగరం | లింగం వెంకటసుబ్బారావుగారు, బి.ఏ., |
| 144 | శ్రీరామతీర్థ గ్రంథనికేతనము | విజయనగరము (రామతీర్థము) | ,, | 1. కల్వపూడి రంగాచార్యులుగారు, 2. తిరుమల పళ్లేర్లమూడి రామానుజస్వామిగారు |
| 145 | సింహాచలపతిరావు లైబ్రరీ | ,, | ,, | వంగవోలు పట్టాభిరామమూర్తిగారు, బి. ఏ., |
| 146 | సత్యసంవర్ధనీ సమాజము | ,, | ,, | గుండాల సుభద్రమ్మగారు |

| సంఖ్య | గ్రంథాలయనామము | గ్రామము | తాలూకా | కార్యదర్శి పేరు |
|---|---|---|---|---|
| | **గంజాం జిల్లా** | | | |
| 147 | ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము | బరంపురం | బరంపురం | రాయప్రోలు సూర్యనారాయణమూర్తి గారు |
| 148 | యంగుమెన్సు లైబ్రరీ అండు అసోసియేషను | ,, | ,, | మొసలికంటి రామమూర్తి గారు; గాదె బలరామదాసుగారు |
| 149 | రాజ్యలక్ష్మీ తెనుగుపుస్తక భాండాగారము | ,, | ,, | కొండ విజయలక్ష్మీభాయిగారు; దామెర్ల భ్రమరాంబగారు |
| 150 | సుజనానుమోదినీ పుస్తక భాండాగారము | హీరమండలము | పర్లాకిమిడి | పార్నండి సత్యనారాయణమూర్తి గారు |
| 151 | శ్రీకృష్ణదేవరాయ గ్రంథభాండాగారము | బారువ | సోంపేట | తిత్తి జానకిరామయ్యగారు |
| 152 | జ్ఞానానందవర్ధినీ సమాజము | రంభ | బిండి | పద్మచరణ పట్నాయకులుగారు |
| | **కడప జిల్లా** | | | |
| 153 | శ్రీరామకృష్ణపరమహంస మెమోరియల్ రీడింగురూము. | కడప | కడప | యన్. నరసింహారావు పంతులుగారు |
| 154 | ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము | ప్రొద్దుటూరు | ప్రొద్దుటూరు | డి. రాజశేఖరంగారు |
| 155 | సరస్వతీవిలాసమందిరము | పులివెందుల | పులివెందుల | గాడిచర్ల వెంకటరావుగారు |
| | **కర్నూలు జిల్లా** | | | |
| 156 | ఆంధ్రశారదానిలయము | నంద్యాల | నంద్యాల | దేశపాండ్య సుబ్బారావుగారు, బి. ఏ., ప్రధానకార్యదర్శి; కా. నరసింగరావుగారు, సహాయకార్యదర్శి |
| 157 | శ్రీకృష్ణ పుస్తకభాండాగారము | జొకు | కోయిలకుంట్ల | వావిలాల అప్పయ్యశాస్త్రిగారు |
| | **బళ్ళారి జిల్లా** | | | |
| 158 | మిత్రమండలి | బళ్లారి | బళ్లారి | కె. శింగరాచార్లుగారు |
| 159 | మారుతీవిలాసాత్మక పుస్తకభాండాగారము | కుడుతని | కుడుతని | బి. కె. బాలాజీరావుగారు |
| | **అనంతపురం జిల్లా** | | | |
| 160 | సాధుజనసమాజ గ్రంథభాండాగారము | వరదాయపల్లె | తాడిపత్రి | రత్నాకరం గంగరాజుగారు |
| | **సేలం జిల్లా** | | | |
| 161 | ఆనందమందిర గ్రంథాలయము | కొరటగిరి (వెంకటగిరికోటపోస్టు | హోసూరు | కారుపల్లి శివరామయ్యగారు |
| 162 | సనాతన ధర్మబోధినీసభ | కెలమంగలం | కెలమంగలం | కే. వేంకటాచార్యగారు |
| 163 | తెలుగురీడింగురూము అండు లైబ్రరీ | నాగపురము | నాగపురము | రేకపల్లి అష్టభుజంగముగారు |

## క్షమాపణ

ఆంధ్రప్రతిష్ఠాపనల చరిత్రలు సమగ్రముగ సకాలమున రాకపోవుటచేతను, ఇప్పటికే ఈ సంచిక ఒకటిన్నఱ సంచికగా పెరుగుటచేతను, సంవత్సరాదినాడే సంచికను ప్రకటింపవలె ననెడి పూనికచేతను, ఈసంవత్సరము మొదట నుద్దేశించిన ప్రకారము సంచికలో ఆంధ్రసంస్థల చరిత్ర ప్రకటింపఁజాలనందులకు చింతిల్లుచున్నారము. పాఠకులును, విలేఖకులును ఉదారహృదయులై క్షమింతురుగాక ! — సంపాదకుడు.

# ఆకస్మిక సమావేశము

కాళ్లకూరి గోపాలరావు గారు

ఒకనాఁ డేకత ముఖ్యకాంత విజవీలోద్యానవాసంతల
క్ష్మీకిన్ విద్యాభ్యసనంబు సేయు గతి నాత్మీయాభిరామేంద్రియాం
గకశృంగారవిచేష్టితంబు లొలయం గైసేసి స్వేచ్ఛావిహా
రకళాకౌశల మేపు చూపుచు నవార్యప్రీతి నున్నంతటన్, 1

మ. అవమానానిలభేదపూరణముచే నంభోధి నౌకాక్రియన్
పవమానప్లవమానమై యుభయపార్శ్వక్షేపణీయంత్రశ్రీ
జ్జవమానోన్నతితో నరిత్రనియతాశామాత్రసంచారి యై
న విమానమ్ము నరోత్తమాంచితము మింటం దోఁచెఁ జోద్యంబుగన్. 2

తే. లింగభేదంబు గల తరుణాంగు లుర్కి - వని కవతరించె నపుడు పుష్పకవరంబు,
వివిధ వైద్యుతశక్తులు వెలయు కతన - జలదమున కీడ్వఁబడు మేఘశకలమట్లు. 3

మ. సరసాన్యోన్యకటాక్షవీక్షలు హఠాత్సంప్రాప్తసామీప్యభా
స్వరలావణ్యపయఃప్రపూర్ణ సుతనువ్యాజాంబుదాంతఃపర
స్ఫురతారుణ్యవిభిన్న వైద్యుతమహాశక్త్యాత్మ తేజోలతల్
సరవిం దోఁచె స్వభూజయాస్త్రములు లోలత్వంబు స్వతంబుగన్. 4

క. హృదయకమలఘనభావము - పదు నటి వీక్షాతటిత్ప్రభవకామాగ్నిన్,
తుది నీ రయ్యును నిలువక - కదలి బయలు ప్రాఁకె బాష్పకైతవ మెసఁగన్. 5

చ. అతులితరాగపూరతటిదాత్మకశక్తి యనుక్షణాభివ
ర్ధిత మయి నిండి క్రిక్కిఱియ దేహము లోపమి నెంచి తద్బహి
ర్గతికయి మారయాంత్రికుఁడు గ్రక్కున నెత్తిన సూక్ష్మసూచికా
తతి యన రోమహర్షణము దార్కొనెఁ గంపపురస్సరంబుగన్. 6

* * * * * * *

# చిత్రపటముల వివరణము

సర్ దోరాబ్ తాతా:— సుప్రసిద్ధులగు జె. ఎన్. తాతాగారిపుత్రుడు. బొంబాయివర్తక ప్రపంచమునందు నగ్రగణ్య స్థానము నలంకరించుచున్నారు. సాక్చివద్ద ఉక్కుకర్మాగారములను, బొంబయికి విద్యుచ్ఛక్తిని లోనావ్లావద్దనుంచి పంపు సంకల్పమును అనేకకోట్ల రూపాయలు వ్యయముచేసి పరిపూర్ణస్థితికి దీసికొనివచ్చి తండ్రిగారి యభీష్టములను నెరవేర్చిరి.

---

సర్ ఫజుల్ భాయి కరీంభాయి:— సామ్రాజ్యశాసనసభాసభ్యుడు. బొంబయిలో బట్టలమిల్లుల కధిపతి. బొంబయి వణిగ్వరులలో సుప్రసిద్ధుడు. శాసనసభలోజేయు ప్రసంగములు భావపూరితములై యుండును. యావన్మహమ్మదీయనాయకులలో నొకడు.

---

సంఘ సంస్కరణసభ—స్వచ్ఛంద నారీమణులు:— బొంబయిలోజరిగిన సంఘ సంస్కరణసభకు వాలంటీయరులుగా ఈ యావన స్త్రీలుండిరి. ఇట్టిసేవ బొంబయినగరములో తప్ప మరియెచ్చటను సాధ్యపడదు. నారీమణు లింతమంది ఈ విధముగా వాలంటీయరులుగా సేవజేయుట కిదియే మొదటిపర్యాయము.

---

బొంబయి సేవాసంఘము:— సేవాసదనము పక్షమున కొంతమంది బాలికలు, పడుచులు, కాంగ్రెసు జరుగుచున్న దినములలో డబ్బాలు తీసికొని మంటపమంతయు తిరిగి 7000 రూప్యములను మూడుదినములలో వసూలుచేసిరి. ఇట్టి మహత్కార్యములు బొంబయిస్త్రీలే చేయవలెను గాని నితరుల చేతగావు.

---

కుగ్లరుఆసుపత్రిగుంటూరు:— ఈ ఆసుపత్రి ఆంధ్రదేశమంతటను ప్రసిద్ధికెక్కినది. వేలకొలది ఆంధ్రయువతులిచ్చట ఆరోగ్యము బడిసి కుగ్లరుదొరసానికి కృతజ్ఞులయి యున్నారు. ఇది అమెరికన్ లూథరన్ మిషన్‌వారిచే గుంటూరులో స్థాపింపబడినది. పాతికసంవత్సరములకు పయిగా కుగ్లరుదొరసాని యిచ్చట సేవ జేయుచున్నది.

---

మదనపల్లి క్షయరోగవైద్యశాల:— చెన్నపురి ...రతమువారి ధనసహాయముచేతను, మదరాసు రాజధానిలో బని చేయుచున్న క్రైస్తవ మతవ్యాపక సంఘములచేతను క్షయరోగ వ్యాధి చికిత్సకయి స్థాపింపబడినది. ఇచ్చట స్త్రీలకు పురుషులకు వేరుగా వైద్యశాలలు కలవు. క్షయరోగముచేత బాధపడువారు మదనపల్లికి వ్రాసినచో అచ్చటి నిర్వాహకులు జవాబొసంగగలరు.

---

శాంతినికేతనము, బోల్పూరు:— ఇది లోకమాన్యులు రవీంద్రనాథ టాగోరుగారిచే స్థాపింపబడిన పాఠశాల. ఇందులో క్రైస్తవ మిషనరీలు సయితము ఉపాధ్యాయులుగానున్నారు. ఇచ్చట బాలురకు జెప్పబడు చదువు నవీనపద్ధతుల ననుసరించును. టాగోరుగా రీశాలకయి నమితశ్రద్ధ బుచ్చుకొందురు.

---

సర్ దిన్షా పెటిట్ గారు:— కోటీశ్వరుడు, బట్టలమిల్లుల కధిపతి. బొంబయిలో మహాగొప్ప పార్శీకుటుంబమునకు జెందినవాడు. శాసనసభాసభ్యుడు. దేశాభిమాని.

---

వి. వి. జోగయ్యగారు బి. ఎ. బి. ఎల్:— గంజాంజిల్లా బరంపురములో న్యాయవాది. పబ్లికు ప్రాసిక్యూటరు, గవర్నమెంటు ప్లీడరు, రాజకీయవిషయములలో కాంగ్రెసు పుట్టినది మొదలు పరిశ్రమజేయుచున్నారు.

---

వి. రామలింగస్వామిపంతులు గారు:— బొబ్బిలి మహారాజా హైస్కూలుకు హెడ్డుమాస్టరుగారు. ఆప్రాంత్యమున విద్యాభివృద్ధికయి కృషిచేయుచున్న ప్రసిద్ధ ఆంధ్రపురుషులు.

---

డాక్టర్ కె. వి. సుబ్బారావుగారు:— అయిదు సంవత్సరములు కలకత్తాలో హోమియోపతీయను క్రొత్తవైద్యమును కష్టపడి నేర్చుకొనివచ్చి మదరాసు నగరమందు వైద్యము చేయుచున్నారు. ఈయన నొక మాసికవైద్యపత్రికను సయితము స్థాపించియున్నారు.

---

ఆంధ్రవిద్వాంసులు, శతావధానులు:— కూరుచున్నవారు:— (ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు) (1) ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (2) పురాణపండ మల్లయ్యశాస్త్రి

గారు (3) వేదం వేంకటరాయశాస్త్రిగారు (4) చెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారు (5) దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు. నిలబడి యున్నవారు (1) నంబూరి తిరునారాయణస్వామిగారు (2) వేటూరి శ్రీరామశాస్త్రిగారు (3) శ్రీరాజా భుజంగరావుగారు

---

లెఫ్టినెంటు కో(ల). వెంకటరమణరావుగారు:— లెఫ్టినెంటు హెచ్ సుందరరాజన్, లెఫ్టినెంటు వేలాయిన్ పాల్ వీరికి ఐ. ఎం.ఎస్. లో కమీషనులు దొరికినవి. సైన్యములో వైద్యులుగా నియమింపబడి ఇండియాకు పంపబడిరి. ఆంధ్రులు.

---

జాదూష్వరుమహారాజు:— వీరు యుద్ధభూమికి వెళ్లి జోధపుర రాజవంశపు కీర్తినినిలిపిరి. లోకప్రఖ్యాతులగు మహారాజా సర్ ప్రతాపసింగుగారు రీయన పినతండ్రి. ఈయన బాల్యదశలో జాదూష్వరుడు సింగుగారు రాజప్రతినిధిగా పనిచేసెను రెండు నెలల క్రిందట హార్డింజిప్రభువుచే పట్టాభిషిక్తుడై గౌరవింపబడెను. యుద్ధభూమికివెళ్లి స్వదేశసంస్థానాధీశులకు కీర్తితెచ్చిన యౌవన మహారాజులలో నొక్కరు.

---

డా॥. వెంకటాచలపతిశర్మ:— డాక్టరు కూనితోట్ట వైద్యము నాంధ్రదేశములో ప్రవేశపెట్టిన పుణ్యాత్ములలోనొక్కరు. కూనీగారి పుస్తకముల నాంధ్రీకరించి ఆంధ్రదేశమందీ వైద్యప్రచారమునకు తోడ్పడిరి.

---

కె. మా. శర్మగారు:— స్వధర్మప్రకాశినీ సంపాదకులు. గ్రంథకర్త.

---

శివశంకరుడు:— ఈయన చిన్నతనమందే మంచికవనమును చెప్పుచున్న యౌవనాంధ్రుడు.

---

గద్దె వెంకటకృష్ణయ్య:— $1\frac{1}{2}$ మైలు ఈతపందెమునందు బందరు వ్యాయామపరీక్షలలో జయమొందెను.

---

జనరలు బర్డువుడ్:— డార్డినల్సులో జరిగిన ఆస్ట్రేలియను సేనల కధిపతి. ఇండియాలో చాలకాలము కొలువుచేసెను.

---

జనరలు సర్ జేమ్సువిల్కాక్సు:— హైందవసేన ఫ్రాంసు, ఫ్లాండర్సులలో నాయకుడుగానుండి వారి కనేక జయములను సమకూర్చెను. ఈ యుద్ధములో గొప్పకీర్తినిపొందిన ఆం సేనాధిపతులలో నొక్కరు.

---

కిచ్నర్ప్రభువు:— యుద్ధములో పోరుటకయి అనే లక్షలమంది స్వచ్ఛంద సైనికులను జేర్చెను. ఈయుద్ధపు గడబిడలు లే చో హిందూదేశ రాజప్రతినిధిగా రాదలసినట్టివాడట.

---

జనరలు సర్ లెస్లీరండల్:— యుద్ధములలో ముఖ్యముగా ఆంగ్లసేనలను నడపించుచున్న సైన్యాధిపతులలో నొక్కరు

---

సర్ జాన్ సైమన్:— ఆంగ్లమంత్రులలో నొక్కరు న్యాయవాది. లిబరలుకక్షివాడు. నిర్బంధసైనికసేవ వలదని పోరా యుద్యోగమునకు రాజీనామా నొసంగెను.

---

ఎఫ్. ఇ. స్మిత్:— ఇంగ్లండులో యూనియనిస్టు నాయకులలోని యౌవనులలో గట్టివాడు. న్యాయవాదిత్వమువల లక్షలార్జించెను. ప్రెస్ సెన్సారుగా కొంతకాలముండెను. తరువా కప్టెనుగా యుద్ధభూమి కరుదెంచెను.

---

కేరుహార్డీ గారు.— ఇంగ్లాండులో కృషీవలుల నాయకుడు. యుద్ధమువలదనినవాడు. పార్లమెంటు మెంబరు. ఇండియందపరిమిత సానుభూతికలవాడు. ఇండియాకువచ్చి చూచి స్థి గతులనుగూర్చి పుస్తకము వ్రాసెను.

---

సి.ఎల్. వార్నేఫ్ లీ:— ఆకాశ విమానదళాధిప లలో నొక్కరు. దేశమును శత్రువిమానదాడినుండి కాపాడు భా మీయనమీద చాలకలదు.

---

సిపాయి ఖుదాదుబక్సు:— ఈయనచరిత్ర మాంధ్రప కలో వ్రాయబడెను. అతి సాహసపరాక్రమమునకయి విక్టోరియ పతకమును జార్జి చక్రవర్తిగా రిచ్చిరి.

---

కె॥ లక్ష్మీనారాయణగారు:— గుంటూరుజిల్లా పాలెములో సెకండరీస్కూలును స్థాపించి అభివృద్ధిలోనికి దెచ్చి యూనియను పంచాయతీలో శ్రద్ధవహించి పనులను జేయుచుండు సహకారసంఘములను, ముష్టిఫండును వేటపాలెములో స్థాపిం రాత్రిపగటి పాఠశాలలు కృషీవలులకు పెట్టవలయునని యత్నిం చున్నారు.

వెల స్వల్పము! ఫల మధికము!!

# అమృతాంజనము

## వాయువునొప్పులకు పరమామృతము

గొప్ప గొప్పవారిచే వేలకు వేలు యోగ్యతా పత్రములు పొందినది

పంచభాషా చీటి చూచికొనిన మోసము గలుగదు. ప్రతియింట నుంచదగినది.

సీసా 1-కి 0-8-0 అణాలుమాత్రమే. ప్రతివారము వేలకు వేలు విక్రయము.

## అమృతాంజనము పోట్లబోగొట్టును తలనొప్పులమాన్పును







నెత్తురునందు మాత్రాప్లజము మొదలగు చెడు పదార్థములు చేరియవి సంధి బంధనములందు నిలిచి యుండుటవలన సంధివాత మేర్పడుచున్నది. కీళ్లు వాచుట, జ్వరము, కీళ్ల పోటు ను మొదలగునవి దీనికి లక్షణములు. బాధగలిగిన వెంటనే రోగికి విశ్రాంతినిచ్చుట యవసరము. వాయువునొప్పుల కుపయోగించుమందులు దీనికి నుపయోగపడును. సంధిబంధనములను వేడి ఇసుకతో కాని, ఉప్పుతోగాని, నీటితోగాని కాచి పిమ్మటను అమృతాంజనముతో మెల్లగా తోమవలయును. సంధివాత మేర్పడిన వెంటనే అమృతాంజనము నుపయోగించుచు వెంటనే భేదికి తీసికొనుట మంచిది.

## అమృతాంజనము జగత్ప్రసిద్ధి జెందిన దివ్యాంజనము

తలనొప్పుల మాన్పును

పార్శ్వపు నొప్పుల బారదోలును

వాయువుపోట్ల బాపును

బెణుకుల భేదించును

వాపుల రూపుమాపును





దగ్గును శమించును

దురదను తొలగించును

తేలుబాధను తీసివేయును

వేలకువేలు విక్రయము.

వెల 0-8-0 లు మాత్రమే.

**అమృతాంజనండిపో, 6 తంబుశెట్టివీధి. మదరాసు.**

## ఉగాది పండుగ బహుమతి

16 మూరలు ! మంచి సొగసైనవి !!

## గోహర్ జార్జితీగల చీరలు

ఈ క్రొత్తరకము చీరలు బహు నాణ్యమైన తెల్ల మల్లులో తీగలువేసి చుట్టు రమణీయమైన సన్న అంచుకట్టి యున్నది. ఇది కట్టుకొనుటకు సొగసుగాను చూచుటకు నయముగాను యున్నది. చీరల రంగు మారవు. దీనిని మేము ప్రత్యేకముగా ఉగాదిపండుగకు గాను రప్పించి ఉన్నాము.



ఇది ధరించినయెడల కలుగు ఆనందము ఇంతయని చెప్ప వలవిగాదు. దీనినిచూచు ప్రతివారు తెప్పించుకొనుటకు బలుమారు వేడుకొందురు. రు 2-8-0, వి. పి. చార్జి 0-8-0

1 చీర తెప్పించుకొనువారికి 1 గజ్జల అడ్డిగ ఇనాముగ పంపెదము.

రత్నంకంపెని 3 ఇరుళప్పర్ వీధి, మదరాసు.

---

త్వరపడుడు! **ఉగాదిబహుమతి** మంచిలాభము !!

### "లండర్ స్విసు పాకెట్టు గడియారము"




ఈ గడియారము మేము ప్రత్యేకముగా సీమలోనుండి రప్పించియున్నాము. ఇది చూచుట కందమై తలబీగమును డస్టుప్రూఫ్ అను గ్లాసు మూతను గలిగి బహు నాణ్యమైన పనితో చేయుబడి యుండును. ఇది ఇంగ్లీషు మాదిరి గడియారము. అనేక గడియారములు విక్రయించితిమి. మా కంపెనిపేరు ప్రఖ్యాతి పొందవలెనని రూ 2-0-0 ఖరీదుగల మేలైన ఫౌంటన్ పేనా ఇనాముగా పంపించబడును.

గడియారము ఫౌంటన్ పేనాతో క్రయం రూ 3-0-0

వి. పి. చార్జి 0-5-0 ప్రత్యేకము.

ఆంధ్రపత్రిక చందాదారులకు మాత్రము యివ్వబడును.

మీపత్రిక నంబరు తెలియపరచవలెను.

ధైర్యలక్ష్మీకంపెని 3 ఇరుళప్పర్ వీధి మదరాసు

---

# డోంగ్రేగారి

# బాలామృతము




శిశువులపాలిటికి సుప్రసిద్ధమైన టానిక్.

తియ్యగానుండుటచే శిశువులు త్రాగుదురు.

రుచిగా నుండును.

స్వయముగ నొసంగిన అభిప్రాయము.

జూనాగాడ్ హైస్కూలు ప్రధానోపా ... యులగు కరీం మహమ్మదు ఎం. ఏ., యల్. యల్. ... గా రిట్లు వ్రాయుచున్నారు:—

"తమ బాలామృతమును నా కుటుంబములో సదా వాడుటయేగాక, నాస్నేహితులకు దాని ఉప యోగములను దెలిపితిని. దాని అద్భుతశక్తిచేత, దా ... కియ్యబడిన బాలామృతము అను నామము సార్థకమైనది."

ధర బుడ్డి 1-టికి 12 అణాలు.

పోస్టేజి 4 అణాలు

ప్రొప్రయిటర్లు:—

## కె. టి. డోంగ్రే అండు కంపెని

గిరిగాం, బొంబయి

జ్వలించునట్లు చేయవలసియున్నది. చంద్రదర్శనముచే జలధి యుప్పొంగునట్లు ప్రతిదినమును నీశ్వరసందర్శనముచే మన హృదయము గూడ సంతోషపారవశ్యమున నుప్పొంగుటకై ప్రతిదినమునందును నీశ్వరోపాసనకై కొంతకాలమును నిర్ణయించి యుంచవలయును. పరబ్రహ్మముయొక్క నామమును తఱచు జపించుచుండుటయు మిగులఁ బ్రయోజనకరము. గృహమున జరగు సకలశుభాశుభ కార్యసమయము లందును పరమేశ్వరుని స్మరించుట లాభదాయకము. అప్పుడప్పుడు నిర్జనప్రదేశమున కరిగి యీశ్వరచింతనమునఁ గాలము గడపుటయు నత్యంతోపయోగకరము. ఈ సాధనచయములో నెల్ల పూర్ణాంగ బ్రహ్మోపాసన యగ్రగణ్యము.

## పూర్ణాంగోపాసన

పూర్ణాంగ బ్రహ్మోపాసనయందు నాల్గు ముఖ్యభాగములు గలవు: 1. ఉద్బోధనము 2. ఆరాధనము 3. ధ్యానము 4. ప్రార్థనము.

1. ఉద్బోధనము:—నియమితకాలమునందు మనము ఈశ్వరోపాసనకై యొకచోఁ జేరినను మనస్సు తఱచుగ భగవచ్చింతనమునకు సిద్ధమై యుండదు. అంతకుఁ బూర్వము చేయుచుండిన కార్యజాలము నందే తగిలియుండును. అందువలననే మన మనస్సును బ్రహ్మోన్ముఖము చేయవలసిన యావశ్యకత గలదు. చాంచల్యశీలమైన మన చిత్తము నీశ్వరాయత్తము చేయుటకై గావించు ప్రయత్నమునకే యుద్బోధన మని పేరు. ఇయ్యది శాస్త్రపాఠముచేఁ గాని సత్ప్రసంగముచేఁగాని భగవత్ప్రార్థనముచేఁ గాని పద్యపఠనముచేఁ గాని సంకీర్తనముచేఁ గాని నెఱవేర్పవచ్చును. సామాజికోపాసనాసమయము లందు ఆచార్యుఁడు సామాన్యముగా నేదో యొక మహావాక్యము నాధారము చేసికొని చిన్నప్రసంగము గావించి యుపాసకుల నీశ్వరపరాయణులఁ జేయును.

2. ఆరాధనము :—పరబ్రహ్మముయొక్క స్వరూపావళియందలి యొక్కొక్క స్వరూపమును గూర్చి భక్తిసహితముగాఁ జింతించుటయే యారాధనము. బ్రహ్మస్వరూపనిర్ణయము చేయుటకై అనేక బ్రాహ్మసాధకులు విశేషముగాఁ గృషిచేసి యున్నారు. అమ్మహనీయుల తపఃప్రభావముచేతను భజనసాధనములచేతను అన్నిటికంటె మిన్నగా నీశ్వరానుగ్రహవిశేషముచేత నాత్మానందదాయక మగు బ్రహ్మస్వరూపనిర్ణయము చేయఁబడినది. తత్స్వరూపము లెల్ల నీ వాక్యమునం దిముడ్పఁబడినవి: "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఆనందరూప మమృతం యద్విభాతి శాంతం శివ మద్వైతం శుద్ధ మపాపవిద్ధమ్."

ఈ యారాధనామంత్రమునందు ప్రాచీన నవీన బ్రాహ్మసాధకుల సాధనసంపత్తి యంతయు నిమిడియున్న దని చెప్పవచ్చును. తమ యాత్మప్రదేశముల నుదయించిన ధర్మపిపాసను తీర్పఁగల వాక్యరత్నములను ప్రాచీన మహర్షులనుండి గ్రహించి వాని నెల్ల నీ మంత్రరూపమున నొక యమూల్యహారముగా నాధునికసాధకులు గూర్చియున్నారు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను భాగము తైత్తిరీయోపనిషత్తునుండియు, 'ఆనందరూప మమృతం యద్విభాతి' యను భాగము ముండకోపనిషత్తునుండియు, 'శాంతం శివ మద్వైతమ్' అను భాగము మాండూక్యోపనిషత్తునుండియు 'శుద్ధ మపాపవిద్ధమ్' అనునది యీశోపనిషత్తునుండియుఁ గైకొనఁబడినవి. ఉపనిషత్తు లనియెడు మహాపుష్పవనమునఁ బ్రవేశించి దేవేంద్రనాథాది సాధకభృంగము లీ యారాధన మంత్రామృతమును సంపాదించిరి. ఈ మహామంత్రమునందు బ్రహ్మస్వరూపము చక్కఁగా వర్ణింపఁబడినది. సకలచేతనాచేతన వస్తుసముదాయముయొక్క స్థితికి మూలాధారుఁ డనియు, చిన్మయుం డనియు, ఆదిమధ్యాంతరహితుఁ డనియు, అనంతకల్యాణగుణాకరుఁ డనియు, సకలవిశ్వక్షేమంకరుం డనియు, శాంతినిలయుఁ డనియు, అద్వయుం డనియు, పరమపవిత్రుఁ డనియు, ఆనందస్వరూపి యనియు బ్రహ్మమంత్రరాజమున నుతింపఁబడియున్నాఁడు. నిశ్చలచిత్తుఁడై, నిర్మలమనస్కుఁడై, వ్యాకులహృదయుఁడై యిట్టి యారాధనము సేయు నెవ్వాఁడు భక్తిమాధుర్యము నాస్వాదింపక యుండ నేర్చును?

## ధ్యానము

హృదయపూర్వకమైన యారాధనముచే బ్రహ్మసాక్షాత్కారమును పొందిన భక్తుఁడు తద్బ్రహ్మమువిూఁదనే తన మనస్సును నిలిపి యుంచుకొన నభిలషించుట యస్వాభావికము గాదు కదా! ఝుంకారనినాదముతో పద్మముపై వలయాకారమునఁ దిరుగుచు క్రమక్రమముగా తద్గర్భమునఁ జేరి మధువుఁ గ్రోలుచు నిశ్శబ్దమై యుండే నిమగ్నమై యుండెడు మధుపము చందమున భక్తుఁడు బ్రహ్మస్వరూపచింతనక్రియాలోలుఁడై బాహ్యప్రపంచమును మఱచి తన్మయతను జెందియుండును. ఇదియే ధ్యానము.

## ప్రార్థనము

సకలసల్లక్షణసంపన్నుఁ డగు పరమేశ్వరుని సాంగత్యమాధుర్యము ననుభవించునపుడు భక్తుఁడు తన అయోగ్యతను అహంకారమును అపవిత్రతను గుర్తించును. కామాదిశత్రుగణము తన హృదయదుర్గమును వశము చేసికొన్న సంగతిని దెలిసికొనును. దుశ్చింతాదూరమై నా హృదయ మెన్నఁడు సచ్చింతాసంపూర్ణ మగునా యని యావేదనమును పొంద నారంభించును. వినయభావము కుదురును. దుఃఖాశ్రువులు కనులనుండి రాలఁదొడంగును. పశ్చాత్తాపతప్తహృదయముతో దీనవదనముతో వినయవినమితశిరస్సుతో ముకుళితహస్తములతో నతఁడు ప్రయత్నముగనే "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మాఽమృతం గమయ, ఆవిరావీర్మ ఏధి రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యమ్" అని ప్రార్థింప మొదలిడును.

"పరమేశ్వరా! అసద్వస్తువులనుండి నన్ను సద్వస్తువును పొందింపుము. అంధకారమునుండి నన్ను వెలుఁగును పొందింపుము. మృతావస్థనుండి నన్ను అమృతావస్థను పొందింపుము. ఓ స్వప్రకాశుఁడా! నీవు నా యందర ప్రకాశింపుము. నీ ప్రసన్నముఖముచే నన్ను సర్వదా కాపాడుము."

ఆముష్మికచింతను మఱచి ఐహికసుఖసాధనాపరాయణులమై యుండెడు మన కిట్టి పూర్ణాంగోపాసన యమోఘలాభమును

చేయఁగల దనుటకు లేశమైనను సంశయము లేదు. ఉద్బోధనముచే హృదయము బ్రహ్మోన్ముఖ మగును. ఆరాధనధ్యానములచే విశ్వాసము బలపడును. బ్రహ్మానురాగ మతిశయించును. ప్రార్థనముచే నహంభావ మడంగును. ఆత్మసమర్పణబుద్ధి యుదయించును. బ్రహ్మవిశ్వాసమును బడసి బ్రహ్మానురాగమును సంపాదించి బ్రహ్మసేవయందుఁ బ్రవేశింపఁ గల్గితిమేని, ఇఁక మనకు వాంఛనీయ మేమి యుండఁ గలదు? ఇందే ధర్మజీవనముయొక్క సారమంతయు ఘనీభవించి యున్న దని నుడువనగును.

## ద్వివిధోపాసన

జన్మసాఫల్యహేతుభూతము లగు ఈశ్వరవిశ్వాసమును ఈశ్వరభక్తిని ఈశ్వరసేవాభిరతిని కలిగింపఁగల యీ యుపాసనను సకల జనులును ననుష్ఠింపవలయు నని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. స్త్రీలును పురుషులును నీ యుపాసనాలాభమును బడయవలసి యున్నది. ప్రతి మనుష్యుఁడును దా నొంటరిగా బ్రహ్మము నుపాసించుటయే కాక యితరులతోఁ గూడఁ గలసి యుపాసింపవలసి యున్నది. అందుచే బ్రహ్మోపాసన ద్వివిధము: 1. వ్యక్తిగతము 2. సామాజికము. వ్యక్తిగతోపాసనయొక్క ప్రయోజనమును వెల్లడించు మహాపురుషు లనేకుల మనము గాంచియున్నారము. అయినను నిట్టి యుపాసనయందు ప్రమాదములు లేకపోలేదు. ఈ లోపముల కెల్ల సామాజికోపాసన మారణౌషధము. సామాజికోపాసనయందే కుటుంబోపాసన గూడ నిమిడి యున్నట్లు మనము తెలిసికొనవలయును. ఒంటిమై నుపాసించునపుడు మనుష్యుఁడు సహజముగా తనకును నీశ్వరునికిని గల సంబంధము నే చూచుకొనును. అందుచే స్వార్థపరుఁడై యుండును. స్వకుటుంబమువారితో నేమి స్వసాంఘికులతో నేమి కలసి యుపాసించునపుడు పెద్ద కుటుంబములోఁ పెద్ద సంఘములోఁ దా నొక వ్యక్తి నను సంగతిని స్పష్టముగా నతఁడు గ్రహించును. కుటుంబముయొక్క క్షేమముతోడను సంఘముయొక్క క్షేమముతోడను తన క్షేమము గూడ నవిచ్ఛేద్యసంబంధము గల దన్న యంశమును గుర్తించును. స్వార్థబుద్ధి కీ యుపాసనయందు నవకాశము లేదు. తనవలె పాపపంకిలమునఁ బడి కొట్టాడుచున్న వారి జీవితములఁ గాంచుటచే నతఁడు నాశాపూరితహృదయుఁ డగును. సాధుపురుషుల సాంగత్యముచే ధర్మజీవనాభివృద్ధికి సాయపడు ననేకనూతనసాధనముల నెఱుంగుచుండును. సాధుసంగంబు సకలార్థసాధనం బగుట మోక్షప్రాప్తికి నదియొక్క మహోపాయ మనుటకు సంశయ మేమి? ఉపాసనచే గృహము భూతలస్వర్గ మగును. సంఘము ప్రేమత్యాగాదులకు నిలయమై రాజిల్లును.

## ఉపసంహారము

బ్రహ్మోపాసన మనుష్యునికి స్వాభావికము. తనయునికి తల్లిపై ప్రేమ యెట్లు సహజమో, నదికి సముద్రగామి యగుట యెట్లు సహజమో, తీఁగకు తరువు నలమికొనుట యెట్లు సహజమో, ఆ చందముల నే జీవాత్మకుఁ బరమాత్మునిఁ జేరుటయు సహజము. ఝంఝామారుతములవలె నెన్నియో నాస్తికవాదములు ప్రపంచమున బయలువెడలెను. కాని, యవి మానవప్రకృతికి సహజమైన యీశ్వరవిశ్వాసవృక్షమును జీవింపఁజేయఁజాల వయ్యెను. మానవుఁడు భగవంతుని విడిచి యుండఁజాలఁడు. లోకమున కష్టము లనేకములు. దుఃఖము లపరిమితములు. ప్రలోభనములు మెండు. ఆశాభంగము లనంతములు. రోగమరణములకు మితి లేదు. ఇట్టి నానావిధావస్థలకు నిలయమై యున్న ప్రపంచమున దయాసింధు వగు పరమేశ్వరుని యాశ్రయము లేక సుఖముగా నెవ్వఁడు జీవింపఁగల్గును? ఉత్తుంగతరంగసంక్షుభిత మైన మహాసముద్రమునందుఁ బ్రయాణము సేయు నావికులు ద్వీపమును జేరి నిర్భయులై శాంతచిత్తులై యుండు విధమున తరపరంపరగాఁ బైపడు బహువిధదుఃఖములకు గురియై తల్లడిల్లెడు మనుష్యుఁ డీశ్వరపాదారవిందముల నాశ్రయించి స్వస్థమనస్కుఁడై సౌఖ్యానందముల ననుభవించుచున్నాఁడు. తత్కారణముచే నుపాసన సలుపుట సకలజనులకును నవశ్యకర్తవ్యము. ఉపాసనాప్రభావముచే భయచిత్తుఁడు నిర్భయుఁ డగును; నిరుత్సాహి యుత్సాహపూరితుఁ డగును; దుఃఖాత్ముఁడు సంతుష్టస్వాంతుఁ డగును. ఉపాసనాబలముచే గృహజీవనము పవిత్ర మగును. ఆనందపూరిత మగును. ఇఁక మన జాతీయజీవనమునం దీ యాధ్యాత్మికోపాసన ప్రవేశించెనేని మన జాతియొక్క మహాభాగ్య మే మని వర్ణింపఁగలము? సర్వశుభప్రదమైన యీ యుపాసనను వ్యక్తిజీవనమునందును కుటుంబజీవనమునందును జాతీయజీవనమునందును వ్యాపింపఁజేయుటయే బ్రాహ్మసమాజముయొక్క పరమోద్దేశము.

# ఎత్తిపోఁతల నీటిధారలు

విష్ణుభట్ల సూర్యనారాయణ గారు

ఈ ధారలు గుంటూరు జిల్లాలోని తుమ్మురుకోడుకు పడమటగా నున్నవి. నీటిధారల కాధారమగు చిన్నివాఁగు అచటి జనులచేత చంద్రవంక యని పిలువఁబడుచున్నది. ఈ ధారలను మాత్ర మెత్తిపోఁతల ధార లని యందురు. దీనినే 1797-వ సం. న "యడ్లపా" డని పిలుచుచున్నట్లు డాక్టరు హైనను నొక యాంగ్లేయుఁడు వ్రాసియున్నాఁడు ఎది యెట్లున్నను, ఎత్తిపోసినట్టుగా నీ ధారలు చూపఱకు కన్పట్టుటచేత వీనిని ఎత్తిపోఁతల ధార లని జనులు పిలుచుచున్నా రనుటయే సమంజసముగా నున్నది. వర్షాకాలమున నీ చుట్టుపట్టులకు, మిక్కిలి కష్టముమీఁద తప్ప, వచ్చుటకు వీలు లే దని తెలియవచ్చును. ఆ కాలమునం దీ నాల్గు ధారలు నొకటిగా కలసి సుమారఱువది డెబ్బది యడుగుల వెడల్పు గల్గియుండునఁట. ఈ చిత్రపటములు మాత్రము జ్యేష్ఠమాసాంతమున తీయఁబడినవి. వర్షాకాలములో నీధారలవలనఁ గల్గెడి ధ్వని మిక్కిలి గొప్పదై సముద్రపు హోరుతో సమానముగా నుండి పెక్కు మైళ్లవఱకును వినఁబడఁగలదు. ఇచటి తుమ్మురుకోడునుండి పోయెడు త్రోవలో నెచట చూచినను అడవిపంది యీఁకెలు మెండుగ దొరకును. సామాన్యముగా నిచటి జనులీ యీఁకెలను కలముపుల్లలుగా వాడెదురు. ఈ సెలయేటియొద్ద నెల్ల కాలములయందును తుమ్మెదలు ఝుంకారము చేయుచు, ఆ ధారయొద్దకు సామాన్యముగా జనులను రానియ్యవు. తుమ్మెదలచట మెండుగా నుండుటకు కారణముగా నొక చిన్న గాథ కలదు. త్రిమూర్తులలో నొకఁడైన విష్ణుమూర్తి యచటి చెంచుస్త్రీ నొకతెను మోహించి యామెతో నచట కొన్ని రాత్రులు గడపె ననియు, ఆ సంగతి లక్ష్మికి తెలియరాఁగా ఆమె కసూయ పెరిఁగి తుమ్మెదల రూపమును ధరించి యచటి కెవరిని రానియ్యకుండె ననియు, అచటి జనులు వాడుకగా చెప్పికొందురు.



1. ధారలు. ఇయ్యవి నాలుగు. ఇందులో తూర్పున నున్నది సుమారు ఎనుబదియడుగుల యెత్తును పది యడుగుల వెడల్పును గలిగియున్నది.

ఈ ధారలను చక్కఁగా వర్ణింప నా తరము కాదు. వీనినే 1797-వ సంవత్సరమున దర్శింపఁబోయిన డాక్టరు హైను తన భాషలో బహురమ్యముగా వర్ణించియున్నాఁడు. ఆ వర్ణననే నేను చేతనయినట్లు తెనుఁగున నిచట పొందుపఱచుచున్నాను:

"తుమ్మురుకోడున కాఱు మైళ్ల దూరమున, దక్షిణముననుండి యుత్తరమున కున్న గుట్టలపైనుండి క్రిందికి పడెడు నీటిధార (సెలయేఱు) ఈ గుంటూరు జిల్లాలోని ప్రశస్తవిషయములలో నొకటియై చూపఱ మనంబుల కాహ్లాదజనకంబై కన్నులకు పండువుగా నున్నది. ఈ స్థలమునకు నేను పులుల భయమువలన కాగడాలయొక్కయు డప్పులయొక్కయు సహాయముతో వెళ్లియుంటిని. కాని, దైవవశమున మాకు త్రోవలో నే విధమైన పులులును కనిపించి యుండలేదు...."

"ఇచటికి పోయెడు మార్గ మంతయు రాళ్లతో నిండియుండి యిరుప్రక్కలను ముళ్లకంపలు కలిగి యుండుటవలన అచటికి వెళ్ల నిశ్చయించెడి వారలకు నిరుత్సాహమును కలిగింపఁగలదు. ఈమార్గమున పోను పోను ఈ గుట్ట యొక్క శిఖరమున శిల్పచమత్కృతిగా తోఁచెడి చిన్న నదియొడ్డొకటి కనఁబడును. ఈ యొడ్డున నున్న రాళ్లు చక్కఁగ నమర్పఁబడిన వానికంటెను చక్కఁగా నుండి తన సహజసౌందర్యమును వెలిపుచ్చుచుండును."

"ఈ నదిని సెలయేటిని ఇచటి జనులు 'యడ్లపా'డని పిలుతురు. ఈ నది దక్షిణమునుండి యుత్తరమునకు ప్రవహించుచున్నది. ఈ దిక్కుననే యీ నది గుట్టయొక్క శిఖరమునుండి క్రిందికి ధారగా పడుచున్నది. అచటినుండి పడమరగా ప్రవహించి ఆఱు మైళ్ల దూరమున కృష్ణానదిలో పడుచున్నది.

"ఈ స్థలముయొక్క సహజసౌందర్యమును తగినట్లు నేను వర్ణింపలే నని నాకు భయము వేయుచున్నది. చక్కని పెద్ద సెల

రేటి కొక విధమైన శోభ యున్నది. స్వచ్ఛమైన నురుగుతో తెల్లనై ఇంద్రధనుస్సులచే చుట్టుకొనఁబడి అతి రమ్యమై గభీరమై చూపఱి మనమున కొక విధమైన భయము కల్గించు ధ్వని కల్గి నిర్మానుష్యమైన ప్రదేశమున అనేక వృక్షచ్ఛాయలక్రింద అనేక దేవాలయముల మధ్యమున కొండ శిఖరమున సహజముగా నిర్మింపఁబడిన చక్కని రాతిప్రదేశమునుండి క్రిందికి ధారగా పడుచు నిరాధారగా కన్పట్టెడి యీ సెలయేఱు మిక్కిలి విచిత్రముగా నుండక తప్పదు. ఇచట శిఖరమునుండి సుమారు నూట యిరువది యడుగుల నిడుపు గల్గి దొన్నెవలె నున్న యొక కుండము లోనికి దాదాపు ఎనుబదియడుగుల



2. ధారలు పడెడి కుండము. పైనుండి పడెడు స్రవంతియు నీ కుండములోనికి పడును. ఈ కుండము సుమా రైదడుగుల లోతు గల్గి యున్నది.

యెత్తునుండి పడుచున్నది. కుండమునకు తూర్పు దిక్కున నున్న గోడలు నిలువుగా నుండి చక్కఁగా గృహనిర్మాణమును చేయుట కవశ్యమైన వాస్తుశాస్త్రవేత్తచే నిర్మింపఁబడినట్లు తోఁచుచు అతిరమణీయముగా నున్నవి. నీటి ధారలు పడెడి దిక్కున నున్న గోడలు నిడుపుగా నున్నవి. అందు నడుమ నడుమ నున్న కొన్ని కంతలయందు పక్షులే క్లిల్లిబిల్లిగా నల్లుకొనియున్నవి. ...... ఈ వేరుల సహాయమువలననే యీ గోడపై కెగఁబ్రాకఁగల్గితిని.

"నే నచటికి వెళ్లిన సమయమున నా యదృష్టవశమున పెద్దధారలే యున్నవి గాని, అవి మరింత మిక్కుటముగా లేవు. నదిలో పూర్తిగా నీరు లేదు. తూర్పు దిక్కున మాత్ర మిరువది గజముల వెడల్పున నీ రున్నది. నడుమ నీరు లేదు. పశ్చిమమున కొలఁదిగా నీ రుండుటచేత నేను పై కెక్కఁగల్గితిని. ఈ ప్రక్క కొన్ని హిందూదేవాలయము లున్నవి. అందులో నొకటి మాత్రము మిక్కిలి పుణ్యప్రదమైనది. ...... ఇచట నున్న తక్కిన దేవాలయములయందు కట్టడపు చక్కఁదన మెంత మాత్రమును లేదు."



3. కుండము నుండి తరువాత నది ప్రవహించెడి మార్గము.

# జలాంతర్గాములు

తేకుమళ్ల వెంకాజీ గారు

ఈనవయుగమందు ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యద్భుతముగా వికాసము చెందియున్నది. అత్యంతోపయోగకరములగు నానావిధచిత్రవిచిత్రయంత్రశతంబులు నిర్మింపఁబడియున్నవి. దేశకాలముల ధిక్కరించు నుపాయములు వేనవేలు నెలకొల్పఁబడినవి. మానవుఁడు తన యద్భుత మేధాశక్తిచే భూతముల నెల్ల జయించి నిరంకుశాధికారమును సలుపుచు వానిచే తన కెల్ల విధముల సేవను చేయించుకొనుచున్నాఁడు.

ప్రస్తుతము జరుగుచున్న ఘోరసంగ్రామమందీ మేధాశక్తి ప్రస్ఫుటితముగ కాంచనగును. పూర్వకాలమున యుద్ధములు కాలనిర్ణయమును బట్టి రాత్రియగుటతోడనే ఆపఁబడుచుండెడివి. ఆ ధర్మము పోయి రాత్రియుద్ధములు కూడ ప్రారంభింపఁబడినవి.

ఒక్కొక్క యుద్ధనౌకను నిర్మింప కోట్లకొలఁది ధనము కావలయును. అట్టి యమూల్యరత్నములనఁబరఁగు యుద్ధనౌకలను ముంచుటకు రాత్రులు చాలక పగళ్లు కూడ ప్రయత్నము చేయవలెనని యూహించి ఏరికిని కనఁబడకుండ తుపాకులం దుపయోగింపఁబడు మందుగుండువలె నుండు టార్పెడోలను పెద్ద యుద్ధనౌకలపై వదలుటకు సముద్రములో మునిఁగి ప్రయాణము చేయు నావలు గావలసివచ్చెను. ఇట్టి యవసరము అమెరికాయందు జరగిన యుద్ధము (Civil War of Independance) లో కలిగెను. అప్పుడు 1775-వ సం. న అమెరికాదేశస్థుఁడును ప్రకృతిశాస్త్రజ్ఞుఁడును నగు బుష్నెల్లనువాఁడు ఇట్టి నావను కనుపెట్టెను. వీనినే జలాంతర్గాములని యందురు. ప్రస్తుత ముపయోగములో నుండువానివలె అంత యందముగాను అంత యుపయోగకరముగాను లేకపోయినను ఇవి మార్గదర్శకము లైనవని చెప్పవచ్చును.

దీనియందు సౌకర్యము లేమియుఁ గానరావు. ఒక్క మనుష్యునికంటె నెక్కువమందిలోని కరుగుటకు వీలు లేదు. వాఁడయినను, అరగంటకంటె నెక్కుడు కాల మందు జీవించియుండలేఁడు. ఆకారము తాఁబేటి చిప్పను బోలియుండును. నడపుటకు మనుజులచే నడుపఁబడిన తెడ్లు మాత్రము గలవు. ఇది యంతయు కఱ్ఱతో నిర్మింపఁబడినది. ఇంత కష్టపడి నిర్మించినను ఆ పరిశోధకుని దురదృష్టవశమున అది నిరుపయోగ మయ్యెను.

అస్థిరమేమి చిత్రమో కాని, ప్రకృతిశాస్త్రజ్ఞులు ప్రతిఫలము గోరకయే పరిశోధనలయందు తమ యుత్సాహమును 'కనఁబఱచుచు, తమ జీవితములను ధారపోయుదురు. యూరోపున కంతటికిని రాజనఁదగు నెపోలియను ప్రోత్సాహమున 1801-వ సం.లో ఫుల్టనను పరాసుదేశపు శాస్త్రజ్ఞుఁడీ జలాంతర్గామియందు కొన్ని మార్పులు చేసి యింకొకదానిని నిర్మించెను.

మొదటిదానికిని దీనికిని అంతగా భేదము గాన్పింపదు. ఆకుగుస తామ్రపు రేకులను వేయించెను. నీటిలోపల దీని నడకయు అంత వడిగా లేదు.

వీనిని చేతులతో నడపుటను మాని యంత్రసాహాయ్యముచే మొట్టమొదట 1863-వ సం. న చార్లెస్సు బరన్సు ఒక జలాంతర్గామిని నిర్మించి నడపించెను. పూర్వపువానికంటె నిది కొంచెము పొడుగుగను నడిమికొలత యెక్కువగను నుండెను.

ఈ తరుణముననే 'డేవి' డ్సను పేర చిన్న జలాంతర్గాము లమెరికాయందు నిర్మింపఁబడి, రెండు మూడు పెద్ద యుద్ధనౌకలను ముంచుటయందు జయము గాంచెను. కాలము గడచిన కొలఁది ఈ జలాంతర్గాములందు మార్పులు మెండయ్యెను. అమెరికావారీ విషయములో నొక బహుమానపరీక్షను పెట్టుటవలన, నార్డెను ఫెల్టను శాస్త్రజ్ఞుఁడును హాలండను మహనీయుఁడును తమ బుద్ధికౌశల్యమును బట్టి రెండు జలాంతర్గాములను నిర్మించిరి. అందు హాలండు జలాంతర్గామియే మెప్పు వడసెను.




అ. ద్వికుంభకటకము
ఆ. సమతలదర్పణములు
ఇ. సూక్ష్మదర్శని (గాని) భూతదర్పణము

ఈ హాలండు పద్ధతికన్న నెక్కుడుగ మార్పులను చెంది చాల సౌకర్యములను గలిగిన జలాంతర్గాము లిప్పు డుపయోగమందున్నవి కాని, యుద్ధమందు మన రహస్యములు విరోధులకు తెలియఁగూడదు. కావున, మనవారీ యుద్ధములో నుపయోగించుచున్న జలాంతర్గాముల నిర్మాణము నెవరికిని తెలియఁజేయరాదు. కాని, యీ జలాంతర్గాములను గూర్చి వివరింత మన్న, హాలండు జలాంతర్గామిని పరిశీలించినచో మన కంతయు విశద మగును.

పైకి చూచుట కిది యొక పెద్ద పలకల చుట్టవలె కాన్పించును. నడుమ పైభాగమున గోపురమువలె ఒక గొట్టము నుండును. జలాంతర్గామి నీటిలో మునిఁగియున్నప్పుడు ఈ గొట్టము మాత్రము మన కగపడును. నలు వైపులను ఏమేమి నావలు వచ్చుచున్నవో

ure) కావలసి యున్నది. ఇంకను ననేకోపయోగములకు వలయు వాయువును పీడనమువలన లోన దాఁచియుంచఁబడును. లోన నివసించువారి కే మాత్రమును కష్టము లేకుండునట్లు విద్యుచ్ఛక్తి విసనకఱ్ఱలును దీపములును లోనఁ గలవు. దుర్వాయువు పొగ మొదలగు చెడు పదార్థము లన్నియు జలాంతర్గామి యడుగు భాగమునకు గొట్టము ద్వారా తీసికొనిపోఁబడి అచ్చట సముద్రములో విడిచి పెట్టఁబడును.

ఈ జలాంతర్గాములయొక్క నడక(Speed) తేలికశక్తి (Buoyancy) మున్నగువానిని తెలుపు యంత్రము లిందు కలవు. నీ రచ్చట నుండినను స్థలమును నిర్ణయించు యంత్రములును నావికుల దిక్సూచికలును(Mariner's Compasses) ఇందుఁ గలవు. లోన నొండొరుల తోడి సంభాషణము టెలిఫోను ద్వారా జరగును. సగటున ఈ జలాంతర్గాములు గంటకు 22, 23 మైళ్ల చొప్పున నీటిలో పోవును.

ప్రకృతిశాస్త్రము నిమిష నిమిషము నభివృద్ధి పొందును. ఈ జలాంతర్గాములకు ముందు మైక్రోఫోను అను యంత్రము తగుల్పఁబడును. ఇది చుట్టుప్రక్కల నగు ధ్వని సంతతిని లోనికి వినఁబడునట్లు చేయును.

సూక్ష్మముగ జలాంతర్గాములు కట్టు పద్ధతిని వాని వర్ణనను తెలిసికొంటిమి. వివిధదేశములవారును ఎట్లు వీనియం దభివృద్ధి పొందిరో యీ పట్టికవలన కానవగును:

| దేశము పేరు | సంవత్సరము | బరువు టన్నులు | నడక మైళ్లు (గంటకు) | టార్పిడో గొట్టములు |
|---|---|---|---|---|
| బ్రిటను | 1902 (నెం 3 గు) | 122 | 25 మొ 28 వరకు | 1 |
| | 1909 (D 1) | 604 | 50-54 | 3 |
| ఫ్రాన్సు | 1901 (ఫ్రాన్సిస్సు) | 139 | 36 | 3 |
| | 1910 (Q 74) | 810 | 45-50 | |
| రష్యా | 1904 (డెల్ఫిన్ను) | 200 | 25-28 | 4 |
| | 1909 (క్రైమను) | 500 | 45 | 4 |
| అమెరికా | 1898 (హాలండు) | 74 | 25 | 1 |
| | 1910 (కిలు) | 425 | 45-50 | 6 |
| ఇటలీ | 1894 (డెల్ఫిన్) | 107 | 28 | 1 |
| | 1908 (ఫోకా) | 230 | 50 | 2 |

ఈ ప్రకార మాయా సంవత్సరములలో నాయా దేశము లీ విషయములం దభివృద్ధి పొందినవఁట. ఈ యుద్ధసమయములో నభివృద్ధి యపారముగ జరగినది. మన రాజులు 1909-వ సం. న 604 టన్నుల బరువు గల జలాంతర్గామిని నిర్మించిరి. ప్రస్తుత మందఱును 2,000 టన్నుల జలాంతర్గాములను నిర్మించుచున్నారు.

ప్రకృతిశాస్త్రమున రాక్షసులం బోలు నీ జర్మనీవారు 5,000 టన్నుల బరువు గల జలాంతర్గామిని కూడ నిర్మింపఁగలిగిరఁట.

ఎన్నఁ డీ యుద్ధము ముగిసి, మన యాంగ్లేయసామ్రాజ్య మతివైభవోన్నతిని చెంది ప్రపంచమం దెల్లెడలను శాంతిని ప్రజ్వరిల్లఁజేయునో కదా!

# నీ తి వి ధు లు

బొండాడ సూర్యనారాయణ గారు

సతతంబు సుమువుము సత్యంబు; వ్యర్థ వా
　　　　వాగ్దానములు సేయవలదు సుమ్ము;
చెడుమాట లొరులపైఁ జెప్పకు; సజ్జన
　　　　సహవాసమే నీవు సలుపుట తగు;
నీ యొడంబడికలు నెఱవేర్పుమీ; యుదా
　　　　రుఁడ వయి మనఁగ నెప్పుడును గోరు;
గగనకుసుమంబులు గైకొనఁబూనకు;
　　　　మద్యపానాదులు మరుగవలదు;
నీదు రహస్యముల్ నీలోన నుంచుమీ
　　　　యొకవేళ నే మైన నున్న యెడల;
మంచి వర్తనమును మించిన వస్తువు
　　　　వేఱొండు గలదె యీ విశ్వమందు?
సాధ్య మగావలసిను జగతిలో నప్పుల
　　　　పాల్పడఁబోకు శుభంబు నొంద;
సౌఖ్య మపేక్షించు జనుఁడు నిత్యంబును
　　　　దుష్పథంబులనుండి తొలఁగి మెలఁగు;
వృద్ధి నొందెడునట్టి బుద్ధి నీ కున్నచో
　　　　ధనము గడించు తొందర వదలుము;
ఒకనితో భాషించుచుండెడి తఱి వాని
　　　　వదనంబు వీక్షించి పలుకుము మఱి;
పెండ్లియాడకు నీవు ప్రియురాలి నిలలోన
　　　　సాఁకంగఁగల శక్తి లేకయున్న;
ఆయంబు మించని వ్యయము నొనర్పుము;
　　　　వార్ధకమున నీదు వ్యయముకొఱకు
తరుణవయస్సున ధనమును గడియించి
　　　　సెలవు సేయక కొంత నిలుపుకొనుము;
తలఁపంగఁ జెల్లింపఁగల శక్తి లేని ఋ
　　　　ణంబులు చేయఁ గష్టంబు లొదవు;
పాపపాశములోనఁ బడి చిక్కు లొందకు;
　　　　ధైర్యవంతుఁడ వయి దాని గెలువు;
సన్మార్గసిద్ధికి సజ్జనసహవాస
　　　　భాషణంబులు ప్రాపు వాస్తవముగ;
సన్మార్గవర్తికి స్వల్పలాభంబులోఁ
　　　　దనయంత లభియించు ధనముకతన
సంతుష్టి గలుగును జగమందు నీ దగు
　　　　నడతకుఁ గీడు జనంబువలనఁ
గలుగనేరదు సుమీ, తలపోసి చూడంగ
　　　　నీకతంబునఁ గల్గు నిశ్చయముగ;
మంచి నడత గలిగి మహిలోన మెలఁగుచో
నితరు లాడు నింద లేమి చేయు?
సవ్వళించు తఱిని ప్రతిదినచర్యల
నెన్నుకొనుము; దేవు నెన్నుకొనుము.

# కావేరి దాఁటు – నీటి ద్వారా మెఱుపు

వేమూరి విశ్వనాథశర్మ గారు, ఎమ్. ఏ.

వాస్తుశాస్త్రము భౌతికశాస్త్రములలో నొకటి. వాస్తు శాస్త్రజ్ఞులను ఇంగ్లీషు భాషలో "ఇంజనీరు" లందురు. వీరి కృత్యములు కొన్ని అత్యద్భుతములు. నిశ్చయముగా సముద్రమునకు చెలియలికట్ట వేయఁదగిన వారు వీరే. నేల మట్టమున పారెడి కృష్ణా గోదావరుల నీరు వ్యర్థము గాకుండ ఆనకట్టలు గట్టి డెల్టా భూములను అమరకము చేయుటకు సాధ్యము చేసిరి. కాని, యన్ని నదులును నేలపారున ప్రవహింపవు. కొన్ని నదులు ప్రవాహమధ్యమున ఎత్తయిన కొండల మీఁదనుండి దుముకును. ఇట్టి నదులకు ఆనకట్టలు గట్టుట సులభము గాదు. రాతిభూముల గుండ ప్రవహించుటవలన పడవ లాడుటకును లాయకుగావు. ఇట్టి నదులయొక్క నీరు వ్యర్థముగ సముద్రమును చేరవలసినదేనా? మైసూరు చెన్నరాష్ట్రముల గుండ ప్రవహించెడి కావేరీనది మొట్టమొదట కొండలమీఁదుగ నుఱికి మనరాజధానిలో నేలపారుగ ప్రవహించుచున్నది. నేలమట్టమున ప్రవహించుటచేతనే మన రాజధానిలో కావేరికి ఆనకట్టలు గట్టి తంజావూరు తిరుచినాపల్లి డెల్టా భూములు ఫలవంతములు చేయఁబడినవి. అయితే మైసూరు రాష్ట్రపు ప్రజలు కావేరీఫలితము నెట్లు పొందుచున్నా రని యడుగవచ్చును. మైసూరు సంస్థానమునకు కావేరి మెట్లుపయోగించునదియు ఇంచుక వ్రాసెదను. ఎత్తయిన కొండలనుండి నిరంతరము ఏనుఁగుతొండముల వలె ప్రవహించు నదులయొక్క వైభవము వర్ణనీయము. సృష్టియం దిట్టి ప్రకృతిసౌందర్యముఁ జూచి యానందించుటకే లక్షలకొలఁది జను లచ్చటికి యాత్రలు సలుపుచుందురు. అమెరికాదేశములో "నయాగ్రా" యను నది యొక టిట్టిది గలదు. ఇది 1400 అడుగుల వెడల్పున 162 అడుగుల యెత్తుననుండి ప్రవహించును. ఇట్టివి రెండు పాయలు గలవు. వీని సౌందర్యమును జూచుటకై సాలునకు 12 లక్షలమంది యాత్రికు లచ్చటికి వెళ్లుచుందురఁట!

కాని, మైసూరు దర్బారువారు యాత్రికుల సందర్శనముతో తృప్తిఁ జెందక ఏయే ప్రదేశముల నెట్టు లా నీటి నుపయోగింపవలెనో తగిన యుపపత్తులను కల్పించిరి. కావేరీనది కూర్గు రాష్ట్రములోని పడమటి కనుమలలోఁ బుట్టి మైసూరు రాజ్యములోనికిఁ జొచ్చి 170 మైళ్లు ప్రవహించిన తరువాత రెండు పాయలుగా చీలుటవలన శివసముద్ర మను నొక చిన్న లంక యేర్పడినది. ఈ లంక దగ్గఱనే నది రెండు చోట్ల నెత్తయిన ప్రదేశములనుండి ప్రవహించుచున్నది. శివసముద్రము దాఁటిన తరువాత రెండు పాయలు తిరిగి యేకమై కనుమల మధ్యము గుండ సేలము జిల్లాలోనికి వచ్చి పడును. ఈ కనుమల మధ్యమున నదియొక్క వెడల్పు కొన్ని యడుగులు మాత్ర ముండును. అందుచేత నీ ప్రదేశమునకు "మేకదాఁటు" అను పేరు వచ్చినది. శివసముద్రమునకు పైభాగమున నదికి 12 ఆనకట్టలు గట్టి యా నీటిని అమరకమున కుపయోగించుచున్నారు.

శివసముద్రము దగ్గఱ కావేరి రమారమి 400 అడుగుల యెత్తునుండి ప్రవహించును. అంత యెత్తునుండి ప్రవహించెడి నదికి అమితమైన శక్తి యుండును. ఈ శక్తిని ఉపయోగించి యేపని నైనను చేయవచ్చును. అంత యెత్తునుండి పడెడి నీటిక్రింద రాళ్లు బ్రద్ద లగును; చెట్లు విఱిగి పడును. తెలివితేటలతో నుపయోగించినయెడల ప్రజల కుపయోగకరము లగు పనులను చేయవచ్చును. ఇప్పుడు ప్రతివస్తువు యంత్రసహాయమువలన తయా రగుచున్నది. బియ్యము బట్టలు నూనె పప్పు పిండి మున్నగునవి యన్నియు మఱలలో తయా రగుట మన కనుభవమే. ఈ మఱ లనేకవిధములుగ పనిచేయుచున్నవి. కొన్ని చేతిమఱలు అనఁగా చేతులతో త్రిప్పి

నడుపునవి. ఆవిరివలన నడపఁబడునవి కొన్ని. కిరస నాయిలు మఱలు మరికొన్ని. విద్యుచ్ఛక్తి నుపయోగించి నడుపునవి కొన్ని. ఈ మఱ లన్నియు నడుచుటకు ముఖ్యాధారము పనిచేయఁగల శక్తి యని తేటపడును.

ఇంజనులు బయలుదేఱక పూర్వము పాశ్చాత్యులు కష్ట మయిన కార్యము లన్నియు గుఱ్ఱములచే చేయించెడివారు. అందుచేత నే పని నైనను చేయుటకుఁ గావలసిన దార్ఢ్యమును గుఱ్ఱముయొక్క సామర్థ్యముతోఁ బోల్చెడివారు. ఒక్క నిమిషము కాలములో 33,000 పౌనుల బరువును అడుగెత్తు లేపుటకుఁ గావలసిన బలమునకు "అశ్వశక్తి" (Horse-power) యని పేరు. ఇప్పుడు ఇంజనుల సత్తువ కొలుచుటకుఁ గూడ అశ్వశక్తియే వాడఁబడుచున్నది. ఐదు అశ్వశక్తుల యింజను అనఁగా నొక నిముసములో 5 గుఱ్ఱములు చేయఁగల పనిని ఈ యింజను ఒక్కటియు నదేకాలములో చేయఁగల దని యర్థము. ఇట్లు వేలకొలఁది యశ్వశక్తులు గల యింజనులు కూడఁ గలవు.

కావేరినుండి దుమికెడి నీటిని మైసూరు దర్బారువారు "విద్యుచ్ఛక్తిని" ఉత్పత్తి చేయుటకై యుపయోగించుచున్నారు. విద్యుత్తును బుట్టించుటకు కొన్ని యింజనులు పనిచేయవలెను. ఎత్తయిన ప్రదేశమునుండి ప్రవహించెడి కావేరి నీరు పడుటవలన ఈ యింజనులు తిరుగును. ఇవి తిరిగిన కొలఁది విద్యుత్తు ఉత్పన్నమగును. ఇంజనులను త్రిప్పుటకు నదియొక్క నీటి నంతటి నుపయోగించుట యసంభవము, అసాధ్యము. అందుచేత నదికి ఎగుదల నొక యానకట్ట వేసి చిన్న చిన్న కాలువలు తీసి వానిలోనుండి వచ్చెడి నీటిని పెద్ద గొట్టముల గుండ ప్రవహింపఁజేయుదురు. ఈ నీరు ఇంజనులమీఁద పడి వానిని త్రిప్పుచుండును. ఇవి తిరుగుటవలన విద్యుత్తు ఉత్పన్న మగును. ఇచ్చట నుత్పన్నమయిన విద్యుచ్ఛక్తిని తంతువుల ద్వారా కావలసిన చోట్లకుఁ దీసికొనిపోయి యుపయోగపఱచెదరు.

1894, 1898 సంవత్సరములలో మైసూరు దర్బారువారు విద్యుత్తును తయారు చేయవలె ననెడి యుద్దేశముతో ఇంజనీర్లను రావించి సంప్రతించిరి. కాని, యప్పట్లో వారి యుద్యమము సఫలము కాలేదు. అప్పుడు మైసూరు రాష్ట్రములోని పరిశ్రమ లన్నియు కోలారులోని బంగారు గనులును ఆవిరియంత్రములనే యాధారము చేసికొని నెఱవేర్పఁబడుచుండెను. ఇప్పటికిని మన రాజ్యములో మిల్లు లన్నియు రైళ్లవలె ఆవిరితోనే నడపఁబడుచున్నవి.

1899-వ సంవత్సరములో మైసూరు దివానుగా నున్న శేషాద్రి అయ్యరు గారు పట్టుపట్టి "కాంబెల్" "ఫోర్బ్సు" మొదలగు ఇంజనీర్లతో సంప్రతించి విద్యుత్తును తయారు చేయుటకు గట్టి ప్రయత్నము చేసిరి. కోలారులోని బంగారు గనులను కౌలునకు తీసికొన్న మైలరు కంపెనీవారును మైసూరు రాష్ట్రమునం దితర పరిశ్రమలలో పనిచేయుచున్న యంత్రశాలాధికారులును ఆవిరి మానివేసి విద్యుత్తుతోనే తమ యింజనులను నడపెద మని వాగ్దానము చేసి శేషాద్రి అయ్యరు గారిని ప్రోత్సాహపఱచిరి. నదియొక్క ప్రవాహమును బట్టి 90,000 అశ్వశక్తులు గల విద్యుత్తు ఉత్పన్న మగు నని ఇంజనీర్లు రిపోర్టు చేయఁగా, 5,000 అశ్వశక్తులు మాత్రమే తయారుచేయుటకు శేషాద్రి అయ్యరు గారు ప్లాను వేసికొని యా పని నెఱవేర్చుటకు 43 లక్షల రూపాయలను విదేశ కంపెనీలకు కంట్రాక్టుగా నిచ్చెను. కాని తయారగునప్పటికి నికరముగ 4,000 అశ్వముల శక్తి మాత్రమే నిలిచినది.

క్రమముగా నెక్కువ యింజనులను పెట్టి యెక్కువ శక్తిని తయారు చేయుట కారంభించిరి. మొదట ననుకొనినంతకంటె సర్కారునకు ఎక్కువ లాభము రా నారంభించెను. యంత్రశాలాధికారులు తమ యొడంబడిక ప్రకారము కావలసినంత విద్యుత్తు నియ్యవలసిన దని దర్బారువారి నొత్తిడిచేయసాగిరి. వారికి కావలసినంత శక్తి నియ్యఁజాలకపోవుటచేత దర్బారునకు వరుంబడి తగ్గసాగెను. వేసవిలో నీరు తగ్గుటవలన కావలసినంత విద్యుత్తును తయారు చేయుటకు వీలు లేకుండెను. అందుచేత విశ్వేశ్వరయ్య గారి హయామున కన్నంబాడి

యను ప్రదేశములో నొక పెద్ద యానకట్ట వేసి నీటి నాఁపి మరిరెండు ఇంజనులు తగిలించి యెక్కువ విద్యుత్తును తయారు చేయుచున్నారు.

ఈ క్రొత్త యానకట్టయొక్క యెత్తు నదీగర్భమున 60 అడుగులును, ఇరుప్రక్కలను 25 అడుగులును ప్రస్తుతము గలదు. ప్రస్తుతము నాలుగు ప్రదేశములలో విద్యుచ్ఛక్తి యుత్పన్న మగుచున్నది. మొదటి మూఁడింజనుల క్రింద 9,321 అశ్వశక్తులును నాల్గవదాని క్రింద 5,000 అశ్వశక్తులును తయా రగుచున్నవి. ఇవిగాక మరియొక ప్రతిష్ఠాపన సిద్ధ మగుచున్నది. దీనిమీఁద నిదివఱకే 48,902 రూపాయలు వ్యయ మైనవి.

ఎత్తయిన ప్రదేశములనుండి ప్రవహించెడి నీటి నుపయోగించి మెఱుపును సృష్టించి వ్యాపారసౌకర్యములకు ఉపపత్తి కలుగఁజేయుటకు మన దేశములో నిదియే ప్రథమప్రతిష్ఠాపనము. దీనిని జూచి యిటీవల బొంబై సిమ్లా మొదలగు రెండుమూఁడు నగరములలో నిట్టి ప్రతిష్ఠాపనలను స్థాపించిరి. కాని, యగ్రస్థానము మైసూరు దర్బారువారికే చెందును.

శివసముద్రము దగ్గఱ తయా రైన విద్యుచ్ఛక్తి 90 మైళ్ల దూరములో నున్న కోలారు బంగారు గనులయందును బెంగుళూరు మైసూరు నగరములయందును అనేకవిధముల నుపయోగింపఁబడుచున్నది. మైసూరు బెంగుళూరు పట్టణములలో దూదిమఱలు నేతయంత్రములు నూనెమఱలు వడ్లమఱలు అవి యివి యన నేల యంత్రసహాయమున తయారు చేయఁబడు సరకు లన్నియు విద్యుచ్ఛక్తి మూలముననే చేయఁబడుచున్నవి. అచ్చట ఆవిరిశక్తి నడచెడి యంత్రములు లేవు. ఇది గాక, మైసూరు బెంగుళూరుల వీథులలో కూడ మెఱుపు దీపములే కాని నూనె దీపములు గాని గ్యాసు లైట్లు గాని లేవు. ఇఁకమీఁద బెంగుళూరులో ట్రాంబండ్లు కూడ నీ శక్తిచేతనే నడపఁబడును.

ఈ యుద్యమమువలన మైసూరు దర్బారువారికి ఏ విధమయిన నష్టమును కలుగకపోవుటయే కాక స్వల్పకాలములోనే పెట్టుబడి యంతయు వచ్చి ప్రతిసంవత్సరము లక్షలకొలఁది సొమ్ము నికరాదాయముగ వచ్చుచున్న దని యీక్రింది తఖ్సీళ్లవలన తెలియఁగలదు:

1916-వ సంవత్సరము జూను నెలాఖరుకు ఈ యుద్యమము మొదలుపెట్టి 14 సంవత్సరము లైనవి. మొట్టమొదటినుండి యీ 14

| | |
|---|---|
| సంవత్సరములలో పెట్టిన పెట్టుబడి రూపాయలు | 1,07,46,390 |
| ఈ 14 సం. లలో కర్చులతో కూడిన ఆదాయము | 2,35,78,311 |
| పెట్టుబడి తాలూకు వడ్డి యంత్రముల యఱుగుదల జీతములు కూలీ మొదలగు కర్చులు | 1,17,85,716 |
| నికరాదాయము | 1,17,92,595 |

అనఁగా ఈ యుద్యమమువలన మైసూరు రాష్ట్రజులకు అనేకసౌకర్యములును పరిశ్రమాభివృద్ధియు కలుగుటయే కాక సర్కారువారికి సాలునకు రమారమి యెనిమిదిన్నఱ లక్షల యాదాయము వచ్చుచున్నది.

# పుష్పాంజలి

బహుళప్రబంధవనముల - విహారింపఁగఁ గూర్చినాఁడ విస్మృతసుకవి

స్పృహణీయచరిత సౌరభ - రహిఁ బుష్పాంజలి గ్రహింప రండిట సుముఖుల్.

చిరకాలముగ రాజసభలలో వెలుఁగొచ్చుచు మహాభట్టారకకంఠపరిష్కృతములై యుండిన కావ్యభూషణములు కాలవిపర్యయముచేఁ జెదరి రత్నములు లేచిపోఁగా లక్కయు మెఱుఁగాఱిన సీమతళుకు తేకులును మాత్రమే యప్పుడప్పుడు గోచరించుచున్నవి. భూమిఁ ద్రవ్వఁగా నెప్పుడో నశించి పూఁడిన దేవాలయపు ఘంటయో దీపికయో లభించునప్పుడువోలె నీ క్రింది యంశములించుకమాత్ర నద్భుతశోకక్రోధాదిభావములు పుట్టింపఁగల వనియుఁ దెగిపోయిన లూతాతంతువులతోఁ బట మల్లనేర్చు చరిత్రకారులకుఁ జిత్రవర్ణముల ఘటింపఁ జాలు ననియుఁ గాలవైచిత్రిచే విస్మృతిసాగరమగ్నములయ్యుఁ దేలిన భగ్నవాగ్రత్నశకలముల నిందుఁ బ్రచురింప సాహసించితిమి. పూర్వాపరవిభాగమున కనుకూలింపమియు వస్తులాఘవమును దలంచి వీని నీ యాంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో వెల్లడింపఁ దొడంగితిమి. విరుద్ధాభిప్రాయములును బ్రమాదములును జూపఁదలఁచువారీ పత్రికకే వ్రాయుదురని వారిఁ బ్రార్థించెదము. చరిత్రకారుల కనుకూలముగా నిశ్చయార్థ సందేహార్థములను విస్పష్టముగా సూచించుచు సమసంక్షిప్తవిస్తృతముగా నాంధ్రగీర్వాణకర్ణాటద్రవిడవాఙ్మయ సంబంధి విషయములును దేశచరిత్రవస్తుకాంశములును గ్రింద విస్తరింపఁబూనెదము.

**పుష్పిక 1.— శ్యామలాదండకము**

సర్వమంగళావతారప్రశంసగా శ్యామలాదండకమును గ్రహింతము. అది యాబాలగోపాలము చదివి పఠించి తత్కర్త యని ప్రసిద్ధిపడసిన కాళిదాసుని మఱికొంత కొనియాడుచున్నారము గదా! ఒకానొక వ్రాఁతప్రతి కొట్టకొనలో

"ధరాధీశో ధరాధీశో ధారాయాం ధనదోపమః
బభార రాజ్యం భోజాఖ్యో దానమానైశ్చ పండితాన్
మ్లేచ్ఛా నమ్లోచయ ద్వీరో ద్వారకాయాం విరాజితం
శంకరాచార్యగురూణాం స్వం మోషిణో మఠదూషిణః
లోకాశీరససంఖ్యాక (923) శకాబ్దే పూర్ణిమాతిథౌ
శ్రావణే మాసి విప్రేభ్యః కవిభ్యో వ్యతర న్నదా
గ్రామాన్ సోమోద్భవాతీరే శతం యో గిరిశప్రియః
సరస్వతీకంఠభూషాం సరసాలంకృతిం కృతిం
ప్రాణయ త్కీర్తికాయస్య ప్రాయచ్ఛ త్స్వస్య నిత్యతాం
జీయతాం తద్యశో నిత్య మాచంద్రార్కం ద్యుభూషణం
మహాదేవద్విజ శ్శైవో మహాకాలస్య పూజకః
పురాంతక స్తస్య పుత్రః పురారేః కృపయాఽభవత్
శ్యామలాయాః ప్రసాదాద్యః శ్యామలాదండకం వ్యధాత్
వాగ్దేవీ యస్య వశ్యాఽభూ ద్యావో వాచస్పతే రివ
తస్మై గ్రామాన్ శత మదా చ్ఛిప్రావారసవేదినః."

అని యున్నది. ధారాధీశుఁ డగు భోజుఁడు ద్వారకాపురమున దూఱి శంకరాచార్యుల మఠద్రవ్యమును హరించు మ్లేచ్ఛులఁ బాఱఁదోలి క్రీ. శ. 1001 టిలో సోమోద్భవా (నర్మదా) తీరమున నగ్రహారశతమును దానము చేసి సరస్వతీకంఠాభరణ మను నలంకారశాస్త్రగ్రంథమును రచించెను. అప్పుడు మహాకాలదేవాలయపూజకబ్రాహ్మణుఁ డగు మహాదేవునిపుత్త్రుఁడు పురాంతకుఁ డను కవి శ్యామలాదండకమును రచింప భోజుఁ డతనికి నగ్రహారశతమును శిప్రా (నర్మదా) తీరముననే యొసఁగినట్లు తెలియుచున్నది. ఈ యంశము తంజాపురినివాసులును గీర్వాణభాషాపండితులు నగు టి. ఎస్. కుప్పుస్వామిశాస్త్రులవారు "ఆర్యధర్మ" మను ద్రావిడపత్రికలోఁ బ్రచురింపఁగా దానిలోనుండి యుద్ధరించితిమి.

**పుష్పిక 2.— కవిభల్లటుఁడు**

ఆంధ్రశబ్దచింతామణిలోఁ దద్గ్రంథకర్త కవిభల్లటునిఁ బేర్కొనియున్నాఁడు. కవిభల్లటుఁడు సంస్కృతభాషలోఁ బదమంజరియు గణమంజరియు నను నిఘంటు

WILLIAM CAVENDISH: Governor General of Canada



విలియము కావిన్డిషుప్రభువు: కనడా దేశపు గవర్నరు జనరలు

GENERAL SIR MACKINSON WOOD
(Director General of Recruiting)



జనరలు సర్ మాకిన్సను వుడ్డు. సైన్యనిర్మాణకుడు

MR. HUGES: MINISTER OF AUSTRALIA



హ్యూజెసు, (ఆస్ట్రేలియామంత్రి)

LORD ROBERT CECIL
Under Secretary for Foreign affairs



రాబర్టు సిసీల్ ప్రభువు (విదేశాంగమంత్రి)

GENERAL POLIVANOFF
Russian New Minister of war



జనరలు పలవినాఫ్ : క్రొత్తరష్యను యుద్ధాంగ మంత్రి

PRESIDENT RUSSIAN DUMA



ప్రెసిడెంటు: రష్యను డ్యూమా

ESSAD PASHA



ఇస్సదు పాషా

HUSSAIN THE 1st MECCA SULTAN



మొదటి హుస్సేను (మక్కా-సుల్తాను)

వులు రచించి వాని మొదలను గడపటను గ్రింది శ్లోకములు గూర్చియున్నాఁడు.

"లక్ష్మీ ర్బుద్ధనృపాలేన యం ప్రాప్తా కవిభల్లటం
తేన కావ్యదృశా ప్రోక్తా సప్రాసా పదమంజరీ."

"ఇతి శ్రీమద్దాక్షారామ (భీమ) నాథ వరప్రసాదలబ్ధ సకల భాషాకవితానిర్వాహక కవిభల్లటవిరచితా గణమంజరీ సమాప్తా."

పై శ్లోకములోఁ జేర్కొనఁబడిన బుద్ధనృపాలుఁడు గోనబుద్ధనృపాలుఁ డగునేని దాక్షారామప్రాంతనివాసి యగు భల్లటుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁడు కావలసివచ్చును. ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్ట కృతము కాదను ననేక బాధకములు చూపిన పిదప దీనిని సహితము సూచింపఁదగును.

మఱియొక భల్లటకవి ప్రతాపరుద్రుని సభలో నుండినట్లు శృంగారశేఖరుఁ డను కవి యభినయభూషణ మను గ్రంథమున నిట్లు చెప్పుచున్నాఁడు.

"ఇతీవ కథయామాస వీరభల్లటదేశికః
ఆలోచ్య శుక్రసంప్రోక్తసమ్మతిం గురుశేఖరః
ప్రతాపరుద్రదేవస్య సన్నిధౌ సర్వశాస్త్రవిత్."

ఈ వీరభల్లటుఁడు నాట్యశాస్త్రమునఁ జాలఁ బ్రసిద్ధుఁ డైనట్లు పై గ్రంథమునఁ జెప్పఁబడినది. చాళుక్య భల్లాళసేవణకాకతీయాదిరాజులు సంగీతనాట్యశాస్త్రములలోఁ బ్రౌఢగ్రంథముల రచించియు రచియింపఁ జేసియు నున్నారనుట మనకు హర్షశోకములఁ గలిగింపక తప్పదు. గణపతికి గజసేనాపతి యగు జాయ దండాధినాథుఁడు నృత్తరత్నావళి యతిమనోజ్ఞముగా రచియించియున్నాఁడు. ఈ విషయము ముందుముందు వచ్చును.

పుష్పిక 3.—వెల్లంకి తాతంభట్టు

ఇతఁడు శ్రీనాథునకుఁ దరువాతఁ బెద్దనాదులకుఁ బూర్వ ముండినవాఁడు. ఇతఁడు ఛందోదర్పణము కావ్యచింతామణి మొదలగునవి రచించెను. ఇతని పాండిత్యాతిశయ మిట్టి దని మెఱుఁగఁగోరువారు ఛందోదర్పణము మొదట నుద్ధృత మగు క్రింది పద్యములను జూడుఁడు.

సీ. ఏ కవి నిర్మించె నీ శబ్దశాస్త్రప
ద్ధతియెల్లఁ గవుల చింతామణి యన?
నే కవి చెప్పె ననేకపుణ్యానల్ప
బంధురసంక్షేపభాగవతము?
నే కవి పఠియించె నెల్లభాషలు నతి
ప్రకటనిర్భరమతిప్రౌఢి మెఱసి?
యే కవి దెచ్చె మహీశసంఘముచేత
వారణాశ్వాదివస్తుచయము?
నతఁడు వెల్లంకి తాతమహాయశోగ్ర
గణ్యుఁ డుత్తమసుకవిముఖ్యాధినాథుఁ
డంబరాశావకాశవిఖ్యాతచక్ర
వాళశైలాంతరావాప్తఖేలయశుఁడు.

సీ. కర్ణాటకటకభూకాంతసభాంతప్ర
గల్భకవీశ్వరకమలహేళి!
గజపతిసంసదఖర్వవిద్యాగర్వ
తార్కికకుముదసుధామయూఖ!
యశ్వసాదనమహేంద్రాస్థానశాబ్దిక
వర్యచూతద్రుమవనవసంత!
మాళవేశ్వరసదోమధ్యమాస్థాయికా
లంకారికమయూరలలితమేఘ!
యనుచు నిన్ను వనీపకు లహరహంబు
సరసగంభీరవాక్ప్రౌఢి సన్నుతింతు
రబ్బధీమణితనయ! శబ్దార్థనిలయ
తస్థిరాత్మక (?) వెల్లంకి తాతసుకవి!

పై పద్యములలోఁ దాతప్ప నరపతిగజపత్యశ్వపతిసంస్థానములనే కాక మాళవేశ్వరుని సభలోను ప్రఖ్యాతుఁడై కవిత్వన్యాయవ్యాకరణాలంకారశాస్త్రములలో నసమానుఁ డనియు సంక్షేపభాగవతకర్త యనియు సూచింపఁబడుచున్నది.

పుష్పిక 4.— సంస్కృతవసుచరిత్రము

"వసుచరిత్రాదికావ్యప్రీతబహునృపప్రాపితానేకరత్నాప్లవుండ" నని రామరాజభూషణుఁడు గణనగాఁ బ్రశంసించుకొనిన వసుచరిత్ర సంస్కృతద్రవిడ కర్ణాటభాషలలో ననువదింపఁబడియె నన్న నాంధ్రులకు మేలిమి తెచ్చునుగదా! అరవమున నెవ్వఁడో తిమ్మారెడ్డి ప్రేరింపఁగా నేదో విధముగా నిది యనువాదము గావింపఁబడియె. సంస్కృతమున నప్పయదీక్షితుల శిష్యుఁ డగు కాళహస్తికవి సాధ్యమైనంత ప్రౌఢముగా రచించె.

ఈ కవి రామరాజభూషణుని పేరెత్తక తిరుమలరాయని వంశావళియు నాశ్వాసాద్యంతపద్యములను వదలినందున నొకవేళ సంస్కృతము తెలుఁగునకు మూలగ్రంథమగు నేమో యని తోఁచును గాని యాంధ్రకవిస్తోత్రమును దెనుఁగు పద్యమునకు సరియగు శ్లోకమును గూడి యుండుట కాక కాళహస్తికవి యప్పయదీక్షితులవారి శిష్యుఁ డగుటచే రామరాజభూషణునకుఁ దరువాతివాఁ డగుటయుఁ గారణంబులుగా నాంధ్రగ్రంథమే మూలమని కంఠోక్తిగాఁ జెప్పవచ్చును. ఇయ్యది కాంచీపురీశ్వరి యగు కామాక్షీదేవి కంకిత మీఁబడినది. కవి స్తోత్రపద్యములను "నానాసూన" "బ్రహ్మోపదేశ" "ఆజూంబిల్లి" మొదలగు పద్యములకు గీర్వాణభాషానువాదమును నుదాహరించెదము.

1. యః కన్యాం కవితాం క్షితావజనయద్యో వాఽతతానాగమాన్
   యో వాహం త్వ మితీరణాన్వరచయత్యోఽదాత్పదాళిం మృదుం
   యస్యానంద మణీఘటద్ఘనతులా కోటింగుణా న్యోఽదిశత్
   యే నానేన కరాస్తిరర్థగురుతాం యోఽపూరయ ద్విశ్రుతాం॥

2. వాల్మీకిపారాశరికాళిదాస
   దండిప్రమృవ్యద్భవభూతిమాఘాన్
   వల్లన్మయూరం వరభారవించ
   మహాకవీంద్రాన్ మనసా భజే తాన్.

ఆంధ్రకవి వర్ణనము

3. వాక్యానన్నప్రథితకుండలివల్లభశ్రీ
   నాథేషు సద్ధజనసద్ధిలిపాలనేషు
   సోమే చ శోభయతి భాస్కరనామ్నిచాంధ్ర
   కావ్యప్రపంచమహిమా స హి మాననీయః.

ఆంధ్రములో లేని పద్యము

4. శ్రీదక్షిణామూర్త్యపరావతారం
   శ్రీకంఠభాష్యాంబుధిపూర్ణచంద్రం
   అత్యాదరా దప్పయదీక్షితేంద్రం
   విద్యాగురుం మంత్రగురుం భజామి.

5. సారంగః సకలప్రసూనకుతుకీ సర్వాత్మనోపేక్షితే
   మా మిత్యేవ విచింత్య గంధఫలికా మాన్యాతపస్యాస్థితః
   నాసాకార ముపేత్య సర్వసుమనః సౌరభ్యయోగా ద్వధూ
   చంచద్వీక్షణచంచరీకపటలీం సంప్రాప కిం పార్శ్వయోః.

6. మోహాంధ్వాంతసనిద్రదృబ్జలినయో రుక్మచ్యం హిమాంభః కథం
   స్వేదాంబూద్గమఖిన్నచక్రకుచయోః శీతాంశునామ్నా హ్యలం
   ఆశావృంత చలాసుమానసవిధేః కిం తాళవృంతానిలైః
   తప్తేఽస్యా స్తనహేమ్ని పల్లవపుటీ తేజోఽగ్నిణం కిం క్షమం.
   స్మరాగ్నితప్తమృత్పాత్ర స్నేహాపూరసముల్బణే
   పద్మాయతాక్ష్యాః కిం కార్యం పటీరరససేచనం.

7. తదను వదనరాకాతారకానాథకాంతే
   నిహితమహితచేలా నిస్త్రపం సా రురోద
   కిసలయమృదురాజత్కన్నరీపాణివీణా
   సరసరవసుధాంచత్స్వరపూరానుకారం.

ఆశ్వాసాద్యంతపద్యములు

శ్లో. కామాక్షి దేవి కరుణామయి కామకోటి
   కాంచీపురీశ్వరి కదంబవనీనివాసే
   కాంతైకచూతపతినా కలితావధానా
   కర్ణామృతం కలయ కావ్య మిదం మదీయం.

౮. ఇతి శ్రీకామాక్షీదాస కాళహస్తి కవి విరచితే వసుచరిత్ర చంపుకావ్యే.

# అత్యద్భుత మైన సినీమా నగరము

విస్సా అప్పారావు గారు ఎం. ఏ., ఎల్. టి.

ఉత్తర అమెరికా ఖండమందు యునైటెడ్ స్టేట్సు అను సంయుక్తపరగణాలు ఒక ప్రసిద్ధ మైన దేశము. ఈ దేశమునకు పశ్చిమమున కేలిఫోర్నియా అను ఒక పరగణా కలదు. ఇది పసిఫిక్ మహాసముద్ర తీరస్థము, జపానుదేశమునకు దగ్గఱ. మనము ఆ దేశమునకు పోవలె ననిన ఇండియను మహాసముద్రమునుండి పసిఫికు మహాసముద్రమునకు పోయి అది దాఁటి కేలిఫోర్నియాకు సులభముగా వెళ్లవచ్చును. అందు సేన్ ఫెర్నాండో అను లోయయొక్క మధ్యభాగమున ఒక యత్యద్భుత మైన పట్టణము గలదు. ఇందలి చిత్రములు ప్రపంచమునందు మఱెక్కడను చూడఁజాలము. దీని పేరు యూనివర్ సల్ సిటీ. ఇది యొక మ్యునిసిపాలిటీ. వినోదార్థము మన మందఱము చూచి యానందించు సినిమటోగ్రాఫు బొమ్మలను (వీనినే బయోగ్రాఫు బయోస్కోపు సినీమా యని యందురు.) తయారు చేయుటయే ఇక్కడివా రందఱకు పని. ఈ పట్టణమునకు సామ్యము ఇదే కాని మఱియొకటి లేదు. దీనిని అమెరికావారు 1915-వ సం. మార్చి నెలలో స్థాపించినారు. ఈ పట్టణమును పోయి చూచువారికి తాము చూచునది యంతయు నిజమే యని తోఁచును గాని ఒక కథకు అనుగుణ మైన నాటకప్రదర్శన మని సందేహ మెంత మాత్రమును గలుగదు. గొప్ప విశాల మైన నాటకరంగము లగు వీథులయందలి చూపఱ మని తోఁపదు. ఇరువదియవ శతాబ్దమందలి గొప్ప నాగరకత గల జగజ్జెట్టులు గూడ అక్కడికి పోయినప్పుడు నిజ మను భ్రాంతిచే దగాపడుచున్నారు. దీనిని మాయాకల్పిత నగరము లేదా నాటకనగరము అని పిలువవచ్చును.

ఈ పట్టణపు వీథులయందు పోవునపుడు అద్భుత కల్పనాకథలయందు చెప్పఁబడిన పట్టణమా అని తోఁచును గాని సాధారణ మని తోఁపదు. నేఁడు చూచిన వీథి మఱునాటికి ఉండదు. ఇప్పుడు చూచిన యిల్లు ఉత్తరక్షణమున మాఱిపోవును. ఫలానా వీథి అందు ఫలానా యిల్లు అని గుర్తించుట కెంత మాత్రమును వీలు లేదు. అక్కడి యిండ్లు కేవలము మన్ను ఇటుకరాయి సున్నములతో కాక కఱ్ఱబల్లలు కాకితపుటట్టలు వెదురుతడకలు మొదలైనవానితో కూడ ఇష్టము వచ్చినట్లు మార్చుకొనుటకు వీలుగా కట్టఁబడియున్నవి. కొన్నివేల సంవత్సరముల క్రింద ప్రఖ్యాతి గాంచిన ట్రోయి బేబిలోను హస్తినాపురము మొదలైన పట్టణములవలె ఒకనాఁడును, మఱియొకనాఁడు లండను పేరిసు న్యూయార్కు మొదలగు మహాపట్టణరాజములవలెను ఈ వింత నగరము రంగులు మార్చుచుండును. దేశదేశములయందలి వివిధ వీథులవంటి వీథులును అక్కడ మచ్చున కొకటి యేర్పఱుపఁబడి యున్నవి. రాజమందిరమువలె కన్పట్టు దానిని బజారు దుకాణమువలెఁ గాని గొప్ప కళాశాలవలెఁ గాని కచ్చేరివలెఁ గాని యుద్ధపు కర్మాగారమువలెఁ గాని దొంగలు గుమిగూడి దురాలోచనలు సలుపు రహస్యప్రదేశమువలెఁ గాని ఇష్టానుసారముగా 12 గంటలలో అక్కడివారు మార్పఁగలరు. అక్కడి గ్రామాధికారుల కార్యనిర్వహణముకొఱకు నియమింపఁబడిన మందిరము నాలుగు దిక్కులకు నాలుగు విధములుగా కనఁబడునఁట. ఒక ముఖమున ప్రవేశించి మఱియొక ద్వారమున వెలువడునప్పుడు ఒక యింటినుండి కేవలవిరుద్ధ మైన మఱియొక యింటిలోనికి చొచ్చినట్లు భ్రాంతి పొందించును. క్రొత్తవారికి భయోత్పాదమును కల్పించును.

1913, 1914 సంవత్సరములలో ఈ పట్టణమును నిర్మాణము చేసి 1915 లో నాటకులు సూత్రధారులు అధికారులు మొదలైనవారు ప్రవేశించినారు. పట్టణము ఇప్పటికిని పూర్తి గాలేదు. ఎప్పటికి కాఁగలదో చెప్పుట కష్టము. చేయవలసిన క్రొత్త యేర్పాటులకును వింత కట్టడములకును మితి లేకున్నది. సర్వసాధారణ మైన యన్ని పట్టణములయందువలెనే దీనియందును పోలీసు న్యాయాధికారులు ఉపాధ్యాయులు మొదలైన యన్ని బాపతులవారును ఉన్నారు. కాని, వీరు చేయు పనులు తదితర పట్టణములయందలివారివలె నిజము గాదు. నాటక మని యిదివఱలోనే చెప్పఁబడియుండెను గదా.

కావలె నన్నచో విద్యుచ్ఛక్తిని తీఁగల మూలమునను కిరసనాయిల్ గాలిని నిర్మలోదకమును గొట్టముల ద్వారాను సిద్ధపఱచియున్నారు. ఈ కిరసనాయిల్

గాలి అగ్నిని పుట్టించుటకును దీపములు వెలిగించుటకును ఉపయోగింపఁబడును. ఆ పట్టణము చుట్టు నొక పెద్ద వీథి గలదు. అది యేఁబది మైళ్ల పొడవు. ఇక్కడి వీథులు మన దేశమందలి వీథులవలెఁ గాక, అతి శుభ్రముగాను గోతులు లేకుండునట్లును దుమ్ము గురకుండునట్లును జాగ్రత్తతో కాపాడఁబడును.

అడవి జంతువులను బయాస్కోపులో చూచుట, సర్కసు ఆటలోవలె సింహము పెద్దపులి మొదలైన వానిని స్వాధీనపఱచుకొనిన దొరలయొక్కయు దొరసానులయొక్కయు దినచర్యలను చూచుట, సీనిమటోగ్రాఫు చూచినవా రందఱికిని సర్వసాధారణమై యున్నది. అట్టి క్రూరమృగములతో కలసిమెలసి అద్భుత చర్యలు నిజముగా జరపినారా యని ఆశ్చర్య మందఱకును కలుగక మానదు. ముమ్మాటికిని నిజమే కాని, అం దెంత మాత్రమును అసత్యము లేదు. అన్ని విధములైన యడవి మృగములను ఇతరమృగములను రకరకముల కుక్కలను పిల్లులను గుఱ్ఱములను పిట్టలను పావురములను చేపలను మొసళ్లను అన్ని విధములైన జంతుకోటిని కథానుసారముగా పనికివచ్చుటకు ఈ వింతనగరమువారు చేర్చి యున్నారు. వీని నన్నిటిని ఒక యావరణయందు వేఱువేఱు ఱెండ్లలో క్షేమముగా జాగ్రత్తపఱచియున్నారు. మదరాసులోని పీపిల్సు పార్కువంటి దానినిగా దీనిని భావింపవచ్చును. దీనిని 'జూ' యని యందురు; లేక జంతుప్రదర్శనశాల యనవచ్చును.

అమెరికాఖండమందు ఎఱ్ఱ యిండియనులు అను నిమ్నజాతివారు గలరు. వారు నాగరికులు కారు. వారి చర్యలు పద్ధతులు కథలు సినిమా ద్వారా ప్రపంచమునకు విదితపఱచుకొఱకు ఆ తెగవారిని కొందఱిని ఈ నగరమునందు ఒకమూల నివసింపఁజేసినారు. వారు వారి యిష్టానుసారము పనులను చేసికొనుచు జీవనము వెళ్లఁబుచ్చుచుందురు. నిమ్నజాత్యుద్ధరణము నాగరికుల కందఱకు కర్తవ్య మైనను ఇక్కడ కావలసిన పని వేఱు గనుక ఎప్పటి స్థితిలోనే వారి నుంచియున్నారు.

ఆ పట్టణమందలి నటులు, అనేక దేశములయందలి వారివలె అభినయింపవలసియుండును గాన, ఏ కథకు అనుకూల మైన వేషము ఆ కథకు వేయవలసియుండును గాన, ఆఁడవాండ్రకు మగవారికి పిల్లలకు కావలసిన దుస్తులు ఎన్ని రకములు కావలసియుండునో చదువరులే ఊహింతురుగాక. ఈ బట్టలను సిద్ధపఱచుటకుఁగాను దేశదేశములందలి వింతవింత రకముల చీరలు రవికెలు గనులు షరాయీలు మొదలైనవి కుట్టుటకు నేర్పరులైన పనివా రెందఱో ఇక్కడ నున్నారు. ఈ దుస్తులను జాగ్రత్త పెట్టుటకును వేషములు వేసికొనుటకును 500 గదులు ఏర్పాటుచేయఁబడియున్నవి. ఈ గదులకు అగ్నిభయ మనునది కల నైన లేకుండుటకై గట్టి యేర్పాటు ఆ గదులను కట్టుటయందే చేసియున్నారు. పాశ్చాత్యులకు ఈ బట్టలు కట్టుటలో రోజునకొక మార్పు వచ్చుచుండును గనుక ఫేషనునకు విరుద్ధము గాకుండ దుస్తులు ఎప్పటికప్పుడు మార్చుచుందురు. ఇది బహుబుద్ధికుశలతయు ప్రపంచజ్ఞానమును కలిగినవారి సలహాల ప్రకారము జరపఁబడును. ఇదియే కాదు, ఏ విషయమం దైనను సంపూర్ణులే దానికి నియమింపఁబడి కార్యనిర్వహణము చేయుచుందురు.

ఈ యద్భుత మైన పట్టణమునందు రెండు ఫర్లాంగుల పొడవు గల ఖాళీస్థలము గలదు. అది బాగుగా చదును సేయఁబడి అతిశుభ్రముగా నుంచఁబడును. ఇది సాము గరిడీలు మొదలైన వ్యాయామములు సాధారణముగా చేయువారి కేర్పఱుపఁబడినది. అందు అన్ని రకముల యాటలును సర్కసు మొదలైనవియును ఆడుటకు తగిన యేర్పాటులు చేయఁబడియున్నవి. ఇంతే కాక, అవసర మైనయెడల రోమ్ అను పురాతన నగర మందలి కొలీజయమ్ వలె మార్పవలె నన్నఁ గాని పెద్ద సంత యేర్పాటు చేయవలసినఁ గాని లేదా హిందూరాజులయొక్కయు పాదుషాలయొక్కయు దర్బారుల నలంకరింపవలయు నన్నఁ గాని వీ లగునట్లు కూడ నిది యేర్పఱుపఁబడి యున్నది.

ఈ పట్టణము సినిమా బొమ్మ నాటకములను స్వభావవిరుద్ధము గాకుండునట్లు ప్రపంచ విదితము జేయుటకై నియమించిన దని చెప్పఁబడియున్నది. ఇందు సర్వవిషయములను గుఱించిన యేర్పాటులును గావలయును గదా. పైని ఉదాహరించిన నాలుగు విషయములయొక్క యేర్పాటుల పరిమాణ మెంతటిదో, అనఁగా అతివిపుల మనియు బహుకష్టసాధ్య మనియు చదువరులు గ్రహించియే యుందురు. ఇట్టి విషయము లెన్నియో యున్నప్పుడు వారు చేయవలసిన యేర్పాటులకు మితి యుండునా? వాని నన్నిటిని గుఱించియు ఇక్కడ వ్రాయుట కవకాశము లేదు. ఊహను బట్టి

యాలోచింపఁదగినదియే కాని వేఱు గాదు.

ఇది యొక గొప్ప పట్టణ మని వ్రాసి యుంటిమి గదా. దీని కా పేరు తగునా? దాని నిజ మేమి? అని సందేహము కలుగక మానదు. నిశ్చయముచేత ఇది యొక గొప్ప సినీమా నాటకపు కంపెనీవారు ప్రదర్శనమునకు వీలుగా చేసికొన్న యొక గొప్ప నాటకశాల. సాధారణశాలలు ఒక యింటిలోనే యిమిడియుండును. అందు ఎప్పుడును ఒక్కొక నాటకమునే యాడుచుందురు. నాటకమును రాత్రియందే యాడుదురు. కాని, ఈ కంపెనీవారి నాటకములు రాత్రింబగళ్ళనక ఎల్లప్పుడును అనేకములు ప్రదర్శింపఁబడుచుండును. కొన్ని యిండ్లలోను కొన్ని వీథులలోను ఆడఁబడును. నాటకశాలలో సీను లెంత యేర్పఱచియుంచినను నిజ మైనవి కానందున తృప్తిని కలుగఁజేయఁజాలవు. అందుచేత సాధ్య మైనంతవఱకు ఈ కంపెనీవారు అట్టి సీనులు నిజముగా ఉన్నచోటికి పోయి ఆడుచుందురు. ఇందుకు తోడ్పాటుగా నుండవలసిన సకలసన్నాహవిశేషములను తయారు చేయుట మరమ్మతులు చేయుట మొదలైన కార్యములకు కూడ పరాపేక్ష లేకుండ వారే యేర్పాటులు చేసికొనియున్నారు. ఇవి యన్నియును ఒక యావరణయందే యిమిడ్చియున్నారు. అందుచేత ఈ సన్నాహమున కంతటికిని వారికి 4000 ఎకరముల నేల కావలసివచ్చినది. అనఁగా ఈ నాటకశాల $2\frac{1}{2}$ మైళ్ళ చదరము కలిగియున్నది. ఎంత గొప్ప కంపెనీయో ఆలోచింపుఁడు. లోనికి పోయినయెడల వైశాల్యమును బట్టియు నాటకుల చర్యలను బట్టియు వివిధవస్తుప్రదర్శనశాలలను బట్టియు అనేక కర్మాగారములను బట్టియు ఈ కంపెనీ గొప్ప పట్టణ మను భ్రాంతిని కలుగఁజేయును. కాని, మన మందఱము పోయి కాఁపుర ముండుటకు వీలు లేదు. మదరాసునందలి స్పెన్సర్ ఓక్సు మొదలైన కంపెనీలను మనము పూర్తిగా చూచినచో కొంతవఱకు ఈ కంపెనీయొక్క స్థితి అవగాహన కాఁగలదు. కాని, పోలిక మిక్కిలి దూరము.

ఈ సినీమా కంపెనీలు అమెరికా దేశమందు మిక్కిలి వ్యాపించియున్నవి. అందులో కేలిఫోర్నియా పరగణాయందు ఎక్కువ. ఈ కంపెనీవారి నాటకనగరమునకు నాలుగు క్రోసుల దూరములో లాజ్ ఏన్‌గిలేస్ అను పేరు గల యొక నిజమైన గొప్ప పట్టణ మున్నది. అక్కడ ఇట్టి చిన్న చిన్న కంపెనీలు చాలఁ గలవు. ఫ్రాన్సు ఇంగ్లాండు జర్మనీ మొదలగు దేశములయం దిట్టి కంపెనీలు కలవు. ఇవి యన్నియును పట్టణమధ్యమందే ఏర్పఱుపఁబడియున్నవి. వీథిలో నాటక మాడవలసినప్పుడు అనేకాటంకములు కలుగవచ్చును. అట్టి యాటంకము లెంత మాత్రమును లేకుండుటకై యూనివర్సల్ కంపెనీవారు ఒక పట్టణమును వేఱె తాము నిర్మించుకొనియున్నారు. ఇది ప్రపంచమందలి యన్ని కంపెనీలకంటెను పెద్దది. ఈ కంపెనీకి అధికారులు అనగా లాభనష్టములను వహించువారు కొందఱు గలరు. వీరు సాధారణముగా నాలుగు కోట్ల రూప్యములు పెట్టుబడి పెట్టి వ్యాపారమును చేయుచున్నారు. ఎంత వ్యాపారమో ఎంత లాభము గలుగునో ఆలోచింపుఁడు. వీరు ఆడించు నాటకములకు సహాయులుగా ఉండుటకు ఏ కారణముచేత నైనను రోజునకు 20,000 మంది కావలె నని మాడరన్ రివ్యూ పత్రికయందు 'నిరుపమచంద్రగుహ' గారు వ్రాసియున్నారు. ఈయన మన దేశమువారే. ఆ కంపెనీలో అసిస్టెంటు ప్రొడ్యూసరు పని చేయుచున్నారు. ఈ కంపెనీవారి తరఫున 26 గురు పెద్ద యుద్యోగస్థులు ప్రొడ్యూసర్సు అనువా రున్నారు. వీరికి సినీమా బొమ్మలను తయారు చేయించుట ముఖ్యమైన పని. మనము వారిని సూత్రధారులుగా చెప్పవచ్చును. వారియొద్ద ఒక్కొకరికి ఒకరిద్దఱు అసిస్టెంటు ప్రొడ్యూసర్సు అనఁగా సహాయ సూత్రధారు లుందురు. ఈ సూత్రధారు లందఱు ఒక్కొక విషయమందు పరిపూర్ణులు. ఒకరికి ఆఫ్రికాఖండవాసుల చర్యలు స్థితిగతులు బాగుగా తెలిసి, అట్టివారు నాటకమునకు కావలసినయెడల వారిని తయారు చేసి తగిన యేర్పాటులను చేయఁగల సామర్థ్యము ఉండును. మన హిందూదేశస్థుల దినచర్యలు ప్రదర్శించుటకయి సహాయపడుటకుఁగాను 'నిరుపమ చంద్రగుహ' గా రేర్పఱుపఁబడియున్నారు. ఇటులే ఒక్కొకరు ఒక్కొక దేశవిషయము తెలిసినవారు. ఒక సూత్రధారుని క్రింద సాధారణముగా 20 మంది నాటకులు ఏర్పడియుందురు. ఒక్కొకసారి అవసరమును బట్టి అంతకంటె నెక్కువమంది కావలసినప్పుడు ఇతర గ్రామములనుండి సుప్రసిద్ధు లగు నటులను ఎంత ద్రవ్యమైన ఇచ్చి పిలిపింతురు. మేరీ పిక్‌ఫర్డు అనునామెను వారమునకు 6,000 రూపాయిల నొసఁగి అవసర మైనప్పుడు తీసికొనివచ్చుచుందురఁట. ఈమె మిక్కిలి

సుప్రసిద్ధులగువారలు.

ఈ కంపెనీవారు ధనవ్యయము చేసి ప్రసిద్ధుల చేత సర్వజనసమ్మతము లగు అద్భుతచర్యలతో నున్న నాటకములను కథలను వ్రాయించుచుందురు. ఆ వ్రాసినదానిని ఒకసూత్రధారున కిత్తురు. వానికి కావలసిన ధనమును సామగ్రిని ఇచ్చెదరు. తక్కిన పనులు అనఁగా పాత్రల నెన్నిక వారికి అభ్యాసము చేయించుట మొదలైనవి సూత్రధారుడే చూడవలసిన విధి. అధికారుల కేమియు జోక్యము లేదు. సిద్ధమైన తరువాత నాటకమును ఆడింతురు. అప్పుడు ఎదుట చూపఱు లెవ్వరు నుండరు. ఈ సూత్రధారుఁడును నాటకమును ఫొటోగ్రాఫు తీయువారును మాత్ర ముందురు. నటులు మాటాడవలసిన అవసరము లేదు. చేష్టలు ప్రధానము. కాని, ముఖచర్యలు సంభాషణయందుఁ గాని ఒప్పవు. కావున మాటలాడుచున్నటు లభినయించుచుందురు. ఈ నాటకమంతయు క్రమముగా ఫొటోగ్రాఫ్ తీయఁబడును. ఈ ఛాయాపటములు తీయు యంత్రములు మన మందఱము చూచుచున్న వానివలెఁ గాక కొంత మార్పు గలిగియుండును. ఈ యంత్రమందుపయోగపడుచు ప్లేట్లు సెలులాయిడ్ అను వస్తువుతో చేయఁబడును. ఇది కాలర్ అను మెడపట్టీలకుఁగాను ఉపయోగింపఁబడుచున్నది. దీనిగుండా గాజువలెనే ఈవలనుండి ఆవలకు చూడవచ్చును. ఈ సెలులాయిడ్ బద్దెగా చేయఁబడి చుట్ట చుట్టలుగా ఏర్పఱుపఁబడియుండును. ఇది సాధారణముగా 1¼ అంగుళము వెడల్పు ఉండును. దానిమీఁద వరుసగా చిన్న చిన్న ఫొటోగ్రాఫులు సెకనుకు 16 చొప్పున తీయఁబడును. ఈ 16 ను ఒక యడుగు పొడుగులో ఇమిడియుండును. గంటకు 60 నిమిషములు, నిమిషమునకు 60 సెకనులు గదా. (3600 × 16) 51, 600 సుమారు గంటకు 50 వేల ఫొటోగ్రాఫులు తీయఁబడుచున్నవి. అందుకు కొన్ని వేల (3600) అడుగుల సెలులాయిడ్ బద్దె కావలసియుండును. ఒక్కొక చుట్ట 1000 అడుగుల పొడవును సాధారణముగా దాఁటియుండదు. తక్కువ యుండవచ్చును. 1000 అడుగుల బద్దె 15 నిమిషములలో సాధారణముగా ప్రదర్శింపఁబడుచున్నది. ఈబద్దెను ద్రావకములతో శోధనము చేసి మామూలు ఛాయాపటములవలె తయారు చేయుదురు. ఈ బద్దెచుట్టను రీల్ అందురు. తయారయిన తరువాత బయాస్కోపు ప్రదర్శనము చేసి చూచి చెడిపోయిన బద్దెను కాల్చివేసి క్రొత్త బద్దెమీఁద తయారు చేయుదురు. ఇట్లు సిద్ధపఱచి సూత్రధారులు కంపెనీ యధికారుల కిచ్చెదరు. వారు ఎన్ని యార్డర్లు ఉండునో అన్ని కాపీలు తయారు చేయించి ఏ దేశమున ఎవరికి ఎన్ని కావలెనో, వానిని కావలె నన్న నాఁటికి రవానా చేయుదురు. ఇట్టి చుట్టలను సంగ్రహించి ఈ బయాస్కోపు ప్రదర్శనము జీవనముగా చేసికొన్న వారికి అద్దెకుఁ గాని క్రయమునకుఁ గాని పంపుటకుఁగాను మన దేశమందు బొంబాయిలో కంపెనీలు ఏర్పడియున్నవి.

ఈ సినీమా బొమ్మ నాటకములను చూచుటకై జనులకుఁ గల యాసక్తి యింతంత యని చెప్ప నలవి కాదు. సర్వజనసామాన్యమునకు బొమ్మ లన్న మిక్కిలి యాసక్తి. నాటకములు కథలు అన్న చెప్ప నక్కఱయే లేదు. అందుచేత బొమ్మలు నాటకములు కథలు కలసి ఒక్కమాఱు కంటికి గోచర మగు నన్న వారికి బొమ్మ నాటకములయందు కలిగెడి ప్రీతికి మితి యుండునా? ఇందులకు ప్రతిదినమును అట్టి నాటకములను చూడఁబోవు జనులయొక్క సంఖ్యయే నిదర్శనము. సాయంకాలమందు మదరాసు మౌంటురోడ్డువద్ద నిలువఁబడి చూచినయెడల ఈ సంగతి ప్రత్యక్షముగా కనఁబడును. ఈ నాటకములవలని యుపయోగములు ఎన్నియో కలవు. మానవకోటియందు ఎల్లప్పుడును అనేక కారణములచేత పుట్టినట్టి సర్వమనోభావములు అనఁగా శృంగారము భయానకము కరుణ మొదలైనవి ప్రత్యక్షముగా దృగ్గోచరమగుచుండును. మఱియును ఎల్లదేశములవారిని వారి స్వభావములను వారి జీవనమును అందలి చిత్రమైన పద్ధతులను బుద్ధిశాలులచేత క్రొత్తగా కనుపెట్టఁబడినట్టి యంత్రములను ఇంకను ననేకసంగతులును ఎక్కడ నున్నవారికి అక్కడనే విదేశములు పోయి చూడ నవసరము లేకుండనే తెలుపుటయందు మిక్కిలి యుపయోగపడుచున్నవి. ఇవి ఎంత సుబోధకములో ఎంత సులభసాధ్యములో ఆలోచింపుఁడు. ఇట్టివి అమెరికా యూరోపా ఖండములయందు మిక్కిలి వ్యాపించియున్నవి. అక్కడి ప్రతి స్కూలులోను ఇట్టి యంత్రము ఒకటి కలదఁట. తద్ద్వారా కుఱ్ఱవాండ్రకు కావలసిన సర్వవిషయములును నేర్పుచున్నారఁట. మన దేశమందు అట్టివానియెడల జనసామాన్యమున కభిరుచి విశేషముగా కలిగి దేశాభివృద్ధికి తోడ్పడునుగాక!

# అరబ్బుల ప్రాచీనాధిక్యము

హెచ్. మహబూబ్ మియ్యా గారు

అరాబియా దేశమందు మహమ్మదీయమతము పుట్టక ముందు పర్షియాదేశవాసు లగు మేజియన్సు అను జాతివారు ప్రాగ్దేశము లన్నింటిలో తమ మతమును వ్యాపింపఁజేయుదురా యను నంత ప్రబలులై యుండిరి. వీరి కగ్నిపూజ ప్రథమగణ్యమగు మతధర్మమై యుండెను. ఈజిప్టుదేశవాసులు మూఢభక్తియుతము లగు వైరాగ్యాచారములలో మునిఁగియుండిరి. గ్రీసు మొదలగు పశ్చిమ దేశములలో      స్తవమతము వ్యాపించియుండె నని పేరే కాని ఆ దేశములు వర్ణింపరాని హేయము లగు సంఘదురాచారములకు నెలవులై యుండినవి. ఆసియా ఆఫ్రికా ఐరోపా ఖండములలోని యనేకదేశము లట్లనాగరకతాతిమిరములో మునిఁగియుండఁగా, ఆ యజ్ఞానాంధకారం బడఁగింపఁ బుట్టిన మార్తాండతేజంబో యనునట్లు మక్కాపురములో ఇస్లామ్ మతము జనన మొందెను. అప్రతిహత మగు నా మహమ్మదీయ శక్తి పైఁబేర్కొనిన దేశములలోని సంఘదురాచారములను దుష్ప్రభుత్వములను అజ్ఞానమును క్రమముగ రూపుమాపివేసినది. అరబ్బులు వాఙ్మయమందును తత్త్వ పదార్థవిజ్ఞాన రసాయన వైద్య జ్యోతిష గణితాది శాస్త్రములందును అమూల్యము లగు ననేకనవీన విషయములను కనుపెట్టి ఆయా శాస్త్రముల నభివృద్ధి నొందించి ప్రపంచమునకు, ముఖ్యముగా ఐరోపా ఖండమునకు, నిరుపమానోపకృతిని సలిపి శాశ్వత కీర్తి గడించిరి. ప్రాగ్దేశములో కనిపెట్టిన యక్షరములను వ్రాతను పశ్చిమఖండములోనికి మొట్టమొదట ప్రవేశపెట్టినది అరబ్బులే. అట్లే సూక్ష్మగ్రాహు లగు నరబ్బులు ప్రాగ్దేశములందలి విద్యల నన్నింటిని గ్రహించి వానిని స్వశక్తిచేత పెంపొందించి ఐరోపా ఖండములోనికి ప్రవేశపెట్టిరి.

అరాబియారాజ్య మఖిలవిద్యాశోభితమై తనరుచుండినపుడు విద్యాగంధవిహీనమై క్రుంగియుండిన పాశ్చాత్యలాటిన్ రాజ్యములో కొందఱు పండితులు బయలుదేఱి అరబ్బీభాషలో వ్రాయఁబడియుండిన శాస్త్రగ్రంథములను క్రమముగా లాటిన్‌లోనికి భాషాంతరీకరణ మొనర్పఁదొడఁగిరి. తర్వాత లాటిన్‌భాషలోని గ్రంథములు గ్రీకుభాషలోనికి తర్జుమా చేయఁబడినవి. టోలిమి యూక్లిడు మొదలగు పండితవర్యుల గ్రంథములు భాషాంతరీకరణములే.

పద్యకావ్యమును అద్భుతకల్పితకథారచనను పశ్చిమఖండవాసులకు నేర్పినది అరబ్బులే. లక్షలకొలఁది అద్భుతనవలలను విరచించుచున్న యూరోపియనులు తమ కా మార్గమును చూపిన యరబ్బుల కెంతో కృతజ్ఞతను చూపవలసియున్నారు. ఇస్లాముమతస్థాపనమునకు ముం దెంతో కాలమునుండి అరబ్బులు నవసరములఁ జిప్పిలు పద్యకావ్యములను పాఠకులఁ బరవశత్వము నొందించు అద్భుతకల్పితకథలను వ్రాయుచుండినవారు. ఇందుకు తార్కాణ మిపుడనేకభాషలలోనికి పరివర్తనముఁ జేయఁబడి వేనోళ్ల పొగడఁబడుచున్న "అరేబియన్ నైట్సు" కథలే.

అరబ్బులేకచ్ఛత్రాధిపత్యముగ తుర్కీ ఫ్రాన్సు స్పెయిన్ మొదలగు దేశముల నేలుచుండినపుడు క్రీ. శ. 1214-వ సంవత్సరములో రోజర్ బేకన్ అను నప్రతిమ మేధాసంపన్నుఁ డొకఁడు పుట్టెను. అతఁడు గ్రీకు లాటిన్, అరబ్బీ భాషలలో నఖండపాండిత్య మార్జించి స్పెయిన్ దేశములో నుండిన అరబ్బీ విశ్వవిద్యాలయములలో చదివి అరబ్బీ శాస్త్రగ్రంథములను గ్రీకు లాటిన్ భాషలలోనికి తర్జుమా చేసెను. అతఁడు భాషాంతరీకరణ మొనర్చిన గ్రంథములలో

తత్త్వ, పదార్థవిజ్ఞాన శాస్త్రములు ప్రధానములు. 17-వ శతాబ్దములోనివాఁ డైన ఆంగ్లపండితుఁడగు బేకన్ ప్రభువు ఆంగ్లములోనికి భాషాంతర మొనర్చినది పైఁ జెప్పిన బేకన్ పండితుని గ్రంథములే. పండిత బేకన్ ప్రభుని తత్త్వశాస్త్ర మన్న ప్రామాణికము గదా! ఇఁక దానికి మూలము లగు నరబ్బీ గ్రంథకర్తల జ్ఞానౌన్నత్యము నెంత యని కొనియాడనగును?

స్పెయిన్ దేశపు అరబ్బీ విశ్వవిద్యాలయము లాకాలపు యూరోపియనులకు జ్ఞానదాయిను లగు కల్పతరువులై యుండిన వన్న నతిశయోక్తి కానేరదు. వివిధ దేశముల నుండియు క్రైస్తవవిద్యార్థులు వేనవేలుగా వచ్చి ఆయరబ్బీ పాఠశాలలో విద్య గఱచి పోవుచుండిరి. 'పీటర్ ది వెనరబిల్' అను క్రైస్తవరాజును కైస్తవ పీఠాధిపతి యగు రెండవ 'సిల్ వెస్టర్' అనునతఁడును నీ విశ్వవిద్యాలయపు శిష్యులే. క్రీ. శ. 15-వ శతాబ్ద మంతమువఱకు ఇంగ్లాండు ఫ్రాన్సు ఇటలీదేశములలో జ్ఞాన మించుకేనియు సంపాదించియుండిన ప్రతివాఁడును తన విద్య నేదో యొక విధమున అరబ్బులనుండి గ్రహించినవాఁడే యైయుండెను, రసాయనశాస్త్రము పూర్తిగా నరబ్బులు నిర్మించిన శాస్త్రమే యని చెప్పనచ్చును. జంతు శాక ఖనిజ పదార్థములను వారు సంపూర్ణముగా విభజించి వాని గుణాగుణములను నిర్ధారణ చేసిరి. వాయువు అగ్ని భూమి జలము వీనిని పరీక్షించి వాని సర్వగుణములను నిశ్చయించిరి. క్షారములయొక్కయు ద్రావకములయొక్కయు సజాతీయ విజాతీయ గుణములను కనిపెట్టిరి; అనేకవస్తువులను సులభముగా భస్మముచేయు మార్గములను కనిపెట్టిరి; వానినుండి తైలములను .తీయు మార్గములను కనిపెట్టిరి; అనేకవిషయముల గుణములను తెలిసి వానిని విఱిచి వానితో అమృతతుల్యము లగు నౌషధములను తయారు చేసిరి; పాదరసమును చంపు విధము దాని సకలగుణములు దాని యుపయోగములు కని పెట్టిరి. వైద్యశాస్త్రములో నిరంతర కృషిసలిపి అరబ్బు లనేకఘోర వ్యాధుల కమోఘము లగు నౌషధములను చేయు విధములను కనిపెట్టిరి. ప్రాగ్దేశములందలి యమూల్యము లగు వనమూలికలను యూరోపులోనికి ప్రవేశపెట్టిరి. రేవల్చిని చింతపండు లవంగపట్ట సునాముఖి (తంగేడు) కర్పూరము వీనిని యూరోపులోనికి ప్రవేశపెట్టినది అరబ్బులే. ఇప్పు డీ వస్తువులు చేరని యాంగ్లేయౌషధము లరుదు. అరబ్బుల ప్రవేశమునకు ముందు యూరోపుఖండవాసులకు చక్కెర యన నేమో తెలియకుండెను. అరబ్బు లచట చెఱకులను పండించి చక్కెర తయారు చేసినపుడు పాశ్చాత్యు లాశ్చర్య మొందిరి. అంతకు మున్ను తేనె తప్ప నే యితర మధురపదార్థము వారికి తెలియకుండెను. ఆ తేనెయు నతిప్రియ మగుటచే ధనికులకే కాని బీదల కలభ్యమై యుండెను.

వ్యాధిలక్షణములను తెలుపు శాస్త్రపరిశోధనములో నరబ్బులు పడినంత పాటే యితరదేశస్థులును పడలేదు. ప్రతి వ్యాధికిని దాని జననమునకును గల కారణములను వానిని నివారించు నౌషధరాజములను వారు కనిపెట్టిరి. వా రమితజయ మందినది చర్మవ్యాధులందే. వారు మశూచి తట్టువ్యాధులను పరీక్షించి వానికి తగు చికిత్సలను కనుఁగొనిరి. హృద్రోగములయొక్కయు కంఠరోగములయొక్కయు స్వభావములను తుదముట్ట గ్రహించి వానిని మాన్పు మందులను గనిపెట్టిరి.

గణితశాస్త్రమందు బీజగణితమును కనిపెట్టినది అరబ్బులే. దశాంశగణితమును యూరోపులోనికి చేర్చినదియు వారే.

ఇఁక జ్యోతిషశాస్త్రమందు వారిచే కనిపెట్టఁబడిన 'రమల్' జ్యోతిషము జగత్ప్రసిద్ధము.



రుమీద్వారము



కేసరిభాగ్ లకి ద్వారము



ఛత్తర్ మందిరము



మహానజఫ్ ద్వారము



దిల్ కుష్ ఉద్యానవనము

Lord RONALDSHAY
GOVERNOR OF BENGAL



రోనాల్డుషే ప్రభువు
(బంగాళాదేశపు గవర్నరు)

BABU AMBIKACHARANA MOOJOOMDAR



బాబు అంబికాచరణ మజుందారు

# ఒకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?

(వినయాంతరగర్భితకళికామాలిక)

తాపీ ధర్మారావు గారు బి. ఏ.

సంజకెంజాయ సత్కవీశ్వరుని భంగి
మించు సొగసునఁ బ్రకృతి వర్ణించుచుండ
జగదధీశుని మహిమ కాశ్చర్య మంద
కొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 4
శైత్యమును మాంద్యసౌరభసంపదలును
గలిగి హృదయంగమంబుగా మెలఁగుచుండు
పిల్లగాలికి దుఃఖంబు లెల్ల మఱవ
కొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 8
శ్రావ్యమా కాద యను చింత సరకుగొనక
కలకలారావముల విహంగంబు లెల్ల
పరము నొక్కట స్తుతియింపఁ, బల్కు లన్ని
నేర్చియుండియు నీ వేమి నేరనట్టు 12
లొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
కలయ దేశంబు ద్రిమ్మరి కాకకులము
గూడ జోడులఁ గూడి యా కొమ్మలందు
సంతసం బందుచుండంగఁ, జెంత నిట్టు 16
లొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
నీదు జాతీయవిహగంబు లేదొ పనిని
యాత్రదిన మెల్లఁ గడపియు, హాయి నిపుడు
జోడులను గూడి తమతమ నీడ లంద, 20
నొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
మోహ మల్లారఁ బెనిచిన ముద్దు పిల్ల
లింతదను కెట్టు లుండెనో యింట ననుచు
మందలను వీడి పసువులు మగుడుచుండ, 24
నొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
కాంచ నొక ప్రొంత బహువర్ణ కాంతిబృంద
మొక్క దిక్కున స్వర్ణమయోజ్జ్వలంబు
నైన యీ మహాప్రకృతిలో లీన మంద 28
కొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
సంజ పోయెను పోఁగదే సత్వరమునఁ
గాక యేదేని శోకంబు గలిగెనేనిఁ
బ్రీతి నాతోడఁ దెల్పుము రాతి రయ్యె 32
నొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఎంత శోకంబు మది నున్న, నెవ్వఁడేని
హితున కొక్కని కెఱిఁగింప వెత యడంగు
నంచుఁ బెద్దలు వచియింతు; రదియు నేర 36
కొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
మౌన మిది యేల? నీ కనుమాన మున్న
వినుము; నీ చింత సగపాలు గొనెద నేను.
తెలియఁజేయవె నీ చింత తెఱఁగ దెల్ల 40
ఒక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ముద్దుముద్దుగ నినుఁ బెంచి మురిసి, నీకు
విద్య యొక్కింత యబ్బిన విన్న ముట్టె
ప్రీతి బుద్ధికి నిను గారవించునట్టి 44
పిశరు లేరేనిఁ బాసిరో విహగ చెపుమ!
కాక, నీ జోడుఁ బాయంగ లేక, యెపుడు
నాటపాటల సంతసం బందఁజేయు
చెలిత లేరేని దవ్వుల కరిగినారె? 48
ఒక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
అదియుఁ గాకున్న నీ కున్న యనుఁగువార
లెవ్వ రేనియు నాథులనేని ఘోర
బాధలను గాని మిక్కిలి వనటఁ గుందు 52
చున్నవారలో తెల్పవే యున్న రీతి,
ఒక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఇంక మాటాడఁబూనవి దేమి శుకమ,
నెయ్యుఁ డెవఁడేని దవ్వుగ నిన్ను వీడి 56
పోయి నీ సేమ మరయక మొఱకు భంగి
నున్నవాఁ డేమొ. పాప మే ముండకున్న
నొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఇదియుఁ గాకున్న నిం కేమి యింత వంత 60
గలుగఁజేయఁగఁజాలెడి కారణంబు?
వ్యర్థమై పోయె నా యూహ లన్ని యిచట;
ఒక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
లేక దేహంబునందున నీకు నేమి 64
స్వస్థత యొకింత తప్పెనో వంతఁ గుంద?
పలికి శోకంబు నుపశమింపంగనీక
యొక తెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఇదియునుం గాదె? ఈ వంత కేమి మూల 68

మకట! యిన్నియుఁ గాక వేఱైన దేమి
పోల్చుకొను రీతి? నే నేర! పొమ్ము పొమ్ము!
ఒకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఆ! మఱచితిని, నీ పతి యేమి యైన 72
బాధలను గూర్చుచున్నాఁడా? పల్కు శుకమ!
అదిగో జలజల బాష్పంబు లక్షియుగము
వెడలుచున్నవి...నీ వంత విధము దెలిసె.
ఆఁగు మేటికి బాష్పంబు లటులు గురియ? 76
నిరపరాధత నీ వుండఁ బరమపాపు
లైన పెరవారు సెప్పినయట్టి పల్కు
లాలకించుచు యజమాని జాలి మాలి
చాల కుందించుచుండెఁ గాఁబోలు నయ్యొ! 80
వేళ క్రమమున నాహృతి పెట్టలేదొ?
పంజరముఁ బాయఁగాఁ బట్టు పట్టినాఁడొ?
ఎడఁద నొచ్చెడి పల్కుల నాడివినాఁడొ?
ఒకతెవై యేడ్చు చుండెదు శుకమ యేల? 84
అకట! నినుఁ జూడ గుండియ లవియుచున్న;
వా దినంబుల గురువుల యండ నుండి
గౌరవం బందుచుంటివి. కాలమహిమ
కొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 88
మాట లన్నియు ముద్దులు మూటగట్ట,
హృదయరంజకవర్తనం బింపు నింప,
భవ్యభవదీయజీవనం బవ్యయ మని
యంద అరుదంద లోకవిఖ్యాతి గాంచి 92
నేఁ డిటుల నుండవలసెనే? పాడు కాల!
మొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
కల దొకింత లోపంబు నీవలన నయిత,
మాగ్రహం బందఁబోకు మే ననినదాని; 96
కట్టి యుత్కృష్టరీతి ని న్నరయుచుండు
పదము విడనాడి యాతని పాలి కరిగి
తొకతెవై యేడ్చుటకె యిప్డు? శుకమ చెపుమ!
సరసుఁ డంచును జేరితో, సదయహృదయుఁ 100
డంచు నేఁగితో, నీదు విద్యలకు మెచ్చు
నంచుఁ జెందితో, యే హేతు వైన సరియె;
పూఁట పనిచేయ కుండిన బువ్వఁ బెట్టఁ,
డితనిఁ జేరుట నీ బుద్ధిహీనత గదె! 104
ఒకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఈవె యారీతిఁ గుందుచు నిచట నచటఁ
దిరుగుచుండిన, నీ జోడు చిఱుత లెల్ల
నేమి రీతిని బొట్టఁ బోషించుకొనుచు 108
వారివీరింట దుఃఖానఁ బరఁగువారొ?

*　　*　　*

ఏమి దాఁగు మింక కీ రీతి హృదయ మగల
నొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 112
ఔను, భరియింప నతికష్ట మగును, గాని
లెమ్ము లే లెమ్ము దుఃఖింప లేదు సుఖము;
వంతలకుఁ గుందు టిది యేమి పని తలంప?
ధైర్య మూనుము, తోలుము దైన్య మవల; 116
నొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
ఇంతగా వంత దురపిల్ల నేల నీకు?
వ్యర్థులంబోలె చింతింతు వక్కటకట!
ఒకట నీ వింటఁ గూర్చుండ నొగిరంబు 120
తనకుఁ దా వచ్చు నీ సన్నిధానమునకు
విద్య గారవించెడివారు పృథ్విఁ గలరు;
లేదు నీ కింత సేగియు లేదు దుఃఖ;
మొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 124
రమ్ము నాతోడ వచ్చి సుఖమ్ము గనుము,
నీదు మాటల మాకు సమ్మోద మిమ్ము
గురువిధంబున గాంతు మే కొఱఁత లేక
యొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 128
వదన మొకయింత యెత్తి యా చదలఁ జూడు
మిందుఁ డే రీతి పూర్ణుఁడై యంద మిచ్చు;
మొన్న మొన్న నె యాతఁడు విన్ననగుచుఁ
జెందె బహుళార్తి వికలుఁడై పొందె క్షయము. 132
అతని చరితంబు నొక్కింత మతిఁ దలంపు
మొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
కాల మొక్కింత మాఱఁగాఁ గ్రమముతోడ
వృద్ధి గాంచుచు పూర్ణత నిప్పు డంది, 136
తొంటి శత్రుల రూపఱ మంటఁ గలిపి
లోకముల నెల్ల మోదంబులోన ముంచు;
నొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల?
అట్టి యభ్యుదయంబె నీ కగును గాన 140
సంతతం బీశ్వరునిమీఁద చింత నిల్పి
వంత నొకకొంత డిందఁగా పదిలపఱచి
మానసంబందు ధైర్యంబు నూనకుండ
నొకతెవై యేడ్చుచుండెదు శుకమ యేల? 144

# ఋ ణ ము

రివరెండ్ డబ్లియ్యూ. ఎల్. ఫెర్గూజను గారు, ఎమ్. ఏ.

"మనుష్యు లందఱి దృష్టికిని యోగ్యమైనవానిని సంపాదించుకొనుఁడు."

"ఒకని నొకఁడు ప్రేమించుట యను విషయములో తప్ప మరెందును ఎవనికిని అచ్చి యుండవలదు."

అప్పు అశుభ్రత అపవాదిత్వము — ఈ మూఁడును హిందూ దేశముయొక్క శాపములు. ప్రతివాఁడు నిందు దేనిపాలను బడకుండఁ జూచికొనుట యెంతయు నుపయుక్తము. యుద్ధము జాడ్యము క్షామములవలె పై మూఁడును నేకకాలమందే పైకొని మనుష్యుని నాశనము చేయును. ఒకని స్వేచ్ఛను రూపుమాప నీ మూఁడింట నొకటి యైనను జాలు నన మూఁడును గల్గిన నే మన వచ్చును?

"హిందూదేశమున నెల్లవారును నప్పులలో మునిఁగి యున్నా" రను మాటవాడుక కలదు. ఈ మాట నిజమైనను గాకపోయినను సర్వసాధారణముగ నెవరును ఋణములోఁ బడియుండుట న్యాయము గా దనియు, ఋణస్థులై యుండుట యవశ్యము కా దనియు నొప్పుకొనఁదగియున్నది.

I. అప్పులుపడుటకు కారణములు.

II. అప్పులవలని ఫలితములు.

III. అప్పునుండి విడుదల పొందు మార్గములు.

వీనిని గూర్చి కొంత యోచింతము.

## 1. కా ర ణ ము లు

1. ఇండియా దేశస్థులలో నప్పు చేయుట వాడుకయై యున్నది. ఈ దేశములో నెచ్చటకు పోయినను అప్పు పద్ధతులను కనుఁగొనవచ్చును. చేత సొమ్ము గలిగినవారు సయితము కొంత ముఖమెఱుక గలిగినయెడ నంగడివానియొద్ద నప్పుగా వస్తువులను పుచ్చుకొనుటకు మిగుల సిద్ధులై యున్నారు. అంగడివాఁడు అజ్ఞానులైన వారికి అప్పుగా నిచ్చుటకు చాల కోరుచున్నాఁడు. ఏల యనఁగా, విశేష వడ్డి పెంచుటకును, కొన్ని వేళల నసలుకంటె వడ్డి నధికముగా చేయుటకును తరుణము చిక్కును. ఇట్టి విషయములలో మనుష్యులు దేశవాడుక ననుసరించుచున్నారు గాని న్యాయచట్టముల ననుసరించుట లేదు. అయినను కలిగియున్న వాడుక మంచిది గా దని తెలిసిన పిదప నట్టి వాడుకల నెల్లప్పుడు వెంబడింప నవసరము లేదు. ఎదిరించి చక్కఁజేసికొనుట యుక్తము.

2. ఒకఁడు తన నిజస్థితికంటె నెక్కువగ నుండఁగోరియో, లేక తా నున్నదానికంటె నెక్కువగ నగపడఁగోరియో యప్పులపాలగుచున్నాఁడు. కొందఱు తమ పేదతికమును నివారింపఁగోరి, యేదో కొంత పొలమును కొనుటకో ఒక యంగడిని పెట్టుకొనుటకో, లేక యొక వ్యాపారము చేయుటకో యత్నించి కొంత సొమ్ము నప్పుగా తీయుచున్నారు. ఒకఁడు తన యింటిలో జరగనై యున్న వివాహము నిమిత్తము చేత నొక్క కాసు లేకపోయినను వెల గల బహుమతుల నిచ్చుటకును ధారాళమైన విందు లొనర్చుటకును దొరకఁగల ఋణధైర్యముతో పూనుకొనుచున్నాఁడు. అట్టి వారి ప్రాణరక్తమును పానము చేయఁగోరు సాహుకారులును సొమ్ము వడ్డి కిచ్చుటకు సర్వసిద్ధులై యున్నారు. అప్పు లిచ్చి పుచ్చుకొనుట సర్వసామాన్యమైన దేశాచారమై యున్నది. తాను నాశనమైన నగును గాని, తనబిడ్డలను తరతరములవఱకు అప్పులపాలు చేయనైనఁ జేయును గాని వివాహము మాత్రము గొప్పగా జరపవలెను. లేనియెడల నలుగురిలో హేళన. దానికి వెఱచియే మఱికొందఱు చావులకొఱకును, బట్టలకొఱకును విందుల నిమిత్తమును ఆభరణముల నిమిత్తమును తుదకు దినభోజనముల నిమిత్తమును బహుధనవ్యయము చేయుచున్నారు. హేళనవలని భయముచేతను, బీద లనిపించుకొను సిగ్గుచేతను, ధనవంతులవలె నగపడు కోరికచేతను, లోకపు మెప్పుకొఱకును, డంబాలితయములచేతను త్వరలో ధనసంపాదన చేయవలె ననెడి యాశచేతను, చుట్ట భంగి నల్లమందు సారాయి మొదలగు ననాచారములచేతను మనుష్యులు ఋణసాగరమగ్నులై యున్నారు. ఒకానొకఁడు జీవనోపాధి నిమిత్తము అప్పుతీసియు దానిని తదనంతరము తీర్చివేసి, జయము నొందుచున్నాఁడు గాని, మున్నూటికి తొంబదితొమ్మండుగురు జనులు అప్పు తీసి రేని, తిరిగి కోలుకొనలేకపోవుచున్నారు.

ఒకవేళ కొందఱు "అప్పు పుచ్చుకొనిన నేమి? దానిని తీర్చివేతుము" అని పలుకవచ్చును. అయితే యెద్దు చనిపోయిన తరువాత దానిని కొనుటకై చేసిన యప్పును తీర్చుచుండుటలో నేమి యానందము గలదు? అటువలెనే చినిఁగిపోయిన పుస్తకములకొఱకు విఱిగిపోయిన సామానులకొఱకు పేలికలైపోయిన వస్త్రములకొఱకు పోఁగొట్టుకొనిన దొంగిలింపఁబడిన లేక సాహుకారులచేతిలో చిక్కిన సొమ్ములకొఱకు తిని జీర్ణించి పోయిన యాహారముకొఱకు డబ్బు చెల్లించుట యెంత సంతోషమో? ఒక వస్తువు దాని నమ్మినవానికిని కొనినవానికిని కూడ ప్రయోజనము లేని దశకు వచ్చిన తరువాతఁ గూడ దానికొఱకు సొమ్మును చెల్లించుచుండుట మరింత కష్టతరము గదా?

3. మఱికొందఱు తలిదండ్రుల ఋణములను బాధ్యులై పొందుచున్నారు. అట్టివారు ప్రాఁతయప్పులను లేక వానిపై వడ్డిని తీర్చుటకు మఱియొకచోట నప్పులను తీయుచున్నారు. ఒకటికి రెండప్పులు రెండింతలు వడ్డిని చెల్లింపవలసియుండును. కనుక అప్పునుండి విడిపింపఁబడుటకు బదులుగా రెండంతల బంధకములలో చిక్కుకొని తన సంతానమునకు తనకంటె నెక్కువ భారమును తగిలించుచున్నారు. హిందూశాస్త్రప్రకారము కుమారుఁడు తండ్రి యప్పులను చెల్లింపవలెను. కనుక నే యప్పు లున్నవారు డంబముగా బ్రతికి ఋణములను విస్తరింపఁజేయుటకంటె ఆ యప్పు తీరువఱకు గంజి త్రాపి జీవనము చేయుట యెంత మేలు! ఏల యనఁగా, నీవు చేయని యప్పు

లను విధి లేక నీవు తీర్పవలసి యుండఁగా, నీ బిడ్డలను కూడ నెందు కట్టి యన్యాయములోఁ ద్రోయవలెను? నీకు అన్యాయము జరిగినది గాన ఇతరులు నా యన్యాయమును పొందుట యేలా? ఎఱిఁగి యెఱిఁగి తన పుత్రుల నప్పులఁ జొప్పించుట మహాపాతకము.

## 2. అప్పులవలని ఫలితములు

అప్పులవలని ఫలితముల నెన్న నెవ్వరి తరము? అయిన నప్పుల వలనఁ గలుగు ముప్పులు ద్వివిధంబులు : స్వకీయాపరాధము, పరకీయాపరాధము. అప్పులపా లగువాఁడు తనకుఁ దాను మువ్విధముల కీడు కలుగఁజేసికొనుచున్నాఁడు.

1. స్వయంకృతాపరాధము:— అప్పులలోఁ బడువాఁడు శాంతవృత్తితోఁ గూడిన నిశ్చింతజీవనము చేయఁజాలఁడు. దినదినము మార్వాడివాఁడు వెంటాడుచుండ ప్రతి తపాలులో బాకీవాయిదా జ్ఞాపకము చేయఁబడుచుండ, వీథిలో పోవుచు కోమటివాని ముఖము చూడ భయమగుచుండ ముఖములో సంతోషమును మనస్సులో నెమ్మదియు నేలాగు కలుగఁగలవు? అవమానము నొంది కచ్చేరికి లాగఁబడి యవస్థలపా లగుట ఎవరి కిష్టము?

అప్పు పేదతనమునకు పెద్దన్న. ద్రవ్యవంతుఁడుగ నటించినను ఋణస్థుఁడు పేదవాఁడే. రుచ్యము లగు భోజనపదార్థముల ననుభవించిన నేమి? వస్త్రాభరణముల నోలలాడిన నేమి, గృహ మంతయు నలంకరించిన నేమి బాకీ చెల్లింపలేఁ డని తెలిసినతోడనే పోలీసు బంట్రౌతు పొసుపులలోను బొండకొయ్యలలోను పడు భాగ్యము గలుగును గదా!

అప్పులలోఁ బడినవాఁడు అబద్ధము మోసము దొంగతనము మొదలైన దురభ్యాసములకు లోనగుచున్నాఁడు. అప్పులవారు వెంటాడినప్పుడు చెల్లించెద నని వాగ్దానము చేసి, మాటను కాపాడుకొనలేకపోవుచున్నాఁడు. ప్రస్తుతబాధను తప్పించుకొనుటకు పలికి నెఱవేర్ప లేకపోవుచున్నాఁడు. చెల్లించుటకు శక్తిలేకపోయి కొట్టులో నుంచఁబడినప్పుడు అవమానమును సహింపలేక ఆత్మహత్యకు గూడ సాహసించి దుర్మార్గుఁ డగుచున్నాఁడు మరియు స్నేహితుల ముఖము చూడఁజాలక దొంగతనముగా దాఁగుకొనుచు మించిన పిదప జగడములకు కూడ కారణభూతుఁ డగుచున్నాఁడు.

2. పరులకుఁ గలుగు కీడు:—ఎవ్వఁడు గాని సొంతమునకు బ్రతుకుట లేదు. మనుష్యుఁడు చేయు ప్రతికార్యఫలితము ఇతరులకు తగులుచునే యుండును. ఒకఁడు తనకు కీడు చేసికొనినయెడల ఆ కీడు తన బంధువులకును, స్నేహితులకును, ఇరుగుపొరుగువారికిని తగులుచున్నది. ఒకఁ డప్పులలోఁ బడి యవమానము పొందినచో ఆ సిగ్గును తన కుటుంబమువారును స్నేహితులును పంచుకొనుచున్నారు. ఒకని యపనమ్మకముచే నిర్దోషులు నదే విధముగా చూడఁబడుచున్నారు. ఒకానొక యాఫీసులో విశ్వాసపాత్రుఁ డని యెంచుకొనిన గుమాస్తా దుర్వ్యాపారములలో నుండుటను బట్టి, అప్పులపాలయి, తన యజమానుని సొత్తును కొంగిలించి తప్పుడు చేవ్రాలు చేయుచున్నాఁడు. కొంత కాలము దాఁగియున్నను తదనంతరము బైటికి వచ్చును. అట్టి ద్రోహులు తమ యజమానుల కుటుంబములను వారి స్త్రీలను బిడ్డలను బీదతనములో ముంచి, దుఃఖముపాలు చేయుచున్నారు. అంతమాత్రము గాక తాము కఠినఖైదును యావజ్జీవితనిందను పొందుచున్నారు. అప్పులపా లగువాఁడు దురదృష్టమును అపజయమును ఘనహీనతను పొందుట మాత్రమే కాక తన బ్రదుకును పాడు చేసికొనుచున్నాఁడు.

భరతఖండస్థులు తమ మాతృదేశమును ప్రేమించి ఘనపఱుపఁ గోరినయెడల, ఋణములనుండి స్వేచ్ఛను సంపాదించుకొని, తమకుఁ గలిగిన చెడ్డ పేరును పోఁగొట్టుకొని దేశాభిమాను లగుదురు గాక!

## 3. ఋణవిముక్తిమార్గములు

ఒకానొకఁడు సహాయము నిమిత్తము అప్పు తీసినను తుదకు ప్రయత్నించి దానిని తీర్చివేసి ఋణవిముక్తుఁ డగును గాని, అనేకులొకసారి యప్పులలోఁ బడిన మఱెప్పుడును విడుదల పొందక అప్పులు తీయు వాడుకలో పడిపోవుచున్నారు. ఇతరదురభ్యాసములవలె నిదియు విడుచుట కష్టము. ఒక త్రాగుఁబోతు ముసలివాఁడు మొదటి గ్లాసు త్రాగుటకు సిద్ధముగా నున్న పడుచువానిని జూచి "కుమారుఁడా! ఆరంభింపకుము, అపుడు విడువ నవసరము లే" దని చెప్పెనఁట.

1. కాఁబట్టి యారంభింపకుండుటయే యప్పులలోనుండి తప్పించుకొను ప్రథమపద్ధతి. ప్రయత్నము చేసినయెడల ప్రతివాఁడును సంవత్సరములో నొక్క దిన మైనను అప్పు లేకుండ చక్కఁబెట్టుకొనవచ్చును. తపాలాఫీసులో బిళ్లను అప్పుగా తీయలేవు. పన్నులు వసూలు చేయుట నిదానింపు మని తహసీలుదారు నడుగలేవు. రైలుబండిలోఁ గాని ట్రాముబండిలోఁ గాని చార్జి లేకుండ ప్రయాణము చేయఁజాలవు. ఎందు కనఁగా రైలుచార్జి గాని పోస్టుబిళ్ల ఖర్చు గాని నెల పన్ను గాని చెల్లింపక విధి లే దని జనులకు తెలియును; అదియును ముందుగా చెల్లింపవలెను. అనఁగా పంటల సమయమప్పుడు పన్నులు ప్రయాణమునకు ముందు చార్జి జాబు పంపక ముందు బిళ్లఖర్చు చెల్లించితీరవలెను. అదే విధముగా భుజింపకముందు ఆహారమును ధరింపకముందు వస్త్రమును కొనుటకు ముందుగా డబ్బు నియ్యవలెను. ఇట్లు చేసినయెడల నీ స్నేహము చెడదు. నీ గౌరవము తగ్గదు. నీ వెల్లప్పుడు మిగిలించువాఁడవుగా నుందువు గాని అప్పులలో నుండవు.

2. మితవ్యయము చేయ నభ్యాసపడియుండుట మఱియొక పద్ధతి. సామాన్యరీతిలో జీవించుచు రాబడిలోపల వ్యయము చేయ నేర్చుకొనవలెను. కొంచెము మంచి జీతము సంపాదించు పడుచువాఁడు తన భోజనము, బట్టలు, పుస్తకములు ఇతరఖర్చులు పోఁగా ప్రతినెలకు కొంత దాఁచిపెట్టవలెను. మితవ్యయము నిమిత్తము భోజనపానాదులకు సరిగా వాడుకొనక, బీదలను కష్టపెట్టుచు సేవకులకు జీతములు చక్కఁగా నియ్యక బాధపెట్ట నవసరము లేదు. ధనాశ పనికిరాదు, దౌర్భాగ్యదశ పనికిరాదు. వృథావ్యయము పనికిరాదు. పిసినితనము కూడదు. అప్పులలో పడుట న్యాయము కాకున్నచో, ధనాశచే డబ్బు కూర్చుటయు న్యాయము కాదు. "ధన మైనను దారిద్ర్య మైనను నా కియ్యకుము. నా దినాహారములో నన్నుఁ బోషింపు" మని యొక భక్తుఁడు భగవంతుని ప్రార్థించెను.

3. నీ యార్జనమునందు కొంత భాగము ధర్మము నిమిత్తము వాడుకొను నభ్యాసము చేయుము. దేవుని మహిమార్థము మన మీ భూమిమీఁద జీవించుచున్నాము. ఆయన మన కనుగ్రహించు శరీరాత్మదీవెనలలో నితరులకు భాగ మియ్యవలెను. "ఒకని నొకఁడు ప్రేమించు విషయమున తప్ప మఱేమియు నెవనికి నచ్చియుండవద్దు." ఇదే మన యప్పు. ఇదే మన విధి. అప్పు పుచ్చుకొని తిరిగి చెల్లించుట సర్వలోకన్యాయము. దానియం దాధిక్య మేమియు లేదు. అయితే ప్రేమపూర్వక మైన విధి యొకటి గలదు. అక్కఱలలో నున్నవారికి సహా

యము చేయుచు, బలహీనుల కూఁతనిచ్చుచు నిరాధారులను గాపాడుచు, అజ్ఞానులకు జ్ఞానజ్యోతిని చూపుచు, అన్యాయము పొందుచున్నవారికి న్యాయము కలిగించుచు వ్యాధిగ్రస్తులకు బీదలకు సేవ చేయుచు నుండుటకంటె దైవము నెడలఁ గాని మనుష్యులయెడలఁ గాని మానవుఁడు నెఱవేర్పఁ గలిగిన మఱియొక శ్రేష్ఠమైన విధి గలదా? బీదల పోషణ నిమిత్తము లేక వైద్యశాలల నిమిత్తము లేక మఱియొక యుపకారము నిమిత్తము సంతోషహృదయములో క్రమముగా కొంత సొమ్ము నిచ్చుచుండుట బహుధన్యకార్యము. అట్లు చేయుచుండునప్పుడు హృదయము ధారాళగుణము గలిగి అంతఃకరణముప్పొంగి నీ ధర్మమును పొందువారి యాశీర్వాదమునకు పాత్రుఁడవగుదువు. "నీ ప్రభువును జ్ఞాపక ముంచుకొనుము. ఎందుకనఁగా ఆయనే నీకు భాగ్యము కలిగించువాఁడు." ఇమ్ము. అప్పుడు అదిమి, కుదిలించి, పొర్లునట్లు మనుష్యులు నీ యొడిలోనికి కొల్తురు." "చల్లువానికి వృద్ధి గల్గును. యుక్తమైనదానికంటె నెక్కువగ బిగఁబట్టువానికి దారిద్ర్యము కలుగును." "నీకు కలిగిన దానితో నీ ప్రభువును ఘనపఱుపుము. అప్పుడు నీ కొట్లు సమృద్ధితో నిండి నీ నూనెగానుగలు పొర్లి ప్రవహించును." "మనుష్యు లందఱి దృష్టికి యోగ్యమైనవానిని కూర్చుకొనుము." "ఒకని నొకఁడు ప్రేమించుట యను విషయమునందు తప్ప మఱేమియు నెవనికి వచ్చియుండవద్దు."

# వాఁడెపో జ్ఞానఘనుఁడు

( గుణత్రయవిభాగయోగగీతమాలిక )

గుమ్మలూరి లక్ష్మీనరసింహశర్మ గారు

జగతిఁ బుట్టు చరాచరసంఘములకుఁ
ప్రకృతి జనని, బీజప్రదాయకుఁడ నైన
నేను జనకుఁడ, నిందు సందియము లేదు;
జన్మ మొందెను సత్త్వరజస్తమములు
ప్రకృతిచేతన, యవ్వి యవ్యయుఁ డయి తగు
దేహి బద్ధునిఁగాఁ జేసితీఱుచుండు;
గుణము లిమ్మూటిలో సత్త్వగుణము విపుల
నమలము ననామయంబును నౌటచేత
దేహికి సుఖంబు జ్ఞాన మెంతే నొసంగు;
హృదయమునఁ గోర్కెలను జనియింపఁజేసి
యందఁబోయెడువానియం దధికమైన
రాగ మొదవఁ జేయు రజోగుణంబు;
మోహకారణ మజ్ఞానమున జనించు
మనుజు నాలస్యనిద్రాప్రమాదవితతి
వేగఁ బడఁద్రోయుచుండు తమోగుణంబు;
సౌఖ్యవారాశిఁ ద్రిప్పును సాత్త్వికంబు
కర్మములయందుఁ ద్రిప్పును ఘనరజస్సు
మతిని చెడఁగొట్టి చెడ్డలో మాటుఁ దమము;
ఎపుడు దేహమునందు జ్ఞానేంద్రియముల
మూలమున జ్ఞాన మను కాంతి పుట్టునపుడ
హెచ్చు కాఁజొచ్చె సత్త్వ మం చెఱుఁగవలయు;
లోభము ప్రవృత్తి కోరికల్ పుట్టుచుంట
కర్మములయందు నాసక్తి కల్గు నెప్పు
డపుడె హెచ్చయ్యెను రజస్సటంచు నెఱుఁగు;
బుద్ధి యింతయు లేకుంట బద్ధకమ్ము
మోహగుణమును నెప్పుడు పుట్టు నపుడె
తమము హెచ్చయ్యె నని లోన దలఁపవలయు;
సాత్త్వికము హెచ్చుగా నున్న సమయమందు
నరుఁడు మరణమ్ము నొందు నేని స్వచ్ఛమైన
వనజజాతాదిలోకముల్ గనఁగలండు;
చాలఁగ రజోగుణం బున్న కాలమందు
మరణ మాసన్న మగు నేని మర్త్యలోక
మందుఁ గ్రమ్మఱ జన్మంబు నందు నరుఁడు;
తమ మ దెంతయు హెచ్చైన సమయమందు
మృత్యుదేవత దరిఁ జేరనేని నరుఁడు
శునకకీటాదిజన్మముల్ గొనుచునుండు;
స్వచ్ఛ మగు జ్ఞాన మబ్బుటే సత్త్వఫలము,
సకల బాధలఁ గనుటె రజఃఫలంబు,
బుద్ధి యంతయుఁ జెడుటె తమఃఫలంబు;
ఈ గుణంబుల మూఁడింటి నెవఁడు దాఁటు
జన్మమృత్యుజరాదు లా జనునిఁ బొంద
వాతఁ డింకను మోక్షంబు నందఁగల్గు;
సుఖము దుఃఖమ్ము నొకటిగాఁ జూచునట్టి
కాంచనము మంటి నొకటిగా నెంచునట్టి
యతని నే త్రిగుణాతీతుఁ డని యెఱుంగు;
శత్రుమిత్రుల నిర్వైర సరిగఁ జూచు
పీస మంతయు ధైర్యంబు వీడకుండు
నే మనంగ గుణాతీతుఁ డీస్యుఁ డతఁడు;
పరమభక్తి నెవండు నన్ భజనసేయు
నా యతండె గుణాతీతుఁ డౌచు బ్రహ్మ
భావమును బొందఁదగినట్టివాఁడు నగును;
దీని నెఱిఁగినవాఁడెపో జ్ఞానఘనుఁడు.

# కర్ణుని జననము

పారనంది రామశాస్త్రి గారు

ఆంధ్రమహాభారతము ఆదిపర్వము పంచమాశ్వాసమందు—

కుంతిభోజు నింటికి దుర్వాసమహర్షి యతిథిగా వచ్చి యచ్చట తాను కొన్ని దినము లుందు నని, "నీవును నీ పరిచరులును నాకు పరిచర్య యొనర్చెదరా?" యని కుంతిభోజు నడుగ, అతఁడు సమ్మతించి తన యింట నాతని నుంచి యా మహర్షి పరిచర్యకై తన కూఁతు రగు కుంతి నప్పగించెను. ఆమెయు నా మహర్షి యనుమతమును తెలిసికొనుచు జాగరూకతతో పరిచర్య చేయుచుండెను. ఇట్లొక సంవత్సరము కాఁగా మహర్షి సంతుష్టుఁడై "నీవు చేసిన పరిచర్యకు చాల సంతసించితి, నీకు వర మిచ్చెద, కోరు" మని కుంతితోఁ బలికెను. అందుకు కుంతి "తాము నావలన సంతసించుటయుఁ దమ పరిచర్యకై నన్నప్పగించిన మా తండ్రి సంతసించుటయు నింతియే నాకుఁ జాలు" నని బదులు చెప్పెను. అప్పుడు మహర్షి "యట్లయినచో నీ కొక దివ్యమంత్ర మిచ్చెద దానిచే నీ వే దేవతల నావాహింతువో యా దేవతలు నీవు కోరినట్టి పుత్రుల నిత్తు" రని యాపద్ధర్మముగా మంత్ర మిచ్చి చనెను. పిమ్మటఁ గుంతి యా మంత్రశక్తి నెఱుఁగఁదలఁచి యేకాంతముగ గంగకు పోయి స్నానము చేసి యా మంత్రమును తన హృదయమున నిలిపి సూర్యున కర్ఘ్య మిచ్చి "దేవా! నాకు నీయట్టి పుత్రు ని మ్మని కోరఁగా సూర్యుఁడు వెంటనే గగనమునుండి వచ్చి కుంతియొద్ద నిలువఁగాఁ గుంతి యాతని తేజోరూపములకు భయాశ్చర్యములఁ బొందుచుండ సూర్యుఁడు "భయపడవలదు. నీవు కోరిన వర మీయవచ్చితి" నని చెప్పెను. అప్పుడు కుంతి లజ్జితయై "యొక బ్రహ్మవిదుఁడు నాకుఁ గరుణించి యీ మంత్ర ముపదేశింప, దీని శక్తి యెఱుఁగఁగోరి యజ్ఞానముచే నిన్ను రావించినందుకు క్షమింపు"మని వేఁడికొనెను. అప్పుడు సూర్యుఁడు "నీకు దుర్వాసుఁ డిచ్చిన మంత్రశక్తి నే నెఱుఁగుదును. నా రాక వృథ కాదు. నీ కోర్కె నెఱవేర్తు" ననఁగా గుంతి "దేవా! నే నీ మంత్రశక్తి నెఱుఁగ నిట్లు కోరరా దని తెలియక వరముఁ గోరితిని. నాకు గర్భ మైనచో నా తలిదండ్రులు చుట్టములు నన్ను నవ్వరా?" యని విన్నవించెను. అప్పుడు సూర్యుఁడు దానిని కరుణించి "నీకు సద్యోగర్భమునఁ బుత్రుఁ డుదయించును, నీకుఁ గన్యాత్వమును దూషితము గాదు భయపడవల" దని చెప్పి వర మియ్యఁగా, నామెకుఁ దక్షణమే సూర్యుని యంశమున సహజకవచకుండలములతోఁ గానీనుఁడై కర్ణుఁ డుదయించెను. కుంతి యా శిశువును జూచి మహర్షి తనకు మంత్ర మిచ్చినందుకుఁ దా నా మంత్రశక్తి నెఱుఁగఁగోరి సూర్యు నావాహనము చేసినందుకు సూర్యుఁడు సద్యోగర్భమునఁ బుత్రు నిచ్చినందుకు విషాద మొందుచు లోకాపవాదమునకు భయపడుచుండ, సూర్య ప్రేరణచే నొక మంజుస ప్రవాహమునుండి రాఁగాఁ జూచి దానిలో శిశువు నుంచి నదిలో విడిచి యింటికి వచ్చెను.—అని యున్నది.

అరణ్యపర్వము సప్తమాశ్వాసమందు— కుంతి తన తండ్రి యింట నుండియే దుర్వాసుఁడు తన కిచ్చిన మంత్రము శక్తినిఁ దెలియఁగోరి యొక్కనాఁడు స్నాతయై యుదయపర్వతముపై నుదయించుచున్న సూర్యునిఁ జూచి "దేవా నీతో సమానరూపము గల పుత్రుని నాకుఁ గరుణింపు" మని మనస్సులోఁ గోరి మంత్రోచ్చారణము సేయఁగా, సూర్యుఁడు కుంతియొద్దకు వచ్చి "నీ మనఃప్రియముఁ జేయ వచ్చితి, నెద్దియో చెప్పు" మనియెను. అందుకుఁ గుంతి "మంత్రశక్తి నెఱుఁగఁగోరి కాని వేఱు కార్యము లేదు. కావున నిచ్చటికి దయ సేయ నేల మరలఁ బొమ్ము" అని ప్రార్థింప సూర్యుఁడు "నీవు నావలనఁ బుత్రునిఁ గోరితివి కదా, నా సమాగమమున కొడబడవలయు. కానిచో నీ తలిదండ్రులను నీకు మంత్ర మిచ్చిన మునినిగూడ దహింతు" నని పలికెను. అప్పుడు కుంతి "నేను కన్యను నా కన్యాత్వము చెడు" నని భయముతో మనవి సేయఁగా, సూర్యుఁడు "నీకుఁ గన్యాత్వభంగము గాదు. నా సమాగమమువలన నధిక తేజోవంతుఁ డగు పుత్రుఁ డుదయించు" నని చెప్పి యొప్పించి యామెకు గర్భాధాన మొనర్చి యంతరితుమున కరిగెను. గర్భము క్రమమున వర్ధమాన మగుచు సూర్యుని మహిమచే నెవ్వరికిఁ దెలియకుండ నొక్కనాఁ డంతఃపురమున నొక్క సఖికి మాత్రము దెలియునట్లు ప్రసవింపఁ గర్ణుఁ డుదయింపఁ గుంతి యా శిశువు నొక మంజుసలోఁ బెట్టి బంధించి సఖియుఁ దానును పురసమీపమున నున్న యశ్వనదికిఁ దీసికొనిపోయి ప్రవాహములో మంజుస విడిచె.—అని యున్నది.

ఇందు నాదిపర్వములో ముని కుంతి కాపద్ధర్మముగా మంత్ర మిచ్చినట్లు చెప్పఁబడినది గదా! ఆ యాపద్ధర్మ మెద్ది? ముని యభిప్రాయ మేమి? కుంతికిఁ గన్యాత్వమందే సంతానము గలుగవలయు ననియేనా ముని మంత్ర మిచ్చెను? అది యామె కాపద్ధర్మమేనా? సంతుష్టుఁడయిన ముని యామె కనర్థము కొఱ కిచ్చునా? కుంతియు సూర్య నావహించుట తన కప్పుడే సంతానము కావలయు ననియేనా? అట్లైనచో సూర్యుఁడు తనయొద్దకు వచ్చినప్పుడు ప్రత్యాఖ్యాన మెందుకుఁ జేసినది? సూర్యుఁడు నామె నెందు కంత నిర్బంధింపవలెను? ఆమెకు కన్యాత్వభంగము కాకుండఁగ సూర్యుఁడు వర మిచ్చుట కభిప్రాయ మేమి? మఱియు నాదిపర్వములోఁ గుంతి గంగకు వెళ్లి, యచ్చట సూర్యుని గోరి యాతనివలనఁ బుత్రుఁ డచ్చటనే సద్యోగర్భమునఁ బుట్టఁగా భయ మొంది నదిలో శిశువును విడిచినట్లును, అరణ్యపర్వములోఁ గుంతి తన తండ్రి యగు కుంతిభోజు నింటనే యుండి యొకనాఁడు

సూర్యునిఁ జూచి ముని యిచ్చిన మంత్రముచే నాతని నావాహనము చేయఁగా సూర్యుఁ డప్పటికివచ్చి యామెను నిరోధించి యొప్పించి సంగమించి పోవ, గర్భ మయ్యును వ్యక్తము గాకుండఁగ నుండఁ బదవ మాసమందు నొక్క నిశాసమయమునఁ గర్ణుఁ డుదయింప నప్పు డా శిశువును మంజసలోఁ బెట్టి యొక సఖియుఁ దానును మోచికొని పోయి పురసమీపమున నున్న యశ్వనది ప్రవాహములో విడిచివచ్చినట్లును చెప్పఁబడియున్నది కదా! మన చరిత్రగ్రంథములలో నొక్క విషయమే యిట్లు పరస్పరవిరుద్ధమై యున్నప్పుడు దాని సంగతిసందర్భములకొఱకు విమర్శ మావశ్యకము కాదా?

విచారింతము: దుర్వాసముని కుంతి కాలోచించిన యాపద్ధర్మము ముం దామెకుఁ బాండురాజువలన సంతానము గారామియు, నప్పు డా మంత్రమహిమచే యమ వాయు ఇంద్రుల వలన నామె సంతాన మొందు ననియు భావిజ్ఞాని యగు మహర్షి యభిప్రాయము. కాని, యప్పుడే యామెకు సంతానము కలుగవలయు నని కాదు. ముని యామె కిట్లు అనుగ్రహించి యిచ్చినదే కాని యనర్థముకొఱకు కాదు. ఇఁకఁ గుంతి యభిప్రాయము: తనకు దుర్వాసుఁ డిచ్చిన మంత్రశక్తిచేఁ దాను కోరిన దేవత తనకు వశ మగునో కాదో చూఁగవలయు నని చాపల్యముచేత సూర్య నావాహనముచేయుట, అతని యట్టి పుత్రుఁడు కావలయు నని కోరుట తన కుచితకాలమందే యని కాని యప్పుడే కాదు. కాకున్నను, సూర్యుఁడు తా నా మంత్రశక్తిచేఁ గుంతికి వశ్యుఁడై వచ్చుట కింద్రాదులు తన్ను నగుచుండుటచేత మఱలఁ దాను వ్యర్థముగఁ బోయినచో నది తనకుఁ బరాభవముగఁ దలంచి కుంతి నంతగా నిరోధించి యొప్పించెను. కుంతియును శక్యమైనంత సూర్యునిఁ బ్రార్థించి తప్పించుకొనఁ బ్రయత్నించి తప్పక యొప్పికొనినది. కాని, ముని కుంతి కిచ్చిన మంత్ర మాపద్ధర్మ మనఁగా నామెను పాండురాజు వివాహమై యామెయం దాతని కౌరసపుత్రులు కలుగుట కవకాశము లేనందున నప్పు డీ మంత్రముచే యమ వాయు ఇంద్రులవలన నియోగవిధిప్రకారము పాండురాజునకు క్షేత్రజపుత్రులను సంపాదించుట యాపద్ధర్మము. కాని, కన్యాత్వావస్థలోనే సంతాన మొందుట కాదు. ఇట్టి మహర్షి యభిప్రాయము నెఱిఁగియే యామెకు కన్యాత్వము చెడకుండఁగను వివాహయోగ్యత కలుగునట్లును సూర్యుఁడు వర మిచ్చెను. ఆ వరప్రభావముచేతనే కుంతికి ప్రసవించిన స్త్రీయొక్క చిహ్నములు లేక కన్యాచిహ్నములే కలిగియుండెను. అందుచేతనే పిత్రాదిబంధువుల కెవ్వరికిని తెలియకపోయెను. లోకనిందయు కలుగలేదు. కాని, "భావిజ్ఞాని యగు దుర్వాసముని ముం దెప్పుడో యామెకు తన భర్తవలన సంతానము లేని యాపత్తులో నుపచరించుట కిచ్చిన యీ మంత్ర మిప్పు డెట్లుపచరించెను? ఎందు కుపచరింపవలయును?" అను ప్రశ్నము మాత్ర ముదయింపవచ్చును. విచారింతము: మహర్షి యాపద్ధర్మమును విశేషింపక సామాన్యముగా నాపద్ధర్మ మని చెప్పి మంత్ర మిచ్చినవాఁడు కదా. కుంతిభోజునకుఁ బుత్రసంతానము లేదు కదా. అతని కీ కర్ణుఁడు కానీనపుత్రుఁడుగా నుపయోగించుటయే యాపద్ధర్మ మైనపక్షమునఁ గుంతికి సూర్యునితో సమాగమము గర్భోదయము పుత్రజననము పిమ్మట వానిని నదిలో విడుచుట మొదలగు ననిష్టములు సంభవించుటయు నా రహస్యరక్షణక్లేశమును నుండకపోవును గదా? ఇట్లెందుకు వారు తలంపలేదు? దీనిని విచారింతము. కుంతిభోజునకుఁ బుత్రసంతానము లేకుండుట యాపత్తయినను కర్ణుఁ డాతనికి కానీనపుత్రుఁడు కానందున నది యాపద్ధర్మము కాలేదు. కుంతి కానీనునిఁ గని వివాహము లేక తండ్రియింట నట్లు యుండిపోయినచోఁ గర్ణుఁ డప్పుడు కుంతిభోజునకుఁ గానీనపుత్రుఁ డగును. అట్లు జరుగలేదు కావున వాఁడు కానీనపుత్రుఁడు గాఁడు. అది యాపద్ధర్మమును గాదు. ప్రమాణము: యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహారకాండము—శ్లో. కానీనః కన్యకాజాతో మాతామహసుతో మతః. వ్యా. యద్యనూఢా సాధ వే త్తథా పితృగృహ ఏవ సంస్థితా. కావునఁ గర్ణుఁడు కుంతిభోజునకుఁ గానీనపుత్రుఁడు గాఁడు. ఇఁక నాపద్ధర్మముగా మంత్ర మిచ్చిన మహర్షి వచనమున కన్యథాత్వము వచ్చునా? యనునది విచారణీయము. అన్యథాత్వము లేదు. ఎట్లన, ఈ కర్ణుఁడు కుంతిచే నదిలో విడువఁబడి యతిరథునకు దొరకి యతని కపవిద్ధపుత్రుఁ డయినందున మంత్ర మాపద్ధర్మముగానే చరితార్థ మయినది. కాని, మహర్షి యభిప్రాయ మట్లు కాదు గావున సూర్యుఁడును దాని నెఱిఁగియే కుంతికి కన్యాత్వభంగము లేకుండ వర మిచ్చి యా వృత్తాంత మంతయు గూఢ మగునట్లే యనుగ్రహించెను. ఇదియే భారతమందుఁ జెప్పిన దేవరహస్యము. ఈ రహస్య మిట్లు జరగకున్నచోఁ గుంతిని బాండురాజు వివాహము చేసికొనకపోయినను "కర్ణునితల భారతము" అను లోకోక్తి ప్రకారము కర్ణుఁడు లేనిచో భారతయుద్ధమే లేకపోవును. ఇది యిట్లుసంగతము కావచ్చును. ఇంకొక్కటి విచారణీయము: కర్ణుని జననము ఆదిపర్వములో నది యొద్ద జరిగినట్లును అరణ్యపర్వములోఁ గుంతిభోజునింట జరిగినట్లును నున్నది. పరస్పరవిరుద్ధ మగు నిది యెట్లు సంగత మగును? దానిని విచారింతము: ఆదిపర్వములో నన్నయభట్టుఁడు "కుంతి మంత్రశక్తి తెలియఁగఁగోరి యేకాంతముగఁ దాను గంగకుఁ బోయి స్నానము చేసి మంత్రమును స్మరించి యతనివంటి పుత్రునిఁ దనకి మ్మని సూర్యునిఁ బ్రార్థింప సూర్యుఁ డప్పుడే గగనమునుండి వచ్చి నీవు కోరిన వర మీయవచ్చితి నని చెప్ప నామె లజ్జితయై మంత్రశక్తిఁ దెలియఁగోరి యిట్లుచేసితినే కాని యిప్పుడే నాకుఁ బుత్రు నిమ్మని కాదని విన్నవించినను సూర్యుఁడు తన రాక వ్యర్థము కారాదని చెప్పి యొప్పించి సంగమింపఁ బుత్రుఁ డప్పుడే యుదయింప నామె భయ మొందుచుండ భయపడకు మని చెప్పి యామెకుఁ గన్యాత్వభంగము లేకుండునట్లు వర మిచ్చి పోవఁగా నతని మహిమచేతనే యొక మంజుస ప్రవాహమునుండి రాఁగా దానిలో శిశువు నుంచి విడువవలయు నన్నట్లు సూర్యుని యభిప్రాయముగా తలఁచి యట్లే శిశువును కుంతి విడిచినట్లు చెప్పినాఁడు. ఇది యౌచిత్య మాలోచించి చెప్పినట్లు కానుపించుచున్నది. మూలభూతమగు సంస్కృతభారతము ఆదిపర్వము 111వ అధ్యాయములోఁ గుంతి గంగకు వెళ్లినట్లును సద్యోగర్భమున వచ్చు

టనే పుత్రుఁ డుదయించినట్లును గూడ లేదు. తనకుఁ బుత్రుఁ డుదయింపఁగా,"దృష్ట్వా కుమారం జాతం సావార్ష్ణేయీ దీనమానసా- గూహామాసా౽పచారం సా బంధుపక్షభయాత్తదా- ఉత్ససర్జకుమారం సా జలే కుంతీ మహాబలం- తముత్సృష్టం జలే గర్భం రాధాభర్తా మహాయశాః" అని యున్నది. ఇట్లున్నను కుంతి పుత్రుని జలమందు విడువవలసినది కావున జలమునకు నదీసందర్భ ముండవలయును గావునఁ గుంతిభోజుని పురసమీపమున నున్న నది యశ్వనది యయ్యెను అది చర్మణ్వతిలో గలియఁ జర్మణ్వతి గంగలోఁ గలిసినది కావున శిశువు గంగలో నతిరథుఁ డనువానికి లభించెను కావున గుంతి గంగకే స్నానార్థము వెళ్లినట్లును నదియొద్ద జరగు పుత్రజన్మము సద్యోగర్భమున నని చెప్పుటయే యుచిత మని భావించి యట్లు చెప్పియుండును. అరణ్యపర్వములో నెఱ్ఱాప్రగడ "కుంతి తనకు మహర్షి యిచ్చినమంత్రము చంద మెట్టిదో తెలియఁగోరి యొకనాఁడు స్నానము చేసియుండి యుదయశైలముపై నుదయించుచున్న సూర్యునిఁ జూచి యాతనితో సమానరూపము గల పుత్రు నిమ్మని ప్రార్థించుచు మంత్రోచ్చారణము సేయఁగా సూర్యుఁడు ప్రత్యక్షముగా వచ్చి "నీకు వశ్యుఁడనై వచ్చితి నీ ప్రియ మెద్దియో చెప్పు" మనఁగాఁ గుంతి భయ మొంది "నా కేమియు నిప్పుడు నీవలనఁ గావలసిన కార్యము లేదు కావున మరల వెళ్లు" మని ప్రార్థనాపూర్వకముగఁ జెప్ప నప్పు డామె తన మనములో కోరిన కవచకుండలాభిరాముఁ డగు పుత్రు నుగ్గడించి "నా సమాగమమున కొడంబడనిచో నీ తలిదండ్రులను నీకు మంత్ర మిచ్చిన మునినిఁ గూడ దహింతు" నని చెప్పఁ గుంతి తనకుఁ గన్యాత్వభంగ మగు నని భయముఁ దెలుప నామెకుఁ గన్యాత్వభంగము లేకుండ వర మిచ్చి యామె నొప్పించి యామెతో సంగమించి గర్భాధానము చేసి దివమునకుఁ బోయినట్లును సూర్యుని మహిమచే గర్భము వ్యక్త మయ్యును లోకమందుఁ దెలియకుండ నుండి పదవ మాసమందుఁ గర్ణుఁ డుదయింప నొక సఖియుఁ దానును శిశువును మంజసలోఁ బెట్టి తెప్ప యొకటి కట్టి కొనిపోయి యశ్వనదిలో విడిచివచ్చినట్లును చెప్పినాఁడు. ఇచ్చట సంస్కృతభారతములో అరణ్యపర్వము ౩౦౭-వ అధ్యాయములో శ్లో. తతో గర్భ స్సమభవత్పృథాయాః పృథివీపతే-తతః కాలేన సాగర్భం సుషువే వరవర్ణినీ" అని యున్నది. ఇందు"గర్భస్సమభవత్" అనుచోట గర్భాధానమనియు, "కాలేన" అను చోటఁ బ్రసవోచితకాలము పదవ మాసము గావున నెఱ్ఱాప్రగ్గడ యట్లు చెప్పినాఁడు. మఱియు సంస్కృతమందు "జాతమాత్రం చ తం గర్భం ధాత్ర్యాసంమంత్ర్య భామినీ మంజూషాయాం సమాధాయ స్వాస్తీర్ణాయాం సమంతతః। సముత్సృజన్తి మంజూషా మశ్వనద్యా స్తదాజలే" అని యున్నది. ఇందులో ధాత్రికి బదులుగాఁ దెనుఁగులో "సఖి" యనియు సంస్కృతములోఁ దాను నదిలో మంజూషను విడిచిన ట్లున్న దానికి రాజపుత్రి యగు కుంతి యొక్క తెరయే నిశీథమందు మంజసను తోఁచికొని నదియొద్దకు వెళ్లినట్లు చెప్పక యౌచిత్య మాలోచించియే యెఱ్ఱాప్రగ్గడయును "సఖియును దానును" అని చెప్పియుండును. మూలగ్రంథమునకు భాషాంతరీకరణకర్తలు విషయమును మాత్రము తప్పక యవాంతరాంశములను తమ యభిప్రాయముతోఁ గొన్ని మార్పులను గల్పించి చెప్పుట యాచారమే యైయున్నందున వీరట్లు చెప్పియుందురు. ఇచ్చట మూలభారతమునకు భాషాంతరీకరణకర్తలు వేఱువేఱైనందున వీరిలో వీరికి వచనవిరోధము లేదు. మూలభారతకర్త వేదవ్యాసమహర్షి యొక్కఁడే కావున నాతనికి వచనవిరోధము రారాదు. వానికి సామరస్య మెట్లనఁగా నాదిపర్వములో ౧౧౧-వ అధ్యాయమందు "ప్రకాశకర్తాపవనస్సంబభూవ తయాసహ- తత్ర వీరస్సమభవత్సర్వశస్త్రభృతాంవరః-ఆముక్తకవచశ్శ్రీమాన్ దేవగర్భః శ్రియాన్వితః-అజాయత సుతఃకర్ణః - సర్వలోకేషువిశ్రుతః" అని చెప్పి పిమ్మట "ప్రాదాచ్చతస్యై కన్యాత్వం పున స్సపరమద్యుతిః - దత్త్వాచ తపతాం శ్రేష్ఠో దివమాచక్రమే తతః" అని యుండుటచేతం గుంతికి కర్ణుఁ డుదయించిన పిమ్మట సూర్యుఁ డామెకు వర మిచ్చి యంతరిక్షమునకు వెళ్లినట్లు కానఁబడును గాని యచ్చటఁ బదానుపూర్వీప్రకార మర్థము వివక్షితము గాదు. సూర్యుఁడు సంగమింపఁగానే తత్క్షణమే గర్భము సంభవించిన దనియు నప్పుడే వర మిచ్చి సూర్యుఁ డంతరిక్షమునకు వెళ్లిన పిమ్మటఁ గ్రమముగ గర్భ మభివృద్ధి నొందియుండ నెవ్వరికిని తెలియకుండఁగఁ బదవ మాసమందే కర్ణుఁ డుదయించె ననియే మహర్షి యభిప్రాయము గావున విరోధము లేదు. ఇచ్చట నట్లు స్పష్టము కాలేదనియే మహర్షి యరణ్యపర్వములో స్పష్టపఱచి చెప్పియున్నాఁడు.

భారతమం దిట్టివి విచారణీయము లనేకములు గలవు. నాదు మహాభారతవిమర్శనం దవి విపులముగ విమర్శింపఁ బడియున్నవి. గ్రంథము ముద్రితము కావలసి యున్నది.

## జాతీయావబోధము

మహాకాళి వేంకటేశ్వరరావు గారు

వ్రాయుఁడీ యక్షరాల 'మన భారతమాతకు నెందు లోపముల్
జేయ' మటంచు మీ హృదయ సీమల, నెంటనె భావభేదముల్
త్రోయుఁడి వెన్క- కంతటఁ గుతూహల మొప్పఁగ దేశసేవనే
సేయుఁడి మాతకున్ హితము సేకురు, మీకు యశస్సు చేకురున్.



PRATAP SINGH ALWAR MAHARAJ

ప్రతాపసింహుడు అల్వారు మహారాజు



MAHARAJA RANJIT SINGH

మహారాజ రంజిత్సింగు కాలమునందలి యోధులు

# విశ్వాసము

కోన రాఘవయ్య గారు

చిత్రం బయ్యెడు నీదు చొప్పరయ, వారిన్ జెందు విస్తారచా
రిత్రోపేత పటంచు నెల్లరును వర్ణింపంగ గర్వించితో?
పాత్రాపాత్రవివక్షణం బెఱుఁగవో? పాటింపవో పూజ్యుఁడౌ
సుత్రామున్ సయిరెం బొకానొక తఱిన్ శుద్ధాత్మ? విశ్వాసమా!

మ. శునకంబున్ గని పట్టెఁ దన్ను మిడ నస్తోకానురాగంబుచే
తను దృష్టిన్ గొని వీడకుండును గదా తాఁ బిల్లినిన్ బ్రేమఁ బెం
చిన నిత్యంబు వసించు నింట ఖలిరా! చిత్రంబు గా కేమి? నీ
కనయం బా యవివేకజంతువు లవశ్యం బైన విశ్వాసమా! 2

సీ. వివిధశాస్త్రపురాణవిదు లౌచుఁ దనరారు
మేటి ధాత్రీసురకోటిలోన
సకలసంపన్నులై సర్వజ్ఞులై యుండు
ధారుణీశ్వరముఖ్యతతులలోన
అఖిలార్థములయందు ననుపమం బగు కీర్తి
బంధురంబుగఁ గొన్న వణిజులందు
అజ్ఞానబాహుళ్యులై ప్రజ్ఞావిభవు లౌచు
భద్రయశస్కు లౌ శూద్రులందు
కొందఱందున నుందువు కొందఱందు
నుండకుందువు వారిపై నున్న కూర్మి
వీరిపై నీకుఁ గలుగ దే కారణమున?
పక్షపాతమె నీకు విశ్వాసగుణమ! 3

సీ. ఉడుతభక్తికి మెచ్చి యుడుఁడౌ మోక్షంబు ను
ద్దామకీర్తి వెలుంగ రామమూర్తి!
లలిఁ ద్రివక్ర సపర్య కలరి యభీష్టంబుఁ
గృపఁ దీర్చఁడే బాలకృష్ణమూర్తి?
తనవెంటఁ జనుదెంచు శునకంబు గని వీడఁ
గలిగెనే ధర్మజుం డలఘుకీర్తి?
తనుఁ బట్టి పిదప వీడినయట్టి నలునెడ
మేలు మఱచెనె మరాళమూర్తి?
వీర లందఱికడ నీవు చేరుకతనఁ
బూజ్యు లెందఱొ ని న్శిరోభూషణముగఁ
గలిగియుండెద రం చాత్మ గర్వపడెదొ?
భాసితగుణలలామ! విశ్వాసగుణమ! 4

ఉ. ఆ పరణిన్ గరం బతిశయంబును బొందక యుంటివేని, య
భ్యాసమె నీకుఁ గొందఱ నయంబునఁ జెందుచుఁ గొందఱన్ గసా
భాసము చేసి వీడుట? భవద్గురుకీర్తికి హాని గాదె? వి
శ్వాసమ! నిన్నుఁ బొందని యభాగ్యుఁడు నీచుఁడు చూడ ధారుణిన్.

మ. తొలి శుభ్రాంశునియంతవాఁడు తన కెంతో ప్రేమచే నేర్పు వి
ద్యలు సర్వంబును దండ్రిమాడ్కి గురురత్నం బంచు భావింపకే
నళినాభాయతనేత్రి గిష్పతిసతిన్ దాఁ గూడి యా పిమ్మటన్
దలవంపున్ గొనె నిన్నుఁ బాయుటను నిందన్ జెంది విశ్వాసమా!

మ. వనవాసంబున మాయలేడిఁ గని 'యో ప్రాణేశ! తోలెమ్ము దా
ని' నటం చొప్పగ రాముఁ బంపి పిదపన్ వీతేర 'హా లక్ష్మణా'
యను నార్తధ్వని, యద్ది రాక్షసుల కృత్యం బంచుఁ బల్మాఱు చెఁ
ప్పిన యా లక్ష్మణుఁ దూలనాడి 'పతినిన్ వీక్షించిర' మ్మంచుఁ బ
న్నిన సీతావనజాక్షి తాఁ జెడెఁ గదా నీ వ్వీడి విశ్వాసమా! 7

సీ. నినుఁ బొందలేనట్టి నీచాత్ముఁ డెన్ని వి
ద్యలలోన నేర్పరి యైన నేమి?
నిను బాత్మ వీడిన మనుజాధముఁడు దాను
ధన మెంత కూడఁబెట్టినను నేమి?
నీతోడఁ గలయంగ నేరని హీనుండు
బల మెంత కలిగిన ఫల మ దేమి?
నీతోడ వైరంబు నెఱపిన యల్పున
కున్నత మౌ ధృతి యున్న నేమి?
పాపములఁ బొందు, సద్గతుల్ పాసి యుండు,
దుఃఖములఁ జెందు, సౌఖ్యంబు దూర మందు,
ఉర్వియందున నపకీర్తి నొందు మందు
భవదుచిత మే మనందు? విశ్వాసగుణమ! 8

సీ. జగ మెల్ల రక్షించు సర్వేశ్వరునియందు
దేశంబు నేలు భూమీశునందు
తనుఁ గని పెంచిన తల్లిదండ్రులయందు
సురవిద్య నేర్పిన గురునియందు
ఆపత్సమయమందుఁ గాపాడు జనునందు
తన కుపకృతి సేయు ఘనునియందు
దేశోపకారి యౌ ధీవిశారదునందు
వ్యాధిఁ బాపినయట్టి వైద్యునందు
బంధుహితులందు ప్రాచ్యవిద్వాంసులందు
సంఘసంస్కర్తలందు శాస్త్రజ్ఞులందు
నిఖిలపూజ్యులయందును నిన్నుఁ దాల్చు
వాఁడె నీతిమంతుం డు విశ్వాసగుణమ! 9

# పాశ్చాత్య గ్రంథాలయములు

దశిక సూర్యప్రకాశరావు గారు

పాశ్చాత్యదేశము లన్నియు మాతృదేశముకన్న నెన్నో మడుఁగులు నాగరికత గలిగి యలరారుచున్న వన్న యంశము సర్వజనవిదితమే. ఏ యంశమును బట్టి నాగరికత గలిగిన దని యెన్నవచ్చును? దేశముల భాగ్యమును బట్టియు ముఖ్యముగా దేశీయవిద్యలను బట్టియు వాని యాధిక్యమును బట్టియు మనము నిర్ణయింపవలసి వచ్చుచున్నది. దేశముయొక్క ఔన్నత్యమును గుర్తెఱుఁగుటకు ముఖ్యసోపాన మా దేశముయొక్క విద్యాభివృద్ధియే. విద్య నెక్కడ నభ్యసింపనగును? ఎంతవఱ కట్లు చేయవలెను? ఏ విధమున నేర్చుకొనవలయును? కావలసిన పరికరము లేవో మన మించుక యోచింపవలయును. విద్య నభ్యసించుట కెల్ల చోటులను పాఠశాలలు నిర్మింపఁబడినవి. పాఠశాల విడిచిన పిదప కాని, కళాశాలను వదలిన తరువాత కాని విద్య పూర్తియైన దనుట తప్పు. విద్య పూర్తి కాలేదు. మన మభ్యసింపవలసిన విద్య ముం దున్నది గాని యంతటితో ముగియలేదు. ఆ కొనసాగించు విద్యకు ముఖ్యసాధనములు గ్రంథాలయములును చిత్రవస్తుప్రదర్శనములును. ఐరోపాదేశములం దందఱును విద్యాధికులే యని మనకు తెలిసినప్పుడు అక్కడ తప్పక గొప్పగొప్ప గ్రంథాలయములు మొదలగునవి యుండి తీరవలయు నని మనకు తోఁచును. నిశ్చయముగా నక్కడనే వినుతికెక్కిన గ్రంథాలయములు కలవు. ఇంగ్లండునందును పరాసుదేశమందును జర్మనీయందును, ఇన్ని యేల, ప్రతిదేశమందును ప్రతినగరమందును ప్రతి గృహమందును గ్రంథాలయము లున్న వన్న నతిశయోక్తి కాదు.

## ఇంగ్లండు

ఇచ్చట ప్రతినగరమందును వందల కొలఁది గ్రంథాలయరాజములు కలవు. అత్యున్నతదశ నందుచున్న వన్నియు మొత్తముమీఁద దొరతనమువారిచేతనే నెలకొల్పఁబడి పోషింపఁబడుచున్నవి. కడచిన యిరువది సంవత్సరములనుండియు భాండాగారము లింగ్లాండునందు శరవేగమున వృద్ధి నొందుచున్నవి. ప్రపంచమం దుండెడి గ్రంథాలయము లన్నిటిలో శిరోభూషణ మైన భాండాగారము లండను నగరమం దుండెడి బ్రిటిషు మ్యూజియమునం దున్నది. అందు 2,000,000 అచ్చుగ్రంథములును 56,000 వ్రాఁతగ్రంథములును కలవు. అందు రాజకుటుంబముయొక్క భాండాగారము కూడ చేర్పఁబడి యుండుటచేతను, ముఖ్యముగా సర్ ఏన్థనీ పానిజీ గారి స్వార్థత్యాగమువలనను, ఆయన యౌదార్యమువల్లను ఆ భాండాగార మంత యభివృద్ధి చెందియున్నది. పానిజీ మహాత్ముఁడు తన స్నేహితుల నందఱిని గ్రంథములు కొనవలసిన దని సలహో యిచ్చి వారిచే పెక్కు గ్రంథములను కొనిపించెను. అట్లు 8,400 గ్రంథముల నేఁటేఁట చేర్చుచుండెను. అట్టి మహాత్ముని ప్రయత్నమున లండను నగరమం దుండెడి మ్యూజియము గ్రంథాలయము విలసిల్లుచున్నది. దాని భవననిర్మాణసౌందర్యము వేఱ యడుగవలయునా? పరిశోధననిమిత్తమై యమర్చఁబడు గ్రంథము లన్నియు ప్రేక్షకుని యందుఁబాటులో నుంచఁబడును. కూర్చుండుటకు చక్కని యాసనము లమర్చఁబడి యుండును. గ్రంథముల బీరువాలు నింగిని తొంగిచూచుచుండెనా యనునట్లెత్తుగ నుండును. అచ్చట సరస్వతీదేవి తన నిండారు యౌవనసౌందర్యమున వీణాగానము చేయుచు సదా నాట్య మొనర్చుచున్న దనిన నొక వింత కాదు. అది నగరమధ్యమున నున్నది. ఆక్స్‌ఫోర్డునగరమందు కూడ నొక గొప్ప గ్రంథాలయము కలదు. సర్ థామస్ బాడ్లీ గారు సరస్వత్యాలయమును స్థాపించిరి. ఇచ్చటనే కాక, యితర నగరములందును పెక్కు గ్రంథాలయములు గాననగును. దీని కొక ప్రబలకారణ మున్నది. అ దేది యనిన, 1850-వ సంవత్సరములో ఎవర్టు గారు ఇంగ్లండుదేశమం దంతటను "ధర్మపుస్తకభాండాగారములు" స్థాపింపవలసిన దని యొక చట్టము నమలులోనికి తెచ్చిరి. ఆ కారణమున ఇంగ్లండునందు సరస్వతి తాండవ మాడుచున్నది.

## పరాసు దేశము

ప్రపంచములోని రెండవ గొప్ప గ్రంథాలయము ప్యారిసు నగరమం దున్నది. దాని పేరు "బాబ్లియోథిక్ నేషనల్ లైబ్రరీ". అందు 15,50,000 అచ్చు గ్రంథములును 50,000 వ్రాఁత గ్రంథములును కలవు. ఫ్రాన్సు దేశమందు నాలుగు తరగతుల గ్రంథాలయములు కలవు. (1) స్టేటు లైబ్రరీలు (2) డిపార్టుమెంటు లైబ్రరీలు (3) సంఘములకు సంబంధించిన లైబ్రరీలు (4) విద్యాసంబంధమైన లైబ్రరీలు: ఫ్రాన్సు చక్రవర్తి యగు చార్లసు చాల శ్రద్ధ వహించి భాండాగార సంఖ్యను దేశమందు వృద్ధి చేసెను. అతని యనుచరులును తమ క్రేఁగంటి చూపులచే గ్రంథాలయములం బోషించుచుండిరి. 1617-వ సంవత్సరమందు 'ప్రతి క్రొత్త ప్రచురణమును రెండు ప్రతులు భాండాగారముల కియ్యవలసిన' దని యొక చట్టము జారీ చేయఁబడెను. ఇవ్విధమున పరాసుదేశము కూడ ఇంగ్లండు దేశమునకు తీసిపోక యొప్పారుచున్నది.

## అమెరికా

అమెరికాలో సుమారు 10,000 గ్రంథాలయములు కలవు. దీనికి ప్రబలకారణ మున్నది. పాలకు లత్యంతశ్రద్ధ దీసికొనుటవలన భాండాగారములు ప్రతి పల్లెయందును ఒకటికి మిక్కిలిగా నుండును. ఒక పల్లెటూరున నొక గ్రంథాలయము స్థాపింపఁబడిన దనిన, పై యధికారు లా గ్రంథాలయస్థాపకులకు కొంత మూలధన మిచ్చి దాని పురోవృద్ధికి సాయపడెదరు. ఒక్క ధనసాహాయ్యమే కాక, వాక్సహాయమును కూడ నధికముగ నొసంగెదరు. భాండాగార మేవిధమున కట్టవలెనో ఏ విధమున దానిని పరిపాలింపవలెనో ఏ విధముగా గ్రంథములు సేకరింపవలెనో ఎట్టి గ్రంథము లుంచఁదగినవో ఏ విధముగా గ్రంథాలయ మలంకరింపఁబడవలసినదో ఏ విధ మగు దేశోపకారము

నకు గ్రంథాలయ ముపయోగింపఁబడవలెనో ఎట్టి గ్రంథాలయముగా పరిణమింపవలెనో ఏ పెద్ద గ్రంథాలయమునకు శాఖగా నేర్పడవలెనో ఎవరిచే పరిపాలింపఁబడినచో అత్యున్నతదశకు గ్రంథాలయము వచ్చునో, వెయ్యేల, పై యధికారులు ప్రతి గ్రంథాలయమును తమదిగా భావించి యన్ని విధములను తోడుపడెదరు. పై యధికారులంత యాతురతతో అసమాన మైన శ్రమతో పాటుపడుచున్న పుడు దేశప్రజలు గ్రంథాలయోపయోగములు తెలిసికొని పుస్తకాలయస్థాపనమునకు కడంగకుందురా?

అమెరికాయందు సంచారగ్రంథాలయములు విరివిగా కలవు. గ్రంథాలయము లన్నియు దొరతనమువారిచే పరీక్షింపఁబడుచున్నవి. న్యూయార్కునందు ధర్మసంచారగ్రంథాలయములు గలవు. వాని యన్నిటికిని కేంద్రముగా సెంట్రల్ లైబ్రరీ యని యొక పెద్ద గ్రంథాలయము గలదు. దాని శాఖలుగా 65 భాండాగారములు గలవు. ఇట్లే అమెరికాయందు ప్రధానగ్రంథాలయములు మఱికొన్ని యుండి, శాఖలుగాను ఉపశాఖలుగాను పుస్తకాగారములు గలవు. బోస్టను నగరమందు పెద్ద గ్రంథభాండార మొకటి గలదు. న్యూయార్కునం దుండు ప్రధానగ్రంథాలయముయొక్క పొత్తముల సంఖ్య 14,00,000. ఇట్టి సంచారగ్రంథాలయము లుండుటవలన ప్రజలకు పెక్కు లాభములు గలవు. ఒక యూర నుండు గ్రంథాలయముయొక్క గ్రంథములు ఇతరపురవాస్తవ్యు లుపయోగించియు మఱియొక గ్రంథాలయపు క్రొత్త పొత్తము లీ నగరపు ప్రజ లుపయోగించియు ఇవ్విధమున గ్రంథవ్యాపనరై, దేశమం దుండు అన్ని గ్రంథాలయముల పొత్తము లన్ని నగరముల ప్రజలు చదివి పరిశీలించుట కనుకూలించుచున్నవి. ఇట్లు ఒక గ్రంథాలయపు పొత్తములకే కట్టువడియుండక యన్ని పొత్తములు పఠించుట కనుకూలించుటంజేసి సంచారగ్రంథాలయములు మిక్కిలి లాభకరముగా నున్నవి. అమెరికాయందు చందాలను ప్రోగుచేసి గ్రంథాలయములను పోషించు నలవాటు మొదట బెంజమిన్ ఫ్రాంక్లిను గారిచే నారంభింపఁబడినది. యునైటెడ్డు స్టేట్సునందు వివిధశాఖలకు నుపయోగించు గ్రంథాలయములు కలవు.

## జర్మని

ఈ దేశమందు కూడ గొప్పగొప్ప గ్రంథాలయములు గలవు. జర్మనీదేశము గ్రంథభాండాగారములకు పుట్టినిల్లనఁబడును. ఇక్కడ నాలుగు తరగతుల గ్రంథాలయములు గలవు: (1) రాజ్యతంత్రములకుపయోగించు పుస్తకాలయములు (2) యూనివర్సిటీ గ్రంథాలయములు (3) నగరగ్రంథాలయములు (4) జనసామాన్యమున కనుకూలించు పుస్తకాలయములు. మొదటి రెండు తరగతుల పుస్తకాలయములు జనసామాన్యమునకు గాక పండితజనుల కెక్కుడుపయోగకరములుగ నున్నవి.

బెర్లినునగరమందు రిజిష్టరు కాఁబడిన గ్రంథాలయముల సంఖ్య 268. తదితర మైన గ్రంథాలయము లెన్ని కలవో మనకు తెలియదు. ఆ నగరగ్రంథాలయములలో సెల్ల రాయల్ గ్రంథభాండాగారము మిక్కిలి పెద్దది. 1699-వ సంవత్సరము మొదలు ప్రచురణమునకొక్క ప్రతి చొప్పున గ్రంథాలయము లన్నింటికిని ఇచ్చునట్లొక చట్టము హుజూరు చేయఁబడెను. ఆ రాయల్ గ్రంథభాండాగారమందు 12,30,000 అచ్చు పుస్తకములును 30,000 వ్రాఁత గ్రంథములును ఉన్నట్లు తెలియవచ్చుచున్నది. ఆ గ్రంథాలయమునకగు ఖర్చు సంవత్సరమునకు 11,326 పౌనులు. దీనిని బట్టి యా భాండాగారమెట్లు పోషింపఁబడుచున్నదియు ఎంత మూలనిధి గలిగియున్నదియు ఎట్టిదశయం దున్నదియు సూచింపఁబడక మానదు. ఒక్క బెర్లిను నగరమం దీ భాండాగారమే కాక, యితరములు గల వని యిదివఱకే చెప్పియుంటిని. తదితరనగరములందును గ్రామములందును వివిధములైన గ్రంథాలయము లనేకములు కలవు.

## ఆస్ట్రియా

వియన్నా నగరమందు ఇంపీరియల్ గ్రంథభాండాగార మని యొక పెద్ద గ్రంథాలయము గలదు. అది మూఁడవ ఫ్రెడరిక్కుగారిచే 1440 సంవత్సరమందు స్థాపింపఁబడినది. అందు 10,00,000 అచ్చు గ్రంథములు గలవు. వార్తాపత్రికలు మొదలగునవి చదువుకొనుటకు వీలగు ప్రదేశము లనేకములు కలవు. ఆ స్థలములు ఒకటవ అక్టోబరు మొదలు జూను ముప్పదియవ తేదీవఱకు ఉదయము 9 గంటలు మొదలు రాత్రి 8 గంటలవఱకు తెఱచియుంచఁబడును. మిగిలిన నెలలయందు కొంచెము తక్కువ కాలమువఱకు తెఱచియుంచఁబడును. మొత్తమున పగ లంతయు గ్రంథాలయము చదువరుల నాకర్షించుచు తెఱచియే యుంచఁబడును. ఆస్ట్రియా దేశమందు కూడ పెక్కు గ్రంథాలయములు గలవు.

## ఉపసంహారము

ఓహో! యాంధ్రసోదరులారా, చిత్తగించితిరా? పాశ్చాత్య గ్రంథాలయముల పరిస్థితి. ఒక్కొక్క నగరమం దుండు గ్రంథాలయముల సంఖ్యకైనను, మన యాంధ్రదేశ మంతయు పదునొకండు జిల్లాలు కలిపినను మన గ్రంథాలయముల సంఖ్య సరివచ్చుట లేదు. మన దేశమందు లెక్కకు 160 గ్రంథాలయములు మాత్రమే యుండి యున్నవి. ఇందు సుమతిశతకము లాలిపాటలు మంగళహారతులు మొదలగు పుస్తకములు కలిగి సంఖ్యను వృద్ధిచేయు గ్రంథాలయములు కొన్ని, గ్రంథాలయములకు బీగములు బిగించి పనిచేయు గ్రంథాలయములు కొన్ని, ఉత్సాహము వచ్చినప్పుడు కష్టపడి పనిచేసి తదితరసమయములందు పండియుండు గ్రంథాలయములు కొన్ని; ఈ విధముగా మన దేశపు గ్రంథాలయము లలరుచున్నవి.

పాశ్చాత్యగ్రంథాలయములందు లక్షల కొలఁది కోట్ల కొలఁది గ్రంథము లున్నవి గదా, 'లక్ష్మణమూర్ఛ ఈసప్పు కథలు మున్నగు చిన్న పుస్తకములు తప్పక సంఖ్యను పూర్తి చేయుచున్నవి' అని మీ రెన్నఁటికిని తలఁపవలదు. ఇట్టి గ్రంథము లచట లేనే లే వని విజ్ఞానసర్వస్వము లన్నియు ఘోషించుచున్నవి. ఒక్క భాండాగారమునకు మనము పోలిమేని, ఒక పెద్ద రాజభవనమును పొడగాంచిన ట్లుండును. నిశ్చయముగా సరస్వతీదేవి యచట తాండవమాడుచున్న ట్లుండును. పాశ్చాత్యగ్రంథాలయముల యుత్కృష్టదశ చక్కఁగ పర్యాలోచించి మన దేశమం దుండు గ్రంథాలయములను పెంపొందింపఁజేసి యాంధ్రమాతకు శుభమును చేకూర్పుఁడు!

# మిత్రనిరూపణము

## శర్మానందగారు

తెలిసి కష్టంబు గోరెడి కలిమి లేదు
కలిమి నష్టంబు కష్టంబు గాదు భువిని
బలిమి పోయిన కష్టంబు ప్రబల మగుచు
అష్టకష్టములకు మిన్న యగును ధాత్రి.
మతి మెఱుంగక నిరతంబు హితము గోర
హితము చెడుటయు తాటస్థ్య మతికకుంట
పరుఁగ శత్రుత్వ మబ్బుట బాధపడుట
పూర్వనిర్బంధవిచ్ఛేదపూర్తి గనక
సగము మచ్చిక యేహ్యత సగము పగయు
కొంత మోమోటము రవంత చింత యింత
శాంతి రాహిత్యదుఃఖ నితాంతభ్రాంత
మదియు కొంత తారసిలు; అనంతభేద
వాద సందిగ్ధ సంసిద్ధి వచ్చు పిదప.
స్నేహితులతోడ మోదంబు చేర రెట్లు
గలికి దూరుల మగుటయే కాక యెందు?
హితులు గలరయ్య వ్యర్థసంగతి గదయ్య.
హితులు లే రంచు నిచ్చలు వెదకి వెదకి
పరమగుణలుబ్ధు నొక్కని వరహితునిఁగ
తలఁచి గ్రహియించి హృదయంబు దాఁచలేక
గుట్టు వెడలించి మనమును గోసి యిచ్చి
తుదకు వెంగలి యగు లేశదోషవృత్తి!
అదియ ప్రాకృతహితుల మర్యాద సుంతు.
హితుఁడు లేకున్న కష్టంబు; హితుఁడు గలుగ
వృత్తి గలియని కష్టంబు; వృత్తి గలియ
కార్యగుణగతి కష్టంబు; కార్యగతుల
పాలు గొనుటను కష్టంబు; పాలుగొన్న
కనకవిభజనకష్టంబు; కనకమునకు
మున్న విషయేచ్ఛ కష్టంబు; మోహబంధ
బంధురాపేక్షబంధితబాంధవంబు
ఘోరనరకంబు, స్నేహంబు గోరు భవము.
హితునిఁ గానక వివిధసంగతులు తడవి,
విసిగి వేసారితి ననర్థవిషయ మగుట.
కొట్టకొస కిట్టులే నొక్క గుట్టు తెలిసి
లోన గాంచితి నొక్కని లోభి గాని
పరమకల్యాణగుణగణప్రాభవుని వి
శేష గాంభీర్యభావుని చిన్మయునిఁగ.

చూచితిని గాని చూచిన చూపు గాదు,
తలఁచితిని గాని తలఁచిన తలఁపు గాదు,
వలచితిని గాని వలచిన వలపు గాదు,
కొలిచితిని గాని కొలిచిన కొలువు గాదు;
వాని రూపవిశేష మెవ్వనికి లేదు,
వాని గాంభీర్యవృత్తి యెవ్వనికి లేదు,
వాని శాంతస్వభావ మెవ్వనికి లేదు,
వాని నిత్యనిదాన మెవ్వనికి లేదు,
తలఁచి చూచితి వలచితి కొలిచి లేను.
లోనఁ గాంచిన వాని నీ లోకమందు,
చూడఁదలఁచితిఁ గాని యీ చూపు వేఱు:
బాహ్య మాంతర్యమునఁ జొన్ని వస్తుజగతిఁ
బాఱఁజూచితి; నా మిత్రు ప్రతిభ గంటి
ఏ మనం దా మహాత్ముని ప్రేమ? యెచట
ప్రతిఫలింపంగ లేదు? శుభ్రప్రభావ
మేని మోహింపఁజేయదు? ఎందుఁ గన్న
నొక్క భావంబు మాత్ర నా ప్రక్క నిలిచె;
దాని నా నేర్పు కొలఁదిని తనివి దీఱ
నాదు లోకంబునకుఁ దెల్పి నాదు వంత
మాన్పుకొన నెంచితిని మైత్రిమహిమఁ దలఁచి.
జీవు నెడ జీవి నిర్జీవభావచిహ్న
కళలయందున కళ పోయి గానమందు
రూపమందున తేజంబు రుద్రభూమి
యందు భయమును భ్రాంతియు నైనవాఁడె
తెలియఁబడినట్టి హితుఁ డని తెలుపవలసె.
రూపు లన్నియు తనయందె రూఢి నిలిపి
రూపు లన్నియు తానెయై రూఢి నిలిచి
రూపులకు రూపియై తన రూపు చెడని
రూపరహితుఁడె హితుఁ డని రూఢ మయ్యె.
హితుఁ డనఁగ వాఁడె సర్వసమ్మతుఁడు వాఁడె,
బంధుగులు వాఁడె పితరులు భ్రాత వాఁడె,
సర్వమును వాఁడె, కలఁ డన్న సామి వాఁడె,
పరుఁడు స్వత్వంబు వాఁడె, యెవ్వాఁడు లేఁడు.
మాంసపిండంబు మనిసిగా మార్చె నెవఁడు?
గ్రుడ్డులో నాన పిట్టగాఁ గూర్చె నెవఁడు?
స్వేదమున జీవకోటిని చేసె నెవఁడు?

బీజముల భూజములు చేసి పెంచె నెవఁడు?
వాఁడె హితుఁ డగుఁగాక, యెవ్వాఁడు గలఁడు!
పసులలో నింత జ్ఞానంబు పఱపువాఁడు
రాలలో రత్నరాశిని రాల్చువాఁడు
నీటిలో నగ్గి పుట్టించి నిలుపువాఁడు
చెట్లలో పెద్ద లెన్నియొ చేర్చువాఁడు
సుఖము దుఃఖంబు నొకరీతిఁ జూచువాఁడు
సుఖము దుఃఖంబు తనయందె నూచువాఁడు
సుఖము దుఃఖంబు తానుగాఁ జూచువాఁడు
సుఖము దుఃఖంబు వేఱుగాఁ జూపువాఁడు.
పాపపుణ్యంబు లొక్కటఁ బఱపువాఁడు
పాపపుణ్యవిభేదంబుఁ బాపువాఁడు
పాపమే పుణ్య మనిపించు ప్రజ్ఞవాఁడు
పాపమును పుణ్యమును గాని ప్రతిభవాఁడు
కాఁడె, కల్యాణరూపుఁ డఖండుఁ డతఁడు!
కంటి కాఁ జూపి యెది గాని రీతివాఁడు
కండు తా నాచు నెది గాని రీతివాఁడు
లేఁ డనెడువాని కెందును లేనివాఁడు
కలఁ డనెడువాని కన్నింటఁ గలుగువాఁడు
కలఁడు హితుఁ డిఁక ననుకంప గలఁగ నేల?
కష్టముల తెచ్చు తండ్రి జగాన లేఁడు.
జగములకు తండ్రి కష్టంబు సలుపఁబోఁడు
కష్టమున నిత్యసుఖమును గట్టువాఁడు
గట్టివాఁ డంతవాఁ డెందుఁ గలుగఁబోఁడు
ప్రబలహితుఁ డాఁడె నాపాల, బాస లేల?

# స్వప్నము

మైనముపాటి హనుమంతరావు గారు

భావమునందు కల్పన లపారము లౌటయు మెల్ల మెల్ల గో
దావరి శీకరాంబుతతి దాన జనించు సుగంధసంపదల్
చేవ నడంప మెల్లమెలఁ జేరుచు శ్రాంతుల కెంతొ సంతసం
బావహిలంగఁ జేయు బవనాళి చెలంగెడు చోటు చేరితిన్. 1

ఉ. వన్నెలకెల్లఁ దండ్రి యగు భానుఁడు మున్నిడినట్టి సంపదన్
సన్నని బంగరుం గిరణజాలము మూలమునన్ గ్రహింపఁగా
మన్నన లంది వానియెద మానకయుండు మిళిందబృందముల్
కన్నులు గానరామి నల కంజగృహాంతరసీమఁ దూఁగఁగన్. 2

ఉ. దూరగతుండు మిత్రుఁ డిఁక దూరమె కా విజయాప్తి నీకు? నీ
ఘోరము చూడఁజాల మని కుందుచు దిక్కులు మోము నల్లనై
దూరము లౌట, నొంటి యయి దుఃఖమునన్ జనుచుండె గౌతమీ
వారిజకోమలాంగి మది స్వస్థితి మెల్లఁగఁ జింత సేయుచున్. 3

ఉ. ఒంటివి గావు నే నిచట నుంటిని; నే నిట నుంటి; నే నిదే
యుంటిని గొంత దూరమున; నుంటిని నే నఱమైలు దూరమం;
దొంటి నటంచుఁ జింతిలకు మల్లము నించుక చిక్కఁబట్టు మా
ఇంట వసింపు మన్న గతి సన్నని దివ్వెలు దోఁచె నాకలన్. 4

ఉ. వందురకమ్మ! యెల్లర కవార్యమ కర్మఫలం బశాశ్వతం
బెందుకు జీవన మ్మనుచు నెప్పుడు బుద్బుదపాళిఁ జూపి మా
యందఱ చిత్తవేదనల నారుచుచుండు సుధీమతల్లి! నీ
కెందుల కిట్టి పామరత? యీ వగ మాని ముదమ్ము నందుమా. 5

ఉ. అమ్మరో! కష్టముల్ నిలుచునా కలకాలము? నీ తరంగసం
ఘమ్ములు సాంధ్యకాలమునఁ గష్టసుఖమ్ములు క్రిందుమీఁదు కా
నిమ్మగఁ దీటుపెట్టుకొని యెప్పుడు నిల్వ వటంచుఁ దెల్పవే?
నెమ్మది చిక్కఁబట్టు; మగు నీ విజయాప్తి యినప్రభాప్తితోన్.

ఉ. కాలము మంచి దైన తఱిఁ గ్రన్నన డగ్గరి, ఖిన్నమైన నా
కాలము దూరుకొంచుఁ గడగాఁ జనువారల కేల యేడ్వ? నీ
పాల వసించి రేల్పవ లపారముదమ్మున నిన్నుఁ గొల్చు నా
జాలరిబండ్లఁ జూచికొని సాధ్విరో! దుఃఖము లో నడంపుమా. 7

శా. నానానూతనభావనాతతికి లోనై కన్నులన్ మూయ నా
కా నవ్యాద్భుతగౌతమీవిమలకూలామోదసంతుష్టి నెం
పూనన్ నాదు మనంబున న్విడిచి తా నొందెన్ లసద్దివ్యసం
తానానూనమనోజ్ఞగానకలనాతత్త్వంబు నాలించుటన్. 8

సీ. తమ్మికేకుల మార్దవమ్ము నెమ్మి యొనర్చు
మిసిమి బంగరు చాయ మేను లమర,
కల్లుఁబూవుల సౌరు జల్లులాడఁగఁజాలు
వలిపంపుచాల్ తళత్తళల నీన,
మై నలందిన మృగీమదసౌరభంబులు
గంధవహాఖ్యాతి కరముఁ బెంప,
కరపల్లవంబులఁ గైసేసి మొఱయించు
వీణాదిరవములు వీన్ను నింప,

లసదలంకారవరరత్న రాజికాంతి
పుంజముల నల్గడలఁ జిమ్మ, పుష్పధన్వి
విడువ రయగలిఁ జను దమ్మివిరు లనంగఁ
గొమ్మగమి చనుచుండె దివమ్మునందు. 9

తే. రత్నకాంచీరవంబు తాళముల రవము
పంచమస్వరగానంబు బహువిపంచి
కానినాదంబు లీనమై గంధవహునిఁ
గలసి తన్మయత్వమ్మున నిలను ముంచె. 10

ఉ. నల్లని మబ్బులందు లలనామణు లెల్లరు మర్దళధ్వనుల్ [చుల్
ఘొల్లనఁ జేయుచున్ జనఁగఁ గ్రొత్తమెఱుంగులు నాఁ దనూరు
చెల్లని చంద్రగర్భ లన మేలగు వాద్యరవంబులున్ దగన్
జల్లని గానవృష్టి జనసంతతి కెంతయు సంతసం బిడెన్. 11

మ. భ్రమరధ్యానము సేసి కీటకము దివ్యం బైన రోలంబరూ
పమునుం బొందు గతిన్ దదీయసుదతీవారంబు సంగీతసా
రమరందాంబుసమూహపానవశతన్ బ్రాపించె నవ్వేళ నా
కమలం బైన తదీయశక్తివిభవం బయ్యారె! వింతే కదా. 12

తే. అంచ టెక్కల కెనయగునట్టి రెండు
పక్షములు గల్గి యా వాయుపథమునందు
రివ్వురివ్వనఁ బారు నా జవ్వనులనుఁ
గాంచ నాకును గల్గెఁ బక్షద్వయంబు. 13

ఉ. నేలను వీడి యొక్కడుగు నింగికి లేవఁగలేనియట్టి నే
నా లలనావతంసముల యండను సత్పథమందు రివ్వనన్
దూలికవోలెఁ బోఁగలుగ దోషము నా కది మిన్ను ముట్టె; ధా
రాళము నయ్యె నాదు గళరావ మ దేమి మహాప్రభావమో? 14

తే. కాలమున కనువైన రాగములఁ గూర్చి
వాద్యముల మేళవించి యవ్వారి గాఁగ
వివిధగీతములను బాడు వేళ నట్టి
గీతములె నేను బాడిన భాతి దోఁచె. 15

తే. అమలగానసుధానందవిమలవార్ధి
మునిఁగి తేలుచు నా సఖుల్ మదము మీఱఁ
బాడు గీతంబులను నేను బాడినట్టు
లెంతొ సంతుష్టి నందుచు నితర మైన
సృష్టి యంతయు మఱచితిఁ జిత్తగతిని. 16

ఉ. అంచలగుంపువోలె గగనాంగణమందునఁ బోవుచున్న యా
కాంచనసుందరాంగులను గాంచినయంతనె చిత్త మెల్ల మో
హించిన దా నటన్న, నిఁక నద్భుతగానవిలాససంపదన్
గాంచిన నా మనం బెటులు గాంచును నిర్మల శాంతభావమున్?

ఉ. మేఁకల గొఱ్ఱెపిల్లలను మేపుచు గుట్టల మిట్టలన్ గుబా
నీకవిశాలశాఖల వనీతలమం దలరారునట్టి య
బ్జాకరపాళికూలముల హాయిగ గొల్లలు వేణునాదముల్
ప్రాకటలీలఁ జేయ నది బంధురమోద మొసంగకుండునే? 18

చ. కిటకిట తాళరావములఁ జేయుచు దక్కిని జక్కఁ దట్టుచున్
ఖటిమ యొకింత లేని చెడుపాటలఁ బాడుచు రాత్రివేళ నాఁ
కటివెత నార్పఁ గూటికయి యల్లనఁ బల్లెల సంచరించు మ
ర్కటనిభు లైన భిక్షుకుల గానము మోహనకారి గాదొకో?

ఉ. తంబుర మీటి గుమ్మెటలఁ దట్టుచు సంగములందు వస్త్రముల్
డంబు చెలంగఁ జిందులు దృఢమ్ముగఁ ద్రొక్కుచుఁ బూర్వరాజ
కంబుల విక్రమక్రమము కల్పితరీతిని బాడునట్టి జం [లో
గంబుల గానవైఖరియుఁ గాదొకొ లోకవిమోహనం బొగిన్? 20

ఉ. కత్తియు డాలు కేలఁ గొని కర్ణయుగమ్మున కెంతొ విందుగాఁ
దిత్తియుఁ జంబలున్ దనరు దివ్యతరం బగు మేళమై తగన్
జిత్తము బత్తి కున్న హరి చిన్మయరూపచరిత్రఁ బాడు నా
మత్తులు గొల్ల పాటలను మార్దవ మింతయు నుండకుండునే? 21

చ. ఘనతరశాస్త్రబద్ధ మయి క్రాలక, మేళము పొందు లేక, పా
వన మగు భావ గాక, ధర భైక్షుకవృత్తి చెలంగు గానమే
మనముఁ గరంగఁజేయునెడ, మానవతీకలకంఠనిస్వనం
బున సకలాంగయుక్త మయి పొల్చెడు గాన మిఁ కేమి సేయదో?

ఉ. మందలఁ బ్రొద్దుప్రొద్దునను మానెడొ ముంతెడొ పాలు ద్రావి
పొందుగ శాద్వలంబులమహోద్ధతి మై పెనుగంతు లేయుచున్ [యిం
సందడి సేయు లేగలను జల్లని గానసుధానుసేవనన్
దొందరపాటు దక్కి కడు తోషము మాపులయందు చూపవే? 23

ఉ. గానము సేయ నేరమియు గానసుధానుభవంబునన్ వరా
నూనముదమ్ము నందమియు నూటికి నొక్కని కుండునే మొ? య
వ్వానిది వ్యర్థజీవనము, వానిఁ దలంప నఘంబు కల్గు న
మ్మానవు కృత్యముల్ సత మమానుషముల్ భయకారణంబు లౌ.

చ. అను తలపోఁతలన్ దవిలి హాయిగ నా సుదతీలలామలన్
గనుచుఁ దదీయగానభవగాఢముదంబుధి నోలలాడు చి
ట్లని వచియింపరాని మహదారవ మొం డొగి నాలకించి జ
ల్లన నొడ లెల్ల మేల్కనితి నద్భుత మౌ కల మాయ మాటచేన్.

మ. తొలి నేఁ గాంచిన సైకతస్థలములే, దూరంబునన్ గోతమీ
సలిలంబందునఁ దేలు నౌకలె, మనస్సంతాపమున్ బాపఁగాఁ
గల మందానిలపోతసంతతులె, నక్షత్రావృతం బైన ది
వ్యల సద్వీథియె గాని దేవవనితావారంబు గాన్పింపదే. 26

మ. అని హన్మంతకవీశ్వరుండు మది నత్యంతంబుఁ జింతించు చా
ఘనసంగీతసుధాప్రవాహమునఁ జొక్కం జేయఁగా మిత్రులన్
దనరన్ గూర్చెను స్వప్నగాథ; నిది యీ ధాత్రీస్థలిన్ సర్వదా
దనరుం గాత రమామనోహరకృపాదంచత్సుధావృష్టులన్! 27

# పౌరగ్రంథాలయములు: బాలశాఖ

సూరి వేంకటనరసింహశాస్త్రి గారు, బి. ఏ.

ఒక మనుజుని ప్రవర్తనను గూర్చి మనము తెలిసికొనవలయు నన్న, 'ఆ మనుజుఁడు ఏ వంశపువాఁడు? ఆయన చెలిమి చేయు చెలికాండ్రెవరు? ఆయన చదువు పుస్తకము లెవ్వి? ఆఁడు ఆట లెవ్వి? పాడు పాట లెవ్వి? ధరించు వస్త్రము లెట్టివి? నివసించు గృహస్థితి యెట్టిది?'—ఇట్టి బహువిషయములపై మన బుద్ధి ప్రసరించును. కావున మనుజుని మంచి మార్గమునకో చెడ్డ మార్గమునకో త్రిప్పుటకు పైని చెప్పిన విషయము లన్నియు కొలఁదిగనో గొప్పగనో తోడ్పడు నను మాట తేలుచున్నది. ఇందును బట్టి సన్మార్గవర్తినిగా చేయుటకై పైని చెప్పిన పరిస్థితులు నిర్దుష్టముగా నుండవలయు ననెడి యంశము తేలుచున్నది. ఇఁక నీ పరిస్థితులను నిర్దుష్టముగా చేయుట యెట్లు? ప్రతి మనుజుఁడును తన మనస్సున కిష్టమగు పరిస్థితుల నేర్పఱచుకొనుచున్నాఁడు. ఇష్టము అలవాటుపై నాధారపడియున్నది. అలవాటు అనఁగా చిరకాలాభ్యాసమువలన మనుజుని సంకల్ప ప్రసారణ అంతగ లేకయే కార్యాచరణకు ప్రేరణ చేయునది. ఈ యలవాట్లు చాలవఱకు శిశువుయొక్క మెదడు కోమలమై వెలుపటినుండి జ్ఞానేంద్రియము మూలమున వచ్చు అనుభవములను అతిసునిశితముగ గ్రహించెడి పసితనమున ప్రారంభమగుచున్నవి. ఇంతే కాక, జన్మాంతరములయందు జీవుఁడు అనుభవించిన యనుభవములతోఁ గూడ శిశువు భూమిపై నుద్భవించుచున్నది. కావున శిశువునం దిమిడియున్న శక్తులు అనంతములు, అసంఖ్యాకములు. ఈ శక్తుల నన్నిటిని జాగరూకతతో గుర్తెఱిగి సన్మార్గమునకు త్రిప్పి తన్మూలమున శిశువుయొక్క భావిప్రవర్తనను బాగుపఱచుటయే సరియైన విద్యయొక్క విధి. కావున విద్య యనఁగా పుస్తకములయం దున్న యంశములను గ్రహించి వానిని మనస్సునం దిమిడ్చికొనుటయే కాదనియు మనుష్యులయం దిమిడియున్న యన్ని శక్తులను న్యాయమార్గమున నభివృద్ధి పొందించి తన్మూలమున మనుజుని జీవయాత్రను పవిత్రముగను పురుషార్థప్రాప్తి సాధకముగను చేయునదే విద్య యనియు తెలియుచున్నది. విద్యవలనఁ గల్గునది జ్ఞానము. విద్య ఇంద్రియముల మార్గమున లభించును. కావున జ్ఞానాభివృద్ధి సాధనము ఇంద్రియవ్యాపారములు. పైన చేసిన చర్చ కంతకును ఫలిత మేమని తేలుచున్న దనఁగా మనుజుఁడు పురుషార్థములను సాధింపవలయు నన్న జ్ఞానవంతుఁడు కావలయును. జ్ఞానము విద్య వలన లభించును. విద్య యింద్రియముల మూలమున లభించునదై యున్నది. కావున విద్య యింద్రియవ్యాపారములమీఁద నాధారపడి యున్నదని తేలుచున్నది. ఈ యింద్రియవ్యాపారములు సరియైన మార్గముల ప్రసరించునట్లు చేయుటయే విద్య. ఇట్టివిద్య పైని చెప్పఁబడిన కారణములను బట్టి పసితనముననే ప్రారంభింపవలసినదై యున్నది. ఈ చర్చ యంతటిలోను మనస్సుకూడ ప్రత్యేకేంద్రియముగా పరిగణింపఁబడినది. ఇంతవఱకును మూలసూత్రముల నాధారపఱచుకొని చర్చ జరపఁబడినది. ఇఁక ముందు ఇంద్రియవ్యాపారములను శుద్ధపఱచుట యన నేమో దృష్టాంతపూర్వకముగ విమర్శించి ప్రస్తుతవిషయమును పౌరగ్రంథాలయములందలి బాలశాఖకును అట్టి పనికిని కల యన్యోన్య సంబంధములను గూర్చి వివరింపఁబడును.

తత్త్వము ఏ దేశమునందు ప్రచారము పొందిన దైనను ఏ కాలమునందు బోధింపఁబడిన దైనను నిరంతారాసక్తితో అన్వేషింపవలయు నను గాఢతర మగు వాంఛ కలిగియుండుట, భావనాశక్తిని వృద్ధిపఱచుకొనుట, ధారణాశక్తిని బలపఱచుకొనుట, మనుష్యునియందలి యీశ్వరచిహ్నము లగు సత్యము దయ ప్రేమ పవిత్రత మొదలగు తత్త్వముల నభివృద్ధిపఱచుకొనుట, ఆత్మసంరక్షణకుఁ గావలసిన జ్ఞానమును సంపాదించుకొనుట యనునవి పైని చెప్పిన యింద్రియవ్యాపారములకు దృష్టాంతములుగా నంగీకరింపవచ్చును. ఈ యింద్రియవ్యాపారములకు గ్రంథములు చిత్రకళలు అన్యోన్యసంభాషణము ఆటలు మొదలగునవి సాధనములై యున్నవి. పైని చెప్పిన సాధనములను బాలురకు లభించునట్లు చేయుటయే పౌరగ్రంథాలయమునందలి బాలశాఖయొక్క విధి. ప్రాచీనకాలమునందు మన మిప్పుడు చూచుచున్న పౌరగ్రంథాలయములు అందలి బాలశాఖలు మన దేశమున లేకున్నను, ఈ విధులను నెఱవేర్చు ప్రతిష్ఠాపనలు కొన్ని లేకపోలేదు. పొడుపుకథలను చెప్పుకొనెడి యలవాటు మన బాలురకు కొలఁది కాలము క్రిందటివఱకు నుండినది. పాశ్చాత్యపద్ధతుల ప్రకారము మన దేశమునందు విద్య వ్యాపించిన కొలఁది ఈ యలవాటు మన బాలురయందు రూపుమాయుచున్నది. ఇందువలన భావనాశక్తి వృద్ధి యగును. లోకానుభవము హెచ్చును. రెండవది కట్టు పద్యములను చదువుకొనుట. అనఁగా, ఒకరు చదివిన పద్యము ఏ యక్షరముతో నంత మగునో ఆ యక్షరముతో ప్రారంభ మగు పద్యమును రెండవవారు చదువవలయును. అట్లు చదువలేనిచో ఒక యాట ఓడిపోయినట్లు లెక్క. ఇందువలన ధారణాశక్తి వృద్ధి యగుచుండును. మరియు, ఆఁడుపిల్లలచే రచింపఁబడు ముగ్గులయందు కొన్ని చిక్కులు కల్పింపఁబడుచుండును. ఆ చిక్కులు కనుఁగొనఁగలిగినవారికి ఒక యాట గెలుపు. ఇంతియ కాక, వైకుంఠపాళి దశావతారముల యాట మున్నగు నాటలు మన బాల బాలికలు కొలఁది కాలము క్రిందటివఱకును ఆడుకొనుచుండిరి. దీనివలన హస్తకౌశలము ఏర్పడుచుండెను. ఇంతియ కాక, మన దేశపు పిల్లలు కథలు చెప్పుకొనుటయందు మిక్కిలి ప్రజ్ఞావంతులుగా నుండియుండిరి. ఇందువలన

బాలురయందు భావనాశక్తి, కార్యకారణసంబంధము తెలియుట, జ్ఞాపకశక్తి మొదలగు శక్తులు వృద్ధి యగుచుండెను. ఇప్పు డీ యలవాటు లన్నియు రానురాను నశించినవి. మన మొక నూతనశకము ప్రారంభించితిమి. మన ప్రస్తుతస్థితిని బట్టి మన దేశమునందు కొన్ని నూతనప్రతిష్ఠాపన లవతరించినవి. మన దేశమునం దభ్యస్తమగు ధారావాహితపరిజ్ఞానమునకు నష్టము కలుగకుండ ఈ నూతన ప్రతిష్ఠాపనలను మన బాలుర విద్యాభివృద్ధికొఱకు మనమె ట్లుపయోగించుకొందుమనెడి యంశమే ఇచ్చట చర్చనీయము. పౌరగ్రంథాలయములందు బాలశాఖను మహోన్నతదశకు తెచ్చినవారు అమెరికా దేశీయులు. వారినిచూచి బరోడా రాష్ట్రాధీశుఁ డగు గాయాక్వాడ్ గారు ఈ ప్రతిష్ఠాపనలను తమ దేశమునందు ప్రవేశ పెట్టిరి. ఆధునిక పౌరగ్రంథాలయముయొక్క ముఖ్యధర్మము నొక దానిని బాగుగ జ్ఞప్తియం దుంచుకొనినఁ గాని బాలశాఖకును పౌరగ్రంథాలయమునకును గల అన్యోన్య సంబంధము తేటపడదు. గ్రంథాలయమునకు వచ్చువారికి వారు కోరిన గ్రంథము నిచ్చి వారి వాంఛను తీర్చుటయే కాక గ్రంథాలయము పనిచేయు ప్రదేశమున నివసించెడి యాబాల గోపాలము జనుల యందఱి యొక్కయు మనముల నాకర్షించి వారి జ్ఞానాభివృద్ధికి తోడ్పడుట గ్రంథాలయముయొక్క విధి యని యిప్పుడు సర్వజన సమ్మతముగా నంగీకరింపఁబడినది. అందువలన బాలురుకూడ పౌరగ్రంథాలయముల యాదరణలోనికి రావలసినవారైరి. బాలుర విద్యాభివృద్ధికై అమెరికాదేశము నందలి గ్రంథాలయములు బహువిధముల పాటుపడుచున్నవి. అచ్చట బాలశాఖకు ప్రత్యేక మందు కొఱకై రెండు మూఁడు సంవత్సరముల కాలము తర్ఫీదు కాఁబడిన యధికారి యేర్పడియుండును. ఈ యధికారి యమెరికాలో సామాన్యముగా స్త్రీయై యుండునఁట. ఆమె ఒక్కొకదినము గ్రంథాలయమున బాలురను చేర్చి కథలు చెప్పుచుండును. మరియొక దినము పిల్లలలో పిల్లలు కథలు చెప్పుకొనునట్లు చేయుచుండును. బడికిపోయి యుపాధ్యాయుని సాహాయ్యముతో బాలురను గ్రంథాలయమునకు తోడ్కొని వచ్చి వా రభ్యసించు పాఠములను చిత్రపటముల మూలమున వారలకుబోధించును. సద్గ్రంథపఠనమునందు వారలకు వాంఛను కలుగఁజేయును. సదసద్గ్రంథ విచక్షణాజ్ఞానము వారి కలవడు నట్లు చేయును. గ్రంథాలయములందలి పరికరములను, అనఁగా కేటలాగులు (గ్రంథవిభజన పట్టికలు) మొదలగువాని యుపయోగమును, గుఱించి బాలురకు బోధించును. ఇట్లు బాలురను గూర్చి గ్రంథాలయమున జరగు మహాకార్యములతో తృప్తినొందక ఆ దేశమునందలి బాలశాఖాధికారిణి పాఠశాలల కేఁగి అచ్చటి బాలుర కుపయుక్తముగా నుండెడి గ్రంథములను ప్రత్యేకముగా పెట్టెలలోఁ బెట్టి యుపాధ్యాయుల పరమున నొప్పగించుచుండును. ఉపాధ్యాయులు బాలురకు బోధించు కాలమున ఈ గ్రంథముల ప్రాశస్త్యమును గూర్చి బాలురకు బోధించుచుందురు. తన్మూలమున వారి కా గ్రంథములం దభిరుచి కలిగి వానిని బాలురు చదువుచుందురు. పల్లెకూటమునకుఁ గాని గ్రంథాలయమునకుఁ గాని వచ్చుటకు నావకాశము లేని నిరుపేద లగు బాలుర యుపయోగముకొఱకు గ్రంథాలయముల నుండి పుస్తకములు పంపఁబడి అవసరమైనపుడు గ్రంథాలయ సేవకులెవరైన వారలయొద్ద కేఁగి ఆ పుస్తకములనుండి చదువుచుందురు. ఇంతటి యీమహాకార్యము, ఆ దేశములోని రాజ్యాంగము ప్రజాధీనము గనుక, జరగుచున్నది. బరోడా రాష్ట్రమునందుఁ గూడ ఇందులో కొంత భాగము కృషి సలుపఁబడుచున్నది.

బాలశాఖకు ముఖ్యమైన పరికరము శాఖాధికారి. ఆయన యొక్క గుణసంపత్తిపై ఈ శాఖయొక్క జయాపజయములు ఎక్కువగా నాధారపడియుండును; అటు పిమ్మట బాలురకొఱకు ప్రత్యేకముగా నేర్పఱుపఁబడిన గ్రంథములు బొమ్మలు ఆటలు మొదలగు వానిపై నాధారపడియుండును. ఈ రెండవ విషయమున మన కున్న కొఱఁత యింతంతయని చెప్పుట కలవి కాదు. బాలుర విద్యనుగూర్చి మన మాచరించుచున్న పాతక మతిఘోరము. ఏ విషయములను బోధించిన మన బాలుర మనంబులు వికసించునో యను విషయమును తల పెట్టిన పాపమున మన మింతవఱకును పోనే లేదు. వారివారి స్వలాభములకొఱకై విదేశీయులును, వారిపై నాధారపడియుండు స్వదేశీయులును ప్రచురించు గ్రంథములే మన కీ విషయమున శరణ్యములు. స్వదేశస్థులు స్వయముగా ప్రచురించు గ్రంథములకు అమ్మకము లేదు. గ్రంథములు కొనుట యన నేమో మన కంత యిష్టమైన పని కాదు. ఒకరు గ్రంథము కొనినచో పలువురు దానిని తిరిపెమెత్తి చదువుచుందురు. ఈ కారణమున మన దేశీయగ్రంథకర్తలు దివాలా యెత్తి తిరిగి గ్రంథములను ప్రచురింపలేక చతికలఁబడుచున్నారు. ఈ విధముగా, మన పిల్లలను పసితనమున దూరదేశమునుండి వచ్చు డబ్బాలపాలుపోసియెట్లు పెంచుచున్నామో అట్లే, మన బాలురను గూడ విజాతీయుల విజ్ఞానముపైనే శైశవమునుండియు పెంచుచున్నారము. అట్టి పని మన దేశమునకు శ్రేయోదాయకము కాదు. మన దేశపరిజ్ఞానమును బాలురకుద్బోధించు నూతన గ్రంథములు సులభశైలితో స్వదేశగ్రంథకర్తలు రచింపవలయును. అట్టి గ్రంథములు మన దేశమునందలి పాఠశాలలన్నిటియందును పఠనగ్రంథములుగా ప్రవేశపెట్టఁబడునట్లు ప్రజానాయకులు అధికారులను కోరవలయును. అప్పుడే మన బాలుర విద్య మంచి మార్గమును త్రొక్కుటకు మొదలుపెట్టును. అప్పుడే గ్రంథాలయములయందలి బాలశాఖకు పూర్తియైన ప్రచారణ కలుగును.

PROFESSOR K. RAMAMURTHI'S CIRCUS
(Wonderful High jump feat)



ప్రొఫెసరు కోడి రామమూర్తిగారి సర్కస్
(అత్యద్భుత వ్యాయామ కౌశలము)

KAPPAGANTULA CHANDRAMOULESWARA SASTRI GARU



కప్పగంతుల చంద్రమౌళీశ్వరశాస్త్రిగారు

MR. N. GOPALASWAMI NAIDU: Andhrapatrika Artist
ఎన్. గోపాలస్వామి నాయుడుగారు (ఆంధ్రపత్రికా కార్యాలయము నందలి ఆర్టిస్టు)



H. H. R. K. V. PERUMAL RAJAH BAHADUR
2 nd Prince of Karvetinagar

హిజ్. హైనెస్. ఆర్. కె. వి. పెరుమాళ్ రాజాబహద్దరు గారు (కార్వేటినగరము)

# ప్రధాన పౌరప్రశంస

కాళ్లకూరి గోపాలరావు గారు

రావుసాహెబుబిరుద విరాజమాన!
ప్రథితకలువలవంశప్రవర్ధమాన!
శ్రీమదార్య! రామానుజశ్రేష్ఠివర్య!
శ్రీజగన్నేత నిన్ను రక్షించుఁగాత! 1

క. నైష్ఠికుఁడ వీవు పౌరవరిష్ఠత గనినట్టి యాంధ్రబృందమునందున్,
జ్యేష్ఠుఁడవు గాకపోయిన, శ్రేష్ఠుఁడవని గౌరవింపఁ జెల్లదె నిన్నున్.

తే. నిన్ను గౌరవించు టన్నచో, తముఁ దాము
గౌరవించుకొనుట గాదె యరయ?
దొరతనంబువారి పక్షమున నీ సూక్తి
సార్థ మనె మణయ్యగంతవాఁడు. 3

తే. ఆర్యవైశ్యసంఘాతిథ్య మందినావు;
ఆంధ్రసభవారి యాతిథ్య మందినావు;
మరియు నెందఱో చేసిన మన్ననలను
గాంచినా; వవి యటు లుంచి గనుము దీని. 4

ఉ. సర్వగుణాఢ్య! కంటె? నిజసంతతి యున్నతిఁ గాంచుచున్కి-దృ
క్పర్వముగా గ్రహించి, తన పట్టఁగ రాని ముదంబు త్వద్యశః
పార్వణచంద్రికాభ మయి పర్వఁగ, నీ కిదె యాంధ్రమాత యా
శీర్వచనం బొనర్చెడిని సిద్ధకవిత్వలసన్ముఖంబునన్. 5

సీ. ఆంధ్రైకలక్ష్య మహా నార్యవైశ్యకులంబు
మేల్మి మీఱంగ జన్మించినాఁడు;
పాశ్చాత్యవాణిజ్యపారీణతను గన్న
కిం గండు కంపెనీకిన్ విభుండు;
దక్షిణభారతవర్తకసంఘము మన నొప్పు
జాతీయపూగంపు సభ్యవరుఁడు;
సామ్రాజ్యముఖ్యసంస్థలయం దొకం డగు
పోర్టు ట్రస్టునను సభ్యుం; డితండు
సర్వసామాన్యుఁడే? సుప్రశస్తకీర్తిఁ
దనరు స్వకులైకధర్మసంస్థాపకుండు—
అని జగం బెల్ల నుతియింప నతిశయిల్లు
నీ గుణాతిరేకంబు వర్ణింపఁదరమె? 6

తే. మఱియు నీవు చెంగల్పట్టు మండలంపు
స్థానికస్వపాలనమున సభ్యమణివి;
చెన్నపురపాలకసంఘసేవ కూడ
నీదు సభ్యతాధిక్యంబు నిరూపించు. 7

సీ. చెన్నపుర్యాంధ్రసభోన్నతిఁ గాంక్షించి
ధర్మకర్తృత్వంబు దాల్చినావు;
దక్షిణహైందవోద్యద్బలసమితి ను
పాధ్యక్షపీఠంబు నందినావు;
రాఘవశ్రేష్ఠిధర్మప్రతిష్ఠాపన
గరిమ నధ్యక్షత గాంచినావు;
మహితనుంగంబాకమానితాయుర్వేద
ధర్మవైద్యాలయస్థాపకుఁడవు;
సర్వతోముఖప్రచారప్రవృత్తులఁ
దనరు నీ యుదారదాననిరతి
నీదు కార్యపరత నిరుపమానములు; నీ
కేని సంస్థ పురిని లేదు నిజము. 8

సీ. శ్రీపెరుంబూరూరఁ దెలుఁగు సంస్కృతకళా
శాల కింపగు వ్యవస్థాపకుఁడవు;
విక్టోరియానామవిదితపారిశ్రామి
కాలయసభ్యత్వ మందినావు;
తతభక్తి భగవత్కథాప్రసంగసభాధి
పత్యోన్నతపదాప్తిఁ బరఁగినావు;
ఏపారుచున్న మైలాపూరు సంగీత
సభ నుపాధ్యక్షత సలిపినావు;
బహుళకార్యపరత సహజవినమ్రత
వెనుక కీడ్చుచున్న విరతి గొనక,
అన్ని సభల కరిగి యభివృద్ధికై పాటు
పడెదవఁట! యిట్టుండవలదె శ్రద్ధ? 9

తే. జంతుహింసానివారకసంఘకోశ
పతి వగు ట టుండ, వ్యాధిబాధితమృగాళి
కుచిత మగు మేఁత స్వయముగా నొసఁగుచున్కి
యొకటె చాలు నీ సదయత నుగ్గడింప. 10

తే. పశువులకె యింత చేసెడి భవ్యమతివి
మానవుల కేమి చేయంగఁ బూనకుందు?
'ధనికుఁ డన భగవల్లోకధర్మకర్త'
యనిన నీ యుదారత కన్న యదె మితంబు? 11

తే. భువిఁ బరస్పరాశ్రయత మానవగుణంబు,
ఎదిరెఱు లోపంబు లేనివా రెందు లేరు;
ఒండొరుల లోపములు దీర్చుచున్కి కన్న
జన్మసాఫల్యమార్గ మీ జగతిఁ గలదె? 12

క. వీణావాదనమందు ప్రవీణుండవు, శిల్పముఖరవివిధకళాసం
త్రాణుండ, వరయ ప్రాపుం గాణాచివి కావె నీవు కవివర్యులకున్?

ఉ. పూర్వము కృష్ణరాయముఖ పూజ్యసురద్రుమకోటు లున్న యాం
ధ్రోర్వి, చిరంబు బీడువడియుం, జిగిరించెడి నిప్డు; త్వాదృశా
ఖర్వకృపాప్రవాహము వికస్వరకావ్యవరైకకుల్యలన్
బర్వన, నాంధ్రలోకకృషి వైశద సత్ఫల మీయఁ జాలెడిన్. 14

సీ. అభినవపచ్చప్ప యని లోకము నుతింప,
పారశువాకము పెరుంబూరులందు
మేలి యున్నతపాఠశాలలు నెలకొల్పి
పోడిగా జరపుచున్నాఁడ వనియు;
సాశ్రమోత్తమకళాశాలకై లక్ష యి
చ్చెద నన్న సద్దానశీలి వనియు;
పట్టణబాలికాపాఠశాల యటుండ,
విద్యార్థినీనిధిఁ బెట్టి తనియు;
అసమవిద్యావినోదివై యలరు నీకు
మాతృభాషాభిమానంబు మలయుకొఱకు
దీని రుచిచూడు మంచు ప్రార్థించువాఁడు
త్వద్ధితుఁడు కాళ్లకూరి గోపాలరావు. 15

# పల్లెటూళ్లు - గ్రంథాలయోద్యమము

కొవ్వలి శేషగిరిరావు గారు

మానవులకు జీవితమును గడపుటకు ధన మావశ్యకము. అందువలననే "ధనమూల మిదం జగత్" అని పెద్దలు వక్కాణింతురు. "ఉదరనిమిత్తం బహుకృతవేష" మనునట్లు ఎన్ని విద్దెలు నేర్చినను ఎన్ని హోదాలు సంపాదించినను ఎన్ని మాయలు చేసినను ఉదరపోషణమునకే. అయినను విశేష స్వార్థపరత్వమును చెందకుండుటచే మనుజుడు దేశసాంఘిక సేవ లొనర్పఁగలుగుచున్నాఁడు. విద్యావంతులు తమ జీవితములను సార్థకపఱచునదియు ఎప్పటికప్పుడు నూతనోత్సాహము నాపాదించునదియు దేశసాంఘిక సేవయే యని పూర్తిగ నెఱిఁగినను, పెక్కురు లక్ష్మీప్రసన్నము గానిదే తత్సేవకుఁ గడంగుట లేదు. లక్ష్మీప్రసన్నము గావించు కెల్లరకును సాధ్య మగునా? ఒకచో అయినను, విద్యార్థికులు కోరినంతనే వలసిన రొక్కములు ముడుపులుగ చెల్లింప నిచ్చగించువారలు పలువురుందురా? ఆ! ఉండ కేమి? పల్లెల కర్షకులకు జీవనోపాధు లైన క్షేత్రములు కొన్ని వత్సరములకు పూర్వము వర్షాధారమువలన మాత్రమే ఫలవంతము లగుటకు తగినవై అట్టి వర్షములు సకాలమున కఱవగుటఁజేసి సస్యములు పూర్ణఫలముల నొసంగమి కర్షకుల జీవనోపాధులకే పెక్కు లిడుములు ప్రాప్తించుచుండెడివి. ప్రభుత్వమువా రిటీవల త్రవ్వించిన కాలువల యాధారముచే క్షేత్రములు ఇనుమిక్కిలి ఫలించి కర్షకులను లక్ష్మీపుత్రులుగఁ గావించుచున్నవి. వారలలో పలువురు విద్యాగంధము లేనివారగుటచే, తమ జీవితమును సదా లేనిపోని కక్షలవలన తలలు వ్రక్కలుగావించుకొని న్యాయస్థానముల కెక్కు కౌతుకముతోనో, పిత్రార్జితవిత్తముల నే తెలియఁగున నైన దుర్వ్యయముల పాలు చేయు తలఁపుననో, చీట్లాటలతోనో జూదములతోడనో, అవాచ్యసంభాషణలతోడనో ఆత్మస్తుతిపరనిందలతోడనో, వృథా పుచ్చ నిచ్చగింతురు. వారలే విద్యార్థికులకు దిక్కు, శరణము. కుటుంబపోషణకు వలసిన వస్తుసముదాయములను సదా యిచ్చుచుందురు. శుభాశుభ కార్యములు వచ్చినపుడు తమ స్వకార్యములవలె తలఁచి ఏ లోపమును రాకుండఁ జేయువారు. తమ సొమ్ము నమ్మకుచున్నను 'చిత్తము అనుగ్రహము సెలవు' మొదలగు గౌరవశబ్దములను ప్రయోగించువారు. అవును! విద్యావంతులు వీరు గావించు ప్రతికార్యమును సుకృతమా దుష్కృతమా యని విచారింపక తమ ముడుపులు తమకు చెల్లినంతనే యపరిమితానందభరితు లయ్యెదరు. కర్షకులు తమశక్తి నెల్ల ధారవోసి "దాసుని తప్పులు దెబ్బమాళ్ల కెలుక" యనునట్లనేకావస్థలు పడుచుండ, వీరు మాత్ర ముపకారికి ప్రత్యుపకార మొనరింపవలసిన భారము వహింపకుందురా? న్యాయస్థానములును న్యాయవాదులును వృద్ధి యయినకొలఁది వ్యాజ్యెముల సంఖ్యయు పెరుఁగుచున్నది. ఏ విద్యావంతుఁడో తన యావచ్ఛక్తిని ధారవోసి తన కిష్టుఁడగు కర్షకుఁ డెంతటి దుష్కృతి యొనరించినను వాని నిడుముల బారిఁ బడకుండఁ గాపాడుటకు కంకణము గట్టి వ్యాజ్యెములయం దమితోత్సాహము జనింపఁజేయుచుండును. ఇట్టి పరిస్థితులలో గ్రామములందు కలఁతలు నశించి సంఘీభావ మతిశయించి గ్రామస్థులు విద్యావంతు లగు టెట్లు? గ్రామసీమ లట్టి దుస్థితియం దుండ విద్యావంతులలో నూటికొకరో యిరువురో స్వార్థత్యాగులై దేశోద్ధరణమునకై ఎంత కృషి చేసినను ప్రయోజన మేమి? గ్రామసీమల దుస్థితిని మాన్పి జనసామాన్యమునకు విజ్ఞానము కలుగఁజేయనిచో దేశ మభివృద్ధి చెందుట కల్ల. కావున, ఓ దేశాభిమానులారా? సంఘోద్ధారకులారా! ఆంధ్రనాయకులారా! వెంటనే గ్రామసీమ లున్నతస్థితికి వచ్చు మార్గములను కనుఁగొనుఁడు. కనుఁగొనుటయే కాదు, గ్రామస్థులు వాని నాచరింపఁబూనునట్లు చెప్పుఁడు. చెప్పుటయే కాదు, ఆచరింపఁజేయుఁడు, చేసి చూపుఁడు.

ఎవరికిని స్వయముగ ప్రతి గ్రామమును తిరుగుట బహుకష్టము గనుకను, గ్రామములపై పెక్కు డధికారములను తక్కిన శాఖలవారికంటె రివిన్యూ శాఖవారు కలిగియున్నారు గనుకను, ఒక తహశీల్దారుఁడు గాని డిప్యూటీ కలెక్టరు గాని గ్రామవాసుల నే పని చేయుమనిన వారు దాని నాచరింప సంసిద్ధులై యున్నారు గనుకను, మీరు రివిన్యూ ఉద్యోగుల నుచితరీతిని వేఁడి వారి యధికారములలోని ప్రతి గ్రామమందును వారే గ్రామవాసుల రొక్కముతో నొక పుస్తకభాండాగారమును స్థాపింపఁజేయించి గౌరవకార్యదర్శులుగ నుండి సర్క్యూటు వెళ్లునపుడు తక్కిన పనులతోఁబాటు ఆ గ్రంథనిలయముల స్థితిగతులను విచారించుచు జనసామాన్యమునకు విజ్ఞానము కలుగఁజేసి తమ దేశాభిమానమును వెల్లడించుకొనఁగోరుఁడు. సామాన్యజనులుద్యోగుల యధికారములను చూచి భయపడుదురు కాని, దేశోద్ధారకు లైనను అనధికారుల పల్కులను పాటిసేయరు. ఒకానొక సమయమందు వారి మాటల నంగీకరించినట్లు నటించినను వారు గ్రామము వదలి చనినంతనే తమ ప్రాఁత పద్ధతుల నవలంబింతురు. ఉద్యోగుల మాటలన్ననో, శిరసా వహింపనిచో తమ కేమి యపకృతి గావింపఁబడునో యని భీతి చెందుదురు. ఉద్యోగులు ప్రభుత్వమువారిచే వందల కొలఁది జీతములు తీసికొనుచున్న కారణమున పల్లెటూరివాండ్ర ముడుపులకుఁ గాని మామూళ్లకుఁ గాని చేయి చాఁపరు. ఒకానొక రట్టివా రున్నను వారి యధికారములోని కొలఁది గ్రామములే కొంత కాలము దుస్థితిలో నుండును గాని తక్కిన పెక్కు డున్నతస్థితికి వచ్చును. ఈ విధానమువలన కొలఁది వత్సరములలోనే యన్ని గ్రామములును విద్యావంతము లగు ననుటకు సందియ మావంతయు లేదు.

# వణిగ్విలాపము

నుద్దిపట్ల వేంకటరమణయ్య గారు

ఘనమద మేఁచి లోకములఁ గాఁతియ పెట్టిన క్రూరుఁ డయ్యు భో
గినికరభూషణున్ శివునిఁ గీడున మేలటు లెన్న దానవేం
ద్రుని తలఁ దాల్చుటన్ యశము దుర్యశ మానినవాఁ డనంగ వ
ల్ల నగుమొగంబు దంతముఁ జెలంగ మెలంగు గణేశుఁ గొల్చెదన్.

ఉ. ఒక్క వణిక్కు బాంధవహితోక్తులు గీటునఁ బుచ్చి, యోడపై
నెక్కి ప్రయాణమై కడలి నేఁగుచునుండఁ, దుపాను పట్టి తో
నెక్కినవారు నా జనము నీల్గుచుఁ, దా నొక దీవి సేరి నల్
ప్రక్కలు రోసి యొండు నరులం గన కిట్లొకనాఁడు చింతిలెన్ :2

మ. నను రక్షించుట దైవమా! మునుమునన్ హా స్తంబులన్ మోడ్చి నీ
కొనముల్ సన్నుతియింతు నా? యదటుం గోపాలి వ్యాఘ్రాననం
బునఁ జొప్పించెను భంగి నెందఱినొ యంభోరాశి పాల్సేసి తం
చును నిందూరుదు నా? భవచ్చరితముల్ చోద్యాస్పదంబుల్ గదా!

ఆ. ఇనుముఁ గూడినట్టి యనలుండు సమ్మెట
పెట్టు లొందినట్లు కట్ట! కష్ట
పరితు నన్నుఁ బోటి దురదృష్టవంతుని
వెంటఁ గొని జనాళి పిలుకుమారె. 4

శా. సప్తాంభోధిపరీతభూతలము శశ్వద్విక్రమస్ఫూర్తినై
నాప్తామాత్యసుహృత్సుపాలచతురంగానీకముల్ గొల్వఁగా
సప్తాశ్వప్రభఁ జక్రవర్తియుఁ బలెన్ సందీప్తదావాగ్నిసం
తప్తక్ష్మాధవిహంగసత్త్వయుతకాంతారంబు దీ వేలుదున్. 5

ఉ. ఉన్నతవృక్షశాఖకును నూయెలఁ గట్టి మహాబలంబుతో
డన్నరుఁ డొక్కఁ డూఁచెను నెడన్ మనుజుం డెటు లూఁగు నట్లు సం
పన్నజవప్రచండబలమారుతసంజనితోర్మికార్భటిన్
మిన్నులు దాఁకి తోడనె నిమేషములో నడుగంటుచుండు నా
కన్నిమునుంబు లన్నియు యుగంబులుగా నటు చేతఁ బ్రాణముల్
గొన్నపుడైన నొంద నిటు శోకముఁ జంచలభావమున్ మదిన్. 6

మ. అరిషడ్వర్గభయంబు లే, దనుము సేయంగల్గ దావశ్యకం,
బరిసంతోషము కున్న, లే రొరుల కీర్ష్యం గీడులం దెచ్చు కా
పురుషుల్, ఖేదము గూర్చు ఘోరరుజలుం బోకాదు, నేకాంత మా
నిరవే లెస్సని తాపసుల్ పురయరే యిష్టార్థసౌఖ్యమ్ములన్?

క. ఆశావిముఖుఁ డెదురు ధన
రాశివలె న్నాయొడను నిరర్థక మన్యున్
లేశము జ్ఞానము లేమి ము
నీశుల కామోద మొసఁగు నేకాంత మరో! 8

మ. ధన మార్జించి కుబేరుఁ డౌదు నని యుద్యత్కీర్తినిం గాంతు నే
ననియుం గుళ్లును గోపురంబులును బుణ్యార్థంబు కట్టింతు నం
చును భావించి కలంబు నెక్కఁ దుది నిచ్చోఁ జిక్కి శోభించుటా
యొనగూడె! న్నరుఁ డొక్కఁ డెంచ విధి వేఱొం డెంచుచుండుం గదా!

చ. చిలుకకుఁ జెప్పినట్లు ననుఁ జేరఁగఁ జీరి 'కుమార! మాదు ప
ల్కులు చెవిఁ బెట్టుమన్న! యెటులుం జనఁగా వలదన్న! యేల భా
ములఁబడి పోయెదన్న!' యని ముందుగనే జనకుండుఁ దల్లియుం
దెలిపినఁ బాటిసేయ, కిటు తెచ్చితి వారికి నాకు శోకమున్. 10

చ. పరకరివక్త్రముం దగిలి వాలమునం జను దొడ్డనాగసం
బురవడి వీచి వృక్షతతి నూఁచి పెకల్చెడు చండవాయువు
న్నరగున వ్యాప్తినెందు కిరణమ్ములు వ్రేల్మిడి సర్వభూమిఁ గ్రు
మ్మరు మదితో జవంబున సమానమె? పందెము వేయ నోడవే?

ఉ. కన్నులఁ బ్రోలఁ గట్టిన ప్రకారము యొందుఁ దలంచునంత న
న్నన్నగరంబు; గాని యది స్వప్నమునన్ ధనరాశివోలెఁ దొ
త్తన్నె యసంతోషం బిడియుఁ దాఁ దెలియన్ జలమందు గీఁత రై
యొన్నియొ రీతుల న్మనము నేఁచి నిరాశను గూర్చెడిం దుదిన్. 12

ఉ. ఎన్నఁగరాని దవ్వు గణియింపను; దాఁటు నశక్యమైన వా
రాన్నిధి మాట నెంచను; బురంబున మిత్రుల బంధుబృందము
న్గన్నులనిండఁ గాంచుటకు నామది నువ్విళులూరు వేళ నె
వ్వ; న్నినుపారు కూర్మి యిదె పో పొగడందరమే? తదున్నతిన్?

తే. సృష్టికిని దొల్తఁ బుట్టిన వృద్ధ! యబ్ధి!
మంచిచెడ్డలు దెలియక మాయగాలిఁ
గూడి నన్నేఁచెదగదె? నిన్జూడ నోడు
వాఁడ మూతి గాలిన పిల్లి పాలువోలె. 14

తే. సురనదీజూటు లోకసంస్తుత్యచరితు
నుత్తమాంగమునం బావనోదయంబుఁ
బొంది యపరిశుద్ధపదార్థముల్ సతతముఁ
దాఁకు నోఁకుదయ్యెదు! యెడ నీకు బుద్ధి? 15

ఉ. ఐనను వేఁడుచుంటి నిపుడైన మనంబు కరంగి నా దెసం
బూనుదు వేని కొంత దయ వోయెదు కాన సమీర! మత్పురం
బే నిటఁ బడ్డ పాట్లు వచియింపవె నా హితబంధుకోటితో
దీనత నెందఱుం డనుచుఁ దెల్పవె కొల్పవె ధైర్య మెంతయున్.

ఉ. పీనుల విందుగా నెపుడు వింటినొ మానవభాషణమ్ముల
న్నేను చెవుర్ప నుక్కపడి నిద్రయు నిల్తు నిమేష మట్లె యే

దేనియుఁ గంఠ మెత్తి పఠియించినచోఁ దొలుకాడునన్ మహా
ధ్వాన మొనర్చు మేఘరవితంబునఁ గయ మూను మాదిరిన్.

చ. ఘనఘన యందు మ్రోఁత నిగుడం జని దొమ్మరియాటఁ జూడ, వే
దములను వల్లెవేయు వసుధాత్రిదశేంద్రులఁ గాంచ, వేణునా
దమును విపంచికాతతమృదంగరవంబుల నాలకింపఁ, బ
ర్వముల మహోత్సవాళి గన భాగ్యము లే దిఁక నోఁచ దానికిన్.

ఉ. ఇంచుకయేని భీతి వహియింపవు; పాఱవు నన్ను డాయఁగాఁ
గాంచి; యదేమొ యిచ్చటి మృగంబులు పూర్వము చాల మచ్చిక
న్గాంచినవాని కైవడిఁ గనంబడు సద్భుత మావహిల్లు యో
జించుకొలంది; నిర్భీడ వసించుచు నుండిరొ మున్ను మానవుల్?

మ. జనసంపర్కము లేమి లేశ మయినన్ స్వప్నంబులం దక్క, గా
హనజంతుప్రకరంబుతోఁ గలసి సర్వావస్థలం దుండుట,
న్ఘనఁ గొన్నాళ్లకుఁ గల్గునో మృగసమానత్వంబు; సా మప్పుడే
వనమధ్యాటనచర్మధారణగుహావాసంబులం జేసినన్. 20

శా. ఏ కాయల్ ఫలపుష్పము ల్వలయునో యీ కాలమా కాలమున్
నాకే వేళ లభించు నారకయె, పంటల్ దున్నకే పండెడున్,
మ్రాఁకుల్ కెంపకె నెర్గు, గోగణము క్షీరం బిచ్చెడుం గావకే,
నాకుం జూడ వసింప నిం దనువగు న్యాయంబె పెల్లగ్బెనన్. 21

మ. ఉరికిన్ సిద్ధముగాఁగ నున్న వనజాం డోరంబు నైకొక ముం
దర నుంపంబడు భక్ష్యముల్ ఫలములుం గన్నెత్తి వీక్షింపన
ట్లరయంజాలమిఁ జావుకన్న నితరం బౌ ముక్తి నిర్ధీవి సుం
దరపుష్పాభ్రగసత్వజాతులను గానం జాల మోదంబునన్. 22

చ. ఘనతిమిరంబునం దెరువు గానక క్రుమ్మరుచున్న వానికిన్
దెను వెలుఁ గబ్బు చెల్వన లభించితి వాప్తుఁడ నీవె యాచు ని
ర్జన మగు నిర్భీడన్ శ్రవణరంజకవాక్కులఁ జాతు నా మనం
బు నడలు దీర్ప నీదు ఋణమున్ శుకరాజమ! యెట్లు దీర్తునో? 

తే. ఇచ్చియున్న నీకువలెనె యీశ్వరుండు
నాకుఁ గూడఁ బతుద్వయ, మాకసమున
నేఁగి తిన్నఁగా మా యింటి యెదుర వ్రాల
కుందునె? చిలుక! తలఁతునే యుదధి మాట! 24

చ. కడచిన మేన నెవ్వరిని గట్టిగ నేఁ కెఱఁ బెట్టినాఁడనో
కుడుచుచునుంటి నేయి మడుఁగుల్ తదఘంబు ఫలంబుఁ జిక్కె! కీ
లెడలఁగఁజేసి ని న్విడువ నెంతు భవాంతరమందు నైన నీ
యిడుమలు గల్గకుంట కరయె! యెట్టుల ని న్నెడఁబాయఁజాలుదున్

ఉ. విన్నులు దాఁకు భంగముల వేష్టిత మౌ నిట ముక్తి లేక యే
మున్న వితాన నీవును శుకోత్తమ! పంజరమందు నుండుటన్
ని న్నిటఁ గంచుఁ బాపుకొన నేర్తు నొకింత దురంతచింత యెం
దు న్నెగు లారకున్న సమదుఃఖనిమగ్నులఁ జూచుచుండినన్?

చ. మరపున నైన లెక్క కొక మాఱును దల్పను దీసియుంచఁ డ
బ్బురము జనించు నాదు నుడువుల్ వినినన్ నిజ మైన మిత్రు మా
దిరి ననుఁ గూర్చి తాఁ బలుకుఁ దేనియ పూసిన కత్తి యీతఁ డం
చరితిఁ దొఱంగి నాపయి దురాగ్రహ మానకుమా శుకోత్తమా!

చ. వడివడిఁ బుట్టి మున్గినటు పర్విడె దో దిననాథ! యబ్ధిలోఁ
బడుటకె? చాలుచాలుఁ దొలుఁబల్కులు నేర్చినయట్టిదానికిన్
ఫల మిది యొక్కొ? యింకఁ దెలవారిన దాదిగ మేలు సేయు పె
ల్గుడుపుడె, చింతతోడ భయమూను మటంచును నిర్దయుండవై?

ఉ. అందఱితోడ నోడ నను నంతము నొందఁగనీక కాచు పె
ల్లం దలఁపంగఁ జిన్న తెలలం దలఁ దన్నిన పాట్ల నింకఁ ద్రో
యఁ దలపెట్టితే, కలఁడె? వ్యాఘ్రముబారిఁ దొలంగఁజేసి యి
ట్టిం దవవహ్ని వేల్మి నొనరించెదు నిర్దయుఁ డెందు దైవమా! 29

చ. తెలియదె? నీకు నా పడెడు తిప్ప లెఱుంగకపోవు సర్వమున్
దెలిసినవాఁడ వౌటఁ; జోఱఁదే మొఱ నీమల నోఁకకున్నె? దీ
నులకు వశంబు లౌ కతన; నో రెటు లంటుకు నాడదయ్యె! యా
ర్తుల మనుపంగఁ గట్టుకొను తోరము నూడ్చితి వోటు? దైవమా!

శా. ఆపత్కాలభుజంగదష్టుఁడను శోకాభీలకాకోలసం
తాపంబున్ ధరియింపలేక వెఱచే నానార్తవిధ్వంసకా!
నీ పాదంబులు పట్టినాఁడ నసువుల్ నిల్వంగ భారంబు నీ
దే పుణ్యంబును గట్టుకొమ్ము వెసఁ, గాదే నెల్ల వ్యర్థం బగున్.

ఉ. వీరరణంబునం దనువు వీడి సుఖంబుగ స్వర్గ మందుటో?
ధీరత దేశవృద్ధికయి దేహ మొసంగి యశంబు నందుటో?
తీఱని దుఃఖభారమున దీవిఁ గృశించి నశించుటో! దయా
వారినిధీ! జగత్పతి! విపన్నుఁడ నం దరిఁ జేర్చి ప్రోవవే! 32

శా. కాయ ల్గాచినయట్టి కంగవకుఁ గల్గంజాలునే? యెన్నఁడే
నే యోడేనియుఁ జేరువం గనెడు నత్కృష్టంపు భాగ్యం బయో!
తోయంబుల్ దరియించి పోఁగల నె సంతోషంబుతో నింటికిన్?
వాయెమ్ముల్ బలుతూంట్లువోయె నెపుడంతంబొందునో కష్టముల్?

శా. వేలన్ సంద్రముపై జలాంతరమునన్ విస్వేథియందున్ సరిత్
కూలంబందుఁ జరించి మేఁతకొఱకై గూం డ్లున్న యా పక్కికి
న్బాట ల్గట్టి విహంగముల్ పఱచె నానాకృత్యముల్ మాని యి
ష్టాలాపంబుల నిండ్లకుం జనసమూహం బేఁగు చందంబునన్. 34

చ. పురమున నున్న కాలమునఁ బూరికి నేఁ గొనసట్టి నెల్ల న
బ్బురమును గొల్పు నిందు; వనభూమి మృగాభ్రగపంక్తిఁ జూడ ముం
బరిచిత మైన వెల్ల నుపమాకలనంబునఁజేసి యొక్కటన్
స్ఫురణకు వచ్చి డెందము రవులొక్కనఁజేసెడు, నేమి చేయుదున్?

తే. ఇంచుకంత రంగును బుద్ధి నిడినయంతఁ
గెంపుఁజాయ నీరంబు రాగిల్లునట్లు
వేయిచేతులసామి యబ్ధి న్మునుంగ
సంద్రమునఁ దోఁచు సంజకెంజాయ యదిగో! 36

తే. జగము చుట్టంబుఁ జెయ్యుల సాకి రైన
వాని దిగమింగుటం గల్గు పాప మనఁగఁ
గడలిఁ గటికిచీఁకటి బయల్వెడలమ్ముచున్న
దింకఁ బులిమీఁదఁ బుట్ట దైయె యోఁచ నన్ను. 37

మ. తమముం బాపు మహోపకారి వని నే దండం బిడంబోవఁ బ
న్నమనాఁ డీ వ్రసరించు తంత్ర మది చంద్రా! జ్ఞప్తికిన్ వచ్చి వి
ఘ్నము కల్పించుఁ; దెగండు గాని తటినీకాంతుండు ద్వీపంబు రూ
పము లేకుండఁగఁజేయఁజాలును గదా భంగం బొకం డెత్తఁటన్?

శా. కట్టా! నా చరితంబుఁ గాంచి కరుణం గాసంత లోనూని నీ
విట్టుల్ మోదము దక్కయున్నఁ గలదే? యింతేనియున్ లాభ; మి
క్కట్టుల్ గాఁపురముండునే? యనుచు నొక్కండై నశోకంబుఁబోఁ
గొట్టన్ లేఁ డిటుఁ; గొల్పకోవలయు నాకు న్నైన ధైర్యం బిఁకన్.

ఆ. లేవగల్లు గల్గ క్రియఁ బోటుపాటుల
కరణి వచ్చు నోలిఁ గష్టసుఖము
లనెడు పెద్దల నుడి నాత్మఁ బాదుకొలిపి
గుండె బాయి నేసి యుండువాఁడ. 40

# ఆంధ్ర నాటక ప్రయోగపరీక్షలు

శ్రీపాద కామేశ్వరరావుగారు, ఎమ్. ఏ., ఎల్. టీ.

ఆంధ్రనాటకములయొక్కయు రంగస్థలములయొక్కయు వ్యవస్థయందు ఇటీవల క్రొత్త మార్పొకటి కలుగఁ జొచ్చెను. పూర్వమే నాటకసంఘమో నాటకములను ప్రయోగించునప్పు డందలి ప్రయోక్తలకుఁ గాని నాటకకర్తలకుఁ గాని సభవారిలో నొకరు పతకముల నిచ్చు వాడుక యుండెను, ఇప్పటికిని కలదు. ఇది కాక, యేదో నాటకమును నిర్ణయించి నాటకసంఘములకు తెలియఁజేసి ప్రయోగములను పరీక్షించి ఉత్తమప్రయోక్తలకును సంఘములకును పతకముల నేర్పఱచుచున్నారు. ఈ విషయమున మార్గదర్శకులుగా "ఉత్తరసర్కారులలో పతకము నిచ్చుసంఘము" (The Northern Circars Medal Awarding Society) అను పేర కొంద ఱేర్పడి 1913-వ సంవత్సరము బెజవాడలో చిలకమర్తి లక్ష్మీనృసింహకవిరచిత మగు "గయోపాఖ్యానము"న అర్జునపాత్రమును నిపుణతతో ప్రదర్శించినవారిలో నిద్దఱకు పతకముల నిచ్చిరి. పిమ్మట 1915-వ సంవత్సరము డిసెంబరు నెలలో మచిలీపట్టణమున "ఆంధ్ర నాటక ప్రోత్సాహకసంఘ" మొకటి యేర్పడి "చిత్రనళీయము"న నళబాహుకపాత్రములను దమయంతీపాత్రమును జయప్రదముగా ప్రదర్శించినవారికి వెండి యొకపతకమును మొత్తముపై నాటకమును బాగుగ ప్రదర్శించిన సంఘమునకు సరస్వతీవిగ్రహమును బహుమానమొసంగిరి. ఈ సంవత్సరము జూలై నెలలో రాజమహేంద్రవరమున "మిత్రసమితి" వారు పైని చెప్పిన గయోపాఖ్యానమునే ప్రదర్శింపించి కృష్ణ అర్జున గయ పాత్రములకు పతకములును సంఘమున కొక కృష్ణవిగ్రహమును నొసంగిరి. ఇంతకు కొలఁదికాలము క్రిందటనే గుంటూరుపురమున నొక సంఘమువారు "ప్రసన్నయాదవము"న కృష్ణ నరకాసుర పాత్రధారులకు పతకములు సంఘమున కొక పారితోషికము నిచ్చిరి. నెల్లూరున నొకరు "చిత్రనళీయము"నే పరీక్షాగ్రంథముగా నేర్పఱచిరని వార్తాపత్రికలలో చూచినాఁడను. మరియు రాజమహేంద్రవరమున కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తాము రచియించిన బొబ్బిలియుద్ధనాటకము నేర్పఱచి ఎనిమిది పతకముల నిచ్చుటకు నిశ్చయించిరి. పరీక్షలు ప్రారంభ మయినవి. ఇఁక ముం దెవ్వరో "వేణీసంహార" ప్రయోగమును పరీక్షింతురఁట.

ఈ పరీక్షలవలన లాభములు కలవు. మున్ముందు మంచి ప్రదర్శకులు వెలువడుదురు. నాటకసంఘములు కూడ ప్రయోగనైపుణ్యమును సంపాదింపవచ్చును. మన రంగస్థల మిప్పటికంటె శ్రేష్ఠతర మైన పదవిని పొందఁగలదు. నాటకములను చూడఁబోవువారు కూడ నాగరకరుచుల నెఱింగి కళాభిజ్ఞు లగుదురు. పైని చెప్పిన లాభములను సమకూర్పవలె నన్న, 'పరీక్ష లెట్లు జరగుచుండవలయును? పరీక్షాధికారు లెట్టివా రుండవలయును? నాటకము లెట్టివి? ప్రదర్శకులు గమనింపవలసిన విషయము లెవ్వి?' అను నీ యంశములు చర్చింపవలయును.

ఇదివఱకు జరగిన పరీక్ష లెవరికి తోఁచిన రీతిని వారు చేసిరి కాని, ఒకరి మార్గమును వేఱొకరు త్రొక్కినట్లు తోఁచదు. మొట్టమొదట అనఁగా 1913-వ సంవత్సరము పరీక్షలు జరగు నని నాకు తెలిసినతోడనే కృష్ణాపత్రికాసంపాదకునకు నే నొక చిన్న యుత్తరము వ్రాసితిని; కాని వా రే కారణముననో దానిని ప్రచురింపలేదు. ఆ పరీక్ష సేయువారు కొన్ని పద్ధతులను ప్రచురించిరి; వానిని నా యుత్తరమున ఖండించితిని. నా యభిప్రాయము వారికిఁ గాని వారి యభిప్రాయము నాకుఁ గాని తెలియకయే ఆ పరీక్షలు ముగిసినవి. పరీక్ష చేయుటకై వా రేర్పఱచినవారు వారి పద్ధతుల నవలంబింపక తామే కొన్ని పద్ధతులు నియమించుకొని రని తెలియవచ్చినది. అందుచే దాని విషయమై చర్చ చేయుట మానితిని. బందరువారికి పై ప్రశ్నలు వేసినతోడనే వారు తిరిగి నా యభిప్రాయములను విశదపఱుపుఁ డని ప్రత్యుత్తర మిచ్చిరి. పిమ్మట నాకు తోఁచిన రీతిని పరీక్షానిబంధనలను వారికి పంపితిని. పరీక్షలు జరగునప్పుడు వారి నడుగఁగా నా సలహా ప్రకారము సర్వము జరగుచున్న దనియు, అక్కడక్కడ చిన్నచిన్న మార్పులు చేసితి మనియు వారు సెలవిచ్చిరి. ఈ పురమున జరగిన గయోపాఖ్యానపరీక్షయందు నిబంధనల నేర్పఱచుట కూడ నా యభిప్రాయము ననుసరించియే జరగినది. ఏతదితరస్థలముల పరీక్షారీతి నా కేమియు తెలియదు. నా స్నేహితులలో చాలమంది నా యభిప్రాయముల నామోదించుటచే వానినిట ప్రచురింప సాహసించితిని.

మొట్టమొదట పరీక్షాధికారు లెట్టివా రుండవలయు నను విషయ మాలోచింపవలయును. ఈ విషయమును గూర్చి మున్ముందు నిర్ధారణచేయుట కొంచెము కష్టము. పరీక్ష నిచ్చెడి యంశములు కళలు కావున, పరీక్షాధికారులు తత్తత్కళాభిజ్ఞులు కావలయు ననుట నిర్వివాదాంశము. ఇట్టి యభిజ్ఞత యెట్టిది? చిత్రకళానైపుణ్య మంతగా నవసరము లేదు కాని రంగ మెద్దియో తెరలు సీనులు మొదలగునవి రంగానుగుణ్యముగా నున్నవో లేవో పరిశీలించుట యావశ్యకము. ఏల యన, మనవారు సందర్భానుసారముగ రంగప్రసాధనము సేయక తమవద్ద నుండు తెరలను సీనులను ఏ తీరున నైన ప్రతి నాటకమందును చూప ప్రయత్నింతురు. మరియు నాటకమునందలి యితివృత్త మే కాలమునకు చెందియున్నదో నాఁటి కనుగుణ్యముగా ప్రసాధన మమర్పక విద్యుచ్ఛక్తిసాహాయ్యమున దీపములు తీవనలు

మొదలగునవి ద్వైతవనము మొదలగు రంగములయం దమర్చెదరు. ఇట్టి స్ఖాలిత్యములను పరీక్షకులు గమనింపవలయును.

పిమ్మట అభినయము. ఈ విషయమున చెప్పవలసిన యంశములు చాల కలవు. యుక్తప్రదర్శకత మనవారికి అబ్బలేదు. ఇప్పటి స్థితిని బట్టి చూడ నింకను నిరువది వత్సరముల కైన నలవడునో లేదో యను సంశయము కలుగుచున్నది. పాత్రానుగుణ్యమగు అభినయము బుద్ధికుశలత యుండినఁ గాని యలవడదు. ఇందు భావనాశక్తి నాగరకాభిరుచి ప్రపంచజ్ఞానము ఆవశ్యకములు. విద్యాగంధము లేనివారి కివి యబ్బవు. మన ప్రదర్శకులలో నూటికి పదిమంది కైన నివి కలవో లేవో సంశయాస్పదము. భావనాశక్తి ప్రపంచజ్ఞానానుసారిణి. పాత్రస్వభావ మెఱింగినఁ గాని యభినయము యుక్తము కాదు. మాటకు, వేణీసంహారనాటకమున భీమునకు గుణసమితి యెట్లుండవలయునో మనవా రెవ్వరైన నించుక యాలోచించియున్న యెడల పెద్దపులి వేషము నేల వినికరి సేయుదురు? ఇట్టి యమానుషచర్య భీమున కనుగుణ్యమా? ఏ ధార్వాడనాటకులో, ఏ వీథినాటకులో వీరరౌద్రరసముల నయుక్తముగ ప్రదర్శించియుందురు. ప్రప్రథమమున వీరిని చూచినవా రిదియే బాగున్న దని తలఁచియుందురు. వారి ననుసరించి మనవారును మితిమీఱి రంగస్థలమున తైతక్క లాడుచున్నారు. చూచినవారిలో నాగరకరుచుల నెఱింగియున్నవా రెవ్వరును ఇది యయుక్త మని చెప్పరు. తమకు తోఁచక చెప్పెడువారు లేక ఒకవేళ నెక్కడనో యున్నను వారి మాటలను వినక ప్రదర్శకులు గతానుగతికన్యాయ మనుసరించిన, అభినయ మభివృద్ధి చెందుట యెట్లు? మితి యను మాట లేదు. ఆర్భాటము తోఁత ధ్వని దుమ్మెగురుట యెంత హెచ్చు హెచ్చెఁగిన, అంత ప్రముఖత నిచ్చుచున్నారు. రసము మిక్కుటముగా నెప్పు డుండవలయునో ఎప్పుడు తగ్గవలయునో గమనించు శక్తి లేక, ఆది మొదలంతముదనుక ఒకటే గోలగా చేసి భీముని వ్యాఘ్రతుల్యమానవునిఁగా ప్రయోగించుచున్నారు. ఇట్టి చెడ్డ యలవాటు నాగరకరుచి కెంతయు ప్రతికూలము. మిత ముండవలయును. ఇంద్రియనిగ్రహము పాత్రౌచితిని బట్టి మాఱుచుండును. ఒక రాజునకు మంత్రికి సేవకునకుఁ గూడ కోపము వచ్చునపుడు వారి చర్య మాఱును; సేవకుఁడు నీచపాత్ర మైనందున నోటికి వచ్చిన ట్లెల్ల ప్రేలి యుక్తాయుక్తవివేచన లేక కార్యములను నిర్వర్తించును; మంత్రి యంతకంటె నింద్రియనిగ్రహము కలవాఁడు కావున మాటలను అంతగా వ్యయపఱుపక కార్యసాధన మార్భాటముతో నెఱవేర్చును. రాజన్ననో యుత్తమ పాత్రము కావున మాటలను గాని కృత్యములను గాని తక్కినవారివలె వ్యయపఱుపక తన శక్త్యనుసారము దండించును. ఈ విషయమున పాత్రానుగుణముగ ప్రవర్తన యెట్లు మాఱునదో చదువరులు గ్రహింతురు. ఏయే పాత్ర మేయే యవస్థల రసాభినయ మే తీరున చేయవలెనో యెఱుంగుటకు బుద్ధికుశలత యుండవలయును. పాత్రము చెప్పెడు మాటలయందు కవి యే యుద్దేశముల నిమిడ్చియుండెనో యెఱుంగవలయును. ఉద్దేశమునకును ముఖవైఖరికిని గల సంబంధము గుర్తింపవలయును. వానిని కాలానుసారముగా ప్రయోగింపవలయును. ఇట్టి శక్తియే యభినయము. ఇది యుక్తముగా నున్నదా లేదా యను విషయము వర్ణించు పరీక్షకులు తాము యుక్తప్రదర్శకులై యుండవలయును. "అంత లావుగా నున్నవానికి పాము మంత్రము రాదా?" అనునట్లు నాటకములను చూచియున్నా రనియో గ్రంథములను రచియించియున్నా రనియో గొప్ప యుద్యోగమున నున్నా రనియో మఱే కారణముచేతనో పరీక్షకులను నియమించుట ప్రమాదము. ఒకవేళ ప్రదర్శకులు కావలె నన్న నెప్పుడో మొగమునకు రంగు పూసిన చాలదా అని యనుకొందు రేమో. ఇట్టి మిడిమిడి జ్ఞాన మపాయకరము. వారికి తెలియు ననఁజాలము, తెలియ దనఁజాలము. "తెలిసియు తెలియని నరునకు తెలియంగాఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే?" వెండియు "పసుగు రాదు మాట పాటియై ధరఁ జెల్లు" కావున, పరీక్షకులు నాటకప్రయోగమున నేయే విషయముల నెట్లు పరీక్షింపవలయునో నిర్ణయింపవలయును. ఇట్టి విషయములలో నన్నియు సమానప్రధానములు కావు గావున నే విషయము నెట్లు గణింపవలెనో నిశ్చయింపవలయును. ఈ కాలమున నాంగ్లపరీక్షల తీరున మార్కు లిచ్చి పరీక్షించుట సమాదరణీయము కావున నే విషయమున కెన్ని మార్కు లేర్పఱుపవలయునో నిశ్చయింపవలయును. ఈ విషయములను బాగుగ వర్ణింపవలయును. అభిప్రాయవైషమ్యము సాధ్యమగునంతవఱకు తగ్గించి సర్వసమాదరణీయముగ ప్రతివిషయమునను బాగోగులు నిర్ణయింపవలయును. వీనిని సక్రమముగ నెఱింగియుండుటయే కాక వేయి కన్నులు గలవానివలె మొదటినుండి చివరవఱకును అన్ని విషయములను పరిశీలించుచుండవలయును. ఇది చాల కష్టము. కాదాచిత్కముగా చేకుర నేమో కాని సులభసాధ్యము కాదు. నాకు తోఁచినరీతిని ప్రదర్శకునియందు చూడవలసిన విషయములును వాని కీయఁదగు మార్కులును చదువరులకు తెలియునట్లిచట ప్రచురించెదను. ఈ విషయమునే వర్ణించుచు నళనామసంవత్సరాదిసంచిక 177-వ పుటలో నాటకప్రయోగమున ముఖ్యాంగములు నాల్గని వ్రాసియుంటిని. వానినే యిచ్చట కొంచెము విపులీకరించెద:

1. తెఱలు సీనులు దుస్తులు మిగిలిన యేర్పాటులు,- ఈ విషయములలో మూడవది తప్ప తక్కినవి, ప్రదర్శకునకు చెందు విషయములు కావు.

2. పాత్రముల కివి మాట చెప్పునపుడు కాని రంగస్థలమున మఱే పని చేయునపుడు గాని ప్రదర్శకుఁడు పాత్రోచిత మగు శీలని నిలుపవలయును. గాంభీర్యము ప్రధానముగాఁ గల ప్రతిపాత్రమును ఎట్టి యవస్థయందైనను గాంభీర్యము వీడరాదు. ధీరోదాత్త నాయకుఁడు చిందులు త్రొక్కఁగూడదు.

3. వాచకము. ఇందలి యంతర్భాగము లాఱు: అనఁగా నిర్దుష్టత స్పష్టత ధార విరామములు ఊతము కంఠధ్వని. వీనిలో మొదటి రైదును సంచికయందు విశదపఱిచితిని. ఆఱవ విషయ మేదియన, ప్రదర్శకుని కంఠధ్వని వినువారల కందఱకు వినఁబడవలయును. మనవారిలో కొందఱు పద్యములను బిగ్గఱగా చదివి

గద్యమును చదువుదురు, లేదా మెల్లగా గొణుఁగుదురు. అందువలన వినఁబడనివా రల్లరి చేయుటకు వీలు కలుగును.

పైని చెప్పిన వన్నియు పద్యగద్యముల వాచకమునకు సమానాంగములు. పద్యమం దివి కాక సంగీతము కలదు. దీని విషయమై సావధానముగా ప్రచురింతు నని బాస చేసినాఁడను కావున వ్యాసము నీ విషయముతో ముగించెద.

4\. అభినయమును గూర్చి వ్రాయుటలో తన వంతు వచ్చినప్పుడును ఇతరులు తనయెదుట మాటలాడుచున్నప్పుడును కూడ అభినయించుట ప్రదర్శకుల విధి కదా?

ఇఁక నీయా విషయములకు మార్కు లెట్లీయవలయునో తెల్పెద:

| | | | |
|---|---|---|---|
| I | వేషము | 5 | మార్కులు |
| | లీవి | 10 | ,, |
| II | ఉచ్చారణ | | |
| | నిర్దుష్టత | 4 | ,, |
| | స్పష్టత | 4 | ,, |
| | ధార | 8 | ,, |
| | ఊతము | 10 | ,, |
| | ఆఁపుటలు | 10 | ,, |
| | కంఠధ్వని | 4 | ,, |
| | సంగీతము | 10 | 1. కంఠము ... ... 2 |
| | | | 2. సంగీతపరిచితి ... ... 3 |
| | | | 3. సంగీతవాచకముల సమ్మేళనము 5 |
| III | అభినయము | | మార్కులు |
| | తాను చెప్పునపుడు | 25 | ,, |
| | ఇతరులు | 10 | ,, |
| | మొత్తము | 100 | |

ఈ పట్టిని విమర్శించునపుడు అన్ని విషయములను ప్రతిక్షణమును జ్ఞాపక ముంచుకొనవలయు ననుట నిశ్చయము కదా. ఇద్దఱు ముగ్గుఱు ప్రదర్శకులను పరీక్షించునపుడు ప్రమాదము రావచ్చును. కావున నాటక మాడునప్పుడు పరీక్షకుఁడు నాటకగ్రంథమును చేత పుచ్చుకొని ఆయా పాత్రములు ప్రయోగించు నెడ తప్పొప్పులను పుస్తకమందు గుర్తింపవలయును. ఇటులే పరీక్షకు లందఱు చేసి ప్రదర్శనానంతరము అంద ఱొకటిగా చేరి తప్పొప్పులను చర్చించి నిర్ధారణ చేసి పిమ్మట వారివారికి తోఁచిన రీతిని మార్కు లీయనగును. చర్చ లేక మొత్తముపై నభిప్రాయ మిచ్చుట కోవిదులకు లక్షణము కాదు. ఇప్పటివారు పరీక్షకులుగా నుండుటకు అవలీలగ నొప్పుకొనెదరు. పుస్తకమును చూడరు, నాటకము వినరు, వారు వీరు అనుకొనెడు మాటలను విని గ్రుడ్డివాఁడు వీథిభాగవతము వంగచెట్టు సామెత ననుసరించి లోకులకు భయపడియో పూర్వోద్దిష్టాభిప్రాయానుసరణము ననో మరియొక కారణముననో కోర్టులో "గిల్టీ" "నాట్ గిల్టీ" అని వ్రాయవలసిన మాటలను ఇంటియొద్దనే వ్రాయించుకొను అస్సెసర్ల మాదిరి అభిప్రాయముల నిత్తురు. ఇట్లు చేయుట యెంతయు విచారకరము. కాని, పరీక్ష యిట్టిది, పరీక్షకు లీయా నియమములను నిర్వర్తింపవలయు నని యాదేశించువారు లేకపోవుటచే పెక్కుతీరుల విమర్శించుచున్నారు. పెడత్రోవ త్రొక్కినతోడనే హెచ్చరిక చేసినయెడల మంచి త్రోవకు వత్తు రేమో యను ఊహచే నే నిట్లు ప్రచురించితిని. ఇందలి లోపములను సవరించి, యింతకంటె శ్రేష్ఠతరమగు మార్గము చూపించువారు అభివందనీయులు.

ఇఁక సంగీతమునకు నాటకమునకుఁ గల సంబంధ మెట్లుండవలయును? ఏయే చోటుల సంగీత మెంతవఱ కుండవలయును—నను విషయముల చర్చించి విరమించెదను. క్రిందటి సంచిక 179-వ పుటలో "నిర్దుష్ట మగు వాచకము రసయుక్త మగు అభినయము వీని రెండిటికి తన విషయమున కాని పరుని విషయమున కాని ప్రతిబంధకము లేకుండ సంగీత ముండవలయు" నని వ్రాసియుంటిని. ఈ యభిప్రాయమునే విపులీకరించెద.

సంగీతవిషయమున చూడవలయు విషయములు మూఁడు: మొదటిది శ్రావ్య మైన కంఠధ్వని. ఇది భగవద్దత్తము, కొంత వఱకు యత్నసాధ్యము. ఐనను దేశభేదముచేతనో ఆచారముచేతనో కాని కృష్ణా గుంటూరు జిల్లాలయందలి జనులలో చాలమందికి శ్రావ్యమైన ధ్వని కలదు. గంజాము విశాఖపట్టణము మొదలగు జిల్లాలలోనివారి కిది సకృత్తుగా నుండును.

రెండవది సంగీతపరిచితి. ఇందు ప్రకృష్ట మైన శాస్త్రజ్ఞాన మక్కఱలేదు. కాని శాస్త్రవాసన లేకున్న సంగీత మింపుగా నుండదు. సాధారణముగా నాటకములలో తిరుగువారలకు శ్రుతిజ్ఞానము లయజ్ఞానము నుండవు. ఈ జ్ఞానము లేనప్పుడు వారికి గాలిపాటయే దిక్కు. ఎవరో యొక రొక రాగము నొక తీరుగ పాడినారు కదా యని యందఱు దానినే యనువర్తింతురు. ఎవ రా రాగము పాడినను ఒకటే మాదిరి సంగీతమున నిట్టి యనుకరణము విసుగు పుట్టించును. కొందఱకు మూఁడు నాలుగు రాగములకన్న నెక్కుడు తెలియవు. వారు పది పద్యములను పాడవలసినప్పుడు పాడిన రాగమునే పాడవలసివచ్చును. చాలమందికి ననేక రాగములు వచ్చియుండును కాని వీరు రంగస్థలమునకు పోవు రీతి మాత్రము నాలు గైదు రాగములతోనే యెన్ని పద్యముల నైనను చదువుదురు. అందఱి కళలు నొకటే తీరు. రాగప్రస్తార మెఱుంగరు. ఇఁక శ్రుతియొక్క విశేషము కలదు. శ్రుతులకై విచిత్రముగ పెనఁగులాడుదురు. ఇప్పు డెల్లెడలను హార్మోనియ ముపయోగించుచున్నారు. ఇది కర్ణాటకసంగీతమున కుపచరింపదని హరి నాగభూషణము గారు చెప్పియున్నారు. నా యనుభవము కూడ నట్లే యున్నది. దానిని శ్రుతిగా నియమించుటలో నొక కష్టమున్నది. కొందఱు $1\frac{1}{2}$ వేఱొకరు $2\frac{1}{2}$ మఱికొందఱు $4\frac{1}{2}$, $5\frac{1}{2}$—ఈ ప్రకారముగా నిర్ణయించుకొనవలసివచ్చును. ఏకశ్రుతి నియమించుకొనినచో నాటక ప్రదర్శకులు సులభముగా పాడఁగలరు. తమ కనుగుణ్య మైన శ్రుతి గాక వేఱొక శ్రుతి నియమించిన పాడుట ప్రయాసజనకముగా నుండును. ఒకరు $2\frac{1}{2}$ వేఱొకఱు $1\frac{1}{2}$ శ్రుతి

కావలయు నన్నచో చాల కష్టముగా నుండును. మొత్తముపై రక్తి చెడును. ఏ జనులకు తగిన ట్లాతనికి శ్రుతి నమర్చి పాడుక కొన్ని చోటుల కల దని వినుచున్నాను. ఇట్లందఱు చేయరు. అట్లు సేయుట సర్వజనసమాదరణీయము కాలేదు. ముఖ్యపాత్రమును గ్రహించువా రట్టి శ్రుతిని నియమింతురో దానినే యందఱు నవలంబింపవలె నన్న వారి కిది యుక్తముగా నుండదు. స్వేచ్ఛను పోవిడుచునప్పుడు యావచ్ఛక్తి వినియోగపఱచుట దుర్ఘటము. *ఒకవేళ న ట్లమర్చినను వారు సంతుష్టాంతరంగులు కాజాలరు.

శ్రుతి నియమించిన పిమ్మట సంగీతకళాభిజ్ఞత చర్చింతము. గానము ప్రయత్నసాధ్యము. అధమము రెండు మూడు సంవత్సరములేని తగిన గురువుకొద్ద నభ్యసించినఁ గాని మనోహర మైన రీతి యలవడదు. ఇట్టి రీతులలో రెండు కలవు: హిందూస్థానిబానీ కర్ణాటకబానీ. మొదటిది యీ దేశమందు మిక్కిలి యరుదు. ఈ సంగీతమున విద్వాంసులు మన దేశమున లేరు. కర్ణాటకబానీ తెలిసిన వారు చాలమంది కలరు. ఇప్పుడు ప్రతిపట్టణమందును గానసభల నేర్పాటు చేసి దక్షిణదేశమునుండి గొప్పగొప్ప విద్వాంసులను రప్పించి వారి గానవిద్యను పరిశీలించుచున్నారు. ఇప్పుడిప్పుడు సంగీత మె ట్లుండవలయునో తెలియుట సుకరముగా నున్నది. కావున నందఱు ప్రదర్శకులు గానవిద్య నభ్యసించుట యవసరము. ప్రతినాటక సమాజమువారును సంగీతకళాభిజ్ఞులను తమలో చేర్చుకొని అందఱకు జాగ్రత్తతో పాఠములను చెప్పించి అధమము ముప్పది రాగముల యందు కృతులను శ్రోత్రపేయముగా పాడఁగలవారిని తప్ప తదితరులను నాయకనాయికాపాత్రములకు నియమింపకుండునట్లు నిబంధన చేసికొనినచో మన ప్రదర్శకుల సంగీత మభివృద్ధి చెందవచ్చును. ఇందు సుస్తీ చేసినయెడల యోగ్యత యలవడదు.

సంగీతపరిచితి పైని చెప్పినట్లు ప్రదర్శకులయం దలవఱచి నను "వాచకము" విషయ మంతకన్న నెక్కుడు పాటుపడకుండిన లాభ ముండదు. సంగీతము రంగస్థలములయందు వాచక మంత ముఖ్యాంగము కాదు. ఎంత సంగీత మున్నను వాచకము బాగుండనిచో నిష్ఫలము. వాచక మె ట్లభివృద్ధి చెందు ననిన, విద్యాభ్యాసముచే నగు నని చెప్పుట తప్ప వేఱొక యంశమును చెప్పఁజాలము. భావానుగుణ్య మగు వాచక మలవడుట దుస్తరము. ఈ విషయమున నెంత కృషి చేసిన నంత ప్రయోజనము కలదు. జ్ఞానము అనుభవము ఈ రెండును వాచక మభివృద్ధి సేయు సాధనములు. ఇవి హెచ్చిన కొలఁది వాచకము అభివృద్ధి చెందుచునే యుండును. 'ముఖే ముఖే సరస్వతీ' యనునట్లు వాచక మె ట్లుండవలయు ననెడి యంశము నిర్ధారణ సేయుట కష్టము. ఒకరు చదివినదానికంటె, మఱియొకరు చదివిన అనిర్వాచ్య మగు భేదము కన్పట్టును. గానము కవితామాధురి భావోదయమును ఈషద్వైషమ్యమును చెందుచునే యుండును. దానికి కారణము బుద్ధివిశేష మని తోఁచును.

వాచక మొక కళ యనియు దాని నభ్యసించినఁ గాని యందు ప్రావీణ్యము కలుగ దనియు మనవారు ఇప్పటికిని గుర్తెఱుంగలేదు. కారణమే మన, సంగీతమునకు ప్రాముఖ్యము నిచ్చి వాచక మెంత చెడినను లక్ష్యపెట్టక శ్రావ్య మైన కంఠధ్వని కాని సంగీతము కాని యున్నచో ప్రదర్శకుల మెచ్చుకొనుచుండుటచే వాచకము అభినయము అడుగంటుచున్నవి. ఇప్పటికే చెప్పినది విసుగును పుట్టించు ననుకొనియెదను. ఐనప్పటికిని సహించుకొను ఓపిక పట్టఁగోరెదను. సంగీత వాచక సమ్మేళనమును యుక్తరీతిని చేయుటకై గమనింప వలసిన యంశములు — సంగీతజ్ఞాన మభివృద్ధి చేసికొని మిక్కిలి శ్రావ్య మైన సంగతులను మితముగా పద్యమునందు కనఁబఱుప వలయును. పద్యము పెద్దది యైనప్పుడు అందలి భావమున కనుగుణమై తాను బాగుగ నభ్యసించిన ఘనరాగములలో నెద్దానినో జతపఱుపవలయును. రాగప్రస్తారము బాగుగ నేర్చినఁ గాని నాల్గు కాని అంత కెక్కుడు కాని పెద్ద చరణము లుండిన పద్యమును చదువుట కష్టము. చిన్నచిన్న పద్యములను చదువవలసినప్పుడు కొలఁది సంగతులతోడనే రాగమును ముగింపవలయును. మనవారు ఏ రాగము పాడునప్పుడు గాని తమకు వచ్చిన సంగతుల నన్నిటి నేదో యొక రీతిని పద్యములయం దిమిడింతురు. ఇట్టి వేళల పద్యము ముగిసినను రాగము ముగియదు. రాగప్రస్తారము చేయుట నెఱిఁగినవారి కట్టి దురాశ యుండదు. వారి కేయే చోటుల నేయే కళలను వేయవలెనో తెలియును కావున, వీ లుండినట్లు కొన్ని కళలను మాత్రమే యుపయోగించి తక్కినవానిని వేఱొకసారి యుపయోగింతురు. తమ రాగజ్ఞాన మంతయు నొక పద్యమునందే కనఁబఱుప నెంచినవారు అనేక రాగములను నేర్చియుండకపోవుటచేతనో లేక సఱియే కారణముననో చాల పద్యములు చదువవలసినప్పుడు పాడిన రాగమే పాడుదురు. ఒకే తీరున పాడుచుండుటచేతను ఇతరులు కూడ ఆ రాగమునే పాడుచుండుటచేతను అట్టి రాగ మెంత యింపుగా పాడఁబడినను విసుగు పుట్టింపక మానదు. కావున పద్యపూర్తి యగుసరికి రాగము పాడునప్పుడు అన్ని సంగతుల నొకసారియే చూపుద మను దురాశ యుండఁగూడదు. పద్యమందలి పాదములను చదువునప్పుడు రాగము కూడ మాఱుచుండవలయునే కాని, అన్ని పాదములు చదువునప్పుడు నొక తీరుగానే యుండి పద్యాంతమున రాగ మంతయు మిగిలియుండరాదు. పాదము మాఱునప్పుడు రాగమునందలి కళలు కూడ మాఱుచుండవలయును. ఇక్కడ నొక యంశము చర్చింపవలయును. పద్యమునకు నడుమనడుమ నాఁపుచుండ వలయును కదా. అట్టి చోటుల రాగమును ప్రస్తరింపవచ్చునా? ఎట్టి చోటుల నట్లు సేయవలయును?

పద్యమునందు ఆఁపెడు చోటు లుండవలయును. ఇవి భావము ననుసరింపవలయును కాని వేఱొక విషయము ననుసరింపఁగూడదు. చాలమంది యతిస్థానములయందును పాదాంతములయందును ఆఁపుచుందురు. పదాలంకారము లుండిన చోటులను వృత్తములను చదువునపుడును అందుల కనుగుణముగా నాఁపుచుందురు. ఈ చోటుల నాఁపుట యొకానొకప్పుడు భావానుసారియై యుక్త మైన దగును; వేఱొకప్పు డట్లు కాదు. ఇందున కుదాహరణముల నిచ్చెద:

తే. మెలఁగి, దేవుల కెంతయు మెప్పు గలుగ
పగిది॥ నాఁడిగ మునకింపవచ్చు గాని॥
దొమ్మదాసుల మంచితనమ్ము నడచు
టెంతయు నసాధ్య మనుట॥నా॥ కిపుడు, తెలిసె.— స్వరజతులు.

ఇందు "మెప్పు" అను పదమునకు ముందును "గలుగు" అను పదము తరువాతను ఆఁపఁగూడదు. "గాని" అనుదానికిని వాకైను "ఇప్పుడు" అను పదము ముందఁను ఆఁపవలయును. ఇట్లు చేసినచో నాఁపెడు చోటులు భావోచితముగా నుండును.

సీ. పాడగాన । కడగాన । వడుకాన । గడదీన
గలివిూఱ । నెంతెబ ల్వేతల బడితో:

ఇందు నాల్గేని యక్షరము లయిన పిమ్మట ప్రాసము కలదు. అందుచే నచ్చోట ఆఁపుటవలన చెవి కింపుగా నుండును. కాని, ఇట్లాఁపుటవలన భావము స్ఫురింపక కేవలము శబ్దముల పొందిక మాత్రమే యంతోషింపవలయును. కవితాస్వరూపిణి యొక్క శబ్దము నే యనుసరింపదు. భావము దానికి ముఖ్యము. శబ్దాలంకారములకంటె అర్థాలంకారములు శ్రేష్ఠతర మగునవి. పై పాదము భావానుగుణముగా నుండిన ట్లాఁపవలె నన్న నిట్లు సేయవలయును:

"పాడగానక ॥ (అ)డగాన । వడుకాన ॥ కడు దీనగలి విూఱ
నెంత బల్వేతలఁ బడితో ?"

విరామములు హ్రస్వములు దీర్ఘములు అని రెండు విధములు వీనిని గమనింపనిచో వాచక మింపుగా నుండదు.

ఇఁక వృత్తములయందు వాచకము చెప్పుచున్నాను.

"ధీశుకోభగల్గింప । శ్రీకాంతునకు న్నాళర । తీకాంతునకు న్నాభ్వా
తీకాంతుఁడాక్క నైతురే ?"

ఇందుల నడకను బట్టి గీత లున్న చోటుల నాఁపుమండినచో నర్థము చెడును. శబ్దమునకు ప్రాధాన్య మిచ్చినచో నర్థము చెడును; భావము స్ఫురింపదు. అందువలన వాచకము యుక్తముగా నుండదు.

పాటలు పాడునప్పుడు యతిప్రాసములకును స్వరములకును అనుకూలముగా నాఁపుచుండుటచే నర్థము తెలియదు. మన సంగీతశాస్త్రజ్ఞులు కృతులను పాడునప్పుడు వారాఁపెడు స్థలములను గమనించినచో వారు స్వరమునకు ప్రాధాన్య మిచ్చి సాహిత్యమును రూపుమాపుట కనుచుందురు: ఉ. "పలుకు పలుకు । లకు తేనియ । లొలుక । మాటలాడు సోదరులుగల హరి త్యాగరాజ । గుణవిభూష. । సుగుణ భావ." ఇందు గీటు గీచిన చోట నాఁపుట స్వరానుగుణ్య మగుఁ గాని అర్థానుగుణ్యము కాదు! సంగీతసభలలో సాహిత్యమునకు ప్రాధాన్య ముండదు. స్వరమే సర్వత్ర గణనీయము. నాటకరంగస్థలముల కూడ నిట్లే యుండవలయునా? స్వరము ప్రాధాన్యమా సాహిత్యము ప్రాధాన్యమా యించుక రోచింపుఁడు. నాయభిప్రాయ మిది. నాటకప్రయోగమున అభినయము ముఖ్యము. ఇది భావము ననుసరించును. భావము సాహిత్యానుసారి. కావున, సాహిత్యమునకు ప్రాధాన్య మలవడవలయును. కావున పాటలను రచియించువారు అర్థము చెడకుండ సాహిత్యమును రచియింపవలెను. స్వరముకొఱకు సాహిత్యమును చెడఁగొట్టరాదు. పాటలను పాడువారు గాయకుల ననుసరింపక సాహిత్యము చెడకుండునట్లు పాడవలయును.

ఇప్పటికి తేలిన దేమన, పద్యమధ్యమున నాఁపెడు చోటులు అర్థానుసరణములై యుండవలయును. సంగీతమున కూడ విరామములు కలవు. ఇవి స్వరము ననుసరించి యుండును. ఇట్టి విరామము లొకానొకప్పుడు అర్థానుసారు లగును, ఒక్కొక్కచో కావు. స్వరవిరామములకును అర్థవిరామములకును వైషమ్యము వచ్చినపుడు స్వరవిరామములను గమనింపరాదు. ఐతే, మన ప్రదర్శకులు సంగీతము నభ్యసించినవారు కానందున వారి విరామములు స్వరమును కాని అర్థమును కాని యనుసరింపక యుండును. దీర్ఘము వచ్చునప్పు డెల్ల రాగమును తీయుదురు. స్వర మేమో తెలియదు, అర్థము తెలిసినను గమనింపరు. ఇందువలన వాచకము బొత్తిగా చెడును. రాగ మొక్కటి యైనను పాడెడు తీరు గాయకునిఁ బట్టి మాఱుచుండును. సంగీతశాస్త్రజ్ఞులు పాడునంత హాయిగా ప్రదర్శకులు పాడఁజాలరు. ఒక్కొక్కరు పాడిన తీరును బట్టి యొక్కొక్క రాగమునందలి విరామములను మాఱుచుందురు. కొన్ని జిల్లాలయందు పద్యము ముగియువఱకు రాగము ప్రస్తరింపరు. చివర రాగమును విశేషముగా ప్రస్తరింతురు. మఱికొన్ని చోటుల ప్రతిచరణము ముగిసిన తర్వాత రాగమును ప్రస్తరింతురు. మఱికొందఱు చరణమధ్యమున ప్రస్తరింతురు. ఇందును హ్రస్వాక్షరములయొద్దఁ గాక దీర్ఘాక్షరము వచ్చునపుడే రాగము పాడుదురు. ఇం దేది యుత్తమము? మూఁడు మార్గములయందును మంచిచెడ్డలు కలవు. వాని నెవ్వరి బుద్ధి ననుసరించి వారు నిర్ణయించుకొనవలయును కాని యిదమిత్థ మని నిర్ణయించుచు సమానధర్మములను వక్కాణించుటకు వీలు లేదు కాని యొకటి మాత్రము కలదు. రాగ మంతయు చివరవఱకు నాఁపుట నాకు సమ్మతము కాదు. పద్య మంతయు తీఁగవలె చదివి పిమ్మట రాగము తీయుట యొకానొకప్పుడు అభినయమునకుఁ గాని వాచకమునకుఁ గాని ప్రతికూలింపవచ్చును. మాటకు, ఇద్దఱు ప్రదర్శకులు సంభాషించునప్పుడు మొదటివాఁడు చదివిన పిమ్మట తత్క్షణమే రెండవ వాఁడు బదులు చెప్పవలసివచ్చును. ఇట్టిచో రాగము ముగియువఱకు అతఁ డూరకుండుట అస్వాభావికము.

ప్రతిపాదాంతమందును రాగము తీయుటయు నొకానొకప్పుడు వాచకమునకుఁ గాని అభినయమునకుఁ గాని ప్రతికూలించును. కావున నట్లు చేయుటయు యుక్తము కాదు. పద్యమధ్యమున వీలు కల చోటుల రాగము కొంచెము కొంచెముగా ప్రస్తరించుచుండవలయును. అర్థకాఠిన్య మున్న చోటుల శ్రోతలకు కొంత యవకాశము కల్పించుటకై రాగము తీయవచ్చును. అటులే అర్థచమత్కృతి యున్న చోటులఁ గూడ చేయవచ్చును. ఆశ్చర్యార్థకము గాని ప్రశ్నార్థకము గాని వచ్చునప్పుడును చేయఁదగును. ఇట్టి చోటుల నాఁపుట అర్థానుగుణ్యముగా నుండును. కావున సంగీతవిరామములు అర్థవిరామముల నాశ్రయించి యుండును. పద్యము మొదలుపెట్టునపుడు రాగమును ప్రారంభించి ప్రతివిరామమున కళలను మార్చి పద్య

మంత మగునప్పటికి రాగము కూడ ముగియవలయును. కళలయందు ముందువెనుకలు గమనించి యింపును సంపాదింపవలయును. సంగీత మభ్యసించి విద్వాంసుల పంథల నవలంబించి శ్రోత్రపేయముగ పాడుట నేర్చుకొనవలయును. ఎచ్చోటఁ గాని సంగీతమున విరామములు అర్థమును భావమును అనుసరించి యుండవలయును. సంగీతము ననవసరముగా పెంచఁగూడదు.

ఈ విషయముల నన్నిటిని ప్రదర్శకులు ముఖ్యముగా గమనింపవలె నన్న సంఘాధికారు లిట్టి ప్రజ్ఞలను కలవారినే నియోగింపవలయును. అట్లు వారు చేయునట్లు చేయుట ప్రయోగపరీక్షకుల విధి. వారీ యంశములను నిర్ణయింపవలె నన్న వానిని తా మభ్యసించి యుండవలయును. సూక్ష్మపరీక్షకీ విషయములు ముఖ్యాంశములు. వీనిని ప్రచురించి ప్రదర్శకులకు ముందుగా తెలియఁగించి పిమ్మట పరీక్ష సేయుట యుక్తము.

మరియొక సంగతి. పరీక్షకు దరఖాస్తు చేసినంత మాత్రమున పతకమున కందఱు నర్హులు కారు. అట్టియెడ గ్రుడ్డిలో మెల్ల యనునట్లు వచ్చినవారిలో శ్రేష్ఠుఁ డని యెంచువానికి పతకము నిచ్చుట నా మతము కాదు. మొత్తముపైని నూటికి నలువది మార్కులు వచ్చినఁ గాని పరీక్షయందు తేరినట్లు గణియింపఁగూడదు. ఇంతకు తక్కువ వచ్చినవారిలో నెవరికిని పారితోషికము నీయఁగూడదు. మఱియు ఈవఱ వైవఱ్యముండునప్పుడు గాని సమానముగా మార్కులు వచ్చునప్పుడు గాని ఏకాధికులకు బహుమానము లీయవలయును.

ఇఁక సంఘపరీక్ష సేయుట యెట్లన, నాటకములో వచ్చెడు పాత్రముల ముఖ్యతాముఖ్యతలను బట్టి మార్కులు నియమించి, సంఘమునందలి ప్రదర్శకుల కందఱకు మార్కు లీయవలయును. పిమ్మట రంగస్థలమునందలి యేర్పాటులకు కొన్ని మార్కులు నిర్ణయింపవలయును. ఈ రెండింటియందు మొదటిదానిలో రెండవది యాఱవ వంతు గాని యైదవ వంతు గాని యుండవచ్చును. ఆ ప్రకారము సంఘములకు మార్కుల నిచ్చి మొత్తముపై నూటికి నలువదికంటె నెక్కుడు వచ్చినఁ గాని పారితోషికము నొసంగరాదు.

ఈ పరీక్షల విషయమై నేనొక ముఖ్యాంశము తెల్పి నా వ్యాసమును ముగించెద. ఇప్పుడు మనవారు పరీక్ష నిచ్చు సంఘముల నేదో యొక యూరికి రమ్మనుచున్నారు. మొదట బెజవాడవారు ఖర్చులైన నిచ్చినవారు కారు. బందరువారిని మాత్రము అట్లిచ్చునట్లొడంబడఁజేసితిని. ఈ యూరివారు కూడ వచ్చెడు సంఘములకు ప్రయాణపు ఖర్చుల నిచ్చిరి. ఇట్లు చేయుచుండినను చాలమంది పరీక్షకు రాఁజాలకున్నారు. ఏ యిద్దఱో ముగ్గురో వచ్చి పరీక్ష నిచ్చుచుండ అందులో బాగుగ నుండువారికి పతకముల నిచ్చుచుండుటచే పతకముల గౌరవము తగ్గుచున్నది. ఒకసారి పతకములను కొనినవారు మఱియొక చోటున పరిహాసాస్పదు లగుచున్నారు. ఇట్లు జరగుచుండుట శోచనీయము. అంతట నొక మాదిరి పరీక్షానియమము లలవడునట్లును, వీలు గల సంఘము లెల్ల పరీక్ష నిచ్చుటకును వీలు గల యేర్పా టొకటి కలదు. ఏ దనిన, పరీక్షలు ఆయా సంఘము లుండు చోటులనే జరగవలయును. పరీక్షకులలో నిద్దఱాయా స్థలములకు పోయి అక్కడివారి నొకరిని తమలో చేర్చుకొని పరీక్ష చేసి మఱునాఁడు గుణాగుణవిమర్శ చేసి మార్కులను సరాసరి చేయుచుండవలయును. ఇట్లు నాల్గయిదు చోటుల పరీక్షల నేర్పఱచినచో చాలమంది పరీక్ష నిత్తురు.

కొందఱు ప్రదర్శకు లిప్పుడే సంఘమునకు చెందక స్వేచ్ఛావృత్తి నున్నారు. ఇట్టివారు పరీక్ష నిచ్చుటకు వీలు కలిగింపవలయును. కావున నే సంఘమువారితోనైన చేరి వారు ప్రదర్శింపవచ్చును అని నిబంధన చేసినచో వారు పరీక్ష నియ్యవచ్చును.

ఒకయూరినుండి మఱియొకయూరు వచ్చినవారికి నాటక ప్రయోగవిషయమున కొన్ని యిక్కట్టులు సంప్రాప్త మగుచున్నవి. అందుచే వందఱను సమానావస్థయందు పరీక్షించుట తటస్థింపలేదు. అందువలన వారివారి యోగ్యత నెఱుంగుట కష్టముగా నున్నది. నిర్బాధకముగా నుండినఁ గాని ప్రయోగ ముత్కృష్టము కాదు గదా! ఆంధ్రదేశమందలి జనుల కందఱకును ఉపయోగింపవలె నన్న వారి నొక చోటునకు రమ్మనుట యసంభావ్యము.

పరీక్షకు లూరూరు తిరుగుదురా అని యడుగవచ్చును. ఒక నెలలోనే అన్ని ప్రదర్శనములును జరగవలె నన్న నట్లగును. కాలవిలంబమున కవకాశ మిచ్చినచో ఏ చిక్కును కలుగదు. ఏదో కొంత కాలము నియమించి ఆయా సంఘములకు ముందుగా నెఱింగించినచో ఏ చిక్కును పొడగట్టదు.

నప్పుడు, 155 మంది సభ్యులు (లిబరలు, కార్మికకక్షులవారు) అనుకూలముగనుండిరి. 224 మంది (లిబరలు, కార్మిక, ఐరిషు) తమ సమ్మ



ఫ్రెంచి సిపాయిలు రణరంగమునకు వెడలుట

తులను ఇచ్చియుండకయో, వ్యతిరేకముగనుండియో ప్రతికూలముగ నుండిరి. రెండవసారి అనుకూలురు 181 మంది. 201 మంది ప్రతికూలురు. మూడవసారి 156 మంది ప్రతికూలురు. 226 మంది అనుకూలురు. ప్రతికూలురలో చాలమంది తమసమ్మతుల నియ్యక తటస్థభావము వహించియుండుటచే, సమ్మతులిచ్చిన వారిలో 36 గురు మాత్రమే చివరకు ప్రతికూలురు తేలిరి. ప్రభువుల సభయందైనను బిల్లువిషయమై గమనార్హమైన చర్చ జరిగి యుండలేదు. మోర్లీ కర్జను ప్రభువులు మొదటినుండి చివరవరకును మౌనమును ధరించియుండిరి. ప్రభువులసభయందును బిల్లు సునాయాసముగ నంగీకృతమైనది. శాసనము ఐర్లాండు దేశమునకు వర్తింపదు. కేవలము జాత్యభివృద్ధి కవసరమైన వృత్తులందున్నవారిని కొందరిని బిల్లు మినహాయించుచున్నది. సేనాపదవిని వర్జించిన వారివలెనే శాసనోల్లంఘనము చేయువారిని శిక్షించెదరు. ఆశాసనమును కేవలము బ్రహ్మచారులకు మాత్రమే, వర్తించునట్లు పాలకు లారంభమునందు దలచియుండిరి. కాని రానురాను సర్వజనసేవ నేర్పాటు చేయవలయునని ఒత్తిడి వృద్ధియగుచువచ్చెను. సర్వజన నిర్బంధ మేర్పడి తీరవలయునని, అభావములేని దృఢప్రతిజ్ఞతో లాయడుజార్జి యుండెను. చిట్టచివరకు సర్వజన నిర్బంధసేవనమును ప్రభుత్వమువా రంగీకరింపక తీరనదికాదు. దీనిని బట్టి 18 మొదలు 45 వత్సరములు వయస్సుగల వారందరు సైన్యమునందు చేరి పనిచేయవలసిన నియమము కలిగినది. అప్పుడమాత్యపదవియందుండిన ఆస్క్విత్తు మహాశయునకు సర్వజన నిర్బంధమునందు లాయడుజార్జి కున్నంత విశ్వాసము లేకపోయినను దీనిని ఒప్పుకొనక తీరినది కాదు. స్వేచ్ఛాసైనిక సేవనమును త్యజింప నక్కఱ

లేకుండ నెపోలియను యుద్ధములు మున్నగువానిని ఆంగ్లులు గెలిచిరి. ప్రస్తుతపు యుద్ధమునందుమాత్ర మాపూర్వపద్ధతి నేల త్యజింపవలయునని నిర్బంధకాంక్షిముఖ్యపక్షము వారి మతము. యుద్ధనిర్వహణముకొఱకు ఇంగ్లండునందు వివిధపక్ష సంయుతమైన సంయోగప్రభుత్వ మేర్పాటు కాబడినది. ఆంగ్ల రాజ్యాంగమునందు నాలుగు పక్షములు గలవు. ఆ నాలుగు పక్షములందును మూడుపక్షముల ప్రతినిధులు సంయోగప్రభుత్వమునందు చేరి యుండిరి. ఏ యుద్దేశము కొఱకు ప్రభుత్వము నిర్మిత మైనదో ఆయుద్దేశము ఫలప్రదము కాలేదు. యుద్ధనిర్వహణమునం దాప్రభుత్వము తగినంత కార్యోత్సాహమును చూపించి యుండలేదు. సంయోగప్రభుత్వనిర్మాత యగు లాయడుజార్జియే దాని పతనమునకును కారకుడు కావలసివచ్చెను. గత డిసెంబరు మాసారంభమునందు లాయడుజార్జి దానిని రెండుపక్షములుగ విభజింపదలచెను. యుద్ధనిర్వహణభారము పదిమంది చేతులలో నుండుటకంటె అల్పసంఖ్యాకుల చేతులలో నుండుటవలన తత్కార్యనిర్వహణము సుకరమగుననియు, తానును మరిముగ్గురును ఆభారము నంతను వహించెదమనియు లాయడుజార్జి కోరియుండెను. అప్పుడమాత్యుడుగ నుండిన ఆస్క్విత్తుమహాశయుడు, స్వల్పమంత్రివర్గనిర్మాణమున కంగీకరించియుండెను గాని యుద్ధనిర్వహణరంగమునుండి తాను మరలుటకుమాత్ర మొప్పుకొనలేదు. లాయడుజార్జి సంకల్పమున కభావము కలుగలేదు. అమాత్యపదవీలాంఛిత మైన గౌరవప్రతిపత్తిని, హోదాను, స్వత్వమును తాను త్యజించి, అలంకారప్రాయముగ తత్పదవియందుండి కార్యనిర్వహణమంతను పరులవశము చేయుటకు ఆస్క్విత్తు ఒప్పుకొనలేదు. చివరకు ఆస్క్విత్తు మహా



జర్మను సిపాయిలు బలాత్కారముగ స్త్రీలను కొనిపోవుట

కేయుడు అమాత్య పదవిని త్యజింపవలసివచ్చెను. లాయడు జార్జి సంకల్పము నెరవేరి అతడే యమాత్యుడయ్యెను. శత్రుసంహారమునకు ఆంగ్లమాత కృతనిశ్చయ యయ్యెను. సంయోగప్రభుత్వముప్పలత్వము నుండి భీమబలసంపన్నుడగు లాయడుజార్జి యావిర్భవించి కర్ణధారుడై వెలయుచున్నాడు. లాయడుజార్జియం దంతర్గర్భితమై యున్న శక్తిపుంజము ప్రదర్శింపబడు తరుణ మాసన్నమైనది. క్షాత్రభావసమన్వితులగు ఆంగ్లులందరికిని జార్జియందు సంపూర్ణవిశ్వాసము కలదు. ఇప్పుడు జార్జి మహాశయుడు యుద్ధయాగమునందు నాధ్వర్యమును వహించియున్నాడు. వారి యాధ్వర్యముక్రిందను, ఆంగ్లులు తలపెట్టిన మహాయజ్ఞము పరిసమాప్తియై విజయలక్ష్మి ప్రసన్నయగునని లోక మెదురుచూచుచున్నది.

సర్వజన నిర్బంధసైనిక సేవనముతోబాటు, శాకాదికవ్యవహార వర్గమును, వర్తకనిర్వహణవర్గమును, ఆహారనిర్ణయవర్గమును, శత్రువిమాన విధ్వంసకవర్గమును, నిర్మితమైనవి. ఆంగ్లు లింతటి కఠినత్యాగవ్రతము నవలంబించుటకు గతంబు లేకపోలేదు. శత్రువుల ధర్మచ్యుతియు, సర్వసంహారతంత్రోపక్రమణమును, ఆక్రాంత దేశవాసులను హింసించుటయును, నిరపరాధులమీద ఆగ్నేయగోళములను ప్రయోగించి సంహరించుటయును, ఆంగ్లప్రజలయం దంతర్గర్భితమై యున్న సహనశీలమును ప్రజ్వలింపజేసి, శత్రుతాడనోన్ముఖులుగ జేసినవి. జర్మనుల శత్రుసంహారతంత్రము వారి విలయస్థితిగనే పరిణమించినది. చీటికిని మాటికిని జప్లినులు నిరపరాధులగు ప్రజలమీద బాంబులను ప్రయోగించుచువచ్చిన ఫలము శత్రువిమాన విచ్ఛేదకవర్గమువారి, కార్యకౌశలమువలన, మృత్యురూపముగ పరిణమించి, జప్లిను ఆటలు జర్మనులకు వికటించినవి. జప్లినులనుండి, ఆగ్నేయగోళములను



రెడ్‌క్రాసు సంఘమునకై స్త్రీలు చందాలను పోగుచేయు [illegible]

ప్రయోగించి, ప్రజలను హింసించి యుద్ధవిముఖులను చేయవలయు నను సంకల్పము జర్మనులకు కలదు. కాని జర్మనులు శత్రుప్రజలను పెట్టిన బాధలు వారిని పరాఙ్ముఖులను చేయుటకు బదులు యుద్ధపరతంత్రులనుగ జేసి, దుష్కృతిసంహారమునకు తోడ్పడుచున్నది.

ఐర్లండువిద్రోహము గతవత్సరమునందు ఆంగ్లసామ్రాజ్యమునందలి గమనార్హమైన విషయములలో ప్రముఖము. ఐర్లండునందు



[illegible] బండి

విద్రోహము ప్రబలుటకు కారణము నెక్కడనుండియో వెదక నక్కఱలేదు. చిరకాలమునుండి, ఐర్లండుప్రజలయం దంతరించి, ప్రజ్వలించుచువచ్చిన అశాంతియే సినుఫీను ఉద్యమావలంబకుల వ్యర్థప్రయత్నమునకు కారణము. సినుఫీను పక్షావలంబకు లందఱు యువకులు. వారు కేవలము భావప్రేరితులుగాని, వారియందు కార్యసాధనకౌశలము లేదు. కౌశలములేని కార్యసాధకుల ప్రయత్నములు వారి యభ్యున్నతికి బదులు, వినాశనమునకే హేతుభూత మగుచుండును. ఐర్లండుప్రజల యసంతృప్తి సహజమైనది కాదని చెప్పుటకు వీలులేదు. కాని, వారియుద్యమము విప్లవముగ పరిణమించుట సంతాపకరము. అల్‌స్టరు పక్షావలంబకుల పట్లను యుద్ధాత్పూర్వము ఆంగ్లపాలకులు చూపిన యాలసత్వము ఐర్లండు స్వరాజ్యవాదులలో నతివాదులపట్ల పామునకు పాలుపోసినట్లు పరిణమించినది. ఇవి యన్నియు విద్రోహానలమును పరోక్షముగ ప్రజ్వలింపజేయుటకు తోడ్పడినను, ఆంగ్లద్రోహియు, ఐర్లాండుదేశాభిమానియు జర్మనుపక్షపాతియు నగు సర్ రోజరు కేస్మెంటు దుర్నయము ప్రత్యక్షముగ సినుఫీనులను శాసనోల్లంఘనమునకు పురికొల్పినది. కేస్మెంటు చాలకాలము ఆంగ్లప్రభుత్వ సేవచేసి, సత్కృతుడై పనిచాలించుకొని, కాలక్షేపము సేయుచు చివరకు ప్రభుభక్తిని త్యజించి, ఉద్రేకభావోన్మత్తుడై యుద్ధమునకు పూర్వము జర్మనులపంచ జేరి, కుట్రలుచేసి చేసి గత ఏప్రెల్ 21వ తేదీని, ఐర్లండుతీరపు పశ్చిమభాగమున కొక సబుమేరైనులో ప్రయా

ణముచేసి, భూమిమీద కాలు పెట్టి కొంతసేపటికి రాజ్యాధికారులకు వశుడయ్యెను. అతడు జర్మనీనుండి, బయలుదేరి వచ్చియుండిన యుదంతము నిచట వివరింప బనిలేదు. 24 వ తేది సోమవాసరమునందు, విద్రోహము ఐర్లండు రాజధానీనగర మగు డబ్లినుపట్టణమునందు ప్రారంభమై దక్షిణభాగమునందలి వివిధప్రాంతములకు వ్యాప్త మయ్యెను. విద్రోహులు తమ నూతనాధికారమును వారము దినములు చలాయించిరి. ఐర్లండు ప్రజలును, ప్రభుత్వసైనికులును విద్రోహమును నిర్మూలముచేసిరి. విద్రోహనాయకులలో చాలమందికి మరణశిక్షను వేసిరి. చాలమందిని ఖయిదులో వేసిరి. విద్రోహకారణముల నరయుటకు, పంచాయతీసభను అధికారులు నియమించిరి. వారు సంగతిసందర్భములను విచారించి, యధికారులు తగిన కట్టుదిట్టములను చేసి యుండకపోవుటచే విద్రోహము తలయెత్తినదని నిర్ధారణ చేసిరి.



అమ్బులెన్సు సిపాయి ఆతని రథక్షితమైన పనిజేసి దప్పి పోయుట

తదనంతరము స్వరాజ్యస్థాపనమునకై కొన్ని రాయబారములు జరిగి కార్యసిద్ధిని పొందియుండలేదు. ప్రకృతమునందు, తిరిగి తత్ప్రియత్నములు జరుగుచున్నవి. కాని ఐర్లాండు ప్రజలకు సుఖస్థితి యెప్పుడు రానున్నదో నిర్ణయించుట దుస్తరము.

గతవత్సరమునందు, ఆంగ్లయోధాగ్రణియగు కిచినరు ప్రభువు అస్తమించి, ఒక ఆంగ్లమాతనే గాక, మిత్రమండలి దేశముల నన్నిటిని దుఃఖసముద్రమునందు బడవేసెను. కిచనరు ప్రభువు ఆనునికాంగ్లసైనిక నిర్మాత, అభావరాహిత్యమైన యోధాగ్రేసరుడు, వీరవ్రతమునకును, సర్వతోముఖమైన కార్యపరతంత్రతకును ప్రథమలక్ష్యము, యుద్ధము దీర్ఘకాలము జరుగగలదనియు నందుకుతగిన సైన్యావళిని సామగ్రిని నిర్మించవలసి యుండుననియు నిర్ణయించి పనిచేసిన దీర్ఘదర్శి. అట్టి సైనికనిర్మాత, యోధాగ్రేసరుడు, వీరవ్రతుడు, కార్యపరతంత్రుడు, దీర్ఘదర్శి అపమృత్యోపహతుడైనను, వారి సంకల్పము సంపూర్ణముగ నెరవేరి, మిత్రమండలి విజయమునకు నేటికిని సాహాయ్యభూతమగుచున్నది. తనచే నిర్మితులైన సైనికులు రణరంగమునందు నిర్వక్రపరాక్రమముతో పోరాడి శత్రువులను భంజించుచుండ చూచి కిచినరు యోధుడు ధ్రువమండలమునుండి వారిమీద పుష్పవర్షము కురిపించి దీవించుచున్నాడు.

యుద్ధసమయమునందు శత్రుదేశముల స్థితిగతులను తెలిసికొనుటకు సాధనాంతరములు స్వల్పములు. యుద్ధమారంభమైనప్పటి నుండియు జర్మనీలోని స్థితినిగురించి పలువురు పలువిధములుగ ప్రకటించు



బ్రిటిషుసిపాయిలు గడ్డిమోపుబండిలో శత్రువులను వెదకుట

చుచువచ్చిరి. కాని అవియన్నియు యథార్థములు కావని కాలాంతరమున ధ్రువపడుచువచ్చినవి. యుద్ధాదియందుకంటె గతవత్సరమునందు జర్మనీయందు విశేషమైన మార్పు కలిగినమాట మాత్రము తథ్యము. ప్రజలకు రణోత్సాహము కొంతవరకు తగ్గినను వారు విముఖులు మాత్రము కాలేదు. ఆంగ్లుల వ్యాపారనిరోధకతంత్రమువలన జర్మనులు చాల తిప్పలు పడుచున్నారు. జర్మనుల ప్రవృత్తి గత రెండువత్సరములందును చాల వరకుమారినను వారికి ప్రభుత్వమునందును, చక్రవర్తి కైజరునందునుగల విశ్వాసము చలించియుండలేదు. ప్రభుత్వమునందు వారికి విశ్వాసమున్నంతవరకును, రణరంగమునందు నిజముగ తమ సేనలకు పరాజయము కలుగుచున్నను, ప్రభుత్వమువారు చెప్పు బూటకపు మాటలను నమ్మి మోసపోవు యమాయకులు జర్మనుప్రజలు. కాని యసత్యమెంతకాలము దాగియుండగలదు? తమ వశమందున్న వివి



గాయము తగులగ మృతినొందుటకు సిద్ధముగానున్న బ్రిటిషుసిపాయికి బ్రిటిషు తపాలా బంట్రోతు ముఖ్యమైనయుత్తరము నొకదాని నందజేయుట

ధాస్త్రము లుడుగువరకును జర్మనులు పోరాడుదురనుటకు వారు గతవత్సరమునందు చేసిన కట్టుబాట్లే నిదర్శనము. ఆకట్టుబాట్లు వారి యసహాయస్థితికిని తార్కాణముగ నున్నది. వారు విజయసిద్ధికి ఆఖరు సన్నాహము చేసినట్లును, చేయుచున్నట్లును తోచుచున్నది. జర్మనీ రహ



ప్రిటీషు సైనికులను ఒకకందకములో తుపాకిరుందుగోరూడ దాగియున్న 6 గురు జర్మనుసిపాయిలకు దంపుట.

ప్రజల శక్తినంతను రుద్రప్రీలిక్షై వినియోగించుచున్నది. జర్మనీయం దిప్పుడు రుద్రత్వ స్థిరస్ప వేరుపున్నము జరుగుటలేదు. ప్రజలందరును యుద్ధోపయుక్తమైన యేదో యొక ప్రయత్నమునందు నిమగ్నులై యున్నారు. జర్మనీదేశపు స్థితిగతుల నిదమిద్ధమని నిర్ణయించి చెప్పుటకు వీలులేదు.

1916 వ వత్సరము రుష్యా చారిత్రమునందే గాకను, లోకవృత్తమునందును సుప్రసిద్ధిని పొందినది. తరతరములనుండి, రుష్యా మహాసామ్రాజ్యమునందు నిరంకుశాధికారులకును ప్రజలకును జరుగుచువచ్చిన సంరంభము గతవత్సరమునందు, జ్వలితమై వర్తమాన వత్సరమునందు నిరంకుశాధికారము నిర్మూలమై పోయి, వారి యందు జాతీయతాభావము స్థిరపడినది. శతాబ్దములనుండి వేళ్లుబారుకొని యుండిన నిరంకుశాధికారము క్షణకాలములో జాతీయోద్ధర్షము నుందర తిరోహిత మయ్యెను. జారు చక్రవర్తి నిరంకుశప్రభుత్వము లేనిది రష్యాదేశమునకు మనుగడ యుండదని నమ్మిన వారి మూఢ విశ్వాస మసత్యమైనది. ప్రజలును, ఉదారపక్షనాయకులును, సైనికులును కలిసి సునాయాసముగ రాజును పదభ్రష్టునిచేసి ప్రజాస్వామికధ్వజమును నెలకొల్పిరి. రష్యను సేనానాయకులును, ప్రముఖులును విప్లవపక్షము నవలంబించి, పనిచేయుటచే విశేషమైన జననష్టము సంభవించుట కవకాశము లేకను పరివర్తకులు ప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి. అనాదినుండియు నిరంకుశపాలనమునకు వశవర్తులై వచ్చిన రష్యను లిప్పుడు క్షణకాలమునందు ప్రజాప్రభుత్వమును కల వాటుపడి పోవుట లోకకళ్యాణమునకు శుభప్రదము. ప్రస్తుతము రాజ్యాంగసభ దేశమును పాలించుచున్నది. రాజ్యాంగసభవారు పాలనమునిమిత్త మొక మంత్రివర్గము నేర్పాటు చేసిరి. వారు తాత్కాలికముగ ప్రభుత్వాధికారమును వహించి దేశానర్థదాయకులగు పూర్వపు మంత్రులను బందిఖానాలో నుంచిరి. భీకరసంగ్రామమువలన దేశ మొక మూల రక్తప్లావితమై పోవుచుండ, శత్రుసంహారము నే పరమలక్ష్యముగ నుంచుకొని సంరక్షింపవలసిన భారము తమ దయ్యును, పూర్వపుమంత్రులు లేదోవిధముగ జర్మనులకు తోడ్పడుచు వచ్చిరి. వారిదుర్నయములు విప్లవనాయకుల కుత్తేజము కలిగించి బహిరంగముగ వారి దురాగతములను ఖండింప నారంభించిరి. జర్మను పక్షపాతులు ప్రజాపక్షమునకు లొంగక, తమ యధికారము నందున్న పోలీసువారిని ప్రజాసమూహమువిూద తుపాకులను ప్రయోగించునట్లు చేయుటవలన ప్రజలు రోషావేశులై వారిని హతముచేసిరి. చివరకు వారికి సాహాయ్యభూతు లెవరును లేనప్పుడు వారు లొంగకేమిచేయుదురు? అధికారుల స్వార్థపరత్వమును నిర్మూలము చేయుటయే పరివర్తనోద్దేశమైనప్పుడు ఆకార్యము నెరవేరినదా లేదా యను శంకకు అవకాశ ముండదు. రష్యాపరివర్తనము సంగ్రామమునందు విజయార్జనమున కెట్లు సాహాయ్యభూతి మగునదియు ముందు వ్యక్తము కావలసి యున్నది.

ఇంగ్లండు రుష్యాదేశములందువలెనే ఫ్రాన్సు, ఇటలీ మున్నగు సంగ్రామనిబద్ధమైయున్న రాజ్యములందును సంగ్రామోత్సాహ సమ



న్వితమైన కట్టుదిట్టములే సంవత్సరము పొడుగునను జరుగుచువచ్చినవి. మిత్రమండలి దేశములందు కార్యోత్సాహమును, యుద్ధనిష్ఠయు వృద్ధియగుచున్నది. శత్రుమండలి దేశములు నిరుత్సాహము కలుగు స్థితికి వచ్చుచున్నవి.

జర్మనుల సబుమేరైను ప్రస్థానము, ఆంగ్లులక రక్షకనిరోధక తంత్రమునకును యుద్ధమునకును సన్నిహితసంబంధము కలదు. కావున



కుమాలుజాను ప్రదుశ్లలు కాల్పులచుచ్చుచు తెనివలకు జర్మనుమున కోటాలవిర్చుచున్నారు

ఆ ప్రస్థానతంత్రమును గురించి కొద్దిగ చెప్పినగాని 1916 వ వత్సరపు యుద్ధప్రస్థానక్రమమును గ్రహించుటకు వీలుండదు. ఆంగ్లుల వ్యాపారనిరోధక తంత్రము జర్మనుల ఉక్కుతాటివలె బిగిసి ప్రతీకారము నకు వారిని పురికొల్పినది. ఆంగ్లులవలెనే జర్మనులును, వ్యాపార నిరోధకతంత్రము నవలంబించిరి. కాని సర్వసముద్రాధికారసమన్వితు లగు ఆంగ్లులతంత్ర మెక్కడ, జర్మనుల సబుమెరైను అస్త్ర మెక్కడ?

గతవత్సరపు మార్చి మాసాంతమున నుపక్రమితమైన జర్మను సబుమెరైను ప్రస్థానము రెండు నెలల లోపుగనే విధ్వంస మైనది. ఏప్రెల్ 15 వ తేదివరకు ఆ ప్రస్థానము ముమ్మరి ముగ జరిగి కొన్ని స్టీమరులు సముద్రముపాలైనవి. తటస్థ దేశములనుండి నిషేధపదార్థములు ఆంగ్లదేశమునకు వెళ్లు చున్నవను ఎడచే వారి స్టీమరులనుకూడ యుక్తాయుక్త వివక్షతలేక జర్మనులు ముంచుట కారంభించుటవలన తద్దే శాల కాగ్రహము కలుగుచువచ్చెను. లూసిటేనియా, ససెక్సు స్టీమరులను ముంచినవిషయమై జర్మనీ అమెరికా లకు బోలెడు వ్యవహారము జరిగినను, అప్పుడు పొత్తు మాత్రము చెడియుండలేదు. జర్మనుల దౌర్జన్యము నంతను, అమెరికావారివంటి, సర్వసంపన్నులే సహించి యూరకుండినప్పుడు దుర్బలరాజ్యములగు స్వీడను, హాలండు మున్నగునవి యేమిచేయగలుగును? జర్మనులతో స్థలసంబంధము కలవారందఱు వారుచేయు యపకృతుల నన్నిటిని ఇష్టమున్నను, ఇష్టము లేకపోయి నను భరించి యూరకున్నారు. వ్యవహార మింతవరకు ముదిరిన వెనుకను జర్మను లంతటితో పోనియ్యక, కొఱవితో తల గోకికొన పోయినట్లు లోకమునంతను ధిక్కరించి సర్వసంహార తంత్రమును 8 వారముల క్రిందట ప్రారంభించిరి. ఆ సంహారతంత్రఫలము వెంటనే

లోకమునందు వ్యక్తమైనది. విధినిషేధములు లేకను జర్మనులు తమకు కనిపించిన స్టీమరుల నన్నిటి ముంచుటకు సంకల్పించి వారి సంకల్ప మును, లోకమునకు తెలియజేసిరి. తటస్థరాజ్యములు ఆంగ్లదేశముతో వర్తకము చేయగూడదని శాసించుటకు జర్మను లెవరు? జర్మనులకు లొంగిపోవువా రెవరు? తటస్థదేశము లన్నియు తమ యసమ్మతమును జర్మను పాలకులకు తెలిపి, వారు చెడచెవిని బెట్టినప్పుడు అమెరికా ముందంజవేసి తన తటస్థభావము త్యజించి జర్మను రాయబారికి సెల విసంగి తన రాయబారిని స్వదేశ మునకు పిలిపించుకొనెను. యుద్ధా రంభదశయందు జరుగవలసినదం తయు జరిగినను, ఉభయదేశముల కును యుద్ధము మాత్రము పొసగియుండలేదు. ప్రస్తుతదశయందమె రికా త్రిశంకుస్వర్గము ననుభవించుచున్నది. స్థలసంబంధ మున్న దేశ ములు జర్మనీతో యుద్ధమును ప్రకటింపలేకను, కాలోచితముగ ప్రవ ర్తించుచున్నవి. కాని జర్మనులు తమ పంతమును విడువక, తమకుదొర కిన స్టీమరులను ముంచుచున్నారు. ఇంత బ్రహ్మాండప్రయత్నముచేసి జర్మనులు లోకకంటకులైనను వారి ప్రస్థానతంత్రము ఫలప్రద మగు



ఆంగ్లసిపాయులు జర్మను సిపాయిలను తరుముట

నని గాని, ఫలప్రద మైనదని గాని, చెప్పుటకు వీలు లేదు. జర్మనుల సబు మేరైను ప్రస్థానము గండవసారి నిర్వీర్య మైనప్పుడు వారి యసహాయ స్థితి ప్రజలకు వ్యక్తమై వారు యుద్ధవిముఖులై గత్యంతరము లేకను సంధికాములు కావచ్చును.

1916-వ సంవత్సరపు యుద్ధప్రణాళిని నిర్ణయించినప్పుడు ఆసం వత్సరమునందు జర్మనుల శకము తిరిగి వారికి పరాజయమును మిత్ర మండలికి విజయమును సంప్రాప్తమైనదని చెప్పవలసి యుండును. ఆ

THE MADRAS VAISYA STUDENTS' LITERARY ASSOCIATION.



చెన్నపురి వైశ్యవిద్యార్థుల వాఙ్మయసంఘము

THE M. A. C. STUDENTS OF THE PACHAYAPPA'S COLLEGE



చెన్నపురి వ్యాయామసంఘముసందలి పచ్చయప్పకళాశాల విద్యార్థులు

THE MADRAS ANDHRA SABHA



చెన్నపురి ఆంధ్రసభా సభ్యులు

MR. R. JAGANNADHA SASTRI



రాంభొట్ల జగన్నాథశాస్త్రిగారు

THE BUILDING OF THE MADRAS LANDHOLDERS' ASSOCIATION



మద్రాసు భూస్వాముల సభాభవనము

GENERAL JOSEPH GALLINI (Died at Versallieus)



జనరలు జోసెఫ్ గాల్లియను (వర్సైలెస్సువద్ద చనిపోయెను)

GENERAL MANJIN



జనరలు మంజీను

The French Redcross in London. President Mme La Viscountesse Louis De La Panouse With Her Daughter



లండను నగరమునందలి ఫరాసు రెడ్క్రాసుసంఘము ప్రెసిడెంటు
మె. లావిస్కౌంటెస్ లూయి డిలా పెనూసుగారు వారి పుత్రికయు

THE SOUL OF VERDUN



వర్డను దిగ్విజయ పతాకములు

LADY STUDENTS OF THE MADRAS WOMENS' COLLEGE



చెన్నపురి స్త్రీకళాశాలయందలి విద్యార్థినులు

SRIMATHI VAKKALANKA VENKATA SURYARAMA JOGAMMA GARU, VIZIANAGARAM



శ్రీమతి వక్కలంక వేంకటసూర్యరామ జోగమ్మగారు, విజయనగరము

AMRUTANJAN



అమృతాంజనము

వత్సరమునందు శత్రువులను శరణాగతులను చేయుటకై వారు మూడు ప్రస్థానముల నుపక్రమించి యుండిరి. వర్దను ఫ్రెంటినో ప్రస్థానములు రెండును, కొనసాగి యుండలేదు సరికదా వారి కపారమైన సైన్యనష్ట మేర్పడినది. రుమేనియా ప్రస్థానము పూర్తిగ గాక పోయిన కొంతవరకైనను ఫలప్రద మైనదనుటకు సందియము లేదు. రుమేనియా యందు శత్రువులు కొంతభాగము నాక్రమించుకొన గలిగినను, వారు ప్రస్థానప్రారంభమునందు తలచినట్లు శత్రుసంహారమును మాత్రము చేయజాలక పోయిరి. వర్దను దుర్గావళుల యెదుట జర్మనులకు విజయము సిద్ధముగ నున్న సమయమునందు ఆంగ్లులు పికర్డీయందు అవస్కందనమున నుపక్రమించి, వారి యుద్ధప్రణాళికి భంగము కలిగించి రెండున్నర వత్సరములనుండి, సుస్థిరముగ నావాసము చేసికొనిన కందకావళులను త్యజించి మరలుముఖము పెట్టునట్లు చేసిరి. ఆర్మీనియాయందు రష్యను లవలంబించిన యవస్కందనము ఫలప్రదమై తురుష్కుల ప్రాభవము క్షీణించి ఎర్జిరమును, ఇర్జింఘును, ట్రిబిజాండు, మఘుపట్టణములు విజేతల వశమైనవి. ఆంగ్లసేనలు జర్మనుల తూర్పుఆఫ్రికాను జయించినవి. నైగేరియా, కామరూనులును, ఆంగ్లులకు స్వాధీనములైనవి. ఇటలీరంగమునందు గోరిజియా పట్టణమునుండి ఇటలీవారు శత్రువులను తరిమి ఆపట్టణమును పట్టుకొనిరి. రష్యనులు బుకోవినా నంతను గెలుచుకొనిరి. రుష్యాప్రస్థానము వలన ఆస్ట్రియావారికి, 15 లక్షలమంది రోగులు నిరుపయోగమైరి. మాసిడోనియా రంగమునందు మిత్రమండలి, మొనాస్టిరును పట్టుకొని బల్గేరియాతోశము పట్టుటకు యత్నించుచున్నారు. 1916 వ వత్సరమునందు మిత్రమండలికి కలిగిన విజయపరంపరలను తలచుకొనినప్పుడు శత్రుమండలి విజయలక్ష్మి పెడముఖము పెట్టినదని నిర్ణయింపక తప్పదు.




ఫ్రెంచి సిపాయిలు తిరిగి గోంజను పట్టుకొని జర్మనులు వెనుకకు మరలి [illegible] దానిని సురక్షితముగ నుంచుట



ఆంగ్లసిపాయిలు జర్మనుల రహస్యములను కనుగొని [illegible] జర్మను సిపాయిలు [illegible] వారిమీద [illegible]

ఆరుమాసములలో శత్రువులను సంహరించి విజయలక్ష్మిని అవలీలగ వరింపగలమను నిశ్చయభావముతో యుద్ధ మారంభించిన జర్మనుల సంకల్పము యుద్ధ మారంభమైన 18 మాసములకైనను సిద్ధించియుండలేదు. 1915-వ సంవత్సరము జర్మనులకనుకూలమైనను వారికి జయప్రదము కాలేదు. ఆకాలమునందు వారెన్ని చిన్న రాజ్యములను వశము చేసికొనినను, రష్యనుల నెన్ని మైళ్లు వెనుకకు నెట్టినను, విజయోత్పాదకమగు స్థితి యేర్పడలేదు. విజయసాధనములను తమ చేతి యందుంచుకొని శత్రువులను నొక్కవలయుననియే జర్మనుల యుద్ధప్రణాళికి కీలకము. ఆయుద్ధప్రణాళికి భంగము కలుగుటకు జర్మనులొప్పుకొనరు. మిత్రమండలిని భేదోపాయముచే వంచించుటకు జర్మనులకు వీలుకలుగలేదు. 1916-వ వత్సరమందు వారియందు సంయోగప్రస్థానసంకల్ప ముదయించినది. జర్మనుల కిది గిట్టదు. తమ యిష్టానిష్టములను, భావమునందే గాకను, క్రియారూపమునందును జర్మనులు వ్యక్తీకరించుట కాలోచించుచుండిరి. మిత్రమండలిలో నెవరినో యొకరిని కడతేర్చుటకు జర్మనులు 1915-వ సంవత్సరాంతమునందు సంకల్పించిరని నమ్ముట కే యభ్యంతరమును లేదు. ఆంగ్ల వ్యాపార నిరోధకతంత్రముచే సరిగ ఆహారపదార్థములు లభింపక తప్ప

లు పడుచున్న జర్మను ప్రజలను, సంతోషపెట్టుటకును, తమ విజయమును శంకించుచున్న తటస్థదేశముల ప్రజలకు నమ్మకము కలిగించుటకును, గొప్ప విజయమును పొందుట జర్మనుల కవసరమైనది. తత్ఫలప్రాప్తికై జర్మనులు 1915-వ సంవత్సరాంతము నుండియే ప్రయత్నములు చేసిరి. పడమటిరంగమునందు లేని ప్రాముఖ్యము మరే యితరరంగములందును లేదు. ఆంగ్లుల తరువాతను ఫరాసులే జర్మనులకు గర్భశత్రువులు. వర్డనుతో తుల్యమైన విఖ్యాతిదుర్గ మితరరంగములందు లేదు. ఒకవేళ నట్టి దుర్గరాజ మున్నదనుకొనినను, దానికి సమీపమునందు జర్మను సేనలుండవద్దా? వర్డను దుర్గమునకు జర్మను సేనలు పదిమైలుల దూరమునం దుండెను. ఫరాసుల నోడించినప్పుడు వచ్చు విఖ్యాతి శత్రుమండలియందు మరెవరిని ఓడించినను రాదు. వర్డను వశము చేసికొనినందువలన తమకేదో విశేషమైన లాభము కలుగునని జర్మనులు లేనిపోని యాశలు పెట్టుకొనలేదు. వర్డను స్వాధీనమువలన తమకు కలుగు మంచి చెడ్డలు వారికి పూర్తిగ తెలియును. వర్డనుదుర్గపు బలాబలములను కూడ వా రెఱుగుదురు? ఇంత తెలిసియుండియు జర్మను లక్కడ ప్రబలప్రయత్నము చేయుట కేమి కారణమని ప్రశ్న కలుగును?

ఎన్ని తప్పులుచేయుటకైనను ఒప్పుకొందురుగాని ఎంతనష్టము వచ్చినను అంగీకరించెదరుగాని జర్మను సైన్యనాయకులు తమ దురభిమానమును మాత్రము త్యజింపజాలరు. 1914-వ వత్సరమునందు జర్మను యువరాజుసేనకు వర్డను దుర్గావళుల యొద్దను పరాభవము కలిగినది. వర్డను స్వాధీనముచేసికొని యువరాజునకు కలిగిన పరాభవమును పోగొట్టుకొనదలచి తత్సన్నాహము వారు చేసిరి. జర్మనులకు మరియొక యుద్దేశము కూడ నుండవచ్చును. మిత్రమండలి 1916-వ వత్సరపు వసంతకాలమునం దారంభింపదలచిన ప్రస్థానమునకు ముందుగనే వారిలో నొకరిని బాదుటవలన వారి సంకల్పమును విఘ్నము చేయవచ్చునని తలచి యుందురు. తాము వేసిన యెత్తు ప్రకారము శత్రువులు వారి స్థితిగతులను సరిపెట్టుకొని యుద్ధము చేయవలసివచ్చుననియు, తమకనుకూలమైన స్థితిగతులందు విజయమును పొందవచ్చుననియు జర్మనులు తలచి యుందురు. కాని చివరకు జర్మనులు చేసిన యత్నమునకు తగిన ఫలము కలుగలేదు. ఇన్ని సంగతుల నాలోచించి జర్మనులు వర్డను ప్రస్థానమున కుపక్రమించి యుందురని యూహింప తగియున్నది.



కందకములలో కావలి కాచుట

గతవత్సరమునందు పడమటి రంగమునందు జరగిన ప్రస్థానములలో వర్డను, సోము యుద్ధములు ప్రముఖములు. గత ఫిబ్రవరి 21-వ తేదిని ప్రాతఃకాలమునందు 7-15 నిమిషములకు వర్డను యుద్ధ మారంభమైనది. మాలనుకోరు, ఈటనుల మధ్యను సేనాముఖము పాతిక మైళ్లదూరము కలదు. ఆ ముఖముమీద వారు బ్రహ్మాండముగ నగ్నివర్షము కురిపించిరి. సాయంకాలమునందు పదాతిసేన కందకములను నిర్గమించినది.



ఫ్రెంచిసిపాయిలు మోటారుబండినుండి జర్మనుసిపాయిలను వెనుకకు తరుముగొట్టుట

యుద్ధారంభమునందు మొదటి మూడు రోజులందును తప్ప తరువాత
జర్మనులకు వర్డనునొద్ద విజయము కలుగుటకు బదులు పరా



లెఫ్టినెంటు సివిలు గార్డన మార్టిన్. ఎస్. ఒ. పన్నెండుమంది జర్మను సిపాయీలను చంపుటలో
చాల ధైర్యసాహసములను చూపినందులకు, విక్టోరియా క్రాసు ఇయ్యబడెను

జయమే కలిగినది. రక్షణయోగ్యము కాని
ప్రదేశమునంతను, పరాసులు మొదటి
మూడు దినములందును త్యజించి సురక్షిత
ప్రదేశములను చేరుటవలన వారి సైనిక
పంక్తి ఘనీభవించి జర్మనుల యెత్తు సాగ
లేదు. పరాసు ఫిరంగులకు లెక్కలేనన్ని
సైనికులను బలిపెట్టి జర్మనులు వా, డా
మంటు దుర్గములను పట్టుకొనిరి. కాని,
సమయము వచ్చినప్పుడు వానిని వారు
నిలుపుకొనలేకపోయిరి. జర్మనుల కీ వ్యర్థ
ప్రయత్నమునందు 5 లక్షలమంది సైనికులు
నష్టమై యుండును. పరాసులకు వారిలో

వలయునని, అక్టోబరు మాసమునందు పరాసులు సంకల్పి
త్నములు చేసిరి. పరాసుల ప్రయత్నములకు, రుమేని
తోడ్పడినదని చెప్పవచ్చును. తమ సేనలోని బలాధ్యుల
జర్మనులు వర్డను ముఖమునుండి మరలించి, రుమేని
ముపక్రమించియుండిరి. సమయమునకు వేచియున్న పరా
చేసికొని, నాలుగు బాదులు బాది, వా, డామంటు దుర్గ
బోలెడు శతఘ్నులను, సైనికులను పట్టుకొని, తమ ర
అవస్కందన తంత్రమును లోకమునకు చాటిరి. వర్డను
జర్మనుల కపకీర్తిదాయక మయ్యెను.

జూలై మాసమునం దారంభమైన సోము యుద్ధ
యెత్తులనన్నిటిని తాలుమాలు చేసినది. ప్రస్తుతసం
నిమగ్నములైయున్న దేశములం దే దేశమునకు మొదట
విముఖత్వముకలిగి ప్రజలయం దాహాకారములు బయలు
పరాజయము ధ్రువము. పూర్వమునందువలెగాక ప్రస్తు
వృతమైన రణరంగమునందు, శత్రుసేనలను ఓడించు
ము లింకను నిర్ధారణ కాలేదు. ఆవిషయము నిర్ధారణ
సంగ్రామ సుముఖులకు విజయము నిజముగ సిద్ధాం
మునం దుండగలదు. తమ సమయమును కనిపెట్టియెవ
నందు జర్మనులు బలమును కేంద్రీకరణముచేసి విజయమ
యుద్ధము తమ కనుకూలముగనే సాగుచున్నదని య
తమ ప్రజలను నమ్మించుచుండిరి. జర్మను సైనికా
మాటయందు ప్రజల కపనమ్మకము కలుగుటకు తోడ్ప
లలో మారనుయుద్ధమైనవెనుక సోము యుద్ధముతో
దొకటియు జరిగి యుండలేదు. వర్డను యుద్ధమునందు జ
ఊగులాడుచుండెను. రష్యారంగమునందు జర్మను అ
గ్రుక్క తిరుగుటలేదు. శత్రు వన్నిరంగములందును,



యుద్ధముచేయుచు తలత్రిప్పుకొనలేని స్థితియందు ఆంగ్లపరాసుల సంయుక్తావస్కందన మేర్పడినది. అర్రాసునుండి బార్లోవరకును గల



ఆంగ్ల సిపాయిలు కందకములనుండి బైటకువచ్చుట. దాని జర్మను సిపాయిలు పరుగెత్తుకొని పోవుట

పాతిక మైలుల ముఖమునందు, జర్మనులు దుర్భేద్యములని యెంచిన కందకములను ఆంగ్లపరాసులు చూర్ణముచేసి ముందుకు వచ్చుట కారంభించిరి. పెయిలీ మొదలు థీపవలువఱకును గల యున్నతస్థానములందు జర్మనులు కందకములను త్రవ్వుకొని, ఆంగ్లుల పురోగమనమునకు ప్రతిబంధకముగ నుండిరి. ఇన్ని యవాంతరములున్నను ఆంగ్లులు పరాసులు తమ కార్యమును సాధించి క్రమముగ నున్నతప్రదేశమును స్వాధీనము చేసికొనగలిగిరి. బెల్జియమునుండి, ఎయినునదీప్రాంతమునకు గల జర్మనుల గమనాగమనములను భేదించుటకై ఆంగ్లులీముఖమునందు దాకియుండురు. హేమంత ఋతువునందు యుద్ధప్రస్థానము జరుగలేదు. జూలై మొదలునవంబరు వరకును, ఆంగ్లులు 9 మైళ్ల దూరము ముందునకు వెళ్లగలిగిరి. జూలై మాసమునందు జర్మనుల స్వాధీనమునందు గల యున్నత ప్రదేశాక్రమణముతో నాంగ్లపరాసుల పురోగమనము సుకరమైనది. 1917-వ సంవత్సరమునందు సోముతటమునుండి జర్మనులు మరలు ముఖము పెట్టుట కారంభించుట కిదియే కారణము.

1917-వ సంవత్సరపు వసంతకాలప్రస్థానమును వ్రాయు నప్పుడీ సంగతిని వ్యక్తీకరించెదము. 1917-వ సంవత్సరపు ప్రస్థానమును దిలకించువారికి సోముదరంగమునందు మిత్రమండలి చేసిన ప్రయత్నమునకు తగిన ఫలము లభించినదా లేదా యను సంశయము కలుగదు. జర్మను సైనికులలో 70 వేలమంది ఖయిదీలకు దొరకిరి.

వర్దను సంగ్రామ నిమగ్నులై యుండిన ప్రజలదృష్టి యొకసారి మే మాసాంతమునందు, రుష్యారంగము వైపునకు ప్రసరించి యుండెను. వివిధపరాజయములకు లోనై 1915-వ వత్సరాంతమునందు కోలుకొనుట కారంభించిన రుష్యనుల బలశౌర్యములు 1916-వ సంవత్సర వసంతోదయములో వికసించి, ఆస్ట్రియా జర్మనుల భంజనమునకు వినియోగపడినవి. ప్రిపెటు బాడవలు మొదలు రుమేనియా సరిహద్దువరకును గల 300 మైలుల ముఖమునందు, రుష్యను సేనాని బ్రూసిలాఫ్ ఆస్ట్రియా జర్మను సేనల నోడించి, వారి సైనికుల కపారనష్టమును కలిగించి, అమితమైన యుద్ధద్రవ్యములను పట్టుకొనెను. 300 మైలుల ముఖము సందంతటను రష్యనుల బలమునకు విజయమే కలుగునని వారు తలచియుండలేదు. సూచీముఖమునందు శత్రువులను తాకుటవలన, ఇతరప్రాంతముల నుండి యక్కడకు సేనలను రప్పించి, వారి ప్రయత్నములను భంగము కలిగించుట కవకాశ ముండును. యుద్ధారంభము నుండియు జర్మను లాతంత్రమును పూర్తిగ శత్రువుల మీద ప్రయోగించి, విజయములను బడయుచు వచ్చిరి. ఆ తంత్రమును భేదించుటయందే జర్మనుల పరాజయ వృక్షాంకురములు మొలకలెత్తినవి. రణరంగమునందలి యితర ప్రాంతముల నుండి సేనలను తెచ్చి శత్రుతాడిత ముఖమును రక్షించుటకు సేనలను కదుపకుండ జేయుటకే రుష్యను సేనాని బ్రుసిలాఫ్ విశాలముఖమునందు అవస్కందనమున కుపక్రమించి యుండును. ఆధునిక యుద్ధములను జయించుట కిది యొక ముఖ్యసాధనముగ పరిణమించినది. రుష్యను



రష్యను సిపాయిలు త్రాళ్లతో ఉచ్చులనువేసి ఆష్ట్రియను సిపాయిలను పట్టుకొనుట

సేనాధ్యక్షు డవలంబించిన యవస్కందనము సిద్ధించినదని చెప్పుటకు వీలులేదు. కాని అది ఫలప్రద మైనదని నిస్సందేహముగ చెప్పవచ్చును.



విషవాయువులకు వదలి శత్రువులకడ్డముంచి తమకు పోయిన సిపాయిలకు తిరిగి తెలివొచ్చుట

దాని ఫలము ఇటలీరంగమునందును, వెర్డునరంగమునందును ముఖ్యముగ గోచరించినది. ఇటలీరంగ ప్రస్థానమును విమర్శించినప్పుడు, దానిని గురించి పూర్తిగ వ్రాయుటయు గాక ప్రస్తుత మెత్తుకొని యుండ లేదు. రుష్యను తంత్రమువలన జర్మనులు తమ పూర్వపు స్థానముల నుండి, 40 మైళ్ల దూరము వెనుకకు పోవలసివచ్చెను. మొదటి యున్నత కింతదూరము వెనుకకు వెళ్లవలసివచ్చుటచే శత్రువులు తమ యుద్ధోపకరణములను ఫిరంగులను తమతో తీసికొని వెళ్లలేకపోయిరి. అవి యన్నియు విజేతల స్వాధీనము లగుటయే గాక శత్రువుల రక్షణ దుస్తర మైనది. ఉత్తరభాగమునందు కోల్కి మొదలు టార్నపోలు వరకును వ్యాప్తమైన రుష్యనుల సేనాముఖము త్రిభుజాకారముగ లజ్కు, కోజను, బ్రొడీలవరకు ముందుకు సాగి, జర్మను సేనాముఖమునందు "గసిగట్టి" నట్లు పరిణమించి, దానిని ఛేదించుటకు సాధన మేర్పడినది. కోవెలు పట్టణము నుండి, కీవుపట్టణము పోవుటకు సరాసరి లోహమార్గము కలదు. కోవెలునందు దెస్నరోహా లోహమార్గములు కలిగియున్నవి. కోవెలు చాల ముఖ్య స్థలము. ఆ స్థానమును వశపరచుకొనుట రష్యనుల సంకల్పమై యుండెను. కాని దానిని వారు పట్టుకొనలేకపోయిరి. దక్షిణభాగమునందు రుష్యనులకు సీరెతు నది మొదలు స్ట్రిపానదివరకును, పురోగమనము కలిగి జర్నావిజీపట్టణము స్వాధీన మైనది. దక్షిణమునందు గల స్టానిస్లా స్వాధీన మైనను లెంబర్గుపట్టణమును పట్టుకొనుటకై రుష్యనులు చేసిన యత్నము సాగి యుండలేదు. ఉత్తరమునందు కోవెలును స్వాధీనము చేసికొను నుద్దేశముతో స్టాకోదు ప్రాంతముననున్న చేరిన రుష్యా సేనలను జర్మనులు ముందుకు రాకుండ జేసిరి. అంతటితో రుష్యా ప్రస్థానము కొంచె మించుమించు మందగించి వారు ముందుకు సా లేకపోయిరి. తరువాత రుష్యనురం మునందు హిమవంత ప్రభావము ప్రచలనము కలిగియుండలేదు.

ఆసియా మైనరునందలి అర్మీ యాను రుష్యనులు స్వాధీనముచే కొనిన యుదంతము గత సంచి యందు ముద్రితము. డార్డినల్ల యుద్ధానంతరము, తురుష్కులు బా గ్దాదు రంగమునకు, చాల సేనల పంపించిరి. ఆ ఫలము కాక్ససురం మునందు వారికి కలిగిన పరాజయము వలన విదిత మైనది. బాగ్దా రంగమునకు వచ్చిన తురుష్కసేన కెట్సిఫను నొద్ద జనరలు టౌన్సెండును ఓడించి కటుపట్టణమునో ఆంగ్లసేనలను ముట్టడించినవి. టౌన్సెండు సాహాయ్యార్థము బస్రా నుండి వెళ్లిన సేనలు చాల ప్రతిబంధకముల నెదుర్కొనవలసి వచ్చె సమయమునకు టైగ్రిసునందు వరదలువచ్చి బాస్రానుండి, బయలుదే సేనలు ముందుకు పోలేకపోయినవి. దీనికి తోడు తురుష్కులు త స్థానములను బలపరచుకొని, రక్షించుకొనిరి. నాలుగు మాసము యద్వితీయ పరాక్రమముతో పోరాడిన టౌన్సెండు సేన చివరకు ఆహా పదార్థములు లేకను శత్రువులకు లొంగిపోవలసివచ్చినది. కటు ఆంగ్లులకు కలిగిన పరాజయము వారియందు కల లోపములను ని



ఇద్దరు గూర్ఖసిపాయిలు జర్మనుల వెంట వెళ్లి వారలను పొడిపోతకట్టు చేయుట

రణ చేసికొనుటకు పురికొల్పినది. అప్పటినుండి డిసెంబరువఱకును మెసపొటేమియాయందు లోహమార్గములను నిర్మించుటయందును



టైగ్రిస్‌నదీసమీపమునందు భారతయోధులు తురుష్క సిపాయిల మందుగుండును వేల్చుట

మందుసామగ్రిని వృద్ధిచేయుటయందును ఆంగ్లులు తమ సామర్థ్యమును వినియోగించిరి. క్రొత్తగ యుద్ధప్రస్థానమును ప్రారంభించుటకు ఆంగ్లు ... సర్వసన్నాహములను చేసిరి. ఆ ప్రయత్నములవలన ఆంగ్లులు ...ష్కులను ఓడించి, బాగ్దాదును సైతము స్వాధీనము చేసికొన... ఆ యుదంతమును, 1917-వ సంవత్సరపు ప్రస్థానచారిత్రము



...యొద్దనుండి కెనుకకు వచ్చుచు నిపోవునపుడు తురుష్క సిపాయిలు తమకు సంబంధించిన పశువులను, జంతువులను తీసికొనిపోవుట

నందు తెలుపుదుము. తురుష్కుల ఈజిప్టు పరిపాల్య ప్రస్థానములు విఫలమైనవి. ఈజిప్టురంగమునందు తురుష్కులు తమ యసహాయ స్థితిని గ్రహించి, తమ యుద్యమమును విరమించినట్లు తోచుచున్నది. తురుష్క సేనాముఖమును భేదించి రుష్యను సేనాధ్యక్షుడు, గ్రాండు డ్యూకు నికలసు ఎర్జిరము ట్రెబిజాండులను స్వాధీనము చేసికొనిన వెనుకను, తురుష్కులు క్రొత్తసేనలను మద్దతుగ తెచ్చి శత్రువులను



సేనాధిపతికర్ణలుండి కండకరు అలో అర్డరులను గైకొనుట

తాకి, మషు బిట్లిసు పట్టణములను పట్టుకొని ఆరంభమునందు కొంత విజయమును గాంచినను, రుష్యనులు తిరిగి, యనక్కుందనమున కుపక్రమించి, మషుపట్టణమునే గాకను, ఎర్జింఘానునుకూడ స్వాధీనము చేసికొనిరి. రుష్యనుల ఆర్మీనియా విజయముతో తురుష్కుల పరాజయము ధ్రువమైనది.

ఇటలీరంగమునకును, తదితర రంగములకును సాదృశమైనను లేదు. ఇటలీరంగము పర్వతమయము. ఇతరరంగములు కొద్దిగనో గొప్పగనో సమప్రదేశములు; విశేషవ్యూహ నిర్మాణయోగ్యములు. ఇటలీరంగమునందు గల ప్రతిబంధకములు మరేరంగమునందును లేవు. ఆ రంగమునందు సులభమైన గమనాగమనసాధనములు లేవు. ఇటలీ ఉత్తరభాగమున కెదురుగ యున్నతప్రదేశము కలదు. దానినే ట్రెంటినోయని వ్యవహరించెదరు. ఆ ప్రాంతమునకు దిగువను సమప్రదేశము. ఇటలీవారి కెన్ని యిబ్బందు లున్నను శత్రువుల యాటలు సాగకుండ

జేయుచు, వారిని కదల మెదలనియ్యకుండు టెంతయు ప్రశంసనీయము. ఇటలీవా రిప్పుడన్ని యవాంతరములను దాటిరని చెప్పవచ్చును. 1916-వ సంవత్సరమునందు శత్రువులు వర్దునదగ్గర పరాసులనే గాక



ఇటాలియను సిపాయిలు ఆల్ప్సుకొండలమీదను రణరంగమునకు పోవుట

ట్రెంటినోయందు ఇటలీవారిపనికూడ పట్టుటకు సంకల్పించి, ఆప్రాంతమునకు చాల ఫిరంగులను, సైన్యములను చేర్చిరి. జర్మనులదృష్టి వర్దునుయందును, ఆస్ట్రియనులదృష్టి ట్రెంటినోయందును ప్రసరించుచుండెను. ఆ ప్రస్థానములు రెండును ముమ్మరముగ సాగుచుండి నప్పుడే రష్యను సేనాధ్యక్షుడు బ్రుసిలాఫ్ రష్యారంగమునందు జర్మనులపై దుమికెను. ఆసమయమున ఇటలీవారు సందుచేసికొని, ఆస్ట్రియావారి ప్రయత్నములను విఫలము చేయగలిగిరి. ఆస్ట్రియావారు ఇటలీ సరిహద్దును దాటిరి. కాని, శత్రుముఖమును ఛేదింపలేకపోయిరి. ఆస్ట్రియావారి మధ్యభాగమునందలి సేన ముందుకు వచ్చిపడినను, పార్శ్వములందలి సేనలు కదలలేకపోయినవి. అప్పు డిటలీవారు ప్రబలసేనలతో పార్శ్వములందు యెదిరించి, వారిని వెనుకకు తరుము నారంభించిరి. ఆస్ట్రియావారు తాము తలచిన కార్యమును సాధించుటకు తగినసేనలను తెచ్చుటకు వీలులేకపోయినది. ఒకమూల రష్యారంగమునందు శత్రువు ఒత్తిడివృద్ధియై ఇటలీప్రస్థానమునకు భంగపాటు కలిగించినది. ఇటలీవారు ఆస్ట్రియనులను ట్రెంటినోయందు ఓడించు



గాయములు తగిలిన సిపాయిలను ఆమ్బులెన్సువారు రైలుబండిలో నెక్కించుకొనిపోవుట

టయేగాక ఐసాంజోయందు అవస్కందన మారంభించి, గొరిజియాపట్టణము నాక్రమించుకొనిరి. కార్సోప్రస్థమునందు ఇటలీవారు శత్రుముఖమును ఛేదించి, ట్రిస్టీని సమీపించిరి. కాని, వారికి ముం దింకను రెండుమూడు దుర్గమ ప్రదేశములు గలవు. ఇటలీరంగమునందు 1916-వ సంవత్సరమునం దధమము 10 లక్షలసైనికులైనను ఆస్ట్రియావారికి నష్టమై యుండును. శత్రుబలమును క్షయముచేయుట కితరరంగములవలెనే ఇటలీరంగమును చాలవఱకు తోడ్పడినది.

యుద్ధారంభమునుండియును బాల్కనురంగమునందు స్థితిగతులు నిలుకడగ లేవు. 1915 వ సంవత్సరమునందు బాల్కనురంగమునందు విషమస్థితి యేర్పడినది. 1916 వ సంవత్సరమునం దా విషమదశ తగ్గుటకు బదులు మరింత యధ్వాన్న మగుటకు రెండు కారణములు తోడ్పడినవి. గ్రీసు రాజు ద్రోహబుద్ధియు, రుమేనియావా రవలంబించిన యుద్ధతంత్రమునందలి లోపమును, బాల్కను వ్యవహారమును క్లిష్టదశకు తెచ్చెను. సర్వియాను జర్మను బల్గేరియసేన లాక్రమించుకొనుటవలన మిత్రమండలి సేనలు సలోనికారేవును శరణ్యము చేసికొనవలసి వచ్చెను. మొదటినుండియు గ్రీసురాజు భావము మిత్రమండలి

కనుకూలముగ లేదు. మిత్రమండలిసేన ముందుకు సాగినవెనుకను, ప్రక్కలోని బల్లెమువలె వెనుకనుండి ముట్టడించుట కాతడు తరుణము వేచియుండెను. రుమేనియా ఆస్ట్రియా, బల్గేరియాలమీదకు దుమికి నప్పుడు మిత్రమండలి తమ సేనలను మాసిడోనియయందు బల్గేరియాపై



అంబులెన్సు మోటారుబండి యుద్ధరంగమునుండి ఆసుపత్రికి పోవునప్పుడు త్రోవలో సిపాయీలు కాపలా యుండుట

నప్పుడే నుంకించెదరు గదా! అట్టి తరుణమునందు తన సంకల్పము నెర వేర్చుకొనుటకు గ్రీసురాజు తలచియుండెననుటకు సందియ ముండదు. కాని మిత్రమండలి గ్రీసురాజు యెత్తును కనిపెట్టలేకపోలేదు. గ్రీసువ్యవ హారము పరిష్కారమగువరకును మిత్రమండలి తమ శరణ్యమును వదలి సలోనికాముఖమునం దంతటను, అవష్కందన మవలంబించి సేల విడిచి సాముచేయదలచుకొన లేదు. మిత్రమండలి యట్టి సంక టస్థితియందు వివేకమును దూర దృష్టిని చూపుట సంతృప్తి కరము. సలోనికాయందలి తమ సేనల రక్షణమే మిత్రమండలి ప్రథమకర్తవ్య మయ్యెను. గ్రీసు వారి నౌకాదళమును, మిత్ర మండలి స్వాధీనము చేసికొని, ఫిరంగులనుకూడ తమ వశము చేయుటకు కోరగ గ్రీసువారు నిరాకరించిరి. దానికి ప్రతిక్రి యగ మిత్రమండలిసేనలు ఏథె న్సు పట్టణము చేరెను. దానిమీద గ్రీకులు మిత్రమండలిసేనను ముట్ట డించిరి. ఉభయపక్షములకును, చాల నష్టము కలిగినది. గ్రీకులకు బుద్ధివచ్చి మిత్రమండలి చెప్పినట్లు వినుటకును తామిదివరకు చేసిన తప్పిదమునకు పరితపించుటకును మిత్రమండలి, గ్రీసువ్యాపార మును నిరోధించినది. తిండితిప్పలు లేక గ్రీసు ప్రజలకు వేడిపుట్టుట కారంభించిన వెనుక మిత్రమండలి కోరిన షరతుల కొప్పుకొనిరి. గ్రీసువ్యవహారము పూర్తిగ పరిష్కరించుకొను వరకును సలోనికా యందలి మిత్రమండలిసేన నిరపాయస్థితియం దుండునని నమ్ముటకు వీలులేదు.

ఆగస్టుమాసమునందు రుమేనియా మిత్రమండలి పక్షము చేరి నది. కాని వారిప్రవేశమువలన బాల్కనురంగమునందు మిత్రమండలి ప్రతిభ హెచ్చి శత్రువులు పతితు లగుదురని కలిగిన నమ్మకము సిద్ధించి యుండలేదు. సర్వియా మాంటెనిగ్రోలకు గలిగిన దురవస్థయే రుమే నియాకును పట్టినది. కాని ఒక విషయము మాత్రము సంతోషాస్పదము. శత్రువు సర్వియా మున్నగు దేశముల నాక్రమించుకొనగలిగినను తద్దే శపు సేనలను సంహరింపలేక పోయినట్లుగనే రుమేనియా దేశపు సేనలు శత్రుముఖమునుండి తప్పించుకొని బయటపడినవి. రుమేనియా ప్రస్థానమునకు విఘ్నము కలుగుటకు రెండు కారణము లున్నవి. రుమే నియనులు ట్రాన్సిల్వేనియా ప్రస్థానమునమున కిచ్చినంత ప్రాముఖ్యమును డబ్రుజా ప్రస్థానమున కియ్యక, డబ్రుజారక్షణమును నిర్లక్ష్యముచేసిరి. సమయమునకు వాను మెకెన్సను డబ్రుజాయందు ప్రవేశించి రుమేనియ నుల యుద్ధప్రస్థానమునకు భంగము కలిగించినప్పుడు వారు తమ లోప మును కనిపెట్టి ట్రాన్సిల్వేనియాయందు యుద్ధము చేయుచున్న సైని కులనేగాకను, అక్కడ రక్షణమున కవసరమైన వారినికూడ డబ్రుజా పంపించిరి. ఇందువలన డబ్రుజాయందు మెకన్సెను గమన మునకు నిరోధము కలుగలేదు. సరికదా ట్రాన్సిల్వేనియా యందు వారిరక్షణబలమున్న గిలి శత్రుసేనలముందర నిలువలేక రంగమంతయు



జర్మను విమానమును నాశనముచేసి సముద్రములో బడద్రోయుట

చెడిపోయినది.

రుమేనియా యుద్ధము ప్రారంభించిన నెలదినములకు ట్రాన్సిల్వేనియా కొండకనుమలను దాటి ట్రాన్సిల్వేనియాయందు ప్రవేశించి మూడవవంతు భాగమును పట్టుకొనినది. ఓర్సోవా పట్టణమును రుమేని యనులు పట్టుకొనుటచే శత్రువులు డాన్యూబు నదియందు స్టీమరులను

తిప్పుటకు వీలులేకుండ పోయినది. ట్రాన్సిలువేనియా ప్రస్థానము మున్ముమ్మరముగ జరుగుచున్నపుడు శత్రువులను వెనుకకు మరలించి వారిని ఓడించుటకు జర్మనులు సంకల్పించి ట్రాన్సిలువేనియాకు ఫాల్కెను హేయను డబ్రుజాకు మెకన్సనును పంపించిరి. డబ్రుజాయందు రుమేనియనులు విశేష సైన్యమును ఉంచినట్లు లేదని పైన సూచించితిమి. డబ్రుజాకు టుర్టుకాయి ముఖ్యస్థానము. టుర్టుకాయియందు దుర్గము కలదు. ఆ దుర్గమునందు సైనికులును గలరు. కాని మెకన్సను కొట్టిన మొదటి దెబ్బతో టుర్టుకాయి పడిపోయినది. దుర్గము జర్మనుల వశమైనది. సైనికులను విజేతలు బందీలుగ పట్టుకొనిరి. తరువాత సిలిస్ట్రియాను జర్మనులు పట్టుకొనిరి. డబ్రుజాయందు మెకన్సనునకు కలిగిన విజయము వలన రుమేనియనులదృష్టి ట్రాన్సిలువేనియానుండి మరలి దానిరక్షణమునకై చాల సేనను పంపించిరి. అంతటితో ట్రాన్సిలువేనియాయందు సమయముకొరకు కనిపెట్టుకొని యుండిన ఫాల్కెనుహేయకు దానితో వారి పనిపట్టుటకు తరుణము కలిగినది. తానింతవరకును సిద్ధము చేసిన పెద్దపెద్దఫిరంగులను సైనికులను ఫాల్కెనుహేయ శత్రువులమీద ప్రయోగించినప్పుడు వారింతవరకును అవలంబించిన అవస్కందన తంత్రమును విసర్జించి రక్షణతంత్రము నవలంబింపవలసివచ్చెను. తరువాత రుమేనియనులు కనుమలనుకూడ త్యజించినప్పుడు జర్మనులు వలేషియాను దండెత్తి దానిని స్వాధీనము చేసికొనిరి. రాజధానీ నగరము బుఖారెస్టు శత్రువులవశమైనది. కాన్‌స్టాంజారేవుతో డబ్రుజా నంతయు విజేతలు పట్టుకొనిరి. రుమేనియా పతనమువలన బాల్కను రంగమునందు శత్రువుల గమనాగమనములు బలపడినవి. రుమేనియా బల్గేరియామీదను దండెత్తునను భయము పోయినది. రుమేనియాయందు కూడ శత్రువు పీఠము వేసికొని తన నిరంకుశపాలనము జరుపుటకు వీలు కలిగినది. సలోనికారంగ మునందు మిత్రమండలి మొనాస్టీరు పట్టణమును స్వాధీనము చేసికొనిరి.

1916 వ సంవత్సరమునందు జట్లండు సమీపమునందు జర్మను నౌకాదళమునకు ఆంగ్లేయ నౌకాదళమునకు జరిగిన పెద్దయుద్ధమునందు జర్మను నౌకాదళమునకు విశేషనష్టము కలిగించి, ఆంగ్లులు విజయము గాంచిరి. జర్మను నౌకాదళ ముత్తరాభిముఖముగ వచ్చుచుండ, మే 31-వ తేది మధ్యాహ్నము ఆంగ్ల నౌకాధ్యక్షుడు అడ్మిరలు బెట్టీ 6 మైళ్ల దూరమునుండి శత్రునౌకలను చూచి వెంటనే శత్రువులతో కలియబడెను. ఆరంభమునందు అడ్మిరలు బెట్టీనాయకత్వము క్రిందనుగల నౌకలకును జర్మను మూలబలమునకును యుద్ధము జరిగి కొన్ని ఆంగ్లనౌకలు మునిగిపోయినవి. తరువాత ఆంగ్లుల మూలబలము వచ్చి శత్రువుల కమితనష్టము కలిగించి వారి నౌకలను ముంచి మిగిలిన వానిని తరిమివేసినవి. రాత్రి జర్మనునౌకాదళము తోకముడిచి తన నౌకాశ్రయమును చేరినది. మరునాడు శత్రునౌకలు సముద్రమునందు దృగ్గోచరము కాకుండుటచే ఆంగ్లనౌకాదళము స్వస్థానము చేరుకొనెను. సర్వసముద్రాధిపత్యము ఆంగ్లుల వశమందుండువరకును జర్మను నౌకలు శత్రువులను కన్నెత్తి చూడజాలవు.

## 1917-వ ప్రస్థానము

పింగళనామ సంవత్సర మన్నివిధముల మిత్రమండలికి మంగళప్రదము, శత్రుమండలికి ప్రతికూలము. యుద్ధారంభమునం దుండిన యుభయపక్షముల స్థితిగతులు నిప్పుడు తారుమారైనవి. యుద్ధారంభమునందు జర్మనుల కపారమైన సైన్యము కలదు. యుద్ధద్రవ్యము లుండెను. అపారమైన కార్యోత్సాహము కలదు. మొదటి రెండు సంవత్సరములందును జర్మనులకుండిన కార్యోత్సాహమును, సైన్యమును, యుద్ధద్రవ్యములును, వా రుపక్రమించిన విజయయాత్రలందు వినియోగపడినవి కాని, విజయోత్పాదితమగు స్థితి వారి కేర్పడియుండలేదు. ప్రకృతము జర్మనుల యాధిక్యమేమయినది? వారి సైనికబలము తరిగిపోయినది. యుద్ధద్రవ్యములు క్షీణించినవి. రణోత్సాహము సన్నగిలినది. యుద్ధప్రారంభమునందు మిత్రమండలికి ఆధునికయుద్ధములకు తగిన సైన్యములు లేవు, శతఘ్నులు లేవు. మిత్రమండలి ప్రస్తుతస్థితికిని పూర్వస్థితికిని సాదృశమైనను లేదు. మిత్రమండలి కిప్పుడు నూతసైనికులు సుశిక్షితులై రణరంగము ప్రవేశించిరి. నూతన శతఘ్నులు తండోపతండములుగ యుద్ధభూమి నలంకరించినవి. సర్వరంగములందును, మిత్రమండలి సైనికులు విజయోత్సాహప్రపూర్ణులై యున్నారు. ఆంగ్లులు సర్వలక్షణలక్షితమైన అవస్కందనోపక్రమణమునకు సిద్ధ



ఉత్తరసముద్రమునందు జర్మను టార్పిడో పడవ మునుగుట.

మై యున్నారు. వర్డను దుర్గావళులయొద్దను ప్రదర్శించిన శౌర్యప్రతాపములను పరాసులు పనిపట్టినప్పుడు చూపగలరు. రష్యనుల



బరిసుగాస్తు ముందుకువచ్చి 4 గురు జర్మను సిపాయిలను చంపుట.

విజయకాంక్షకు వారిజాతీయప్రబోధము సాహాయ్యకారి గాగలదు. ఇటలీవారు శత్రువులను భంజించుచున్నారు. మిత్రమండలిస్థితిగతు లిట్లుండ శత్రుమండలి విజయోత్సాహము తగ్గి పరాజయము దర్శనమగుచున్నది. యుద్ధ మెంత కాలము జరుగునో తమ కెప్పుడు పరాజయము ప్రాప్తించునో యని వారు భయభ్రాంతులై యున్నారు. జర్మను ప్రజల, సైన్యముల పరాజయ విహ్వలత్వములును మిత్రమండలి విజయోత్సాహమును, ప్రకృతపు యుద్ధవ్యవస్థకు కీలకములు.

జర్మనులు సునాయసముగ లొంగిపోయి తమ పరాజయము నొప్పుకొందురని తలచుట భ్రమ. జర్మనుల దేశాభిమాన మద్వితీయము. వారి రణకౌశల మపారము. వారి కార్యనిర్మాణశక్తి విశేషము. వారి శిక్షణము ప్రశంసనీయము. వారియందు నిబిడీకృతములై యున్న గుణసంపద విపదదశయందు వారికి తోడ్పడక మానవు. కాని వారి ప్రయత్నమునకు మించిన ప్రయత్నమును, వారి త్యాగమునకు మించిన త్యాగమును మిత్రమండలి చేయవలసి యుండును. ప్రస్తుతయుద్ధమునందు, మిత్రమండలి కార్యభారము గురుతరమైనది కాని లఘుతరమైనది కాదు. పింగళసంవత్సర ప్రస్థానము వారు పూనిన కార్యభారమునకు తార్కాణము.

పింగళ సంవత్సర యుద్ధప్రస్థానము నూతనరూపమును దాల్చినది. ఇంతవరకును పశ్చిమరంగమునందు సేనాముఖమునం దంతటను సంగ్రామము జరిగియుండలేదు. పశ్చిమరంగమునం దుభయపక్ష సేనాముఖమును కొంచెమించుమించుగ 400 మైలుల దూరమువరకును వ్యాపించియున్నది. ప్రస్తుత మక్కడ, 56 మైలుల ముఖమునందు యుద్ధము జరుగుచున్నది. కాని ప్రస్తుతపు స్థితి ముందును నుండనుటకు వీలులేదు. మిత్రమండలి ఆ 56 మైలుల ముఖమునందే యుద్ధముచేసి తక్కిన ముఖమునందు మౌనముతోనుండునా? శీఘ్రముగ శత్రువులకు పరాజయము కలుగుటకు మిత్రమండలి సేనాముఖమునం దంతటను, తాకి వారికి గుక్కతిరుగకుండ చేయవలసి యుండును. అట్టి రణతంత్రమును మిత్రమండలి యవలంబించినప్పుడు వారి సర్వతోముఖమైన యవస్కందనము ఫలప్రదమై శత్రువులకు సంపూర్ణమైన పరాజయము సిద్ధించును. ప్రస్తుతపు స్థితిగతులను సింహావలోకనము చేసినప్పుడు మిత్రమండలి యాస్థితి నిదివరకే యతిక్రమించిన దనియు, సమయ మాసన్నమైనప్పుడు ఆతంత్రమును వారు పూర్ణముగ శత్రువులపై ప్రయోగింపగలరనియు విదితము కాగలదు.

గతవత్సరము జూలై మొదలు, నవంబరువరకును సోమునదీతటమునందు, ఆంగ్లపరాసులకు కలిగినవిజయ మిప్పుడు జర్మనులకు వికటించి వారికి మిత్రమండలి యుద్ధప్రస్థాన ప్రాబల్యము వ్యక్తమైనది. ఎంతటి కౌశలముతో కట్టినకందకము లైనను ఆధునిక శతఘ్నులతాకుడుకు నిలువక చూర్ణము కాగలవని సోము యుద్ధము వ్యక్తముచేసినది. సైనిక శరణ్యములగు కందకములే నిలువజాలనప్పుడు సైనికులకు రక్షణ యెక్కడిది? భిన్నభిన్నములైన కందకములందుండి రక్షణము నవలంబించినప్పుడు, అవస్కందనతంత్రావలంబకులకంటె రక్షణతంత్రావలంబకులకే విశేషనష్టము కలుగగలదనియును వ్యక్తమైనది. సోము యుద్ధమువలన కలిగిన యనుభవములకు జర్మనులు విముఖులై యుండ



శత్రుకందకములలోనికి వారి బాంబులను వారిమీద తిరిగి వేయుట.

లేదు. అక్కడ ఆంగ్లపరాసులకంటె వారికే విశేషమైన నష్టము కలిగినది. సోము ప్రస్థానమునకు పూర్వముండిన స్థితిగతులలోనే ప్రకృతమునుండి యుద్ధముచేసినయెడల తమ కమితనష్టమును చివరకు

పరాజయమును కలుగుట తథ్యమని గ్రహించి అట్టివిపద్దశనుండి తప్పించుకొనుటకై తమ దురాక్రమణమును మానుకొని పశ్చిమరంగము నందు జర్మనులు మఱ్ఱిముఖము పెట్ట నారంభించిరి.

అంకరునది కిరుపార్శ్వములందు ఆంగ్లసైనికులకు కలిగిన విజయము జర్మనులు తిరుగుముఖము పెట్టుటకు తాత్కాలిక కారణము.



యుద్ధరంగమునందు సైనికులకు మార్గము చూపుచున్న విద్యుచ్ఛక్తి దీపములు. ఫ్రెంచి విమానములు బాంబులను వేయుట.

జర్మనులు స్వదేశోన్ముఖులగుదురని చాలకాలము క్రిందటనే వదంతులు బయలు దేరెను. ఫిబ్రవరి 24-వ తేది స్థిరవాసరముతో నది ప్రవహించి పోయి నది. సోముతటమునందలి బలీయస్థానమగు గామికోరను గ్రామమును జర్మనులు త్యజించుటతో వారితిరుగుముఖము ప్రారంభమయ్యెను. మిత్రమండలి సైనికులు శీఘ్రవేగముతో ముందుకువచ్చి బాపాము పెరోను మున్నగు ప్రదేశముల నాక్రమించుకొనిరి. కాంబ్రయి సెయింటు క్వెంటిను ముఖమునందు జర్మనులు ప్రస్తుతము నిలిచి యుద్ధముచేయుచున్నారు. మిత్రమండలిసైనికు లా ప్రదేశమును సమీపించి, శత్రుస్థానములను బాధుచున్నారు. శత్రువులు వెనుకకు పోవునప్పుడు సర్వమును ధ్వంసము చేయుచున్నారు. గమనాగమనసాధనములైన బాటలను లోహమార్గములను పంతెనలను బాగుచేసికొని, మిత్రమండలి జోరుగ ముందుకు పోవుటకు కొంతకాలము పట్టును. 2 మైలుల దూరమునందు 12 మైళ్లవరకును శత్రువులు వెనుకకు పోయిరని తెలియుచున్నది.

ప్రస్తుతావస్థయందు జర్మనుల రణతంత్రమును, పూర్తిగ గ్రహింపజాలము. జర్మనులు తిరుగుముఖము పెట్టుటకు కారణమేమై యుండినను, సోముతటమునందు వారు నిలువజాలక పోయిరని మాత్రము నమ్మవలసి యున్నది. 1917 వ సంవత్సరారంభమునందుండిన స్థానము లందుండి జర్మనులు తమ సేనాముఖమును రక్షించుకొనజాలమని గ్రహించి యుందురు. సేనాముఖమును సంకుచితము చేయుటవలన సైనికులును, యుద్ధద్రవ్యములును కొంతవరకు కలిసివచ్చి రక్షణము సులభసాధ్యమగునని కూడ వారు తలచి యుందురు. ఇది యథార్థమగునో కాదో ముందు చూడవలసియున్నది. జర్మనుల నాశ్రయించుకొనిన ఆస్ట్రియా, బల్గేరియా, టర్కీలకు వారు ముందు విశేషసాహాయ్యము చేయవలసియుండును. మెసపొటేమియాయందు తురుష్కులకు సంపూర్ణమైన పరాజయము కలిగించి ఆంగ్లలు కుటెల్ అమారాను గాకను సుప్రసిద్ధపట్టణరాజమగు, బాగ్దాదును పట్టుకొని 30 మైళ్లు ముందుకుపోయిరి. బల్గేరియాను భంజించుటకు, సలోనికాయందలి మిత్రమండలి సేనలు ముందుకు దుముకుచున్నవి. రష్యను సేనలు నవోత్సాహముతో శత్రువులను గవియుటకు సమయము నెదురు చూచుచున్నవి. జర్మనుల నాశ్రయించుకొనిన వా రిప్పుడు కేవలము స్వశక్తినే నమ్ముకొని, తమకు పరాజయము సిద్ధింపకుండ చేసికొనజాలరు. సంగతిసందర్భము లిట్టి విషమస్థితికి వచ్చినవి. తమ ఆశ్రితుల పరాజయము తమ పరాజయముగ పరిణమించునని నమ్మిన జర్మనులు వారిసాహాయ్యార్థ మీయెత్తును పన్నినపన్నియుండవచ్చును. పశ్చిమరంగమునందు సంపూర్ణమైన రక్షణతంత్రము నవలంబించి ఇతర రంగములందు అవస్కందన మారంభించి, శత్రువులను భంజింపవలయునను సంకల్పము జర్మనుల కుండినను నుండవచ్చును. చాలకాలమునుండి జర్మనుల కన్ను పీటర్సుగ్రాడు, కీవ్ పట్టణములమీద పడియున్నది. ముందు జరుగు సంగతులను ప్రస్తుతసందర్భముబట్టి మనము యూహించుదుమే కాని యథార్థముగ నెట్లు చెప్పగలము? ప్రస్తుతపు విషమదశయందు జర్మను లేమి చేయుదురను సమస్య తల యెత్తినది. ఆ సమస్యాపరిష్కారమునకును యుద్ధపర్యవసానమునకును సన్నిహితసంబంధము కలదు. గత వత్సర ప్రస్తావపు టుదంతమునందు అమెరికా ప్రశాంతస్వర్గము ననుభవించుచుండె నని తెలిపియుంటిమి. కాని అప్పటికిని ఇప్పటికిని స్థితిగతులు చాల మారిపోయి అమెరికావారు యుద్ధసన్నద్ధులగుచున్నారు. అమెరికావారు మిత్రమండలితో



రైలుమార్గములు కలియుచోట ఫ్రెంచి విమానములనుండి బాంబులు పడద్రోయుట.

కలిసి పనిచేయుటకు కృతనిశ్చయులైరి. 1917 వ సంవత్సరమునందు యుద్ధము ముగిసి మిత్రమండలికి విజయము కలిగి శాంతి స్థాపితమై లోకమునకు మంగళప్రద మగును గాక!

# చిత్రపటముల వివరణము

## గౌ. సర్ రాబర్టు క్లెగ్గు గారు

కే. సి. ఐ. ఇ. బిరుదప్రదానమున సత్కరింపఁబడినవారు మన రాజధానిలో అరుదు. అట్టి యసాధారణబిరుదాంకమును స్వసామర్థ్యమువలన సంపాదింపఁగలిగిన వీరు ప్రత్యేకప్రశంసాపాత్రు లనుట యనావశ్యకము. వీరు పరీక్ష యిచ్చిన ప్రథమదేశభాష ద్రావిడము; కావుననే వీరు తొలుదొల్త దక్షిణమండలములలో నుద్యోగము చేసియున్నారు. వీరి ద్వితీయదేశభాష యాంధ్రము. వీరు మండలాంతరములలో స్వసామర్థ్యమును నిరూపించిన యనంతరము కడప గోదావరి కృష్ణా కర్నూలు నెల్లూరు జిల్లాలకు బదలాయింపఁబడి ప్రజారంజకముగా పనిచేసియున్నారు. తరువాత వీరు రివిన్యూ బోర్డు మెంబరుగా నియోగింపఁబడి ప్రస్తుత మందే మొదటి మెంబరుగాను ల్యాండు రివిన్యూ కమీషనరుగాను పనిచేయుచున్నారు.

## గౌ. ఎఫ్. ఎచ్. డబిల్యూ. గిల్మను గారు

వీరి స్వస్థలము ఐర్లండు; వీరు చాల కాలము ఇంగ్లండునందు చదివి ఐ. ఎమ్. ఎస్. పరీక్షలో కృతార్థులై మన రాజధానికే వచ్చి పనిలో ప్రవేశించిరి; ఆరంభదశలో ఫారెస్టు డిపార్టుమెంటు డైరక్టరుగాను పోలీసు ఇనస్పెక్టరు జెనరలుగాను పనిచేసియుండిరి. వీరు క్రొత్తగా సర్ హెగల్డు స్టువర్టు గారి స్థానమున ప్రభుత్వకార్యనిర్వాకసభాసభ్యులుగా నియోగింపఁబడక పూర్వము రివిన్యూ బోర్డు మెంబరుగా పనిచేయుచుండిరి. వీ రీ యుద్యోగముతోఁబాటు సాంగ్రామికసేవా శాఖలో కూడ పనిచేయుచున్నారు; లెప్టినెంటు కలనల్ గిల్మను గారు ప్రస్తుతము మద్రాసు వాలంటీరు గార్డుల అఫీషియేటింగు కమాండెంటుగా నున్నారు. వీరు విశాఖపట్టణము జిల్లా కలెక్టరుగాను అనంతరము విజయనగరము సంస్థానము ఏజెంటుగాను చాలకాలము పనిచేసి ప్రజారంజకు లని ప్రసిద్ధివడసియున్నారు; వీరు పరీక్షయం దుత్తీర్ణు లయిన దేశభాషలలో మొదటిది యాంధ్రము. వీరు పరీక్షకసంఘాధ్యక్షులుగ నుండుట వీరిభాషాప్రావీణ్యమునకు సూచకము. వీరికి విశేషించి యాంధ్రభాషయం దభిమానము కూడఁ గల దని తెలియవచ్చుచున్నది.

## గౌ. పి. రాజగోపాలాచారి గారు

గౌ. దివాన్ బహదూరు పి. రాజగోపాలాచారి, సి. ఐ. ఇ., గారు ఎమ్. ఏ., బి. ఎల్. పరీక్షలం దుత్తీర్ణులై ప్రభుత్వసేవలో ప్రవేశించిరి. వీరు జిల్లాజడ్జిగా నుండి అనంతరము కర్నూలు జిల్లాకలెక్టరుగా నియోగింపఁబడిరి; కొంత కాలము సహకారసంఘముల రిజస్ట్రారుగా నుండిరి, పిమ్మట కొచ్చిన్ తిరువాన్కూరు రాజ్యములలో దివానుగా పనిచేసిరి; తరువాత జ్యూడిషల్ డిపార్టుమెంటులో గవర్నమెంటు సెక్రటరీగా నుండిరి. ఈ పదవినుండియే వీ రిపుడు గౌ. సర్. పి. ఎస్. శివస్వామయ్యరు, కే. సి. ఎస్. ఐ., సి. ఐ. ఇ. గారి స్థానమున ప్రభుత్వకార్యనిర్వాహకసంఘసభ్యులుగా నియోగింపఁబడి పనిచేయుచున్నారు; ఈ క్రొత్తయుద్యోగము రానియెడల, కడచిన మార్చి నెల 18-వ తేదిని రిటైరు కావలసినవారు. చిరకాల ముద్యోగము చేసినందుకు వీ రీపదవివలన సత్కరింపఁబడుట ప్రశంసనీయము. వీరు రెండు పర్యాయము లింగ్లండునకు వెళ్లి వచ్చియున్నారు; మధ్యధరాసముద్రమధ్యమున టార్పిడోతో కొట్టఁబడిన 'కోమగాతమారు'నందు వీరు ప్రయాణము చేయుచుండిరఁట. వీరి నీ భయోత్తమమైన యాపద నుండి వీరి మతవిశ్వాసమే కాపాడిన దని వదంతి కలదు. గోపాలాచారి గారు శుద్ధశ్రోత్రియబ్రాహ్మణు లని తెలియవచ్చుచున్నది.

## గౌ. ఎస్. శ్రీనివాసయ్యంగారు

వీరు విద్యార్థిదశనుండియు ప్రతిభాశాలులుగా ప్రశస్తిగాంచినారు. ఆంగ్లభాషాపరీక్షయందు రాజధాని కంతటికి అగ్రగణ్యులుగా కృతార్థులైనందుకు క్రైస్తవకళాశాలవారు వీరి కొక బంగారు పతకమును బహుమానముగా నొసంగిరి; అర్థశాస్త్రపరీక్షయం దగ్రగణ్యులుగా కృతార్థులైనందుకు చెన్నపురి విశ్వవిద్యాలయమువారు మరియొక బంగారు పతకము నొసంగిరి. వీరు కీర్తిశేషులైన సర్ ఎస్. వి. భాష్యమయ్యంగారి యల్లుడు; వారియొద్ద నే వకీలుపని నేర్చుకొనిరి. న్యాయవాదివృత్తియందు నిరుపమానసామర్థ్యమును వ్యక్తీకరించిన వీరిని ప్రభుత్వమువారు అడ్వొకేటు జెనరలుగా నియోగించి గౌరవించియున్నారు. వీరు హైందవార్థికశాస్త్రపరీక్షలో అగ్రగణ్యముగా కృతార్థులైన వారికి బహుమానము లొసంగు నిమిత్తము చెన్నపురి విశ్వవిద్యాలయము వారికి రు 10,000 ల విరాళము నొసంగినారు; కాశీవిశ్వవిద్యాలయమునకు రు 10,000 ల సాయము చేసినారు. వీరు చెన్నవిశ్వవిద్యాలయసభ్యులు, సంస్కరణప్రియులు; ప్రజాహితకార్యములందు వీరి పేరు తఱుచుగా కానవచ్చుచుండును.

## వేపా రామేశము పంతులు గారు

వీరి స్వస్థలము విశాఖపట్టణము. వీరి విద్యార్థిదశ యప్రతిమానము. వీరు చిరకాలమునుండి చెన్నపురిలో సుప్రసిద్ధన్యాయవాదులుగా నున్నారు. వీరి గ్రహణధారణకల్పనాశక్తులు నిరుపమానములు. వీ రిటీవల విశ్వవిద్యాలయసభ్యులుగా నెన్నుకొనఁబడుటయు ప్రభుత్వపక్షమున న్యాయవాదిగ నియోగింపఁబడుటయు వీరి సామర్థ్యాతిశయమునకు ప్రత్యక్షనిదర్శనములు.

## కొప్పరపు వేంకటకృష్ణరావు గారు

వీరు డిస్ట్రిక్టు మునసబు పనిచేసి నెల్లూరు మున్నగు పురములందు పురపాలకాధ్యక్షులను ఒంగోలునందు తాలూకా బోర్డు ఉపాధ్యక్షు

తను వహించి కీర్తిశేషు లైన కొప్పరపు రామారావు పంతులు గారి దత్తకుమారులు. వీరు సహకారసంఘనిధుల పనులను నిపుణముగా నిర్వహించి ప్రభుత్వసన్మానమునకు పాత్రు లైరి; ప్రస్తుతము ఒంగోలు పురపాలక సంఘమున కధ్యక్షులుగ నెన్నుకొనఁబడి పురపాలన కార్యనిర్వహణమున ప్రజల కృతజ్ఞతకు పాత్రు లగుచున్నారు. ఇంతటి చిన్న వయసున ఇంతటి ఘనకార్యములు గావించుట ప్రశంసనీయము.

## రావు సాహేబు కలువల కణ్ణను శ్రేష్ఠి గారు

వీరు చెన్నపురియందలి యార్యవైశ్యప్రముఖులలో ప్రముఖులు; పౌరప్రముఖులలో పరిగణ్యులు. లక్ష్మీపుత్రు లగు వీరును వీరి యనుజు లగు ఇప్పటి ప్రధానపౌరులు రావు సాహేబు రామానుజము శ్రేష్ఠి గారును అవిభక్తసోదరు లయ్యును, దానధర్మములం దప్పుడప్పుడు విడివడి యొండొరుల మించున ట్లుందురు. వీరి యౌదార్యాతిశయ మప్రతిమానము. దీనిని పురస్కరించుకొనియే, 'భారతయుగంబున కర్ణుఁ డొకఁడే యుండ, ఈ యుగంబున మన కిరువురు కర్ణు లేర్పడినా' రని ఇచటి ప్రజలు పరిపాటిగా చెప్పుకొనుచుందురు. పాశ్చాత్యవర్తకసంఘములతోఁ బాటు పని చేయుచున్న కింగ్ కంపెనీకి వీరు యజమానులు. పచ్చప్ప కళాశాలను సాశ్రమకళాశాలగా మార్చు నిమిత్త మిచ్చెద మన్న లక్షరూప్యముల విరాళము, నుంగంబాకమునందలి యాయుర్వేద ధర్మవైద్యాలయము, జార్జిటౌనునందలి బాలికపాఠశాల మొద లగు ధర్మములు వీరు సోదరు లుభయులును కలసి చేసిన వానిలో ప్రధాన మైనవి. కణ్ణనుశ్రేష్ఠి గారు ప్రత్యేకముగాఁ గావించిన ప్రధానధర్మకార్యములలో మైలాపూరునందలి సంస్కృత కళాశాల, తిరువల్లిక్కేణియందలి యాయుర్వేద ధర్మవైద్యశాల, విక్టోరియా క్యాస్టు & ఘోషాసుపత్రిలో పది పడకల యేర్పాటు, తిరువళ్లూరు మధ్యమ పాఠశాల, చింతాద్రిపేట యందలి బాలికాపాఠశాల, తిరువళ్లూరునందును తేనాముపేట యొద్దను రాయపురములోను జార్జిటవునునందును గల రాత్రిపాఠశాలలు మున్నగునవి ప్రశంసాపాత్రములు. ఇవి యన్నియు న టుండ, బిడ్డల కావుపా లిచ్చు నిమిత్తము వీరు తిరువల్లిక్కేణిలో ప్రతిష్ఠించిన ప్రతిష్ఠాపనమును, జంతుహింసానివారణసంఘమునకును చెన్నపురి యన్నదానసమాజమునకును వీరు ధారాళముగా నొసంగెడి వార్షిక విరాళమును, కృష్ణమ్మనాయని యగ్రహారమునందలి పేదల వసతిగృహమును వీరి సాధారణదానధర్మములందు పేర్కొనఁదగినవి. ఇంత యేల? ఏ విధముగనో యొక విధముగ వీరి సాహాయ్యమునో యాజమాన్యమునో పొందని ధర్మప్రతిష్ఠాపనము గాని తదితరప్రతిష్ఠాపనము గాని యీ పట్టణమందు లేనే లే దని చెప్పవచ్చును. వీరి యౌదార్యము కేవలము స్థానికమే కాక, ఔచిత్యానుకూల్యములను బట్టి యెంత దూరమైనను వ్యాపించుచుండును. కాశీవిశ్వవిద్యాలయమునకు వీ రొసంగిన యుదార విరాళమే దీనికి నిదర్శనము. వీరి సభ్యతాదులచే గౌరవింపఁబడని ప్రతిష్ఠాపనమే లే దన్నచో, వీరు పచ్చప్ప ధర్మప్రతిష్ఠాపనమునందును కన్యకాపరమేశ్వరీధర్మస్థానమునందును ధర్మకర్తలనియు చెన్నపురాంధ్రసభ యుపాధ్యక్షు లనియు వివరించుట యనావశ్యకము. వీరి యీ మహోత్కృష్టదానధర్మములే వీరి భూతదయను అసమానవిద్యాభిమానమును దీనావనాసక్తిని ఉదారదానశీలమును సర్వసమబుద్ధిని తదితర నానా సుగుణగణంబును వేనోళ్ల నుద్ఘోషించుచున్నవి. వీరి కార్యదక్షతకు కింగ్ కంపెనీ ప్రత్యక్షసాక్షి. వీరియం దిట్టి యసాధారణ మైన లక్షణము లుండుటను బట్టియే ప్రభుత్వమువారు వీరిని రావుసాహేబు బిరుదాంకముచే గౌరవించిరి.

## రావు సాహేబు కలువల రామానుజశ్రేష్ఠి గారు

ప్రత్యేకముగా ప్రకటింపఁబడిన ప్రధానపౌరప్రశంసయందు వీరి విషయము విపులముగా ప్రస్తావింపఁబడియున్నది. (చూ. పుట 249.) వీరు తమ యవిభక్తాగ్రజు లగు రావు సాహేబు కణ్ణను సెట్టి గారితో కలసి చేసిన వివిధదానధర్మములు న టుండ, వీరు ప్రత్యేకించి స్వయముగాఁ గావించిన మహోత్కృష్ట ధర్మకార్యములందు పెరుంబూరు పరశువాక మున్నగు పాఠశాలలును విద్యార్థినీవేతననిధియు తంబుసెట్టి వీధియందలి యార్యపాఠశాలయు ప్రధానములు. ప్రభుత్వమువారు వీరికి రావు సాహేబు బిరుదు నొసంగుటయే కాక వీరిని ప్రధానపౌరపదవీప్రదానముచే గౌరవించుట చూడ, వీరి యౌదార్యాదిసుగుణగణంబు లెంత ప్రశంసాపాత్రములో స్పష్టపడఁగలవు.

## పొత్తూరి అయ్యన్న శ్రేష్ఠి గారు

వీరు చెన్నపురియందలి యార్యవైశ్యప్రముఖులలో నొకరు. ఆంధ్రాంగ్లేయాదు లగు బహుభాషలందు వీరికి పరిచయము కలదు; విద్యాభిమానము మెండు. ఆర్యావర్తదేశయాత్రవలన వీరికి కలిగిన ప్రపంచజ్ఞానము ప్రబలము. వివిధము లగు స్వదేశవస్త్రముల మాదిరులు గల విదేశవస్త్రములను తెప్పించి వాని తక్కువ వెలలను బట్టి జనసామాన్యమునకు సైతము క్రొత్తక్రొత్త మాదిరుల వస్త్రములను ధరించు కుతూహలమును తీర్చుటయే గిడ్డంగివీధియందలి వీరి వ్యాపారము యొక్క విశేషలక్షణము. పూర్వ మొకప్పుడు జరగిన పారిశ్రామిక విచారణయందు వీరి యభిప్రాయము లంగీకరింపఁబడుటయే వస్త్రపరిశ్రమయందు వీరికిఁ గల దక్షతకు ప్రత్యక్షనిదర్శనము. దయాదాక్షిణ్యములు ధర్మపరత్వము గోబ్రాహ్మణదైవభక్తి పాత్రోచితదానశీలము కార్యనిర్వహణదీక్ష దేశాభిమానము మున్నగు వీరి గుణవిశేషములు ప్రశంసాపాత్రములు. వీరి యాజమాన్య సాహాయ్య సభ్యత్వాది సంబంధ మేదో యొకటి ఇచటి పెక్కు ధర్మప్రతిష్ఠాపనలకును సభలు క్లబ్బులు మున్నగు నితరప్రతిష్ఠాపనలకును గల దన్నచో, వీరు చెన్నపురాంధ్ర సభా ధర్మకర్తలలో నొక రని చెప్పుట విశేషము కాదు. ఇచటి యార్యవైశ్యులందలి పూర్వదురాచారపరాయణులు కొందఱు విద్యాసంపాదనార్థము విదేశముల కేఁగి వచ్చినవారిని సంఘమునుండి బహిష్కరించి బాధించుచుండినపుడు వీరు ప్రతిఘటించి చిరకాలము కష్టనష్టములకు సహించి తమ పలుకుబడివలన ఇతరప్రముఖుల సాహాయ్యసంపత్తిని సంపాదించి యసమాన మైన నైతికవిజయమును గాంచిరి. కావున, యథార్థసంఘసంస్కర్తలలో వీ రొక రనుట కెంత

మాత్రమును సందియమును లేదు. చెన్నపురియందు జరగిన రెండవ యార్య వైశ్య మహాజనసభకు వీ రాహ్వానసంఘాధ్యక్షులై యుండుట కూడ వీరి ప్రముఖతను ప్రజాహితపరత్వమును వేనోళ్ల చాటి యినుమడించు చున్నది.

## కాళ్లకూరి గోపాలరావు గారు

వీరి స్వస్థలము కాకినాడ. ఐనను, వీరు చిరకాలమునుండి చెన్నపురిలోనే యున్నవారు. వీరికి బాల్యమునుండియు సహజమైన కవితాధోరణి గలదు. వీరు తమ 16-వ యేట రచియించిన "నీలికథాసంగ్రహము" ప్రభుత్వమువారిచే 1,2,3 ఫారములకు పఠనగ్రంథముగా నిర్ణయింపఁబడి ఆంధ్రదేశమునందలి పాఠశాలలలో నెల్ల నుపయోగింపఁబడుచున్నది. ప్రకృత రాజదంపతులు వేల్సుయువరాజదంపతులుగా చెన్నపురికి విచ్చేసినప్పుడు వీరు సమర్పించిన "కవితోపాయనము" రాజాంగీకృతమై పత్రికాముఖంబున బహుధా ప్రశంసింపఁబడినది. ఇటీవల ముద్రింపఁబడిన "అపూర్వసంఘసంస్కరణము" వీరి కసమానవిఖ్యాతిని కలిగించినది. వీరిచే సభ్యముగా సంస్కరింపఁబడిన "చంద్రరేఖావిలాపము" జగద్విదితము. "కళ్యాణరాఘవము"ను "వసంతసేన"యు అముద్రితములుగా నున్న వీరి యితరగ్రంథములలో ప్రధానములు. వీరు తొలుదొల్త ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున ఆంధ్రగ్రంథముల వివరణపట్టికను సిద్ధపఱచు సందర్భమున 5 సంవత్సరములు పనిచేసిరి. ఈ ప్రతిష్ఠాపనమందలి యాంధ్రశాఖలోను, పఠనగ్రంథనిర్ణాయక సంఘమందలి యాంధ్రశాఖలోను, కార్యనిర్వాహణభారము సమర్థులగు నాంధ్రులకు మాత్రమే యొసంగఁబడవలెనని వీరు స్వార్థత్యాగపూర్వకముగను ఫలవంతముగను గావించిన యాందోళనము ప్రత్యేకప్రశంసాపాత్రము. వీరి కాంధ్రభాషాభిమాన మధికము; ఇప్పటి యాంధ్రోద్యమపు టంకురములు చిరకాలమునుండియు వీరిని కలవరపఱచుచుండిన వనుట కనేకనిదర్శనములు గలవు. ఆంధ్రసాహిత్యపరిషత్తు స్థాపింపఁబడుటకు చాల ముందే "శబ్దరత్నాకరము" సంస్కరింపఁబడవలసిన విధానమును గూర్చి వీ రొక వ్యాసమును 'ఇండియన్ పేట్రియట్' పత్రికలో ప్రకటించియుండిరి. ఇంచుమించందు సూచింపఁబడిన పద్ధతులమీఁదనే ఇటీవల పరిషత్తువారు నిఘంటు నిర్మాణమునకు కడంగినట్లు తెలియవచ్చుచున్నదని కీ. శే. వేంకటగిరి మహారాజా గారు తమ యభిప్రాయమును వ్యక్తీకరించిరి. గోపాలరావు గారు చెన్నపురాంధ్రసభాప్రతిష్ఠాపకులలో నొకరు. వీరు తమ యుత్సాహ సేవాపరత్వముల కనుగుణముగా చెన్నపురాంధ్రసభయందలి విద్యాశాఖకు కార్యదర్శిగను మద్రాసు యువజన వాఙ్మయసంఘమునకు సంబంధించిన విక్టోరియా ధర్మపఠనమందిరమునకు గ్రంథాలయాధిపతిగను ఎన్నుకొనఁబడియుండుట ప్రశంసనీయము. వీరు ప్రస్తుతము ఆంధ్రపత్రికాసంపాదకీయవర్గమున పనిచేయుచున్నారు.

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

వీ రుభయభాషాపండితులు, కవీశ్వరులు, అవధానులు, కవిరాజ బిరుదాంకితులు; అనేకు లగు రాజులచే సత్కరింపఁబడిన వారు. స్థితిమంతు లగు వీరు తమ యాస్తిని కోల్పోయిన విధము తలపోయ శ్రీనాథుని జీవితము స్ఫురణకు వచ్చుచున్నది. వీ రత్యుత్సాహపురుషులు, కొంత కాలము స్వయముగా రాజమహేంద్రవరమున ముద్రాయంత్రమును నెలకొల్పి కళావతియను మాసపత్రికను ప్రకటించుచుండిరి; ఇటీవల మానవసేవా పత్రికకు సంపాదకులుగ నుండిరి. వీరు కావ్యములు నాటకములు విమర్శనములు మున్నగు గ్రంథము లనేకములు రచియించియున్నారు. గౌతమీమాహాత్మ్యము మొదలైన వీరి గ్రంథములను కళాశాలాపఠనీయములుగ నిర్ణయించి చెన్నపురి విశ్వవిద్యాలయమువారు వీరిని గౌరవించియున్నారు. వీ రిప్పుడు ముక్త్యాల జమీందారు శ్రీ రాజా వాసిరెడ్డి ఎస్. చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దూర్ గారి యాశ్రయానుగ్రహములకు పాత్రులై భారతమును యథామాతృకముగా నాంధ్రీకరించుచున్నారు. అందలి కొంత భాగ మింతవఱకే ప్రకటింపఁబడియున్నది.

## ఏలూరు నారయంత్రాలయమందలి యుద్యోగులు

మొదటి పంక్తియందు కూర్చున్నవారిలో ఐదవవారు మోతే గంగరాజు గారు. వీరు జమీందారులు; ఏలూరునందలి వైశ్యులలోను వర్తకులలోను అగ్రగణ్యులు. ఈ యంత్రాలయము సరిగా పనిచేయకున్న సందర్భములో వీరు దాని నిర్వాహణభారమును వహించి స్వసామర్థ్యమువలన దాని నున్నతస్థితికి తెచ్చిరి. వీ రీ ప్రతిష్ఠాపనమునకు కార్యదర్శిగా నున్నారు. వీరి కుడివైపు కూర్చున్న దొర యంత్రాలయమునందలి ఇంజనీరు; ఎడమవైపు కూర్చున్న చిలుకూరి నరసింహారావు గారు ఈ ప్రతిష్ఠాపనమునకు వ్యవస్థాపకులు, ఆంగ్లేయ కవీశ్వరులు.

## కే. సి. వేంకటరెడ్డి గారు

కత్తి చిన వేంకటరెడ్డి గారు కృష్ణామండలవాసులు. వీరు సామాన్యస్థితిలో రంగూనునకు వెళ్లి స్వయంకృషివల్ల విశేషధనమును సముపార్జించి అచటనే యిపుడు కంట్రాక్టరుగా నున్నారు. వీరి కాంధ్రోద్యమమం దెక్కువ యభిమానము.

## చెలికాని ధర్మారావు గారు

వీరి నివాసస్థలము గోదావరి జిల్లాయందలి చిత్రాడ. వీరు సీమకు వెళ్లి బ్యారిస్టరు పరీక్షలో కృతార్థులై వచ్చినారు. వీరికాంధ్రభాషాభిమాన మధిక మనుటకు ప్రస్తుతము పీఠికాపురమున జరగుచున్న గ్రంథాలయోద్యమము నిదర్శనము.

## ఆర్. వి. ఎస్. చంద్రమౌళీశ్వరప్రసాద్ బహద్దరు గారు

వీరు ముక్త్యాల జమీందారు గారు. వీరి యాంధ్రభాషాభిమాన మసమానము. వీరి ప్రోత్సాహసాహాయ్యములవలన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిపుడు భారతమును యథామాతృకముగా నాంధ్రీకరించి ప్రకటించుచున్నారు. వీరి పూర్వీకు లగు వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారు బంగారుతో తులాభారము తూఁగిన సుప్రసిద్ధదాత. భాషాపోషణము వీరి కుటుంబమునకు సహజము. సంక్రందనవిలాసాదు లనేకగ్రంథములు వీరి పూర్వికుల కంకితము గావింపఁబడియున్నవి.

## లెఫ్టినెంటు తాడేపల్లి శంకరశాస్త్రి గారు

వీరి స్వస్థలము బృందావనపురము (బందరు). వీరి తండ్రిగారు సబ్ రిజిస్ట్రారుగా నుండిరి. వీరు చెన్నపురిలో ఎమ్. బి. సి. ఎమ్. పరీక్షయందు కృతార్థులై పిఠాపురము రాజా గారి సాహాయ్యసంపత్తి వలన ఇంగ్లండునకు వెళ్ళి 6 మాసములలో ఐ. ఎమ్. ఎస్. పరీక్షయందు త్తీర్ణులైరి. ఆ సమయమునకే యూరోపుమహాసంగ్రామ మారంభమగుటవలన వీరు వెంటనే లెఫ్టినెంటుపదవికి నియోగింపఁబడి మెసొపొటేమియా చిత్రాల్ రణరంగములందు అతిసామర్థ్యముతో తమ యుద్యోగకార్యములను నిర్వర్తించిరి. వీరు ప్రస్తుతము బెంగుళూరు నందలి సాంగ్రామిక వైద్యాలయాధికారులుగా పనిచేయుచున్నారు. వీరి కాంధ్రభాషాభిమాన మధికము. వీ రిప్పుడు నేదో యొక యాంధ్ర గ్రంథమును పఠించుచుందురు; తఱచుగా ఆంధ్రపత్రికకు వ్యాసములు వ్రాయుచుందురు. ఆంధ్రులందు సైనికోద్యోగాభిలాషను ప్రోత్సాహపఱచుచు ఆంధ్రపటాలమును స్థాపించు నిమిత్తము వీరు వ్రాసిన వ్యాసములు ఉత్సాహ జనకములు.

## వంగా జగన్నాథరావు నాయఁడు గారు

ఈయన విజయనగరము మహారాజావారి కళాశాలలో గణితశాస్త్రప్రధానోపాధ్యాయులుగా నుండిన మాధవరావు నాయఁడు, ఎమ్. ఏ., గారి యేకపుత్త్రుఁడు, నాగపూరు డిస్ట్రిక్టు జడ్జీగా నుండిన సి. ఎస్. నాయఁడు గారి యల్లుఁడు; వయసున చిన్న యయ్యు బుద్ధికుశలత యందు పెద్ద. ఈయన సీమకు వెళ్ళి "బారిష్టరు" పరీక్షలో పేరు ప్రతిష్ఠలతో కృతార్థుఁడై మన దేశమునకు మరలివచ్చి మద్రాసు హైకోర్టులో న్యాయవాది వృత్తికిఁ గడంగి గొప్ప పదవిని కొలఁది కాలములో నొందుదు నన్న యాశతో కుతూహలపడుచున్న సమయమందు కులంబువారి కెల్ల ఆశాభంగ మగునట్లు కడచిన యానంద సంవత్సర భాద్రపదమాసమున ఇరువదియాఱవ యేట అకాలమరణము నొందెను. మన రాజధానిలో వెలగకులంబునందు బారిష్టరుగా నేలెంచినవారిలో ఈయన మొదటివాఁడు; దృఢకాయుఁ డయ్యు క్షయరోగపీడను తప్పించుకొనఁజాలకపోయెను. భార్యాజనకులతోఁ బాటు ఈయన వియోగమును గూర్చి విలపించుటకొక కొమార్తె కూడఁ గలదు.

## రాజవైద్య నాగలింగము సంపయ్య గారు

వీరు 1842-వ హూణాబ్దమునకు సరియగు ప్లవవత్సర జ్యేష్ఠమాసంబున గుంటూరు మండలము అమృతలూరు గ్రామమున శివాచార్యవర్యవంశమం దుద్భవిల్లి వాహటాద్యనేకవైద్యశాస్త్రంబులను బాగుగా పఠించి మిక్కిలి నైపుణ్యముతో చికిత్స నొనర్చుచున్న విద్వద్వైద్యులు. నిరతాన్నదాత లగు వీరు తమ యాయుర్వేదభవనమం దుచితముగ నౌషధరాజంబుల నొసంగుటచే సంపూర్ణారోగ్యవంతు లయిన బీద జను లనేకు లీ జిల్లాయొక్కయు ఇతరజిల్లాలయొక్కయు బహుభాగముల ప్రవర్తిల్లుచున్నారు.

## గోపీనాథము వేంకటకవి

ఈయన బ్రాహ్మణుఁడు, కౌండిన్యసగోత్రుఁడు, పద్మనాభ సూరి పుత్రుఁడు, నరసింహశాస్త్రి పౌత్రుఁడు. నెల్లూరు జిల్లా కావలి తాలూకా లక్ష్మీపుర మీయన నివాసస్థానము. ఈయన తన 16-వ యేట నరసింహస్వామి కళ్యాణోత్సవమును చూచుటకు నెల్లూరు వెళ్ళియుండ, అందొక మహాయోగి ఈయన కొక విద్య నుపదేశించెనట. దాని ప్రభావంబున ఈయన యప్రయత్నంబుగ కవీశ్వరుఁడై ఇష్టదైవ మగు కృష్ణున కంకితంబుగా నేదేని కృతి రచింపఁబూని యోచించుచున్న సమయంబున, కృష్ణుండు స్వప్నంబున సాక్షాత్కరించి తన యవతారములలో నేదే నొకటి గ్రాహ్యం బని యపునర్భవావాప్తిని నిరంతరాయకావ్యపరిసమాప్తిని అనుగ్రహించి యంతర్హితుం డయ్యెనట. అంతట ఈయన రామాయణమును యథామాతృకముగా ఆంధ్రీకరింపఁబూనినంతనే వాల్మీకి ప్రసన్నుండై తన తెలివితేటల నెల్ల ఈయన కొసంగి చనెనట. అనంతర మీయన రామాయణము నాంధ్రీకరించి కృష్ణాంకితము గావించి గ్రంథప్రకటనమున కే మహీపతి సాయపడునో యని యోచించుచుండ, అట్టి ప్రకటనోద్దేశమే కలిగియున్న వేంకటగిరి మహారాజు సర్వజ్ఞకుమార యాచేంద్రుఁడు ఈయన విషయమును విని ఈయనను రప్పించి 1859-వ సంవత్సరము ఆగస్టు నెల 18-వ తేదిని ఈ కృతిని సభాసీనుఁడై విని సంతసించి కవిని 'చామీకరకటకాంగుళీయకహారాగ్రహారాది ప్రదానంబుల'చే సత్కరించి గ్రంథమును విస్తరింపఁజేసెనఁట. ఈ విషయము గోపీనాథరామాయణ మను పేర ప్రసిద్ధి గాంచిన ప్రకృతగ్రంథము పీఠికనుండి గ్రహింపఁబడినది. ఇందువలన, తక్కిన సంగతి సందర్భము లెటు లున్నను, కవి సహజపండితుఁ డనియు బాల్యమందే యీ గ్రంథరచన కుపక్రమించె ననియు ప్రభుసాహాయ్యసన్మానము లపేక్షించియు మోమోటమి లేక తన గ్రంథమును భగవదంకితమే కావించె ననియు, కవి కాశ్రయుఁడైన సర్వజ్ఞకుమారయాచేంద్రుఁడును అంకితాద్యాడంబరముల కాశపడక యుదారబుద్ధితో గ్రంథవ్యాప్తికి తోడ్పడి కవిని సత్కరించె ననియు స్పష్టపడుచున్నది. బ్రహ్మకైవర్తపురాణమునందలి కృష్ణజన్మఖండము, భగవద్గీతా పద్యకావ్యము, మాఘాంధ్రీకరణ మగు శిశుపాలవధ ఈయన రచియించిన యితరగ్రంథములలో ప్రధానమైనవి. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు మా కెరవిచ్చిన ఛాయాపటము కవి యవసానమునకు పూర్వదిన మెత్తఁబడిన దని తెలియవచ్చుచున్నది. పటమునందలి ముఖలక్షణమును చూచునెడల ఈ భక్తుఁడు శంకరాచార్యునంతవానిచే ప్రార్థనీయముగా తలఁపఁబడిన యనాయాసమరణము నందిన ట్లూహింపవచ్చును.

## కప్పగంతుల చంద్రమౌళీశ్వరశాస్త్రి గారు

వీరు మంత్రవేత్తలు; సాలగ్రామములను తత్పూజావిధానమును గూర్చి యొక గ్రంథమును రచించియున్నారు. వీరి నివాసస్థలము కాళహస్తి.

### హెచ్. హెచ్. ఆర్. వి. పెరుమాళ్ రాజాబహద్దరు గారు

వీరు కార్వేటి నగర సంస్థానపు కుమారరాజు లగు కావేరి రాజాబహదూరు గారి కుమారులు; గంగమాంబాపురము దుర్గము అడవుల ప్రొప్రయిటరులు; సుప్రసిద్ధదాతలు. ధాతసంవత్సరపు కఱవులో వీరి తాత లగు వేంకటపెరుమాళ్లురాజు గారు గావించిన దానధర్మములవలన సంస్థానమందలి ద్రవ్య మంతయు వ్యయ మగుటే కాక సంస్థాన మంతరించునట్టి యప్పులు కూడ నయ్యె నన్నచో, ఈ కుటుంబముయొక్క యౌదార్యాతిశయము స్పష్టపడక మానదు.

### ఎస్. గోపాలస్వామి నాయఁడు గారు

వీరు ఆంధ్రపత్రికా కార్యాలయమందలి చిత్రలేఖకులు. పూర్వము 'లిబరల్' పత్రికలో ప్రకటింపఁబడుచుండిన బొమ్మ లన్నియు వీరి కరకౌశలమునకు నిదర్శనములు. 'ఛాయాగ్రహణతంత్రము'ను 'విద్యాగురు' వనెడి పారిశ్రామికగ్రంథమును వీరు రచియించినవే.

### చెన్నపురి వైశ్యవిద్యార్థుల వాఙ్మయసంఘము

రెండవ పంక్తిలో నడుమ కూర్చున్న నల్లపల్లి కృష్ణస్వామి సెట్టి, బి. ఏ., గారు అధ్యక్షులు; ఆ పంక్తిలోనే కుడివైపునుండి రెండవవారుగా కూర్చున్న ఎస్. విరూపాక్షప్పసెట్టి కార్యదర్శి; మూడవవారుగా కూర్చున్న కే. బి. జగన్నాథము గుప్త కోశాధ్యక్షులు; నాల్గవవారుగా కూర్చున్న సుంకు సుబ్రహ్మణ్యము శ్రేష్ఠి, బి. ఏ., గారు గౌరవసభ్యులు.

### చెన్నపురాంధ్రసభ

చెన్నపురాంధ్రసభవారు రావు సాహేబు కలువల రామానుజము సెట్టి గారు ప్రధానపౌర పదవికి నియోగింపఁబడుటను పురస్కరించుకొని సెట్టిగారికి ఫిబ్రవరి 18-వ తేది నొసంగిన యభినంద వాతిథ్యమప్పుడు ఈ ఛాయాపట మెత్తఁబడినది. ఇందు సభాసభ్యులు కాని వా రనేకులు గలరు. సభాసభ్యు లందఱును గాని యిందునకు విచ్చేసిన వా రందఱును గాని ఈ పటమం దున్నా రనుటకును వీలు లేదు. ఈ సభ 1916-వ సం. ఏప్రిలు నెల 17-వ తేదిని స్థాపింఁబడినది. లైటియూశ్లి సభ్యులతోఁ గూడ, ఇప్పు డించుమించు 525 మంది సభ్యులు గలరు. ఈ సభ విద్యా, లలితకళా, వ్యాయామక్రీడా, వాణిజ్యపారిశ్రామిక, సంఘసేవా శాఖలుగా నేర్పడి, పనిచేయుచున్నది. సభాధ్యక్షులు: రావు బహదూరు పి. త్యాగరాయసెట్టి గారు, బి. ఏ. సభాసహకార్యదర్శులు : కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు, కుల్లి నరసింహరావునాయఁడు గారు. సభాకార్యాలయము : 14, బ్రాడ్వే, మద్రాసు.

### రాంభొట్ల జగన్నాథశాస్త్రి గారు

కీర్తిశేషులైన వీరు విశాఖపట్టణమండలమున సుప్రసిద్ధులు. వీరి విద్యాధికత, సౌశీల్యము, శాంతస్వభావము, నిరుపమాన వదాన్యబుద్ధి, యుదారాశయత మున్నగు సుగుణగణములు సర్వజనవిదితములు. వీరు నానావిధదీనజనులను గుంపులుగుంపులుగా చేరఁదీసి తమ యౌదార్యముచే వాండ్రను సంతృప్తిపఱచుచుండిరి. వీరు చిరకాలము చోడవరమున ప్లీడరుగ పనిచేసి ప్రసిద్ధి గాంచి న్యాయాధికారుల విశ్వాసమునకును తోడి న్యాయవాదుల గౌరవమునకును పాత్రు లైరి. వీ రెల్లప్పుడు వినయవిలక్షణులు. స్వధర్మనిర్వహణమునను ప్రజాహితపరత్వమందును వీ రద్వితీయులు. చిరప్రయత్నసాధ్య మైన యభ్యుదయము మరింత ప్రశస్తము. శాస్త్రి గారు బాల్యమం దతిదరిద్రులు : కడుపు కూడును కట్ట గుడ్డయు కూడ కఱవే. అసహాయస్థితిలో దారి గానక అతిదూరదేశముల కేఁగి భిక్షాటనముచే కూడ కాలము గడపవలసివచ్చెను; అప్రయోజకు లగు ధనికుల నాశ్రయింపవలసివచ్చెను. అనంతర మదృష్టదేవత వీరి నే యాశ్రయించి వశంవద కావలసివచ్చినది. ఈ దశాపరిణామవృత్తాంత మంతయు శాస్త్రి గారి స్వీయచరిత్రమందు విశదీకరింపఁబడియున్నది. ఐహికమహాశత్రువులలో నగ్రగణ్య మగు దారిద్ర్యమును వా రెట్లు నిర్జించినదియు యథార్థముగ కనుఁగొనుట ప్రయోజనకరము. వీరి విజయమునకు సాధనము విద్యావిశేషము కాదు; ప్రాక్పాశ్చాత్యదేశములలో విద్వాంసు లెందరో ఈ కాలమునను కాలాంతరములందును భగ్నమనోరథు లగుట స్పష్టము. వీరి న్యాయవాదివృత్తి కూడ వీరికి విజయసాధన మయ్యె ననుటకు వీలు లేదు. శాస్త్రులు గారి కున్న గుణవిశేషములు లేనిచో, కష్టపడి పని చేసి జీవయాత్ర చక్కఁగ జరపి దరిద్రుఁడుగా చచ్చుటయే న్యాయవాదికి పరమావధి యని గ్రహింపవలసియున్నది. శాస్త్రులు గారు నిరంతరకృషి మహాదీక్ష దృఢసంకల్పము స్థిరోత్సాహము సంపూర్ణధైర్యము స్వయంసహాయ విశ్వాసము మున్నగు నాయుధములను ధరించి దారిద్ర్యముతో చిరకాలము పోరి పోరి చివరకు దానిని నిర్జించిరి. కావున వీరి చరిత్రము పఠనీయ మనియు జీవిత మనుకరణీయ మనియు చెప్పుటకు సందియము లేదు.

### శ్రీమతి వక్కలంక వేంటసూర్య రామజోగమ్మ గారు

ఈమె కీర్తిశేషులైన జోగారావుగారి ధర్మపత్ని; చిట్టివలస జమీందారిణి, నిరతాన్నప్రదాయిని. ఈమెకు సంస్కృతాంధ్రాంగ్లేయములందు విశేషపరిచయము కలదు; ఆంధ్రభాషాభిమాన మధికము. జనమంచి శేషాద్రిశర్మప్రణీత మగు లలితోపాఖ్యానము ఈమె కంకితము గావింపఁబడినది.

---

# A. Saminatha Mudaliar & Sons,

**'RAMAKOTI' PARK TOWN, MADRAS.**

Telegrams
'Gas Madras'
Terms Cash
or
V. P. P.



Telephone
No.
3 2 8,
Established
1880

**DEALERS IN:**

**All requisites for Soda water Factory**

Carbide of Calcium
Sulphuric Acid
Hydrochloric Acid
Nitric Acid
Bicarbonate of Soda
Tartaric Acid
Citric Acid
Salcylic Acid
Sacharine

Empty Soda water Bottles
Carbonic Acid Gas
Lemon Oil
Oil of Orange
Oil of Peppermint
Filter bags for Syrups
Soda water Machines
Soda water Plants
Essence of Rose

Essence of Jasmin
Essence of Coffee
Water filters
Filter Candles
Brushes for Soda water Bottles
Face masks for Bottlers
Codd's Rubber Rings.
Soda bottle Openers.
Essence of Almond.

**and Etc., Etc., Etc.**

## THE ASIAN COMMERCIAL ASSURANCE Co. Ltd; Bombay.

**BRANCH: NO. 5 THUMBUCHETTY STREET, MADRAS.**

**Capital** Authorised Rs 50,00,000. Subscribed Rs 474025. Paid-up Rs. 93555.

**Funds** Invested in Government Securities, Port Trust, Improvement Trust and Municipal Debentures etc.

**Lapsed Policies** Revived at any time without any limit as in other Companies or Payment of arrears of premiums with interest at 6 % per annum.

**Policies** Privileges and advantages unchallengable. Prompt payment of claims.

**Endowment Assurance with Full profits.** Combine advantages of family provision in the event of Assured's early death, and a provision of Assured's himself in his oldage in the event oi survinal. **Profits (Bonus)** added to the sum Assured every 5 years and payable with the claim, or **betaken in cash every 5 Years** or be applied for in equivalent reduction of future premiums for terms of years.

Please apply for full particulars and Agency terms to:—

**J. K. RAJAH ROW PANTULU GARU, Secretary Madras-Branch.**

30/81 ధరలు   మా బి జో ఫ్లూట్ హార్మోనియం.   గొప్ప మాగ్పు!



అన్ని విధములగు శీతోష్ణ స్థితుల కును సంగీతముల కును చాల అను కూలమయినది. చక్కని మాధుర్య మగు ధ్వని. గట్టిగ నుండునట్లు తయారు చేయబడినది. పెట్టెతో సహా సిద్ధముగనుండును. మూడు సంవత్సర ములకు గ్యారంటి యివ్వబడును.

ధర :— సింగిలురీడ్లు, సాదాకేసు రూ 12-12-0; నగిషీగల కేసు (ఈ నమోనా గలది) రూ. 14-8-0.
డబ్బులురీడ్లు ,, 19- 0-0; ,, ,, ,, 21-0-0.

దయచేసి, ఆర్డరుతో రూ 5-0-0 పంపండి. క్యాటలాగు ఉచితముగ పంపబడును.

టెలిగ్రాఫ్ అడ్రెసు మాడెల్, కలకత్తా. మాడెల్ హార్మోనియం కంపెనీ, మానిక్‌తోలావీధి, బీడన్‌స్క్వేరు, కలకత్తా.

---

అద్భుతమైన అలోక్‌హాలైన్. [క్రొత్తవిషయము.

అతి త్రాగుడు, నల్లమందు మున్నగు మత్తుపదార్థ సేవనము, వీనికి, తెలిసియో, తెలియకనో అలవాటుపడినవి.

వీటినిమిత్తమయి కలుగు ఆతురతను నశింపచేయును. వీని సంబంధమగు విషపదార్థమును శరీరమునుండి తొలగించును. దుర్బలము లయిన నరములకు పటుత్వమిచ్చును. ఒక పాట్లము సేవించగనే దీనియందలి గుణము ధ్రువపడును. 3, 4 పాట్లములయినచో నీపిశాచపు రోగమును మొదలంట నిర్మూలముచేయును. "మీ ఆలోక్‌హాలైన్, త్రాగుడు అలవాటును మాన్పుటయేగాక నరపటుత్వము నిచ్చుట మున్నగు అనేక మంచి గుణములుగలది" అని ఒక యూరపియన్ పోలీసు ఆఫీసరు మాకు వ్రాసిరి.

వెల రు 1-8-0 పాట్లము (పోస్టేజి వేరుగ)

గొనోక్యూర్.

శగరోగము, తెలుపు ఇంక నీజాతిలోని వ్యాధులను, శరీరమునకు ఏవిధమగు హానిని కలిగించకుండ, తప్పక కుదుర్చునని యనేకులచే సిఫారసు చేయబడినది. ఒక సీసా ఎట్టి దీర్ఘవ్యాధినయినను కుదుర్చును. ఒకసారి పరిశీలించిన నమ్మకము గలుగును.

వెల సీసా 1 కి రు. 1-12-0 మాత్రమే (పోస్టేజి వేరుగ)

వ్రాసినవారికి వివరములుగల క్యాటలాగు పంపుదుము. మొత్తముగ కొనువారికి స్పెషల్ డిస్‌కౌంటు యివ్వబడును.

జూనో కెమికల్ వర్క్సు డిపో (ఆలోక్)
ఇఛాపూర్, బెంగాల్.

---

**Shirt Studs Buttons** (షర్టుస్టడ్సు బొత్తాములు)

పై భాగంబాల్‌షేపు (గుండ్రము) కలిగి సవరం బంగారుతోను మిగతభాగం మంచి వెండితో చేయబడినవి.

సెట్టు 1 కి 4 బొత్తాములు ధర రూ. 6-0-0.

కాలర్ బొత్తాముమాత్రం రూ. 2-0-0. మిగిలినవి 1 కి 1-8-0 గెట్టిగాను మంచిపనితనము కలిగివుండును.

**Nose Screws** (ముక్కుగోట్టములు)

గొట్టము సవరంబంగారుతోను జవఅపరంజితో చేయబడి పుష్యరాగంరాయితో కట్టినవి. ధర పెద్దసైజు 1-కి రూ. 8-0-0. నడితరం రూ. 7-0-0 చిన్నవి రూ. 6-0-0.

సదరు గొట్టములు యిమిటేషన్ పట్టుకెంపుతో కట్టినవి. పెద్దవి. రూ. 4-0-0 నడితరం 3-12-0. చిన్నవి 3-8-0. గొట్టము మోపుగా వుండేది గాక చాలా సంవత్సరములుండును. సవరంబంగారు అపరంజి పుష్యరాగం రాయి వీటికి పుత్తరవాదం చేసేదిగాక మదింపు తాళదని రుజువుపడేవిషయములో మొత్తం వాపసు చేసెదము.

పైవి ఏదైనను వుత్తరవు చేయునపుడు అడ్వాన్సు రూ. 2 లు పంపవలయును. మిగత వి. పి. ద్వారా వసూలు చేయబడును.

ఏ మాదిరి వెండిసామానులైనను కావలసినంత తూనికతో తయారు చేసి పంపెదము. సీమ వెండికి ఉత్తరవాదం చేసెదము. వివరం జాబు వ్రాసి తెలుసుకొనవచ్చును.

ఆర్. ఎస్. కన్నయ్య, అవడి పోస్టు, చెంగల్పట్టుజిల్లా.
R. S. Cunniah Avadi Fost (M & S. M. Ry.)

వెలస్వల్పము! ఫలమధికము!!

# అమృతాంజనము

## వాయునొప్పులకు పరమామృతము.

గొప్ప గొప్పవారిచే వేలకు వేలు యోగ్యతా పత్రములు పొందినది

పంచభావ. చీటిచూచి కొనిన మోసము గలుగదు. ప్రతియింట నుండదగినది.

సీసా 1-కి, 0-8-0 అణాలుమాత్రమే. ప్రతివారము వేలకు వేలు విక్రయము.

## అమృతాంజనము పోట్లబోగొట్టును తలనొప్పులమాన్పును.







నెత్తురునందు మూత్రామ్లజము మొదలగు చెడు పదార్థములు చేరి యవి సంధిబంధనములందు నిలిచి యుండుట వలన సంధివాతమేర్పడు చున్నది. కీళ్లువాచుట, జ్వరము, కీళ్లుపోటును మొదలగునవి దీనికి లక్షణములు. బాధగలిగిన వెంటనే రోగికి విశ్రాంతినిచ్చుట యవసరము. వాయునొప్పుల కుపయోగించుమందులు దీనికి నుపయోగపడును. సంధిబంధనములను వేడి ఇసుకతో గాని, ఉప్పుతో గాని, నీటితో గాని కాచి పిమ్మటను అమృతాంజనముతో మెల్లగా తోమవలయును. సంధివాత మేర్పడిన వెంటనే అమృతాంజనము నుపయోగించుచు వెంటనే భేదికి తీసికొనుట మంచిది.

## అమృతాంజనము జగత్ప్రసిద్ధిజెందిన దివ్యాంజనము

తలనొప్పుల మాన్పును

పార్శ్వపు నొప్పుల బారద్రోలును

వాయుపోట్ల బాపును

బెణుకుల భేదించును

వాపుల రూపుమాపును




దగ్గును తగ్గించును

దురదను తొలగించును

తేలుబాధను తీసివేయును

వేలకువేలు విక్రయము.

వెల 0-8-0 లు మాత్రమే.

**అమృతాంజనండిపో, 6 తంబుశెట్టివీధి మదరాసు.**







# డోంగరె

గారి

## బాలామృతము

దీనిని

పిల్లలకు నిచ్చుటవల్ల

బలమును సౌఖ్యమును

కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0

# డోంగరె

గారి

## బాలామృతము

ఇది

తియ్యగా నుండుటచే

శిశువులు చక్కగా

త్రాగుదురు.

తపాలఖర్చులు.0-4-0.



## ఒకతల్లి వ్రాసిన లేఖ



పిహాని కాపురస్థురాలు చంద్రశేఖరశుక్ల గారి భార్య:—"ఇంకను మూడు బాలామృతము సీసాలను పంపుడు. ఇయ్యది బిడ్డలకు నిజముగా అమృతమే? నేనెంతగా దీనిని శ్లాఘించినను దాని ప్రయోజనమునకన్న కొఱవడియే యుండును. డోంగ్రేగారి బాలామృతమును వాడినదిమొదలు నాబిడ్డ చాల కులాసాగా నున్నాడు. సౌఖ్యవంతుడై యున్నాడు.

మద్రాసు ఏజంట్లు:—

**ఎస్. వైద్యా అండు కంపెని.**

55. నైనియప్ప నాయకవీధి, మదరాసు.

నవలలు! నవలలు!! నవలలు!!!

# కథాచమత్కృతి అత్యద్భుతము

గ్లేజుకాగితములు! మధురమగు శైలి!! ముద్దులు గులుకు బైండు!!!

## విజ్జలదేవి

గ్రంథకర్త: ఎ. వి. నరసింహం పంతులుగారు. శ్రీకృష్ణదేవరాయలకాలమునాటి చరిత్రవిషయిక నవల. పంచ రంగుల పటము. నిండు క్యాలికోబైండు. 328 పుటలు.

ధర 1-2-0 వీ. పీ. ఖర్చు 0-3-0.

## సాంఘిక దౌర్జన్యము

గ్రంథకర్తలు: చింతా శంకరదీక్షితులు గార్లు. అత్యద్భుతమగు రహస్యాపరాధ పరిశోధక (Detective) నవల. 200 పేజీలు, చక్కని బైండు.

ధర 0-12-0. వీ. పీ. ఖర్చు 0-2-0.

## అస్తమయము

గ్రంథకర్త: బాలకవి భోగరాజు నారాయణమూర్తి గారు. శ్రీ రామరాజుకాలమునాటి చరిత్రవిషయికనవల విమలాదేవిని రచియించిన వీరి శైలి, కథాచమత్కృతిని గురించి వేఱుగ వ్రాయ నక్కఱలేదు. 400 పుటలు నిండు క్యాలికో బైండు.

ధర 1-8-0. వీ. పీ. ఖర్చు 0-3-0.

## దిలారామ

గ్రంథకర్త: కేశవరపు వేంకటశాస్త్రిగారు. నాలుగు రంగుల పటములతో గూడిన చరిత్రవిషయిక నవల. రాయచూరు యుద్ధమును రచియించిన వీరిశైలి, చమత్కృతి మేము వేఱుగా వర్ణింప ననవసరము. 400 పుటలు చక్కనిబైండు.

ధర 1-8-0. వీ. పీ. ఖర్చు 0-3-0.

☞ చందాదారుల కిచ్చినవి పోను కొద్దిప్రతులు మాత్రమే యున్నవి. త్వరపడుడు.

N B పై నాలుగు నవలలు ఏకకాలమున పుచ్చుకొనువారికి వీ. పీ. ఖర్చులతో సహా రు 5—0—0 లకే పంపుదుము.

32 బంగారుపతకములను అనేక యోగ్యతాపత్రములను సంపాదించి కీర్తిగాంచిన

## ప్రొఫెసర్:— టి. వి. సుబ్బారావుగారి

ప్రాక్టికల్ మెస్మరిజం హిప్నాటిసమ్ అనబడు

1. భాగము.
సమ్మోహనము.
వెల 1-0-0 వీ. పీ. 0-2-0

2. భాగము.
అదృష్టరాజము.
వెల 0-8-0 వీ. పీ. 0-2-0

రెండు గ్రంథములను ఏకకాలమున ఖర్చులతోడ 1-8-0 లకు పంపబడును.

విలాసము:— నవలా గ్రంథమాల

తపాలపెట్టె 230 మద్రాసు (అని వ్రాయవలెను.)

50
33

చదివిచూడండి ! సులభముగా పొందవచ్చును !

# మంచి బహుమానము !

వెల స్వల్పము ! గుణ సుఖీకము ! అనేక యోగ్యతాపత్రములు గలవు !

## మదనకామేశ్వర లేహ్యము

ఇది మిక్కిలి వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, బలమును కలిగించును. మేహములు, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, స్వప్నస్ఖలనము, అతిమూత్రమును హరించును. మిక్కిలి బలమును, యౌవనమును, పటుత్వమును, సుఖమును, వీర్యవృద్ధిని, ధాతుపుష్టిని, సంతానప్రాప్తిని కలిగించు వరప్రసాదము— 2 డబ్బీలు చాలును. 20 తు॥ డబ్బి రూ. 1-0-0

### మేహాంతక చూర్ణము

మేహములు, అత్యుష్ణము, పాలుమాలిక, కాళ్లు చేతుల మంటలు, మేహరూతు, పొడిదగ్గు మొదలగు 20 మేహములకు వజ్రాయుధము-2 డ॥ చాలును. 10 తు॥ డబ్బి రూ.1-0-0

### పాలసుగంధి లేహ్యము

సవా మేహములు, మేహపొడలు, పుండ్లు, కీళ్లనొప్పులు, కొరుకుపుండ్లు, చర్మరోగములు, రసదోషము మొదలగువాటిని ఖండించును—2 డ॥ చాలును. 20 తు॥ డబ్బి రూ. 1-0-0

### గంధక రసాయనము

ఇది చక్కగా తయారుచేయబడినది. ఇది చిరకాలము నుండి బాధించు చర్మరోగములు, పొడలు, జిల, పుండ్లు, తీట, కరిమేహము, పాత సవా మేహములు, మేహవ్రణములు, వాయువులు మొదలగు అనేక రోగములకు బ్రహ్మాస్త్రము వంటిది—2 డ॥ చాలును. 20 తు॥ డబ్బి రూ. 2-0-0

### ఘనసార చందిని

ఇది ఎరుపు, తెలుపు, మొదలగు అంటు శగరోగములను, మూత్రపు చురుకును, స్త్రీల కుసుమవ్యాధులను అద్భుతముగా ఖండించును—2 సీసాలు చాలును. సీసా రూ. 1-4-0

### కందమూల రసాయనము

మూలవ్యాధికి సిద్ధౌషధము : రక్తము చీము పడునట్టి మొలలజాడ్యమును, మలబద్ధమును తక్షణమే ఖండించును.

20 తు॥ డబ్బి రూ. 1-4-0

### ఇంద్ర తైలము

కొరుకు, పుండ్లు, చర్మరోగములకు పైన పూయుటకు ఉపయోగము:— డబ్బి రూ. 0-8-0

### మధుమేహ భంజని

అతిమూత్రము, (అనేక పర్యాయములు విస్తారముగా మూత్రము వెడలుట) నోరు ఎండుట, బలహీనము మొదలగు వాటిని హరించును. 20 మా॥ డబ్బి రూ. 1-4-0

### క్షయారిష్టము

సమస్త విధములగు దగ్గులను, శ్వాస, (కాస) ఉబ్బసము, అల్ల, క్షయ మొదలగు శ్వాసకోశసంబంధమగు వ్యాధులను హరించి గుండెకు బలము నిచ్చును— 2 డ॥ చాలును.

20 తు॥ డబ్బి రూ. 1-0-0

### జీర్ణవిజయ గుటికలు

అజీర్ణము, శూల, మలబద్ధము, అన్నద్వేషము, పులిత్రేపులు, వమనము మొదలగువాటిని హరించి మంచి జీర్ణశక్తిని కలిగించును. 24 మా॥ డబ్బి రూ. 0-8-0

### ప్రతాప కస్తూరిమాత్రలు

మంచి సువాసన, తాంబూలములో గాని, విడిగా గాని 1-2 మా॥ పుచ్చుకొనిన అజీర్ణము, వాయువు, జలుబు, దగ్గు, జ్వరము, సన్నిపాతము, శీతబేదులు, కడుపునొప్పి, వమనము, అరోచకము, పంటినొప్పులు మొదలగువాటిని హరించి సుఖమును, ఆనందమును కలిగించును. వేల సీసాలు విక్రయము :

200 మా॥ సీసా రూ. 0-4-0

6 సీసాలు రూ. 1-4-0 (12.సీసాలు రూ. 2-4-0)

### నారికేళాంజనం

నేత్రములో వేసికొనిన ఉష్ణాధిక్యముచే గలుగు మంటలు, మసకలు, దుర్నీరు, తలనొప్పులు మొదలగువాటిని హరించి నేత్రములకు మంచిప్రకాశ మిచ్చును—మంట లేదు.

సీసా రూ. 0-4-0

☞ అన్ని ఔషధముల క్యాటలాగు ఉచితము. వి. పి. ఖర్చులు వేరు.

5 రూ॥ పైబడిన ఆర్డర్లకు రూ 1-కి రూ 0-2-0 కమీషను నిచ్చెదము.

10 మంది మీ మిత్రులకు దీనిని చూపినవారికి ప్రతాపకస్తూరిమాత్రల పేకెట్టు ఉచితముగానిచ్చెదము.

☞ మేనేజరు:—ఆయుర్వేదసమాజం.—పొందూరు, గుంటూరుజిల్లా.

# ఆతంకనిగ్రహ మాత్రలు

15/3




రోగులకును నిరోగులకును స్త్రీ పురుషులకు నుపయుక్తమైన ఆతంక నిగ్రహమాత్రలు తత్కాలము బలము నిచ్చు ఔషధము లన్నింటిలో మొదటిది. ఈమాత్రలు :—

1. జీర్ణసంబంధమైన తొందరల నివారించును.
2. నరముల బలము గలవిగ జేయును.
3. తప్పిపోయిన జ్ఞాపకశక్తిని మరల నిచ్చి దానిని వృద్ధి జేయును.
4. రక్తమును పరిశుద్ధముజేసి వృద్ధి జెందించును.
5. దేహమునకు బలమును చురుకుతనమును కలిగించును.
6. ఆయుస్థానముల దృఢపరచును.
7. కలలోనయ్యెడి వీర్యనష్టమును బొత్తిగా పోగొట్టును.
8. క్షీణించిన మగతనమును మరల గల్గించును.

32 మాత్రలుగల డబ్బీ 1-కి రూ. 1-0-0

## 180 పుటల పుస్తకము ఉచితము

ఆరోగ్యమును శాశ్వతసుఖమును పొందుట స్వాభావికమైన కొన్ని విధులను అనుసరించుటవలననే కల్గుచున్నది. ఈ ఉత్తమమైన పుస్తకము ఆరోగ్యమార్గమును కలుగజేసి శరీర సౌఖ్యమును దృఢగాత్రమును ఆయుర్వృద్ధిని ఇప్పించును. ఈ పుస్తకము ఇనాముగా నీయబడును. పోస్టుచార్జియు మేమే భరించి పంపెదము. వెంటనే వ్రాయుడు.

## వైద్యశాస్త్రి మణిశంకర్ గోవిందజీ, ఆతంకనిగ్రహ ఔషధాలయము.

157, బ్రాడ్వే,—96, వాంటురోడ్, మదరాసు. జాంనగర్, కత్తియవార్.

---

# G. Cunniah Chetty & Son.,

## Millinery, Silk, Woollen, Linen & Fancy Cotton Piece Goods Merchants.

**No. 2 RATTAN BAZAAR STREET**

**George Town, Madras.**

**Try us before you buy elsewhere and you will be convinced.**

**Our Motto "Small Profits and Quick Returns."**

**We have Large and Varied Stock of Piece Goods.**

53/36

బాధాపీడితులకు వరము: ఐయోడిన్ సహితమయిన డా॥ పి. డి.

## సావంతుని వనౌషధి సారసపరిల్లా

అపరిశుభ్రపు రక్తమువలన జనించు జాడ్యముల కుదుర్చు ఔషధరాజములకు ఇయ్యది కిరీటమువంటి మందు. కురుపులను, మచ్చలను, గండమాలలను, పుండ్లను పాతనొప్పులను అన్నివిధములవలన గలుగు చర్మరోగములను పోగొట్టును. మిక్కిలి శక్తివంతమైన రక్తశుభ్రకారిణి. వనౌషధి సారసపరిల్లా గుణ మిచ్చుట నిస్సంశయము, సహజమైనను మధ్యవచ్చినను అన్నివిధములైన దోషములను పోగొట్టును. శరీరమునందలి పాదరదోషములను, మలబద్ధకమును కార్జసంబంధమగు నొప్పులను పోగొట్టి రక్తమును శుభ్రపరచును. శరీరారోగ్యమును కలుగజేయును. 16 రోజులవర కుండుటకు 4 ఔన్సుల బుడ్డీలలో అమ్మబడును.

ప్రొప్రైటరు:—పి. డి. సావంత్. ౧౪౪, ఫనసవాడి నం ౨ బొంబాయి.

34 **Proprietor P. D. SAVANT** No 144, Fanasawadi No 2. BOMBAY.

వెలసులభము !

ఫలమధికము !!

## తారుమారు కథల గంప

ఇందలి కథ లొక్కొక్కటియు నొక్కొక క్రొత్త వింతను వెలయించుచుండును. ఈ కథ లన్నియు సామాన్యముగా సకలజన మనోరంజకములై యుండును. అనగా స్త్రీలు, పురుషులు, బాలురు, బాలికలు, పండితులు, పామరులు మొదలగువారల కెల్ల జదువుట కనుకూలించునట్లు వ్రాయంబడి యున్నవి. వెల పండ్రెండు అణాలు మాత్రము.

వసిష్ఠప్రోక్త

## పులిప్పాణివైద్యరహస్యము

ఇది నాగరభాషయం దుండి తెనిగించబడినది. ఇది వరకెన్నియో అనేక గొప్ప వైద్యగ్రంథము లున్నను దీనివలె సులభమార్గమైన గ్రంథము లేదని నొక్కి చెప్పగలము. తక్కిన విషయములు గ్రంథము జూచిన దెలియును. ప్రతివారిచేత నుండదగిన హస్తభూషణ మిదియే.

కాలికో బైండు ప్రతి 1-కి వెల రూ. 1-8-0 మాత్రమే.

## మలయాళ మంత్రము

ఇందు 43 మంత్రములును, ఆకర్షణ మారణ ఉపాసన వశీకరణ స్తంభన మొదలగు 26 గొప్ప మంత్రములును, స్త్రీ పురుష బాల బాలికలకు గలుగు గ్రహదోషములు; తేలు, పాము మొదలగు విషజంతువుల కాట్లు; శెకునకు, భూతభేతాళ పిశాచాది దుష్టగ్రహములను తొలగించు మంత్రములున్ను, శీత పైత్య వాత సన్నిపాతాది జ్వరములను నివారించు మంత్రౌషధములును, వివరముగా తెలియునటుల తేట తెలుగున దళమైన కాగితములందు ముద్రింపబడియున్నది.

వెల ఒకరూపాయ మాత్రమే.

## దేవలోకక్రిమినల్ కేసులు

చదువుట కానందము. ముద్దుగులుకు మాటలు. పలుకులు అమృతపు తునకలు. ధోరణి కడుచిత్రము. శైలి సులభము.

వెల రూ. 1-0-0 మాత్రమే.

$\frac{60}{43}$ జయశంకర్ అండు కంపెని, చాకలపేట, మద్రాసు

మద్రాసు లక్ష్మీ సువాసన

## వక్క-పొడి, చెక్క-లు.

మా ఫ్యాక్టరీలో సిద్ధముచేయబడు సువాసన వక్క-పొడిని మే మమ్ముచుము. అనేకులు సువాసన వక్క-పొడి నమ్ముచున్నారు. కావున దానిపైన మా అడ్రెస్‌ను చూచికొనిన మోసపోరు. పురాణ పురుషుల యోగముల ననుసరించి సిద్ధము కాబడుచున్నది. దీని వాడుకవలన దగ్గు, నోటి దుర్వాసన, ఉదరరోగములు కుదురును. దీని నొకసారి వాడినవారు తత్క్షణమే దీని గుణమును పరిశీలింతురు.

| | | |
|---|---|---|
| ¼ పౌను డబ్బా సువాసన వక్క-పొడి | రు. | 0-5-0 |
| ,, 1 డజన్ | | 3-0-0 |

ఆర్. వేంకటేశనాయిడు,

మద్రాసు.

76
54

**R. VENKATESA NAIDU.**
**MADRAS. E.**

---

## నవనాగరిక యువతీ ప్రహసనము

ఇది రజస్వలానంతర వివాహమునుగూర్చి బళ్ళారి సరస వినోదినీ సభా జనరల్ మేనేజరు బి. మాధవరావుగారిచే వ్రాయబడిన యొక చక్కని ప్రహసనము.

ఇందలి ముఖ్యాంశములు.

(1) సర్కారువారి సన్మానమును పొందవలెనని స్వధర్మములను వదలుట.

(2) సముద్రయానము. దానివలన కలుగు లాభనష్టములు.

(3) స్వతంత్రముగా విడిచి పెట్టబడిన బాలికలు పడు పాట్లు.

(4) పట్టణములయందు బాలికలు చెడిపోవు విధము.

మొదలగు అనేక సంగతులు గలవు. చదివినవా రందరు కడుపుబ్బ నవ్వకపోరు.

వెల 0—8—0 మాత్రమే; తపాలా కూలి వేఱు.

ది యీస్టర్న్ అడ్వర్టైసింగ్ ఏజన్సీ,

77
55

పోస్టుబాక్సు 211, మద్రాసు.

---

79
56

హిమాలయముయొక్క

## అపరూపపు వస్తువులు.

స్వతస్సిద్ధమయిన హిమాలయ మూలికలను వాడి వాటి యుపయోగమును పరీక్షించండి. అసంతుష్టి గలిగిన సొమ్ము తిరిగి యివ్వబడును.

| | |
|---|---|
| కస్తూరి (టిబెత్తు) తు 1 కి | 31-0-0 |
| రవ్వకస్తూరి (అస్సాం) ,, | 26-0-0 |
| కస్తూరి (నేపాళ) ,, | 23-0-0 |
| ,, (కాశ్మీరము) ,, | 20-0-0 |
| ఇంగువ (కాబూల్) రతి | 2-8-0 |
| ,, తు 12 ల డబ్బీ | 1-0-0 |
| ,, 6 డబ్బాలు | 5-0-0 |
| ,, 12 ,, | 9-0-0 |
| సోలామిశ్రా తు 1 కి రు | 24-0-0 |
| కుంకుమపువ్వు (కాశ్మీరము) తు 1-కి 1-0-0 నుంచి 1-4-0 వరకు | |
| సిలాజిత్ (స్వచ్ఛమయినది) తు 1 కి | 1-12-0 |
| పచ్చకర్పూరం తు 1 కి | 3-8-0 |
| గోరోచనం ,, | 5-8-0 |

N. B. దయచేసి ఇంగ్లీషున నుత్తరములు వ్రాయుడు.

B. R. SONDHI & Co, Phagwara (Punjab)

---

కోయిల్-ధనాల-దేవరాజదాసుల విరచితె

84
60

## భక్తవిజయము.

నాలుగు భాగములు.

రాయల్ సైజులో 840 పుటలు గలది. గ్లేసు కాగితములపై ముద్రింపఁబడి నారపట్టుతో బైండుచేయబడి 11 అఫ్‌టోన్ పటములతో చేరినది.

వెల రు. 3 0 0] —— [పోస్టేజి ప్రత్యేకము.

శ్రీత్యాగరాజస్వామికీర్తనలు. వెల 1 8 0

---

## విద్యాకల్పము.

ఇది మనోహరములగు చరిత్రాత్మక నవలలను వెలువరించునట్టి మాసపంచిక. బాలురు స్త్రీలు లోనగువారి కనుకూలములగు పౌరాణిక గాథలును గలవు; శైలి మార్దవము. అత్యంత రామణీయకము. సాంవత్సరిక చందా రు. 1-0-0 మాత్రమే. విడిసంచిక. 0-3-0.

### ఎమ్. ఆది అన్‌డ్ కంపెని,

ఎస్ప్లనేడ్, మదరాసు.

# Kamala's Letters in Telugu

## కమలామణి లేఖలు.

వెల 1 రూ. వీ. పీ. ఖర్చు 2 అణాలు.

---

1. ఉద్యోగకారణమున విదేశగతుడైన భర్తకు కమలామణి వ్రాసిన యీ లేఖలు వట్టి వలపుజాబులుగాక ప్రేమామృతముతో నిండి లోకాచార వ్యవహారముల విచిత్రవర్ణనము గలిగియుండుటచే స్త్రీపురుషులకెల్ల పఠనీయములు. ఆన 1902 సం॥ జూను మాసములో నివి యాంగ్లేయభాషలో ప్రచురింపఁబడి ప్రపంచమెల్లెడల వ్యాపించియున్నవి. చక్రవర్తి మొదలుగ లక్షలకొలది జనులు చదివి శ్లాఘించియున్నారు. లేఖారూపకమయ్యును చదువ జదువ కట్టుకథగా గన్పట్టి, తుట్టతుదకు కమలామణికి సంప్రాప్తమగు దుర్గతి అత్యంత వ్యసనకరముగా నుండును.

2. చిరకాలమునుండి ప్రయత్నించినను ఈ గ్రంథము దేశభాషలలో తయారుకాబడక గొప్ప కొఱంత యేర్పడెను. అనేకులు ప్రయత్నములు చేసినను దుస్సాధ్యమై విడిచిపెట్టుట తటస్థించెను. గ్రంథకర్తగారగు శ్రీ రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారికి కొంతకాలము నుండి నిలబడియున్న అనారోగ్యస్థితిలో ఈ లేఖల అదృష్టము బయలుపడి అవి తెనుగు వగైరా ద్రావిడ భాషలలోనేగాక హిందీ, బంగాలీ మున్నగు భాషలలో గూడ వారి స్వంతశ్రమ శ్రద్ధలకు లోబడి తర్జుమాలు చేయబడి ముద్రింపబడుచున్నవి. ప్రపంచమంతట చదువబడిన ఈ హిందూ గ్రంథమును ముందుగా చదువవలసిన మనదేశస్థుల కొఱత దీనితో తీఱును. కాని, కాగితములకు కరవు సిద్ధించిన ఈ తరుణమునందు విశేషముగా ప్రతులు ముద్రించుటకు వీలులేదు. అయినను అల్పక్రయమే యేర్పాటు చేయబడినది గనుక, చదువనేర్చిన స్త్రీపురుషులందరు వెంటనే తెప్పించుకొని శ్రీ పంతులవారికి కృతజ్ఞతా వందనములతోడ వారి వారి యిష్టదేవతా ప్రార్థనమును తెల్పుదురు గాక! శ్రీ శ్రీ శ్రీ.

---

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.

...చ్చరిక.

ప్రస్తుత సందర్భములవల్ల మునుపటివలె కేట్లాగులు, కార్డులు, వగైరాలు పంచిపెట్టుట అసాధ్యము. వెలలు హెచ్చించక విక్రయించుటవల్ల ఇది వరలో ముద్రించిన గ్రంథములు చాలా భాగము అమ్మిపోయినవి. క్రింది గ్రంథములు మాత్రము కొద్దిప్రతులు కలవు. ఈ తరుణము తప్పితే అవియు దొరకజాలవు. ☞ కాబట్టి వెంటనే దరఖాస్తులు పంపుకొనవలయును.

1. తెనుగు హిందూలా — మంచి అచ్చు, దళసరికాగితములు, గట్టి కాలికో బైండు. వెల **6** రూ. ధర్మ యేర్పాటు పో॥ సహా రూ. **3-8.**

2. ఇండియన్ పీనల్ కోడ్డు — మంచిఅచ్చు, దళసరికాగితములు, గట్టికాలికో బైండు— వెల **4** రూ. పో॥ సహా **4-8.** ☞ ధర్మ యేర్పాటు పోస్టేజి సహా రూ. **3-8.** ☞ మునసఫు కరణములు, రిజల్టుస్కూలు మాస్టర్లు వగైరా స్వల్ప జీతము వారు, భాండాగారములు, వగైరాలకు ధర్మ యేర్పాటు ప్రకారమే పంపుచున్నాము. ఎన్నో ప్రతులు నిల్వలో లేవు.

3. కథారత్నావళి — చక్కని చిన్న సైజున క్రొత్తకూర్పు. 640 పేజీలు - కాలికో బైండు. వెల రూ. **1-4-0.** పో॥ సహా రూ. **1-8.**

4. శతకరత్నావళి — చక్కని చిన్న సైజు - 560 పేజీలు. వెల - రూ. **1-4-0.** పో॥ సహా రూ. **1-8-0.** భక్తి ముక్తి వైరాగ్యములు, నీతిహాస్య శృంగారములు వగైరాలను చిలికెడి శతకరాజములు వగైరా- దాదాపు 2000 పద్యరత్నములు. ఎన్నో ప్రతులు లేవు.

5. స్మరణానందము — వెల **6** అణాలు. పో॥ సహా **8** అణాలు. హరిభజన కీర్తనము, భజగోవింద శ్లోకములు (26) వానికి సరియైన తెనుగు తోహరాలు, శ్రీరామ రగడ, నారాయణ రగడ, రామరామ శతకము, నారాయణ శతకము, కృష్ణమంజరి, భారతసావిత్రి వగైరా 10 భాగములు.

6. వరశుల్క—నాటకము—క్రొత్తకూర్పు - శృంగార హాస్య కరుణా రసము లొలికించుచుండును. వెల **6** అణాలు.

7. కేసరీవిలాసము — వెల **6** అణాలు. అత్యద్భుత మగు నవల.

8. ఆనందదీపిక — **8** అణాలు. విచిత్రములు, వినోదములు, సామెతలు, సరసములు, పరిహాసములు వగైరాలు.

9. అదృష్టదీపిక— వెల **4** అణాలు. ప్రశ్న, స్వప్న, శకున, సాముద్రిక, ముహూర్తభాగములు కలవు.

10. వడ్డీజంత్రి— వెల **4** అ॥ 4 ప్రతులు వి. పి. ఖర్చు సహా **1** రూ.

☞ వెంటనే తెప్పించుకొనండి!




MOULVI ABULKALAM AZAAD,
Editor "ALHILAL" Caloutta,

# ఆంధ్రపత్రికాకార్యాలయము.

7. తంబుశెట్టివీథి, మద్రాసు.

అగష్టు, 1919.

మహాశయా!

పదియేండ్లనుండియును సంవత్సరాదిసంచికలను బ్రచురించుచు యథాశక్తిని భాషాసేవను దేశసేవను నాంధ్రమహాజనుల సహాయమున జేయుచుంటిమి. కాని అనివార్యములైన కారణాంతరముల వలనను సంచిక లాలస్యముగ వెలువడుచుండుట సంభవించుచున్నది. వ్యాసలేఖకుల వ్యాసములు సకాలమునకు కార్యాలయమునకు జేరక పోవుట యాలస్యమునకు మూలకారణము. రాగల సంవత్సరాది సంచికను సంవత్సరాదికి పూర్వమే ఆంధ్రలోకమునకు సమర్పింపవలయు నని సంకల్పము గలదు. వ్యాసములను వ్రాయదలచిన భాషాభిమానులును చిత్రపటములను బంపదలచినవారును సాధ్యమైనంత త్వరలో వానిని బంపి మాయుద్యమమును సఫలము చేయ ప్రార్థితులు.

చిత్తగింపుడు.

కా. నాగేశ్వరరావు.

......................................................................................

దీనిని పూర్తిచేసి వెంటనే పంపుటకు ప్రార్థితులు.

ఊరు..............................

తేది..............

వ్యాసము పేరు..............................................

ఎన్ని పుటలు..............................................

పంపెడి గడువు..............................................

లేఖకుని పేరు..............................................

చిరునామా..............................................

చిరునామా :—

# సంవత్సరాదిసంచిక.

ఆంధ్రపత్రికాకార్యాలయము,

7. తంబుశెట్టివీథి, మద్రాసు.

A. P. Press, Madras.

# రాజ్యాంగ సంస్కరణములు

## మాంటు ఫర్డు నివేదిక సూచనలు

మాంటేగ్యుమంత్రి-షెమ్సుఫర్డు ప్రభువు గార్లు ప్రకటించిన భారతరాజ్యాంగసంస్కరణముల ప్రధానవిషయములలో నీక్రిందివి ముఖ్యమైనవి:

### ఇండియా కార్యాలయము

1. పార్లమెంటుయొక్కయు, ఇండియా కార్యదర్శియొక్కయు అధికారమును తగ్గింపవలెను.

2. ఇండియా కార్యదర్శి జీతమును ఇంగ్లాండు ప్రభుత్వమువారే భరింపవలెను.

3. భారతదేశవిషయములనుగూర్చి యోచించుటకొక ప్రత్యేక సంఘమును నియమింపుడని కామన్సుసభవారిని కోరవలెను.

4. ఇండియాకార్యదర్శి సభానిర్మాణమును, ఇండియా ఆఫీసు సిబ్బందిని పరీక్షించి నివేదికము నంపుటకొక సంఘము నేర్పాటు చేయవలెను.

### హిందూదేశ ప్రభుత్వము

5. భారతదేశమున శాంతిని, సుపరిపాలనమును నెలకొల్పుటకు ఇండియా ప్రభుత్వమువారికి గల బాధ్యతానిర్వహణమున కవసరమగు విషయములలో ఇండియా ప్రభుత్వమువారి అధికారము నెంతమాత్రమును తగ్గింపరాదు.

6. హిందూదేశమున కొక ప్రీవీకౌన్సిలును నిర్మాణము చేయవలెను.

### కార్యనిర్వాహకవర్గము

7. రాజప్రతినిధియొక్క కార్యనిర్వాహకసభయందున్న భారతీయులసంఖ్యను వృద్ధిచేయవలెను.

8. కార్యనిర్వాహకవర్గ సభ్యులకు ప్రస్తుత శాసన నియోజిత మైన సంఖ్యగాని, అందు పేర్కొనబడిన యోగ్యతగాని యుండ నవసరము లేదు.

9. గ్రేటుబ్రిటనునందలి పార్లమెంటరీ అండరు సెక్రిటరీలవలె నున్న యొకపదవికి శాసనసభలోని సభ్యుల గొందరిని నియమింపవలెను.

### శాసనసభ

10. ప్రస్తుతమున్న గవర్నరుజనరలు శాసనసభకు బదులు స్టేటు కవున్సిలును, శాసనసభయును నుండవలెను.

11. అధ్యక్షుడగు రాజప్రతినిధితోబాటు స్టేటు కవున్సిలునందు 50 మంది సభ్యులుండవలెను. రాజప్రతినిధి కొక సహాధ్యక్షుని కూడ నియోజించుట కధికార ముండవలెను. ఈసభ్యులలో 21 మంది యెన్నిక సభ్యులుగను, 29 గురు రాజప్రతినిధిచే నియోజితులుగను నుండవలెను. ఈ నియోజితసభ్యులలో 4 గురు అనధికారులును, 25 గుర కంటె నెక్కుడు కాకుండగ (ఇందు కార్యనిర్వాహకసభ్యులు కూడ నుందురు) అధికారులును నుండవలెను.

ఈస్టేటుకౌన్సిలుసభ్యులైదువత్సరములవరకే పనియందుందురు.

ఈ స్టేటు కౌన్సిలు సభ్యత్వమున కుండవలసిన లక్షణములను గూర్చి రాజప్రతినిధి నియమముల నేర్పరుపవలెను.

12. శాసనసభలో సుమారు 100 మంది సభ్యులుండవలెను. అందు 2/3 వంతు ఎన్నిక సభ్యులను, 1/3 వంతు నియోజక సభ్యులును నుందురు. నియోజకసభ్యులలో 1/3 వంతు అనధికారులుండవలెను.

ఈ సభాధ్యక్షుడు రాజప్రతినిధిచే నియోజింపబడవలెను.

13. స్టేటు కౌన్సిలులోని అధికారసభ్యులు శాసనసభాసభ్యులుగ నియోజితులు కావచ్చును.

14. స్టేటు కౌన్సిలును గాని, శాసనసభనుగాని తొలగించుటకు రాజప్రతినిధి కధికారము గలదు.

15. శాసనసభలో ఈ క్రింది కార్యవిధానమును అవలంబింపవలెను:—

(ఎ) గవర్నమెంటు బిల్లులు:—వీనిని సాధారణముగ శాసనసభలో ప్రవేశపెట్టి, అందామోదితములైనపిమ్మట స్టేటుకౌన్సిలుకు పంపబడును. శాసనసభవా రనుమతింపని రీతిని, ఈబిల్లును స్టేటు కౌన్సిలువారు సవరించినయెడల, ఈ రెండుసభలును గలసి యీ బిల్లును చర్చింపవలెను. ఈసవరణ దేశముయొక్క సుపరిపాలనమునకును, శాంతికిని అవసరమని రాజప్రతినిధియు, వారి సభవారును నుడివినయెడల, శాసనసభ యీ సవరణలను నిరాకరించుటగాని, దానిని మరల సవరించుటగాని చేయరాదు. కాని యీబిల్లు ప్రవేశము తిరస్కృత మైనప్పుడు, ఇది పై నియమానుగుణముగ నున్నదని రాజప్రతినిధి యొప్పుకొనినయెడల, ఈ బిల్లును స్టేటుకౌన్సిలువారి విచారణకు బంపవచ్చును. అత్యవసరకార్యములయందు రాజప్రతినిధి యిట్టి బిల్లును ప్రథమముననే స్టేటుకౌన్సిలులో ప్రవేశపెట్టి, దాని ఆమోదమును బడసి, అవిషయమును శాసనసభ కెరుకపరుపవచ్చును.

(బి) ప్రైవేటు బిల్లులు.—ఈ బిల్లు ప్రతిపాదించువారే సభలో నుండెదరో ఆ సభయందే దీనిని ప్రవేశపెట్టి, ఆ సభవా

రామోదించిన పిమ్మట, రెండవసభకు బంపవచ్చును. ఈ సభల కభి ప్రాయభేద మున్నయెడల, ఈ రెండుసభల సమ్మేళనా సమావేశము గావించి విషయ పరిష్కారము చేయవచ్చును. ఈ బిల్లు సుపరిపాలనమునకు భంగకర మని ప్రభుత్వమువారికి దోచినయెడల రాజప్రతినిధికి ఈ బిల్లు పై విధానానుగుణముగ నున్నదని దెలిపి, దానిని మరల స్టేటు కవున్సిలులో ప్రవేశ పెట్టవలెను. ఈ కవున్సిలు వా కేర్పరచిన రూపమున ఈ బిల్లు శాసనమగును.

16. తీర్మానములు సలహా రూపకములుగ మాత్రమే యుండును.

17. రాజప్రతినిధియు, రాజును దేనినైన అంగీకరించుటకును, తిరస్కరించుటకును అధికారమును గలిగియుండవలెను.

18. తాత్కాలిక శాసననిర్మాణవిషయమున కిప్పుడు రాజప్రతినిధి కున్న అధికార ముండవలెను. శాసనముల చేయుటకు రాజప్రతినిధికిని, వారి సభవారికిని అధికార ముండవలెను.

19. స్టేటు కవున్సిలునందు గాని, శాసనసభయందు గాని యున్న నియోజిత అధికార సభ్యులు, ప్రభుత్వమువారు వారిని ప్రత్యేకముగ కోరిన తప్ప, నితర విషయములలో వాక్స్వాతంత్ర్యమును, తమ యిచ్చవచ్చినట్లు వోటు నిచ్చు నధికారమును గలిగి యుండవచ్చును.

20. స్టేటు కవున్సిలు సభ్యులు గాని, శాసనసభా సభ్యులు గాని పర్లిమెంటరీ ప్రశ్నల నడుగవచ్చును. ప్రజాక్షేమమునకై యొకానొక ప్రశ్నను వేయరాదను కారణమున రాజప్రతినిధి యొక ప్రశ్నను తిరస్కరింపవచ్చును.

21. స్టేటుకౌన్సిలునందును, శాసనసభయందును కార్యక్రమమును జరుపుటకు వలయు నియమములను మొదట రాజప్రతినిధిసభవారిచే నిర్మితములు కావలెను. రాజప్రతినిధి అంగీకరించినయెడల శాసనసభయు, స్టేటుకౌన్సిలును తమ నియమములను సవరించుకొనవచ్చును. ఈ సవరణలకు ఇండియా కార్యదర్శి గాని, పార్లమెంటు సభవారు గాని, అనుమతింప నవసరము లేదు.

22. శాసనసభ యొక్కయు, స్టేటుకౌన్సిలు యొక్కయు సంయుక్తస్థాయిసంఘములు సాధ్య మైనన్ని ప్రభుత్వశాఖలలో పాల్గొనునట్లు చేయవలెను. ఏశాఖలలో వీరు పాల్గొనవలెనో ఆ విషయమును రాజప్రతినిధి నిర్ణయింపవలెను. ఏయేవిషయములు స్థాయి సంఘమునకు దెలుపవలయునో అను విషయమును ఆయా శాఖాధికారి నిర్ణయింపవలెను. ఈ స్థాయిసంఘమునందలి 2/3 వంతు సభ్యులను శాసనసభ యందలి అనధికారసభ్యు లెన్నుకొనవలెను. 1/3 వంతు సభ్యులను రాజప్రతినిధిసభవారు నియోగింపవలెను.

23. హిందూదేశ ప్రభుత్వమువారిచే రాష్ట్రీయప్రభుత్వములపై నుంచబడిన బాధ్యతలకు సరిపోవునంతమట్టుకు శాసనపరిపాలనా ఆర్థికవిషయములందు రాష్ట్రీయప్రభుత్వములకు సంపూర్ణ స్వాతంత్ర్య మీయబడును.

24. కొన్ని పరిపాలనావిషయములను ప్రజాప్రతినిధులకు సంక్రమితములుగ నొసర్చి క్రమముగ నీ విధానము నభివృద్ధిపఱచి అన్ని శాఖలందును కాలక్రమమున సంపూర్ణమగు బాధ్యత ప్రజా ప్రతినిధిపర మగునట్లు చేయబడును. ప్రజాప్రతినిధులపర మొనర్పబడు శాఖలు "ప్రజాయత్త" శాఖ లనియు, ప్రభుత్వాధికారుల వశమున నుండునవి "అధికారాయత్తశాఖ" లనియు పిలువబడును.

## రాష్ట్రీయపరిపాలనాకార్యనిర్వాహకవర్గము

25. రాష్ట్రములోని రాష్ట్రీయ ప్రభుత్వకార్యనిర్వాహక సంఘమున (అ) గవర్నరును, (ఆ) అతని సహాయకవర్గమును, (ఇ) ప్రజానియుక్త లగు శాసనసభ్యులనుండి గవర్నరు గా రెన్నుకొను ఒకరిద్దరు లేక కొందఱు మంత్రులును, (ఈ) శాసనసభలో ఏ శాఖతోను నిమిత్తము లేకుండ నుండు కొందఱు సభ్యులు నుందురు.

26. గవర్నరు సహాయకవర్గమున (ఆ) ఇద్దఱు సభ్యు లుందురు. అం దొకడు భారతీయుడుగ నుండును. ప్రభుత్వాధీనశాఖ లని పైన చెప్పబడిన శాఖలు గవర్నరు యొక్కయు, గవర్నరు సహాయక వర్గముయొక్కయు నధీనమున నుండును.

27. మంత్రులని చెప్పబడువారు (ఇ) శాసనసభానియుక్త కాలమువఱకు పనిజేయుదురు. ప్రజాయత్తశాఖ లని చెప్పబడినవి ఈ మంత్రులచే నిర్వహింపబడుచుండును.

28. అధికసభ్యులు (ఈ) గవర్నరుగారిచే ఉన్నతాధికార వర్గమునుండి ఎన్నుకొనబడి నియమింపబడుదురు. వీరు గవర్నరు గారికి సలహా నిచ్చుటకును, వివిధవిషయములను యోచించుటకును నుపయోగపడుదురు.

29. పై విధముగ నేర్పఱుపబడిన ప్రభుత్వవర్గమువారు కలసి పర్యాలోచనాదులను సలుపుదురు. కాని గవర్నరుగారు తమ ప్రభుత్వవర్గమున నే శాఖనైనను ప్రత్యేకముగా పిలిపించి విషయపర్యాలోచనము గావింపవచ్చును. అధికారాశాఖలను గూర్చిన తీర్మానములును, ఆర్థికపత్రమునందు ఆ శాఖలకు ధనము నేర్పాటుచేయు విషయమును గవర్నరుగారి మీదను, వారి సహాయకవర్గముమీద నుండును. ప్రజాయత్తశాఖలను గూర్చిన తీర్మానములును, వానికి ధనము నేర్పాటుచేయు విషయమును గవర్నరుగారి మీదను, మంత్రులమీద నుండును.

30. శాసనసభ్యులలోని కొందఱు సభ్యులను గవర్నరుగారు ఎన్నుకొని, వారికి ఇంగ్లండునందు పార్లమెంటు ఉపకార్యదర్శులతో సమానస్థానము నొసగుటకు అధికారము పడయబడును.

## రాష్ట్రీయశాసనసభలు

31. ప్రతిరాష్ట్రమునందును ప్రజానియుక్తసభ్యుల సంఖ్య యధికముగా నుండునట్లు శాసనసభ వృద్ధిచేయబడును. శాసనసభ యందు (1) సాధ్యమైనంత అధిక మగు ఎన్నిక స్వాతంత్ర్యముతో ప్రజలచే నెన్నుకొనబడిన ప్రజాప్రతినిధులును (2) ప్రభుత్వము వారిచే నియమింపబడిన అధికారానధికారసభ్యులును (3) అధికారరీత్యా శాసనసభ్యులుగ నుండువారును నుందురు. (ముందు వ్రాయ

బడు) 58-వ ప్యారాయందు తెలుపబడు విచారణసంఘముయొక్క సలహాలపై గవర్నరు జనరలుగారు హిందూదేశ కార్యదర్శి యనుమతితో శాసనసభా సంఘట్టనమును, ఎన్నికలయందు ప్రజల కీయబడు అధికారమును నిర్ణయించి పార్లమెంటుకు నివేదించెదరు.

32. గవర్నరుగారు శాసనసభాధ్యక్షుడుగ నుండును. ఉపాధ్యక్షుని నేర్పఱచుటకును గవర్నరు కధికార ముండును.

33. శాసనసభను తీసివేయుటకు గవర్నరు కధికారముండును.

34. ఆర్థికపత్రవిషయమున గాక ఇతరవిషయపు తీర్మానము లన్నియు శిఫార్సులవలెమాత్ర ముండును.

35. ప్రభుత్వనియుక్త అధికారసభ్యులకు వాక్స్వాతంత్ర్య ముండును. ప్రభుత్వమువారు వద్దని ఉత్తరువిచ్చిననే తప్ప వోటుల నిచ్చుటకు వారి కధికార ముండును.

36. శాసనసభలో నే సభ్యుడైనను ఒకేవిషయమునకు సంబంధించిన ఇతరప్రశ్నలను (సప్లిమెంటరీ) అడుగుట కధికార ముండును.

37. శాసనసభల కార్యవిధానము మునుపటివలెనే జరుగుచుండును గాని గవర్నరుగారి అంగీకారముపై శాసనసభానిబంధనలను శాసనసభవారు సంస్కరింపవచ్చును.

38. శాసనసభలయందు ప్రతిశాఖకుగాని కొన్నికొన్ని శాఖలను ఒకటిగా కలిపిగాని స్థాయిసంఘము లేర్పఱుపబడును. ఈ స్థాయిసంఘములందు (1) శాసనసభలచే నెన్నుకొనబడిన సభ్యులును (2) ఆయాశాఖల ముఖ్యాధికారులును (3) ఆశాఖకు సంబంధించిన సభ్యుడుగాని మంత్రిగాని (అధ్యక్షుడు) ఉండును.

39. సాధారణముగా అన్నివిషయములకు సంబంధించిన శాసనములును శాసనసభయందు ఆమోదింపబడును. దీని విపర్యయస్థితు లీక్రింద తెల్పబడినవి.

40. గవర్నరుగారు తమ రాష్ట్రములయొక్కగాని రాష్ట్రభాగములయొక్కగాని శాంతికొఱకుగాని తమబాధ్యత నిర్వహించుకొనుటకుగాని లేక అధికారాశాఖకు సంబంధించిన బిల్లు అవసర మని నిర్ధారణముచేయ నధికారము గలిగియుందురు. గవర్నరుగారి నిర్ధారణపత్రముతో ఆబిల్లు గజెట్టునందు ప్రకటింపబడును. తరువాత దానిని శాసనసభలో నుపపాదించి, యథావిధిని చదివి, దానియందలి ముఖ్యలక్షణములనుగూర్చి చర్చజరిగిన యనంతరము ఒక గ్రాండుకమిటీ విచారణమునకు విడిచిపెట్టెదరు. ఆబిల్లును దానిపై చర్చను హిందూదేశ ప్రభుత్వమువారికి పంపునట్లు శాసనసభవారు కోరవచ్చును. బిల్లువిషయము ప్రభుత్వాధీనశాఖకు సంబంధించినదా యను ప్రశ్నములను దానికి సంబంధించిన యితరప్రశ్నములనుగూర్చి హిందూదేశ ప్రభుత్వమువారి తీర్పుకు తిరుగుడు ఉండదు.

ఒకబిల్లుకు సంబంధించిన విషయమును శాసనముగా చేయుటను శాసనసభకు వదలిపెట్టవచ్చునని గవర్నరుగారు తలచుచో బిల్లు విషయమున నిర్ధారణపత్రము వ్రాయ నవసరము లేదు.

41. బిల్లులనుగూర్చి రోచించుటకు శాసనసభలో నూటికి 40 నుండి 50 మందివఱకును గ్రాండు కమిటి ఏర్పఱుపబడును. ఈ సంఘము బిల్లునందలి విషయము ననుసరించి మార్పబడుచుండును. ఈ మహాసంఘమునం దుంచబడు సభ్యులలోకొందఱిని శాసనసభ్యు లెన్నుకొనుదురు. కొందఱిని ప్రభుత్వమువారు నియమించుదురు. ఆ సంఘమున బల మధికముగా నుండునట్లు గవర్నరుగారు (తాము గాక) కొందరిని నియమింపవచ్చును. కాని గవర్నరుగారిచే నియమింపబడు సభ్యులలో 2/3 వంతుకంటె అధికముగాఅధికారు లుండగూడదు.

42. బిల్లు విచారకసంఘమువారిచే విచారింపబడి తీర్మానింపబడినవెనుక శాసనసభకు రిపోర్టు చేయబడును. శాసనసభవారా బిల్లులను ప్రభుత్వమువారిచే నియుక్తమగు కాలములోపల చర్చింతురు. గవర్నరు సహాయకవర్గ సభ్యులలో నెవ్వనిచేతనైన సవరణ ఉపపాదింపబడిననే తప్ప బిల్లుసందర్భమున సవరణ నుపపాదించుటకుగాని, బిల్లును త్రోసివేయుటకు శాసనసభ్యులకు అధికార ముండదు. చర్చ జరిగినవెనుక బిల్లు యథాప్రకారము శాసనసభలో ఆమోదింపబడును. చర్చయందు బిల్లు ముఖ్యవిషయములలో దేనికైన ఆక్షేపణయున్నచో తీర్మానరూపమున శాసనసభాసభ్యులు వాని నుపపాదింపవచ్చును. అట్టి తీర్మానము బిల్లుతోగూడ గవర్నరు జనరలుకును హిందూదేశకార్యదర్శికిని పంపబడును.

43. బిల్లువిషయము ప్రభుత్వాధీనశాఖాపరిమితి నుల్లంఘించినచో గవర్నరు సహాయకవర్గసభ్యులలో నెవ్వరైనను బిల్లుపపాదింపబడినలక్షణమే దాని నెదుర్పవచ్చును. సవరణ యేదైన నుపపాదింపబడుచో దానినిగూడ నెదుర్పవచ్చును. తరువాత ఆబిల్లు సభలో చర్చింపబడునట్లు చేయుటకుగాని మానివేయబడునట్లు చేయుటకుగాని, బిల్లు, క్లాజు, సవరణలలో దేనిసందర్భమునను నిర్ధారణపత్రము నొసగుటకుగాని గవర్నరుగారికి ఇష్టమువచ్చినట్లుచేయ నధికార ముండును. బిల్లు క్లాజు సవరణములలో దేనికైనను గవర్నరుగారు నిర్ధారణపత్రము నొసగినచో గవర్నరుగా రాబిల్లును శాసనసభలో చర్చింప నీయకుండవచ్చును. లేకున్న బిల్లునుగాని సవరించి శాసనసభయెదుట పెట్టవచ్చును. అట్లుకాకున్న, శాసనసభవారు కోరినచో, బిల్లును విచారకమహాసంఘమునకు గవర్నరుగారు విడిచిపెట్టవచ్చును.

44. రాష్ట్రీయవిషయములకు సంబంధించిన శాసనము లన్నియు గవర్నరుగారివలనను, గవర్నరు జనరలుగారివలనను అనుమతింపబడవలెను. సార్వభౌముని యిష్టమైనచో ఆశాసనము త్రోసివేయబడును.

45. గవర్నరుగారు ఒకబిల్లును త్రోసివేసినవెనుక సవరణతో దానిని మరల నుపపాదింపనిచ్చుటకు గవర్నరు కధికార ముండును.

46. రాష్ట్రీయసంబంధశాసనములను నిలిపియుంచుటకు గవర్నరు జనరలుగారి కధికార ముండును.

### ఆర్థికములు

47. రాష్ట్రీయాదాయములును, అఖిలభారతాదాయములును వేఱువేఱుగా నుంచబడును.

48. రాష్ట్రీదాయమునుండి మొట్టమొదట హిందూదేశప్రభుత్వమువారికి ఈయవలసినమొత్తము నిచ్చివేయుట విధిగా నుండును.

49. రాష్ట్రీయ ప్రభుత్వములకు పన్నులు విధించుటకును, అప్పులు పుచ్చుకొనుటకును కొన్ని యధికారము లుండవలయును.

50. బడ్జెటును శాసననిర్మాణసభ యెదుట పెట్టవలయును. గవర్నరుగారు తమచేతిలో స్వంతముగా పెట్టుకొనియున్న శాఖల సంబంధమున అగు వ్యయాదాయములకు శాసనసభవారు అంగీకారము నొసంగనియెడల గవర్నరుగారు శాసనసభవారిచే నిరాకరింపబడిన పద్దులను పూర్తిగా గాని, లేక కొంతభాగముగా గాని బడ్జెటులో తిరిగి యుంచుటకు అధికారమును కలిగియున్నారు. కాని అట్టితతి గవర్నరుగా రట్టిపనిని చేసినందునకై గల కారణములను జూపుచు తమ చర్యను ధ్రువపఱుపవలయును. ఆరాష్ట్రముయొక్క గాని, లేక అందొకభాగముయొక్క గాని శాంతికిని, సౌఖ్యమునకుని భంగము కలుగకుండుటకై అట్లుచేసితిమనియో, లేక తమచేతిలో పెట్టుకొనని శాఖలవిషయమై తాము నెఱవేర్పవలసిన బాధ్యతలను నెఱవేర్చుటకు చేసితిమనియో రూఢిపఱుపవలయును. ఈ అధికారమును గవర్నరుగారు చెలాయించినప్పుడుతప్ప శాసననిర్మాణసభలో జేయబడిన తీర్మానముల ననుసరించియే బడ్జెటు మార్చబడుచుండవలయును.

## స్థానిక స్వపరిపాలనము

51. వీ లయినంతవఱకు స్థానికస్వపరిపాలనము పూర్తిగా ప్రజలవశము చేయవలసినది.

## రాష్ట్రీయ శాసనసభలలో మార్పులు

52. ఈ క్రొత్తశాసనసభలు ఎన్నుకొనబడిన అయిదుసంవత్సరములకు ఒక రాష్ట్రప్రభుత్వమువారు గాని, రాష్ట్రశాసనసభవారు గాని గవర్నరుగారు తమ చేతిలో స్వంతముగా నుంచుకొని నట్టియు, లేక ప్రజాప్రతినిధుల వశము చేసినట్టియు శాఖల లిస్టులో మార్పులను చేయవలసిన దని దరఖాస్తులను పెట్టుకొనినయెడల ఆ దరఖాస్తులు ఆలోచింపబడవలయును. అప్పుడు స్టేటుసెక్రటరీ గారి అనుజ్ఞమీద ఇండియా గవర్నమెంటువారు రిజర్వు లిస్టునుండి ప్రజాప్రతినిధుల చేతికి శాఖలను మార్చవచ్చును. ప్రజాప్రతినిధులచేతి కొసంగబడిన శాఖలలో నేదేని బాగుగా నిర్వహింపబడక పాడు చేయబడినయెడల దానిని గవర్నరుగారిచేతి నుండు రిజర్వులిస్టులోనికి మార్చవచ్చును. ఈ ప్రజాప్రతినిధిమంత్రుల జీతములను ఇండియా దొరతనమువారు శాసనసభవారి వోటుకు ప్రతిపాలుకు లోబఱచవచ్చును. అప్పుడు గాని మఱియొకప్పుడు గాని ఈ మంత్రుల జీతములు తమ వోటుకు పాత్రము కావలయు నని తీర్మానమును గావించు అధికారమును సభవారు గలిగియుండవలయును.

## ప్రారంభ కార్యవిధానము

53. ఇంగ్లాండునుండి వచ్చు నొక అగ్రాసనాధిపతిని, ఒక గవర్నమెంటుద్యోగిని, ఒక అనధికారభారతీయుని గలిగిన యొక కమిటీ నేర్పఱుపవలయును. ఈ కమిటీవారు గవర్నమెంటువద్దనుండి యేశాఖలను ప్రజామంత్రులచేతి కొసంగవలయునో నిర్ణయింపవలయును. ఏ రాష్ట్రములో ఈ విచారణ జరుగుచుండునో, ఆ రాష్ట్రమునుండి ఈ విచారణకర్తలకు సహాయముచేయుటకయి ఒక ఉద్యోగిని, ఒక అనధికారభారతీయుని నిర్ణయింపవలయును.

54. ఇంగ్లండునుండి వచ్చు అగ్రాసనాధిపతిని, ఇద్దరు అధికారులను, ఇద్దరు అనధికార భారతీయులను గలిగిన మఱియొక కమిటీ యేర్పాటు గావలయును. ఈ కమిటీవారు, నియామకపు ప్రదేశములను, నియామకుల కేయే యర్హత లుండవలయునో, ప్రతి రాష్ట్రములోను శాసననిర్మాణసభ కెంతమంది ప్రతినిధు లుండవలయునో, రాజప్రతినిధిసభ కెంతమంది యుండగలయునో నిర్ణయింపవలయును. ఈ విచారణ జరుగుచున్నప్పుడు ఆయా రాష్ట్రములనుండి ఒక్క ఉద్యోగి, ఒక్క అనుద్యోగు డగు భారతీయుడు వీరితో జతపఱుపబడవలయును.

55. పయిన నుదహరించిన రెండుకమిటీలును కలిసి అభిప్రాయముల నొకరి కొకరు తెలుపకొనవలయును.

## విచారణసంఘము

56. ఈ శాసనసభలు ఏర్పడిన 10 సంవత్సరములకు వాటి స్థితి యేలాగున్నదో విచారించుటకు ఒక కమీషను నేర్పాటుచేయవలయును. పార్లమెంటువారి కీ కమీషనరుల పేరులు అంగీకారార్థమయి పంపవలయును. ఇట్టి విచారణసంఘములనే తిరిగి 12 ఏండ్లలోపుగ ఏర్పఱచుచుండవలయును.

## స్వదేశసంస్థానములు

57. స్వదేశాధీశుల సభ నేర్పఱుపవలయును.

58. స్వదేశసంస్థానాధిపతులసభ కొక స్థాయిసంఘముండును.

59. ఒక స్వదేశసంస్థానాధిపతికి ఇంకొక స్వదేశసంస్థానాధిపతికి గాని, ఒక సంస్థానమునకును రాష్ట్రీయ ప్రభుత్వమునకును, లేకున్న సంస్థానమునకు హిందూదేశప్రభుత్వమునకు గాని కలహము గలిగినప్పుడు సలహాలనిచ్చుటకు ఒక సంఘ ముండును. ఆ సంఘమునందు ఒక హైకోర్టుజడ్జియును రెండుపక్షములకు చెరియొక్కొక్క ప్రతినిధియు నుండును. ఈ ప్రతినిధులను రాజప్రతినిధిగారు తమకు తోచినరీతిని నియమించుచుందురు.

60. ఒక సంస్థానాధిపతినుండి అతని హక్కులలోను గౌరవములలోను, అధికారములలోను వేనినైన తొలగింపవలసిన యెడలను, ఒక సంస్థానాధిపుని సంతతివారికి వారసత్వము లేకుండ జేయవలసినయెడలను, ఈ విషయమును గూర్చి విచారించి సలహా నిచ్చుటకు ఒక హైకోర్టుజడ్జి, ఇద్దఱు స్వదేశసంస్థానాధిపతులు, ఇద్దఱు ప్రముఖులు గల ఒక సంఘమును రాజప్రతినిధిగారు నియమించుదురు.

61. స్వదేశసంస్థానములయందు అంతర్దేశవ్యవహారములలో సర్వాధికారము గల సంస్థానాధిపతులు హిందూదేశ ప్రభుత్వమువారితోడనే వ్యవహారములను జరుపుచుందురు.

62. స్వదేశసంస్థానములతోడి సంబంధములను రాష్ట్రీయ శాసనసభల విచారణమునకు మార్చబడుట తీసివేయబడును.

63. అందఱికిని అన్యోన్యమైన వ్యవహారములను చర్చించి పరి

ష్కరించుకొనుటకై స్వదేశాధీశుల సభయును, హిందూదేశ సభయును (కౌన్సిల్ ఆఫ్ స్టేట్) సమావేశ మగుటకు తగిన ప్రయత్నములు చేయవలయును.

### గవర్నమెంటు ఉద్యోగములు

64. గవర్నమెంటుద్యోగము లొసంగువిషయమై నిబంధనములలో నిలిచియున్న జాతిభేదము లన్నింటిని తొలగింపవలయును.

65. ఇంగ్లండులో నుద్యోగులను చేర్చుకొనుపద్ధతి మాత్రమే గాక, ఇండియాలోను ఆ యుద్యోగములను తగినవారి కిచ్చుటకు పద్ధతు లేర్పడవలయును.

66. అన్ని శాఖలలోను ఇండియాలో ఇచ్చు నుద్యోగములు నూటికి యిన్ని యని యేర్పాటుచేయుచు, క్రమక్రమముగా వానిని వృద్ధిచేయుచుండ వలయును.

67. ఇండియన్ సివిలుసర్వీసులో ప్రస్తుతము సాలుకు 100-కి 1½ వంతు చొప్పున వృద్ధిచేయుచు 100-కి 33 పెద్దయుద్యోగములు భారతీయులకు వచ్చునంతవఱకును నీయవలయును. 10 సంవత్సరముల కొకతూరి కమీషనువారు తిరిగి పునర్విమర్శనమును చేయునంతవఱకును ఇట్లు జరుగుచుండును.

68. జీవనవ్యయములు వృద్ధియగు సందర్భములనుబట్టియు, తగినవారు ఉద్యోగములకు రాగలుగునట్లు చేయుటకును వేతననియమము లేర్పఱుపబడును. సాధారణముగా కాలపరిమితినిబట్టి ఉద్యోగవేతన వృద్ధి యేర్పఱుపబడును. ఆ యుద్యోగమున అత్యధికపదవి లభించుటకు వేతనవృద్ధి యొసగబడును. సాధారణపింఛనుసం దత్యధికమగు మొత్తము 6000 రూపాయల కెక్కువచేయబడును. మాఱకమున 1 షి. 9 పె. లొసంగబడును. ఉన్నతోద్యోగములకొఱకు ప్రత్యేక పింఛనులు నుండును.

ఇండియను సివిలుసర్వీసు ఉద్యోగుల కొసగబడు సంవత్సర భృత్యములు ప్రభుత్వమువారిచే నియుక్తముకాని ధనమునుండి యొసగబడును. సెలవులనుగూర్చిన నిబంధనలు విశాలభావయుతములగునట్లు చేయబడును. అధికముగనుండు సెలవుకాలమును తగ్గించుటకు వీలుండును. పూర్తిజీతము నిచ్చువరకుతో సెలవు పరిమితిని తగ్గించుటకును వీలుండును.

69. హిందూదేశమునందే ఉద్యోగుల నెన్నుకొని నియమించుటకు ఒకవిధ మగు వేతనపురేట్లు ఏర్పరుపబడును. యూరపునుండి తెప్పింపబడిన ఉద్యోగులకు గాని, అట్టి లక్షణములను గలిగిన యుద్యోగులకుగాని తగినట్లు అధికభృత్య మొసంగబడవలెను. యూరపునందు నియమింపబడు భారతీయులకును ఇట్టివర్యయే యంగీకరింపబడును.

# భారత ప్రభుత్వమువారి అభిప్రాయములు

మాంటుఫర్డు సంస్కరణములపట్ల భారతప్రభుత్వమువారు మార్చి 5 వ తేదిని ఈ క్రింది అభిప్రాయముల నిచ్చిరి:

1. ప్రప్రథమమున రాజ్యాంగనివేదికపట్ల భారతదేశ మెటుల స్వాగత మొసంగినదియు చూపెట్టుచు, భారతీయులు యూరోపియను అనధికారులు అధికారులు స్థానికప్రభుత్వములు సంస్కరణములపట్ల నిచ్చిన అభిప్రాయములను కొంతవరకు చర్చించిరి. తదనంతరము భారతవర్షమున కెట్టి ప్రభుత్వము అవసరమో అను విషయమును చర్చించి, 1917 సం॥ ఆగస్టు 20 వ తేది నాటి ప్రకటనమునకు ప్రత్యామ్నాయముగా ప్రకృతస్థితిగతుల బట్టి ఏకప్రభుత్వము కొనసాగుట కష్టతర మని నుడివిరి. రెండు రాష్ట్రప్రభుత్వములు తప్ప తక్కిన వన్నియు ఏకప్రభుత్వము కావలయు నని చెప్పినవి. 1919 సం॥ జనవరి నెలలో డిల్లీలో సమావేశమైన రాష్ట్రపరిపాలకులు తమ అభిప్రాయములను ప్రత్యేకప్రకటన ద్వారా తెలిపియుండిరి. ఈ సూచన లన్నియు చాలవరకు ఆలోచించి, వానిని నిరాకరించుటకు కారణములను తదనంతరము ప్రభుత్వమువారు తెలుపుచున్నారు. కొద్దిమార్పులతో ద్విశాఖాప్రభుత్వమే కావలయునని ప్రభుత్వమువారు పిమ్మట తమ అభిప్రాయములను వెలిపుచ్చుచున్నారు.

### కార్యనిర్వాహకసభ

2. రాష్ట్రకార్యనిర్వాహకసభావిషయమున నివేదికయందు సూచింపబడిన సూత్రముల నామోదించుచు, అధికారము వహింపని సభ్యులు కార్యనిర్వాహకవర్గమున నుండగూడ దనియు, భారతదేశ స్థితిగతులను గవర్నరుకు బాగుగా తెలియకున్న ఆయనకు సహాయులుగా నుండుటకు ఇద్దరు అధికారసభ్యులను నియమింపవలయు నని సూచించుచున్నారు. రాజధానులకు తప్ప తక్కిన రాష్ట్రములకు పాలకులను కొంతకాలమువరకు సివిలుసర్వీసు వారినుండియే నియమించుచుండవలయును. కార్యనిర్వాహకసభ కొక్క అధికారి, భారతీయు లొక్కరుండవలయు నని శాసింపవలయును. శాసనసభా సభ్యులనుండి మంత్రులు నియమింపబడవలయును. శాసనసభకు వారు లోబడి యుండవలయును. గవర్నరు కాబోవు మంత్రితో సంప్రదించి వాని జీతమును నిర్ణయించి ప్రజాయత్తశాఖాదాయము నుండి మంత్రిజీతము నీయవలయును.

### ఉద్యోగములు

3. పౌరసేవోద్యోగముల విషయమున నొకచట్ట ముండవలయు నని చెప్పుచు, ఆ చట్టము ఏ విధముగా చేయవలయునో తదనంతరము సూచించిరి. ఉద్యోగములు ఇండియను, ప్రావిన్షియలు, సబార్డినేటు అని మూడుభాగములుగ నుండవలయును. వీరిలో ప్రథములు, తాబేదారులను నియమించు అధికారము కలిగియుండవలయును. మంత్రుల క్రింద వీరు పనిచేయుటకు నిర్బంధ ముండగూడదు. ఉద్యోగముల

కట్టుదిట్టములు చేయు అధికారము గవర్నరున కుండవలయును. అధికారులు కొద్దిపాటి ఉపకారవేతనములను పుచ్చుకొని, విశ్రాంతితీసికొనుటకు స్వాతంత్ర్య మీయవలయును. అధికార ప్రజాయత్తశాఖలలో సమానముగా పనిచేయవలసిన అధికారుల ప్రమోషను మున్నగు వానిపట్ల గవర్నరుకు అధికార ముండవలయును. ఉద్యోగస్థుల విషయమున విచారణచేయుట కొక కమీషను ఏర్పడవలయును.

ఆర్థికవిషయములు

4. ఆర్థకవిషయములలో ప్రభుత్వమువారి అభిప్రాయములు నివేదికనుండి రెండువిధములుగ భేదించుచున్నవి. సామ్రాజ్య ఆర్థిక సహాయమునకు అధికార ప్రజాయత్తశాఖలు బాధ్యత యుండవలయును. సామ్రాజ్యప్రభుత్వమునకు రాష్ట్ర ప్రభుత్వములు చెల్లింపవలసిన సొత్తువిషయమున నివేదికయందు సూచింపబడినవాని నామోదించుచు, ముందు రాష్ట్ర ప్రభుత్వములు ఏ విధముగ సొమ్ము చెల్లింపవలసినది ఆలోచించుట కొక ఆర్థికవిచారణసంఘమును నెలకొల్పవలయు నని సూచించుచున్నారు.

5. సంవత్సరమున కొక్కసారి అధికారాయత్త ప్రజాయత్త శాఖలు సమావేశమై, తమ ఆదాయవ్యయముల విషయ మాలోచించుటకు గాను నివేదికలో సూచింపబడిన పద్ధతిని ప్రభుత్వమువారు నిరాకరించుచున్నారు. ఈ పద్ధతివలన నిలువసొమ్ము, పన్ను, అప్పు విషయములలో చాల కష్టము కలుగు ననియు, ఒకశాఖపైన మరొక శాఖకు సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చు ననియు, అనవసరసంఘర్షణలకు లోనగు ననియు, ఒకశాఖ తన ఆదాయమును వృద్ధిచేసికొనుటకు సాధన ముండజాల దనియు, ప్రభుత్వమువారివాదము. ఈ పద్ధతిని ప్రత్యామ్నాయముగా అధికారాయత్తప్రజాయత్తశాఖలు తమ ఆదాయవ్యయములను ప్రత్యేకముగా నిర్ణయించుకొనవలయు ననియు, రాష్ట్ర ఆర్థికములనుండి ఆ శాఖలకు సొమ్ము ఈయబడు ననియు, శాఖలకర్చులకు, సొమ్ము చాలకపోయిన ఏదో యొక ఆదాయమునుండి కొంత సొమ్మును విరాళముగా నీయవచ్చు ననియు, ప్రభుత్వమువారు సూచించుచున్నారు. ఒక్కొకశాఖ ప్రత్యేకముగా పన్నును వేసికొనుటకును, సొమ్మును బదులు పుచ్చుకొనుటకును అధికార మీయబడును. ఈ విషయములందు సూచనలు రెండుశాఖలు ఏకముగా సమావేశమై ఆలోచింపవలయును. ఆర్థికపట్టిక సయితము ఆర్థికశాఖలో ఏకముగానే తయారుచేయబడి శాసనసభలో చర్చింపబడును. శాసనసభ దీనిపట్ల అభిప్రాయ మీయవలసినదే కాని, వోటు నీయగూడదు. ఆర్థికపట్టిక సూచనలు మంత్రికి వ్యతిరేకముగా నున్నయెడల, శాసనసభ అతనిని నిరాకరించుటకు పూనుకొనవచ్చును. ప్రజాయత్తశాఖను కట్టుదిట్టముల చేయుటకు సంయుక్తకార్యదర్శితో నొక ఆర్థికశాఖ యుండగలదు. సొమ్ము నేవిధముగా ఖర్చుపెట్టవలసినది అను విషయమును గురించి యీ శాఖకు సలహానిచ్చుట కొక యుపసంఘమును శాసనసభ నియమింపవచ్చును.

శాసనసభ

6. నివేదికలో శాసనసభానిర్మాణము విషయమున సూచింపబడిన విధానముల నంగీకరింపవచ్చును. గ్రాండుకమిటీ నిర్మాణవిషయమున చర్చ కొంతకాలమువరకు ఆపుదల చేయవలయును. సర్టిఫికేట్లవిషయమున గల గవర్నరుగారి అధికారమునకు అపీలు ఉండగూడదు. గవర్నరుగారికి అంగీకారము నిరాకరణము మున్నగు విషయములలో గల అధికారములు అంగీకరింపబడినవి. కొన్ని శాసనములలో గవర్నరు జనరలుగారికి అధికార ముండుటకు గవర్నరు గారికి స్వాతంత్ర్య ముండవలయును. రెండవ శాసనసభను (అప్పర్ హౌస్) నిర్మించుట అనవసరము. శాసనసభకు గవర్నరు అధ్యక్షుడుగ నుండుటకును, ఉపాధ్యక్షుని గవర్నరే నియమించుటకును, శాసనసభాకార్యక్రమమునకు నిబంధనలను చేయవలయు ననియు, మార్పులున్న గవర్నరుగారి ఆమోదమున చేయవలయు ననియు నివేదికలో సూచింపబడిన సూచనల నంగీకరించిరి. అనుబంధక ప్రశ్నల నడుగుటకు శాసనసభ్యు లందరికి స్వాతంత్ర్య ముండవలయును. ప్రభుత్వమువారి యుత్తరువుల ననుసరించి అధికారసభ్యులకు చర్చలో పాలుగొనుటకును, వోటు నిచ్చుటకును అధికార ముండవలయును. నివేదికమునందు తీర్మానముల విషయమున గల సూచనలు అంగీకరింపబడినవి. కొన్ని నిబంధనల ప్రకారము స్థాయిసంఘములు, శాసనసభా సహాయ కార్యదర్శు లుండవచ్చును.

ప్రజాయత్తశాఖలు

7. ప్రజాయత్తశాఖలయందు కార్యక్రమమును జరుపుకొనుటకు నిబంధనలు చేయబడవలయును. ప్రజాయత్త శాఖాపాలనమున ఏసందర్భమున గవర్నరు జోక్యము పుచ్చుకొనవలసియుండునో నిబంధనలలో సూచింపవలయును. గవర్నరుగారి అభిప్రాయములకు మంత్రి వ్యతిరేకముగా నుండినయెడల గవర్నరతనిని యుద్యోగమునుండి తీసివేయవచ్చును. ఇంకెవ్వరైనను ఆస్థానము నాక్రమించుటకు సమ్మతింపక పోయిన యెడల మంత్రి యధికారమునను్న శాఖలను గవర్నరు తన అధికారములోనికి తీసికొనవచ్చును. ఆరునెలల లోపుగ గవర్నరుకు మంత్రి చిక్కకపోయిన సదరు శాఖలను సభాయుక్తులగు గవర్నరు స్వాధీనతకు మార్చుటకు హిందూదేశాంగమంత్రి యుత్తరువును కోరవచ్చును.

8. ప్రజాయత్త అధికారశాఖలకు, సంబంధించు విషయములలో నేవైన కలతలువచ్చిన గవర్నరు జోక్యము పుచ్చుకొని ఆశాఖలకు సంబంధించిన మంత్రులు సభ్యులతో సంప్రదించవచ్చును. కాని ఒక శాఖకు సంబంధించిన విషయము ఆశాఖయే పరిష్కరింపవలయును. ఏశాఖ యొక విషయమును పరిష్కరింపవలయునను విషయమున అనుమానము గలిగిన యెడల గవర్నరు దానిని పరిష్కరింపవచ్చును. అధికార ప్రజాయత్త శాఖలు జారీచేయు ఉత్తరువులు విశదముగా నుండవలయును. ఒక శాఖ మరొక శాఖకు వ్యతిరేకముగా నుండకూడదు. అయినను రెండు శాఖలు ఒకదాని కొకటి సహాయము చేయక నుండవచ్చును.

విచారణసంఘములు

9. అయిదేండ్లకొకసారి నియమింపబడు విచారణసంఘ నివయములలో నేమియు నభ్యంతరములేదు. కాని యీ లోపుగ ప్రభుత్వమున నేమియు మార్పులు జరుగకూడదు.

### రాజప్రతినిధిసభ

10. రాజప్రతినిధి కార్యనిర్వాహక సభలో భారతీయ సభ్యుల నియమించు విషయము, సభ్యుల సంఖ్యావిషయమున గల నిర్బంధముల తొలగించుటకును అంగీకరించుచు, శాసనరీత్యా ఇద్దరు అధికారులను, ఒక న్యాయవాదిని, ఇద్దరు భారతీయులను నియమించుటకు సదుపాయములు చేయవలయును. ఫ్రాంచైసు కమిటీవారి సూచనలు తెలిపినంతవరకును, శాసనసభ అంగనిర్మాణము, అధికారముల విషయముల నేమియు చెప్పజాలము. శాసనసభాధ్యక్షులు వైస్రాయిగారిచే నియుక్తులగు అధికారులుగ నుండవలయు ననియు, శాసనసభయందలి చట్టము నంగీకరించుట నిరాకరించుట మున్నగు విషయముల పట్ల గల అధికారములు యథాప్రకారముగా నుండవలయు ననియు వైస్రాయి చట్టమును పునర్విమర్శనమునకు బంపుటకును శాసనసభను గాని, స్టేటుకవున్సిలును గాని నిలుపుదల చేయుటకును, స్వాతంత్ర్య ముండవలయును. శాసన సభానిర్మాణములు ప్రశ్నోత్తరములు, కార్యక్రమ నిబంధనలు ఇప్పటివలెనే యుండి తీరవలయును. స్టేటుకవున్సిలు నిర్మాణ మంగీకరించుచు, సభాసహాకార్యదర్శుల నియోజకము ప్రకృత మనవసరమని ప్రభుత్వమువారి అభిప్రాయము.

### ఇతర విషయములు

హిందూదేశాంగ మంత్రి, పార్లమెంటు అధికారములను తగ్గించి, దేశాంగమంత్రి జీతము ఆంగ్లదేశ బడ్జెట్టులో చేర్చుటకును నివేదికయందు సూచింపబడిన సూచన లంగీకరింపబడినవి. భారతదేశ విషయముల చర్చించుటకు పార్లమెంటు సంఘమును నియమించుటకు అంగీకరించుచు ఈ సంఘమున కామన్సు, ప్రభువుల సభాసభ్యులుండుటకు అవకాశములు గలుగజేయవలయునని ప్రభుత్వమువారి అభిప్రాయము. ఇండియా కార్యాలయ విచారణసంఘమువారి నివేదికమును చూచినంతవరకు హిందూదేశాంగ మంత్రి కార్యాలయము యొక్క పునర్నిర్మాణ విషయమున ఏమియు చెప్పజాలమని ప్రభుత్వమువారు చెప్పుచున్నారు.

# సర్ శంకరనాయరుగారి ఆక్షేపణము

భారతప్రభుత్వమువారి అభిప్రాయముతో సర్ శంకరనాయరు ఏకీభవింపక వారిభావముల నాక్షేపించుచు ప్రత్యేక నివేదికమును ప్రకటించిరి. అందలి ముఖ్యవిషయములను క్రింద ముద్రించుచున్నాము.

1. బ్రిటిషు సామ్రాజ్యమునందు ప్రధానాంగముగా నుండి క్రమాంతరమును బట్టి బాధ్యతాప్రభుత్వము నందునట్లుగ భారతదేశ ముండుటయే శ్రీసార్వభౌమప్రభుత్వవిధాన మని ప్రకటింపఁబడినది. పార్లమెంటు సభవారివద్ద నుండి భారతదేశశాసనసభలకు అధికారమును క్రమముగను సంపూర్ణముగను మార్చుటయే ప్రకటనాభిప్రాయ మని కొందఱభిప్రాయపడుచున్నారు. బ్రిటిషు సామ్రాజ్యమున భారతదేశము ప్రధానాంగముగా నుండవలయు ననెడి మాటనుబట్టి అట్టి అర్థము సమంజసము కాదేమో యని నాకు తోఁచుచున్నది. భారతదేశము ఎంతకాలము బ్రిటిషుసామ్రాజ్యమున నుండునో అంతకాలమును పార్లమెంటు సభాసర్వాధికారమును గుర్తింపవలసియే యుండును. ఆచారమును బట్టియు, సాంప్రదాయమును బట్టియును, పార్లమెంటు అధికారముపైని కొన్ని నిర్బంధములను విధింపవచ్చును. పార్లమెంటు సభాధికారమును గుఱించి వివిధవలసదేశములలో వివిధములుగా నర్థములను చేయవచ్చును. కాని ఏ సమయమందైనను భారతదేశ ప్రభుత్వవిషయములలో పార్లమెంటు సభవారికి జోక్యము కలుగఁజేసికొనుటకు న్యాయసమ్మత మగు హక్కు కలదనుట నిర్వివాద మగు నంశము. ప్రజాప్రతినిధులు గల శాసనసభకు కార్యనిర్వాహకవర్గము వారు లోఁబడి యుండుటయే (బాధ్యత) యని నా యభిప్రాయము. ప్రతివిషయములోను శాసనసభాభిప్రాయమును కార్యనిర్వాహక వర్గమువారు చెల్లించుటయే యిందలి ప్రధానాంశము.

నా సహోద్యోగులు చేయు సూచనలు పార్లమెంటుఅధికారమును తగ్గించుటకే ఏర్పడినవి. కాని వీరి యుద్దేశము, అధికారమును పార్లమెంటు సభవారినుండి శాసనసభలవశము చేయుట గాక, దీనినంతను భారతదేశమునందలి కార్యనిర్వాహకప్రభుత్వవశము చేయుటయే యని తోఁచుచున్నది. పార్లమెంటువారు తమ యధికారమును ప్రజాప్రతినిధిసభలవశము చేయవలసిన దనియే భారతీయులు గోరుచున్నారు. కాని దీనినంతను కార్యనిర్వాహక ప్రభుత్వములకు ఒసంగవలయు నని భారతీయు లభిలషించుట లేదు. మార్పులు జరుగుకాలమున కార్యనిర్వాహకాధికారుల ప్రోత్సాహమువలన గాని, మఱి యితర కారణములవలన గాని, పార్లమెంటు సభవారు శాసనసభాధికారనిర్వహణములో జోక్యము కలుగజేసికొనవచ్చును. భారతదేశ విషయములలో పార్లమెంటు సభవారు న్యాయమగు జోక్యమును కలుగజేసికొనుటకు మితవాద్యభిప్రాయ మెప్పుడును ఆక్షేపింపఁజాలదు. ఇట్టి జోక్యము ఇంకను ఎక్కుడు సంతోషముగా కోరబడుచుండును. భారతప్రభుత్వము వారును కాంగ్రెసు పక్షమువారును గావించు సూచనలలో గల భేదములకు ఇదియే చాలవఱకు కారణభూతము. భారతమంత్రి గల ఇండియా ఆఫీసుయొక్క ప్రస్తుత నిర్మాణమునుబట్టి ఆసభ పార్లమెంటు ప్రాతినిధ్యమును కలిగియుండ లేదని చెప్పవచ్చును.

2. ఈ ప్రకటనమునకును తదనుగుణమగు కార్యాచరణమునకును ప్రతికూలముగ నిక నొకవిమర్శనము గలదు. భారతదేశము ఇదివఱకు నిరంకుశైకరాజ్యాధికారమున నుండె ననియు, బాధ్యతాయుతప్రభుత్వము ఆదేశజుల భావములకు విరుద్ధమనియు, నందుచేత దానిని ఈదేశమునందు ప్రవేశపెట్టుట దుర్లభమనియును కొందఱు వాదించుచున్నారు. ఇట్టి ఆక్షేపణలు చేయువారు భారతదేశము

విద్యామూలమునను పరిస్థితులవలనను సాహచర్యముచేతను, రాజకీయాభివృద్ధిమూలమునను కాలక్రమమునను చాలవఱకు మార్పుచెందినదను విషయమును మఱపుచెందుచున్నారు. నిజమును తెలిసికొనినయెడల ఏకరాజేతరపాలనావిధానము భారతీయులకు తెలియనివిషయము గాదు. ఈ విషయమున విదేశచరిత్రకారుల యభిప్రాయముల నిట తెలుపుచున్నాను. "అధికారముతో కూడిన ఏకరాజపాలనముతో పాటు సంపూర్ణముగా గాని కొంతవఱకు గాని స్వాతంత్ర్యము ననుభవించుచుండిన ప్రజాపాలనములుకూడ కలవని బౌద్ధగ్రంథములవలన తెలియుచున్న"దని ప్రొఫెసరు రిస్, డేవిడ్సుగారు వ్రాయుచున్నారు. వీరు ఈ విషయముగూర్చి యింకను ఇట్లు తెలుపుచున్నారు. "ఒక తెగవారి ప్రభుత్వన్యాయశాఖా కార్యనిర్వాహణమునకై కపిలవస్తుపురమునందలి సభాభవనమునందు వృద్ధులును యువకులును మొదలగు నెల్లరును సమావేశ మగుచుండిరి. వీరిలో నొకరు అధ్యక్షుడుగా నెన్నుకొనఁబడి ఆ సభనుగాని లేక పాలనవిషయికసభల నన్నిటిని గాని నిర్వహించుచుండును. ఇతఁడు ఎట్లు ఎన్నుకొనఁబడెనో, ఎంత కాలము ఈ పదవియందుండెనో తెలియదు. రోమక రాజ్యములోని కాన్సలులవలెగాని గ్రీకు రాజ్యములోని ఆర్కనువలెగాని ఈ యుద్యోగియుండెననియు నితనికి రాజు అను బిరుదము ఒసంగబడెననియు దెలియుచున్నది." మెక్రిండెలుగారు వ్రాసిన 'ప్రాచీనభారతదేశము' అను గ్రంథములో 292-వ పేజీయందు "ప్రజాస్వామ్యప్రభుత్వవిధానము కానవచ్చుచుండె"నని గ్రీకు గ్రంథకారులు తెలుపుచున్నట్లు వ్రాయఁబడి యున్నది. ఈదేశమున నివసించు మఱొకజాతి వారిలో ప్రజాస్వామ్యప్రభుత్వము కలదనియు, కాని అది న్యాయసమ్మతముగా లేదనియు తెలుపబడియున్నది. ఇంక నలగ్జాండరు నెదిరించిన ఇతరజాతు లన్నియును ప్రజాస్వామ్యప్రభుత్వమును గలిగియుండె ననియును తెలియుచున్నది. (మెక్రిండెలు పే 154) పాటలయను నగరమున స్పార్టను ప్రభుత్వమువలెనేయున్న యొక రాజ్యాంగయంత్రము కలదనియు రెండువంశములకు చెందిన ఇద్దరు రాజులకు సైన్యాధికారము వంశపరంపరాగత మనియును పెద్దలసంఘ మొకటి రాజ్యవిషయములలో సర్వాధికారము గలిగియుండె ననియును డియోడొరేను వ్రాయుచున్నారు. ఈవిషయమున హావెలుగారు వ్రాసినగ్రంథమే నాకు తెలిసినంతవఱకు నత్యంతము ఆధునికమైనది. వారందులో ఇట్లు వ్రాయుచున్నారు. "హిందూదేశము బాధ్యతారహితమగు నేకరాజపాలనమున నుండె నని ఐరోపాఖండమునందు వ్యాపించియున్న యభిప్రాయము ముసల్మను పాలనమునకు పూర్వమునను ప్రభుత్వవిధానము నెడల ననువర్తింపదు. భారతదేశము నెడల నైరోపియనులకు గల దురభిప్రాయములలో నిది యొక్కటి." "పాశ్చాత్య పార్లమెంటుసభలను పోలినరీతిని సభలు భారతదేశమునందు నున్నవనియు నిందుమూలమున నీ రెండు దేశములవారును క్రీస్తుకు మునుపు ఆఱవశతాబ్దికి పూర్వము ఏకసంతతిలోని ఆర్యులనియు, నార్మను విజయము నాఁటికి ఆసంతతివారు మిగుల నుచ్చదశయం దుండిరనుట, కొందఱు పాఠకులకు నాశ్చర్యజనకముగ నుండగలదు." "తీవ్రములగు సంక్షోభకలహములవలనను అల్లరులవలనను ఆంగ్లేయులు అధికారులయొద్దనుండి మిగుల ప్రయాసమీద నధికారమును బలవంతముగా లాగికొనిరి. కాని భారతదేశపు టార్యుల రాజ్యాంగనిర్మాణము సీమంతులచే ప్రజల కొసంగబడిన స్వాతంత్ర్యబహుమానము నొసంగిరని తెలియగలదు. ఈబహుమానము ఒకతరగతివారి లాభమునకు గాక యెల్లరకును సమానాధ్యాత్మికాధిభౌతికస్వాతంత్ర్యము లభించుటకే నిర్దేశింపబడినది. అది ఆయాజాతుల శక్తిసామర్థ్యములను బట్టియు ప్రజాక్షేమమునుబట్టియు ప్రసాదింపఁబడుచున్నది." దక్షిణ హిందూదేశమునందు రాజులను తొలఁగించుచు వారిపై నధికారమును గలిగియున్న ప్రభుత్వసంఘము లుండెడివని మెగాస్తనీసు వ్రాయుచున్నాడు. ఇట్టి పాలనవిధానములు ఎంతకాల ముండెనో చెప్పుటకు వీలు లేదు. పోర్చుగీసువారు దండయాత్ర వెడలినకాలమునందు హిందూదేశపు పశ్చిమదిశయం దున్న నాయరులలో నిట్టి ప్రభుత్వవిధాన ముండెననుట నిశ్చయము. రాజులపైని అధికారముగల పార్లమెంటుసభ ఇచ్చట నుండెనని పోర్చుగీసు చరిత్రకారుడు వ్రాయుచున్నాడు. ఈవిషయము లోగనుయొక్క మలబారుజిల్లా చరిత్రమునందు తెలుపఁబడినది. భారతదేశమునకు వాయవ్యమూల నున్న జిర్గాలు అను జాతివారిలో సంధి సంగ్రామ ప్రభుత్వవిషయములను పరిష్కరించు ప్రజాప్రతినిధిసభలు ఉండియుండెను. భారతదేశ స్థితిగతులను బట్టి ఈ ప్రజాప్రతినిధి ప్రతిష్ఠాపనలు చిరకాలజీవితము లగుట దుర్లభమైనది. ఈదేశము బ్రిటిషువారి వశమైనప్పుడు ప్రజాస్వామ్యప్రభుత్వభావములు అంతమొందలేదను విషయము ఎల్లరకు తెలిసియే యున్నది.

8. బ్రిటిషువారు ఈదేశము నాక్రమించినప్పుడు, పల్లెలయందు ప్రజాస్వామ్యప్రభుత్వవిధానము ఉండె ననుట నిర్వివాదాంశము. "ఇండో ఆర్యనుమతమునకు పునాదిగ సాంఘిక రాజకీయప్రతిష్ఠాపనములను నిర్మించి అవి దుర్వినియోగములు కానట్లు తగిన కట్టుబాట్లను చేసి ఆర్యులు తమ ధీశక్తిని వెల్లడించియుండిరి. అట్టిసంతృప్తికరమగు స్థానిక స్వపరిపాలనవిధానము యూరపుదేశముయొక్క ప్రాచీనాధునికచారిత్రములయం దెచ్చటను గానరాకున్నది." దండయాత్రలును మార్పులును రాజ్యవినాశములును ఎన్ని సంభవించినను ఈవిలేజి ప్రజాస్వామ్యములు నశింపలేదని కామన్సుసభవారి ప్రత్యేకసంఘపు ౫-వ నివేదిక తెలుపుచున్నది. ఈ విషయమునుగుఱించి స్లీమెను అను నాతని 'ప్రయాణము' మాక్సుముల్లరు వ్రాసిన 'భారతదేశ బోధము'ను చూచినయెడల నిజస్థితి తెలియఁగలదు. ఈ విలేజి సభలు సివిలు క్రిమినలు కేసులను నిర్ణయించుచుండెను. కేంద్రప్రభుత్వము అన్నివిషయములలోను, ఈసంఘములతోనే సంప్రతించుచుండెను గాని పల్లెలయందలి ప్రజలతో నెట్టి యేర్పాటులు చేసియుండలేదు. ఆదాయమును, పన్నును, ఈసభలే ప్రజలకు విభజించుచుండెడివి. ప్రభుత్వమువారి భూములు వీనివశముననే యుండెడివి. వీనియందు ఎన్నికసభ్యు లుండెడివారు. ఈ ఎన్నిక స్వాతంత్ర్యమునకు వలయు నియమములలో కొన్నిటిని గల శిలాశాసనములు లభించి

నవి. కాని అట్టిసభలు బ్రిటిషు ప్రభుత్వమువారి రివెన్యూపద్ధతికిని, పాలనవిధానమునకును క్రిమినలు శాసనపరిపాలనమునకును విరుద్ధములుగా నున్నవి. పల్లెలయందున్న ప్రాతయుద్యోగులు ప్రభుత్వసేవకులుగా మన ప్రభుత్వమువారిచే మార్చబడి ప్రజలచే నిరంకుశవర్తనులుగా పరిగణింపబడుచున్నారు. పల్లెల వ్యక్తిత్వమును శాసనములు గుర్తించుటలేదు. కొన్ని విషయములలో నిది నశింపజేయబడుచున్నది. ఇదివఱకు గ్రామపరమున నున్న భూములు ఇప్పుడు ప్రభుత్వపుభూములయినవి. బ్రిటిషుపాలనమువలన గాని శాసనములవలన గాని నిర్మితములైన గ్రామప్రతిష్ఠాపనములను ప్రాచీనసభలతో నేవిధమునను సరిపోల్చుటకు వీలులేదు. ప్రజలలో ప్రజాప్రభుత్వభావము ఇంకను నశింపలేదను విషయము ఈ గ్రామసంఘములను దూచాయగ బరికించినవారికిగూడ తెల్లము కాగలదు.

4. గొప్ప ఆస్తులకు సంబంధించిన తగవులను ఆయావర్గమునకు సంబంధించిన సంఘములచే నిర్ణయింపబడుచుండె నను విషయము ప్రతి భారతీయన్యాయవాదికిని తెలిసియేయున్నది. భారతరాజ్యాంగనిర్మాణమునకు నిరంకుశమే ప్రధానలక్షణ మను వాదమునకు, ఈ న్యాయపరిపాలనపద్ధతి తగిన ప్రత్యుత్తరము. వారసత్వమునకు సంబంధించిన హిందూధర్మశాస్త్రమును తత్సంబంధము లగు ఇతరశాసనములను మనము పాలించుచున్నాము. అయినను మనకు తెలిసినంతవఱకు అవి ఎట్టి సార్వభౌముని అనుమతిని పొందిన శాసనములును కావు. అవి రాజులవలన గాక ధర్మశాస్త్రజ్ఞులచేత ఏర్పరుపబడి వివిధవర్ణముల వారిచేతను, గ్రామసంఘములచేతను తమ యెదుటికి విచారణకు వచ్చిన కేసులలో ననువర్తించుచుండినవి. కాన నిరంకుశైకరాజపాలనముకంటెను భిన్నమగు నెట్టి ప్రభుత్వమైనను హిందువుల భావములకు విరుద్ధము లనుట సత్యదూరము.

5. ఇంతేకాక భారతీయులు ప్రాచీననాగరకమునుండి గ్రహించిన భావములను సాంప్రదాయములను అటుండ నిచ్చినను, వారు బ్రిటిషు పాలనమునందు ప్రజాప్రాతినిధ్యప్రతిష్ఠాపనాభావములను గ్రహించి రనుటకు సందియము లేదు. కడచిన ముప్పదియైదు సంవత్సరముల నుండియును మునిసిపలు జిల్లా లోకలు సంఘములకును, కాంగ్రెసు మున్నగు మహాసభలకును ప్రతినిధుల నెన్నుకొను నలవాటు ప్రజలకు కలిగినది. ప్రజా ప్రతినిధులు గల శాసనసభలను నిర్మింపవలయు నని వారు కోరుచున్నారు. ప్రజాక్షేమమునకు సంబంధించిన సమస్యలను పరిష్కరించుటకు ప్రజాప్రతినిధులు గల ప్రభుత్వము కంటె నింక నెట్టి విధానమును ధీయుక్తము లగు ఆధునిక భారతీయులకు రుచింపదనుట నిశ్చయము. ప్రస్తుతము భారతదేశాభిప్రాయమును, సంతృప్తిపరుప గల సంస్కరణముల ప్రసాదించుటకు పూర్వము ఈ విషయమున భారతప్రజాభిప్రాయ మెంతవఱకు అభివృద్ధి నొందినదో తెలిసికొనుట ముఖ్యము.

ఈ విషయముల నన్నిటిని యోచింపక రాజ్యాంగసంస్కరణ విధానమును ఆగష్టు 20 వ తేది ప్రకటనమునకు విరుద్ధముగా నుండునట్లు నొనరించు వివరణలను నా సహోద్యోగులు సూచించియున్నారు. దీనిని గుఱించి తెలుపుటకు పూర్వము సంస్కరణ నివేదికాసూచనలను గుఱించియును తెలిపి సమస్యాస్వభావమును గత ముప్పది సంవత్సరముల నుండియు ప్రస్తుత స్థితిగతులకు తోడ్పడిన అంశములను ఇంచుక వ్రాసెదను.

## విధానము - రాష్ట్రీయ ప్రభుత్వము

6. సంస్కరణ నివేదికయందలి సూచనలను మూడు విశాల విభాగములుగా విభజింపవచ్చును.

1. స్థానికస్వపరిపాలనము మున్నగు ప్రభుత్వశాఖలు, ప్రజాప్రతినిధులు గల రాష్ట్రీయశాసనసభల అధికారమునకు లోబడియున్న భారతమంత్రులవశము చేయబడును. ఆయాశాఖలు ఆ రాష్ట్రపు గవర్నరు పరిశీలనము క్రింద మంత్రి పరిపాలించుచుండును.

2. ఇతరశాఖలకు సంబంధించిన విషయములు ప్రభుత్వాయత్తములుగా నుండును. ఒక సివిలియను ఉద్యోగియు, గవర్నరు సూచననుబట్టి నియమింపబడిన ఒక భారతీయుడును గల కార్యనిర్వాహకసంఘమువారిచే నా శాఖ పాలిత మగుచుండును.

3. ప్రతి శాఖలోను కార్యనిర్వాహకాధికారులకు నిర్ణయాధికార ముండినను ప్రధానవిషయములలో మంత్రులును కార్యనిర్వాహకసంఘమువారును కలసి కృషి సలుపుచుందురు గావున ప్రభుత్వాయత్తవిషయములలో మంత్రియు శాసనసభయు కొంతవరకు తమ అభిప్రాయమును కొనసాగించుటకు శక్తి కలిగియున్నారని చెప్పవగును. ఆర్థికపత్రనిర్ణయమున మంత్రికిని కార్యనిర్వాహకసంఘమునకును అభిప్రాయభేదము జనించునపుడు ఆ విషయమును గవర్నరు పరిష్కరించుట కధికారము గలదు. ఆ విధముగా నిర్ణయింపబడిన ఆర్థికపత్రమును శాసనసభవారు తమ యిచ్చవచ్చిన విధమున మార్చవచ్చును. కాని ప్రభుత్వాయత్తవిషయములకు అవసర మని తోచినయెడల ఆర్థికపత్రమునందలి ఎట్టి విషయమునైనను శాసనసభాభిప్రాయమునకు భిన్నముగ మార్చుటకు గవర్నరున కధికారము గలదు. మరియు మంత్రి అనుమతిలేనిదే ఏ విషయమునైనను పన్నుల విధింప వీలు లేదు.

7 దానినిబట్టి చూచినయెడల ప్రభుత్వాయత్తవిషయములలో కూడ మంత్రికిని శాసనసభకును పలుకుబడికలదని తెల్లము కాగలదు ఈ విధముగా కార్యనిర్వాహకసభ అనేకప్రధానవిషయములలో శాసనసభయొక్క పలుకుబడికి లోబడినట్లు చేయబడియున్నది. ఇప్పుడు భారతప్రభుత్వమువారిచే తెలుపబడిన నిరోధదాయకసూచనలనుగూర్చి యోచించునపుడు ప్రభుత్వాయత్తవిషయములకు సంబంధించిన ఈ పై నియమములను గుర్తింపవలసియున్నది. ప్రభుత్వాయత్తశాఖనుండి పాలనావిషయములను ప్రజాయత్తములుగా చేయుటకై అప్పుడప్పుడు పార్లమెంటరీసంఘము లేర్పరుపబడుచుండును. ప్రజాయత్తవిషయపాలనములో మంత్రికిని శాసనసభకును కలిగిన విజయమునుబట్టియే ఈ శాఖ మార్పులను జేయ నవసరము లేదు. మంత్రియు శాసనసభయు ఇచ్చు సలహాలను ననుసరించియు వారికి గల

పలుకుబడినిబట్టియు పాలనావిషయములను ప్రభుత్వాయత్తశాఖ నుండి ప్రజాయత్తశాఖకు మార్చుటకు ఈ సంఘమువారికి ప్రోత్సాహ మెుసగుచుండును. కావున ప్రభుత్వ ఐక్యమునకు ఏర్పరుపబడిన ఈ నియమములు ప్రభుత్వాయత్తవిషయములకై మంత్రులకును శాసన సభలకును గల పలుకుబడి సంస్కరణవిధానములో ప్రధానభాగ ముగా నున్నది. భారతీయదృక్పథమునుబట్టి చూచినయెడల వీని ప్రాముఖ్యము ఇంకను హెచ్చుచున్నది. ప్రజాభిప్రాయమునుబట్టి పాలనావిషయమున పురోవృద్ధికరము లగు ఏర్పాటులను చేయవల సిన యనేకప్రధానవిషయములు ప్రభుత్వాయత్తశాఖయందు జేర్ప బడుట నిశ్చయము. ఈ నియమములనుబట్టి అవసరమగు మార్పులను ఈ శాఖావిషయపాలనములో చేయవలసినదని శాసనసభలను మంత్రి యు నొక్కి చెప్పవచ్చును. వారుసూచించిన మార్పులు కార్యరూపము దాల్చకపోయినయెడల కార్యనిర్వాహకసంఘమువారే యిందులకు బాధ్యులుగా పరిగణింపబడుటయు, పరిశోధకసంఘమువారు ప్రభు త్వాయత్తవిషయములను ప్రజాయత్తములుగా చేయుటయు తట స్థించును.

భారతప్రభుత్వమువారు సాధ్యమైనంత తక్కువసంఖ్య గల పాలనావిషయములనే (అనగా దేశముయొక్క శాంతి, సుపరిపాలన విషయములను) తమవశమున నుంచుకొనవలసినదని నివేదిక తెలుపు చున్నది. కావున సాధ్యమైనంతవఱకు ఈ నియమము నుల్లంఘింపక, అధికారమును రాష్ట్రీయప్రభుత్వములకొసఁగుట చేయుట అవసరము. ఈవిషయము ప్రస్తుత స్థితిగతులనుబట్టి సంస్కరణములు ఆచరణ లోనికి వచ్చుట దుర్లభ మనెడి అభిప్రాయము ననుసరించియున్నది.

8. ఈసూత్రములను రాష్ట్రములకు సంబంధించినంతవఱకు సంస్కరణవిధానముల నే నంగీకరించుచున్నాను. నేను కొన్ని సవరణ లను సూచించుచున్నాను. కాని అవి ఈసూత్రములతో ననుగుణము గ నేయుండి రాష్ట్రీయప్రభుత్వములకు సంబంధించినంతవఱకు కొంచె ము ముందంజ వేయుచున్నది. నా సహోద్యోగులు ఈవిధానమును చాలవఱకు మార్పు నొందింపవలె నని సూచించుచున్నారు. వారి విధానమునుబట్టి ప్రజాయత్తవిషయములలో బాధ్యత నశించుచున్నది; మంత్రియొక్కయు శాసనసభలయొక్కయు పలుకుబడి సంపూర్ణ ముగా తొలగిపోవుచున్నది. ప్రజాయత్తవిషయములలో అధికార మును పొందువారు ప్రజాక్షేమమునకు భంగకరముగా వర్తించెద రనియు, సంస్కరణాభిలాష అల్పసంఖ్యాకులయందు మాత్రమే కానవచ్చుచున్న దనియు ఇందుమూలమున రాజకీయాభివృద్ధికి పాల నాసౌష్ఠవమును కోల్పోవలసియుండు ననియు, ఇంతవఱకును బ్రిటిషు ఆశయానుగుణ్యముగా నడిపింపబడుచున్న దేశపాలనము భారతీయ ఆశయానుసరణముగా నిర్వహింపబడుననియు నా సహోద్యోగులు వాదించుచు, తదనుగుణ్యముగ నే తమ సూచనలను వెల్లడించియుం డిరి. సంస్కరణనివేదికయందు గూడ ఆ నివేదిక కర్తలకు కలిగిన యిట్టి యభిప్రాయములే సంస్కరణసూచనలను చాలవఱకు సంకు చితపఱచినవి.

9. దేశమున సత్పరిపాలనము లేకపోవుటవలన కలిగిన కష్టము లును ప్రస్తుత స్థితిగతులనుబట్టి ఈ కష్టములు తొలగవనెడి నిరాశ యును దేశమున రాజద్రోహము, విప్లవోద్యమములు జనించుటకు కారణములు. ఇటీవల స్వపరిపాలనమును గడింపవలె ననెడి అభిలాష యు, సంగ్రామమువలన గలిగిన భావపరివర్తనమును, సంస్కరణ వాంఛ ద్విగుణీకృత మగుటకు తోడ్పడినది. నివేదికయందు తెల్పబడి నటులు భారతవిద్యాధికులు దేశపాలనమున పాల్గొనవలె ననెడి అభి లాషయే ఇందులకు కారణ మనెడివాదము సమంజసముగా లేదు. ప్రథమమున ఆంగ్ల ఆశయముల ప్రకారము పరిపాలనమును వృద్ధిచేయ వలె ననెడి ఉద్దేశమే మొదట సంస్కరణత్వష్టను పురికొల్పినది. ఇప్పుడు స్థితిగతులు మారినవి. అందుచే ప్రభుత్వశాఖలయం దన్నిటి యందును భారతీయులను ఎక్కువగా జేర్చుకొనుటయు, స్వపరి పాలనము నొసంగుటకు నేకవిషయముగా పరిగణింపబడుచున్నది. ఇందుమూలమున దేశపుస్థితి తొలగుననను అభిప్రాయము వ్యాపించి యున్నది.

10. ఈ యుద్యమ ప్రతికూలురు, కాంగ్రెసుమహాసభ వంగ దేశీయులచేతను, దక్షిణ ఇండియా బ్రాహ్మణులచేతను స్థాపింపబడిన దనియు, భారతదేశమంతయు వీరితో నేకీభవించుట లే దనియు భావించుచున్నారు. ఈ బంగాళీలతోడను దక్షిణ హిందూస్థానపు ఆందోళనపరులతోడను తమ కెట్టిసంబంధమును లేదని ప్రకటింపవల సినదని మహారాష్ట్రులు కోరబడిరి. ఈ కోరికకు వచ్చిన ప్రత్యుత్తరము మనకు దెలిసియేయున్నది. కొన్ని కరగతులవారు చేయు ఆందోళన మును ప్రభుత్వమువారు సమానభావముతో తిలకింపవచ్చు ననియు, కాని మహమ్మదీయులు చేయు ఆందోళనము మాత్రము ఆవిధముగా తిలకింపబడదనియు మహమ్మదీయులు బెదరింపబడిరి. కాంగ్రెసు మహాసభ వీరికి ప్రతికూలముగ నున్నది. భావములు మహమ్మదీయులు జనింపజేయుటకు ప్రబలప్రయత్నములు చేయబడినవి. ఈ వివాదజని తములగు స్థితిగతులే సంస్కరణములయెడల మహమ్మదీయుల ప్రతి కూలభావమును తెలుపుచున్నది. వారిలో ఉదారభావు లగువారు హిందువులకంటె గూడ ఎక్కుడుసంస్కరణములను కోరుచున్నారు. కాంగ్రెసు ప్రతికూల రాజనీతిజ్ఞులు సిక్కులు, పంజాబీలు మున్నగు జాతులు స్వపరిపాలనమునకు ప్రతికూలముగా నుండె నని తలచు చున్నారు. ఇప్పుడు మాత్రము స్వరాజ్యమునకు పంజాబుకంటె నెక్కుడు ఉత్సాహమును, కార్యదీక్షను చూపువారు వేఱే లేదని తెలియగలదు. ఢిల్లీ కాంగ్రెసుసభయందు సంస్కరణనివేదికముకంటె నెక్కుడుసంస్కరణములు వాంఛితము లగుటకు పంజాబుదేశీయుల భావములే కారణములు. బ్రాహ్మణేతరులును నిమ్నజాతులును తమ దుస్థితిని, అసహాయస్థితిని గ్రహించి, ఒక శతాబ్దమునుండి తమ్ము నను బాగుచేయుని ప్రభుత్వమువారిపై నాధారపడియుండక తమ భావి నిర్ణయమున అధికారము కలిగియుండవలెనని కోరుచున్నారు. కార్య నిర్వాహకసభలయందు (రాజప్రతినిధి కార్యనిర్వాహకసభయందు గూడ) సభ్యులలో సగముమంది భారతీయు లుండవలె ననియు,

గ్రాండుకమిటీలు, స్టేటుకౌంసిలులు మున్నగు ఆటంకములు లేకయే, అధికసంఖ్యాకులగు ప్రజానియుక్తసభ్యులు శాసనసభలయం దుండవలయు ననియు, మన క్షేమమునకై ప్రత్యేక ప్రాతినిధ్యము కావలయు ననియు వీరు కోరుచున్నారు. స్వపరిపాలనము మొదలుకొని నిమ్న జాతుల కోరికలవఱకును ఎక్కుడు సంస్కరణములు కావలయు ననెడి వాంఛలు ఎల్లెడలను కానవచ్చుచున్నవి.

11. భారత దేశ ప్రత్యభిజ్ఞానమును పెంపొందించుటకు విరోపాఖండము నందలి యిటీవల జరగిన విషయములు కారణభూతము లనియు నిందుమూలమున వారు గొప్ప రాజ్యాంగసంస్కరణలను గోరుచున్నా రనియు సంస్కరణ నివేదికయందు వ్రాయబడియున్నది. కాని ఈ రాజకీయప్రత్యభిజ్ఞానస్వభావమును ఈ నివేదిక సంపూర్ణముగా తెలిపియుండలేదు. దేశమున అసంతృప్తి వ్యాపించుచున్న దనియు, శాసనసభల నిష్ప్రయోజనమువలన అధికారులకును, అనధికారులకును భేదభావములు వృద్ధి యగుచున్న వనియు నివేదిక చెప్పినవాక్యములు సత్యములు. ఇట్టి విభేదములకు అధికారుల స్వభావమే చాలవరకు కారణమను విషయము వీరు సరిగా తెలిపియుండలేదని నాయభిప్రాయము. పురోవృద్ధికారక మగు ఎట్టి విధానమైనను ప్రస్తుత భారత ప్రభుత్వ నిర్మాణమును బట్టి దుస్సాధ్య మనెడి వాదమునుగూర్చి నే నిచట చర్చింప నవసరము లేదు.

12. ప్రబలమగు మార్పును జరుపుటకు సంస్కరణ నివేదిక దెలిపిన కారణముల నిట పేర్కొనుచుంటిని. కాని రాజకీయనాయకుల యభిప్రాయమును బట్టి సంస్కరణావశ్యత ఇక ననేక కారణములు గూడ కలవు. దేశపు సుపరిపాలనమునకును, శాంతికిని ఆంగ్లేయానుగుణ్య మగు ప్రభుత్వమునకు—సంస్కరణ మావశ్యకము. ప్రస్తుత పాలనా విధానము సౌష్ఠవవిహీనముగా నున్నది. బొంబయి రాజధానియందు సంభవించిన ప్లేగు అల్లరులు ప్రజాస్వామ్యపాలనమున తటస్థింప నేరవు. తిరునల్వేలి అల్లరులును ఆష్. గారి హత్యయు స్వదేశీ స్టీము నావిగేషను కంపెనీవారియొక్కయు మిల్లు కూలీలయొక్కయు స్థితిని బాగుచేయుటకై చిదంబరం పిళ్ళె చేసినపనులలో జోక్యము కలుగ జేసికొనుటయే కారణము. ఇట్టి స్థితిగతులు సుపరిపాలనము కలుగ జేసికొనుటయే కారణము. ఇట్టి స్థితిగతులు సుపరిపాలనమున సంభవములు కాజాలవు. తూర్పుబంగాళా దేశమున రాజద్రోహకరములును విప్లవదాయకములు నగు ఉద్యమములనుబట్టి సంభవించిన దుస్థితి ప్రజాప్రభుత్వమున దుస్సాధ్యము. శాసనసభవారిచే నిర్మితమైన యొక శాసనమువలన 1907-వ సంవత్సరమునుండి పంజాబు దేశములో నశాంతి ప్రబలజొచ్చినది. వ్యక్తిస్వాతంత్ర్యమును, నాగరిక ప్రపంచమున గల న్యాయసంరక్షణమును, ప్రస్తుతము శాసనసభయెదుట నున్న బిల్లులు తొలగించుచున్నవి. వార్తాపత్రికాస్వాతంత్ర్యమును, వాక్స్వాతంత్ర్యమును బంధించుటకు కొన్ని శాసనములు నిర్మితమైనవి. ఈచర్యలన్నిటిని బట్టి చూచినయెడల నిట్టిస్థితికి కారణభూతమగు ప్రభుత్వవిధానమును సంస్కరించుటకు ఉదారవంతములగు సంస్కరణము లవసరమని లేటతెల్లము కాగలదు.

అనేకవర్ణ విభేదములం బట్టి సంఘవిభజనము జరుగుటచే కలుగు లోపములను తొలగించుటకు గొప్ప రాజ్యాంగ సంస్కరణము లత్యవసరము. ఈ వివిధ సంఘనాయకులకు తమతమ కలహములను తామే పరిష్కరించుకొనుట కధికార మొసంగినయెడల ఈ విభేదము లంతరించునని నిశ్చయముగా చెప్పవచ్చును.

భారత దేశపు ప్రజాసామాన్యక్షేమమునకు గూడ గొప్ప రాజ్యాంగ సంస్కరణము లత్యవసరములు. ఇంతవరకును వారిస్థితిని వృద్ధి చేయుటకు విద్యాధికులు చేసినప్రయత్నములు నిష్ఫలములైనవి. ఈవిషయమున ప్రభుత్వమువారు తగిన చర్యను తీసికొనకపోవుటయే గాక విద్యాధికుల ప్రయత్నములకు గూడ వీరు చేయూత నొసంగరైరి.

ఆదివరకే లభింపవలసిన సంస్కరణము లనేకములు ఉన్నవి. జాతివిభేదములు లేకయే భారతీయులకు ప్రభుత్వోద్యోగముల నొసంగెదమను వాగ్దానములు ఇంతవరకును కార్యరూపము దాల్పలేదు. భూమిశిస్తు పరిపాలనమును గూర్చి సంస్కరణము చేసెదమను ప్రభుత్వవాగ్దానము ఇటీవల ఉపసంహరించుకొనబడినది. భారత ప్రభుత్వమువారు వాగ్దానము జేసిన ప్రభుత్వన్యాయశాఖావిభజనము ఇంతవరకును జరుగలేదు. స్థానిక స్వపరిపాలనమును గూర్చి రిప్పను, మార్లీ ప్రభువులు చేసినయుత్తరువులు తృణీకరింపబడినవి. విద్యావిషయమున శ్రీసార్వభౌముని కోరికలు చెల్లింపబడలేదు. పారిశ్రామికాభివృద్ధికి వలయు ప్రయత్నములు జరుగలేదు. మనము కార్యవిరహితము లగు వట్టి వాగ్దానములతో కాలమును బుచ్చు సమయము దాటిపోయినది. మన ప్రకటనమునకు ఎట్టి గౌరవమును లేదు.

## ప్రజాయత్తశాఖ.

13. మంత్రులయొక్కయు శాసనసభయొక్కయు నధికారముక్రింద నుండు ప్రజాయత్తవిషయములను గూర్చి ప్రథమముగ చర్చింతము. సంస్కరణనివేదికను బట్టి గవర్నరు తన సమ్మతివలన ఎట్టి అపాయమైనను కలుగునెడల అట్టికార్యముల కాత డనుమతింపకుండవచ్చును. ఈవిషయమును నాసహోద్యోగులు అంగీకరించిరాయను సందియము మాకు కలుగుచున్నది (ప్యారా 101). వారు దీని నంగీకరింపనియెడలను గవర్నరు ఇట్టి విషయములలో నింకను ఎక్కుడుజోక్యమును కలుగజేసికొనవలె నని వీరి అభిప్రాయ మగునెడలను, వీరితో నే నంగీకరింపజాలను. వీరు చేసిన నూతనసూచనలు ఇట్టి జోక్యము కలుగజేసికొనవలె ననియే తెలుపుచున్నవి. మంత్రులుగాని సభలుగాని తమ యుత్తరువులను నెరవేర్పజాలినసమర్థు లగు ఉద్యోగీయులను కలిగియుండనే గాని పరిపాలనము విజయవంతముగా కొనసాగజాలదు నివేదికయందు సూచింపబడునటుల ప్రథమముననే మంత్రులు తమ శాఖోద్యోగులను తామే నిర్ణయించుకొనవలసినదను సూచనవలన వారి ప్రయత్నములు విఫలమగుటకు ఎట్టి సందేహమును లేదు. కావుననే ప్రస్తుత ప్రభుత్వోద్యోగ

ములను యథాస్థితియందే యుంచి అట్టిశాఖాసంరక్షణార్థము కొన్ని కట్టుబాట్లను చేసి, వానిని మంత్రుల యాజమాన్యమున నుంచవలసి నదని నివేదిక తెలుపుచున్నది. భారతప్రభుత్వమువారు ఈశాఖా సంరక్షణమునకై అనేక వాగ్దానములను చేసియున్నారు. కాని ప్రభుత్వోద్యోగశాఖను మంత్రుల వశమున నుంచుటకు బదులుగా ఉద్యోగుల యిష్టానుసారముగనే మంత్రులు తమ విధానమును నడిపింపవలయునని వీరు సూచించుచున్నారు. ఇందుమూలమున మంత్రులు గాని గవర్నరుగాని తమ యిచ్ఛవచ్చిన ఉద్యోగులను ఏర్పఱచుటకు అవకాశము లేకున్నది. కావున భారతరాజ్యాంగమంత్రి అనుమతిని బొంది తనశాఖకు సంబంధించిన ఉద్యోగులను నియమించు అధికారము మంత్రికుండవలెనని నా అభిప్రాయము.

14. గవర్నరుతోడి సంబంధము విషయమున ఈ సమస్య యెక్కుడు ప్రాముఖ్యము వహించుచున్నది. మంత్రులు ఈ శాఖయందలి పర్మనెంటు ఉద్యోగీయులను కార్యదర్శులను, గవర్నరు ప్రత్యేకముగ చూపవలెనని తమకు తోచినవిషయములను గవర్నరునకు తెలియజేయవలెనని నా సహోద్యోగులు సూచించుచున్నారు. ఇందుమూలమున నీ యుద్యోగులు మంత్రుల ఆజ్ఞకు భిన్నముగ వర్తించుట కవకాశ మేర్పడుచున్నది. దీనివలన మంత్రి అధికారము తగ్గుట తటస్థించును. ఇట్టిస్థితి సంస్కరణనివేదికకర్తలకు గూడ తోచినట్లు లేదు. ఇది సరియైనపద్ధతి కాదు. ఈవిషయములలో నెట్టి కార్యదర్శియు ఈవిధముగ వర్తింపరాదని నా అభిప్రాయము.

15. నా సహోద్యోగు లిక నొక ప్రబలసవరణను జేసియుండిరి. ప్రజాయత్తవిషయములకు సంబంధించిన ఎట్టి బిల్లులోనైనను దేశశాంతికి గాని, ప్రభుత్వాయత్తవిషయక్షేమమునకు గాని భంగకరము అగు నెట్టినియమము నైన గలిగియుండినపుడు అట్టి విషయములను గ్రాండుకమిటీవారికి తెలియజేయు అధికారమును గవర్నరున కుండవలెనని నా సహోద్యోగులు సూచించుచున్నారు. ఇందుమూలమున ప్రజాయత్తవిషయములపై శాసనసభకుగల అధికారము తొలగిపోగలదు. ఎట్టి ప్రజాయత్తవిషయమునకు సంబంధించిన బిల్లులనైనను శాసనసభలో ప్రవేశపెట్టుటకు గవర్నరున కధికారము కలదు. గవర్నరుయొక్క ఉత్తరువును ఉల్లంఘించుటకు వీలుండరాదని నా సహోద్యోగుల అభిప్రాయము. ఒక ఉదాహరణము: విద్యావిషయమునగాని, పారిశుద్ధ్యవిషయమునగాని ఒకబిల్లును మంత్రి ప్రవేశపెట్టి అశాంతికి కారణమగునను మిషచే గవర్నరు దానిని గ్రాండుకమిటీకి పంపవచ్చును. ఇందుమూలమున ఇంతకు పూర్వమువలెనే ప్రజాయత్తవిషయములయందు కూడ శాసనసభాధికారము వ్యర్థమగును. ఇది సంస్కరణనివేదికకు ప్రతికూలముగా నున్నది. కాన దీనిని నే నంగీకరింపజాలను.

16. ప్రజాయత్తములుగా నున్న విషయములను కార్యనిర్వాహకసంఘమువారి వశము చేయుటకును గవర్నరునకును, భారతరాజ్యాంగమంత్రికిని అధికారముండవలెనని నాసహోద్యోగుల యభిప్రాయము. మంత్రిని పదచ్యుతిని గావించుటకు గాని శాసనసభను తొలగించుటకు గాని గవర్నరున కధికారము గలదను విషయమును మనము గుర్తింపవలసియున్నది. కాని యిట్టి అధికార మున్నప్పుడు కూడ శాసనసభయు, మంత్రియు తనకు ప్రతికూలముగా నున్నయెడల గవర్నరు సరియగుమార్గమునను మంత్రులు మున్నగువారు తప్పుమార్గమునను వర్తించుచున్నారను దురభిప్రాయముతో వారిని తొలగించు అధికారమునుకూడ గవర్నరువశము చేయవలెనని నాసహోద్యోగులు తెలుపుచున్నారు. పరిపాలనము స్తంభింపకుండ నిట్టి అధికారము గవర్నరున కుండవలెనని వీరు వాదించుచున్నారు. గవర్నరునకు అనిష్టమగు పనులను చేసినయెడల మంత్రులును శాసనసభలును బాధ్యతావిరహితములుగా వర్తించుచున్న వనెడి అభిప్రాయమే యిట్టిభావములకు కారణము.

17. సంస్కరణప్రణాళికయొక్క ప్రధానసోపానమును చెడగొట్టుటకు గవర్నరునకు గాని, భారతమంత్రికిగాని అధికారమిచ్చుట మంచిదిగాదని నా అభిప్రాయము. ఈ సూచనయే కార్యరూపమున బెట్టబడినయెడల సంస్కరణ నివేదికాదర్శములను రూపుమాపగలదు. నివేదికలో శాసనసభమీద కార్యనిర్వాహకసభవారి కేమియు అధికార మిచ్చియుండలేదు. అవసరమైన పార్లమెంటువారిచే నియమింపబడు నిష్పక్షపాతమగు విచారణ మొకటి యీ విషయమును ఆలోచించి, సదరు అధికారమును కార్యనిర్వాహకసంఘమువారి కిచ్చుటకు సదుపాయములు చేయబడినవి. ప్రణాళికప్రకారము నిర్మింపబడబోవు శాసనసభలు రెండును గవర్నరుగారి అభిప్రాయమునకు వ్యతిరేకముగా నభిప్రాయమిచ్చినయెడల, గవర్నరుగారి అభిప్రాయములు పొరపాటైన వనియు శాసనసభాభిప్రాయములనె మన్నింపవలయుననియు నా నిశ్చితాభిప్రాయము. అథవా అట్టి అధికారమును గవర్నరుకే ఇచ్చినయెడల స్వభావసిద్ధము లగు ప్రభుత్వధర్మములకు వ్యతిరేకముగా ననుసరించుటయే యని చెప్పవచ్చును. అవసర సమయములలో రాజప్రతినిధిగారికి తాత్కాలికచట్టములను (ఆర్డినెన్సులు) చేయుటకు అధికార మీయబడియేయున్నది. అవసరకార్యములలో భారతప్రభుత్వమువారి కీయబడిన అధికారముల సందర్భమున ఇంకను, నీ అధికారము నయిత మిచ్చుటకు నే నామోదింపజాలను.

18. ఈ విషయముల సందర్భమున భారతప్రభుత్వమువారికి ప్రజాయత్తశాఖాపరిపాలనమున జోక్యము పుచ్చుకొనుటకు ఈ క్రింది అధికారము లీయబడినవి. (1) భారతప్రభుత్వశాఖాపరిపాలనమును సురక్షితముగా కొనసాగించుకొనుటకు (2) భారతదేశ లాభాభివృద్ధి కొరకై రాష్ట్రములందు సమానమగు శాసనములను చేయుటకు (3) ముందు పరిష్కరింపబడబోవు పబ్లికు సర్వీసులను సంరక్షించుటకును. (4) ఇతరరాష్ట్రమునకు సంబంధించు ప్రశ్నోత్తరవిషయములపట్ల అధికారము.

19. అధికారప్రజాయత్తశాఖలకు ధనమును పంచిపెట్టుటకు సూచింపబడిన అధికారమువలనను మంత్రులు కార్యనిర్వాహకసభకు లోబడి యుండవలసియుండును. రాజధానిలో వసూలగు

ఆదాయములలో ముఖ్యమైనవి భూమిశిస్తు మున్నగునవి. కార్యనిర్వాహకవర్గమువారి చేతులలోను, విద్య స్థానికపరిపాలనము ఆరోగ్యము పబ్లికువర్క్సు మున్నగువాని వ్యయములు మంత్రుల అధికారములో నుండగలవు. ఈ డిపార్టుమెంటులనే పెంపొందింపజేయుట కెక్కువ ప్రయత్నము చేయవలయును. వీనికి కావలసిన ధనమునంతను కార్యనిర్వాహక వర్గమే ఈయవలసియుండును. దీనివలన సహజముగా కార్యనిర్వాహకవర్గమునకు మంత్రులు లోబడి యుండవలసియుండునని తేలగలదు. గవర్నరుగారి అంగీకారము లేనిదే మంత్రులు క్రొత్తపన్నులను వేయగూడదు. మంత్రులు తమస్వాధీనములోనున్న శాఖాదాయములను పెంపొందింప జేసికొనుటకు నాతోడిసభ్యులు అవకాశ మిచ్చియున్నారు గాని, ఏ ఆదాయమును అభివృద్ధి చేసికొనుటకు వీలున్నదో అట్టివాని కార్యనిర్వాహకవర్గమువారి స్వాధీనములోనే యుంచియున్నారు. ఒక శాఖనుండియే ఆశాఖాభివృద్ధికి కావలసిన ఆదాయమును దానినుండియే అభివృద్ధి చేసికొనవలయునని చెప్పు సూత్రము నే నంగీకరింపజాలను. అధికారశాఖకు ప్రజాశాఖకు కావలసిన ద్రవ్యము నిచ్చుటకు నిరాకరింపగూడదని నాతోడిసభ్యులు చెప్పుచున్నారు. కాని క్రొత్తపన్ను వేసికొను నధికారము మాత్రము మంత్రులకు గాక గవర్నరుకే యుండవలయునని వారి వాదము. మంత్రి కార్యనిర్వాహకవర్గము వారు నిర్వహింపవలసిన కార్యములను తగిన సహాయము రాకపోయిన యెడల దేశమునందలి ప్రజలను శిక్షింపవలయునని సూచించు ఈవిధానము నే నెంతమాత్రమును అంగీకరింపజాలను.

20. ఈవిధానమువలన మంత్రులకును శాసనసభకును ప్రజాయత్తశాఖల సందర్భమున స్వాతంత్ర్యము నీయకుండుటయే గాక, వారు కార్యనిర్వాహకవర్గమునకు లోబడవలసివచ్చును. కావున ప్రజలకు బాధ్యతగల స్వాతంత్ర్యము నిత్తుమని ఆగష్టు 20-వ తేదీని ప్రకటింపబడిన ప్రకటనమున కీవిధానము వ్యతిరేకము గానున్నది. కావున దీన్ని నంగీకరింపగూడదు. క్రొత్తవిధానముప్రకారము మంత్రులు అధికారము వహించినశాఖల సందర్భమున చాల కష్టపడవలసియుండును. సహజముగా వారు కార్యనిర్వాహకవర్గమువారినుండి సయితము సానుభూతిని పొందజాలని ప్రకృతపు స్థితిగతులను గురించి వ్రాసినచోటనే యుదాహరించియుంటిని.

సార్వభౌముని ప్రభుత్వమువారు పాలనాకార్యనిర్వహణమునకుగాను మంత్రులకు తగిన బాధ్యతా స్వాతంత్ర్యము నీయవలయునని చెప్పుచుండగా హిందూమంత్రి రాజప్రతినిధులు మంత్రుల బాధ్యతలంతయు గవర్నరుగారి విచారణక్రింద నుండవలయునని వాంఛించుచున్నారని పై నావిమర్శనమునందు తెలియగలదు. నాతోడి సభ్యులా అధికారమును సయితము తీసివేసి మంత్రులును శాసనసభలు గవర్నరు, కార్యనిర్వాహకవర్గములకు లోబడియుండవలయునని సూచించుచున్నారు. రాష్ట్రీయప్రభుత్వమును హీనస్థితికి దీసికొనిరాగూడదని వాదించుచు నాతోడి సభ్యులు కార్యనిర్వాహకవర్గము ప్రజలకు బాధ్యమయి యుండగూడదని వాదించుచున్నారు.

## అధికారశాఖలు

21. సంస్కరణనివేదికయందలి విషయములప్రకారము శాసనసభాప్రతినిధి యగు మంత్రి యనుమతిలేనిదే అధికారాయత్తపరిపాలనమునకును పన్నును వేయగూడదు. దీనివలన ప్రజాప్రభుత్వమును సంపాదించుటకు వీలుకూడ గలదు. అధికారాయత్త ప్రజాయత్తశాఖలు రెండును సమావేశమై ఆదాయవ్యయములను చర్చింపవలయును. దీనివలన మంత్రి ఆదాయవ్యయములలో సలహానిచ్చుటయేగాక, ఎక్కువ బాధ్యతతో ఆయవ్యయవిషయములను పరిష్కరించుటకు వీ లుండగలదు. అధికారాయత్తశాఖల పాలనములో సయితము మంత్రికి ఈ విధానమువలన పలుకుబడి యుండగలదు. అధికారశాఖల బడ్జెట్టులో మంత్రులకును, కార్యనిర్వాహక వర్గమువారికిని నేమైన కలతలు వచ్చినయెడల మంత్రితో సంప్రతించి ప్రజాయత్తశాఖలతో సంబంధమున్న గవర్నరు వీనిని పరిష్కరింపవలసియుండును. కావున అధికారశాఖలతో ఈవిధానమువలన మంత్రులకెంతయు పలుకుబడి యుండగలదు. ప్రజాయత్తశాఖల సందర్భమున సయితము మంత్రులు కార్యనిర్వాహకవర్గమువారి సలహాను గైకొనుటకు అవకాశము లుండగలవు. ఈ విధానము చాల ముఖ్యతరమైనది. గవర్నరుగారు కొన్ని విషయములలో చేయు కట్టుదిట్టములను తప్ప ఆదాయవ్యయములను శాసనసభవారు చర్చించి అధికారాయత్త ప్రజాయత్తశాఖల పాలనమునకు గాని బంధీకృతము లగు సలహాల నిచ్చుటకు అవకాశము లుండగలవు.

నేను సూచించిన సూచనలవలన ఆర్థికవిషయములలోను అధికారశాఖాపాలనమునందును మంత్రులకును శాసనసభకును ఎక్కువ పలుకుబడి యుండగలదు. ఇవి చాల తృప్తికరములుగనున్నవి. మంచి సూత్రములమీద ఆధారములై యున్నవి. నాతోడిసభ్యు లీ విషయమున సూచించిన మార్పులు ఈవిధానము లంతటిని నామావశిష్టము చేయగలవు.

## ప్రభుత్వమువారి సవరణలు

22. ఆదాయవ్యయపట్టికల పట్ల శాసనసభలు చేయు తీర్మానములు ప్రభుత్వమువారికి బంధీకృతములు కాగూడదని భారతప్రభుత్వమువారు తమ మార్పులలో సూచించుచున్నారు. తీర్మానము సలహారూపకముగా నుండవలయునని ప్రభుత్వమువారివాదము. ఈ సూత్రము రాజ్యాంగప్రణాళికకు వ్యతిరేకమని నా అభిప్రాయము. సతతము శాసనసభాతీర్మానములను గవర్నరు నిరాకరించుటకు కష్టతరముగానుండుననియు, వాదింపబడుచున్నది. శాసనసభాభిప్రాయమును ప్రభుత్వమువారికి తెలుపుటకే ఈవిధానము ప్రవేశపెట్టబడినది. కావున శాసనసభాభిప్రాయములు అంగీకృతములు కావలయును. అట్లు కాకపోయినయెడల ఈ వాదము సయితము రాజ్యాంగప్రణాళికకు వ్యతిరేకముగా నుండియుండగలదు.

23. పరిపాలనాసౌకర్యమున కొక్క ఆదాయవ్యయపట్టికను తయారుచేయుట మానివేసి అధికారశాఖల తరపున నొకటి, ప్రజా

యత్తశాఖలతరఫున మరొక్కటి ఆదాయవ్యయపట్టికలను తయారుచేయ సూచించుచు, ఆర్థికపట్టికసందర్భమున గవర్నరు కార్యనిర్వాహక సభ్యులును, ప్రజాయత్త ఆయవ్యయ పట్టిక సందర్భమున గవర్నరు మంత్రులను సంప్రతించుకొనవలయునని సూచించుచున్నారు. ప్రజాయత్తశాఖల పాలనమునకు మంత్రులును అధికారాయత్త శాఖాధికారములకు కార్యనిర్వాహకసభ్యులును పన్నులను వేసికొనవలయునని సూచింపబడినది. గవర్నరు నిరాకరించినగాని శాసనసభా తీర్మానములు ప్రభుత్వమువారికి బంధీకృతములై యుండుననుసూత్రమును నిరాకరించుచు, శాసనసభాతీర్మానములు ప్రభుత్వమువారికి సలహా నిచ్చునవిగనే యుండవలయు నని భారతప్రభుత్వమువారి వాదము.

ఈ వాదములవలన అధికారశాఖల ఆయవ్యయముల పట్టికలో మంత్రుల కేమియు సంబంధ ముండజాలదు. ఇదియు సంస్కరణ సూచనలకు వ్యతిరిక్తముగనే యున్నది. ఆదాయవ్యయపట్టికలో ప్రజాభిప్రాయ మిసుమంతయైనను నుండజాలదు. కార్యనిర్వాహక వర్గమునకువలె క్రొత్తపన్ను వేయుటకు సయితము సర్వాధికారము లేదు. శాసనసభ క్రొత్తపన్ను విధించుటకు నిరాకరించినయెడల గవర్నరు గ్రాండుకమిటిని సమావేశపఱచిగాని మఱే యేవిధముగానైనను తన సంకల్పమును నెఱవేర్చుకొనవచ్చును. వ్యయవిషయమున సయితము అధికారశాఖలతో మంత్రులు జోక్యము పుచ్చుకొను స్వాతంత్ర్యము ఈపద్ధతితో నామావశిష్టము కాగలదు. రాజ్యాంగసంస్కరణాదర్శములను రూపుమాపగలదు. కావున ఈమార్పులను నే నంగీకరింపజాలను.

24. ఈ పద్ధతివలన మంత్రులును, కార్యనిర్వాహకసంఘమువారును, తమశాఖలకుగా నెంత ఆదాయమువచ్చునో అనువిషయము కార్యప్రారంభమున నెంత నిలువసొమ్ము తమయొద్ద నున్నది, తమ కార్యనిర్వాహణమున కెంతద్రవ్యము కావలసి, ఎంతవఱకు క్రొత్త పన్నును వేయుటకు పూనుకొనవలయునో అను విషయములు తెలిసికొనుటకు వీ లుండగలదు. ప్రతిశాఖాభివృద్ధికిని శక్తివంతముగ పని చేయుటకు సావకాశ ముండగలదు. వీనిలాభములను అన్ని శాఖ లనుభవించుటకు వీ లుండగలదు. ప్రతిశాఖయు తమకు కావలసినసొత్తును బదులు పుచ్చుకొనుటకును అవకాశము లీయబడినవి. అధికార ప్రజాయత్తశాఖల ఆదాయవ్యయములను ప్రత్యేకప్రత్యేకముగా నుంచినయెడల సులభముగా నుండునని తలంచినను అధికారాయత్తశాఖల ఆదాయవ్యయములలో ప్రజల పలుకుబడి యుండుటకు వీ లుండజాలదు. మంత్రులు, శాసనసభచేతులలోనుండి అధికారశాఖలకు విముక్తి కలుగజేయుటకే ఈవిధానము సూచింపబడినదని వారి వాదము. దీని నే నెంతమాత్రము నంగీకరింపజాలను. సంస్కరణనివేదికము ప్రకారము ఈ క్రొత్తపద్ధతివలన అధికారులకు పనికిరాని శాఖలు మంత్రుల కీయబడినవనియు మంత్రులు ప్రత్యేకముగా తమ శాఖాపాలనమునకు పన్నులు వేసికొనుటకు ప్రజాభిప్రాయము వ్యతిరేకముగా నున్నదనియు జేకీయమహాజనసభవా రొక గొప్ప అభ్యంతరమును కల్పించుచున్నారు. నాతోడిసభ్యులు ప్రత్యేక ఆర్థికపట్టికను ప్రవేశపెట్టు విషయమున ఈ అభ్యంతరమును సమర్థించియున్నారు. ప్రజాభిప్రాయమునకు ప్రోత్సాహము కలుగజేయుటకుగా నిట్టివిధానమును కల్పించుట మంచిదిగాదు. ప్రణాళిక ఈవిషయమున చేసిన కట్టుదిట్టములను సులోకచోట నుదాహరించియున్నారు. మంత్రియొక్క అంగీకారము లేనిది క్రొత్తపన్నును వేయగూడదు. బాధ్యతగల కార్యనిర్వాహకసభ్యు డెవరును అధికారాయత్తశాఖలకెక్కువస్వాతంత్ర్య మీయవలెనని వాంఛింపజాలడు. అయినను ఈ విషయమున గవర్నరుగారికిమాత్రము పూర్తిఅధికారముగలదు. శాసనసభ ఆర్థికపట్టికను ప్రజాయత్తశాఖాపాలనసందర్భమున విమర్శింపవచ్చును. గవర్నరు అధికారాయత్త శాఖాసందర్భమున చేయబడు సూచనలనుమాత్రము నిరాకరింపవచ్చును. ఈపద్ధతివలన ప్రజాయత్తశాఖ స్థితి చాలకష్టతరముగ నుండగలదు. ఈవిధానమును నే నంగీకరింపజాలను. భారతీయనాయకుల నివేదికయందలి వాక్యాడంబరమువలన మోసపోయిరి. అధికారాయత్తశాఖలకు ఆర్థికవ్యయవిషయములలో ప్రధానస్థాన మీయవలయు నని చెప్పుటదానికన్నను కార్యనిర్వాహకప్రభుత్వము రెండుశాఖలకును ద్రవ్యము సమానముగా బంచిపెట్టిన బాగుగనుండు నని నా అభిప్రాయము. మంత్రులు, కార్యనిర్వాహకవర్గమువారిందులకు అంగీకరింపక పోయినయెడల గవర్నరు దీనిని పరిష్కరింపవలయును. అధికారశాఖలతో సయితము మంత్రి అంగీకరింపకపోయినయెడల గవర్నరే దీనిని సయితము పరిష్కరించు అధికార ముండవలయును. భేదాభిప్రాయములు కలిగినయెడల పన్ను వేయువిషయమున గవర్నరుగారి ఆమోద మవసరమని నాతోడిసభ్యులు సలహా ఇచ్చుచున్నారు. రివిన్యూలను సమానముగా పంచిపెట్టినతరువాత క్రొత్తపన్ను వేయువిషయ మాలోచింపవలయును. మంత్రుల అంగీకారములేకనే క్రొత్తపన్ను విధింపగూడదు. చట్టమును శాసనసభలో నెవరు ప్రవేశపెట్టవలసినది గవర్నరు పరిష్కరింపవలయును. ఏ శాఖకు ద్రవ్యము కావలయునో ఆ శాఖ మంత్రియే సాధారణముగా చట్టమును ప్రవేశపెట్టిన మంచిది.

## ఆర్థికవిషయములు

25. ఈపద్ధతివలన చాలలాభములు గలవని నా అభిప్రాయము సంస్కరణములందలి యీ సూచనలపట్ల భారతదేశమున విమర్శ లేమియు జరుగలేదని నాతోడి సభ్యులు చెప్పుచున్నారు. అటులైనయెడల ఈ విధానమున నేమియు మార్పులు చేయగూడదని నా అభిప్రాయము. ఆర్థికపట్టిక నిరాకరించుటకు మంత్రులకు స్వాతంత్ర్యము లేకపోయినను ఈవాదమును బలపఱచుటకుముందు ప్రజాయత్త శాఖలకును తగినంత ధనము నీయకనే అధికారాయత్తశాఖల ధనమును హెచ్చుచేయుటకు గవర్నరుగారికి అధికార మున్నదని గ్రహింపవలయును. గవర్నరుగారే ఈవిషయమున అధికారమును చెలాయింపదలంచినయెడల ఇతరత్ర గూడ ఆయన తన కార్యమును నిర్వహించుటకు వీ లున్నదని మనము గ్రహింపవలయును. ఒక్క విషయ

మాలోచింపుడు. అధికారశాఖావ్యయముల విషయమున మంత్రుల దయాపాత్రములకు లోబడియుండవలసి యుండు నని నా తోడి సభ్యుల వాదము. ఈ వాదము నంగీకరించిన యెడల మంత్రులకును కార్యనిర్వాహకవర్గమువారికిని సర్వదా కలతలు గలుగుచుండును. మంత్రులమీద అధికారము గల గవర్నరు—నా తోడిసభ్యులు ఈయన అధికారము లెక్కువచేయ వాంఛించుచున్నారు.—అధికారాయత్తశాఖలకు అవసరమైనను మంత్రుల స్వాధీనములో నున్న ధనమును తగ్గించిన నేమి గతి? ఈ వాదములవలన పరిపాలన సులువుగ జరుగుట బహుకష్టతరము.

26. అధికారాయత్తశాఖలకు వచ్చు ఆదాయము, ఆశాఖాపరిపాలనమునకు కావలసినధనము పోగా చాల మిగులగలదు. పూర్వము సయితము ఈ శాఖకు ద్రవ్యము బదులు పుచ్చుకొనుట అవసరము లేకుండెను. కావున ముందు సయితము ధనము బదులు పుచ్చుకొనుట అనవసరము. కొంతకాలమువరకు కావలసిన ఆదాయమును ఏదో విధముగ నిర్ణయించుకొని బడ్జెటుచర్చను నాపుదలచేయ నా తోడి సభ్యులు సూచించుచున్నారు. ఈ సూచన న్యాయరీత్యా శాసనసభకు ఆర్థికవిషయములందు గల స్వాతంత్ర్యమును నామావశిష్టము చేయగలదు. ఈ విధానమువలన క్రొత్తపన్నులు వేసికొనుటకును సొత్తును బదులు పుచ్చుకొనుటకును మార్గ మేర్పడి అనవసరచర్చలకు లేని పోని సంఘర్షణలకు వీ లేర్పడగలదు. నా తోడిసభ్యులు ప్రతిచోటను మంత్రులపై తగిన అధికారమును చెలాయించుటకు ఎన్నియో సూచనలను చేయుచున్నారని నేను గట్టిగా చెప్పగలను. మంత్రులు చేయుకార్యములందు గవర్నరు జోక్యము పుచ్చుకొనుటకు వీలు లేనందునను మంత్రులకును కార్యనిర్వాహకవర్గమునకును వివాదము కలిగినపుడు గవర్నరు ఆ వివాదమును పరిష్కరించుటకు ఏర్పాట్లు లేవనియు నా తోడిసభ్యులు భావించి అందువలన చాల చిక్కులు కలుగునని వారు తెలిపియుండిరి. ఈ చిక్కుల కన్నిటిని తగిన సమాధానము సంస్కరణ నివేదికయందలి సూచనలే తెలుపుచున్నవని నా అభిప్రాయము.

27. ప్రథమమున ఆర్థిక ఆదాయ వ్యయ పట్టిక విషయమాలోచించి, సాధారణ స్థాయి యుత్తరువులవలనను, హిందూదేశాంగమంత్రివలనను, రాష్ట్రీయప్రభుత్వమునకు గల నిర్బంధము లేవియో కనుగొందము. ఒక నిర్ణీతమగు జీతమునకు ఇంగ్లీషు అధికారిని నియమించుటకును, సాధారణముగా ఇంగ్లీషు అధికారిచే ఆక్రమింపవలసిన క్రొత్త యుద్యోగస్థానమును నిర్మించుటకును, నిర్ణీత మగు మాసవేతనముతో క్రొత్త యుద్యోగస్థానమును నిర్మించుటకు, వెయ్యిరూపాయలకన్న నెక్కువగా గౌరవభృతి యీయవలసి యున్నను, లేక ప్రత్యేక పరిస్థితుల ననుసరించి భూమిని మంజూరు చేయుటకుగాను హిందూదేశాంగమంత్రి యుత్తరువు కావలసియుండును. పౌరసేవాసందర్భమున మోటారు బండిని కొనవలసియుండిన దానికిని హిందూదేశాంగమంత్రి అనుమతి కావలయును. ఉదాహరణ పూర్వకముగా చూపెట్టిన ఈ విషయములే కాక, దేశాంగమంత్రి ఆమోదమును బడయవలసిన కార్యము లెన్నియో గలవు. ఈ నిర్బంధములు రాష్ట్రీయప్రభుత్వములు తమ చేతులలో నున్న అధికారములను జాగరూకతతో నిర్వహించుకొనుటకే ప్రవేశపెట్టబడినవి. ముందు సయిత మీ నిర్బంధము లుండుట అవసరమనియె చెప్పవచ్చును. ఈ విధానమువలన స్థానికప్రభుత్వములు వెయ్యిరూపాయల జీతమునకు పైన తెచ్చుకొను అధికారులను నియమించుటకు అధికారము నిచ్చుచున్నాము. భారతప్రభుత్వమువారితోను భారతదేశాంగమంత్రితోను సంప్రతింపక నే లక్షలకొలది రూపాయల వ్యయములతో నుండు స్కీములను సయితము నిర్వహించుటకు స్థానికప్రభుత్వములకు అధికారము నిచ్చుచున్నాము. శిస్తును చెల్లించువారి శ్రేయమును భారతప్రభుత్వము, హిందూదేశాంగమంత్రులు చూడవలయు నని తలంచినయెడల స్థానికప్రభుత్వమువారు చేయు కార్యమును బాగుగా పరీక్షించుచు, ప్రజలకు పరిపాలనమున స్వాతంత్ర్య మిచ్చుటకు ఆ నిర్బంధమును రద్దుచేయవచ్చును. ఉద్యోగుల సంఖ్యను హెచ్చుచేయు విషయమున కర్జను ప్రభువుగారును, ఈ విషయము నాలోచింపవలసి వచ్చిన ఇతర పరిపాలకులును ఈ అభిప్రాయమునే వ్యక్తీకరించియుండిరి. ఆర్థికవిషయముల పట్ల శాసనసభకు గల అధికారమును తీసివేయుట అటులుండ భారతప్రభుత్వమువారియొక్కయు భారతదేశ మంత్రియొక్కయు నిర్బంధములను తొలగించినయెడల సంస్కరణనివేదికయం దుదాహరింపబడిన ప్రకారమునకన్నను శాసనసభకును, మంత్రులకును, ఎక్కువ అధికారము లీయవలసియుండును. భారతీయులకు ఉద్యోగములకు అవకాశము లిచ్చుటకుగాను ఇంగ్లీషు యుద్యోగముల నియామకములపట్ల భారతప్రభుత్వము భారతదేశాంగమంత్రులకు అధికారము లీయబడియున్నవి.

పరిశ్రమలను అభివృద్ధిచేయుట, న్యాయశాఖను కార్యనిర్వాహకవర్గమునుండి విభజించుట, శాసనసభాంగీకారములేనిదే శిస్తును వేయుట అను విషయములను తీసికొనుడు. ఇవన్నియు ఆర్థికవిషయములకు సంబంధించినవి. రాజ్యాంగనివేదికయందలి ప్రణాళికప్రకారము ఈ విషయములలో ప్రభుత్వమువారి అభిప్రాయములను మార్చుటకు శాసనసభలకు అధికార మీయబడియున్నది. భారతప్రభుత్వమువారి సూచనలు ఈ విషయములలో శాసనసభలకును, మంత్రులకును నేమియు పలుకుబడిలేకుండ చేయగలవు. కావున ఈ సూచనలు సయితము నివేదికయందలి ప్రణాళికకు వ్యతిరిక్తములుగా నున్నవి. ఈ విషయములపట్ల ప్రజలకుగల పట్టుదలను నాతోడిసభ్యులు మఱచిపోయిరని తలంచెదను. ఈ విషయములవలన గలిగిన పర్యవసానములను సయితము వారు పూర్తిగా మఱచియుండిరని నా అభిప్రాయము. ఈ విషయములపట్ల దేశీయసభలో నేమియు భేదాభిప్రాయములు లేవు. హిందూ దేశాంగమంత్రికిని, రాజప్రతినిధికిని దేశీయసభవారు సమర్పించిన పత్రములలో ఈవిషయములు ప్రధానములై యున్నవి.

ఈ సంగతిసందర్భములనుబట్టి నిర్బంధములను తొలంగించిన యెడల ప్రజలద్రవ్యము వృథాగా వ్యయము కాగలదనియు దేశమున

అసంతృప్తి యెక్కువగా వ్యాపింపగలదని నా నిశ్చితాభిప్రాయము. కావున నాతోడిసభ్యుల అభిప్రాయమును నిరాకరించి, పన్నులవిషయమునను ఆర్థికపట్టికవిషయమునను నివేదికయందలి ప్రణాళికయందు గల సూచనల నంగీకరించుచు సాధారణరీత్యా కార్యసాధనము కొనసాగించుకొనజాలనప్పుడు గవర్నరు అధికారములను చెలాయింపగూడదనియు, హిందూదేశాంగమంత్రియుత్తరువు లేనిదే అధికారాయత్తశాఖల శ్రేయోభివృద్ధికిగాను గవర్నరు క్రొత్తనిబంధనలను చేసికొనగూడదనియు నేను సూచించుచున్నాను. ఈ సందర్భమున ప్రజాయత్తశాఖల మంత్రిని తొలగించుటకు కార్యనిర్వాహకవర్గమునకు అధికార మున్నదనియు, మంత్రి అట్టి యధికారమునే కార్యనిర్వాహకవర్గముపట్ల చెలాయించుటకు స్వాతంత్ర్యము లేదనియు గ్రహింపవలయును.

28. ఆర్థికవిషయము నటుండనిచ్చి, ప్రజాశాంతివిషయము నాలోచించెదను. రాజద్రోహము బొంబయిలోనె పుట్టినదని చెప్పిన యెడల, కలక్టరొకరుచేసిన చట్టములప్రకారము పరిపాలనము చక్కగా జరుగకపోవుటయే దీనికి పునాదియనియు, ప్రభుత్వమున హైందవుల పలుకుబడికి నావకాశ ముండినయెడల ఇది జరుగకనే యుండియుండుననియు గ్రహింపవలయును. ఆవిధముగానే వంగదేశమున అరాజకము ప్రారంభమగుటకు తూర్పుబంగాళమున క్రమపరిపాలనము జరిగియుండినయెడల ఈకష్టములు కలిగియుండెడివి కావు. మన మిటీవల నంగీకరించిన శాసనము, ఇంకను మతికొన్ని నిబంధనల ననుసరించి రాష్ట్రములో కార్యనిర్వాహకప్రభుత్వమువారు ఏ మనుజుని యొక్కయు శరీరస్వాతంత్ర్యమును వాక్స్వాతంత్ర్యమును, న్యాయస్థానములతో నిమిత్తములేకుండ తొలగింపవచ్చును. వార్తాపత్రికాస్వాతంత్ర్య మటులనే తొలగింపవచ్చును. రాష్ట్రపుగవర్నరు తన నెదిరించినవారికి శరీరస్వాతంత్ర్యమును తొలగించి న్యాయస్థానముల యెదుట నేరములు రుజువుచేయు నవసరములేకుండ ఆస్తినిగూడ వశపఱచుకొనవచ్చును. ఈశాసనముక్రింద ఏ వార్తాపత్రికయు రాష్ట్ర అధికారికి సరిపడని విమర్శనములను కావించుటకు సాహసింపదు. సివిలుసర్వీసువారికి గాని అధికారవర్గమువారికి గాని వ్యతిరేకముగా జరిగెడి యే యాందోళనమైనను రాష్ట్రాధికారి సివిలుసర్వీసువారైనంతవఱకు జరుగుటకు సాధ్యపడదు. మతోమురూలు ఆందోళనముగాని శాసనబద్ధమగు మతి యే ఆందోళనము గాని కార్యనిర్వాహకప్రభుత్వమువారిచే అణచివేయబడవచ్చును. అందువలన రాష్ట్రప్రభుత్వమునందు భారతీయులకు ఎక్కుడధికార మీయవలయునని నే గోరుచున్నాను. లేనిచో శాసనసభలు నిరుపయోగములై అధికారులకును అనధికారులకును విభేదములు అతిశయించి అనర్థము గలుగును.

## గ్రాండుకమిటి

29. ప్రజాశాంతిక్షేమములకుగాను గవర్నరుగారు తన బాధ్యతను నిర్వహించుటకు అధికారాయత్త శాఖావిషయములను చర్చించుటకు శాసనసభాసభ్యులతో గ్రాండుకమిటి నొకదానిని నిర్మించుటకు నిర్ణయింపబడినది. అధికసంఖ్యాకు లగు శాసనసభాసభ్యులు అధికారాయత్తవిషయములను శ్రద్ధగా చర్చించుటకు నీలుండదనియె ఈ గ్రాండుకమిటి నిర్మింపబడినది. దేశీయులు రాజకీయ విషయములతో పాలుగొనుచుండుట లేదనియు అందువలన, భూస్వామికిని, వాని తాబేదారునకును సంబంధించు కలతలు పరిష్కరించు అధికారము కార్యనిర్వాహకప్రభుత్వమునకే యుండవలయు నని సూచింపబడినది. ఇట్టి అధికారము బ్రిటిషు వర్తకలాభము, పరిశ్రమలను గురించిన ఇతర ప్రశ్నలను సంరక్షించుటకు అవసర మని చెప్పబడినది. జాతులమధ్య నెరిగెడి సమస్యలను సామాన్యపు శాసనసభలకు విడువగూడదని తెలుపబడినది. ఇట్టి అసాధారణాధికారములు సుపరిపాలనమున కవసరమా యని సందేహింపవచ్చును. మన నియోజకవర్గములు విశాలవంత మగుచున్నవి. పలు విధము లగు అభిప్రాయములకు అందు ప్రాతినిధ్యము కలుగును. ఇట్టి స్థితిలోనే ప్రభుత్వమువారికి అధిక సంఖ్యల సభ్యులు చేకూరని యెడల వారు పొరపడిరని తలచుట కవకాశము గలదు. శాసనసభపై నిరోధముగ గ్రాండుకమిటి పనిచేయును. అందుచే ఈ ప్రతిష్ఠాపనము వాంఛనీయము గాదు. కార్యనిర్వాహక సభకును శాసనసభకును లేనిపోని పోరాటములను కల్పించును గాన దానిని నెలకొల్పుట భావ్యము కాదు. సామ్రాజ్యశాసనసభకు గల అధికారము గవర్నరు వైస్రాయిగార్లకు ఏ చట్టము లైనను ప్రతిఘటించుటకు గల అధికారములను తగిన సంరక్షణోపాయములను నొసగుచున్నవి. ఇండియా గవర్నమెంటువారు శాసనము చేయుటకు ఆక్షేపణలు సంస్కరణ నివేదికములో వివరింపబడినవి. అట్టి అధికారము రాష్ట్రీయస్వాతంత్ర్యమునకు భంగము కలిగించు నని మొదటి యాక్షేపణ. హార్డింజిగారి డిల్లీ ప్రకటనములో సూచింపబడిన రాష్ట్రీయస్వాతంత్ర్యము ప్రజాధికారము నెచ్చించుటకు ఉద్దేశింపబడినది. కాని రాష్ట్రీయస్వాతంత్ర్యము శాసనసభపై కార్యనిర్వాహకప్రభుత్వమువారి యధికారము నెచ్చుచేయుటకు నుద్దేశించినచో మాకు దానితో నిమిత్తము లేదు. ప్రజాధికారము హెచ్చినకొలది సామ్రాజ్యప్రభుత్వమువారి యొక్కయు ప్రభుత్వకార్యదర్శి యొక్కయు అధికారమును రాష్ట్రప్రభుత్వములపై తగ్గింపవచ్చును. అందుచే రాష్ట్రీయశాసనసభ యే శాసనము నైనను కావించినపుడు పై ప్రభుత్వములు దానితో జోక్యము కలుగజేసికొనకుండ నుండుట సమంజసము. కాని శాసననిర్మాణసభ వారు నిరాకరించిన శాసనమును కార్యనిర్వాహకప్రభుత్వమువారు గ్రాండుకమిటిద్వారా దానిని తిరిగి అంగీకరించుట న్యాయసూత్రమునకు విరుద్ధము. ఇందులో నిజమగు రాష్ట్రస్వాతంత్ర్య మేమియు లేదు. కార్యనిర్వాహకప్రభుత్వమువారి యిష్టమును చేకూర్చుటకు గ్రాండుకమిటి యుపయోగింపబడుచుండును. అందుచే శాసనసభ తిరస్కరించిన తీర్మానములను తిరిగి అంగీకరించుటకు గ్రాండుకమిటి కార్యనిర్వాహకవర్గము వారికి ఒక సాధనముగ నుండును. రాష్ట్రప్రభుత్వము శాసనసభకును సామ్రాజ్యప్రభుత్వమునకును కూడ లోబడియుండదు. నేను సూచిం

చిన సూచనప్రకారము సామ్రాజ్యప్రభుత్వమువారి అధికారము నిలిచియే యుండును.

ఇండియా ప్రభుత్వము వారు శాసనబాధ్యతను వహించుటకు ఇష్టపడరను రెండవ ఆక్షేపణ సరియైనది కాదు. స్థానిక కార్యనిర్వాహక ప్రభుత్వము నైనను సామ్రాజ్యశాసనసభయం దైనను, శాసనము గావించుట రాష్ట్రపు కోరికలను తృణీకరించుటకే. అట్టి స్థితిలో సామ్రాజ్యప్రభుత్వమువారు కార్యనిర్వాహకప్రభుత్వమునకును శాసనసభకును మధ్యవర్తులుగ నుందురు. ఈ కార్యము నెవరైన నొకరు చేయవలసినదే. స్థానిక కలవరములకు దూరముగా నున్న సామ్రాజ్యప్రభుత్వమువారు చేయుటయే మంచిది. గ్రాండుకమిటీలో ప్రజానియుక్తసభ్యుల సంఖ్యను తగ్గించుటకు కూడ నే నంగీకరింతును.

30. రాష్ట్రాధికారులు లెఫ్టినెంటు గవర్నర్లకన్న గవర్నర్లుండుటయే మేలని అందుకు మన మందఱము అంగీకరించినదే. కాని నా తోడిసభ్యులు సివిలుసర్వీసువారినే ఈ పనులకు నియమింపవలయు నని తెలిపిన సూచనతో నే నేకీభవింపజాలను. కార్యదర్శిగారు ఈ నియామకము చేయుటలో సమర్థత నాలోచింపవలయును. సివిలుసర్వీసువారు సంస్కరణములకు సామాన్యముగా ప్రతికూలురని తెలిసిన విషయమే. భారతీయులు పరిపాలనాధికారము వహించుటకు సమర్థులు కారని వీరు పట్టుదలతో నుడువుచుందురు. వీరిలో చాలమంది భారతీయులతో కలసి పనిచేయుట కంగీకరింపరు. అందుచేత ప్రభుత్వకార్యదర్శి నియామకము చేయునపుడు ఈ ప్రశ్నలను గమనింపవలయు. భారతీయుల అభివృద్ధితో సానుభూతి గలవారే మున్ముందు ఉద్యోగపదవిని నిర్వహింపగలుగుదురు. అందుచేత ఇదివఱకున్న పద్ధతినే కొనసాగింపవలయు ననుట భావ్యము కాదు.

31. కార్యనిర్వాహకసభ్యుని అర్హతలను గూర్చి కూడ ఇట్టి ప్రశ్న యుదయింపక మానదు. సంస్కరణ నివేదికబట్టి ఒకసభ్యుడు భారతీయుడుగను మరియొకరు పండ్రెండు సంవత్సరముల అనుభవముగల యుద్యోగిగను నుండవలసి యుండును. దీనిని శాసనము ద్వారా స్థిరపరుపవలయు నను నుద్దేశము రిపోర్టులో ఉన్నట్లు కనపడదు. ప్రస్తుతము ఉద్యోగము సివిలుసర్వీసువారికి ప్రత్యేకింపబడినది. కాని అవసరములబట్టి ఇతరులను నియమింపవలసి వచ్చును. ప్రభుత్వకార్యదర్శి అట్టివారిని నియమించుటకు ఏల అభ్యంతరముగ నుండవలయునో నాకు తెలియదు.

32. ప్రతిశాసనసభకును తన కార్యక్రమనిబంధనలను చేసికొనుటకు అధికార ముండవలయునా అను విషయము నాలోచించెదను. ప్రతిసభకును అట్టి అధికార ముండి తీరవలయును. దీనికి అధ్యక్షుని యిష్టమెందులకో నాకు తెలియకున్నది.

## ఇండియా ప్రభుత్వము

33. తరువాత బాధ్యతాయుతప్రభుత్వవిషయము ముఖ్యమైనది. రాష్ట్రప్రభుత్వములందువలె శాసనసభకు జవాబుదారిగా నుండు భారతమంత్రి ఇండియా ప్రభుత్వమున నుండగూడదని నివేదికయందు గలదు. రాష్ట్రప్రభుత్వమున ననేకశాఖలు భారతమంత్రులలో నుండు ననియు ఈవిధానమున జయాపజయములు పరీక్షించినగాని ఇండియా ప్రభుత్వమునందలి శాఖలు భారతమంత్రుల యధీనమున నుంచుట సాధ్యము కాజాలదని యీసూత్ర మనుసరింపబడినది. దేశశాంతి, సంధి, విదేశసంస్థానములు, సేన నావికావిషయములును ఆంగ్లభూమికి సంబంధించిన విషయములును ఈశాఖల యధీనములో నుండగలవు. మంత్రులకును శాసనసభకును సంబంధించు దేశపరిపాలనావిషయములును నీ శాఖాధికారమున నుండగలవు. ఈవిషయములలో భారతప్రభుత్వమునకు కొంత బాధ్యత యుండవలయును. అందువలన వారు ప్రజాయుక్తశాఖలలో జోక్యము పుచ్చుకొనవచ్చును. కాని భారతప్రభుత్వమున బాధ్యతాయుతపాలనమును ప్రవేశపెట్టుటకు వారెందులకు అభ్యంతరము పెట్టుచున్నారో నాకు తెలియకున్నది. నివేదికలో సూచింపబడిన సూత్రములు జయప్రదములుగా నిర్వహింపబడవలయుననిన బాధ్యతాయుత ప్రభుత్వము అత్యవసరము. దేశమున శాసనవిషయమున సమానత ఉండుటకును రాష్ట్రీయప్రభుత్వమునందలి ప్రజాయుక్తశాఖలతో ఇండియాప్రభుత్వమువారు జోక్యము పుచ్చుకొనుటకు నధికారయు (?) ఈయబడియేయున్నది. ఇతరరాష్ట్రములకు సంబంధించువిషయములలో సయితము ఇండియాప్రభుత్వమునకు అధికార మీయబడియేయున్నది. ఈవిషయము లన్నియు మంత్రులు శాసనసభలతో సంప్రతించుకొని నిర్వహింపవలసిన కార్యములు. కావున నిండియాప్రభుత్వమువారి కిట్టి కొద్దిస్వాతంత్ర్యమును మంత్రులనుండి తీసివేయుట బాగుగ నుండలేదు. భారతప్రభుత్వమువారీవిషయములలో మంత్రులు శాసనసభలతో సంప్రతించుకొని పనిచేయుటకు స్వాతంత్ర్య మిచ్చినయెడల శ్రేయోదాయకముగ నుండగలదు. అవసరమైనయెడల కార్యనిర్వాహకవర్గపు భారతసభ్యుడు ఈ విషయములలో జోక్యముపుచ్చుకొని పనిచేయుటకు భారతమంత్రిగ నుండవచ్చును. తాత్కాలిక కారణములవలన కొన్ని విషయములు ప్రజాయుక్తముచేయుటకు వీలులేదని తలంచినయెడల మూడు నాలుగుసంవత్సరములు వీనిని మనము ప్రజాయుక్తము చేయవలయు నని కోరుచుండినయెడల, ఈ విషయములలోనైన బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టుట కెందుల కభ్యంతర మున్నదో నాకు తెలియకున్నది. రాష్ట్రప్రభుత్వములలో ఏశాఖలలో మనము బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టుచున్నామో, అట్టి శాఖలలో భారతప్రభుత్వమున బాధ్యతాయుతప్రభుత్వము నీయకున్న రాష్ట్రబాధ్యతాయుతపాలనము లాభవంతము కాజాలదు.

## స్టేటుకౌన్సిలు

34. తరువాత ఆలోచింపదగినది స్టేటుకౌన్సిలు. శాసనసభలో ముందుగ చర్చింపకుండ కార్యనిర్వాహకప్రభుత్వము స్టేటుకౌన్సిలునందు చట్టములుచేయుటకు నే నామోదింపజాలను. గవర్నరు జనరలు అవసరములనుబట్టి చట్టములను చేయుటకు అధికారముగలదు. ఈ చట్ట

ములు ఆరునెలల కాలము అమలులో నుండవచ్చును. ప్రజాభిప్రాయమును కనుగొనుటకు శాసనసభలో చట్టమును గవర్నరు జనరలే ప్రవేశపెట్టవచ్చును. చట్టముపట్ల ప్రజాభిప్రాయము కనుగొనుట అనవసరమని గవర్నరు జనరలు కార్యనిర్వాహకవర్గము తలంచినయెడల దానిని శాసనము (ఆర్డినెన్సు) గా చేయవచ్చును. కావున స్టేటుకౌన్సిలు అనవసరము.

శాసనసభయందు తగిన ప్రాతినిధ్యము లేనివారికి స్టేటుకౌన్సిలు నిర్మించుట అవసరమని తలంచినయెడల నాకేమియు అభ్యంతరము లేదు. ఒక చట్టము శాసనమగుటకు కొంత కాలము వ్యవధియుండుటకుగాను స్టేటుకౌన్సిలు అవసరమని తలంచినయెడలను నాకేమియు అభ్యంతరములేదు. కాని ఈ కౌన్సిలు ఈ కార్యములకుగాను నెలకొల్పబడి యుండలేదు. కార్యనిర్వాహకవర్గమువారొక చట్టముపట్ల శాసనసభవారు వ్యతిరేకముగా నుందురని తలంచినయెడల దాని నెటులైన శాసనముగా చేసికొనుటకే ఈ క్రొత్తసంస్థను నెలకొల్ప దలంచుకొనినారు. దీనివలన మనకేమియు లాభములేదు. కావున ఈ క్రొత్తసంస్థను నిర్మించుటకన్నను నిరంకుశముగా చట్టములు చేసికొనుటకు కార్యనిర్వాహకవర్గమువారికి అధికారములిచ్చిన మంచిది. ప్రజామోదమును సంపాదించుచున్నామని స్టేటుకౌన్సిలుద్వారా చట్టములు చేయనటులు వారు నటనము చేయజాలరు. స్టేటుకౌన్సిలు శాసనసభాస్వాతంత్ర్యమును నాశము చేయగలదు. చాల సంఘర్షణము కలుగగలదు.

ఇంకొక అభ్యంతరము గలదు. ప్రజాప్రతినిధులు పరిష్కరింపవలసిన విషయములలో కార్యనిర్వాహకసంఘమునకు సంపూర్ణస్వాతంత్ర్య మీయగూడదు. ఇట్టి సంపూర్ణస్వాతంత్ర్యములవలన అనేకానర్థములు కలిగినవి. కార్యనిర్వాహకవర్గమునకు ఈ విషయములలో స్వాతంత్ర్యమిచ్చినయెడల ఆ విషయములలో ప్రజాభిప్రాయమును బొందుట అసంభవము. పరిపాలనావిషయమున శాసనసభలలో చర్చింపవలసిన సంస్కరణములు ఎన్నియో గలవు. అధికారవర్గమువారి వ్యతిరేకతవలననే ఈ సంస్కరణములు కొనసాగినవి కావు. కావున ఈ సంస్కరణము లేవియో ముందొకసారి ఉదాహరించియుంటిని. పూర్వపు సాంప్రదాయములను బట్టి స్టేటు కవున్సిలు ఇట్టి సంస్కరణములను ఆమోదింపజాలదు. కావున ప్రస్తుతపువిధానముల ననుసరించి నెలకొల్పబోవు స్టేటు కవున్సిలువలన లాభములేదు. ఇదియు గాక పై విషయములలో శాసనసభ కేమియు బాధ్యత యుండగూడదని నివేదికయం దుదాహరింపబడియేయున్నది. కావున నన్నివిషయములలోను చట్టము లన్నియు శాసనసభాంగీకారమునకు పంపవలయును. శాసనసభ వాని నంగీకరింపజాలక పోయినయెడల ఆ చట్టములకు సంబంధించిన కాగితము లన్నిటిని కామన్సుసభకు పంపవలయును. కామన్సుసభ యొక యుపసంఘమునకు వానిని బంపి సదరు కాగితముల నన్నిటిని ఆలోచింపగోరును. వారి యుత్తరువులను పొందిన తరువాతనే కార్యనిర్వాహకసభ గాని, స్టేటుకవున్సిలు గాని ఆ విషయములలో పనిచేయగూడదు. ఈ విషయమున విధానములు రెండు సూచింపబడినవి. ప్రత్యేకవిషయములలో సర్టిఫికేటు మంజూరుచేయు అధికారమును, శాసనసభలోని కొంతమంది సభ్యులచే నిరాకరింపబడిన చట్టములపట్ల గల సర్టిఫికేట్లను రద్దుచేయుటకును అధికారము గవర్నరు జనరలుగారి కుండవలయును.

స్టేటు కవున్సిలును తీసివేయుటకు వీలులేక పోయినయెడల దాని అధికారములైనను తొలగించుట అత్యవసర మని నా అభిప్రాయము.

## ఆర్థికపత్రము

85. ఈ విషయమున ఇండియా ప్రభుత్వమువారికి అధికారముల నిచ్చుటకు సూచింపబడినది. ఇంతవఱకును, భారతదేశపు పన్ను చెల్లించువాని శ్రేయోదాయకము కొఱకు భారతదేశాంగ మంత్రి, ఆమోదము, లేకనే భారతప్రభుత్వమువారు సొమ్మును వ్యయముచేయుటకు అధికారము గలిగియుండగూడ దని కొన్ని నిబంధనలు పూర్వము కలవు. కాని నివేదికయందలి సూచనలప్రకారము బాధ్యతాయుత ప్రభుత్వము ప్రజలకు లేకపోయినను, భారతప్రభుత్వమువారి పట్ల నిర్బంధనములు తొలగింపబడును. నేను ముందు సూచించిన ప్రకారము పన్ను చెల్లించువారి శ్రేయోదాయకముకొరకు భారతదేశాంగమంత్రి కొన్ని కట్టుదిట్టములను చేయుట అత్యవసరము. అట్టి బాధ్యత ఇక ముందు శాసనసభకుండి ప్రభుత్వపు ఆర్థికపట్టికవిషయములలో శాసనసభాసభ్యుల సూచనలు అంగీకరింపబడిన గాని లాభదాయకము కాజాలదు.

## ఇతరవిషయములు

86. పార్లమెంటు నందువలె సహాయకార్యదర్శులను స్థాయి సంఘములను, నియమించు విషయమున నాతోడిసభ్యులకు గల వ్యతిరేకాభిప్రాయముతోనే నంగీకరింపజాలను. క్రొత్తప్రణాళికప్రకారము అనధికారసభ్యులు అధికారమునం దుండిన గాని ప్రభుత్వవిషయములు గ్రహించుట కష్టతరము. పౌరసేవోద్యోగము లందలి హైందవులవలె, ప్రభుత్వమువారి సూచనల విమర్శించుటకు అనధికారసభ్యులకు సామర్థ్యముండుట కష్టతరము. ప్రజాయత్తవిషయములలో మంత్రులకు మాత్రము సంగతిసందర్భములు తెలియగలవు. అవియును రాష్ట్రములందే సహాయకార్యదర్శుల నియామకమువలనను స్థాయిసంఘనిర్మాణమువలనను అనధికారసభ్యులు ప్రభుత్వమునందలి సంగతిసందర్భములను కనుగొనుటకు వీలుండగలదు. ఈ విధానము వలన ముందు పరిపాలకులను సిద్ధముచేయుటకు వీలుండగలదు. కావున ఈ సూచనలను నిరాకరింపగూడదు. సామ్రాజ్య, రాష్ట్ర శాసనసభాకార్యక్రమములపట్ల నిబంధనలను చేసికొనుటకు శాసనసభలకే స్వాతంత్ర్య మిచ్చితీరవలయును.

87. రాజప్రతినిధి భారతదేశాంగమంత్రులకు సమర్పింపబడిన విజ్ఞప్తిపత్రములలో ప్రతివారును సామ్రాజ్య, రాష్ట్ర కార్యనిర్వాహకసభలయందు సగముమంది సభ్యులు భారతీయులుగ నుండ

వలయునని వాంఛించియున్నారు. కాంగ్రెసు, ముస్లిము లీగువారు, సిక్కులు, మదరాసు బ్రాహ్మణేతరులు ఈ సంస్కరణమును కోరియే యున్నారు. ఈ కోరికలకు కారణము లందఱకు తెలిసియే యున్నవి. కార్యనిర్వాహక సంఘమునందు భారతీయులకు ప్రాతినిధ్యముండిన గాని దేశపరిపాలనమునకు కావలసిన ముఖ్యసంస్కరణములు విజయవంతములు కాజాలవు. ఆర్థికవిషయములకు సంబంధించు విషయములు ఎన్నియో గలవు. భారతప్రభుత్వము, హిందూదేశాంగ మంత్రి కార్యనిర్వాహకసభ్యులతో సంప్రతించుకొని ఈ విషయములను పరిష్కరింప వలసియుండును. భారతప్రభుత్వమున భారతీయులకు తగినంత ప్రాతినిధ్య ముండిన గాని, భారతీయాశయములను కొనసాగించుకొనుట కష్టతరము. ప్రజోద్యమము పట్ల భారతప్రభుత్వ కార్యనిర్వాహక వర్గము వ్యతిరేకముగా గాని నిరంకుశాధికారముగా గాని ప్రవర్తించుటకు వీలులేకుండ చేయుటకై పాలనమునందు భారతీయుల ప్రాబల్యము అవసరము. కావున గవర్నమెంటువారు సూచించిన ఒక రిద్దరు భారతీయసభ్యులు కాక ఒక రిద్దరిని కూడ నియమింపవలయు నని నేను సూచించుచున్నాను. ఇందులకు ప్రభుత్వమువా రంగీకరింపనియెడల రాష్ట్రములందు ప్రజాయత్తము చేసిన శాఖల పరిపాలనావ్యవహారముల విషయమై భారతప్రభుత్వమువారు చెలాయింపవలసిన నియంత్రణాధికారమును చెలాయించుటకు భారతీయుల నొకరిని మంత్రిగా నియమింపవలయు నని కోరుచున్నాను. ఈ వ్యవహారముల విషయమై వారితో సంప్రతింపవచ్చునే గాని, వారితో యోచించి వ్యవహారములను పరిష్కరింప నక్కరలేదు.

డిల్లీ, మార్చి 5. సి. శంకరనాయరు.

## చాంపరాను, కెయిరా తగాదాలు

శంకరనాయరుగారు తమ భిన్నాభిప్రాయ ప్రకటనమునందలి కొన్నిచోట్ల, అధికారులు ప్రజాభిప్రాయము పట్ల చూపుచుండు నిరాదరణమును గురించి వ్రాయుచు, దానికి దృష్టాంతములుగా చాంపరాను, కెయిరాతగాదాల నుదాహరించియుండిరి. అనుబంధమునందు శంకరనాయరుగారు చాంపరాను, కెయిరా తగాదా లెట్టివో యీ విధముగా సూచించుచున్నారు.

### చాంపరాను తగాదా

చాంపరాను నీలితోటల యజమానులకును రైతులకును చాల కాలమునుండి స్నేహభావ మంత తృప్తికరముగా నుండి యుండెడిది గాదు. కొన్ని కలతలు కూడ జరిగినవి. వీని సంగతిసందర్భములను కనుగొనుటకు గాను గోర్లేగారిని ప్రభుత్వమువారు ప్రత్యేకాధికారిగ నియమించిరి. ఆయన వ్రాసిన నివేదిక రైతుల కనుకూలముగా నున్నందున, దానిని ప్రకటించుటకు నిరాకరించిరి. ప్రభుత్వమువారు తోటల యజమానులతో సంప్రతించి, వారికి అధికారములు చెలాయించుటకు స్వాతంత్ర్యమిచ్చియుండిరి. రైతు లంత అసంతృప్తిపడవలసిన కారణము లేవియు లేవని ప్రభుత్వమువారి యభిప్రాయము. 1918 సం॥ మార్చి నెలలో బిహారపు శాసననిర్మాణసభాసభ్యులొకరు ఈ సంగతిసందర్భముల కనుగొనుట కొక విచారణసంఘమును నెలకొల్ప గోరియుండిరి. ఈ విషయములు స్థానికాధికారులు పరిష్కరించుకొనవలసినదే గాని, తా మేమియు నందు జోక్యము పుచ్చుకొనజాల మని ప్రభుత్వమువా రాసభ్యుని కోరికకు ప్రత్యుత్తరమిచ్చిరి. రెండేండ్లకాలము సంగతిసందర్భములు యథాప్రకారముగానే యుండెను. 1915 సం॥ జనవరి నెలలో ఈవిషయమునుగురించి శాసనసభలో ప్రశ్నలు వేయబడినవి. ఈవిషయములలో సత్యాసత్యములు కనుగొని నివేదికను బంప స్థానికాధికారులను కోరియుంటి మని ప్రభుత్వమువారు జవాబిచ్చిరి. ఆ సంవత్సరము ఏప్రియలు నెలలో విచారణసంఘము నొకదానిని నెలకొల్ప శాసనసభలో మఱల నడుగబడినది. విచారణసంఘముకన్న స్థానికాధికారులే ఈ విషయముల నాలోచించుటకు తగిన సమర్థులని ప్రభుత్వమువారు ప్రత్యుత్తరమిచ్చిరి. ఆ సంవత్సరము, మరుసటి సంవత్సరమునందు సయితము ప్రభుత్వమువా రీ విషయమున నేమియు చర్యను దీసికొనలేదు. తరువాత కాంగ్రెసువా రీ విషయమున జోక్యము పుచ్చుకొనిరి. గాంధిగారు సంగతి సందర్భముల కనుగొనుటకు చాంపరానుకు వెళ్లిరి. గాంధిగారు తమ కార్యసాధనమునకు జిల్లా అధికారుల సాయము నపేక్షించిరి.

గాంధిగారి కోరికకు జవాబుగా బిహారునందలి యూరోపియను సంఘమువా రీ క్రింది తీర్మానములను చేసిరి:—

1. ఎవరు పిలువని పనికి బూనుకొనిన, గాంధిగారి రాకవలన అశాంతి, నేరములు ప్రారంభమైనవి.

2. ఆయన ఈ మండలమునం దుండినయెడల చాంపరానునందలి యూరోపియనుల శ్రేయోదాయకమునకును మంచిలక్షేమునకును భంగము కలుగగలదు.

3. చాంపరాను మండలమున శాంతిని కొనసాగింప దలంచినయెడల గాంధిగారిని ఆయనసహాయులను వెంటనే ఈ ప్రాంతముల నుండి సాగనంపుటకు గల ఆవశ్యకతను కలకత్తాయందలి యూరోపియను సెంట్రలు సంఘమువారు గ్రహింపవలయును. చేరువనున్న ఇతరమండలములలో సయితము నేరములు జరుగు నని భయము కలుగుచున్నది.

గాంధిగారికి సహాయముచేయుటకు బదులుగా, పై తీర్మానముల ప్రకారము, మండలాధికారులు ఆయనను మండలమును వదలి వెళ్లమని యాజ్ఞాపించిరి. సాధారణముగ చట్టములకు లోబడి ప్రవర్తించు హిందువున కీ శిక్ష సరిపోయియుండెడిదియే. ఆ విషయమున మం దేమియు మనము వినకపోయియుండెడి వారమే. కాని గాంధిగారు ఆజిల్లానువదలి వెళ్లుటకునిరాకరించిరి. అధికారులు ఆయనను ప్రాసిక్యూటుచేసిరి. తాము దోషులమని గాంధిగా రొప్పుకొనిరి. గాంధిగారటులు ధిక్కారముచేయుదు రని యెవరును ననుకొనలేదు. గాంధిగారిని శిక్షింపక, కేసునుఉపసంహరించుకొనిరి. తరువాత కొంత

కాలమునకు దొరతనమువారు గాంధిగారి కార్యసాధనమునకు సహాయముచేసెద మని చెప్పి తోటల యజమానుల ప్రతినిధులు, అధికారులు, గాంధిగారు మఱొక భారతీయ జమీందారునితో నొక విచారణసంఘమును నెలకొల్ప సమ్మతించిరి. గాంధిగారికిటులు తృప్తికరముగ విచారణసంఘమువారు కార్యసాధనమును ముగించిరి. బిహారు ప్రభుత్వమువారు విచారణ సంఘమువారి సూచనల ననుసరించి తోటయజమానులు బద్ధవ్యతిరేకత చూపుచున్నను సరకుగొనక శాసనము నొకదానిని చేసిరి. పర్యవసానమునకును తోటయజమానులు పోరాడిరి. ఆంగ్లో ఇండియనుపత్రిక యొకటి ఈ విషయమున నిటుల వ్రాసినది.

“ఈ ప్రవర్తనమునందు అధికారవర్గమున కనేకదోషములను ఆరోపించవచ్చును. ప్రతివిషయములోను ఉపేక్షచేయుట వారి యాదర్శము. విషయమును గుప్తముగా దాచియుంచుటకు వారి కెంతయు సంతోషము. విషయము చర్చించ తలంచిన నొప్పుకొనరు. కాని వాదనచేయువారు సమర్థతతో ముందుకు వచ్చిన వారికోరికల కొనసాగింతురు. విమర్శపూర్వక మైన ఈ విషయమున చాల కాలము శ్రద్ధవహించక యుండి వాదనచేయువారి బలాబలములను బట్టి న్యాయముచేయుట మంచిది కాదు.” (పయొనీరు 1918 మార్చి 13.)

అధికారవర్గమునకు వ్యతిరేకముగా నొక తగాదాను వాదించుట కష్టతరము. రైతులు శాంతిభూయిష్ఠముగా చేయు, నాందోళనమును, ప్రభుత్వమువారు తోటయజమానుల మనస్సు నొప్పించుటకు అయిష్టులై పెడచెవిని బెట్టుచుందురు. కాంగ్రెసువారు, గాంధిగారు రైతుల ఆందోళనమునకు కేలూతనిచ్చి, తోటయజమానుల కన్నను ఎక్కువగా రాపిడి కలుగచేసిన గాని న్యాయము కలుగుట కష్టతర మయ్యెను. ఆ రాష్ట్రమునందలి ప్రజలు గాంధిగారిని దైవసంభూతులుగఁ బూజించుచున్నారు.

ఇది ఆంగ్లో ఇండియనులకును రైతులకును సంబంధించిన విషయము. నేను ముందు సూచింపబోవు విషయమున సయితము మన మీ గుణపాఠములనే గ్రహించుటయే గాక ప్రభుత్వముక్రింద రైతు లెట్టి కష్టములకు పాల్పడవచ్చునదియును కనుగొనవచ్చును.

## కెయిరా తగాదా

బొంబయి రాజధానియందలి కెయిరా జిల్లాయందు బహుసంవత్సరములనుండి ప్రజలు పంటలు చెడిపోవుటవలనను క్షామరోగములవలనను వ్యవసాయసంబంధములగు కష్టములవలన బాధపడుచున్నారు. మామూలురోజులలో నా మండలమున 16 అణాలుగాక, 12 అణాల పంటయే పండుచుండెడిదని కలెక్టరే చెప్పుచుండెడివారు. 1917 సంవత్సరాంతమున గల అతివృష్టివలన పంటలన్నియు నాశనమైపోయినవి. పంటలు పాడైపోయిన కర్షకుడు శిస్తు చెల్లించియె తీరవలయుననియు, ఆచోట నందఱికిని ఇట్టిబాధలే యున్నయెడల నప్పుడు ఇతరులతోపాటు ప్రభుత్వసహాయమును కర్షకుడు పొందవచ్చునని రివిన్యూచట్టములలో గలదు. 20 వేల మంది ప్రజలు ఆసంవత్సరపు రివిన్యూవసూళ్లను నిలుపుదలచేయఁ బ్రార్థించుచు మహాజరులనేకములను ప్రభుత్వమువారికి బంపిరి. ఆ సంవత్సరమున నాలుగణాలకు లోపుగనే పంటలు పండినందున, రివిన్యూ చట్టముల ప్రకారము శిస్తులను రద్దుచేయ నామహాజరులం దుదహరించియుండిరి. శిస్తులకు గాను చెల్లించవలసిన సొమ్మునైనను పంటలవలన పొందజాల కున్నామని వారు ప్రభుత్వమువారికి మొఱపెట్టుకొనిరి. తగిన అధికారులద్వారా మహాజరులను తమకు బంపలేదని ప్రభుత్వమువారు వానిని వాపసుచేసిరి. తదనంతరము ప్రజలు వానిని కలెక్టరుద్వారా పంపుకొనిరి.

జిల్లాసంఘమువారు సయితము ప్రజల కష్టములను కనుగొని, రివిన్యూ వసూళ్లు నాపుదలచేయ ప్రార్థించుచు ప్రభుత్వమువారికొక మహాజరు పంపుకొనిరి. మండల సంఘమువా రీ విషయములలో జోక్యము పుచ్చుకొనగూడదని ప్రభుత్వమువారు జవాబు నిచ్చిరి. శాసనసభాసభ్యులగు ఆనరబిలు ఫారెకు పటేలుగార్లు సయితము ప్రజల కష్టనిష్ఠురములను కనుగొని ప్రజల కోరికలో న్యాయమున్నదని కలెక్టరుగారికి మనవి చేసిరి. కలెక్టరు ఈ విషయమున తగిన విధముగ పనిచేయుదు నని జవాబిచ్చెను గాని, రివిన్యూ వసూళ్లను నిలుపుదల చేయలేదు. ఈ మహాజరులు మనవులవలన, ప్రజలు నిలుపుదల చేయుమనిన 23 లక్షల రూపాయల వసూళ్లలో ఒకలక్ష 75 వేల రూపాయలను మాత్రము ప్రభుత్వమువారు రద్దుచేసిరి. పిమ్మట ఆనరబిలు సర్ దిన్షావాచా, ఆనరబిలు ఫరేకు, పటేలుగార్లు గవర్నరుగారిని కలిసికొని సంగతి సందర్భములను నివేదింపగా, గ్రామాధికారులు పంపిన లెక్కలు బాగుగా నున్నవనియు, ఇక నా విషయములలో నేమియు సహాయము చేయజాలమనియు గవర్నరుగారు ప్రత్యుత్తర మిచ్చిరి. హిందూదేశ సేవాసంఘసభ్యులలో ముగ్గురు ప్రజలు కష్టనిష్ఠురముల కనుగొనుటకు ముందంజవేసిరి. అతివృష్టివలన పంటలు నాశన మైన వనియు, 5,6 నెలలనుండి ప్రజలకు తినుటకు కావలసిన ఆహారపదార్థములును లేకయున్న వనియు, అందువలన వారెన్నియో కష్టములకు పాలగుచున్నా రనియు, ఈ సంఘసభ్యులు కనుగొనిరి. రైతుల కోరికలు సరియైన వనియు, వారికి తగిన సహాయము చేయుట అవసర మనియు, అధికారు లందరికి నివేదించిరి. అధికారులు తగిన సహాయము చేసెదమని చెప్పిరి. ఈ విషయమున తగిన విచారణచేయ గాంధిగారు కోరుచు, ఆ విచారణ సందర్భమున తాను సయిత ముండుటకు సదుపాయములు గలుగ చేయవలయు నని కలెక్టరును వేడిరి. దీనికి కలెక్టరు నిరాకరించెను. ప్రజల కష్టనిష్ఠురములను కన్నులార చూచివచ్చుటకు గాంధిగారే బయలుదేరిరి. ప్రజలబాధలు నిజమైన వనియే ఆయన తెలిసికొనెను. కలెక్టరు, గవర్నరులకు యీ సంగతులను తెలిపిరి. ఇంతకు ముందే ప్రజలకు తగిన న్యాయము చేయబడిన దనియు, ఇక తా మేమియు నిందు విషయమున జోక్యము పుచ్చుకొనమని గవర్నరు ప్రత్యుత్తర మిచ్చెను. శాసనసభలో ఈ విషయమున కొన్ని ప్రశ్నల నడుగు

టకు కొందలు సభ్యులు పూనుకొనిరి. ప్రభుత్వమువారు వానిని సభలో నడుగుటకు నిరాకరించిరి. మార్చి 23-వ తేదిని వ్యవసాయ శాఖవారు, పంటలు నాశనమైనందున ప్రజల కెంత నష్టమైనది రివిన్యూ అధికారులద్వారా కనుగొనగోరుచు శాసనసభలో నొక తీర్మానము ప్రవేశపెట్టబడినది. ప్రభుత్వమువారి ప్రతిఘటనవలన తీర్మానము వోడిపోయినది. శాసనరీత్యా చేయవలసిన యాందోళనము దీనితో ముగిసిపోయినది.

రైతులు మార్చి నెల 28-వ తేదినుండి సాత్వికనిరోధము నవలంబించి శిస్తులను చెల్లించుటకు నిరాకరించిరి. శిస్తులు చెల్లించనందున, రైతులసామానులు, ఆవులు మున్నగు యావదాస్తియు వేలము వేయబడినది. వారి భూములను సయితము వేలము వేయుటకు ప్రభుత్వమువారు ఉత్తరువులను జారీచేసిరి. రైతులనుండి శిస్తును రాబట్టుటకు రివిన్యూ అధికారులు చేయవలసిన ప్రయత్నముల నన్నిటిని చేసిరి. కమీషనరు రైతులందఱను నొకచో సమావేశపరచి ప్రభుత్వపుటుత్తరవులకు లోబడవలయు ననియు, అటుల చేయకపోయిన కష్టములకు పాలుగావచ్చు ననియు స్వరాజ్యాందోళనకారుల మాటలు విని మోసపోకు డని రైతులకు గొప్ప యుపన్యాసము నిచ్చిరి. కాని రైతులు తమ పట్టుదలను విడిచినవారు కారు. ఈ యుద్యమమునకు సానుభూతి జూపుటకు దేశమునం దెల్లెడలను సభలు జరిగినవి. స్వరాజ్యవాదులకును తమకును పోరాటము జరుగుచున్న దని ప్రభుత్వమువారు తలంచిరి. ప్రజల నొత్తిడిచేయుటకు సర్వప్రయత్నములను చేసిరి. కాని ఈ యొత్తిళ్లవలన ప్రజల నిరోధమునకు సయితము బలము రాసాగినది. గ్రామాధికారులు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా తిరిగిరి. ప్రభుత్వమువారి యొత్తిడికి ప్రత్యుత్తరముగా వారీ క్రింది జవాబు నిచ్చిరి.

"ప్రభుత్వమువారి యుత్తరవులు, ప్రజలపట్ల మాకు గల ధర్మములకు వ్యతిరేకముగా నున్నయెడల, వానిని నిరోధించుట మా ధర్మము. ఈ కార్యమునకు పూనుకొనుటకు ముందు ప్రజల కష్టముల నివారణచేయుటకు ప్రభుత్వమువారితో కలిసి యెంతయో పని చేసితిమి. కాని వారు వీనిని సరకుకొనలేదు."

ఏప్రియలు 25-వ తేదిని శిస్తు చెల్లించ శక్తిగలవారు తప్ప తక్కినవారు రా సం॥న శిస్తు చెల్లించ నక్కఱలేదని ప్రభుత్వమువారు ఉత్తరవులను జారీచేసిరి. ఎవరు శిస్తులు చెల్లించగలరో, ఎవరు చెల్లించజాలరో అను విషయమును రైతులే పరిష్కరించకోరిరి. కాని యీ యుత్తరవు జూన్ నెల 3-వ తేదీ వరకు కార్యాచరణమునందు పెట్టబడినది కాదు. అంతవరకును సొత్తులు వేలములు వేయబడుచునే యుండినవి. రైతులమీద కేసులును జరుగుచునే యుండినవి. ఈ ప్రాసిక్యూషను లందలి ముద్దాయిలు మారు మాటాడలేదు. తమపై విధింపబడిన శిక్షలకు అపీళ్లు చేయలేదు. వీరిలో నొకరు విడుదల చేయబడిన తదనంతరము, "తాను స్వరాజ్యవాది ననియు తన ఆత్మసాక్షికి వ్యతిరేకముగా నుండు శాసనములను ఎల్లకాలమును నిరోధించుచుండెద ననియు" కలెక్టరు దగ్గరనే చెప్పియుండెను.

రివిన్యూ పద్ధతివలన లాభ మెక్కువగ వచ్చుచుండిన యెడల రైతుల కష్టము భరింప నశక్యము. తరువాత పరిణమించు విషయము సూచించుట సులభము.

ఈ తగాదా విల్లింగ్డను ప్రభువువారి పాలనలో జరిగినది. వీరి వలెనే ఉదారవంతులు కాని వారి పాలనములో నిది యెటుల పరిణమించునో చెప్ప నశక్యము.

# అధికారవిభజనసంఘము

## సౌతుబరో సంఘ నివేదిక సూచనలు

మాంటుఫర్డు రాజ్యాంగ ప్రణాళికలోని అధికార ప్రజాయత్తశాఖల విభజనల విషయమున భారతదేశీయుల అభిప్రాయమును కనుగొనుటకు సౌతుబరో ప్రభువుగారి యాజమాన్యమున నొక విచారణ సంఘము నెలకొల్పబడినది. విచారణ సంఘమువారు దేశమునందలి అధికార ప్రజాభిప్రాయమును కనుగొని ఈ క్రింది సూచనలను ప్రకటించిరి:

### భారతప్రభుత్వముతోటి సంబంధము

అధికారవిభజననిర్ణయసంఘపు నివేదికము ఆఱుఖండములుగ నున్నది. రాష్ట్రీయాధికారములను, రాష్ట్రములకును భారతప్రభుత్వమునకుఁ గల సంబంధమును తెలుపు రెండవభాగమును, ప్రజాయత్తశాఖావిషయములను గూర్చియు నీవిషయములలో రాజప్రతినిధికిఁ గల అధికారమును గుఱించియును చర్చించు మూఁడవభాగమును, ప్రభుత్వశాఖకు సంబంధించిన సూచనలు గల నాలుగవభాగమును, ఆర్థికవిషయమును గుఱించిన ఏర్పాటులు గల యైదవభాగమును ముఖ్యములు. వానిలో నివేదిక క్లిష్టముగను సాంకేతికపదభూయిష్ఠముగను ఉండుటచేత దీనిని సంగ్రహించుట కష్టము. కావున నందలి ప్రధానసూత్రములు మాత్రమే ఇచ్చట పొందుపరుపఁబడినవి:

### ప్రభుత్వశాఖానిర్ణయము

2. సంఘమువారు (1) అఖిలభారతీయ విషయముల గుఱించియు, (2) రాష్ట్రీయవిషయముల గూర్చియు, రెండుపట్టికలను తయారుచేసిరి. మొదటిభాగమున నౌకాసైనికవైమానిక విషయములను, విదేశసంబంధములను, స్వదేశసంస్థానములతోటి సంబంధములును (కొన్ని విషయములలో తప్ప) రయిలు మార్గములను, సైన్యమునకు సంబంధించిన విషయములను పోస్టు టెలిగ్రాఫ్ కరెన్సీ

విషయములును, నాణెములను ముద్రించుటయు, సామ్రాజ్యదాయ విషయములును, ఆస్తి హక్కు మున్నగువానికి సంబంధించు శాసనమును వాణిజ్యమును క్రిమినలు శాసనమును, సెంట్రలు పోలీసు రెయిల్వే, పోలీసు శాఖలును, ఆయుధధారణనిర్ణయమును, వైజ్ఞానిక పారిశ్రామిక పరిశోధనా కేంద్ర ప్రతిష్ఠాపనములును, మతవిషయములను, భారతప్రభుత్వశాఖలుగ చేర్పబడినవి. రెండవభాగమున స్థానిక స్వపరిపాలనమును, వైద్యమును, విద్యయు, పారిశుద్ధ్యమును, (కొన్ని విషయములలో తక్క) విద్యాశాఖయును రాష్ట్రమునందలి భవనములును, (సైనికవిషయములకు సంబంధించినవి గాక) ఇతర ప్రయాణ మార్గములును, కొన్ని విషయములలో రైలుమార్గములును ఇరిగేషన్ కాలువలు, భూమిశిస్తు, వ్యవసాయము, పశువైద్యశాఖలు మున్నగునవియును పరపతిసంఘములు, అటవీశాఖ, మద్యపానశాఖ, న్యాయశాఖయు, పారిశ్రామికపురోవృద్ధియు పోలీసును, ఖైదులును, వార్తాపత్రికా ముద్రణయంత్రాధికారమును అప్పతీసికొను నధికారమును రాష్ట్రీయప్రభుత్వశాఖలో చేర్పబడినవి.

3. రాష్ట్రీయశాఖలు ప్రభుత్వాయత్తము లనియును, ప్రజాయత్తములనియు విభజింపబడినవి. ఈవిభాగమునుబట్టియే రాష్ట్రీయ శాఖావిషయములలో భారతప్రభుత్వమునకు గల అధికారము మార్పుపొందవలయు నని సూచింపబడినది. ప్రజాయత్తశాఖావిషయములలో రెండు విషయములలోమాత్రమే ప్రభుత్వమువారు జోక్యము కలుగజేసికొనవచ్చును.

అవి యేవన: (1) అఖిలభారతీయశాఖ పరిపాలనాసంరక్షణార్థము. (2) రెండు మూడు రాష్ట్రములకు సంబంధించిన సమస్యా పరిష్కారమునకై ఆయారాష్ట్రములు ఎట్టి తీర్మానమును రానప్పుడు కొన్ని ప్రత్యేకవిషయములలో భారతప్రభుత్వమువారు తమ యధికారమును వీడక వానిని భారతప్రభుత్వశాసనమునకు లోబడిన రాష్ట్రీయవిషయములుగ బరిగణించుచుందురు. ప్రభుత్వాయత్త విషయములలో భారతప్రభుత్వమునకు గల సాధారణాధికారము తగ్గింపబడలేదు. కాని, ఈ విషయములను రాష్ట్రీయప్రభుత్వము వారు భారతప్రభుత్వమువారి ఏజెంట్లుగనుండి పరిపాలించుచుండిరా లేక అవి రాష్ట్రీయప్రభుత్వమువారి అధికారములోనివేనా? అను విషయమును గుర్తించి భారతప్రభుత్వమువారు తమకు గల అధికారమును చెల్లించుచుండవలయును. మొదటి విషయములో భారతప్రభుత్వమువారికి గల అధికారము తగ్గింపబడదు. రెండవవిషయములో నూతన భారతప్రభుత్వశాసనోద్దేశము ననుసరించి ఈ యధికారమును చెల్లించుచుండవలయును.

4. సాధారణముగా రాష్ట్రీయవిషయములలో శాసననిర్మాణమును గావించుటకు రాష్ట్రీయ ప్రభుత్వములకు సర్వాధికారము నొసంగవలయు నని సూచింపబడినది. ప్రభుత్వశాఖలు ప్రభుత్వాయత్తము లైనను ప్రజాయత్తము లైనను కావచ్చును. కాని ఇవి భారతప్రభుత్వశాసననిర్మాణమునకు లోబడునట్టివిగ మాత్ర ముండ రాదు. గవర్నరు తనవశమున నున్న ఎట్టి రాష్ట్రీయపుబిల్లుల నైనను ఇతరరాష్ట్రములలో నున్న ఎట్టి అఖిలభారతదేశీయవిషయము నైనను రాజప్రతినిధి అనుమతిని పొందునట్లుగ ప్రత్యేకించునట్లు అధికారమును కలిగియుండవలెను. అందు ముఖ్యముగ మతము మతాచారములు, సాంఘికాచారములు, విశ్వవిద్యాలయశాసనములు, ప్రభుత్వాయత్తప్రజాయత్తశాఖానిర్ధారణశాసనములు, రైలు ట్రాము మార్గములకు సంబంధించిన బిల్లులు — వీనికి గవర్నరు రాజప్రతినిధి యంగీకారమును పడయవలయును.

## అధికార విభజనము

5. అధికారమును ప్రజావశంగతము చేయు విషయములో స్థానికప్రభుత్వములు చేసిన సూచనలను కొన్ని షరతులమీద చర్చించియుండిరి. మదరాసు ప్రభుత్వమువారు ద్వంద్వవిధానము గల ఎట్టి సంస్కరణల కైనను సంపూర్ణముగ ప్రతికూలురుగా నుండిరి. బొంబాయి, పంజాబు ప్రభుత్వములవారును అస్సాము చీఫుకమిషనరును అధికారవిభజనము లేని మరొక సంస్కరణ విధానమును సూచించిరి. మధ్యరాష్ట్రముల చీఫు కమిషనరు సంస్కరణ విధానము నాచరణలోనికి వచ్చుటకు ముందు కొంత శిక్షణము వలయు నని తెల్పిరి. స్థానికస్వపరిపాలనము వైద్యశాఖాపాలనము విద్య, పారిశుద్ధ్యము (కొన్ని విషయములు తక్క) విద్య రాష్ట్రీయభవనములు సైనికసంబంధము గాని ఇతర రాకపోకల విషయములు కొన్ని విషయములలో రైలు ట్రాము మార్గములు వ్యవసాయము పశువైద్యశాఖ చేపలు (అస్సాములో తప్ప) పరపతి సంఘములు, బొంబాయిలో అడవులు, మద్యపానము (అస్సాములో తప్ప) పారిశ్రామికాభివృద్ధి ఇవి. ప్రజాయత్త విషయములలో ముఖ్యములుగా పరిగణింపవలె నని సూచింపబడినవి. మదరాసులో ఏ విషయమైనను ప్రజాయత్తములుగా నుంచుటకు సూచించుట దుస్సాధ్యమనియు, నియోజకవర్గ నిర్ణయసంఘమువారి సూచనలవలన బ్రాహ్మణులే అధిక సంఖ్యాకులుగ నధికారమును కలిగియుందు రనియు, వారిచేతులలో జనసామాన్యము సురక్షితము గాదనియు, కాబినను గారు నుడివిరి.

## గవర్నరు జోక్యము

6. ఈ క్రింద తెలుపబడు రెండు విషయములందు మాత్రము ప్రజాయత్త విషయములలో గవర్నరు జోక్యమును కలుగజేసికొనవలె నని సంఘమువారు సూచించిరి.

(1) ప్రభుత్వాయత్తవిషయ సంరక్షణార్థము.

(2) పై యధికారుల యుత్తరువులను పాలించుటకు వలయు ప్రత్యేకబాధ్యతా నిర్వహణార్థము.

మొదటి విషయములో నాయాశాఖల సమ్మతి నొందుటకు గవర్నరు విఫలమనోరథుడైనచో ఆతడే ఆ సమస్యను పరిష్కరించి ఆ శాఖామంత్రిని తన పదవికి (అవసర మగునెడల) రాజీనామా నొసంగవలె నని చెప్పుటకు నధికారము గలదు. అత్యవసర

మగు విషయములలో సభాయుతులు గవర్నరు స్వతంత్రముగనే చర్యను తగినట్లు తీసికొనవచ్చును. ప్రభుత్వమునందలి రెండుభాగములకుఁ గల యధికారమును నిర్వహించుటకు కొన్ని నియమములు సూచింపఁబడినవి. వీని సారాంశ మేమనఁగా:

(1) ఒక శాఖవారు రెండవశాఖతో అనవసరముగా జోక్యము కలుగఁజేసికోరాదు.

(2) ఈశాఖ యధికార విషయమున సందేహము గలిగినప్పుడు దానిని గవర్నరు మాత్రమే పరిష్కరింపవలెను.

(3) సభాయుతుఁ డగు రాజప్రతినిధి యుత్తరవు పాలింపఁబడునట్లు గవర్నరు కనిపెట్టవలయును.

(4) ప్రజాయత్త ప్రభుత్వాయత్తశాఖలకు సంబంధించిన విషయములలో గవర్నరు సంయుక్తసమావేశములఁ గావించి ఏకీభావము కుదురనపుడు తానే ఆ విషయమును నిర్ణయింపవలయును.

(5) మంత్రి లేనప్పుడు అత్యవసరసమయములోనే ప్రజాయత్తవిషయ మైన సభాయుతుఁ డగు గవర్నరే పరిపాలింపవచ్చును.

పై యధికారుల ఉత్తరవులను పాలించు ప్రత్యేక బాధ్యతా నిర్వహణమునకు గవర్నరు ఇట్టి అధికారమునే కలిగియుండవలయును. గవర్నరుయొక్క ప్రత్యేక బాధ్యతలను నిర్వహించు చిత్తునియమములు నివేదికయందు చేర్పఁబడినవి. శాంతిస్థాపనము మత సాంఘిక కలహ నిషేధము వాణిజ్య స్వాతంత్ర్య ప్రదానము ప్రజాక్షేమమునకు భిన్నములగు వ్యక్తిస్వాతంత్ర్యప్రదానము ఆంగ్లో ఇండియనుల యొక్కయు, ప్రభుత్వోద్యోగుల యొక్కయు, ఈ దేశమునందు తాత్కాలికముగ నివసించు సంఘముయొక్క సంరక్షణము మహమ్మదీయుల విద్యావిషయసంరక్షణము మతప్రతిష్ఠాపనలు, నిమ్న జాతులు—మున్నగువాని సంరక్షణము మొదలైనవి గవర్నరు ప్రత్యేక బాధ్యతలలో చేర్పఁబడినవి.

## పౌరసేవోద్యోగములు

(7) రాష్ట్రీయప్రభుత్వము వారి క్రింద పనిచేయుచున్న వారిని "ఇండియను" "ప్రావిన్షియలు" "సబార్డినేటు" లని మూడు తరగతులుగా విభజింపవలయు నని సంఘమువారు సూచించిరి. ఏ అధికారము ఉద్యోగులను నియమించుచున్నదో, ఆ అధికారమే ఆ యుద్యోగుల కుండవలసిన లక్షణములను నిర్ణయించ గలదు. భారతమంత్రిగారి స్టాట్యూటరీ యుత్తరవుల యందు సూచింపబడిన పద్ధతుల ప్రకారము ఇండియను "సర్వీసు ఉద్యోగములకు తగినవారిని నియమింతురు. భారతమంత్రిగారే ఈ సర్వీసు నందలి వారికి నుద్యోగముల నిప్పించుట, వారి జీతములను నిర్ణయించుట క్రొత్తయుద్యోగములను సాంక్షను చేయుట భారతదేశప్రభుత్వము వారి క్రొత్తచట్టము నందలి స్టాట్యూటరి యుత్తరవుల ప్రకారము ఉపకారవేతనములను సంపాదించుట మున్నగు కార్యములకు పూనుకొందురు. స్టాట్యూటరీ నిబంధనలలో ఇండియను సర్వీసునకు సంబంధించిన యుద్యోగుల జీతములను, ఉపకారవేతనములను గవర్నరుగారి అనుమతి లేనిదే ప్రజాయత్తశాఖలలో చేర్చకూడదని సంఘమువారు సూచించిరి. వైద్యశాఖను ప్రజాయత్తము చేయదలచిన యెడల ఇండియను మెడికలు సర్వీసునందలి యుద్యోగుల ప్రైవేటు ప్రాక్టీసునకు భంగము కలుగకుండ భారతదేశరాజ్యాంగమంత్రి తగిన కట్టుదిట్టములను చేయవలసివచ్చునని సంఘమువారు సూచించిరి. పౌరసేవోద్యోగములను కట్టుదిట్టముల చేయుటకును, ప్రభుత్వమువారి అనుమతిలేనిదే ఏ యుద్యోగియొక్క గాని జీతముల యుపకారవేతన విషయములలో యుత్తరువు లేవియు పాలింపకుండునటుల చేయుటకును గవర్నరు వారు చూచుచుండవలయును. ఈ యుత్తరువులమీద అపీళ్లను భారతదేశప్రభుత్వమువారికి భారతదేశాంగమంత్రిగారికి చేయవచ్చును. దేశాంగమంత్రిగారి యుత్తరువుమీద తప్ప, ఇండియను సర్వీసునకు సంబంధించినవారి నెవరినైనను ఉద్యోగమునుండి తీసివేయగూడదు. అధికార ప్రజాయత్తశాఖలలో నున్న యుద్యోగుల ప్రమోషను, బదలాయింపులు, కట్టుదిట్టముల విషయమున, పైన సభాయుతు లగు గవర్నరుగారికిని, మంత్రులకును గల సంబంధముల విషయమున సూచింపబడినవే అనువర్తింపగలవు.

## రాష్ట్రవిభజన

8. ప్రావిన్షియలు డివిజను రాష్ట్రీయ శాఖోద్యోగము లందలి వారి నియోజనము, శిక్షణ, కట్టుదిట్టములు, మున్నగువానిని నిర్ణయించు శాసనమును చేయునంతవఱకును, ప్రజాయత్తశాఖల సంబంధమున మంత్రులు ప్రకృతమున్న నిబంధనములనే అనుసరింపవలసియుండును. జీతము అలవెన్సులు సెలవులు మున్నగు విషయములందు మాత్రము స్థానిక ప్రభుత్వములవారికి సంపూర్ణాధికారము లీయబడును. సాధారణపు కట్టుదిట్టములలో మాత్రము ఇండియను సర్వీసు ఉద్యోగులకు సూచింపబడిన పద్ధతులే రాష్ట్రీయశాఖోద్యోగులకును అన్వయింపగలదు. ఇకముందు జీతములు, ఉపకారవేతనములకు సంబంధించినట్టియు, ఈ శాఖయందున్న వారిని యుద్యోగములనుండి తీసివేయుటకుగాను పాలింపబడు నుత్తరువుల విషయమునను గవర్నరుగారి అనుమతి యుండుట అత్యవసరము. సబార్డినేటు డివిజను అధికారాయత్త ప్రజాయత్త శాఖలలో నుండు సబార్డినేటు యుద్యోగుల స్వాతంత్ర్యములను యథాప్రకారముగా నిలువబెట్టుటకుగాను గవర్నరుగారు ఉత్తరువులను పాలించుచుండవలయును. ఇకముందు నియమింపబోవు వారి యుద్యోగవిషయములందు మాత్రము సభాయుతు లగు గవర్నరు, గవర్నరు మంత్రులు తగిన నిబంధనలను ఏర్పరచవచ్చును.

ఇండియను సర్వీసునందలి నిబంధనలకు లోబడి నడచుకొను వారినే ఆయా యుద్యోగములకు నియమింపవలయు నని సంఘము వారు అభిప్రాయపడిరి. అయినను అవసర మైన నిర్బంధములను ముందుముందు తగ్గింపవచ్చును.

## ఆర్థిక విషయములు

9. ఆర్థికవిషయమున నీ క్రింది యేర్పాటులను చేయవలయును :

యత్తము చేయుటకు భారతమంత్రికి నాధికారమును కల్పించిరి. ప్రజాయత్తాధికారాయత్తశాఖల మంచిచెడ్డలకు సంబంధించిన విషయములలో కార్యనిర్వాహకవర్గమునకును, మంత్రులకును, భిన్నాభిప్రాయములు కలిగినప్పుడు వానిని పరిష్కరించు అధికారమేశాఖవారికి కలదను విషయమును గవర్నరు నిర్ణయించవలయు నని వారు సూచించిరి. నేను ప్రత్యేకముగా ప్రకటించిన అభిప్రాయపత్రమునందు వ్రాసినటుల ఈ సూచన లన్నియు సంస్కరణనివేదికమునకు వ్యతిరేకముగా నున్నవనియు, దానిని అధికారవిభజనసంఘమువారు అంగీకరింపలేదనియు, ఆ సంఘమువారు దీని విషయమై, భారతప్రభుత్వమువారి యభిప్రాయములకు భిన్నముగ నున్నారనియు నా అభిప్రాయము. ప్రజాయత్తపుశాఖలనుండి అధికారాయత్తశాఖలకు నే విషయమునైనను తిరిగి సంక్రమింపచేయు సూచనలను సంఘమువా రంగీకరించలేదు. శాసనసభానియుక్తసభ్యుడును, ప్రజాయత్తము చేసిన శాఖకు బాధ్యుడు నగు మంత్రిని దాని పరిపాలనమునకు గవర్నరు సదా నియమింపవలయును. కాని గవర్నరుగారి సభవారు దాని నెప్పుడును పాలింపవలయు నని లేదు. ఒక మంత్రి తొలగింపఁబడి రెండవమంత్రిని నియమింపవలసిన కాలమునందు మాత్రము ఆ మంత్రికి ప్రత్యామ్నాయముగా గవర్నరుగారు ఆ వ్యవహారములను చూడవలయు నని కలదు. నాతోడి సభ్యులు సూచించిన ప్రకారము శాసనసభ గవర్నరుగారి అభిప్రాయమును శిరసావహించునట్లును వారే ఆ శాఖాపరిపాలనమును వహింపవలసియుండుటచే పై దానికి విరుద్ధముగా నున్నది. అభిప్రాయభేదము కలిగినప్పుడు ఎవరు దానిని పరిష్కరింపవలయు నను విషయములు, కార్యనిర్వాహకవర్గమునకును మంత్రికిని కలుగు తగాదాలను గవర్నరు నిర్ణయింపవలయు నని సంఘమువారి అభిప్రాయము. మంత్రులు చెప్పినటుల విని పనిచేయక పోయినపుడు ఇండియాగవర్నమెంటు శాసనము 50-వ సెక్షను ప్రకారము కార్యనిర్వాహకవర్గపు ఉత్తరువును జారీచేసి వారిని తొలగించి క్రొత్తమంత్రిని గవర్నరు నియమింపవచ్చును. విషమస్థితియందు మంత్రిని తీసివేసి గవర్నరు స్వయముగా అధికారమును వహింపవచ్చును. కాని త్వరలోనే ఆ పదవికి తిరుగ మంత్రిని నియమించవలసియుండును. విషమస్థితియందు ఇట్లు చేసిన బాగుగనుండు నని సంఘమువారు నిర్ణయించిరి. ఇది సహేతుకముగనే యున్నది. కాని సంస్కరణనివేదికమునందు సూచించిన సులభపద్ధతి యగు గవర్నరు నిర్ణయమునే ఉత్తరువుగా పరిగణింపవలయు నని చెప్పిన విషయము మంచిదా యని సంశయము కలుగుచున్నది. సంఘమువారి సూచనల ప్రకారము గవర్నరు తాత్కాలికముగ ప్రజాయత్తశాఖాధికారమును, అదియును అవసరస్థితియందు మాత్రమే, వహించుట అవసరమని సంఘమువారు సూచించిరి. కావున గవర్నరునకును, మంత్రికిని నుండవలసిన సంబంధములో వారికి కార్యనిర్వాహకసంఘముకంటె తక్కువస్థితిని వారు కల్పించలేదు. ప్రజాయత్తశాఖావిషయము చాల ముఖ్యమైనది. కావునను 87-వ పేరాలో నేను కొన్ని అభిప్రాయములను తెలుపవలసియుండెను.

## ప్రబలాక్షేపణ

ప్రజాయత్తము చేసిన శాఖాధికారమును తిరిగి గవర్నరు వహించియుండవలయు నని చేసిన సూచన విషయమై నేను ప్రబలముగ నాక్షేపించుచున్నాను. స్థానికప్రభుత్వము భారతవర్షప్రభుత్వపు కోరికల ననుసరించి ప్రజాయత్తశాఖను అధికారాయత్తముగ మార్చుటకు భారతమంత్రికి అధికార మిచ్చుటను కూడ నే నాక్షేపించుచున్నాను. నేనిదివఱకు చెప్పినటుల అవి సంస్కరణతత్వమునకే చాల భంగకరములుగ నున్నవి. ప్రజానియుక్తసభ్యులు సివిలు సర్వీసువారి నియంత్రణమునుండి విడివడి పాలనాధికారమును చేయుటయే సంస్కరణోద్దేశము. యోగ్యమగు పరిపాలనమున కిది అవసరమని భారతీయులందఱు నేకాభిప్రాయులై యున్నారు. పార్లమెంటువారియొక్కయు నాంగ్లప్రజల యొక్కయు నుద్దేశములను నెఱవేర్చుటకు సివిలుసర్వీసువారికి సాధ్యము కాకపోవుటవలనను ఇది అత్యవసరమైనది. కొంతకాలమువఱకును కొన్ని రాజధానులలో గవర్నరు సివిలియనుగనే యుండును. తక్కిన రాజధానులలో గవర్నరు సివిలియనుల ప్రాబల్యమునకు లోబడియుండును. ఇట్టి స్థితిగతులలో సివిలు సర్వీసువారిట్లు సంచరించుటకు అవకాశము గలుగకుండ శాసనసభ ఆచరించకుండ నుండవలయు నని ప్రజాయత్తశాఖను అధికారాయత్తశాఖగ మార్చు నిబంధన హెచ్చరించగలదు. నాతోడి సభ్యులు దీనిని స్పష్టముగా చెప్పిరి. సంస్కరణము లేవియు పనికిరావని సివిలు సర్వీసువారు బహిరంగముగా తమ వ్యతిరేకతను ప్రకటించియున్నారు. కావున భారత రాజ్యాంగసంస్కరణముల భావిస్థితి నిర్ణయమును సివిలు సర్వీసునకు నొప్పగించుట భావ్యముగనుండదు. సంస్కరణములు పార్లమెంటువారిచ్చిన వరములుగాని సివిలు సర్వీసువారిచ్చినవి కావు. వారికిష్టమైన యెడల పార్లమెంటువారు వానిని రద్దు చేయవచ్చును. ముందు నిర్మితము కాబోవు శాసనసభలు భారతీయులకును పార్లమెంటునకు బాధ్యత వహించి తమ ధర్మములను నిర్వర్తింపవలసియున్నది. కాని యీ యాయుధమును సివిలు సర్వీసువారి చేతులలో పెట్టినయెడల సంస్కరణములను నిష్ఫలములుగ చేసినట్లే యగును. ఇదివఱకు చేసినట్లు వారు ఆంగ్లప్రజల యుద్దేశములను వ్యర్థము చేసినట్లు వారికి ముందు అవకాశము లీయకూడదు. నాతోడి సభ్యులు తయారుచేసిన ప్రణాళికవలన సంస్కరణ యుద్దేశము వ్యర్థము కావచ్చును. మంత్రియు శాసనసభయు తమ కుండిన బాధ్యతలను నిర్వర్తించిన యెడల, నందువలన పాలనవ్యవహారము సులభసాధ్యముగ జరుగదు. అందువలన బాధ్యతాయుతప్రభుత్వమును తీసివేయుటకు కారణ మేర్పడగలదు. పైని చెప్పిన విషయములలో భారతమంత్రి జోక్యము కలిగించుకొనుటవలన లాభ మేమియు నుండదు. సివిలుసర్వీసు ఉద్యోగుల అభిప్రాయమునకు భారతసచివుడు తలయొగ్గుటయే గాని తద్భిన్నముగా ప్రవర్తించుట లేదు. అట్టి భయము నా కున్నయెడల నేను ఏ సంస్కరణమును కోరియుండను.

పార్లమెంటువారు భారతవర్షమునకు వర్తింపవలయు నని సూచించిన బాధ్యతాయుత పరిపాలనా ధర్మమును నే నంగీకరించి యుండను. కావున సంఘమువారు ఆ సూచనలను అంగీకరించినందులకు సంతోషించుచున్నాను.

ఆర్థికసూచనలు

నాతోడి సభ్యులు ఆర్థికవిషయమై సూచించిన విషయములు స్వాయత్తప్రజాయత్తశాఖావిభజనసంఘమువారి సిఫార్సులకు వ్యతిరేకములుగ నున్నవి. రాష్ట్రాదాయమును ఇండియా గవర్నమెంటునకు రాష్ట్రప్రభుత్వమునకు పంచిపెట్టు విషయములోను స్వాయత్త ప్రజాయత్తశాఖల ఖర్చులవిషయమై సొమ్ము చాలనపుడును ఒక శాఖవారు చేసినపని రెండవశాఖవారికి నష్టదాయకముగ నుండినపుడును, గవర్నరుగారి నిర్ణయమే ముఖ్యముగ నుండవలయు నని సంఘమువారు నిర్ణయించిరి. స్వాయత్తశాఖలకు కావలసిన డబ్బుపోగా మిగిలిన డబ్బు అయినప్పటికిని ప్రజాయత్తశాఖా మంత్రి నిర్వహింపవలసిన కార్యములకు అతడే బాధ్యుడుగ నుండవలయు నని నిశ్చయించిరి. పన్నుల విషయమై నాతోడి సభ్యులు చేసిన సిఫార్సులు సంఘమువారి నిర్ణయములకు వ్యతిరిక్తముగ నున్నవి. మేము ఈ ప్రకటనమును వ్రాయునప్పటికి అవి మా యెదుట లేవు.

రాష్ట్రమునకు కావలసిన పన్నుల విషయమై రాష్ట్రప్రభుత్వమువారు దానిని ప్రజాయత్తశాఖగనే పరిగణింపవలయు నని సంఘమువారు నిర్ణయించిరి. మొట్టమొదట భారతప్రభుత్వమునకు రావలసిన సొమ్మును నిర్ణయింపవలయును. తరువాత రాష్ట్రప్రభుత్వమునకు కావలసిన సొమ్మును నిలువచేయుంచవలయును. అధికారాయత్తశాఖలకు కావలసిన సొమ్మును నిలువచేయుంచవలయును. మొదటి రెండు విషయములలోను ఖర్చుసొమ్ము నిర్ణీతముగానే యుండును. గత సంవత్సరము ఖర్చుపెట్టినసొమ్మును తీసికొనినప్పుడును లేక కొన్ని సంవత్సరములలో ఖర్చుపడిన దామాషా మొత్తమును తీసికొనినపుడును, అధికారాయత్తశాఖల ఖర్చు నిర్ణీతముగనే యుండును. ఈఖర్చులన్నియుపోను మిగతసొమ్ము మంత్రుల ఆధీనములో నుండు నని సంఘమువారు నిర్ణయించిరి. పన్నులు వేసికొను పద్ధతికూడ ప్రజాయత్తశాఖాపద్ధతి వలెనే యుండవలయు నని వారి యుద్దేశ్యము. అభిప్రాయభేదము కలిగినపుడు గవర్నరు దానిని పరిష్కరింపవలయును. ఇండియా గవర్నమెంటువారు పంపిన ప్రకటనమునకు ఇది భిన్నముగ నుండి దానికంటె అనుకూలముగ నున్నది.

6. రాష్ట్రీయాదాయవిభజనవిషయమై రాష్ట్రప్రభుత్వమునందలి ద్విశాఖధర్మముల విషయమై సంఘమువారు చేసిన సూచనలకును, మార్చి ౯-వ తేదిని ఇండియా ప్రభుత్వమువారు ప్రకటించిన ప్రకటనమునందలి తీర్మానములకును చాలభేదములు కలుగు నని నాతోడి సభ్యులు అభిప్రాయపడుచున్నారు. అయినను వారి అభిప్రాయము ననుసరించుట మంచిది కాదని నా అభిప్రాయము. అప్పటి మా ప్రకటనమునందలి విషయములను సంఘమువారి నివేదికమునం దుదాహరింపబడబోవు సూచనల ప్రకారము మార్పు చేసికొనవచ్చు నని అభిప్రాయ మిచ్చియుంటిమి. నాతోడి సభ్యులు మా ప్రకటన సంఘమువారి నివేదికము కన్నను వెనుకనే వ్రాసితి మని చెప్పుచున్నను, సంఘమువారి నివేదికము మార్చి ౯-వ తేదీ నాటికి కార్యనిర్వాహకసభ్యులయొద్దకు ఆలోచనార్థమై వచ్చియుండ లేదు. కావున సంఘమువారి సూచనల ప్రకారము మా అభిప్రాయములను మార్చుకొనుట లేక వారి సూచనలను అవసరమైన నిరాకరించుట భావ్యము. కావుననే మా నివేదికమునందలి 42-వ పేరాలో రాష్ట్రీయ ప్రభుత్వమునందలి అధికారాయత్త ప్రజాయత్త శాఖా ధర్మములను సంఘమువారి నివేదికము నందలి సూచనల ననుసరించి ఆలోచించి నిర్ణయించెద మని తెలిపియుంటిమి.

సంఘమువారు నివేదికమునందు 60 మొదలు 63 పేరాలలోను, 76,77 పేరాలలోను శాఖావిభజనసంఘమువారు ఆర్థికవిషయములపట్ల సూచించిన విషయములకు, నాతోడి సభ్యుల సూచనలు వ్యతిరేకముగ నున్నవని చెప్పియే యున్నాను.

సంఘమువారు విషయనిర్ణయములను గురించిన సూచనలను మొత్తమువిూద నంగీకరించిన నాతోడి సభ్యుల ప్రణాళికను కార్యరూపమున బెట్టిన యెడల జయప్రదముగ పనిచేయుట కష్టము. కావున నీ విషయముపట్ల ప్రణాళికావిధానమును సంగ్రహముగ వివరించుట ఆత్యవసరము.

7. అధికారాయత్త ప్రజాయత్తశాఖల వ్యయములకు గాను ప్రత్యేకముగా కొంత ఆదాయమును నిర్ణయించుట అవసరము. ఈ ఆదాయమునకు ప్రతిరాష్ట్రము నందును ప్రత్యేక కార్యములకు గాను కొంత సొమ్మును నిలువచేయుంచి, మిగిలిన పైకమును చేర్చవలయును. తరువాత నధికారాయత్త ప్రజాయత్తశాఖల ఖర్చులకు కావలసిన పైకమునకు మదింపు వేసికొని, ఈ శాఖల ఖర్చులకు గాను నిలువచేయబడిన ద్రవ్యము సదరు మదింపునకు తక్కువ యైనయెడల, ఇతర శాఖల రివిన్యూనుండి కావలసిన ధనమును-పుచ్చుకొనవచ్చును. కావున ప్రణాళిక జయప్రదమగుటకు ద్రవ్యము అవసరము. కావున శాఖావిభజనములు ముఖ్యతరములైనవి. సంఘమువారి నివేదికము ప్రకారము ప్రణాళికను తయారుచేయు సందర్భమున ప్రణాళికపట్ల గల అభ్యంతరము లేవియో వివరించుట మంచిది.

రాజ్యాంగసంస్కరణనివేదికము నందు రాష్ట్రప్రభుత్వములయందలి ద్విశాఖలకు సంబంధించు ఆర్థికవిషయముల పట్ల సూచింపబడిన సూచనల నెవరును విమర్శించి యుండలేదని చెప్పుట నిజము కాదు. రాజ్యాంగసంస్కరణ ప్రణాళికను ఆమోదించువారు సయితము ఆ సూచనలను తీవ్రముగ విమర్శించియున్నారు.

ఈ యోచనవలన మంత్రులకును శాసనసభకును ఎక్కువ కష్టము కలుగునని మాత్రము విమర్శింపబడుటయే కాదు. సర్ దిన్షావాచాగారు మతీ కాంగ్రెసునందలి మితవాదులలో ఎనమండ్రుగురు సంతకములు చేసిన బొంబయి ప్రకటనమునందు తప్ప, ఈ సూచనల వలన ప్రజాయత్తశాఖలను పాలించు మంత్రులకు కష్టములు కలు

గుటయే గాక, గవర్నరుగారికి ఎక్కువ అధికారము లిచ్చుటవలన శాసనసభవారు సయితమేమియు జేయజాలరని విమర్శింపబడియున్నది. ప్రజాయత్తశాఖామంత్రులు తమశాఖల పరిపాలనమునకుగాను కావలసినంత ద్రవ్యము లేకపోయిన క్రొత్తగా పన్నులను విధించుకొనవచ్చునని సూచనయందుదాహరింపబడియున్నది. మంత్రుల నిట్టి పరిస్థితులలో బెట్టినయెడల శాసనసభలలో వారికి తగిన సానుభూతి దొరకుట కష్టమని విమర్శకులవాదము? ఈ విమర్శనల కన్న నిక నేమి కావలయును? నాతోడి సభ్యులసూచన లేవియో కనుగొందము.

## భారత ప్రభుత్వ సూచనలు

9. లెక్కలను పరీక్షచేయుటకు ప్రవేశపెట్టబోవు శాసనము పట్లను, ఆర్థికవిషయ నిర్ధారణమునకుగాను నెలకొల్పబడబోవు విచారణ సంఘవిషయమునను నేమియు అభ్యంతరము లుండజాలవు. రాష్ట్రీయాదాయములలో నిలువయున్న సొమ్మును వ్యయము చేసికొనుటకుగాను భారతప్రభుత్వమువారికి గల అధికారములను తగ్గించి, రాష్ట్రీయప్రభుత్వములే సదరు సొమ్మును వ్యయము చేసికొనుటకు సుభతరము లగు నిబంధనలను చేయవచ్చును. ప్రభుత్వమువారి ద్విశాఖల సమ్మేళమునకుగాను నొక సాధారణార్థికశాఖ యుండుట లాభదాయకము. ఈ ఆర్థికశాఖ వ్యయ విషయము గల సూచనలను జాగ్రత్తగా పరిశీలింపవచ్చును గాని, శాఖావిభజన సంఘము వారు సూచించిన ప్రకారము ఆర్థికవిషయముపట్ల నొకశాఖకు గల యాశయములను విమర్శింపకూడదు. కేంద్రప్రభుత్వము ఇతర ఖర్చులకుగాను రాష్ట్రములమీద్న పనులను విధించుటకు అధికారము గలిగియుండవలయు నని సూచించిన సూచన కార్యరూపమున బెట్టిన యెడల రాష్ట్రప్రభుత్వమునందలి ద్విభాగములకును, శాసనసభలకును చాల కష్టదాయకమై యుండగలదు. ఒక మంత్రి ఆదాయ వ్యయ విషయములలో తన అభిప్రాయమునకు వ్యతిరేకముగా శాసనసభలలో చేయబడు తీర్మానములవలన నాయన తన పదవికి రాజీనామా నిచ్చి తీరవలయు నని సూచింపబడిన సూచన చాల యుపద్రవకరమైనదిగా నున్నది. దీనినే అనేకులు విమర్శించియున్నారు.

శాసనసభ ప్రభుత్వాయత్తశాఖలలో ఆర్థిక, శాసన, పరిపాలన విషయములందు సలహో నిచ్చు సంఘముగా నుండి ప్రజాయత్త శాఖలందు కూడ సంస్కరణ నివేదిక విధానము సూచించినటుల దాని ఆర్థికాధికారమును తగ్గింపవలయు నని తెలుపబడినది. సంస్కరణవిధానము నింతదూరము నీ విధముగ మార్చవలసిన యవసరము లేదు. శాసనసభ ఆర్థికాధికారము విషయమై చేసిన ఆక్షేపణలు సహేతుకము లని యంగీకరించినను, సంఘర్షణము లేకుండ కార్యనిర్వహణము అసాధ్యమని యొప్పుకొనినను, అందులో చేయవలసిన తక్కువ మార్పులలో నిమిత్తము లేకుండ రాష్ట్రపాలన సౌకర్యమునకును, శాసనసభల నియంత్రణమునకు నవసరమైన యేక ఆర్థికశాఖకు లక్షణమైన రెండు ముఖ్యవిషయములను ఉంచుట సాధ్యము కాగలదు. ప్రభుత్వశాఖలకు సమానముగ నొక ఆర్థిక శాఖను, శాసనసభ్యులలో గూడిన నొక ఆర్థిక కమిటీని నియమించి, శాఖల వ్యయ నిర్ణయమును ప్రభుత్వ మంతయు యోచించి చిక్కులు లేకుండ పరిష్కరించుట కధికార మిచ్చినయెడల పూర్వోక్తమైన లక్షణములను ఉంచుటకు కష్ట ముండదు. రాష్ట్రములందలి ద్విశాఖావిధానమువలన కలుగు లోపములను చాలవఱకు నివారింపజేసి, ప్రజలకును తమకు లాభదాయకముగ సానుభూతితో కార్యనిర్వాహక వర్గ సభ్యులును మంత్రులును ఒకరినియమముల నొకరు పరిశీలించుట కవకాశము కలుగునట్లు చేయదలచిన సంస్కరణవిధానము నందలి ఆర్థికపత్రనిర్ణయమున కిది యోగ్యముగ నుండును. రాష్ట్రాధికారి యగు గవర్నరు తనధర్మమును నిర్వర్తించుటకు వీలు కలుగును. రెండు శాఖలకును మైత్రికలిగించుటకు వీ లుండును. ప్రజాయత్తశాఖకు బాధ్యుడైన మంత్రికి అధికారాయత్తశాఖకు కావలసిన ఖర్చును నిర్ణయించుటలో ప్రమేయము కలదను భావమువలన శాసనసభలందు ఖర్చుకు కావలసినసొమ్మును నిర్ణయించు టవసరమనియు, ఒకరిఖర్చు నొకరు తగ్గించుటకు వీలుండదనియు నమ్మకము కలుగును. గవర్నరునకును కార్యనిర్వాహకసభకును; మంత్రికిని, శాసనసభకును సంఘర్షణము కలుగుటకు కారణమైన సర్టిఫికెట్టులో నంగీకార మియ్యవలసిన యవసరము గవర్నరునకు లేకపోయి పాలన ముత్తమముగ జరుగును. ఆ సంవత్సరములో జరుగవలసిన ప్రత్యేక కార్యవిధానము ననుసరించి ఆయవ్యయమును నిర్ణీతము చేసికొనవచ్చును. ఆయవ్యయ యేర్పాటులను సులువుగ చేయుటకు వీలు కలుగును. ఇట్టి సందర్భములలో క్రొత్తపన్నును నిర్మించవలసియున్నపుడు నాతోడి సభ్యులు చేసిన సూచన లందుకంటె త్వరలో శాసనసభ దాని నంగీకరించి ప్రభుత్వమునకు ఎక్కువగ తోడ్పడుటకు వీ లుండును. సంస్కరణవిధానమునకు చేయూత నొసగుచున్న వారి కండ్లయెదుట సయితము సంస్కరణములందు ఏదో కొంత ప్రయోజన ముండి తీరవలసియుండినచో శాసనసభలకు తప్పక నియంత్రణాధికారము ఉండి తీరవలయును. రెండుశాఖలకును సమానముగ నాయవ్యయముల నిర్ణయించు ఏర్పాటు ప్రస్తుతము ఉండవలయును. నిరంకుశాధికార ప్రజాప్రభుత్వవిధానము నందలి లోపములను మాత్రమే సృజించి ప్రజాప్రభుత్వపు లాభములను వదలివేసిరి. నాతోడి సభ్యులు సూచించిన విధానమువలన మంత్రులస్థితి దుర్భరమై శాసనసభల స్థితి ప్రస్తుతముకంటె నేమాత్రము బాగుపడ నేరదు.

## సంస్కరణ సవరణలు

10. నా సహోద్యోగులు సూచించినవిధానమును సవరించి తన్మూలమున నొక ఆర్థికపత్రమును శాసనసభపై నధికారము నుండునట్లు చేయవచ్చునా? అను విషయమును యోచించి వారు ఏకార్థిక పత్రము విషయమున తెలిపిన ఆక్షేపణలను విమర్శింతము. నికరము నిలవను, సాధారణపునిలవను విభజించి సూచనను అంగీకరింపవచ్చును. రాష్ట్రములనుండి కేంద్రధనాగారమునకు కొంతసొమ్మును పంపించు

నట్లు ఏర్పాట్లనుకూడ చేయవచ్చును. కాటకపునిధికి రాష్ట్రములలో కొంతసొమ్మును ప్రత్యేకించవచ్చును. శాఖావిభజనసంఘము వారు చెప్పినట్టులు ప్రభుత్వవిషయికోద్యోగములకు కొంతధనమును ఏర్పరచవచ్చును. సంఘమువారే ఈధనము నెట్లు నిర్ణయింపవలెనో మనకు తెలుపకున్నారు. మనము గతవత్సరపు మొత్తమునుగాని, లేక గడచిన మూడువత్సరముల సగటు మొత్తమునుగాని, తీసికొనవచ్చును. అప్పుడు ప్రభుత్వాదాయమును రెండు సమభాగములుగా భాగించి వానిని ప్రభుత్వాయత్త ప్రజాయత్తశాఖలకు ఇచ్చుటకంటె ఆయాశాఖలకు తగినట్లుగ ధనవిభజనమును చేయుట యుచితము. ఈధనవిభజనము ప్రజాయత్తము గావింపఁబడిన విషయ స్వభావమునుబట్టి నిర్ణయింపవలెను. ప్రభుత్వాయత్తశాఖకు ఈయబడుభాగము, తచ్ఛాఖోద్యోగుల వ్యయమునకు సరిపోవునట్లుండవలయును. 1918 సంవత్సరము ఆగస్టు 18-వ తేదిని జరిగిన సంయుక్తరాష్ట్ర శాసనసభలో ననధికార సభ్యులు ఇందులకు ప్రభుత్వాయత్త శాఖాదాయములో 1/10-వ భాగమును నిర్ణయింపవలెనని సూచించిరి. ఇంతకంటె నెక్కుడు మొత్తమును శాసనసభవారు అవసరమగునెడల కాంక్షను చేయుచుండవచ్చును.

## సంయుక్తసంఘము

11. ప్రభుత్వాయత్త ప్రజాయత్త శాఖావిషయములనుగూర్చి తెలుపుటకు అధికారానధికార ప్రతినిధులుగా నొక సంయుక్తసంఘము నేర్పరుపవలసినదని సంస్కరణనివేదికయం దొకసూచన కలదు. ఈశాఖలు ఈమధ్య శాసనసభానుమతిని లభించిన ఏకీభావము మూలమున మార్పునొందుచుండవచ్చునని యూహింపబడినది. కాని గవర్నరు తీర్మానమే ఇట్టి విషయములలో భారతీయుల సమ్మతిని పడయునను కారణముచేత నీ నివేదికకర్తలు ఈసూచనను తిరస్కరించిరి. సాధారణముగా నిష్పక్షపాతబుద్ధిగల ఇట్టి సంఘపుతీర్మానము మిక్కిలి సంతృప్తికరముగ నుండుననుటకు సందేహము లేదు. శాసనసభాతీర్మానములు, మంత్రివశమున నున్న ధనమునకు అతని బాధ్యునిగా చేయవలయు ననియు, ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గపు ధనభాగమునకు సంబంధించినంతవఱకు వారిని బాధ్యులుగా చేయవలయు ననియు నవసరమగునెడల ప్రభుత్వాయత్త శాఖాపాలనమునకు వలయు నెట్టి నియమములైనను, ఆచరణలోనికి దెచ్చుటకు గవర్నరున కధికార ముండవలయు ననియు సంస్కరణనివేదికయందు చేయఁబడి శాఖావిభజన సంఘమువారిచే నామోదింపఁబడిన సూచన యుండవలసినదే. ప్రభుత్వాయత్తశాఖపైఁ గల ఇట్టి యధికారమును ఆశాఖ కొసంగబడు ధనమునకు తగియున్నయెడల నందుమూలమున నెట్టి హానియును సంభవింపదు.

12. ఇక శాఖావిభజనసంఘమువారు గావించిన సూచనలకు సంబంధించిన వివిధవిధానములను యాలోచింతము. ఆవిధానము నా సహోద్యోగులు విషయవిభజనమునుబట్టి ధనవిభజనమును చేయవలయునను సూచనకంటె నెక్కుడు సందర్భముగా నున్నది. పరిపాలన యంత్రము సులభముగా నడచుననియు, కార్యనిర్వాహకసభ్యులకును మంత్రులకును అనవసరవిభేదము లుండరాదనియు నాకు తోఁచుచున్నది. సంస్కరణనివేదిక అంగీకరించిన యధికారము శాసనసభకుండనే యుండును. నా సహోద్యోగులు తెలిపిన విధానములో నున్నట్టుల పన్నుల విధించుసూచనలు గ్రాండుకమిటీకి తెలియజేయ నక్కరలేదు. శాసనసభాధికారమునుండి పన్నుల విధించు నధికారమును తొలగించుట మిగుల నాక్షేపణీయమని నా యభిప్రాయము. శాఖానిర్ణయవిషయమునఁ గూడ నా సహోద్యోగులు సూచించిన విధానము ఎక్కుడు సందర్భముగా నుండునని తెలియగలదు.

13. రాష్ట్రములలోని ప్రభుత్వాయత్త ప్రజాయత్తశాఖా విభజనపట్టిక క్రింద తెలుపఁబడినది. అవసరవిషయములు వదలివేయబడినవి.

## రాష్ట్రీయ విషయములు

1. ఇరిగేషను కాలువలు డ్రెయినేజి కాలువగట్టు జలాశయములు. 2. క్రింద తెలుపఁబడిన భూమిశిస్తుపాలనము (అ) భూమిశిస్తునిర్ణయము వసూలు. (ఆ) ల్యాండురికార్డులు సర్వే; హక్కులు రికార్డులు. (క) లాండెన్యూరులకు సంబంధించిన శాసనములు, భూస్వాములకు రైతులకు గల సంబంధములు శిస్తువసూలు. (ఖ) కోర్టఫ్ వార్డ్సు (గ) భూమినివృద్ధి జేయుట వ్యవసాయపు బదుళ్లు. (ఘ) వలసపోవుట, ప్రభుత్వపు భూములను పరిష్కరించుట, భూమ్యాదాయములను తరగతివారీగా విడదీయుట. 3. కాటకపు సహాయము 4. భూములనుగడించుట. 5. న్యాయపరిపాలనము. 6. అడ్మినిస్ట్రేటివ్ జనరల్, అఫిషియల్ ట్రస్టీ. 7. కోర్టుస్టాంపులు. 8. గనులను వృద్ధిచేయుట. 9. క్రింద తెలుపఁబడు పారిశ్రామికవిషయములు. (అ) ఫ్యాక్టరీలు, (ఆ) కూలీల తగాదాలను తీర్చుట, (ఇ) విద్యుచ్ఛక్తి (ఈ) బాయిలర్లు, (ఉ) గ్యాస్, (ఊ) పొగవలన కలిగిన అనారోగ్యములు, (క) ప్రావిడెంటు ఫండ్లు మున్నగు విషయములలో కూలీలక్షేమము నరయుట. 10. రయిల్వేకు సంబంధించని పోలీసు 11. ఇతరవిషయములు. (అ) జూదము పందెములు, (ఆ) జంతుహింసా నివారణ (ఇ) ఘాతుకమృగములు అడవిపక్షులు, (ఈ) విషము (ఉ) మోటారుబండ్లపై యధికారము, (ఊ) నాటకప్రదర్శనములు, సినీమాలు మున్నగువానిపై నధికారము 12. వార్తాపత్రికా ముద్రణయంత్రములపై నధికారము. 13. కారోనర్లు. 14. నేరములజాతులవార్లు 15. దేశద్రిమ్మరులగు విరోపియన్లు 16. ఖైదీలు, శిక్షాలయములు. 17. బందెలదొడ్లు. 18. నిక్షేపములు. 19. ప్రభుత్వముద్రణయంత్రాలయములు 20. భారతీయరాష్ట్రీయ శాసనసభ ఎన్నికలు నియోజకస్వాతంత్ర్యములు. 21. వైద్యమున్నగు వృత్తులకు వలయు నియమనిర్ణయము. 22. భారతదేశీయసేవా సభ్యులును, రాష్ట్రములలోని ఇతరసేవాసభ్యులును. 23. క్రొత్త రాష్ట్రీయపుపన్నులు. 24. రాష్ట్రపు పరపతిమీద నప్పుగైకొనుట. 25. రాష్ట్రీయ విషయములకు సంబంధించిన రాష్ట్రశాసనమును అమలులో పెట్టుటకు

వలయు జరిమానా నిర్బంధావాసము మున్నగు శిక్షలు 26. భారతీయ ప్రభుత్వవిషయములకు చెందినను రాజప్రతినిధి అనుమతిని రాష్ట్రీయ ప్రభుత్వమువశము గావింపఁబడినవిషయము 27. రాష్ట్రీయ న్యాయస్థాననివేదికము.

## ప్రజాయత్త విషయములు

1. స్థానికస్వపరిపాలనములు, అనఁగా మునిసిపలు సంఘముల సభ్యులు అధికారములు మున్నగు విషయములును ట్రస్టులు జిల్లాబోర్డులు, ఆరోగ్యసంఘములు, ఇంకను స్థానికస్వపరిపాలనముతో సంబంధముగల ఇతరవిషయములు. 2. వైద్యశాఖాపాలనము: దీనియందు వైద్యశాలలు వైద్యవిద్యమున్నగునవి చేర్పఁబడినవి. 3 ప్రజారోగ్యము, పారిశుద్ధ్యము, జననమరణములసంఖ్య. 4. విద్య. 5. ఈక్రింద తెలుపఁబడు పబ్లికువర్క్సులు (అ) రాష్ట్రములోని భవనములు. (ఆ) రోడ్లు వంతెనలు పడవలు, ఇంకను సైనికులకు ఆవశ్యకములని రాజప్రతినిధిచే ప్రకటింపఁబడని యితరవిషయములు. (ఇ) మునిసిపలు ఆవరణలోనున్న ట్రామ్వేలు (ఈ) చిన్న రైలుమార్గములు మునిసిపలు ఆవరణములో లేని ఇతర ట్రాముమార్గములు. 6. వ్యవసాయము. దీనియందు పరిశోధనప్రతిష్ఠాపనములు. వ్యవసాయ విద్యకు వలయు నేర్పాటులు వృక్షముల తెగుళ్లను నివారింపజేయు మార్గములు. 7. పశువైద్యశాఖ:— దీనియందు పశువైద్యోద్యోగమునకు వలయు శిక్షణమున కేర్పాటులు. పశురోగములను నివారించుట కేర్పాటులు. 8 పరపతి సంఘములు. 9. ఎక్సైజు. 10. రిజిస్ట్రేషను. 11. జననములు మరణములు, వివాహములు మున్నగువాని రిజిస్ట్రేషను. 12. ధర్మాగారములు. 13 పారిశ్రామికాభివృద్ధి. దీనియందు పారిశ్రామిక పరిశోధనమును సాంకేతికవిద్యయు నిమిడియున్నవి. 14. ఆహారపదార్థములలోని కల్తి 15 తూనికలు, పడికట్లు 16 (ఇండియన్ మ్యూజియము కలకత్తాలోని విక్టోరియా మెమోరియలు తప్ప) ఇతర చిత్రవస్తు ప్రదర్శనశాలలు, జంతుప్రదర్శనశాలలు. 17. చేపలు. 18. బొంబయిలోని ఆవులు. 19 రేవుపట్టణములు. 20. దేశములోని నీటిమార్గములు.

## ఒక ప్రధానాక్షేపణ

14. శాఖావిభజనమును బట్టి ధనవిభజనమును చేయవలయునని భారతప్రభుత్వమువారు చేయు సూచన కొక ప్రధానాక్షేపణగలదు. శాఖావిభజనము కొన్ని కారణములవలన చేయబడుచున్నది. కారణములకును ఈశాఖలనుండి వచ్చు నాదాయమునకును ఎట్టిసంబంధమును లేదు. శాఖావిభజనసంఘమువారు కొన్ని నియమముల ననుసరించి యీశాఖావిభజనమును గావింపవలసినదని సంస్కరణనివేదిక తెలిపియుండెను. వీనికిని ప్రజాయత్తప్రభుత్వాయత్తశాఖలకును సమానముగ విభజింపవలసినధనమునకును ఎట్టిసంబంధమును లేదు. ఈశాఖాసంఘమువారి నివేదికను పరికించినను ఇట్టిసంబంధముండవలయునని వారికి అభిప్రాయమున్నట్టు తోఁచదు. కావున ధనవిభజనమును శాఖావిభజనమును బట్టియే చేయవలయు నని నాసహోద్యోగులు తెలిపిన సూచన సందర్భముగా లేదు. ఈశాఖావిభజన సంఘమువారు ఆయాశాఖలకు సంబంధించిన విషయములనుండి ఆదాయమును కైకొనుటకు వలయుపన్నులను విధించుటకు తప్పక అధికారముండుట యవసరములేదను నుద్దేశముతోడనే పన్నుల విధించు విషయమును ప్రజాయత్తముఁ గావించిరి. ఆసంఘమువారు శాఖావిభజనమును గూర్చి గావించిన సూచనలను మనము అంగీకరించినయెడల ప్రజాయత్తవిషయములు వానినుండి లభించుధనముతోడనే పాలితములు కాజాలవు. అనికూడ వారు గుర్తించినట్లు మనము అంగీకరింపవలసియున్నది. కావున నివేదికయందలి 75వ పేరాలో తెలుపబడిన విషయములతోఁ గూడ పన్నులను విధించు నధికారము ఆశాఖామంత్రుల యధీనములో నుండవలయును గాని ప్రభుత్వాయత్త విషయముగా నుండరాదని గ్రహింపవలసియున్నది.

15. ఈ పట్టికను బట్టి చూచినయెడల ధనాగమన విషయములలో ప్రధానములు ప్రభుత్వాయత్తవిషయముల క్రిందకు వచ్చినవి. కార్యనిర్వాహక సంఘమువారు ఇందువలన మామూలుగ లభించు ఆదాయము మాత్రమేగాక, శాసనసభకు తెలియజేయకయే తమ భూమ్యాదాయమును వృద్ధిజేసికొనుటకును అధికారముకలిగియుండును. దేశాభివృద్ధికి అత్యవసరములై ప్రజాయత్తవిషయములలో అధికారముగల కార్యనిర్వాహక సంఘమువారు, తమ శాఖావ్యయమునకు వలయు ద్రవ్యములో కొంతసాయము చేయవలసినదని ప్రజాయత్త విషయములలో అధికారముగల మంత్రిని కోరుటకు అవసరము లేదని నిశ్చయముగ చెప్పవచ్చును. క్రమక్రమముగ నభివృద్ధినొందు తన శాఖలకు వలయు ధనము మంత్రియొద్ద మంత్రికెపుడు లభింపదు. ఈ శాఖలనుండి వచ్చు ఆదాయమును వృద్ధిచేయుటకు కూడ నవకాశము లేదు. భారతీయుల హస్తగతమైన ఎక్సైజుశాఖ ఎన్నడును ధనాదాయమును వృద్ధినొందింపగూడదు; కాని ఇతఁడు ప్రభుత్వాయత్తశాఖనుండి ఏమైన ధనసహాయమును పొందగలడా? కార్యనిర్వాహక సంఘమువారికి లభించు ధనాదాయము వారి వ్యయపరిణామమును నిర్ణయించుట నిశ్చయము. ప్రభుత్వోద్యోగములు వారి వశమునం దున్నవి. ఈ యుద్యోగుల కోరికలకు ఎచ్చటను అంతులేనట్లును, ఇంకను ఆంగ్లేయోద్యోగులకు నూతనపదవులను నిర్మింపవలయు ననెడి వీరి కోరికలయెడల చూపఁబడు సానుభూతి విస్తారముగా నున్నట్లును వీరి జీతములను ఉపకారవేతనములను వృద్ధిచేయవలయు ననెడి కోరికలయెడల చూపఁబడు సానుక్రోశ మెక్కుడుగా నున్నట్లును మనము అనుభవపూర్వకముగ గుర్తించుచునేయున్నాము. ప్రజాయత్తశాఖాధికారము గల మంత్రికి ఇతరాధికారము లేనియెడల నతఁడు కార్యనిర్వాహక సంఘమువారికి లోఁబడియుండుట తటస్థించును. ఈ దృక్పథముతోడనే మన మీ విషయమును విమర్శింపవలయును.

## కొన్ని ప్రత్యుత్తరములు

16. రాష్ట్రములో నిలువయుండు మొత్తముల నుండియు పన్నుల నుండియు అప్పుపుచ్చుకొను నధికారమువలన నెక్కుడుగా

ధనము వ్యయపరుపబడు నని మొదటియాక్షేపణ చేయబడినది. నా విధానము ప్రకారము, ఈ రెండు శాఖలలోను, ప్రత్యేకింపఁబడు ధనమును ఏర్పరచుటవలన ఈ చిక్కు తొలగిపోవును. అధికారమును మీఱి పన్నులను విధించుట గాని అప్పును తీసికొనుట గాని జరుగకూడదు. భారతప్రభుత్వసూచనము బట్టి అపారధనముగల ప్రభుత్వాయత్తశాఖలనుండి ధనమును గైకొనుటకు బాధ్యతగల ఎట్టి గవర్నరును అంగీకరింపఁజాలఁడు. కావున గవర్నరు గాని ఇతరులగు నధికారులు గాని ఒకశాఖనుండి రెండవశాఖకు ధనసహాయమును చేయరాదని విధించుటచేత, సంఘర్షణ మేర్పడి పాలనము స్తంభించును. కొన్నివిషయములలో నిర్ణయాధికారము గవర్నరున కొసంగఁబడుటచేత సంస్కరణనివేదికావిధానమున గాని శాఖావిభజనసంఘనివేదికావిధానమునఁ గాని నావిధానమున గాని ఆదాయవిషయమున నీరెంటికిని వ్యత్యాసమును రూపుమాపు నియమములు గానరావు. ఇట్టి యధికారము గవర్నరున కొసంగఁబడినయెడల మనము సంస్కరణనివేదికావిధానము తెలుపునటులే వర్తింపుచుంటి మనవచ్చును. రాష్ట్రమున నిలువయుండు ధనవిషయములో ఈ విభజనము చేయుటకు ఎవ్వరికి అధికారము గలదు? అను విషయమును నాసహోద్యోగులును నిర్ణయింపలేదు. బహుశః అట్టి అధికారి గవర్నరై యుండవచ్చును. దీనిని బట్టి మనము ముందటికంటె మంచిస్థితిలో నున్నామని చెప్పుటకు వీలులేదు. నీ రెండుశాఖలును సామ్రాజ్యప్రభుత్వనియమములను బట్టి వర్తింప నవసరము లేకపోవుటచేత తమ వశమునం దున్న ధనమును వారు వ్యయపరచెదరు. లేక అందులకై ప్రత్యేకించెదరు. కావున రాష్ట్రములయందు భావికాలవ్యయమునకు ధనము నిలువయుండు నని చెప్పుటకు వీలులేదు. వారి నిలువను అప్పుచెల్లించుటకు గూడ వినియోగించవచ్చును.

17. ప్రభుత్వమందలి యొకశాఖవారు, రెండవశాఖవారికి, ధనసహాయమును చేయఁ దిరస్కరించుటకు అధికార ముండరాదని రెండవయాక్షేపణ చేయఁబడెను. వివాదవిషయములలో నిర్ణయాధికారము గవర్నరునకే కలదనియు, నీ యాక్షేపణ సంస్కరణనివేదికావిధానమున జనింపదనియు నా సహోద్యోగులు మఱచిరని నాభిన్నాభిప్రాయ ప్రకటనమునందు తెలిపియుంటిని. ప్రస్తుతము గవర్నరునకు గల యధికారముల మాట నటుండనిచ్చి నా సహోద్యోగులు సూచించిన నూతనవిధానమువలన ఈ శాఖావిభజన మున్నంతకాలము మంత్రియు నతని శాఖయు దీనత్వములో ప్రార్థించినఁ దప్ప ఇతర విషయములలో జోక్యము కలుగఁజేసికొనుట కధికారము లేనట్లు స్పష్టమగుచున్నది. ధనాదాయమునందు సగముకంటె నెక్కుడు భాగము కలిగియుండిన కార్యనిర్వాహకసంఘమువారి పనులలో ఇతరులెవ్వరును సంబంధమును కలుగఁజేసికొనఁజాలరు. కావున వీరి విధానము ఇతర రెండు విధానములవలె ప్రధానకష్టమును తొలగింపఁజాలదు. పన్నులను విధించు నధికారము కార్యనిర్వాహకసంఘమువారికేగాని ఇతరుల కుండరాదని నా సహోద్యోగుల యభిప్రాయము. కాని, క్రమక్రమముగా వృద్ధియగుచున్న భూమ్యాదాయమును ఏవిధముగనైన తమ లాభమున కుపయోగించు నధికారము వీరి కుండరాదని నామతము. ప్రజాయత్తశాఖలలో ప్రధానములగు విషయములకు వలయు ధనమునకు భూమియే మూలాదాయము కావలసియున్నది.

18. ప్రతిసంవత్సరమును ధనవిభజనమును గావించుటకై మంత్రులు కార్యనిర్వాహకసంఘమును కోరవలసియుండుటచేత నీ సమయమునందు తప్పక సంఘర్షణము ఏర్పడు నని మూఁడవయాక్షేపణ చేయఁబడినది. ఇది మంత్రికే నష్టదాయకము. ఈ విధానమును బట్టి మంత్రి కార్యనిర్వాహకసంఘమువారికి లోఁబడి యుండవలయును. సంస్కరణనివేదికను బట్టియు, శాఖావిభజనసంఘనివేదికను బట్టియు నిట్టి విషయములను గవర్నరే నిర్ణయింపవలయు నని తెలియుచున్నది. ఇది సందర్భమే. ఇంక మూఁడవ విధానమునుబట్టి ఈ విషయమునందు గవర్నరునకు కూడ నీ యధికార మీయఁబడక ఎవ్వరికి వారే స్వతంత్రులుగా చేయఁబడిరి.

19. ప్రతిశాఖయొక్క అభివృద్ధికిని దాని యాదాయము నెక్కువచేయుటకును ప్రోత్సాహ ముండవలయు ననునది నాల్గవ యాక్షేపణ. దీనిభావమేమి? రాష్ట్రములో ఆదాయమునకు మూలమనఁదగు భూమిని గురించి యోచింతము. కార్యనిర్వాహకసంఘమువారు ఈ విధానమును బట్టి సాధారణముగా భూమివలన లభించు నాదాయమువలన మాత్రమేగాక శాసనసభాసమ్మతి లేకయే దీనిని క్రమక్రమముగా నభివృద్ధిచేయుటకు అవకాశము గలిగియుండును. సాధారణము లగు స్థితిగతులలో కూడ మంత్రితో సరిపోల్చి చూచినయెడల వీరి ధనాదాయము అత్యధికముగనే యుండును. కాని ఇంగ్లీషు ఉద్యోగులు, తమజీతములను వృద్ధిచేయవలయు నని కోరుదురనుటకు సందియములేదు. వీరి కోరికను కార్యనిర్వాహక సంఘమువారు చెల్లించెదరనుటకును సందియము లేదు. కావున నీ వఱకే దారిద్ర్యస్థితియం దున్న రైతుస్థితి ఇంకను దుర్భరము గావింపఁబడును. భారతీయపురోభివృద్ధికి అత్యవసరములగు ప్రజాయత్తశాఖలు వెనుకంజవేయును. ఇట్టి ఫలితములే ఇతర ధనాదాయ విషయమున గూడ తటస్థించును. ఈసూచనలమూలమున మంత్రియును కార్యనిర్వాహకసంఘమువారును తమ శక్తికొలది ధనము లభించుమార్గముల నుపయోగింపవచ్చును. ఇంతకంటె దేశమునకు అనర్థదాయకమగు విషయము వేఱొక్కటిలేదు. ఇట్టి స్థితిగతులలో నాసహోద్యోగులు తెలిపిన విధానము దేశక్షేమమునకు భంగకరము. ధనాదాయము వలన కలుగు లాభములను దేశమంతయు ననుభవించ కుండుట అన్యాయ్యము. సంస్కరణనివేదికావిధానమున గాని మూఁడు విధానమునఁ గాని ఇట్టిలోపము గానరాకున్నది. నాసహోద్యోగులు, ఎంతవఱకు వ్యయమున కవకాశముగలదో ప్రతిశాఖయు చెప్పవలసినదని తెలిపియుండిరి. ఈ యుద్దేశమునకు వారివిధానము భిన్నముగా గాన్పించు చున్నది. మంత్రిచేయు వ్యయము అతనికిగాని అతనిశాఖకుగాని లభించు నాదాయమును బట్టి నిర్ణయించుటకు వీలులేదు. ఇతర శాఖలనుండియు, క్రొత్తపన్నుల నుండియు నెంతవఱకు తాను న్యాయ్యముగా ధనమును

భాండగారునో దానినిబట్టియే విషయమును నిర్ణయింపవలసియుండును. ఈ కారణములన్నియు మూఁడవ విధానమువలన కార్యరూపముఁ దాల్పఁగలవు.

## భూమ్యాదాయము

20. ఇదివఱకు అవలంబింపబడిన రివిన్యూ, పారిశ్రామిక విధానములవలన, భారతదేశమున దారిద్ర్యము సంభవించినదని తెలియుచున్నది. భూమిమీఁద విధించు పన్నులు మున్నగువానిని రాష్ట్రీయ విషయములుగ నీ సంఘమువారు పరిగణించుట సంతృప్తికరము. దీనినిఁ బట్టియే పన్నులను విధించునధికారము ప్రజాయత్తము కావింపఁబడినది. ముందుగ తమ సమ్మతి లేకయే, ఇట్టి విషయములలో పన్నులను విధించు నధికారమును' రాష్ట్రీయప్రభుత్వములు చెల్లించుటకు భారతప్రభుత్వమువారు గూడ నంగీకరించిరి. అయినను భూమిశిస్తు నిర్ణయము ప్రభుత్వమువారికే వదలివేయఁబడుటచేతను దీనిని కార్యనిర్వాహకసంఘపు అధికారమునకు లోబడిన ప్రభుత్వాయత్త విషయముగాఁ బరిగణింపఁబడవలయు నని ఈ సంఘమువారు 79-వ పేరాలో సూచించుచున్నారు. ఈ రెండు విషయములును పరస్పర విరుద్ధములుగా నున్నట్లు తోఁచుచున్నవి. కార్యనిర్వాహకసంఘము వారు గాని, శాసనసభవారు గాని, వారిలో నొకరు విధించిన భూమి పన్నును గ్రహింపకయే రెండవవారు మఱల విధించుటకు వీలులేదు. ఈ రెండు ప్రభుత్వశాఖలును ఈ విషయమున ఒక దానిపై నొకటి యాధారపడవలసియున్నది. సంఘమువారి యభిప్రాయముప్రకారము ఈ విషయమునందు ఇరువురకు నధికార మున్నదనియు నభిప్రాయ భేదములు వచ్చినప్పుడు గవర్నరునకు నిర్ణయాధికారము ఉండవలెననియుఁ దోఁచుచున్నది. కాని కేవలము కార్యనిర్వాహకసంఘము వారి చర్యవలన ధనాదాయమును వృద్ధిచేయరాదని నా యభిప్రాయము. భూమిశిస్తును విధించుటకు శాసనసభకు మాత్రమే యధికార ముండవలయును. పర్మినెంటు సెటిల్మెంటు చేయఁబడిన జమీందారీలలో తప్ప తక్కిన విషయములలో భూమి రాజుయొక్క ఆస్తియనియును కార్యనిర్వాహకప్రభుత్వమువారి యిష్టము చొప్పున విధింపఁబడిన పన్నును భూస్వామి తప్పక యొసంగవలయు ననియు మున్నగు భావములు ప్రస్తుతపు ప్రభుత్వమువారికి గలవు. ప్రపంచమునందలి యన్ని దేశములలో భారతదేశమునందు మాత్రమే శాసనముబట్టిగాని ఆచారమునఁబట్టిగాని పోటీనిబట్టిగాని భూమిశిస్తు నిర్ణయింపఁబడుటలేదు. ఇదియే దేశమునందు వృద్ధియగుచున్న దారిద్ర్యమునకు ప్రధాన కారణము. ఇందుమూలముననే కూలిచేయువారును ధనికులును భూమి సేద్యమునుండి వీగిపోవుట తటస్థించుచున్నది. కావున భూమిశిస్తును శాసనమువలనగాని వాయిదాలనుబట్టిగాని విధింపఁబడునట్టి ప్రజాయత్తవిషయముగా నుండవలయును. లేనియెడల, పది సంవత్సరములకు పూర్వము అధికారవిభజనసంఘమువారు సూచించినట్టుల రాష్ట్రములలో భూమిశిస్తు నిర్ణయమును శాసనరూపమున గావించి మఱల దానిని మార్పు నొందించునెడల ప్రతిజిల్లా విషయమును గూర్చియు నొకబిల్లును రాష్ట్రీయశాసనసభలో ప్రవేశపెట్టుట అవసర మని నేను నొక్కి వక్కాణించుచున్నాను.

## పరిశ్రమలు

21. సంఘమువారు సూచించిన రీతిని పారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన అన్నివిషయములను ప్రజాయత్తములు కావించుట ముఖ్యము. నా సహోద్యోగులు దీని నంగీకరించనందున ప్రస్తుత స్థితిగతులను గురించి యించుక తెలుపవలసియున్నది. భారతదేశము పూర్వము వస్తువులను ఎగుమతి చేయు ప్రదేశములలో మిగుల పేర్వడసి యున్న దనియు నిచ్చటనుండిన ధనమువలన తూర్పిండియా సంఘమువా రిచ్చటకు వచ్చి రనియును మనకు తెలిసియేయున్నది. సిపాయి తిరుగుబాటునకు పూర్వము ఈ దేశమునందు నిరుత్సాహముచేతను ఆంగ్లదేశమున నపరిమితము లగు సుంకములను విధించుటచేతను భారతదేశపు పరిశ్రమలు బుద్ధిపూర్వకముగ వినాశనము నొందింపఁబడినవి. అందుమూలమున వ్యవసాయమునకును పరిశ్రమలకును నిలయమైన భారతదేశము కేవలము వ్యవసాయపుదేశముగ మారిపోయినది. ఆంగ్ల వాణిజ్య క్షేమమునకై భారత వాణిజ్యక్షేమము నేటివఱకును లోఁబరుపఁ బడియుండినది. ఈ దేశపు ప్రకృతిసాధన సంపత్తిని విదేశలాభమునకు ఉపకరించునట్లు చేయుటయు నింగ్లీషువారి ధనము వీనియం దుపయోగింపఁబడుటయు నాంగ్లదేశపు వస్తువులు ఈ దేశమునందు ప్రవేశపెట్టఁబడుటయును తటస్థించుచున్నది. కావున నిదివఱకే జనసామాన్యమున జీవనోపాధిని కలిగింపలేకున్న వ్యవసాయవృత్తిని భారత పరిశ్రమలు కొంతవఱకు భారమును తగ్గించుటకు బదులు వేలకొలది పనిలేనివారు ఇదివఱకు భూమిపై పనిచేయుచున్న కూలీలతో పోటీకివచ్చుట తటస్థించుచున్నది. ప్రభుత్వమువారికిఁ గల యీ భావమే, దేశమునందలి యసంతృప్తికి చాలవఱకు గారణము. ఈ దేశమున వాణిజ్యమునకు అందునను ముఖ్యము నాంగ్ల వాణిజ్యమునకు గల సహజ సంపత్తిని అవకాశములను తెలిసికొనుటకు కమీషనరు నేర్పరచిన విషయము మనకు తెలిసియేయున్నది.

వీరు చేయు సలహాలను బట్టి ఈదేశపు సహజవస్తు సంపత్తిని ఏవిధముగా ఆంగ్లదేశవాణిజ్యమునకు లాభదాయకముగ నుపకరించునో, అనువిషయముఁ గూర్చి ఏర్పాటులు చేయఁబడును. ఈ సమాచారము భారతీయులకుఁ గూడ ఎఱుక చేయబడును గాని దానివలని లాభములను పొందువారు ఆంగ్లేయవాణిజ్య ప్రతిష్ఠాపనలవారు మాత్రమే యనవచ్చును. ఈ దేశము తన క్షేమమునకు భంగము కలుగకుండునట్లుగ నపక్వపదార్థములను ఎగుమతి చేయుట కభ్యంతర ముండదు. కాని పక్వపదార్థములను తయారుచేయుటకును తన దేశీయులనే అందు కూలీలుగా నేమించుటకును, వలయు నవకాశములు ఈ దేశమున లేకుండునట్లు చేయరాదు. భారతదేశపు పరిశ్రమలు ప్రజాయత్తములైననే గాని ఈ యుద్దేశము నెఱవేరజాలదు. లేనియెడల నాహారపదార్థము లనేకములు ఈదేశజులు అన్నములేక మాడుచుండగా

పరిశ్రమలను సంరక్షించుచుండినను భావము సరియైనదే యని నేను అనుభవపూర్వకముగ చెప్పగలను. పారిశ్రామికసంఘమువారు భారతీయులకు సహాకారకములగు కొన్ని సూచనలను గావించియున్నారనుట సత్యమే. కాని ఇవి కార్యరూపమును దాల్చినపుడు నిష్ఫలము లగునని మనకు గల అనుభవమే చెప్పక చెప్పుచున్నది.

## ట్రామ్వేలు, చిన్న రయిల్ మార్గములు

ట్రాముమార్గములును చిన్న రైలుమార్గములును భారతీయ మంత్రుల అధికారముక్రింద ప్రజాయత్తములుగ నుండవలయునని శాఖావిభజన సంఘమువారు సూచించుచున్నారు. నా సహోద్యోగులు ఇవి ప్రభుత్వాయత్తములుగా నుండవలయునని వాదించుచున్నారు. ఇందులకు కారణము ఏమనగా మంత్రియు, శాసనసభయును రయిలుమార్గముల యభివృద్ధికి అవలంబింపబడు విధానమున జోక్యము కలుగజేసికొందు రని చెప్పుచున్నారు. చిన్న రైలుమార్గములను నిర్మించుటకు జిల్లాబోర్డుల కధికార ముండవలయు నని భారతీయు లేకగ్రీవముగ కోరుచున్నారు. నా సహోద్యోగు లీ విషయమున జేసిన సూచన జాతీయక్షేమముకంటె, ఇంగ్లండులోని పెట్టుబడి దారుల క్షేమమే ఎక్కువగ బరిగణించుచున్నది. ప్రస్తుతము కంట్రాక్టు మున్నగువానిని సంరక్షింపవలసినదే గాని పై విషయములకు క్రొత్తమార్గములను అన్వేషించుట కష్టకరము గాదు. కావున నేను శాఖావిభజన సంఘమువారు గావించిన సూచనను అంగీకరించుచున్నాను.

## విద్య

22. ఈవిషయమై మనము సర్వమును గ్రహింపవలయును. ఈ విషయమునందు రాష్ట్రీయప్రభుత్వములు చెల్లించు నధికారము మంత్రులవశము గావింపవలయునా? అను సమస్యను మనము పరిష్కరింపవలసియున్నది. ఈ విషయమున భారత ప్రభుత్వమునకు ఎట్టి యధికార ముండవలయును? దానిని ఎవ్వరు చెల్లింపవలయును? అను ప్రశ్నలను మనము నిర్ణయింపవలసి యున్నది.

విద్యాశాఖను సంపూర్ణముగ ప్రజాయత్తము చేయవలయు నని శాఖావిభజన సంఘమువారు తెలిపిరి. నా సహోద్యోగులు ప్రాథమికవిద్యనుమాత్రమే ప్రజాయత్తము గావింపవలయునని సూచించుచున్నారు. వారు శాసన సభాధికారమునకు లోబడి యున్న మంత్రి నిర్ణయింపవలసిన వయోనిర్ణయమునకు ఎట్టి అవధిని సూచించుటలేదు. వారు ఇచ్చట బోధింపఁబడు విషయములనుగాని ఆంగ్లభాషాప్రాముఖ్యమును గాని నిర్ణయింపలేదు. వీనిని మంత్రియును శాసనసభయును నిర్ణయింపవలయును. కాని విద్యాశాఖవంటి విషయమును ఈ తీరున విభజించుట కార్యానుకూలము కాదని నా యభిప్రాయము. ఇదివఱకు ఇట్టి విభజనము భారతదేశమునం దెచ్చటను చేయఁబడలేదు.

ఒకవేళ అట్టిభేదమును చేయుట సాధ్యమని యనుకొన్నను నది కార్యరూపమును ధరింపవలయునా? విదేశీయోద్యోగులు భారతదేశమునకు భిన్నములయిన ఆశయములతో కొందఱు ప్రజానాయకులకు విద్యను గఱపి తక్కిన దేశీయులకు విద్యను నేర్పుటకు కలయు మార్గములను వారు, అవలంబింపవలయు నని చెప్పవచ్చును. కాని విదేశీయులు, జాతీయవిద్యను నేర్పవలయు ననుట అసందర్భము. సంస్కరణ నివేదికయందు గూడ విద్యాశాఖ ప్రజాప్రతినిధి సంఘముల యధికారముక్రిందనే యుండునట్లు సూచింపఁబడినది. ఇందులకు తగిన ధనమును మంత్రులు మాత్రమే లభించునట్లు చేయగల్గుదు రనుటకు సందియములేదు. మఱియు రాజకీయాభివృద్ధి మంచి విద్యావిధానముపైని ఆధారపడియుండును. అట్టి శాఖ ఇంతవఱకును, రాజకీయ విద్యాభివృద్ధికి ప్రతికూలురగువారి హస్తములయం దుంచుట సంభావ్యము కాదు.

మూడు సంవత్సరములకంటె నెక్కుడు కాలమునుండి నేను విద్యాశాఖాధికారిగ నుంటిని. భావికాలమునందు విద్యాభివృద్ధి భారతీయుల యాజమాన్యమున నుండిననేగాని సాధ్యము కాదని నాకు దృఢముగా తోచినది. నాకంటె ముందు ఈ పదవియందుండిన సర్ హార్కోర్టు బట్లరుగారును, ఈశాఖ ప్రజాయత్తముగా నుండవలయు ననియే చెప్పుదురు. సర్ క్లాడ్ హిల్లును, ఇది ప్రజాయత్తమగుటకే తమ సమ్మతిని తెలిపియుండిరి. మఱియు బొంబాయి పంజాబు సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వములు, విద్యాశాఖను సంపూర్ణముగ ప్రజాయత్తము కావింపవలయుననియే అభిప్రాయము నిచ్చియుండిరి. మద్రాసు ప్రభుత్వమువారు విద్యాశాఖయం దెట్టిభాగమును ప్రజాయత్తము గావింపరా దనిరి. బెంగాలు అస్సాము ప్రభుత్వమువారు కళాశాలవిద్యను ప్రజాయత్తము గావించుట కంగీకరింపలేదు. నా సహోద్యోగులు ప్రాథమికవిద్యను మాత్రమే ప్రజాయత్తము గావింపవలయు నని కోరుచున్నారు. కాని, ఇందులకు వారు తెలిపిన కారణములు సరియగున వైనయెడల ప్రాథమికవిద్యనే ప్రభుత్వవశమునసుంచి ఇతరశాఖలను ప్రజాయత్తములు గావింపవలయు నని తప్పక స్ఫురింపకపోదు. విద్యను ప్రభుత్వాయత్తవిషయముగ నుంచవలయు నని కోరువారు విద్యాభివృద్ధియందు గల యభిలాషచే గాక రాజకీయములు అగు కొన్ని కారణములచేత నిట్లు కోరుచున్నారు. వీరికి వెనుక ఈ పదవులయం దున్నవారు కూడ వీరివలెనే ఎట్టి విద్యావిధానమును లేకయే భారతీయుల ఆక్షేపణలను సరకుసేయక అనేకపరిశోధనములను గావించుచున్నారు. ఇవి యన్నియును విఫలత నొందినవి. మన విద్యావిధానమును గూర్చి ఇంచుక తెలుపవలసి యున్నది.

## నిరోధదాయకవిధానము

డఫరిన్ ప్రభువుకాలమునుండియు నిరోధదాయకవిధానము అవలంబింపబడుచున్నది. ఈ సమస్యాపై శాల్యమును గుర్తించి ప్రభుత్వమువారు తమభారము తగ్గుటకై ఇతరులు ఎట్టి సహాయము చేయ మన్నను దాని నంగీకరించుట ధర్మము. డఫరిన్ ప్రభువు ప్రభుత్వము

వారు విద్యాభివృద్ధికి దేశీయులు చేయు సాయము నంగీకరించి వారికి గ్రాంటులు మున్నగువాని నిచ్చి ప్రభుత్వమువారు ఈ విషయమున తమకు గల బాధ్యతను తగ్గించుకొనుటయే తమ యభిప్రాయ మని తెలిపియుండిరి. ప్రాథమిక కళాశాలావిద్యవలని ఫలితములు సంతృప్తికరములుగ లేవు. జాతీయవిద్యను ప్రభుత్వమువారు పరిగణింపకపోవుటచేత విద్యార్థులు, ఇందులకు దేశీయులు నిర్మించిన పాఠశాలలయందే చదువుకొనవలసివచ్చెను. అట్టి పాఠశాలలు వృద్ధియగుచున్న విద్యార్థుల సంఖ్యకు సరిపడుచుండలేదు. ప్రతిష్ఠాపనలు వృద్ధిచేయబడుచుండెను. ప్రభుత్వనియమముల ననుసరించి నియమితములైన పాఠశాలలకే గ్రాంటు లొసంగబడుచుండెను. ఇతర పాఠశాలలకు సమర్థులగు నుపాధ్యాయులు లభించుటలేదు. ఇందుమూలమున వీటికి ప్రభుత్వమువారు గ్రాంటుల నీయజాలకున్నారు. ఇట్టి విధానము వలన అనేక ప్రతిష్ఠాపనలు సమర్థులగు నుపాధ్యాయులు లేక నిష్ఫలము లగుచున్నవి.

పిమ్మట ఉన్నత మాధ్యమికవిద్యలు ధనవంతులకే లభించునట్లు ప్రభుత్వమువారిచే నేర్పాట్లు చేయబడినవి. ఈ ప్రయత్నముకూడ మంచి విద్యావ్యాపనోద్దేశముతోఁ గాక, రాజకీయ కారణములతో జేయఁబడియున్నది. విద్యావ్యాపనమునకును, అందు ముఖ్యముగా బీదవిద్యార్థుల విజ్ఞాన వ్యాపనమునకును, ఆటంకదాయకములగు, నియమము లేర్పరుపఁబడినవి. గ్రాంటుల నిచ్చుటకు అనేక కఠిన నియమములు నిర్మింపఁబడినవి. వీనిలో నేది యుల్లంఘింపఁబడినను అనర్థము వాటిల్లును. సాధారణముగఁ బాఠశాలలకు బోవు విద్యార్థుల ధన ప్రతిపత్తినిబట్టి చూచినయెడల మిగుల నధికములగు జీతములు విధింపబడినవి. ఇట్టి పెద్దమొత్తాలు జీతములవలన బీద విద్యార్థులకు చాల కష్టము కలుగుచున్నదని తెలిపినప్పుడు అట్టి విద్యార్థులు ఇట్టి విద్య నభ్యసింప ననర్హులని ప్రత్యుత్తరము ఒసంగబడినది. ప్రైవేటు పాఠశాలల నిర్వాహకులు ఈ జీతములలో కొంతభాగముగాని అంతను గాని భరించినప్పుడు వారికి గ్రాంటులు తగ్గింపబడినవి. ఈ నియమములవలన విద్యాభివృద్ధి చేకూరుట కష్టముగా నున్నది. ఇదియే మాధ్యమిక విద్యాభివృద్ధి సంతృప్తికరముగా లేకుండుటకు నిజమైన కారణము. మన బాలురకు విద్యనొసగు నధికారము మనవశముననే ఉండినగాని సమర్థులగు నుపాధ్యాయులను నియమించుటకు గ్రాంటులను వృద్ధిచేసినగాని ఈస్థితి తొలగఁజాలదు. ఈ రెంటిలో దేనినైనను చేయుటకు మనము సంసిద్ధులము కాలేదు. ఈ విధానమును బట్టి ఆంగ్లేయవిద్యను ధనవంతులకు మాత్రమే బోధింపవలయు నని యుద్దేశమైనట్లు తోచుచున్నది. అట్టివారు ప్రభుత్వమువారికి ఎట్టి కలవరమునైనను కలుగజేయరని వీరి యభిప్రాయము. ఈ యుద్దేశముతోడనే బీదలు ధనికులను భేదములేక ఎల్లరు నేర్చుకొనుట కుపకరించు ప్రాతవిధానము మార్పునొందింపఁబడినది.

జనసామాన్యమున విద్య వ్యాపించుటకు ఏడు సంవత్సరముల వఱకు ప్రాథమికవిద్యను సంపూర్ణముగ దేశభాషలలోనే విద్య నేర్పుటకు ఒక నూతనవిధానము ఆలోచింపఁబడినది. ఇందువలన వీరు, తమ పూర్వులస్థితియందే యుండి వారి వృత్తులనే అవలంబించెదరని తలఁపబడినది. ఇంగ్లీషు విద్యాభ్యాసమునుండి బాలురను తొలగించుటకే దేశభాషా పాఠశాలలు స్థాపింపఁబడి ప్రోత్సాహపరుపబడుచున్నవి. ఈ యుద్దేశము తోడనే నియమము లేర్పరుపఁబడినవి. ఈవిధముగ జనసామాన్యము నిజమగు నాంగ్లేయవిద్యను బోధించు పాఠశాలలనుండి తొలగింపబడిరి. ఇందుమూలమున నాంగ్లభాషను నేర్చుకొనుట కవకాశము లేకపోవుటచేతను దేశభాషలను నేర్చుకొనుటకు దీనియందుత్సాహము లేకపోవుటచేతను ప్రజాసామాన్యము మఱల విద్యావిహీన మగుచున్నది. ఈ విధముగా వారికి అభివృద్ధిగాని విజ్ఞానముగాని లభింపజాలకున్నది. నాసహోద్యోగులు ప్రాథమికవిద్యను మంత్రివశముగావించుటకు అంగీకరించుట సంతోషకరము. కాని ప్రాథమిక విద్యలో మనము పొందిన యభివృద్ధి ఏమి? ఈశతాబ్దిప్రారంభమున గోఖ్లే గారు ప్రాథమిక విద్యావిషయమున ననేక మనోరథములను తెలిపియుండిరి. ఉచితవిద్య నొసంగుటకై చేయఁబడు వాగ్దానములుగ పరిగణింపబడిన అనేక వాక్యములను ప్రభుత్వమువారు 1906-1907 సంవత్సరములలో తెలిపియుండిరి. సంస్కరింపబడిన శాసనసభలు సమావేశమగునప్పటికి విద్యావిషయక స్థితిగతు లీ విధముగానుండెను. ఆంగ్లవిద్యాధికు లెల్లరును, ప్రథమమున ప్రారంభవిద్యను గురించియే యోచింప మొదలు పెట్టిరి. గోఖ్లే గారు తమ విద్యాశాసనమును శాసనసభయందు ప్రవేశపెట్టిరి. ప్రభుత్వమువారు దీని నెదిరించిరి. అందుచేత శాసనసభయందీ బిల్లు తిరస్కృతమయ్యెను. కాని యాసంవత్సరాంతమున దర్బారులో విద్యాభివృద్ధికి సంబంధించిన కోరికలు పరిగణింపబడునని తెలుపఁబడెను. కాని ఈ వాగ్దానము కార్యరూపము నొందలేదు. ప్రతిరాష్ట్రీయ శాసనసభయందును, నిర్బంధప్రాథమిక విద్యకు సంబంధించిన బిల్లులు ప్రవేశపెట్టఁబడియెను. వీరికి వలయు ధనము నొసఁగు బాధ్యత ప్రభుత్వమువారి కుండరాదు. అను పద్ధతిమీద ఈబిల్లు ప్రవేశపెట్టుట కనుమతింపబడినది. రాష్ట్రీయ ధనాదాయములు తక్కువగా నుండుటచేత నిట్టివిద్య మిగుల నసంతృప్తికరముగ నున్నది. ప్రభుత్వమువారి యొద్దనుండి ఎట్టి ధనసహాయమును లేకయే ఈవిధానమును ఆచరణలోనికి తెచ్చుట కష్టసాధ్యము.

ఇకను వాణిజ్య పారిశ్రామిక విద్యలనుగూర్చి యోచింతము. గొప్ప పరిశ్రమలను స్థాపించుటకుగాని గొప్ప వాణిజ్యోద్యమములను ప్రారంభించుటకుగాని తగిన యున్నత వాణిజ్యపాఠశాలలను మనము స్థాపింపలేదు. కాని, తెలివిగల కార్మికులు ఇంకను తృప్తికరముగా పనిచేయుటకు తగిన విద్యను మాత్రము మనము నేర్పుచున్నాము. ఈ విధముగనే వాణిజ్యమునందు చిన్నచిన్న పనుల జేయుటకు తగిన పాఠశాలలను స్థాపించుట కుద్దేశింపఁబడినది. ఇంజనీరింగు వైద్యపాఠశాలలు స్థాపించుట యవసరమని గ్రహించితిమి. కాని ఈ విషయమునం దింకను ఎక్కుడు పాఠశాలలను స్థాపించునట్లు గాక నేను తెలిపిన విధముననే ప్రయత్నములు జరిగినవి. ఈ విషయము లన్నింటిలో ప్రభుత్వమువారు ఉన్నతోద్దేశములతో వర్తించి

రనుటకు సందియము లేదు. కాని ఈ మార్పులన్నియును దురుద్దేశములతో చేయబడినవని భారతీయులు దృఢవిశ్వాసమును గలిగియున్నారు. ఆంగ్లప్రాథమికవిద్యను జనసామాన్యమునకును ఉన్నతవిద్యను మధ్యతరగతివారికిని అందకుండునట్లు నిరుత్సాహపరచుటకు రాజకీయకారణములే కారణభూతములని యెల్లరును నమ్ముచున్నారు. స్థితిగతులనుబట్టి ఈభావము స్థిరపడుచున్నది. వృత్తిసంబంధమైనయున్నతపారిశ్రామిక సాంకేతికవిద్య ఆంగ్లేయుల పారిశ్రామిక సంరక్షణము కొఱకును ఆంగ్లోద్యోగుల కొఱకును నిరుత్సాహపరుపబడుచున్నది.

కావున మనకు ఎక్కుడు సంఖ్యగల వైజ్ఞానిక, సాంకేతిక పారిశ్రామికకళాశాల లున్న యెడల, ఈ ప్రస్తుత విద్యావిధానము వర్జింపబడి ఈ శాఖాధిపత్యము భారతీయమంత్రివశమున నుంచుట అవసరమని అనుభవజ్ఞానమువలన మనము తెలిసికొనుచున్నాము. లేనియెడల నిదివఱకు అవలంబింపబడిన మార్గము ఆచరణలోనికి వచ్చును. మన విద్యార్థులతో వారు గరపువిద్య అసంతృప్తికరముగా నున్నదని తెలుపుచు వారు విదేశములకు బోయి విద్యను నేర్చుకొనుటకు వలయు అవకాశములను కల్పింపజాలకున్నారు. విద్యాశాఖ ప్రజాయత్తమును గావించుటకు ప్రతికూలముగ నున్న వారు కూడ భూతకాలమున నీ విషయమున జరిగిన లోపముల నంగీకరించి వానిని ముందు సవరింతుమని వాగ్దానము చేసియున్నారు. ఈ విషయము దేశాభివృద్ధికి అత్యవసరము కాన ఈ విషయమున నిక నెట్టి పరిశోధనములును చేయుట గాని ఇదివఱకు లోపములను గావించినవారి వశముననే ఈ శాఖ నుంచుట గాని జరుగకూడదు. ఇదివఱకు ఈ విషయమున లోపములు జరుగుటకు ధనాభావమును పల్లెలయందలి జనసామాన్యముయొక్క అజ్ఞానమును, కారణములని తెలుపబడినది. కాని యివి సత్యములని నే నంగీకరింపజాలను.

## పూర్వపు లోపములు

మనము ఇదివఱకు చేసిన లోపములు కలకత్తా యూనివర్సిటీ కమిటీవారి నివేదికను చూచినఁ దెలియగలవు. ఉన్నతపాఠశాలలలోని యుపాధ్యాయులకు విద్య చాలదనియు, జీతము తక్కువనియు వారు తెలిపిన వాక్యములు సత్యములు. ఈ విధానలోపములను తొలగించుటకు తమవశమున నున్న ధనమును వినియోగించుట లేదు. మాధ్యమికవిద్యయందు అనవసరముగా పరీక్షకపద్ధతి చొనుపబడినదని కమీషనువారు తెలుపుచున్నారు. ఇది ప్రభుత్వోద్యోగులచే నడుపబడునంత కాలమును ఈ లోపము తొలగజాలదు. ఏలయన—వారి దేశభాషావిజ్ఞానశూన్యతయే ఇందులకు కారణము. కాని యీపద్ధతిని పరీక్షించువారు వీరే. మఱియు విశ్వవిద్యాలయమున జేర్చుకొనబడు విద్యార్థుల అర్హత ఇంటర్మీడియేటు పరీక్ష ప్యాసు అయినవారికే యొసంగవలయుననియు, ప్రస్తుతమున్న అర్హతవలన విద్యార్థులకు తగిన ఆంగ్లభాషాజ్ఞానము లేదనియు కమీషనువారు సూచించుచున్నారు. ఇందులకు భారతీయుల ఆక్షేపణల నాలోచింపక ప్రథమతరగతులయందు ఆంగ్లభాషను భాషగానైన నేర్పకుండు విధానమే కారణము. వారు ప్రస్తుతము విశ్వవిద్యాలయమున జేరుటకు చేయబడు పరీక్షలవలన వైద్యము ఇంజనీరింగు వ్యవసాయము వాణిజ్యము పరిశ్రమలు మున్నగు వృత్తులయందు చేరుటకు తగిన సామర్థ్యము లభించుచుండ లేదని సంఘమువారు తెలుపుచున్నారు. పైని నేను తెలిపినటులు గుమాస్తాలను తయారుచేయుటకు ఏర్పరుపబడిన విద్యావిధానమే కారణమని వేరుగ చెప్పనవసరము లేదు. కావున భారతీయుల యభిప్రాయములే ఇట్టి అసంతృప్తికరములగు స్థితులకు కారణములని చెప్ప వీలులేదు. కావున ననధికార సంఖ్యాబాహుళ్యముగల యొక సంఘమును నిర్మింపవలయు ననియు నిందువలన నీలోపములు తొలగిపోవుననియును సంఘమువారు సూచించుచున్నారు. దీనివలన అనధికారుల యాజమాన్యముయొక్క ప్రాముఖ్యము గుర్తింపబడినది. విద్యాశాఖాధికారముగల మంత్రికి తగిన సలహా నిచ్చుటకు ఒక డైరక్టరునుగూడ నేర్పఱుపవలయునని వారు సూచించుచున్నారు.

ఇక విశ్వవిద్యాలయ విధానమును గురించి ఈ కమీషను నివేదికయందు కంటె నెక్కుడు తీవ్రమగు ఖండనము కానరాదు. విశ్వవిద్యాలయము ప్రభుత్వాధికారముక్రింద నున్న యుద్యోగులుగల యొకసంఘమని మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. విశ్వవిద్యాలయముయొక్క పాలనము అసంతృప్తికరముగా నున్నదని వీరు నుడువుచున్నారు. ఇట్టి విశ్వవిద్యాలయముకూడ ప్రభుత్వమను దృఢపాశముచే బద్ధమై యున్నదని వారు వచించుచున్నారు. "ఇందు ఎక్కుడుగ ప్రభుత్వమువారు జోక్యము కలుగజేసికొనుచున్నారు." వీరు చెప్పిన వాక్యములు మిగుల సత్యములు. అట్టి విధానముక్రింద ఏవిశ్వవిద్యాలయమైనను తృప్తికరముగ కార్యనిర్వాహణము గావించుట దుర్లభము. ఈ కారణములవలననే నిరంకుశాధికార ప్రాబల్యమును తొలగించి విశ్వవిద్యాలయము మాధ్యమిక విద్యాశాఖలను భారతమంత్రియధీనమున నుంచవలయునని భారతీయులు కోరుచున్నారు. కావున సంఘమువారు సూచించినటుల విద్యాశాఖ సంపూర్ణముగా ప్రజాయత్తము కావింపవలయునని నాయభిప్రాయము. ఈ విషయమున స్వదేశసంస్థానములలో ననేకములు ముందంజవేయుచున్నవి.

## బ్రాహ్మణేతరోద్యమము

24. పరిపాలనవిషయములు ప్రజాయత్తములుగ చేయుటకై గల ఆక్షేపణల స్వభావము బాధ్యతాయుత ప్రభుత్వావశ్యకతకు నిదర్శనముగ నున్నది. ఈ యాక్షేపణలలో నొకటి ఈ నివేదికయందు గానవచ్చుచున్నది. కొన్ని కారణములవలన దానిని ముందుముందు నేను తెలిపెదను. మదరాసు ప్రభుత్వప్రతినిధి ప్రత్యేకప్రాతినిధ్యము నొసంగకయే పాలనవిషయములను ప్రజాయత్తము గావింపరాదనియు వాదించి యుండెను. ఈ యభిప్రాయమునే మదరాసు ప్రభుత్వమువారు కూడ నంగీకరించిరని తెలుపఁబడినది. నేను బ్రాహ్మణేతర ప్రత్యేకసాంఘిక ప్రాతినిధ్యమును ఆమోదించువాఁడను. కాని బాధ్యతాయుతప్రభుత్వమునకు పూర్వమే దీనిని

ప్రసాదించుట అవసరమను నభిప్రాయముతో నే నేకీభవింపజాలను. ఈ విషయమును గూర్చి నా యభిప్రాయమును ఇట వివరించెదను.

25. ఈ సమస్యను గూర్చి యోచించుటకు బ్రాహ్మణేతరులలో రెండు ప్రధానవిభాగములను, గణింపవలసి యున్నది. వారు ఉన్నతజాతులనియు నిమ్నజాతు లనియు ద్వివిధములు. కాంగ్రెసు సభాప్రారంభపుదినములలో ప్రభుత్వోద్యోగులు దీనితో సంబంధమును కలుగజేసికొన రాదనియును సాధ్యమైన వానిపట్ల శత్రుభావమును చూపవలసిన దనియు బ్రాహ్మణేతరనాయకులను హెచ్చరించుచుండిరి. కాని వారీ సూచనను తిరస్కరించుటకు తీర్మానించుకొనిరి. వారు ఈ భావమును గలిగియుండుటకు క్రింది కారణములు ప్రధానములు. బ్రిటిషువారి హైందవవిజయమువలన ఉన్నతతరగతి బ్రాహ్మణేతరులును మహమ్మదీయులును ఎక్కువగ నష్టము ననుభవించిరని వారు కనుగొనిరి. బ్రిటిషు ప్రభుత్వమువారి వలన తమ ఆస్తులను కోల్పోయిన రాజులును జమీందారులును ఈ జాతులకు చెందినవారలు. వీరిలో ననేకులు తమ ఆస్తులను కోల్పోవునట్లుగాని మిగుల కష్టతరమగు షరతులపైవాని ననుభవించుటకుగాని బ్రిటిషు ప్రభుత్వమువారు ఏర్పాట్లను గావించియుండిరి. బ్రిటిషువిజయము ప్రాప్తించిననాటికి వీరు చెల్లింపవలసిననిస్తు వీరి ఆ స్తితో పోల్చి చూచినచో మిగుల నెక్కువగా నుండునని తెలియకపోదు. వీరి హక్కులు క్రమక్రమముగా తగ్గింపఁబడినవి. 1887 సంవత్సరమునకు పూర్వమున్న రైతువారిపద్ధతి మిగుల కఠినముగను ఆస్తికి అపాయకరముగను ఉండెను. తరువాత నది మిగుల నిర్బంధదాయకముగ గూడ పరిణమించె నని తలంపబడినది. ఈ యున్నతతరగతులకు సంభవించిన దురవస్థయే వర్తకులకును పారిశ్రామికులకును కార్మికులకును తటస్థించినది. కాంగ్రెసు, ప్రారంభమునుండియు భారతదేశ ప్రజాసామాన్యపు దారిద్ర్యమును తొలగించుటకు వలయు మార్గములనే అన్వేషించుచున్నది. అట్టి ప్రయత్నములవలన ఎక్కుడు లాభమును పొందువారు బ్రాహ్మణేతరులలోని యున్నతజాతులవారే కాని ఇతరులు గారు. కాంగ్రెసులో ప్రతివత్సరమును తీర్మానింపఁబడు న్యాయ, ప్రభుత్వశాఖావిభజనము గూడ వీరికే లాభదాయకము. అప్పుడును ఇప్పుడును కూడ కానవచ్చు పరిస్థితులను బట్టి ప్రభుత్వోద్యోగములయందును, ఇతరవిషయములయందును చాలవఱకు బ్రాహ్మణులే విజయులగుట కెక్కుడవకాశములు గలవు. విదేశపాలకజాతివారు కోరు తాబేదారులకు గల స్వభావము బ్రాహ్మణులయందు గలదు. మహమ్మదీయులును హిందూ జమీందారులును హైందవయోధజాతులును ప్రభుత్వపాలనవిషయమునకు వలయు గుణములను కలిగియుండలేదనియు నందుచేత వారు విశ్వసింపఁదగినవారు కారనియు తలంపఁబడుచుండెను. కావున బ్రాహ్మణేతరనాయకులు కాంగ్రెసు అందోళనఫలిత మగు నూతనస్థితిగతులలో తమకు లాభము కలుగుననియు, బ్రాహ్మణులకంటె నెక్కుడు గుణగణములుగలిగిన అభివృద్ధికి ఎక్కుడు అవకాశము గలుగుననియు తలంచిరి. ప్రస్తుతము బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులయెడల నారోపించు దోషారోపణములను పూర్వకాలపు బ్రాహ్మణులయందు కానవచ్చుచున్నను ఇప్పటి యువకులు కొంచెము ఉదారభావులనియు అందుమూలమున బ్రాహ్మణయువకులకును తమకును క్రమక్రమముగా భిన్నాభిప్రాయములు పోయి ఏకాశయములు నేకభావములును ప్రోత్సాహ మొసంగుననియుఁ దలంపఁజొచ్చిరి. ఈయాశలు వృథ కాలేదు. ఇప్పటికిని దేశపురోవృద్ధికిగాని జాత్యభివృద్ధికిగాని యుపకరింపని భావములనుగల బ్రాహ్మణనాయకులు లేకపోలేదు. కాని కాంగ్రెసు ఉద్యమము బ్రాహ్మణ బ్రాహ్మణేతర సంఘములకు సమన్వయముఁ గూర్చి ఐకమత్యమును పెంపొందించినది. అందు ముఖ్యముగ బిసెంటుగారు తమపక్షపు బ్రాహ్మణులు అనవసరములగు సాంఘిక దురహంకారములను వర్జించినట్లును, బ్రాహ్మణేతరులయెడల సోదరభావముతో వర్తించునట్లును ప్రోత్సాహ మొసంగినది. పైకారణములే గాక అధికారదృక్పథముగూడ బ్రాహ్మణేతరులను భయభ్రాంతులగావించినయది. అధికారులు ఇట్టి సంఘవిభజనము రాజకీయ పురోభివృద్ధికి నిరోధకరమని వాదించుచు వానిని తొలగించుటకై చేయు ప్రతిప్రయత్నమును తమ సాత్వికనిరోధభావమువలన నిష్ఫలముఁ గావించుచుండిరి. ఈసంఘసంస్కరణకర్తలు ప్రజలతో సంబంధము గోల్పోయిరనియు వట్టి ఆశయప్రేరితులనియు ఆంగ్లమానసపుత్రులనియుఁ గర్హింపఁబడుచుండిరి. ఈ పురాతన జాతిపద్ధతి సంఘక్షేమమునకవసరమనియు ప్రభుత్వమునకు ప్రజలను లోఁబరచి దేశశాంతి కుపకరించుననియు, నందుచేత ప్రభుత్వక్షేమమునకై ఈ పద్ధతిని ప్రోత్సాహపరచుట అవసరమనియుఁ గొందఱు ఉద్యోగులు బహిరంగముగ జెప్పఁదొడగిరి. కావున ఈ వర్ణవిభేదములు, అధికారుల సాయమువలన రూపుమాపుట దుర్లభమనియు తమస్థితి వీరిమూలమున బాగుపడుట కష్టమనియు బ్రాహ్మణేతరనాయకులు తలంచుచుండిరి. ఇప్పటికిని ఈ కారణములు తొలఁగిపోలేదు. ఇదివఱకే ప్రసాదితములు కావలసిన కొన్ని సంస్కరణములను నేను వేఱొకచోఁ జేర్కొని యుంటిని. అవి బ్రాహ్మణులకంటె బ్రాహ్మణేతరులకే ఎక్కువ లాభప్రదములు. ప్రస్తుతము సూచింపబడిన సంస్కరణములు సద్భావముతోను నిర్ణీత నియమానుసారముగను కార్యరూపముఁ దాల్చునట్లు చేయఁబడు నెడల నవి యున్నతతరగతి బ్రాహ్మణేతరులకే ఎక్కువ లాభప్రదములు. ప్రస్తుతము సూచింపఁబడిన సంస్కరణములు సద్భావముతోను నిర్ణీతనియమానుసారముగను కార్యరూపముఁ దాల్చునట్లు చేయఁబడునెడల నవి యున్నతతరగతి బ్రాహ్మణేతరులకే ఎక్కుడు లాభకరము లని చెప్ప నవసరములేదు. వీనివలన బ్రాహ్మణేతరుల స్థితి ఇంకను ఎట్లు చెడిపోవునో నే నూహింపజాలకున్నాను.

## నిమ్నజాతులు

26. నిమ్నజాతుల విషయములో స్థితిగతులు కొంచెము భేదముగా నున్నవి. వారి ఆర్థిక ప్రతిపత్తి బ్రిటిషుపాలనము క్రింద నెంతమాత్రమును వృద్ధి చెందలేదు. అది ఇంకను క్షీణించినదనికూడ ననవచ్చు

ను. ప్రాతియాచారములను బట్టి అడవులలో కట్టెలు తీసికొని గృహనిర్మాణము గావించుకొనుటయు, తమ పశువులను ఉచితముగ నేలపై మేయబంపుటయు తమ కూలిమూలమున సాగుచేసికొనబడు భూమియాదాయమును అనుభవించుటయును వీరికి గల హక్కులు. రైతువారీ పద్ధతివలన వీరు అన్నిటిని కోల్పోయిరి. భారతీయ పరిశ్రమలు నాశనము నొందినతోడనే వ్యవసాయేతర విషయములలో కూలిచేసికొని జీవించువారల కూలి పడిపోయినది. ఇట్టి కూలీలు తమ యజమానులవలెనే, వినాశమునొందిరి. వ్యవసాయములో నున్న కూలీలు గూడ ప్రభుత్వమువారి మూలముననుు, జమీందారుల మూలముననుు, పెద్దరైతుల మూలముననుు చాలకష్టముల ననుభవించిరి. ప్రస్తుతము సూచింపబడిన సంస్కరణములు ఉన్నత బ్రాహ్మణేతర జాతులవలె వీరిస్థితిని ప్రత్యక్షముగ బాగుపరుపజాలవు కాని ఈ సంస్కరణములు తగినవిధమున నాచరణలో పెట్టబడిన యెడలను దారిద్ర్యసమస్య తగిన రీతిని పరిష్కృతమైనయెడలను దేశమున కంతకును వచ్చులాభములో వీరును పాల్గొనవచ్చును. కాని, ఉన్నతజాతులవారినుండి వీరి క్షేమసంరక్షణమునకు వీరికి ప్రతినిధులుగా నుండదగినవారు తగినంతమంది యున్నారా? యని సందియము కలుగుచున్నది కాని వారు ఎన్నికలలో తమ యభిప్రాయములను జొన్పుటకు అవకాశములను గల్పించుటకును, లేక వారి ప్రతినిధులను శాసనసభలకు ప్రత్యేకముగా పంపునట్లు నియోజకవర్గము నేర్పరుచుటకును వలయు నియమములను నిర్ణయించుట కష్టముగాదని నాయభిప్రాయము. ఏది యెట్లున్నను, ఈ సంస్కరణములవలన వారిస్థితి ఇంతకంటె దుస్తరమగు నని చెప్పుటకు వీలులేదు. ఇంతేకాక ఈ సంస్కరణములు తగినవిధమున నాచరణలోనికి వచ్చినయెడల వారిస్థితి ఇంకను బాగుపడవచ్చును.

### పరీక్ష సలహా

27. పరీక్ష సలహాను గురించి నా సహోద్యోగులు 28-వ పేరాలో చెప్పిన సూచనలను నే నంగీకరింపజాలను. వీరి సూచనల ప్రకారము ఈ యుద్యోగులు ప్రజాయత్త ప్రభుత్వాయత్త శాఖాకార్యములను పరిశీలించి అందలి లోపములను గవర్నరుకు తెలియజేసి తన్మూలమున నాతకు వాని నివారణమునకు కృషి సల్పునట్లు చేయవలయును. ఇట్టి అధికారమువలన వీరు రాష్ట్రీయవిషయములలో ననవసరముగ జోక్యము కలుగజేసికొందు రని సంస్కరణనివేదిక 118 పేరాలో తెలుపబడినది. మున్ముందు వీరికిబదులుగా ప్రజావిమర్శ మే ఉపకరించు నని యీ నివేదిక సూచించుచున్నది. ప్రజాయత్తప్రభుత్వాయత్తశాఖలలో నిందు మూలకముగ వీరి జోక్యము ఎక్కుడగు నని నా యభిప్రాయము. రాష్ట్రీయప్రభుత్వములు నిర్వహించుట కంగీకరించిన సంస్కరణములకు భారతప్రభుత్వమువారు ప్రతికూలురుగ నున్నారని సంస్కరణనివేదికము తెలుపుచున్నది. ఈ కారణములవలన నా సహోద్యోగులు తెలిపిన సూచనలను నే నంగీకరింపజాలను.

నా సహోద్యోగులు తెలిపిన సూచనస్వభావమును బట్టి శాసననిర్మిత మగు నొకసంఘము, ఏర్పడువఱకును ఈ సమస్యాపరిష్కారము నాపివేయుటకు వీలులేదు.

సి. శంకరనాయరు.

సిమ్లా, 16 ఏప్రిలు 1919.

# ప్రత్యేక కాంగ్రెసు సభా తీర్మానము

### భారతప్రభుత్వము

రాష్ట్రీయ దొరతనమునందువలె ఇండియా దొరతనమునందు గూడ ప్రజాపాలితశాఖలును ప్రత్యేకశాఖలు నుండవలెను. ప్రత్యేకీకృతశాఖలలో విదేశ(అధినివేశములు తప్ప) సేనా-నావాదళ-భారత సంస్థానములు, ఇదివఱకు వివరింపబడిన మినహాయింపులకు లోబడి శాంతి నెమ్మది దేశరక్షణములకు ప్రత్యక్షముగ సంబంధించిన విషయము లాకరికంటె హెచ్చుగా నున్నచో వారిలో కనీసము సగముమంది భారతీయులుగా నుండవలెను. ఆర్థికపత్రము శాసనసభలచే నామోదింపబడవలెను. ఇండియాదొరతనమువారికి కొంతసామిమ్మయ్యబడవలెను. మొదటిసంఘముల నియోజనకాలము ముగియువఱకును ప్రత్యేకితశాఖలకు కొంతసామిమ్మయ్యబడవలెను. క్రొత్తపన్నులు వేయబడవలసివచ్చినచో ప్రత్యేకీకృత ప్రజాపాలితశాఖలకన్నిటికిని కలిపి రాష్ట్రీయ ప్రభుత్వమువారిచే వేయబడవలెను.

### రాష్ట్రీయశాసనసభలు

సంపూర్ణ రాష్ట్రీయ స్వపరిపాలనమునకు దేశీయులు సమర్థులుగ నున్నారని నిర్ధారణచేయుచు ననవసరమగు చర్చను తొలగించుటకును ఆలస్యమును రద్దుపఱచుటకును 6 సంవత్సరములవఱకు శాసననిర్మాణ న్యాయవిచారణ (చెఱసాలలు తప్ప) పోలీసుశాఖలను కార్యనిర్వాహకసంఘములకు వదలుటకే కాంగ్రెసువారు నిశ్చయించిరి. కార్యనిర్వాహక న్యాయ విచారణాధికారములను వెంటనే వేఱుచేయ 1:0 మంది సభ్యు లుండవలెను. వారిలో 120 మంది నియోజకు లుండవలెను (అనగా 4.5 వంతు). అధ్యక్షుని ఉపాధ్యక్షుని సభవారే నియోజించుకొనవలెను. సభానిబంధనలను చేయుటకును సవరించుటకును సభవారికే అధికార ముండవలెను. గవర్నరు జనరలు అనుమతి అవసరములేదు. నిర్ణీత కాలములందు గాని, కొంతమంది సభ్యులు కోరినపుడు గాని శాసనసభలను జరుపుట కేర్పాటు జరుగవలెను.

15 సంవత్సరములలోపున ఇండియాదేశమునందంతటను సంపూర్ణ బాధ్యతాయుతపరిపాలనము నేర్పరుచుటకు ఖరారు జరుగవలెను.

## రాష్ట్రీయకార్యనిర్వాహకసభలు

ప్రత్యేకశాఖలు లేనిసభ్యులు కార్యనిర్వాహకసభలలో నుండ గూడదు. సంస్కరణానుసారముగ క్రొత్తసభ లేర్పడినది మొదలు మంత్రులు శాసనసభలకు బాధ్యులగుట ప్రారంభము కావలెను. ప్రత్యేకితశాఖల సభ్యులకు గల గౌరవమును జీతమును మంత్రులకు గూడ నుండవలెను. ప్రత్యేకితశాఖలకు చేరిన కార్యనిర్వాహకసభ్యులు మాత్ర ముండవలెను. తక్కినవన్నియును ప్రజాపాలితశాఖలుగా నుండవలెను. ప్రత్యేకితవిషయములకు కావలసినసొమ్మును ముఖ్యముగ ముందు సమకూర్పవలెను. ఆర్థికపత్రమునకు రాష్ట్రీయ విధానమే వర్తింపవలెను.

శాసనములన్నియు బిల్లులమూలముగ నామోదితములు కావలెను. శాసనసభవారామోదింపనిచో దొరతనమువారి కవసరమని తోచినచో రిగ్యులేషనులద్వారా గవర్నరు జనరలుగా రొకవత్సరము వఱకును పనిని సాగింపవచ్చును. పిమ్మట శాసనసభకు వచ్చినవారిలో 100-కి 40 మంది అనుకూలించినగాని మఱల ననుసరింపగూడదు. స్టేటు కౌన్సి లుండగూడదు. ఉండితీరవలె నందురేని ఆసభలో సగము మందికి తక్కువ కాకుండ నియోజితు లుండవలెను. సర్టిఫికేట్లపద్ధతి ప్రత్యేకితశాఖలకు మాత్రమే వర్తింపవలెను. ప్రత్యేకితశాఖలకు సంబంధించిన కార్యనిర్వాహకసభ్యు లొకరికంటె హెచ్చుగానుండిన సగముమంది భారతీయులుగా నుండవలెను. సామ్రాజ్యశాసనసభలో అధ్యక్షుడును ఉపాధ్యక్షుడును నియోజితులుగా నుండవలెను. గ్రాండుకమిటీల నేర్పఱుపగూడదు. రాష్ట్రీయప్రభుత్వమునకు సంబంధించిన అన్నివిషయములను గూర్చియు రాష్ట్రీయశాసనసభవారు శాసనములను చేయు నధికారమును కలిగియుండవలెను. శాసనరచన పోలీసు న్యాయవిచారణలనుగూర్చి కూడ వారి కధికార ముండవలెను. శాసనసభవారి పరిష్కారము గవర్నమెంటువారికి తృప్తికరము కానిచో వారు ఇండియా గవర్నమెంటువారికి వ్రాయవలెను. వారు ఇండియా శాసనసభలో నుపపాదించి మామూలుచర్చ ననుసరింపవలెను. గ్రాండుకమిటీ నేర్పఱచుచో నా సంఘమునందలి సభ్యులలో సగము మందిని శాసనసభవారు నియోజింపవలెను. శాసనసభలో నియోజిత సభ్యులు 4/5 వంతుగా నుండెను. సామ్రాజ్యరాష్ట్రీయశాసన స్టేటు సభలను విరమించునపుడు గవర్నరు జనరలును గవర్నరును మఱల మూడు నెలలలోపున సమావేశములు జరుగున ట్లేర్పాటుచేయవలెను. నియోజకులకు విజ్ఞాపనమూలముగ శాసనసభలను విరమింపగూడదు. లిఖితములుగా మంత్రుల సంతకములతో గూడ ప్రకటింపబడవలెను.

## పార్లమెంటు: ఇండియాకార్యాలయము

ఇండియామంత్రిసంఘమును తీసివేయవలెను. ఇద్దరు సహాయ కార్యదర్శులను స్థిరముగా నేర్పఱుపవలెను. వారిలో నొకరు భారతీయుడుగా నుండవలెను. ఆ కార్యాలయపు సిబ్బందివిషయములు ఆంగ్లదేశ ప్రభుత్వమువారిచేతనే పరిష్కరింపబడవలెను. నియోజితవర్గములకు రాష్ట్రీయప్రభుత్వముల ప్రత్యేకితశాఖలవారు బాధ్యులగువఱకును వారి కెట్టి ఆర్థికపరిపాలనాధికారములను గూడ నీయ గూడదు. ఇండియా మంత్రిసంఘమును గూర్చి ఆలోచించుట కేర్పఱుపబడిన సంఘమునందు తగినంతమంది భారతీయు లుండవలెను.

## సాంఘిక ప్రాతినిధ్యము

అన్ని శాసనసభలలోను మహమ్మదీయ ప్రాతినిధ్యము కాంగ్రెసు-లీగు నివేదికము ననుసరించియుండవలెను.

## ఇతరవిషయములు

ఆర్థికవిషయములందు సంపూర్ణాధికార ముండవలెను. రాష్ట్రీయ దొరతనములు ఇండియాదొరతనమువారి కియ్యవలసిన ధనమును గూర్చి ఢిల్లీకాంగ్రెసు జరుగులోపల రాష్ట్రీయ కాంగ్రెసులవారు తెలుపుటకు కోరబడవలెను.

# ప్రత్యేకాంధ్రరాష్ట్రసభాతీర్మానము

### భారతదేశప్రభుత్వము

1. అంతర్దేశీయ విషయములందు హైందవ శాసననిర్మాణసభలకు సంపూర్ణాధికారమును కలుగజేయుచు కాంగ్రెసులీగువారు చేసిన విధానమును ఈసభవారు తిరుగ ధ్రువపఱుచుచున్నారు.

2. హైందవభూమికిని బ్రిటిషుసామ్రాజ్యమునకును, క్షేమలాభములు కలుగుటకు భారతీయజనుల సామర్థ్యము, బుద్ధికుశలత, రాజభక్తి వీనియందు దొరతనమువారికి పూర్ణమైనవిశ్వాస ముండుటయే యుక్తమగు రాజ్యపద్ధతియని యీసభవారు అభిప్రాయము తెలుపుచు, బ్రిటిషుసామ్రాజ్యముయొక్క పునర్నిర్మాణమునకు ముందే భారతీయులకు అంతర్దేశీయ వ్యవహారములలో పూర్ణమైన స్వపరిపాలనాధికార మియ్యతగునని యు నియ్యవలయు ననియు, పదిసంవత్సరముల లోపలనే సామ్రాజ్యములో పూర్ణమైన బాధ్యతాయుత స్వపరిపాలన మిచ్చులాగున శాసనమూలకముగ నిష్కర్ష చేయవలయు ననియును కోరుచున్నారు.

3. ఈదేశములో ఏర్పడగల నియోజకవర్గములకు తగిన సామర్థ్యమును, అనుభవమును లేవని యెంచి వానికిని జాతిమతముల ననుసరించిన భేదములకును మాంటాగ్యు-షెమ్సుఫర్డు నివేదికయందు, అనవసరమును అనుచితము నగు ప్రాముఖ్యము నిచ్చినందుకును మఱియు నీ

దేశీయులయొక్క ఆచారాదిసిద్ధమగు నాగరికతయు, నాత్మబుద్ధియు, మేధాశక్తియు, స్వపరిపాలనార్హతయు, మూలప్రయోజనములం దైక్యతయు, తత్పరిజ్ఞానమును నివేదికకర్తలు క్రమముగ గ్రహించ కుండుటను ఈ సభవారు నగచుచున్నారు.

4. హిందూదేశప్రభుత్వమునందు కొంత యధికారము బ్రిటిషు పార్లమెంటువారు కొంతకాలము తమయందే యుంచుకొన నిశ్చయించునెడల నీ మధ్యదశను పురస్కరించుకొని నిర్దేశింపబడిన మాంటేగ్యూ-ఛెమ్సుఫర్డు ప్రణాళిక యీ క్రిందచూపిన మార్పులు లేనిది సంతృప్తికరముగ గాని గ్రాహ్యముగ గాని యుండజాలదని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు:

(ఏ) సేన, నావికాదళము మొదలగు మిలిటరీ వ్యవహార ములయందును, పరరాష్ట్రీయ స్వదేశసంస్థాన సంబంధములయందును, అఖండమగు శాసనాధికారము ఇండియా ప్రభుత్వమున కుండవలెను.

(బి) సేనానావికాదళము మొదలగు మిలిటరీవిషయమునకును, స్వదేశ సంస్థానములకును పరరాష్ట్రములకును చెందిన వ్యవహారము తో సంబంధించిన విషయములలో ఇం[illegible]యా ప్రభుత్వమువారికిని సామ్రాజ్య శాసననిర్మాణ సభవారికిని, [illegible]భిప్రాయభేదము కలిగి నప్పుడుమాత్రమే, ప్రణాళికయందు వి[illegible] సంబంధ సర్టిఫికెట్టు విధాన మును అమలులో పెట్టదగును. సంపూ[illegible] స్వపరిపాలనాధికారము సమకూడుటకులోపల పరివర్తన కాలములో [illegible] ఈ సర్టిఫికెట్టు విధానము అమలులో నుండవలయును. [illegible]యితరసంబంధము లందును స్టేటు కౌన్సిలు వారికి [illegible]నిర్మాణాధికారము ఉండగూడదు.

(సి) సేన, నౌకాసేన, అన్య[illegible] వ్యవహారములు వీని కావశ్యక మైన ద్రవ్యమును సిద్ధపరచవలసిన [illegible]కులోబడి ఇండియా గవర్న మెంటుయొక్క అన్ని ఆర్థికవిష[illegible]లయందును ఇండియా శాసన సభలకు సంపూర్ణమైన స్వాతంత్ర[illegible] కలిగియుండవలెను.

(డి) పైకార్యములకు అవ[illegible]మైన ద్రవ్యమును ఏవిధముగా చేర్చవలెననుపద్ధతులుమాత్రము ఇండియా శాసనసభలవారి యధీన మందుమాత్రమే యుండవలసినది.

ఇండియాదొరతనమువారి కార్యనిర్వాహకసభ్యులలో సగము మందికి తక్కువకాకుండ ఇండియను లుండవలెను.

(ఇ) పార్లమెంటు అండరు సెక్రెటరీలకుపోలిన యుద్యోగస్థు లను ఏర్పఱచుటయందు శాసనసభ్యులలో ప్రజలవలన ఎన్నుకొన బడినవారినుండి నియమించవలసియున్నది.

(ఎఫ్) ఇండియా ఆఫీసును త్రోసివేయవలసినది. అప్రకారము గాక ఆ ఆఫీసును ఇంకను నిలిపెయెడల ఆ సభాసభ్యులలో సగము కన్న యెక్కువమంది ఇండియా శాసనసభలవలన నెన్నుకొనబడిన వారుగ నుండవలెను.

(జి) పార్లమెంటు అండరు సెక్రెటరీలలో ఒకరు ఇండియను గా నుండవలెను.

(హెచ్) పార్లమెంటులో ఇండియా దేశపు విషయములను తెలుపుటకై ఇండియాదేశమునకు తగిన ప్రాతినిధ్యము ఉండుటకై తగుమైన ఏర్పాట్లు చేయవలెను.

(ఐ) ప్రాథమిక విద్యావ్యాపన మత్యంతావశ్యకము గాన మన దేశపు ఆదాయమునుండి దేశరక్షణముతోబాటు ప్రాథమిక విద్యా వ్యాపనమునకు గావలసిన ద్రవ్యమును సయితము మొదట తీసియుంచ వలెను.

(జె) దేహస్వాతంత్ర్యము వాక్స్వాతంత్ర్యము వార్తాపత్రి కల స్వాతంత్ర్యము, ఆయుధములు ధరించుట, ఏ అపరాధమునకైన న్యాయసభలలో బహిరంగముగ విచారణ జరుపమని గోరు హక్కు, అట్టివిచారణ జరిగి, నేరస్థుడని స్థాపింపకయే యెవరైన నిర్బంధింపబడినపుడు, అట్టివారిని నిర్బంధవిముక్తిని జేయుమని న్యాయ సభలను గోరుట, పైన విచారించిన ఈ మొదలైన నాగరికప్రజల కుండవలసిన ప్రాథమిక స్వతంత్రముల సంరక్షించుట[illegible] ఏర్పాట్లు చట్టములో పొందుపఱచవలెను.

(కె) కమీషను ఉద్యోగములుసహా అన్ని శాఖల సైనిక[illegible] గములయందును ఏలాటి తారతమ్యములు పాటించక ఇండియ[illegible] బహుసంఖ్యాకులుగ చేర్చికొనవలెను.

(ఎల్) పౌరసేవోద్యోగులకు జీతములు బత్తెము[illegible] చేయవలయు నను సలహాకు అసమ్మతిని దెలుపుచున్నది. [illegible] వారి జీతములు, బత్తెములు, పెన్షనులు, ప్రపంచమునం దెచ్చట[illegible] లేనంత హెచ్చుగా నున్నవి. హిందూదేశమువంటి బీదదేశమునకు భరింపరానివిగా నున్నవి.

(ఎమ్) మన దేశములోని అన్ని శాఖలయందలి ఉత్తమోద్యోగ ములయందును అర్ధపక్షము సగభాగము భారతీయు లుండవలెను.

(ఎన్) కార్యనిర్వాహకసభలో సగమునకు కొఱఁబడని సభ్యు లు భారతీయులై శాసనసభయందలి యెన్నిక సభ్యులనుండి యెన్ని కొనబడినవారుగ నుండవలయును.

(ఒ) స్టేటు కౌన్సిలులో సగమునకు కొఱఁబడని సభ్యులు ఎన్నుకొనబడిన అనధికారసభ్యులై యుండవలయును.

## రాష్ట్రీయప్రభుత్వము

(ఏ) శాసన, న్యాయ, పోలీసు విషయములతో గూడిన రా ష్ట్రీయప్రభుత్వాధీన మగు విషయములను గూర్చి రాష్ట్రీయశాసన సభవారే శాసింపవలయును. శాసన న్యాయ పోలీసు విషయముల గూర్చిన రాష్ట్రీయ శాసనసభాతీర్మానములో గవర్నరుగా రేకీభవిం చినపుడు ఆయా విషయములగూర్చి గవర్నరుగా రిండియా ప్రభు త్వమువారికి మనవిజేయ నర్హులు. ఇండియా గవర్నమెంటువారీవిష యమును గూర్చి సామ్రాజ్యశాసనసభకు నివేదింపవచ్చును. అట్లు నివేదించిన పిమ్మట సామాన్యపద్ధతుల ననుసరించియే వ్యవహారము చక్కపెట్టబడును. రాజప్రతినిధిగారికి సామ్రాజ్యసభా[illegible] అసంతృప్తికరముగ నున్నచో, ఆ [illegible] లోని ఆటి[illegible]

నకు ఈ విషయమును నివేదింపవచ్చును. పార్లమెంటు సభవారి యెదుటనుంచు పద్ధతికి లోబడి ఆ యుపసంఘమువారి తీర్మానము ననుసరించి నిర్ధారణము చేయవలయును. ఇంతలో రాజప్రతినిధిగారు ఆర్డినెన్సులను జేయు హక్కును ఉపయోగించుట కర్హులై యున్నారు.

(బి) చెన్నపురి రాష్ట్రీయసభలో 10 లక్షలకు 5 గురు చొప్పున 250 మంది సభ్యు లుండవలయును. అందులో 5 యింట నాలుగుపాళ్లు యెన్నికవలన జరుగునవై యుండవలయును. ఈ ఎన్నికలలో స్త్రీలుగూడ ప్రాతినిధ్యమును ఎన్నికకర్తృత్వమును పొంది యున్నారు.

(సి) రాష్ట్రములు భాషల ననుసరించి విభజింపబడవలెను.

(డి) శాసనసభకు ఎన్నుకొనబడిన అధ్యక్షు లుండవలయును.

…సనలను నిర్మాణముచేయగల హక్కు శాసనసభదై యుం… అట్టి నిర్మాణములను గవర్నరుగారు వీటో చేయుటకు వీలు … గ్రాండుకమిటీ రద్దు చేయబడవలయును.

(ఇ) ప్రణాళికలో నియమింపబడిన గ్రాండుకమిటీ పద్ధతిని …వలెను.

(ఎఫ్) 1917, 1918 సంవత్సరములలో శాసన, న్యాయ సంరక్షణ పోలీసుశాఖలకు గాను వ్యయపెట్టబడిన సొమ్మునకు సరియగు మొత్తము ఆ శాఖలనిమిత్తము ప్రత్యేకముగ విడదీసిపెట్టు వరకు నకు లోబడి రాష్ట్రీయ శాసనసభవారికి ఆయవ్యయముల పట్టికతో సహా ఆయవ్యయ వ్యవహారములలో సంపూర్ణమగు అధికార ముండవలయును.

(జి) రాష్ట్రీయ కార్యనిర్వాహక ప్రభుత్వమునందు గవర్నరు నలుగురు సభ్యులనుండవలెను. అధికారమును బాధ్యతయు లేని సభ్యు లుండరాదు. శాసన, న్యాయ, పోలీసుసభ్యులు గాక మిగిలినవారిని శాసనసభలో ప్రజానియమిత సభ్యులనుండి గవర్నరు నియమింపవలెను. ఈ సభ్యులు శాసననిర్మాణసభకు బద్ధులై యుండవలెను. వారి జీతనములు ఆదాయవ్యయ విమర్శలోనికి రావలెను. శాసన, న్యాయ, పోలీసుసభ్యుని గవర్నరు కాలనిర్ణయముతో నియమించవలెను.

(హెచ్) మాంటాగ్యూ చెమ్సుఫర్డు రిపోర్టునందు సామ్రాజ్యాదాయముల అంచన మిక్కిలి తక్కువగ వేయబడిన దనియు 1917-18-వ సంవత్సరపు ఆదాయవ్యయముల పట్టిక ననుసరించి… లోపభూయిష్ఠ మనియు, ఆ సంవత్సరపు పునర్విమర్శిత పట్టిక ప్రకారము కోటి యిరువదిలక్షల పౌనులు ఆదాయము ఎక్కువగ వ…చున్న దనియు, రాష్ట్రముల కట్టుపడి ద్రవ్యమును కట్టవలసిన … [illegible]యు ఎట్లయినను ఉపక్రమింపబడి కట్టుబడిన ద్రవ్య…ము మితిమీరియున్న దనియు,

(ఐ) (క) కట్టుబడి ద్రవ్యవిషయమున రాష్ట్రముల … స్పరసంబంధములు న్యాయ్యములుగా లేవనియు, ఆయా రా… ప్రజాసంఖ్యను మొత్తము ఆదాయమును బట్టి యీ కట్టుబడి … ము నిర్ణయింపవలసిన దనియు, పరివర్తన దశయందు ఈ దామా… పైబడి తీసికొను ద్రవ్యము అప్పుగా నాలోచింపవలసిన దనియు,

(జె) మద్రాసు రాజధాని తన శక్తికిమించి కట్టుబడి ద్రవ్యమునకు మించి యిప్పటికే 80 కోట్లరూపాయల నెక్కువగ నిచ్చి… దనియు, నందువలన …చబడిన దనియు, ఈ కష్టమును ఇంక సాగనిచ్చుట యుక్త… మనియు, ఈ సభవారు తీర్మానించుచున్నారు.

(కె) హైందవ శాసననిర్మాణసభలలో రాష్ట్రములకు ప్రాతినిధ్యము వానివాని జనసంఖ్యకు దగినరీతి నుండవలెను. కౌన్సిలు ఆఫ్ స్టేటులో సామ్రాజ్యకోశమునకు చెల్లించు మొత్తము ననుసరించి యుండవలెను.

(ఎల్) బొంబా… …రమున సమావేశమైన ప్రత్యేక కాం…గ్రెసు ఆమోదించిన … ప్రత్యే… తీర్మానము నీసభవా రంగీకరించుచు సందేశ సవరణను … గావించుచున్నారు. ఆ ప్రత్యే… సభయందు యీ ఆక్షేపణ … …దేశీయమైన హిందూ ప్రజాభిప్రా…యము మార్పుచెందు… …కాలమునకు తక్షణమే రా… స్వాతంత్ర్యము నొసంగు… …ననియు నీ సంస్కరణల… భారతదేశపు అన్ని భాగము… …ప్రమాణముగ ననుభవింపవలె… నీ సభవారు అభిప్రాయపడు… …క్యకొను.

(ఎమ్) అనధికారులగు యూరోపియనులకు ప్రత్యేక నియోజకవర్గముగ చేర్పరాదు. ఏలయన, వారు గనులు త్రవ్వుట తేయా… పండించుట మున్నగు పరిశ్రమలకు సంబంధించినవారు. ఒకవే… వారికి ప్రాతినిధ్య మొసంగినను అది ఆయా రాష్ట్రములో జనసంఖ్యకువీరి పరిమాణమును బట్టి నిర్ణయింపబడవలెను.

# ఇండియా ప్రభుత్వపు బిల్లు

ఈ క్రింద నుదాహరింపబడిన వివరములు పార్లమెంటులో ప్రవేశపెట్టబడెను.

ఇండియా ప్రభుత్వపు బిల్లునకు పరిపోవునని ఇండియా ప్రభు… …తలంచుచున్నారు. కాని తంత్రివార్తా మూలమున అన్ని … …బిల్లునకు అనురూపమేయని

1919-వ సంవత్సరపు సంస్కరణముల చట్టము.

బ్రిటిషు హిందూదేశమును సామ్రాజ్యమందలి ప్రధానభా…ముగ గావించుటకు క్రమాగతమగు బాధ్యతాయుత పరిపాలనము నెలకొల్పుటకు ఈదేశమునందలి స్వపరిపాలనా సంస్థలను క్ర…ముగ నభివృద్ధి జెందించుట అవసరము కావునను,

ఇట్టి ప్రతిష్ఠాపనలు రాష్ట్రములలో క్రమముగ బెలుగుచుం…